శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము. చైత్రనిజవైశాఖమాసములు. } సంచిక ౧.








కాకినాడ

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ
బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩-౦-౦.
విడిసంచిక రు ౦-౮-౦.

1934.

# విషయసూచిక.

---

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.



సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము. చైత్రనిజవైశాఖమాసములు. } సంచిక ౧.

## రసస్వరూపము.*

—ఉభ. సా. ప్ర. బులుసు వేంకటరమణయ్యగారు, మద్రాసు —

సర్వవాఙ్మయసాధారణముగఁ గావ్యమునకుఁ గలముఖ్యప్రయోజనము రసమేయని చెప్పవలెను. కావ్యవాఙ్మయమారంభమైన దాదిగ, నీసిద్ధాంతము ప్రసిద్ధమై యున్నది. రసాస్వాదనమున కనుగుణము కానికావ్యముకావ్యానుకరణమే యగును.

ఆంధ్రవాఙ్మయమున రసతత్త్వమును నిరూపించుటకుఁ దొలుత, సంస్కృతమును గొంతపరామర్శింపవలసియున్నది. ఆంధ్రాలంకారికులకు సంస్కృతము పెట్టినదే భిక్ష యగుట యిందుఁ గారణము. నవీను లగుసంస్కృతాలంకారికులు రసము ప్రధాన మని చెప్పియున్నారు. కాని ప్రాచీనులు విభిన్నవిషయములకుఁ బ్రాధాన్య మిచ్చినటులు వారిగ్రంథములఁబట్టి తోఁచుచున్నది. భరతుఁడు నాట్యమును, భామహుఁడు, దండి, అలంకారములను, వామనుఁడు గుణములను, ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వనినిఁ గావ్యమున ముఖ్యమైన వని చెప్పియున్నారు. అట్లయినను వారు రసమును దమతమప్రధానవిషయములందే (నాట్య, అలంకారగుణాదులు) అంతర్భవింపఁ జేసిరి. నాట్యమును బ్రధానవిషయముగా నెంచిన భరతుని మతమున రసమునాట్యస్వరూపము1. భామ

*నా "ఆంధ్రాలంకారచరిత్రము" ద్వితీయభాగమునందలి "రసము" అనువిషయము నిట్లు ముద్రించుటకిచ్చుచున్నాను.

1. "నాట్యంచ రస ఏ వేత్యుక్తప్రాయమ్, [ధ్వన్యాలో. లోచ, పు 182]

హాదండ్యాచార్యుల మతములం దలంకారములే ప్రధానము లగుట రసము వానియందే సందర్భింపఁబడినది2. గుణప్రాధాన్యవాది యగు వామనుఁడు రసములను గాంతిగుణమునం దిఱికించెను 3. ధ్వని కావ్యాత్మ యనునానందవర్ధనుఁడు, రసము ధ్వనియే యగు నని చెప్పెను 4. ఇట్లే తక్కిన వారిమతములు గల వని యెఱుఁగవలెను. ఆనందవర్ధనాచార్యులకాలమువఱకును రసము సముచితరీతిని విమర్శింపఁబడి యుచితస్థానంబునఁ బ్రతిష్ఠింపఁబడియుండ లేదు సామాన్యముగఁ బ్రాచీను లందఱును గావ్యాత్మను గూర్చి విచారింపక కావ్యాంగముల సంగతినే వివరించి యున్నారు. కావున వారివారిమతమునఁ గావ్యాత్మ యేమో తెలిసికొనుట దుర్ఘటము. నవీను లందఱును రసమే కావ్యాత్మయని స్పష్టముగ విశదీకరించియున్నారు.

ఆంధ్రవాఙ్మయమున రసమునకుఁ గలగౌరవము మొదటినుండియు నిలుపఁబడియున్నది. ప్రథమాంధ్రకవియుఁ, బ్రథమలాక్షణికుఁడు నగు వాగనుశాసనుఁ డీవిషయమును విశదపఱిచియే యున్నాఁడు5 తర్వాతికవులుకూడఁ దమప్రబంధములను రసపరముగనే రచించినట్లు తమప్రతిజ్ఞలందు "తా రసపుష్టిమై ప్రతిపదంబు," ననురీతి వక్కాణించుటలే ప్రమాణము లగుచున్నవి. నవీను లగుసంస్కృతాలంకారికులు రసప్రాధాన్యవాదు లగుటచే వారినే యాదర్శకులుఁగఁ దీసికొనిన మనవారిమతము చెప్పకయే సువిజ్ఞేయ మగును.

భట్టుమూర్తికవి ప్రతాపరుద్రీయము ననుసరించి కావ్యమున రసమే ప్రధాన మని చెప్పియున్నాఁడు6. కాని పెద్దిరాజును దదనుసారి యగునప్పకవియు వామనునిసూత్రములం దున్నట్లు "అఖిలకావ్యములకు రీతు లాత్మ

---

• రసవ ద్దర్శితస్పష్టశృంగారాదిరసం యథా, [భామహ కావ్య 3-6.]
..................రసవద్రసపేశలమ్, [దండికావ్యాదర్శము.]

3 సమగ్రరసత్వం కాన్తిః. 3-2-15.
దీప్తారసాః శృంగారాదయో యస్యసః, తస్యభావః దీప్తరసత్వం, కాన్తిః యథా—ప్రేయాన్......ఏవం రసాన్తరే ష్వప్యుదాహరణీయమ్.

4 కావ్యస్యాత్మా ధ్వనిః—(పు 2) కావ్యస్యాత్మాసఏవార్థః (పు 26) సఏవేతి, ప్రతీయమానమాత్రేఽపి ప్రక్రాన్తే తృతీయ ఏవ రసాదిధ్వనిరితిమన్తవ్యమ్, [ధ్వన్యాలోకః సలోచన,-పు 26]

5. "పాహాగాన్యరసవృత్తిః [చింతామణి 1-3]

6. గీ. అసదృశరసప్రధానశబ్దార్థములును, [నరస 1-20]

యుండ్రు" అనుమతమును గూడ ననుసరించుటచే వారిమతమున నేది ముఖ్యమో దెలియుట కొంచెము కష్టము. కాని చూడామణిపీఠికయందు "భావరస ప్రసంగమునఁ బర్వునలంకృతిలక్షణంబు," అని ప్రతిజ్ఞావచనము నిరూపింపఁబడియుండుటంబట్టి పెద్దిరాజుమతమున రసమే ప్రధాన మగుటలో సందియము లేదు. అప్పకవీయము చింతామణికి విపులవ్యాఖ్యారూప మగుటఁ జింతామణి మతమే యప్పకవిమత మనవలెను. అప్పకవి రసమునకుఁ గలప్రాధాన్యమును జక్కఁగ వివరించియున్నాఁడు7. కాఁగాఁ బరమతప్రదర్శనార్థమై మాత్రమే వారిచే "రీతి రాత్మా కావ్యస్య" యనుసూత్రమార్గ మవలంబింపఁబడినది గాని యది వారిసిద్ధాంతము కానట్లు మనము నిశ్చయింపవలసియున్నది.

అలంకారవాఙ్మయమున కాదిగ్రంథముగ నెంచఁబడుచున్న భరతనాట్యశాస్త్రమునందే యొకమాదిరిగ రసస్వరూపము నిర్వచింపఁబడియే యున్నయది. "విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః"8. అని యచటఁ గల రసనిర్వచనసూత్రము. ఈసూత్రమునే యాధారముగఁ జేసికొని పలువు రాలంకారికులు తమ కిచ్చవచ్చిన మతములను నిరూపించుచు సూత్రార్థమును దమమతమున కనుగుణ మగునట్లే నిర్వచింపసాగిరి. ఆమతములు చాలఁగ నున్నవి. కాని యందు భట్టలోల్లటుల యుత్పత్తివాదమును, శ్రీశంకుకుల యనుమితివాదమును, భట్టనాయకుల భుక్తివాదమును, నభినవగుప్తుల వ్యక్తివాదమును ముఖ్యమైనవి. అం దభినవగుప్తాచార్యుల వాదమునకు ధ్వన్యాచార్యు లగు నానందవర్ధనుల ధ్వనివాదము మూలము. సహృదయహృదయావర్జకమును యుక్తియుక్తము నగుధ్వనివాదమే విమర్శకు లగునర్వాచీనాలంకారికులచే నాదరింపఁబడినది. కాఁగా నిందు వ్యక్తివాదమే సిద్ధాంతిత మైనట్లు తేలుచున్నది. అందులకుఁ గలకారణములు ముందు నిరూపింపఁబడును. ధ్వన్యాచార్యునికిఁ బిదప భట్టనాయకుఁడును, ప్రతీహారేందువర్మయు, మహిముఁడును, ధనికుఁడును వ్యక్తివాదమున కెదురుతిరిగిరి; కాని వారిమతము వ్యక్తివాదమంతటి సరసము కానందునను వారికిఁ దగినంతయవలంబన మక్కాలమునఁ జూపఁబడియుండనందునను వ్యక్తివాదమే స్థిరమైనది. ఆంధ్రాలంకారికులు కూడ నీవ్యక్తివాదమునే యామోదించియున్నారు.

---

7. గీ. తగ రసాశ్రయవాక్యసంతతులు కూర్చి, కావ్యము లొనర్చువారె పో కవు లనంగ
నట్లు కావున నేభావ మైనఁ గవిత, పలుకువారికి సాధింపవలయు రసము. [అప్పక.1 ఆశ్వా]

8. భరతునినాట్యశాస్త్రము, షష్ఠాధ్యాయము చూడునది.

విభావము—అనుభావము—వ్యభిచారిభావము ననునీమూఁడు భావముల సంయోగమును బొంది పరిపోషింపఁబడిన స్థాయిభావమే రస మగునని యించుమించుగ నన్నిమతములవారు నంగీకరించియున్నారు. ఆస్థాయి యట్లు మాఱునపుడు లేనిస్థాయి యుత్పన్న మగుట రస ముత్పన్నమగునా? లేక అనుమితము లగుస్థాయిభావాదులంబట్టి రసమున్న దూహింపవలెనా! లేక సత్త్వోద్రేకమువలన రసము సామాజికులచే ననుభవింపఁబడునా? లేక యిదివఱకు సహృదయహృదయములందు వాసనారూపముగ నున్నస్థాయిభావము విభావాదులచే వ్యక్తమై రస మగునా? అను విషయములందే వారివారి కభిప్రాయభేదము లున్నవి; కాని స్థాయిభావమే రసముగా మాఱు ననుటలో నెవ్వరికి నభిప్రాయభేద మున్నట్లగపడదు. భరతముని స్థాయిభావమే రసముగఁ బరిణమించు నని స్పష్టముగఁ జెప్పియున్నాఁడు9. ఆలంకారికు లందఱు నీవిషయమునే వ్రాసిరి. ప్రాచీనాలంకారగ్రంథములలో రసస్వరూపము చర్చింపఁబడలే దని యిదివఱకే చెప్పియుంటిని. నవీనాలంకారికు లందఱును భరతునే యనుసరించిరి. కాన వారిననుసరించిన మనయాంధ్రలాక్షణికులమతమును భరతునిమతముతో సరిపోవుచున్నదని చెప్పవచ్చును10. కాఁగా స్థాయిభావవ్యతిరిక్తముగ నపూర్వమగు రస మొకటి లేదని తేలినది.

విభావము లనఁగా రసమభివ్యక్త మగుటకుఁగల కారణములు. అయ్యవి యాలంబనవిభావము లనియు నుద్దీపనవిభావము లనియు రెండువిధములైయున్నవి. ఏవి లేనిచో రసము వ్యక్తముకాదో యవి యాలంబనకారణములు. నాయకుఁడు, నాయిక యాలంబనవిభావము లగును. వ్యక్త మగురసమునకు సహకారు లగునవి యుద్దీపన విభావములు. అయ్యవి యావనము, చంద్రిక మొదలగునవి. శరీరమునఁ బుట్టి కార్యరూపము లగువాల్చూపు మొదలగునవియుఁ, బరులసుఖదుఃఖములచేఁ దనకు సుఖదుఃఖములు కల్గునటులు భావించెడిసత్త్వమువలనఁ గల్గుసాత్త్వికము లగుకార్యములుగా నుండునవియు ననుభావపదవాచ్యము లగును. కంపము, కన్నీరు, గద్గదత మొదలగునవి సాత్త్వికములు. సముద్రమునందలి తరంగములవలెఁ బుట్టుచు విలీనములు కావలసిన

9. అథ స్థాయిభావాన్ రసత్వ ముపనేష్యామః, [నాట్య. సప్తమాధ్యాయః.]

10. క. ఉక్తవిభావాదులచే, వ్యక్తనవస్థాయి రూపభావంబులు సు
వ్యక్తములై నిజగుణసంయుక్తములై రసములన రసత్వము బొందున్. [చూ. దా. 1-6.]

పుడు మునుఁగుచు మఱలఁ బుట్టుచు నిట్లు చరించుచు రసాభివ్యక్తికి సహకారము చేయునవి సంచారిభావము లనఁగా వ్యభిచారిభావములు11. స్థిరములై స్వజాతీయభావములచేఁ గాని విజాతీయభావములచేఁ గాని లోపింపక మీఁది భావములకంటె విలక్షణము లగుభావములు రతి, హాసము, శోకము, క్రోధము మొదలగునవి స్థాయిభావము లనఁబడును12

లోకమునఁ గారణ, కార్య, సహకారికారణము లనఁబడునవియే కావ్యనాట్యములందుఁ గ్రమముగ విభావానుభావవ్యభిచారిభావము లని పిలువఁబడుచున్నవి. ఒకనాటకమును జూచుచున్నపుడు గాని కావ్యమును వినుచున్నపుడు గాని వానితత్త్వమును బాగుగ గుర్తించి యనుభవమునకుఁ దెచ్చుకొనసమర్థు లగుసహృదయులకు, ఆయాభావములకుఁ గలవ్యక్తివిశేషసంబంధము నశించి సామాన్యజ్ఞానము కలుగుచుండును. అట్టిసామాన్యజ్ఞానము కావ్యములందుకంటె నాట్యములందే వేగముగఁ గలుగును, గాన, మనము నాటకమునే దృష్టాంతముగఁ దీసికొనుట మంచిది. శాకుంతలనాటకము ప్రదర్శింపఁబడుచున్న దనుకొనుఁడు, అందు శకుంతలాదుష్యంతు లాలంబనకారణములు కాన నియ్యెడ నావిభావములు వ్యక్తివిశేషరూపములు కాక సామాన్యరూపములై పోవును. వారియందలి శకుంతలాత్వదుష్యంతత్వములు విగళితము లగునని భావము. ఇట్లే యనుభావసంచారిభావములు వ్యక్తివిశేషముతోడి సంబంధమును వీడి సామాన్యము లగును. కాని యట్టిసామాన్యత కావ్యము సముచితలలితపదబంధబంధురమై ప్రదర్శించునటులు తత్తద్భావప్రదర్శ

11. 1. విభావః కథ్యతే తత్ర రసోత్పాదకకారణమ్,
ఆలంబనోద్దీపనాత్మా స ద్విధా హ్రాదయంగమః.
రససమవాయి కారణ మాలంబనవిభావః, ఇతరత్కారణజాత ముద్దీపనవిభావః.

2. కార్యభూతోఽనుభావః స్యాత్కటాక్షాదిః శరీరజః॥
పరగతసుఖాదిభావనయా భావితాంతఃకరణత్వం సత్త్వమ్, తతోభవాః సాత్త్వికాః॥
[ప్రతాప. రసప్ర.]

3. విశేషేణ ఆసమన్తాత్ చరన్తీతి వ్యభిచారిణ ఇత్యుచ్యన్తే. [వి + అ + చారిణః-వ్యభిచారిణః.]

12. విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే నయః,
ఆత్మభావం నయ త్యాశు సస్థాయీ........(దశరూపకమ్.)

సముచ నిపుణులై యుండినపుడే- రసాస్వాదనసమర్థు లగుసహృదయులకే కలుగును. సహృదయులు కానివారికి రసాస్వాదము కలుగఁజాలదు.

అట్లు సాధారణము లైనవిభావానుభావవ్యభిచారిభావములవలన విలక్షణ మగునొకవ్యాపారము పుట్టుచున్నది ఆవ్యాపారమే వ్యంజన ఈవ్యాపారమువలననే సహృదయహృదయములందు వాసనారూపమునఁ బ్రతిష్ఠితపూర్వము లగురత్యాదిస్థాయిభావము లభివ్యక్తము లగును. కాఁగా నున్నస్థాయిభావములే విభావాదులచేఁ బుట్టింపఁబడిన వ్యంజనవలనఁ బ్రకాశితము లగునని తేలుచున్నది. సహృదయహృదయములందు స్థాయిభావములు తొలుత నుండియు నున్నను వాని నజ్ఞానము కప్పిపుచ్చియుండుటచే వ్యక్తములు కాఁజాలవు. మీఁదివ్యాపార మావరకరూప మగు నాయజ్ఞానమును నశింపఁజేయును. అజ్ఞానము నశించుటచే లోనున్న స్థాయిభావము, దానితోడిదే యగు నానందమును బ్రకాశించుట కభ్యంతరము లేదు. మానవునికి మమత్వ మను నది యజ్ఞానజనిత మగుటచే నజ్ఞానము తోడనే మమత్వము నశించును. అనఁగా సహృదయునకుఁ దానొక వ్యక్తివిశేషము ననుజ్ఞానము నశించి యతఁడు వ్యక్తిసామాన్యమే యగును. దుష్యంతాదినాయకులు సామాన్యవ్యక్తులైన ట్లిదివఱలోఁ జెప్పఁబడినది; కాని సహృదయనాయకుల కభేదము కలుగును. అపుడు సామాన్యరూప లగు శకుంతలాదినాయికలందు సహృదయునకు స్వకాంతాత్వజ్ఞానము కల్గి యనురాగము కల్గుట యసంగతము కాఁజాలదు. స్థాయిభావము వ్యక్త మగునపుడు విగళితవేద్యాంతర మగు నానందమును సహృదయుఁ డనుభవించును. స్థాయివిశిష్ట మగు నాయానందమే రసపదవాచ్య మగుచున్నది. ఇయ్యది శృంగారరసప్రతీతిమార్గము తక్కిన వానివిషయమై కూడ నిట్లే యూహించునది.

స్థాయిభావమునకుఁ బుష్కల మగువిభావాదిసామగ్రి లభించినపుడే వ్యక్త మగు నాభావము స్థాయి యనఁబడును స్వల్పవిభావజ మగుచో నది వ్యభిచారిభావమే గాని స్థాయిభావము కాఁజాలదు18. కావున రసమును బోషింపఁదలఁచినచో విభావాదులను సముచితరీతిని నిబంధించుట కవులకర్తవ్యమై యున్నది.

18. రత్యాదయః స్థాయిభావాః స్యుర్భూయిష్ఠవిభావజాః
స్తోకైర్విభావై రుద్దిష్టా స్తఏవ వ్యభిచారిణః॥

రత్యాదిభావములు చిత్తవృత్తివిశేషములు. (జ్ఞానవిశేషములు.) కాన నవి క్రొత్తగాఁ బుట్టినవి కావు. అయ్యవి తగినయుద్బోధము కలిగినపుడు వ్యక్తము లగుచు లేనియెడల నవ్యక్తములగుచు నుండును. ఆభావము లట్లులేని వారికి రసాస్వాదము కలుగఁజాలదు. కావున సహృదయులైనవారికే గాని యసహృదయులకు రసాస్వాదము కలుగదు. వాసనారూపమున స్థాయిభావము లందఱియెడఁదల నుండవలె నని నియమము మాత్రము లేదు.

రసమునకు నానందమునకును భేదము కలదా? లేదా? యని కొంచెము విచారింపవలసియున్నది గీర్వాణాలంకారికు లించుమించుగ నీవిషయమున రెండుమార్గములం ద్రొక్కియున్నారు మమ్మటాచార్యులు తనకావ్యప్రకాశమున రసాస్వాదనమువలన విగళితవేద్యాంతర మగునానందము కలుగు ననియు, రసము బ్రహ్మానందసబ్రహ్మచారి యనియు రెండుమార్గములను (రస మానందముకంటె నన్య మనియు, రసానందముల కభేద మనియుఁ గూడ) నిరూపించి యున్నాఁడు14. రసగంగాధరమునందలి రసనిర్వచనసూత్రమునుబట్టి స్థాయి కంటె నానందము వే ఱనియు, నీరెండిటికి నవినాభావసంబంధ మనియుఁ బండితరాజు సిద్ధాంతమైనట్లు తోఁచుచున్నది15. మఱియు నతఁడు స్థాయిభావముతోఁ గూడినయానందము రసమా? లేక యానందముతోనున్న స్థాయి రసమా? యనివిచారించుచు శ్రుతిని బ్రమాణముగ గ్రహించి రత్యాదిస్థాయివిశిష్ట మగు చిదానందమే రసమని సిద్ధాంతీకరించి యున్నాఁడు16. రస మానందస్వరూప మనియే శ్రుత్యర్థము. ఇట్లు ద్వివిధము లగుపక్షములు కానవచ్చుటచేత సమన్వయము నాసించినచో నొకరీతి సమాధానము చెప్పవలసియున్నది. రసము, నానందమును వేర్వేఱయినను హేతుహేతుమదభేదసరణి నాశ్రయించి (రసము చిదానందమునకు హేతు వగుటచే) యభేదమును జెప్పుట యుక్తిదూరము కాఁజాలదు.

---

14....“సకలప్రయోజనమౌళిభూతం సమనంతరమేవ రసాస్వాదనసముద్భూతం విగళితవేద్యాంతర మానందం॥” [కావ్యప్రకాశః ప్రథమోల్లాసః]
బ్రహ్మాస్వాదసబ్రహ్మచారీ......రసః[కావ్యప్ర. చతుర్థోల్లాసః]

15....“స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహగోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్టవాసనారూపో రత్యాదిరేవరసః [రసగం, 22 పు]

16. వస్తుతస్తు వక్ష్యమాణ శ్రుతిస్వారస్యేన రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణాచిదేవరసః. రసోవైసః రసంహ్యేవాయంలబ్ధ్వా ఽఽనందీభవతి. “ఇతిశ్రుతిః” [రసగంగాధర. పు 28]

ఆంధ్రాలంకారికులలోఁ బెద్దిరాజుమత మేమో నిశ్చయింపఁ బ్రబలాధారములు నిరూపించుట కష్టముగాని మూర్తికవి విద్యానాథుని "గుణాలంకారశ్రీకృతపరికర" అనుశ్లోకము నాంధ్రీకరించుచు "వావిరి దుఃఖమైన సుఖవైభవమైన విటీవిటాళియం, దావలఁ బూర్ణమై సహృదయాత్మలఁ గేవలహర్షమై తగున్" అని చెప్పి రసానందముల కభేదమును జెప్పియున్నాఁడు. మీఁదిసమాధానమే యిచ్చుటఁ గూడ శరణ్యమై యున్నది.

ఇట్లుసంగ్రహముగ బహుళాలంకారికసిద్ధాంతిత మగు రసస్వరూపనిర్వచనము సూక్ష్మముగఁ జెప్పఁబడినది. కానఁ బైరీతి వ్యక్తివాదమే సిద్ధాంతితమట్లు చాలమంది నిరూపించియున్నారు. కానఁ బైవాదమే యుక్తియుక్త మనుటకు ముఖ్యములగు నితరవాదములను గొంత విమర్శింపవలసియున్నది.

"విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అను నాట్యశాస్త్రీయరససూత్రమునందలి సంయోగనిష్పత్తిశబ్దములకుఁ దమకుఁ దోఁచినరీతిని బలువురు పండితులు పెక్కులర్థములను గ్రహించుటచేతనే వాదములు పలురీతుల బయల్వెడల నవకాశము కలిగినది. ఉత్పత్తివాదు లగుభట్టలోల్లటప్రభృతులు విభావములవలనఁ బుట్టి యనుభావములచేఁ బ్రతీతియోగ్యమై వ్యభిచారులచేఁ బోషింపఁబడిన స్థాయి రస మగు నని చెప్పుచున్నారు. అయ్యది రామాదినాయకనిష్ఠ మనియు, నాయకవేషమును ధరించుటచే నటునియందునది గోచరించు ననియును వారియాశయము. వీరిమతమున సంయోగపదమునకుఁ బలురీతు లగునర్థములను గ్రహింపవలసియున్నది. స్థాయివిభావముల సంయోగ మనఁ గార్యకారణభావము. స్థాయ్యనుభావసంయోగము జ్ఞాప్యజ్ఞాపకభావము. స్థాయిసంచారిభావముల సంయోగము పోష్యపోషకభావము. నిష్పత్తిపదమునకు వీరిమతమున నుత్పత్తి యని యర్థము. కాని యీమతము సరికాఁజాలదు. ఉన్నస్థాయిభావమే విభావాదులచేఁ బ్రకాశిత మగుచుగాని క్రొత్తగాఁ బుట్టుట యనుభవదూరము; పండితానంగీకృతమును. రస మెన్నియుగముల క్రిందటనో యుండిన రామాదినాయకనిష్ఠమైనచో సామాజికులకు రసాస్వాదము కలుగుట యెట్లు? రసము సామాజికనిష్ఠమై యుండవలదా? సంయోగపదమున కిన్నియర్థముల నంగీకరించుట గౌరవము కాదందురా?

అనుమితివాదు లగుశ్రీశంకుకులు సమ్యఙ్మిథ్యాసంశయసాదృశ్యప్రతీతులు నాల్గింటికంటెను విలక్షణ మగు చిత్రతురగన్యాయగృహీతప్రతీతివలన

నటునియందు రామాభేదజ్ఞానము కలుఁగు ననియు, సరస మగునాట్యమువలనను నిపుణుఁడగు నటుని చేష్టలవలనను, నటునియందు లేనిభావము లచట నున్నట్లే సామాజికులచే గ్రహింపఁబడు ననియుఁ, గాఁగా, రసము నాయకనిష్ఠ మైనను నటునియం దనుమానింపఁబడి సామాజికులచే ననుభవింపఁబడు నని చెప్పుదురు. వీరిమతమున సంయోగపదమున కనుమాప్యానుమాపకభావమును, నిష్పత్తిపదమున కనుమితియు ననునర్థములను గ్రహింపవలసియున్నది. కాని యీ మతముకూడ సరియైనట్లు తోఁచదు. నటుఁడు తటస్థుఁ డగుటచేఁ దద్గతముగ ననుమిత మగుస్థాయిభావము సామాజికులకు విగళితవేద్యాంతర మగునానందమును గల్గింపఁజాలదు. కాన నీవాదమున రసముయొక్క యథార్థస్వరూపము విశకలితమై యుండ లేదు.

భుక్తివాదు లగుభట్టనాయకులు లోకవ్యతిరిక్తముగఁ గావ్యనాట్యములయం దభిధకంటె విలక్షణములగు రెండువ్యాపారములు, భావకత్వ, భోగములనునవి కల వనియు, మొదటివ్యాపారముచే విభావానుభావవ్యభిచారిస్థాయిభావములు వ్యక్తివిశేషసంబంధమును విడిచి సర్వసాధారణము లగుననియుఁ, బిదప సాధారణీకృత మగుస్థాయిభావము భోగాఖ్యవ్యాపారమువలన (ఆవ్యాపారము రజస్తమముల నణఁచి సత్వము నుద్రేకింపఁజేయు నఁట) సామాజికులచే ననుభవింపఁబడుచు రస మగు నని చెప్పుదురు. వీరిమతమున సంయోగపదము సాధారణీకరణరూపార్థపరము. నిష్పత్తి యన భుక్తి లేక యనుభవము. కాని యీవాదమును యుక్తిదూర మనియే యందురు. క్రొత్తగ సాధారణీకరణభోగవ్యాపారముల నంగీకరించిన గౌరవము. రసము సామాజికభుజ్యమాన మగుటచే రసము పుట్టు నని కాని, జ్ఞాప్య మగు నని కాని చెప్పుటకు వీలు లేదు. కాన నది యభివ్యక్తమే యని యనఁదగును. కాని, భుక్తివాదు లగుభట్టనాయకులమతమున వ్యక్తివాదమున కణుమాత్రము నవకాశము చిక్కదు. కావున మొదటనిరూపింపఁబడిన యభినవగుప్త (ఆనందవర్ధనుని మతము ననుసరించియే యభినవగుప్తులు రసస్వరూపమును విశదీకరించిరి.) పాదులమతమే యాదరణీయము. వ్యక్తివాదమున సంయోగపదమునకు వ్యంజనాఖ్యసంబంధ మనియు నిష్పత్తిపదమున కభివ్యక్తి యనియు నర్థములు.

ఇంతవఱకును బ్రతిపాదింపఁబడిన విషయములంబట్టి రసము లన్నింటివలన నానందమే కలుగు ననియును దుఃఖ మెన్నఁడును గలుగఁజాల దనియును దేలుచున్నది. రసస్వరూపనిరూపణమున నిపుణుఁడును బ్రామాణికుఁడు నగు నభినవగుప్తాచార్యుఁ డారీతినే చెప్పియున్నాఁడు. ఇచట నొకపూర్వపక్ష

మును లేవఁదీయవచ్చును. రతి హాసము మొదలగు స్థాయిభావములు గల శృంగారహాస్యాదిరసములవలన నానందము కలుగవచ్చును గాని, శోకము-భయము- జుగుప్స- క్రోధము, స్థాయిభావములుగఁ గల కరుణ, భయానక, బీభత్స, రౌద్రరసములవలన నానందము కలుగు టెట్లు? ఈవిషయమున ని క్రిందివిధముగ సమాధానము ప్రాచీనకాలమునుండి నేఁటివఱకును బ్రచారము ననున్నది. కావ్యప్రపంచము లోకవిలక్షణమైనది. లోకమున సుఖహేతువుల వలన సుఖము దుఃఖహేతువులవలన దుఃఖము కలుగవలె నను నియమము కలదు. కవిబ్రహ్మసృష్టి విలక్షణమగుటచే దుఃఖహేతువు లగు కరుణాదిరసములవలనఁ గూడ విగళితవేద్యాంతర మగు నానందమే కలుగును. అట్లొనరింపఁగల వాఁడే కవి. హాలాహలమునుండి యమృతము నొలికింపఁగల సామర్థ్యము లేని కవి యథార్థకవి కాఁజాలఁడు. శ్రోత గాని, ద్రష్ట గాని కేవలము దుఃఖము ననుభవింపవలె ననునాశయమునఁ గవి శ్రవ్యకావ్యములను, నాటకములను రచింపఁడు. తనకు దుఃఖమే కలుగవలె నని కోరి సహృదయుఁడు కావ్యపఠనమునఁ గాని, నాటకదర్శనమునఁ గాని ప్రవర్తింపఁడు. దుఃఖము నుగల్గించు కావ్యములను జదువ సహృదయుఁడు దొరకొనినను నట్టిదుఃఖమువలన మనసునకు శాంతి గల్గి యానందము కలుగవలె ననునాశయముతోడనే యాతఁ డద్దానఁ బ్రయత్నింపవలెను. మఱియు మనము కవి యారసమును నిరూపించుటయం దెంతవఱకు జయమొందెను? కరుణరసమున మనలను రామాదులతోపాటుగ నేడ్పించెనా లేదా యనియే యాలోచింతుము. మనల నేడ్పించిననే మన కారసమువలన నానందము కలుగును. ఇయ్యది యనుభవమునకు విరుద్ధము కాఁజాలదు. గీర్వాణాలంకారికులు సామాన్యముగ నందఱును గరుణాదులవలన నానందము కలుగు ననియే చెప్పియున్నారు. నాట్యదర్పణమును వ్రాసిన రామచంద్రగుణచంద్రులు మాత్రము సుఖాత్మకత్వదుఃఖాత్మకత్వభేదమున రసములు రెండువిధము లనియు రసము సుఖదుఃఖస్వరూప మనియు వివరించియున్నారు17. కాని వీరిమతము నింకెవరు నామోదించి యుండలేదు. అర్వాచీను లెవ్వరును వీరిమతము నైన నుట్టంకించి యుండలేదు. వేయేల? వారిగురు వగు హేమచంద్రాచార్యులుకూడ వారిమతము నెత్తక రసము లన్నియు నానందస్వరూపము లనియే చెప్పియున్నాఁడు18.

17. చూ. నాట్యదర్పణము. [Gaekwcd Oriental Series] అ. 8.

18. చూ. కావ్యానుశాసనము. నిర్ణయసాగరప్రతి.

ఆంధ్రాలంకారికులు కూడ రసము లన్నింటివలన నానందమే కలుగు నని చెప్పిరి. అందులకు నరసభూపాలీయమునందలి ప్రాగుదాహృతమగు "వావిరిదుఃఖమైన సుఖవైభవమైన విటీవిటాళియం, దావలఁ బూర్ణమై సహృదయాత్మలఁ గేవలహర్షమై తగున్" అనువచనము ప్రమాణము కాఁగలదు.

రసము నాయకనిష్ఠమా? సామాజికసహృదయనిష్ఠమా? నటనిష్ఠమా? అనుప్రశ్నకు సమాధానము రసస్వరూపనిర్వచనావసరముననే ప్రతిపాదింపఁబడినది. కాని కొంచెము వివరించి యిచటఁ జెప్పఁబడును. అభినవగుప్తులమతమును బట్టి రసము సామాజికులచే నాస్వాదింపఁబడుటంబట్టి దానికిఁ దన్నిష్ఠతయే యుచితమై యున్నది. కావ్యమునందు శ్రోతలకును, నాట్యమునందు ద్రష్టలకును రసముకలుగు నని, అనఁగాఁ దత్తత్సామాజికులందు రసము తత్తన్నిష్ఠమగు నని మీఁదిసిద్ధాంతము ననుసరించియే పెద్దిరాజు కావ్యాలంకారచూడామణియందుఁ జెప్పియున్నాడు19 కావున రసము సహృదయసామాజికనిష్ఠ మని తేలుచున్నది. ప్రతాపరుద్రీయమునే మాతృకగాఁ దీసికొని (యించుమించుగ) యందలి ప్రాగుక్తాభిప్రాయప్రతిపాదక మగు "భావేస్థాయిని" అను శ్లోకమునే యాంధ్రీకరించిన మూర్తికవిమతమును వేఱుగ నిరూపించుటయు ననవసరము. కాని రస మెన్నఁడును నటనిష్ఠము కాఁజాలదు. నటుఁడు కేవల మభినయాదుల ననుకరించును. ఒకపుఁ డతఁడు తన్మయుఁడై రసము ననుభవించెనేని యపుడు నటుఁడు కాక యతఁడు సామాజికుఁడుగనే మాఱిపోవును. అతనికి (నటునకు) రసాస్వాదయోగ్యత లేదు. కావున నాట్యమునందు రసాస్వాదయోగ్యుఁడు సామాజికుఁడు కాని వేఱొకఁడు కాఁజాలఁడు.

ఈమీఁదఁ జెప్పఁబడిన విషయములలోఁ గొన్ని ప్రస్తుతము మనవారి కనుభవవిరుద్ధములుగ గోచరింపవచ్చును. కాని ప్రాచీనార్వాచీనలాక్షణికు లందఱు నిట్లే నిరూపించియుండుటచే వారి యనుభవముమాత్రము మీఁదిమాదిరిగనే యుండి యుండవచ్చును. లక్షణగ్రంథములయందు నిరూపింపఁబడినయంశములను విశదీకరించుట నాముఖ్యకర్తవ్యము కాని యది యనుభవమున కెంతవఱకు సరిపడుచున్నదనువిచారము ప్రస్తుతము కాదు.

రసాభివ్యక్తికిఁ గలకారణములు విభావానుభావవ్యభిచారు లని "విభావానుభావ వ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అను భరతరససూత్రమువల

19. గీ. ప్రౌఢలకుఁ గావ్యములయందుఁ బొందురసము
ద్రష్టలకు నాట్యములయందుఁ దనరురసము—[ద్వితీ. ౭.]

ననే తెలియవచ్చుచున్నది. ధ్వనికారాదులందఱు నారీతినే నిరూపించియున్నారు కాని ధనంజయుఁడు, ధనికుఁడు, విద్యానాథుఁడు మొదలగుకొంద ఱర్వాచీనులు సాత్త్వికభావములను గూడ రససామగ్రియందుఁ జేర్చి యున్నారు. వాని ననుసరించి మన యాంధ్రాలంకారికులుకూడ నట్టే చెప్పియున్నారు20. పై వారియాశయమును బట్టి సాత్త్వికములను రససామగ్రిగాఁ జెప్పవలసినట్లు తెలియుచున్నది. ఇయ్యవి ప్రధానములై యవసరమైనవే యైనచోఁ బ్రాచీనాలంకారికు లెవ్వరును వీనిని నిరూపింపకపోవుటకుఁ గల కారణమేమి? అనుప్రశ్నకు సమాధాన మీయవలసినబాధ్యత మనపైనున్నది. విచారించిచూచినచో ననుభావములకును సాత్త్వికములకును భేదమే లేదు. ప్రాగుక్తలక్షణములం బట్టి శరీరమునఁబుట్టు కటాక్షాదు లగు కార్యము లనుభావము లనియును, పరగతసుఖదుఃఖాదిభావభావనవలనఁ బుట్టుగగుర్పాటు, కన్నీరు, మొద లగునవి సాత్త్వికము లని యుఁ దేలుచున్నందున నీరెండును గార్యరూపములే యగుట నభేదమే యంగీకార్యము. కార్యములు మొదట సాత్త్వికావస్థయందుండి యాపై ననుభావములుగ మాఱును. కావున సాత్త్వికములు కూడఁ జివర కనుభావములే యగుటచే వేఱుగ సాత్త్వికములం జెప్పుట యనవసర మని భరతముని యెనిమిది స్థాయిభావములను, నెన్మిది యనుభావములను, ముప్పదిమూఁడు సంచారిభావములను, మొత్తముపై (8 + 8 + 33=49) నలువదితొమ్మిది భావములను గంఠోక్తిగ నంగీకరించియున్నాఁడు. సాత్త్వికములు వేఱుగ నున్న వనినచో నాసంఖ్యాపరిగణనము సరిపడఁజాలదు 21. భరతమునిమతమునే చాల మంది యనుసరించియున్నారు.

---

20. విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాదుత్వం స్థాయీభావో రతిః స్మృతః॥
విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రీసముల్లసితస్థాయీ భావో రసః॥
[ప్రతాపరుద్రీయే రసప్రకరణమ్]

21. గీ. అట్టివిజ్ఞానకలితమై యవరభావ, మాత్మఁ బ్రవ్యక్తమై విభావానుభావ
సాత్త్వికవ్యభిచారిసంజ్ఞలఁ దనర్చు, నాల్గుతెఱఁగుల రసనిదానంబు గాఁగ.
[చూడా 1—20.]

క. తలఁపఁగ రసకార్యములై, జలజాక్షులయందుఁ బొడము సాత్త్వికభావం
బుల నెనిమిదింటి నేర్పడ, నలరింతుం గడఁకతోను దాహరణంబుల్. [నరస 8—88]

21. ఏవం సర్వేమిళిత్వా ఏకోనపంచాశద్భేదాః॥ [నాట్య 6 అ.]

సూక్ష్మదృష్టిచే ననుభావసాత్త్వికములకు భేదము లేకున్నను స్థూలదృష్టిచే నది యనుకొన నవకాశము కలదు. సాత్త్వికములు చివరి కనుభావములే యైపోయినను, వానిప్రాథమికావస్థను విశదపఱచుటకు వేఱుగ వానిని గ్రహించుట దశరూపకకారాదులమతమున యుక్తిదూరము కాఁజాలదు. యోగి ప్రస్తుతావస్థయందుఁ జాతుర్వర్ణ్యముతోడి సంబంధమును వీడి యున్నను దొలుత బ్రాహ్మణుఁడయ్యె నేని బ్రాహ్మణయోగి యని పిలువఁబడునట్లే మొదటి సాత్త్వికభావము ప్రస్తుత మాయవస్థయందు లేకున్నను బూర్వావస్థను దెలియఁ బఱచుటకు వానిని వేఱుగ సాత్త్వికములని పరిగణింపవచ్చు నని విద్వాంసుల యభిప్రాయము.

ఆంధ్రాలంకారికు లెన్నిరసముల నంగీకరించిరో విచారించుటకుఁ బూర్వము తన్మూల మగుగీర్వాణవాఙ్మయమునందలి యాలంకారికులమతములను సూక్ష్మముగ నిరూపింపవలసియున్నది. స్థాయిభావమే రస మగు నను నంశము తొలుదొల్త వివరింపఁబడియే యున్నది. భరతముని యెనిమిదిస్థాయిభావములనే నిరూపించుటచేఁ దన్మతమున రసము లెనిమి దనియే చెప్పవలసివచ్చుచున్నది. సామాన్యముగ రసములు తొమ్మి దని యందఱు నొప్పుకొందురు. శాంతము రస మగు నని యందఱును (స్వల్పసంఖ్యాకులు తప్ప) నంగీకరించి యున్నారు కావున భరతమునిమతమునఁ గూడ శాంతరసము నొప్పుకొనవలెను. అతఁడు "అష్టౌ నాట్యే రసాః స్మృతాః" అని చెప్పినను, నాట్యమునం దెనిమిదే రసములని యతని మత మనియు నాట్యాతిరిక్తముగఁ గావ్యములందు శాంతరస మున్నచో నాతనికి విప్రతిపత్తి కలుగఁజాల దనియు మనము పైవచనమును బట్టియే గ్రహింపవలసియున్నది. అభినవగుప్తాచార్యులు శాంతమునుగూర్చి ప్రసంగించుచు "మునినాఽప్యంగీకృతం, క్వచిచ్ఛమ ఇత్యాదినా" యని మునిమతమున శాంతరసము నొప్పించి యున్నాఁడు. మఱియు శమము శాంతరసమునకు స్థాయి యైనట్లు భరతమునిమత మని కూడ నభినవగుప్తునియాశయ మైనట్లు తెలియుచున్నది నాట్యశాస్త్రమున "రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా, జుగుప్సా విస్మయ శ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః॥" అని స్థాయిభావములు నిరూపింపఁబడి యాపై "నిర్వేదగ్లానిశంకాఖ్యా" అని సంచారిభావములు ప్రస్తుతింపఁబడినవి. కాని శమము స్థాయిభావముగఁ గాని, భావమాత్రముగాఁ గాని చెప్పఁబడియుండలేదు. కావ్యప్రకాశమును వ్రాసినమమ్మటాచార్యులు నిర్వేద మమంగళప్రాయ మగుటచే వ్యభిచారిభావములలో దానిం దొలుదొల్త నిరూపించుట యనుచిత

మైనను నొకప్పుడు స్థాయి కాఁగల దనునాశయముననే యిట్లు నిరూపించె ననియు, నందుచే నిర్వేదము స్థాయి కాఁగల శాంతరస మొండు కల దనియు నిరూపించియున్నాఁడు22. విద్యానాథుఁడు శమమే శాంతరసస్థాయి యని చెప్పియున్నాఁడు. పండితరాజు నిర్వేదమునే శాంతస్థాయిగా నిరూపించియున్నాఁడు. ఇట్లే శాంతస్థాయివిషయమున మతద్వయ మున్న ట్లనుకొన వీలుకలదు. కాని విచారించిచూచినచో నిర్వేదమునకే శమ మని నామాంతర మని తెలుచున్నది- భరతముని శమము నంగీకరింపనిచో నభినవగుప్తులవచనము కుదురఁజాలదు శమనిర్వేదములు రెండును ద్రష్ట్రాత్మయనూపము లగుటచే నీరెండింటికి నభేదము నంగీకరించినచో నణుమాత్రము ననుపపత్తి కలుగఁజాలదు. ఇట్లు భరతముని మతానుసారముగ రసములు తొమ్మిది యని తేలినది.

ఇంతటితో నీనిశ్చయము స్థిర మని విశ్వసింప వీలులేదు. శృంగారప్రకాశమును వ్రాసిన భోజుఁడు శృంగార మొక్కటియే రస మగు నని వ్రాసియున్నాఁడు23. రూపగోస్వామి యుజ్జ్వలనీలమణి యం దుజ్జ్వలవేష మగు శృంగారము రసమని చెప్పియున్నాఁడు ప్రాచీనాలంకారికులలో నొకఁ డగు రుద్రటుఁడు తొలుదొల్త మీఁదిరీతిని దొమ్మిదిరసములనే గాక పదియవ దగు ప్రేయోరసము నంగీకరించి యున్నాఁడు24. ఆపై నంతటితోఁ దనివి నొందక మధురాదులయాస్వాదనమువలనరసములు కలుగునట్లు భావములన్నింటియొక్కయాస్వాదనమువలనను రసోత్పత్తి కలుగుట యనుభవసిద్ధ మగుట నిర్వేదాదులన్నియును రసములు కావచ్చు నని నిరూపించియున్నాఁడు.25 మనయాంధ్రులలో నధునాతనవిమర్శకులు కొందఱు రససంఖ్యను నియమించుటకు వీలు

---

22. నిర్వేద స్యామంగళప్రాయస్య ప్రథమ మనుపాదేయత్వేఽప్యుపాదానం సంచారిత్వేఽపి స్థాయిత్వప్రతిపాదనార్థమ్, తేన "నిర్వేదస్థాయిభావోఽస్తి శాంతోఽపి నవమో రసః" ఇతి. (కావ్యప్ర, చతుర్థోల్లాసః-)

23. వీరాద్భుతాదిషు రసేషు రసప్రసిద్ధిస్సిద్ధాకుతోఽపి వటయక్షవ దావిభాతి
లోకే గతానుగతికత్వవశాదుపేతా మేతాం నివర్తయితు మేష పరిశ్రమో నః॥
శృంగారవీరకరుణాద్భుతహాస్యరౌద్రబీభత్స వత్సలభయానకశాంత నామ్నః
ఆమ్నాసిషు ర్దశరసా నపరే వయంతు శృంగారమేవ రసనా ద్రసమామనామః॥
(శృంగా, పీఠిక)

24. శృంగారవీరకరుణా బీభత్సభయానకాద్భుతా హాస్యః
రౌద్రః శాన్తః ప్రేయా నితి మన్తవ్యా రసాః సర్వే. (రుద్రట కావ్యా. 8-3.)

25. రసనాద్రసత్వమేషాం మధురాదీనామివోక్తమాచార్యైః।
నిర్వేదాదిష్వపి తన్నికామ మస్తీతి తేఽపి రసాః॥ [కావ్యాలంకారః] 8-4

లేదనియు భావానుసారముగ నిచ్ఛకువచ్చినన్ని రసము లుండవచ్చు ననియు, జేయు సిద్ధాంతమునకు మీఁది రుద్రటునివాద మెంతయు నుపకరించుచున్నది.

రసవిషయకవిమర్శనసందర్భమున జగన్నాథపండితరాజుకూడ మీఁది రత్యాదిస్థాయిభావములు భూయిష్ఠము లగువిభావములవలన వ్యక్తమగునపుడు స్థాయిభావము లగుననియు, స్వల్పవిభావవ్యక్తము లగునపు డయ్యవియే సంచారిభావము లగుననియుఁ జెప్పియున్నాఁడు. ఈవిషయ మిదివఱకే నిరూపింపఁబడియున్నది. కాఁగా రసములు తొమ్మిదని నియమించుటలోఁ గలకారణమును వ్యక్తపఱుపవలసియున్నది.

దేవగురుపిత్రాదివిషయక మగురతి భావ మగు ననియును నయ్యదియే కాంతావిషయక మగుచో రస మగు ననియు నాలంకారికుల సిద్ధాంతము. ఆస్వాదమున భేదము లేనప్పుడు నన్నియు రసములే యని కాని లేక యన్నియును భావములనియే కాని యేలకాఁగూడదు? లేదా కాంతావిషయక మగు రతి భావమును, దేవాదివిషయక మగునది రసము నేల కాఁగూడదు? వీని గమనావిరహము నంగీకరింపవలసినపుడు మొదటియాలంకారికు నొకనియెడ గౌరవముంచి తన్మతానుసారముగ సమాధానమును జెప్పుటయే యుచితము. రసనవత్వసిద్ధాంతము మునిమతము ననుసరించియే యంగీకరింపఁబడిన దనియుఁ, దదతిరిక్తము లగునవి భావము లని యంగీకరింపవలసిన దనియుఁ, బేరునందే భేదము కలదు కాని ఫలమున భేదము లే దనియుఁ బండితరాజు చెప్పియున్నాఁడు26. సామాన్యముగ నందఱును రసములు తొమ్మి దనియే చెప్పియున్నారు. పండితరాజుకూడఁ దొమ్మిదిరసము లనే యంగీకరించియున్నాఁడు. అర్వాచీనాలంకారికులమతమున రసములు తొమ్మిదియే యగుచున్నవి? కావున వారిననుసరించిన మనయాంధ్రాలంకారికులమతమునఁగూడ రసములు తొమ్మిదే యని చెప్పవలసియున్నది27. కావున రసములు తొమ్మిదియే యని మనమొక మాదిరిగ సిద్ధాంతీకరించుటలో దోషము లేదు.

---

26. భరతాదిమునివచనానామేవాత్ర రసభావత్వాదివ్యవస్థాపరత్వేన స్వాతంత్ర్యాయోగాత్, అన్యథా పుత్రాదివిషయాయా అపి రతేః స్థాయిభావత్వ మతో నస్యాత్;............ రసానాం నవత్వగణనాచ మునినియంత్రితా భజ్యేత;........ [రసగంగాధరః. పు 46]

27. క. ఉక్తవిభావాదులచే, వ్యక్తనవస్థాయిరూపభావంబులు సు
వ్యక్తములై నిజగుణసం, సక్తములై రసములన రసత్వముఁ జెందున్. [చూడా. 2-4]

క. భరశృంగారము హాస్యము, కరణము వీరము భయానకము బీభత్సం
బును రౌద్ర మద్భుతము శాం,తరసంబును రసములనఁగఁ దనరుం గృతులన్.

ఈవిషయమును వ్రాయుటలో నుపయోగించిన గీర్వాణాంధ్రాలంకార గ్రంథములు.

| గ్రంథము. | కర్తృనామము. |
|---|---|
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| అభినవభారతి (నాట్యశాస్త్రవ్యాఖ్య) | అభినవగుప్తాచార్యులు |
| ఆంధ్రశబ్దచింతామణి | నన్నయభట్టు |
| ఉజ్జ్వలనీలమణి | రూపగోస్వామి |
| కావ్యదర్పణము | రాజచూడామణిదీక్షితులు |
| కావ్య ప్రకాశము | మమ్మటాచార్యులు |
| కావ్యాదర్శము | దండ్యాచార్యులు |
| కావ్యానుశాసనము | హేమచంద్రుఁడు |
| కావ్యాలంకారము | భామహుఁడు |
| కావ్యాలంకారము | రుద్రటుఁడు |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దయకవి |
| కావ్యాలంకారసంగ్రహసారము | ప్రతీహారేందువర్మ |
| కావ్యాలంకారసూత్రవృత్తి | వామనుఁడు |
| దశరూపకము | ధనంజయుఁడు |
| దశరూపకావలోకము (పైదాని వ్యాఖ్య) | ధనికుఁడు |
| ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుఁడు |
| నరసభూపాలీయము | భ. మూర్తికవి |
| నాట్యదర్పణము | రామచంద్రగుణచంద్రులు |
| నాట్యశాస్త్రము | భరతముని |
| ప్రతాపరుద్రీయము | విద్యానాథుఁడు |
| రత్నాపణము [పైదానివ్యాఖ్య] | కుమారస్వామి |
| రసగంగాధరము | జగన్నాథపండితుఁడు |
| లోచనము [ధ్వన్యాలోకవ్యాఖ్య] | అభినవగుప్తాచార్యులు |
| వక్రోక్తిజీవితము | కుంతకుఁడు |
| వ్యక్తివివేకము | మహిమభట్టు |
| శృంగారప్రకాశము | భోజదేవుఁడు. |

# రాజానకరుయ్యకుఁడు.

[క్రీ. శ 12 వ శతాబ్ది]

అయ్యాణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, యం. ఏ, కాకినాడ.

---

I. ప్రాక్కథనము—సంస్కృతమున 'సలంకారసర్వస్వ'ద్యనేకాలఙ్కారగ్రన్థముల రచించి సహృదయసంస్తూయమానకీర్తికలాకలాపుఁడై, యాలంకారికావతంసుఁ డగు విశ్వనాథకవిరాజు నంతటివానికిఁ గూడఁ గృతినిర్మాణావసరమున నుపజీవ్యుఁ డయిన రాజానకరుయ్యకుని కృతికాలాదులంగూర్చి తెలుఁగున నెవరును గూలంకషముగఁ జర్చించియుండలేదు. రుయ్యకుని కృతులుగా మనకుఁ దెలియుచున్నవానిలో 'శ్రీకణ్ఠస్తవము,' 'హర్షచరితవార్తికముం' దక్క మిగిలిన యీక్రింది పదిగ్రంథములును[1] స్వోపజ్ఞమూలకము లయిననేమి, యలంకారగ్రంథవ్యాఖ్యారూపము లయిననేమి సాహిత్యాలంకారప్రతిపాదకములే. సంస్కృతసారస్వతమును వెదకిచూచినను సర్వోత్కృష్టము లగునిన్ని యలంకారగ్రంథముల నిర్మించిన మహనీయుఁడు వేఱొకఁడు గానవచ్చుటలేదు.

ఇంచుమించుగ నైదుశతాబ్దములవఱకు [సనఁగా:— జగన్నాథపండితరాయలకాలము 1620-1660 క్రీ. శ. వఱకును] రుయ్యకుని గ్రంథరాజ మగు 'సలంకారసర్వస్వము' సాహిత్యసామ్రాజ్యమును నిరంకుశముగఁ బరిపాలించుచుండెడి దని చెప్పనగును. ఒక్క జగన్నాథపండితరాయలు దక్క, ఈ యైదు శతాబ్దములలోను రుయ్యకునియాలఙ్కారికమతమును ఖండించినవారు లేరు.

భారతవర్షమున కంతకు మకుటాయమానమును నలఙ్కారశాస్త్రమునకు బుట్టినిల్లు నగుకాశ్మీరదేశమే రుయ్యకుని వాసస్థానము. ఇతఁడు పండితవంశోద్భవుఁడు. దృఢవ్యుత్పన్నుఁ డగురాజానకతిలకుఁ డీతనిజనకుఁడు.[2] తిలకుఁ డుద్భటుని యలంకారగ్రంథమునకు 'ఉద్భటవివేకము' లేక 'ఉద్భటవిచారము'

---

1. (i) అలంకారానుసారిణి
   (ii) అలంకారమంజరి
   (iii) అలంకారవార్తికము
   (iv) అలంకారసర్వస్వము
   (v) కావ్యప్రకాశసంకేతము
   (vi) నాటకమీమాంస
   (vii) బృహతి
   (viii) వ్యక్తివివేకవిచారము
   (ix) సహృదయలీల
   (x) సాహిత్యమీమాంస

2. 'రాజానకతిలకాత్మజః'—పిషెల్ (Dr. Pischel) పండితప్రకటిత మగురుయ్యకుని 'సహృదయలీల'.

అను పేరితో వ్యాఖ్యయో విమర్శమో రచియించియుండినట్లు జయరథుఁడు అలంకారసర్వస్వవ్యాఖ్యాన మగు తన 'అలంకారవిమర్శిని'[3] లోన సూచించి యున్నాఁడు. అందువలనఁ దిలకుఁ డుద్భట మతానుయాయి యని తెలిసెడిని.

రాజానకోపనామము కాశ్మీరదేశీయము. 'రాజానక' పదమునకు 'రాజ కల్పుఁ డని' యర్థము.[4] నేఁటికిని కాశ్మీరదేశీయ బ్రాహ్మణులీపదము నుపనామముగా ధరింతురు. రుయ్యకునకు 'రుచకుఁ డ'ని యు నామాన్తరము గలదు.[5]

---

3. జయరథుని 'అలఙ్కారవిమర్శిని' (i) 'ఏతచ్చోద్భటవిచారే రాజానకతిలకేనైవ సప్రపఞ్చ ముక్త మితి నతథా స్మాభి రావిష్కృతమ్' [115 పు.]

(ii) "ఏతదేవ రాజానకతిలకేనా ప్యుక్తం 'కారణసామగ్ర్య మిహ బాధకత్వేనైవ ప్రతీయతే కార్యానుత్పత్తిస్తు బాధ్యత్వేన' ఇతి గ్రన్థకృచ్చ ప్రాయ స్తన్మతానువర్త్యేవ" [124 పు.]

(iii) "ఏతచ్చోద్భటవివేకే రాజాన[క]తిలకేన సప్రపఞ్చ ముక్తమితి గ్రన్థవిస్తరభయా న్నేహాస్మాభిః ప్రపఞ్చితమ్"

4. చూ. కల్హణుని 'రాజతరఙ్గిణి,' vi త. 261 శ్లో.
రాజ్ఞీకటాక్షభావేన సాపి మన్త్రిసభాన్తరే।
త మాజుహావ నిర్ద్రోహం స్వయం రాజానకాఖ్యయా.'

5. 'రాజానకరుచకాపరనామ్నో ఽలఙ్కారసర్వస్వకృతః' (కృతిః) అని 'పిషెల్' [Dr. Richard Pischel] పండితుఁడు ప్రచురించిన 'సహృదయలీల' యందలియుపసంహారవాక్యము చూ 'కావ్యమాల,' v గుచ్ఛకము: "సహృదయలీల' ఒకానొక వ్రాఁతప్రతిలో 'రుచక' అనుపాఠముగూడఁ గలదు. (i) 'అలఙ్కారసర్వస్వము' ['కావ్యమాల' 35 వ సంఖ్య, 1893 సం.] లో 'సంపూర్ణ మిద మలంకారసర్వస్వమ్. కృతి స్తత్రభవ ద్రాజానకరుయ్య (రుచ)కస్య' (205 పు) అని కలదు. (ii) 'తిరువాన్కూరుసంస్కృతగ్రంథావళి'లో 'నలంకారసూత్రము' ను పేరితోఁ బ్రకటింపఁబడినప్రతిలోను, (iii) కొన్ని వ్రాఁతప్రతులలోను [చూ. రాజేన్ద్రలాలమిత్రుని 'లిఖితగ్రంథసూచిక,' ix సం 117 పు.] (iv) 'ప్రతాపరుద్రీయము' మీఁది కుమారస్వామి 'రత్నాపణము'లోను [393, 396, 475, 448 పుటలు, కమలాశఙ్కరప్రాణశఙ్కరత్రివేది పండితునిప్రతి. 1909] (v) అప్పయదీక్షితుల 'చిత్రమీమాంస' లోను [72 పు. నిర్ణయసాగర ప్రచురణము] (vi) 'శాకున్తలము' మీఁది రాఘవభట్టునివ్యాఖ్యలోను [161, 179, 193 పు], (vii) రుయ్యకునిగ్రంథముపై శ్రీవిద్యాచక్రవర్తివ్యాఖ్యలోను [3609 పు. చెన్నపురప్రాచ్యలిఖితగ్రంథాలయముయొక్క యలఙ్కారమాతృకాసూచిక] 'రుచక' అనియే యున్నది. (viii) మమ్మటుని 'కావ్యప్రకాశము' మీఁది 'సంకేత' నామకవ్యాఖ్యలోఁ గూడఁ దద్వ్యాఖ్య 'రుచక' కృత మనియే యున్నదని డాక్టర్ బూలర్ [Dr. Buhler] పండితుఁడును ['కాశ్మీరదేశలిఖితగ్రంథనివేదిక,' 247 సం. xvi పు] పీటర్సన్ పండితుఁడును వ్రాసియున్నారు. రుయ్యకుఁడినటిదే ప్రమాణతర మని తచ్ఛిష్యుఁ డగు మంఖకుని "శ్రీకణ్ఠచరితము" [xxv స. 30 శ్లో] వలనఁ దెలియుచున్నది.

అలంకారసారస్వతమునఁ జేర్పఁబడిన రుచకుఁడు రుయ్యకునికంటె భిన్నుఁడనియు, 'నలఙ్కారసర్వస్వ'నిర్మాత రుయ్యకుఁడే కాని రుచకుఁడు గాఁడనియుఁ గొందఱు ప్రాచ్యసాహిత్యవేత్తల యభిప్రాయము. కాని, మహామహోపాధ్యాయులగు శ్రీమానవల్లి రామకృష్ణకవీంద్రులు 'రుచకుఁడు' అను వ్యాకరణసమ్మతరూపమునకు 'రుయ్యకుఁడ'ను వ్యావహారికభాషారూపము వచ్చియుండునని వ్రాసియున్నారు.[6]

## II రుయ్యకుని కాలము

రుయ్యకుని కాలము సులభముగా నిర్ణయింపఁగూడును.

(1) క్రీ.శ 1085 ప్రాంతముల రచియింపఁబడిన బిల్హణుని 'విక్రమాఙ్కదేవచరితమునుండి రుయ్యకుఁ 'డలంకారసర్వస్వము'నఁ గొన్నిశ్లోకముల నుదాహరించుకొని యున్నాఁడు.

(2) మహిమభట్టుని [క్రీ.శ. 1020—1060] 'వ్యక్తివివేకము' నకును వ్యాఖ్య వ్రాయుటయే కాక రుయ్యకుఁ డాతని మతము ననేకపర్యాయములు విమర్శించి, తీవ్రముగ ఖండించియున్నాఁడు.

(3) ఆచార్యమమ్మటుని [క్రీ. శ. 1050—1100] 'కావ్యప్రకాశము' పైఁగూడ రుయ్యకుఁడు వ్యాఖ్య రచించుటయే కాక పలుసారు లాతని మతమును విమర్శించి, ఖండించియున్నాఁడు.

---

6. "రుచక" అనుపదమునకు "రుఅక"అని ప్రాకృతభాషారూపము. ఇది క్రమముగా వ్యవహారములో "రుయక" యనియుఁ దరువాత "రుయ్యక" యనియు స్వరూపప్రాప్తత్వము నొంది యుండును. ఇట్లు కేవలశబ్దోచ్చారణపద్ధతిని వ్యుత్పత్తిం జూపినచోఁ గొందఱు విమర్శకుల కది సమ్మతము గాకపోవచ్చును. కావున "నలంకారసర్వస్వము" నకు "సఞ్జీవని' యను వ్యాఖ్యను నిర్మించిన శ్రీవిద్యాచక్రవర్తి శ్లోకములఁ గూడ నిట నుదాహరించెద (అ) "శ్లో. రుచకాచార్యపజ్ఞస్యాయ మలఙ్కారసర్వస్వే సఞ్జీవనీతి టీకా శ్రీవిద్యాచక్రవర్తినా క్రియతే.'
(ఆ) మఱియు గ్రంథాంతమున నాతఁడు—

"శ్లో. శబ్దస్యాసౌ విషమవిషమో దుర్ఘటార్థవ్యవస్థా-
వ్యాప్త్యవ్యాప్తిప్రకటనపటు ర్న్యాయచర్చాగభీరః
ఇత్థంభూమ్నా రుచకవచసాం విస్తరః క్షరశోఽయం
టీకాస్మాభిః సముపరచితా తేన సఞ్జీవనీయమ్"

మఱియు రాఘవభట్టుఁడు "శాకుంతలము"మీఁది తనవ్యాఖ్యలో [53 పు. 2 పంక్తి] 'రాజానకరుచక'అని వ్యవహరించియున్నాఁడు. [Vide: 'Literary Gleanings:' 1. Ruyyaka:- By M. Rama Krishnakavi, M. A., 'Journal of the Andhra Historical Research Society.' Vol. II part 2, pages 130-31; Oct. 1927.]

(4) మంఖకుని 'శ్రీకంఠచరితము [క్రీ. శ. 1135—'45 నడుమ రచితము] లోని రెండుశ్లోకములు 'అలంకారసర్వస్వము నందలివృత్తిలో' నుల్లేఖింపఁబడియున్నవి.

(5) [క్రీ. శ. 1149—'50 నడుమ రచియింపఁబడిన] కల్హణుని 'రాజతరఙ్గిణి' లోని యొకానొకశ్లోకము 'అలంకారసర్వస్వము' నందలి 'వృత్తి'లో నుద్ధరింపఁబడియున్నది.

(6) [క్రీ. శ. 1159—'60 నడుమ నిర్మింపఁబడిన] మాణిక్యచంద్రుని 'కావ్యప్రకాశ సఙ్కేతము'న 'నలంకారసర్వస్వము' బహువార ముట్టంకింపఁబడియున్నది.

ఇఁక నీవిషయముల నించుక వివరింపవలసియున్నది

(1) బిల్హణుని 'విక్రమాఙ్కదేవచరితము'లోని రెండుశ్లోకములను[7] రుయ్యకుఁ 'డలంకారసర్వస్వము'లో నుదాహరించుకొనియున్నాఁడు. ఆచార్యబూలర్ పండితుఁడు [Dr. G. Buhler] 'విక్రమాఙ్కదేవచరితము' క్రీ. శ. 1085 ప్రాంతముల నిర్మింపఁబడియుండు నని సిద్ధాంతీకరించియున్నాఁడు[8] ఈకావ్యమలంకారగ్రంథములలో నుదాహరింపఁబడఁ దగినంత ప్రతిష్ఠ సంపాదించుటకించుమించుగా నేఁబదివత్సరములు పట్టును. కావున రుయ్యకుఁడు 1150 క్రీ. శ. ప్రాంతముల విలసిల్లియుండె ననఁగూడును.

(2). మహిమభట్టుని 'వ్యక్తివివేకము, నందలి విషయముల రుయ్యకుఁ 'డలంకారసర్వస్వము' న సంగ్రహించియున్నాఁడు. మహిమభట్టుఁడు ధ్వన్యాలోకకారునిమతము నతితీవ్రముగా ఖండించుటకే 'వ్యక్తివివేకము'ను రచించియున్నాఁడు. రుయ్యకుఁ డన్ననో యత్యంతపరాకాష్ఠగల ధ్వనిమతానుయాయి. అందువలననే యచ్చటచ్చట మహిమభట్టుని 'మహామతి' యని వ్యాఖ్యానించినను[9] రుయ్యకుఁ డీతనియహంకారమును బలుసారులు తీక్ష్ణముగా

7. (i) 'శ్లో. సాహిత్యపాథోనిధిమన్థనోత్థం కర్ణామృతం రక్షత హే కవీన్ద్రాః
యత్తస్య దైత్యా ఇవ లుణ్ఠనాయ కావ్యార్థచౌరాః ప్రగుణీభవన్తి॥
(ii) శ్లో. గృహ్ణన్తు సర్వే యదివా యథేచ్ఛం నాస్తి క్షతిః కాపి కవీశ్వరాణాం
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యైరద్యాపి రత్నాకర ఏవ సిన్ధుః'—విక్రమాఙ్కదేవ. చ. 1 స. 11, 12 శ్లో. ఈరెండు "నలంకారసర్వస్వమున [118 పు.] నుల్లేఖింపఁబడియున్నవి.
8. చూ. 'విక్రమాఙ్కదేవచరితము'నకు "డాక్టర్ బూలర్" పండితునిపీఠిక.
9. 'వ్యక్తివివేకవ్యాఖ్య' 15, 16 పుటలు-[తిరువనంతపుర సంస్కృతగ్రంథావళీప్రచురణము.]

ఖండించియున్నాఁడు[10]. తిరువనంతపురసంస్కృతగ్రంథావళిలో 'వ్యక్తివివేకము' వ్యాఖ్యాతృనామరహిత మగు నసంపూర్ణ వ్యాఖ్యతోఁ [1909 సం. లో] ప్రచురింపఁబడియున్నది. ఈవ్యాఖ్యాత 'యలంకారసర్వస్వ'నిర్మాత యగు రుయ్యకుఁడే యని గ్రంథస్థప్రమాణబాహుళ్యపురస్సరముగా కాణేపండితుఁడు సిద్ధాంతీకరించియున్నాఁడు. ఈవిషయములు ముందు రుయ్యకగ్రంథవిచారప్రకరణమున విశదీకరింపఁబడును. మహిమభట్టుఁడు అభినవగుప్తపాదునకంటె నర్వాచీనుఁ డనియు, రుయ్యకునికంటెఁ బ్రాచీనుఁ డనియు ననఁగా నాతఁడు క్రీ. శ. 1025-1100 నడుమను లేక యించుమించు ద్వాదశశతాబ్దము నుత్తరార్ధముననో, చివరనో విలసిల్లియుండు నని యాచార్యసుశీలకుమారడే పండితుఁడు వ్రాసియున్నాఁడు[11]. కాణేపండితుఁడు మహిమభట్టుని సమయము క్రీ. శ. 1020-60 అని నిరూపించియున్నాఁడు[12]. పైవానిలో మొదటియభిప్రాయమునుబట్టి రుయ్యకుఁడు క్రీ. శ 1100 కంటె నవీనుఁ డనియు, రెండవదానినిబట్టి క్రీ. శ. 1060 కంటె నర్వాచీనుఁ డనియుఁ దేలుచున్నది.

3. మమ్మటుని 'కావ్యప్రకాశము'నకు రుయ్యకుఁడు 'కావ్యప్రకాశసఙ్కేతము'ను వ్యాఖ్యను నిర్మించియున్నాఁడు. ముందు రుయ్యకుని కృతులను వివరించునప్పు డీవ్యాఖ్యను గూర్చి విశేషముగాఁ జెప్పఁబడును. 'కావ్యప్రకాశము' ననేకపర్యాయములు ప్రమాణీకరించుకొనుట యేకాక, రుయ్యకుఁడు పలుసారులు 'కావ్యప్రకాశ'కారుని యభిప్రాయములను బూర్వపక్షము చేసి

---

10. (i) "ధ్వనికారస్య వచోవివేచనం నః" అను మహిమభట్టుని పీఠికాశ్లోకముపై "యథాస్థితపాఠే తు ధ్వనికారస్యేతి వచశ్శబ్దాన్విత మిష్యమాణం ప్రాధాన్యా ద్వివేచనశబ్దాన్వితం ప్రతీయతే. ఏతచ్చాస్య సాహిత్యవిచారదుర్నిరూపకస్య ప్రమఖప్రస్ఖలిత మితి మహా౯ ప్రమాదః"-అనియు,

(ii) "తదేతదస్య విశ్వ మగణనీయం మన్యమానస్య స్వాత్మనః సర్వోత్కర్షశాలితాఖ్యాపనమితి"-[41 పు.] అనియు [44 పుట కూడఁ జూచునది.] వ్యాఖ్యాత (రుయ్యకుఁడు.) మహిమభట్టును నిరసించియున్నాఁడు.

11. Dr. S. K. De. 'History of Sanskrit poetics'-(1923) Vol I, p. 194.

12. Prof P. V. Kane, M. A. L l. M., ;-'History of Alankara Literature,' (1923), P. XCIV.

యున్నాఁడు[13]. కావ్యప్రకాశములో నితరాలంకారికుల కారికలు గూడనుద్ధరింపఁబడియున్నయవి; కావున నందలి కారికలఁ గొన్నిటి నుదాహరించుకొని యంతమాత్రమున మమ్మటరుయ్యకుల పౌర్వాపర్యము నిర్వివాదముగఁ బరిష్కరింప వీలులేదు. అయినను 'కావ్యప్రకాశము'నందలి వచనము లనేకములు 'అలంకారసర్వస్వము' నందలి వృత్తిలో నుల్లేఖింపంబడుటచే రుయ్యకునికంటె మమ్మటుఁడు ప్రాక్కాలికుఁడని తోఁచెడిని[14].

(4) మఙ్ఖకుని 'శ్రీకణ్ఠచరితము'లోని రెండుశ్లోకములు[15] 'అలఙ్కారసర్వ

---

13. ఆచార్యమమ్మటుఁడు 'రాజతి తటీ' త్యాది శ్లోకమును శబ్దాలఙ్కారసఙ్కరమున కుదాహరించుకొని 'అత్ర యమక మనులోమప్రతిలోమశ్చ చిత్రభేదః పాదద్వయగతే పరస్పరాపేక్షే' అని వ్రాసియున్నాఁడు. రుయ్యకుఁడు ['అలఙ్కారసర్వస్వము' 119 పు] "శబ్దాలఙ్కారసఙ్కరస్తు కైశ్చి దుదాహృతో యథా:—'రాజతి తటీయ మభిహత * * * సారావసదా' అత్ర యమకానులోమప్రతిలోమయోః శబ్దాలఙ్కారయోః పరస్పరాపేక్షత్వే నాఙ్గాఙ్గిసఙ్కర ఇతి. ఏతత్తు నసమ్య గావర్జకమ్. శబ్దాలఙ్కారయోః శబ్దవదుపకార్యోపకారకత్వాభావే నాఙ్గాఙ్గిభావాభావాత్. శబ్దాలఙ్కారసంసృష్టి స్త్వత్ర శ్రేయసీ," అని 'కావ్యప్రకాశ' వచనమును ఖండించియున్నాఁడు. ఈవిషయములు ముమ్ముందు 'కావ్యప్రకాశాలఙ్కారసర్వస్వ' సంబంధమును సమాలోచించుప్రకరణమున వివరింపఁబడును.

14. శ్రీమన్మాడభూషికృష్ణమాచార్యులవారు తమ 'సంస్కృతవాఙ్మయచరిత్రము' [(1906); 164] లో 'మమ్మటుఁడు రుయ్యకునిసన్నిధి నలఙ్కారశాస్త్రాధ్యయన మొనరించె ననియు, రుయ్యకుఁడు మమ్మటునికంటెఁ బ్రాక్తనుఁ డనియు, మమ్మటుఁడు రుయ్యకుని యభిప్రాయముల ఖండించియున్నాఁ' డనియు వ్రాసియున్నారు. కాని యిది సరిగాదు 'కావ్యప్రకాశ' కారునికాలము క్రీ. శ. 1050—1150. లేక క్రీ. శ. 1100 ప్రాంతము. 'అలంకారసర్వస్వ' కారునికాలము క్రీ. శ. 1135—1155 [చూ కాణే: 'అలఙ్కారవాఙ్మయచరిత్ర' CXI, CVI పు.]. ఒకవేళ మమ్మటరుయ్యకు లించుక సమకాలికు లైనఁ గావచ్చును. అట్లైయుండ రుయ్యకునికంటె మమ్మటుఁడు చాల వృద్ధుఁడై యుండనోపు.

15. (i) [శ్రీకణ్ఠచరితము, II స, 49 శ్లో.= అలంకారసర్వస్వము, 21 పు]

'శ్లో. ఆటోపేన పటీయసా యదపి సా వాణీ కవేరాముఖే। ఖేలన్తీ ప్రథతే తథాపి కురుతే నో మన్మనోరఞ్జనమ్। నస్యాద్యావ దమన్దసున్దరగుణాలంకారఝంకారితః। ప్రస్యన్దిల సద్రసాయనరసాసారానుసారీ రసః॥

(ii) శ్రీ. క. చ. VI స. 70 శ్లో.= అలం. స. 87 పు.

'శ్లో. మదనగణనాస్థానే లేఖ్యప్రపఞ్చ ముదఞ్చయ న్నికలబృహత్పత్రస్య స్తస్వరేఖ మషీలవైః। కుటిలలిపిభిః కం కాయస్థం న నామ వినూత్నయ న్న్వ్యథిత విరహిప్రాణే ప్రాయమయా మధికం మధుః॥

స్వము'నందలివృత్తిలో నుదాహరింపఁబడియున్నవి. 'శ్రీకణ్ఠచరితము,' క్రీ. శ. 1145 కంటె నవీనము గాదని సిద్ధాంతీకరింపఁబడియున్నది. 'అలంకారసర్వస్వ' సూత్రవృత్తికర్తృత్వవిచారమున ముందు దానివివరములు చూడఁబడును. 'అపరితోషాద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్,' "కవి కూలియట లోకము మెచ్చుటేకదా,' ['our praises are cur wages'] అనురీతిని మఙ్ఖకుఁడు తనకావ్యమును బూర్తిచేసి, తనసోదరుఁ డగు నలంకారుని భవనమున సమావేశమైన యుద్యోగిపండిత పరిషత్సమక్షమున దానిం బ్రచురించితి ననియు నాపారిషదులలో నొకఁ డగురుయ్యకుఁడు తనకాచార్యుఁ డనియుఁ దనకావ్యముననే [XXV స. 30; 135 శ్లో] వ్రాసికొనియున్నాఁడు. అందువలనఁ, దనశిష్యుఁ డగుమఙ్ఖకుని కావ్యమునుండి రుయ్యకుఁ డైదుశ్లోకముల నుదాహరించికొని యుండుటలో వింత లేదు. ఆచార్యునివచనములను శ్లోకముల నంతేవాసు లుద్ధరించుకొనుట సామాన్యముగాఁ జూపట్టును. కాని 'యత్రయకావ్యకీర్తి' యగువ్యాసదాసక్షేమేంద్రకవీంద్రుఁడు తన'యౌచిత్యవిచారచర్చ'లోఁ దనగురు వగునుపాధ్యాయగఙ్గకుని శ్లోకము[16] నుట్టంకించుకొనుటయే కాక, 'కవికణ్ఠాభరణము[17] న స్వశిష్యు లగురాజపుత్త్రలక్ష్మణాదిత్యునియొక్కయు భట్టోదయసింహునియొక్కయు [లలితాభిధాన మహాకావ్యమునుండి] శ్లోకముల రెంటి నుల్లేఖించుకొనియున్నాఁడు. కావునఁ బ్రౌఢవిద్వాంసుఁ డగు శిష్యుని గ్రంథములనుండి లక్ష్యములను దీసికొనుట యెంత దిగ్దంతివంటికవికి విదునకైనను న్యూనత్వాపాదకము కాఁజాలదు. డాక్టర్ బూలర్ పండితుఁడు

---

(iii) శ్రీక. చ. V స. 28 శ్లో.= అలం. స. 90 పు.

'శ్లో. ద్యూనాలికీర్ణ ముఖ మాశు దిశాం చుచుమ్బ రుద్ధామ్బరాఁ శశికలా వలిఖత్కరాగ్రైః । అన్తర్నిమగ్నచరపుష్పశరోఽతితాపా । త్కించిం చ కారతిరుణో నయదీతుణాగ్నిః ॥

(iv) శ్రీక. చ. VI స. 16 శ్లో. =అలం. స. 90 పు.

"శ్లో. స్వపతుశీలా లలితై రపాఙ్గ హేతా స్మరేదర్నయతో విశేషమ్। మానం నిశాకర్తు మశేషయూనాం పికస్య పాణ్డిత్య మఖణ్డ మాసీత్."

(v) శ్రీక. చ. X స. 10 శ్లో=అలం. స. 90 పు.

శ్లో. మన్ద మగ్నివ ధు రగ్య మాపలా దర్శితశ్వయథు చాఢవత్తమః । దృష్టయ స్తిమిరజలిసిష్షేవిరే దోషమానుధిపతే రసంనిభా."

16. ఔచిత్యవిచారచర్చ. 'కావ్యమాల,' I గుచ్ఛకము (1929), 159 పు.

17. కవికంఠాభరణము. "కావ్యమా IV గు. (1887)

‘శ్రీకణ్ఠచరితము’ క్రీ. శ. 1135—1145 నడుమ రచింపఁబడియుండు నని నిరూపించియున్నాఁడు.[18] డాక్టర్. యమ్. కృష్ణమాచార్యులవారు ప్రకృతము ముద్రింపఁబడుచున్న తమ ‘సంస్కృతవాఙ్మయచరిత్రము’[19] లో ‘శ్రీకంఠచరితము క్రీ. శ. 1140 ప్రాంతముల నిర్మింపఁబడియుండు నని వ్రాసియున్నారు. అందువలన క్రీ. శ. 1145 ప్రాంతముల నిర్మింపఁబడిన ‘శ్రీకంఠచరితము’నుండి రుయ్యకుఁడే పూర్వోద్ధృత శ్లోకపంచకమును దన ‘యలంకారసర్వస్వము’ నందలి వృత్తిలో నుదాహరించుకొని యుండినచో ‘నలఙ్కారసర్వస్వము’ క్రీ. శ. 1150 ప్రాంతముల రచింపఁబడియుండు ననవచ్చును. సుశీలకుమారడే పండితుఁడు చెప్పినట్లు[20] రుయ్యకుఁడు ద్వాదశశతాబ్ద ద్వితీయ తృతీయపాదములలో [క్రీ. శ. 1125—1175] సారస్వతసేవ చేసియుండె ననుట సత్యదూరము గాదని తోఁచెడిని.

ఒకవేళ మఙ్ఖుఁడే పైయైదుశ్లోకములను రుయ్యకుని గ్రంథమునఁ జేర్చెనేమో యనువిషయమును గూడ నిట విచారింపవలసియున్నది. మఙ్ఖుని శ్లోకము లాతనిగురువగు రుయ్యకుని గ్రంథమునఁ గానవచ్చుటంజేసియే కాఁబోలు, మఙ్ఖుఁడు ‘నలఙ్కారసర్వస్వము’నఁ గొంతభాగమును నిర్మించి యుండు నను ప్రతీతి దక్షిణభారతవర్షమునఁ బ్రచురముగా నున్నది; ఇది యసత్యమనుటకుఁ గల ప్రబలహేతువులు ‘సూత్రవృత్తికర్తృత్వ విచారప్రకరణము’నఁ జూపఁబడును. ‘అలఙ్కారసర్వస్వము’న ‘శ్రీకంఠచరితము’లోని శ్లోకములఁ జేర్చిన యతఁడు మఙ్ఖుఁడైనఁ గావచ్చును. తనగురువగు రుయ్యకుని యశస్సౌరభము సర్వతోముఖవ్యాప్తి నందవలె నని విశేషపరిశ్రమ మొనర్చి మఙ్ఖుఁడు ‘నలఙ్కారసర్వస్వము’ను బరిష్కరించియుండును; అట్టియెడఁ దనగురువుకూడ నలంకరించిన విద్వత్సభ పండితపరిషత్తునందే తన ‘శ్రీకంఠచరితము’ రసికామోదము వడసినదిగదా యని యందలి కతిపయశ్లోకముల రుయ్యకుని కృతియందు—

18. Buhler's 'Detailed Report of a Tour in search of Sanskrit MSS in Kashmir, Rajaputana, and Central India' [Extra No. 'JBBRAS' 1877], Bombay. 1877.

19. Dr. M. Krishnamacharya (M.A., M.L., Ph.D., M.R.A.S.,): A History of Classical Sanskrit Literature,' Enlarged II edition, now in course of publication.

20. Dr. S. K. De, M.A., D. Lit.,: 'Sanskrit Poetics'—Vol. I P. 194.

ఆతని యనుమతినే కావచ్చు—చేర్చియుండును. లేదా కేవల మహాకావ్యనిర్మాత యగు తనకీర్తికంటె నలఙ్కారగ్రంథము లనేకములు రచించి మించిన రుయ్యకునియశస్సు చిరస్థాయి యనియెంచి సూదితో దార మన్నట్లు లాతనితో పాటు తనకును సుస్థిరకీర్తి లభించునని సుజ్ఞకుఁడై తనశ్లోకములఁ గొన్నిటి నాతనిగ్రంథమునఁ జొన్పియుండును.

(5) కల్హణుని 'రాజతరఙ్గిణి' లోని యీశ్లోక 'మలఙ్కార సర్వస్వము'న [93 పు ] నుదాహరింపఁబడియున్నది.

శ్లో. 'అసమాప్తజిగీషస్య స్త్రీచిన్తా కామనస్వినః
అనాక్రమ్య జగత్సర్వం నో సంధ్యాం భజతే రవిః' [21]

[రాజతరఙ్గిణి. IV త. 441 శ్లో.]

కల్హణుఁడు, కాశ్మీరప్రభు వగు సుస్సలుని కుమారుఁ డగుజయసింహుని [క్రీ. శ. 1127—1159] యాస్థానము నలంకరించి,[22] 'రాజతరఙ్గిణి'ని, క్రీ. శ. 1149 మొదలిడి,[23] క్రీ. శ. 1150 లోఁ బూర్తిచేసియుండెను. అందు వలన 'రాజతరఙ్గిణి'నుదాహరించుకొనిన 'యలఙ్కారసర్వస్వము,' క్రీ.శ. 1150 కిఁ బిమ్మట నిర్మింపఁబడియుండును.

(6) ఇంతవఱకు 'నలఙ్కారసర్వస్వము'న నుద్ధరింపఁబడిన గ్రంథములం బట్టి రుయ్యకునికాలమును నిర్ణయింపఁగడఁగితిమి. ఇఁక రుయ్యకునికృతి నుల్లేఖించుకొనిన గ్రంథకారులనుబట్టి యాతనికాలమును నిర్ణయింపవలసియున్నది. రుయ్యకుని 'యలఙ్కారసర్వస్వము'ను బేర్కొనినవారిలోఁ బ్రాచీనతముఁడు మాణిక్యచన్ద్రుఁడు క్రీ. శ. 1159—'60 నడుమ[24] నీతఁడు మమ్మటుని 'కావ్య

21. భరతాచార్యుల 'నాట్యశాస్త్రము' మీఁది వ్యాఖ్య యగు 'నభినవభారతి' లోనీశ్లోకము కవినామరహితముగ నుట్టంకింపఁబడియున్నది.

22. 'శ్లో. సుత స్సుస్సలభూభర్తు స్సంప్రత్యప్రతిమప్రభః। నందయన్ మేదినీ మాస్తే జయసింహో మహీపతిః'—రాజతరఙ్గిణి (కడపటిశ్లోకము).

23. 'శ్లో. లౌకికేఽబ్దే చతుర్వింశే శకకాలస్య సాంప్రతం । సప్తత్యాభ్యధికం యాతం సహస్రం పరివత్సరాః'—రాజ. త. (గ్రంథముఖమున నున్నది). ఇందువలన నీకవి శాలివాహనశకము 1070 (క్రీ. శ. 1148) లో నున్నట్లు విశద మగుచున్నది.

24. ఈవ్యాఖ్యయొక్క నిర్మాణకాలముం దెల్పుశ్లోకము ఝాల్కీకరపండితుని 'కావ్యప్రకాశ' పీఠిక [22 పు.] లోఁ జూడనగును.

ప్రకాశము'పైఁ 'గావ్యప్రకాశసఙ్కేతము'[25]ను వ్యాఖ్యను రచియించి యుండ నేకపర్యాయములు 'అలఙ్కారసర్వస్వము' నుట్టంకించుకొని యున్నాఁడు.[26] 'అలఙ్కారసర్వస్వము'న నుల్లేఖింపఁబడిన గ్రంథము లన్నిటిలోను నవీనము క్రీ. శ. 1145 కంటెఁ బరము గా దని నిశ్చయింపఁబడిన 'శ్రీకణ్ఠచరితము', 'అలఙ్కారసర్వస్వము' నుదాహరించుకొనిన గ్రంథము లన్నిటికంటెను బ్రాచీనము, క్రీ. శ 1159—60 నడుమ రచియింపఁబడిన మాణిక్యచన్ద్రుని 'కావ్యప్రకాశసఙ్కేతము.' అందువలన 'నలఙ్కారసర్వస్వము,' క్రీ. శ. 1145—1155 నడుమ రచింపఁబడె ననుట సమంజసము గాఁ జూపట్టుచున్నది. రుయ్యకుఁడు క్రీ. శ. 1125—1175 నడుమ వాఙ్మయసేవ యొనరించియుండు నని నిర్ధారణము చేయవచ్చును. రుయ్యకుని గ్రంథములంగూర్చి రానున్న వ్యాసమున మనవి చేసికొందును.

[మదీయ 'సంస్కృతాలఙ్కారికచరితము'నుండి]



25. (i) 'కావ్యప్రకాశసఙ్కేత'ము ప్రకటనములు: 'ఆనందాశ్రమగ్రంథమాల' సంఖ్య 89, పూనా. 1921.

(ii) 'మైసూరురాజకీయప్రాచ్యగ్రంథాలయ ప్రచురణములు,' సంఖ్యలు 58, 59, 60. మైసూరు.

26. చూ. మైసూరు ప్రతి. 321, 255 పుటలు.

# వేఁడుకోలు.

—( శ్రీ తి. వ. నారాయణస్వామిగారు-దుసిఁగి అగ్రహారము )—

మ. తనజన్మంబులఁ గూళరక్కసులచేతఁ గల్గుబన్నంబులం
బనిగాఁ దెల్పుచు వీఁక వారల నడంపన్ జోదుమేల్బంతినాఁ
జనురాము న్దనతోడ నంపుటకు విశ్వామిత్రుఁ డన్జోగితేఁ
డనుమాటల్విని చాల్పుఁదేన్లదార కట్టా! యంచు డగ్గుత్తికన్. 1

క. కను నడలి వేఁడికన్నీ, రడరఁగఁ బెనువంత నతని ఖుజ్జలఁ బడి యా
పడుపున నొడికారపుఁబే, రడిదఁపుదొరకనివె మించునారాటమునన్. 2

చ. కినుకకుఁ దావొసంగి యుడికింపఁగఁబోవక మమ్ముఁ బ్రేముడిన్
వినఁదగు నాదువిన్నపము వేల్పులమూఁకయు నాకు వాడపుం
జెనఁటులఁ డాయ నేమెడలసిల్గులఁ జెందుచురన్నఁ జెక్కుఁగీ
టిన వసవల్చు నాకొడుకటే? గెలువంగలవాఁడు వారలన్. 3

శా. గుండ్రాలం గొని యేత్తుఅన్నొరుప సోఁకున్మాఁక లేతేర నా
తీండ్రన్నగ్గొని యోలమూసఁగొను నంతేఁ బీతున న్రాముఁడో
తండ్రీ! కొండికయాట; నా యెడలఁ గాంతాళమ్మున న్జూడ కీ
మండ్రాటమ్ముచు దీర్చి యొప్పుపనిఁగొమ్మా! జాలియిమ్మా! వెసన్. 4

ఉ కానక గన్నకొండికలఁ గావల కంపుటి కాక మానుసుల్
బోనముగా నెసంగఁబలుపోఁకలనేగెడి సోఁకుమూఁకతోఁ
బూని దురమ్మొనర్ప వడిఁ బొమ్మన నెవ్వనినాలు కాడు; నీ
కూనలె మేటికంగిసలకు న్దగువారలు జోగిరాయఁడా. 5

ఉ. తోడియమంగుఁబొట్టియలతోఁ గెడఁగూడియు నెమ్మినాఁటఁ జెం
డ్లాడుటొ హత్తిరేసిసనమూరఁగ నెక్కుచువీటివెంటఁ దా
రాడుటొ నల్పు పావలవురా? పొలదిండులఁగూల్చ నేగుటల్
కోడిగమొక్కొ? నీ యెడఁదకు న్దగుకర్జముగాఁగఁ దోఁచెనే. 6

చ. ఒడిమెలఁదాల్పనోవ రెటులోపుదురో దొనలూన; లాగులన్
దొడుగఁగనేర రెప్పగిదిఁదొడ్గుదు రొప్పగుబొందళాల వా
విడిచియు లాఁతివారిఁ బిలువన్గనునోపుదు రిట్టికూనలన్
ఋసుతలనాకఁ గయ్యముఁలఁ బూన్పఁదలంచెదె జోగిరేడ్డొరా. 7

చ. వగయు సుకమ్ము నేఁది పెను వంకల డొంకలఁ జేరి బందుగుల్
దగు నొకసంతు లేక మెయి, దాఁగఁగ జేర్వడనట్టి జంటపు
ట్టుగువలెఁ గాక బొట్టెలఁ గనుఁగొని మచ్చియు జోగినైన నీ
కుఁ గఱఁచనేల? బొట్టియలు కుందినఁ దండ్రి కెసంగు సంగదల్. 8

ఉ. డాసిసిమూర్తిఁ దూఁపుల నెదన్బడఁ జేయుచు నగ్గలించుచున్
దీనసరమ్మైన చిల్కలగమి న్జడిగా వడి నేసి యార్చుచున్
గాసియొనర్చి దాయలకుఁ గాఱు ప్రభీకు నొసంగు పోరులన్
జేసి యెఱుఁగ రిట్టివని చెప్పిన మున్నెవ రేమి సేయుదున్. 9

క. మనుమనుమా; మును నానో, మినసోమున ననను నెన్నుమేనున మనురా
ముని నెమ్మిని మూను మనిన, నను మన్నన నెన్ని సెరుసను నామన్నా. 10

క. మినమినని మేచునన్మను, మవరాముని మూని నన్ను మన్నన మెనని
మ్మనినసుర మ్మన మమునో, మిననిన్ను న్మానవాన మూను నె మనునన్. 11

చ బలితపుఁదమ్మితూఁడు నలువంకల సైఁకపుటొండఁగాయు మే
డలఁ దిరుగాడ వాడెఁకునొడల్గల నెత్తురుకందుల గ్గటా
పొలకవళంబుగా నడఁపి పొంతలఁ ద్రిమ్మరు గ్గసింప్రతోఁ
గలమలకున్బ్రకాలమనఁగా రుసిగామిడి మే స్వశంక దేః?'' 12

ఉ ఒజ్జవుఁ దాఁద్రియట్ల మకూ నోమినవాఁడవుఁ గాక జాలు నా
బొజ్జదునీగతోడ సరిపోలుపనొప్పగు వాఁడ వౌట నీ
కజ్జ నొకింతయు న్దొసఁగు బాటిల దైనను గుత్రనౌట నీ
వజ్జరె! నాఁగ కంగినల నాగదురే నఱజోగిజాబిలీ. 13

ఉ కూఁకటితోడ ముంగురులు కూడవ యీ మన ముద్దుగారు లే
యాఁకటికోర్వఁ డెండమున నాఁగదు క్రొన్ననపోనిమేను; పెన్
జీఁకటి దాఱు పాలసులు చెచ్చెరఁ దన్వినఁజుట్టుముట్టి యు
త్త్రాఁకలఁబెట్టుచోఁ గలఁగ కాఁగునె రాముఁడు బాసవాల్గణీ. 14

చ. జగములఁ బెంపఁగా నుఱుముసల్పఁగఁ జాలువలాతి బాము పె
న్దెగుళులవెజ్జ; కొండికలఁ దెంపునఁ బాయఁగ లేక యింతగా
వగచితివయ్య! మావగపువావఁగ నోపిన ప్రాపవౌట నే
వగవగఁదీర్చి నన్నుమనుపన్దలపోయుదొ నిన్ననమ్మితిన్ 15

క. బంతియరదములదొర మొద, నెంతయుఁ బెనగొన్నవంత నిచ్చడుపున నా
వంతమిగుల్పక రుసిమే,ల్బంతికి వినిపించి యుడుఁకు వను వేఁడుటయున్. 16

# ధాతుజవిశేషణముల ద్రుతప్రకృతికత్వము.

ఉ. భా. ప్ర. దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు, కాకినాడ.

---

విచక్షణులారా!

ఆంధ్రసారస్వతప్రపంచమునకు మెఱుఁగులు దిద్ది హొరంగులఁ దురంగలింపఁజేయు నీస్వర్ణయుగమున, నాంధ్రభారతికి లభించినపాఁదొడవులలో బ్రహ్మశ్రీ, వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారి "యాంధ్రశబ్దచింతామణి విషయపరిశోధన" మొకటి

అది వారి యగాధభాషావగాహనమును నఖండశబ్దశాస్త్రపరిశ్రమను, సూక్ష్మదృష్టితోడి విమర్శకతానైపుణిని చేనోళ్ళఁ జాటు ననుట నిష్పాక్షికోక్తి. నేనా గ్రంథరాజమున ధాతుజవిశేషణములఁ గూర్చి చదువునపుడు కలిగిన యభిప్రాయవిశేషముల నిందుపనిబద్ధింపఁ దలఁచితిని.

శ్రీశాస్త్రులవారు "ద్రుతాఖ్యోనః" అనుసూత్రార్థవిమర్శనమున నిట్లు ద్రుతస్వరూపమును నిర్వచించిరి. "పొల్లునకారము, ద్రుతసంజ్ఞగలదని పైసూత్రమున కర్థము. ద్రుతి యనఁగా ద్రవీభావము. సందర్భవశమున నిటవర్ణలోపమని యర్థము గ్రహింపవలయును ప్రకృతినిష్ఠమైనను ప్రత్యయాదినిష్ఠమైనను స్వరవిశిష్ట మగునకారమునందలి స్వరము ద్రుతి యనఁగా లోపమును బొందినచో నట్టిస్వరద్రుతి నందిన పరిశిష్టనకారము ద్రుత మనునన్వర్థసంజ్ఞను బొందుచున్న దని తాత్పర్యము."

ఇఁక ద్రుతప్రకృతికత్వ నిరూపణము చింతామణిలో నిట్లున్నది.

"త్రిజ్యర్థ్యశేషషష్ఠీ స్స్వస్వర్థప్రవచనీయజవిభక్తీః కించిత్ప్రశంసనాద్భుత సంతాపయదాతనాకిమే వాంశ్చ । క్వాకిలతూష్ణీ మాద్యా నభిదధతికళా ద్రుతో నయేషాం స్యాత్. అన్యే ద్రుతప్రకృతయో యేష్వప్యనుజీవితద్రుతానిత్యం"

దీనిని వివరించుచు నిచ్చిన యుదాహరణములలో 'రక్షించుట' అనియు నుదాహరించినారు. మఱియు నన్నయ ద్రుతద్విత్వప్రయోగప్రదర్శనావసరమున,

"మునీంద్ర నీకుఁ జన్నె నలినాక్షులందు మదినిల్పఁగ"

అని 'చన్నె' యనుదానిని నన్నయ మామూలుగాఁ బ్రయోగించు

ద్రుతద్విత్వముగా సిద్ధాంతీకరించి, త్రిలింగలక్షణశేషకర్త క్రియాపరిచ్ఛేదపు రెండవసూత్రమున 'చను' ధాతువును జేర్చుట సరికాదనియు, అప్పకవి, చింతామణిమతమును గ్రహింపక తద్ధర్మార్థకవిశేషణములఁ గళలుగాఁ బొరఁబడి వివరింప, దానినిసమ్మిసూరిప్రభృతులు ధాతుజవిశేషణములు కళలని భ్రమించిరనియు స్వోక్తి వ్యాఖ్యానించినారు. పైవ్రాఁతలనుబట్టి 'అను' కను, కొను, చను, మొదలగు ధాతుజవిశేషణములు "త్రిజ్ఞర్థ్యే" త్యాదిసూత్రముచొప్పున ద్రుతప్రకృతికములు కాఁగా 'అనుఁ, కనుఁ, కొనుఁ, చనుఁ' అనురూపములనందును. వీనిక్లుప్తరూపములు క్రమముగా అన్, కన్, కొన్, చన్, అనిసిద్ధమగుటలో సందేహము లేదుగదా! వీనితుది నకారపుఁబొల్లులు "ప్రకృతినిష్ఠమైనను ప్రత్యయాదినిష్ఠమైనను, స్వరద్రుతి నందినపరిశిష్టనకారము ద్రుత మను నన్వర్థసంజ్ఞను బొందుచున్నది." అను వివరణవాక్యములవలన ద్రుతములని నిర్ధరింపనగునుగదా! కాఁగా నీపద్ధతి నన్నయభారతభాగమునకే విరోధించున ట్లగపడుచున్నది. చూడుండు.

"ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోని రాజులన్
పెలుకురఁ బట్టి తెచ్చి చెఱఁబెట్టె గిరివ్రజమున్పురంబులో"

అని సభాపర్వ ప్రథమాశ్వాసమున నున్నది. 'అన్' అనునది చి. తామణినిబట్టి ద్రుతాంతమే యగుచో నిట "పరుషా ద్ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతంచ బిందుస్స్యాత్" అను సూత్రముచే 'గిరివ్రజ మఁబురంబు' అని సరళాదేశము రానక్కఱలేదా? మఱియు నిటఁ గొన్ని ప్రాచీనపు ప్రతులలో 'గిరివ్రజమువ్వరంబు, అని వాదేశమును గానంబడుచున్నది. ఇదియు సద్రాని కళాత్వమునే ప్రతిపాదింపఁ జాలియున్నదిగదా!

ఇంకను నిట్టివి స్వతంత్రప్రయుక్తములు పెక్కులు చూపట్టుచున్నవి. చిత్తగింపుఁడు.

"జడిగొన్ కోర్కుల నింతి తాను మగవేషంబూని"

సత్యభామాసాంత్వనము—౩ ఆశ్వాసము.

"తోఁడుఖింటివాఁడు చన్ త్రోవఁ బోక"

ఆముక్తమాల్యద—౬ ఆ.

"వాసి గడల్కొంతఱియందు సత్త్వము"

విజయవిలాసము—౧ ఆ.

పై నుదహరించిన ప్రయోగములు ప్రాసములందుఁ గాని యతులయందుఁ గాని నిబద్ధింపఁబడక పోయినను బరంపరాపాఠవశమునను, బహుపుస్తకముద్రణాక్రమమునను నవి తత్తత్కవిప్రోక్తములే యనఁదగి యున్నవి. మఱియు నొకపుస్తకమునఁ బొరపాటుండును, గాని, భిన్నపుస్తకముల నియ్యెడన సరళాదేశము పొరవడి యుండదుగదా! కాన నీయనుపపత్తి యెట్లు పరిహరింపఁ బడు నని శాస్త్రులవారు తలంచియుండిరో తెలియకున్నది.

ఇట్టి యనుపపత్తి నుద్భావించి వారు ధాతుజవిశేషణద్రుతప్రకృతికత్వనిరూపణావసరముననో ద్రుతప్రకృతికత్వనిరూపణావసరముననో చర్చింపవలసినది, కాని, యట్లు జరుగకుంటచే వ్యుత్పిత్సువులు సందేహపరంపరలోఁ దల్లడిల్లుచున్నారు.

శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ త్రిలింగలక్షణశేషమున నింకొకపక్కితో సూత్రించిరి. చూడుఁడు.

“ అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు ”

ఆచార్యులమతమున ధాతుజవిశేషణములు ద్రుతప్రకృతికములుగాఁ గనుపడవు.

అను, కొను, అను వానికి హల్లు పరముగా నున్నచో నంత్యోకారమునకు లోపముమాత్రమే పైసూత్రమునఁ జెప్పఁబడినది. కాఁగా వీనికి ద్రుతాంతత్వప్రసక్తి లేకపోయినది. కనుక సరళాదేశబాధ తొలఁగినది. కాని యీ యాధునికవైయాకరణసిద్ధాంతము చింతామణివిరుద్ధ మని గదా శ్రీశాస్త్రుల వారిప్రబలవాదము.

ఇట్టిసందర్భములో ధాతుజవిశేషణములు ద్రుతప్రకృతికములో కళలో నిర్ధరింపవీలుకాకున్నది. చింతామణిచొప్పున ద్రుతప్రకృతికములే యన్నచో దీనికి విరోధించునది నన్నయభారతభాగమే యైయున్నది. మఱియుఁ గొన్ని సత్కవిప్రయోగములను విరోధించును ప్రయోగసంగ్రహణార్థము కళలే యన్నచోఁ జింతామణివిరుద్ధసిద్ధాంత మగును. కాన నీయనుపపత్తిని బరిశీలించి వ్యుత్పిత్సుసందేహనివారణార్థము శ్రీ సీతారామగురుదేవులు సదుత్తరముఁ బ్రకటింప సప్రశ్రయాభ్యర్థనము.

# ఆంధ్రితద్విశిష్టత.

కాశీభట్టకృష్ణరామశాస్త్రిగారు, పాలూరు

---

సూ॥ నిత్యమనుత్తమపురుషక్రియాస్వాః ౪.

ఈసూత్రమునుండి నిత్యపదము "పరిమితౌ సమస్తానాం" అను సూత్రమునందనువర్తించుచున్నది కాని తరువాతిసూత్రములయందనువర్తింపదు కావున నే "నస్యాత్తద్ధర్మోతః" అనుసూత్రము తరువాతిసూత్రమునందు "చోర్వాస్యాద్వర్తమానవిహితస్య" 'వా' పద ముపయోగించెను. (౪ నుండి ౬) సూత్రములు నిత్యములని తెలియుదుము ఏడవసూత్రమునుండి యెనిమిదవసూత్రముదాక వికల్పము. ఇట్లే కలదు ఆపట్టికము నీక్రింద జూపుచున్నాను

సంధిప్రకరణము.

| సూత్రసంఖ్య-సాదిపదము. | | నిత్యమూ, వికల్పమూ | ఉదాహరణములు. |
|---|---|---|---|
| సంధిర్నాచోచ్యనుతః- | ౧ | నిషేధము—న | సిరియన్న, రోయివి |
| వాతః ... | ౨ | వికల్పము—వా | మేనత్త, మేనయత్త |
| అనాదిషునిభక్తి ... | ౩ | వికల్పము—వా | నాకిచ్చె, నాకునిచ్చె |
| నిత్యమనుత్తమ ... | ౪ | నిత్యము—నిత్యం | చేసితివర్చనము |
| పరిమితౌసమస్తానాం | ౫ | నిత్యము—అనువృత్తి | దోసెడు, జానెడు |
| నస్యాత్తద్ధర్మోతః... | ౬ | నిత్యము ను—అను | వచ్చునతడు |
| చోర్వాస్యాత్ ... | ౭ | వికల్పము—వా | అనుచున్నాడు, అనుచు నున్నాడు |
| తద్వత్తదాదిజస్య ... | ౮ | వికల్పము—తద్వత్ | అదేల, అదియేల |
| ప్రాయస్తుకిమాది ... | ౯ | ప్రాయము—ప్రాయం | ఏమయ్యె, ఏమియయ్యె |
| అపిశబ్ద ... | ౧౦ | వికల్పము—అనువృత్తి | ఎందేనిట్టి, ఎందేనియిట్టి |
| చోరేరుపధా ... | ౧౧ | వికల్పము—వా | ఎదిరిచి, ఎదిర్చి |
| 1 శత్రర్థే ... | ౧౨ | వికల్పము—అను | అనుచు, అన్చు |
| 2 తస్యస్యాచ్చ ... | ౧౩ | వికల్పము—అను | అంచు, అనుచు |
| 3 శబ్దాత్ ... | ౧౪ | వికల్పము—అను | అయినది, అయినయది |
| 4 పోశ్చ ... | ౧౫ | వికల్పము—అను | అపుడు, అప్డు |
| 5 ప్రథమా ... | ౧౬ | వికల్పము—అను | పదంపడి, పదపడి |

| | | |
|---|---|---|
| 6 షష్ఠ్యా | ... ౧౭ | ౧౨—౨౪ ఈపదుమూఁడు సూత్రములలో నిత్యా |
| 7 ఆద్యస్యా | ... ౧౮ | నిత్య వివేకసూచకవాచకములు లేవు అయినను |
| 8 అహమా | ... ౧౯ | ప్రయోగసంప్రదాయమును బట్టియు ననువర్తన |
| 9 లోపోనమ | ... ౨౦ | మును బట్టియు నైదుసూత్రములకు వికల్పత్వమని |
| 10 పరుషా | ... ౨౧ | యనుకొన్నను మిగిలినవాని గతి యేమో తెలియ |
| 11 అవికార | ... ౨౨ | దు. "షష్ఠ్యా" అనుసూత్రము నిత్యమనియందమన్న |
| 12 గసడ | ... ౨౩ | నట్టి పదముగాని యూస్పదముగాని లేదు. మిగిలినవి |
| 13 నవికృతి | ... ౨౪ | వికల్పములుగనున్నవా ? |

"షష్ఠ్యా" అనుసూత్రమునఁ గేపలాచ్ఛమే విషయమా ? రామునాజ్ఞ యిత్యాదులు గుదురవు. ఆంధ్రభాషాసామాన్యమునకును నాంధ్రవ్యాకరణ కార్యమాత్రమునకును బైసూత్రము వర్తించును. కాకున్న "శంభు+ఆజ్ఞ" "శంభ్వాజ్ఞ" యనురూప మాంధ్రమున నసిద్ధము గావలసివచ్చును. మఱియు నాంగ్రభాష గీర్వాణసాంప్రదాయమే యగుటను గీర్వాణసాంప్రదాయసూత్రములవలన నొకరూపమును దెలుఁగువ్యాకరణమువలన నొకరూపమును సిద్ధించు ననియు నచ్ఛాంధ్రపదములకుఁ బాణినీయము శాసకము గాదు, కాన నీసూత్రముచే నిత్యముగా వచ్చు ననియు నెఱుంగుదుము, కావున నీ సూత్రాష్టకము ఉభయభాషాపదసామాన్యముగ నున్నది. ఆచ్ఛికమున నిత్యముగను నితరమున వికల్పముగను విధించిన యుద్దేశము యోగ్యబల ప్రయోగబలముల వలనఁ దెలియఁ దగును. ఆ యనంతరసూత్రములలోఁ గేవల గీర్వాణపదములను బ్రయోగించుటచేఁ దత్తత్సూత్రకార్యము లన్నియు (మూఁడు సూత్రములును-౧౮-౧౯-౨౦) నాచ్ఛికపదాద్యచ్చు పరమగునెడనగునని తెలుపుచుండుటను, పదునెనిమిదవసూత్రమునమాత్రము 'నమః' "అహమాది" మొదలగు గీర్వాణపదములఁ జూపకున్నను దత్సాహచర్యమున నాసూత్రమునను దత్పూర్వోత్తరసూత్రమర్యాద యున్నదనవలసి వచ్చును. మఱియు నీ యామ్రేడితపూర్వపదాంతాచ్చునకు లోపము గలిగించు సూత్ర మెందే సందర్భమున నున్నను బరపదసంబంధ కావున నాచ్ఛికమే పర మగుటను (నియతము) ఆచ్ఛికమున కాచ్ఛికమే యని యర్థమగుచున్నది. మిగిలిన రెండును వికల్పము లగుచున్నవి. అథర్వణునిమతము నియ్యది యగుటచే వికల్పసూత్రములఁ జేర్చ్బో నిమెను.

ఇరువదొకటవసూత్రమును వికల్పమా? అని సంశయింపకుము. అందావికల్పత్వముండుటచేతనే పూర్వవిధానమున "సరళా ఏవసంతితే" అని నిత్యత్వమును జెప్పెను. ఈ సూత్రమునకున్న వికల్పమేకదా; చింతామణి కభిప్రేతమదియే యగుట నిటసూత్రనిత్యమని పూర్వవిధానముచేసెను, "ఏవ"శబ్దమట్టియర్థమునిచ్చుచున్నది. అయినను నిందొండొక సంప్రదాయము కలదు. సంస్కృతసంబంధి 'కచటతపలకు గజడదబలు' నిత్యముగరావు. సాంస్కృతికకాదివర్ణవికల్పత్వ నిర్ణయమునకే సూత్రమారంభింపబడినది. గజడదబా దేశమును వికల్పమని కొందఱు లాక్షణికులు చెప్పుదురు. దానిన్ + క్షోణిపైనుంచి అనునది సంధించునప్పుడు "దానిఁగ్షోణి" గ వ్రాయరాదు, పలుకరాదు. స్తుతిపేయమునుగాదు. సంయుక్తములగు సాంస్కృతికకచటతపలకు సరళము లాదేశములుగ రావను నాచారమున్నదో పరిశీలింపవలయును.

శ్లో॥ వికల్పేన ద్రుతేలోపే పరుషాః సరళాః పరే

క॥ కృతిని సమాగమములు త, కృత కారములుండ ... ముద్దరాజు రామన్న.

క॥ నాపతులు గంధర్వులచే పడి మృతినొంది ... భారతము.

సీ॥ కనకంబు వర్షించు ఘనుల ... విజయవిలాసము.

కనక్-కంబుక్- వర్షించుఘనుల ... అని పాఠాంతరము.

ఉ॥ పై పయిఁగౌతుకంబు ... విజయవిలాసము.

క॥ ఏ చక్కం బెట్టు వాఁడనే పాండవులక్ ... భారతము.

మ॥ కా। నతగఁబొందుట కార్యము ... డిటో

ఉ॥ శీతమయూఖ పాంథజన చిత్తవధాధ్యుఁడ వైతివిప్పుడు
యొవ్వ్యతలపంగనిప్పుడిది యుత్పలగంధి చకోరనేత్ర యొం
తే తిలకించి చూచి తరుణిం గరుణింపఁగదయ్య ... భాను-పరి॥

ఇత్యాది ప్రయోగములు గలవు. ఈపాఠముల ప్రామాణ్యమదెట్లున్నను సరళాదేశ వికల్పత్వభావము కొందఱకుఁ గలదనుటకుఁ జాలును. అముద్రిత గ్రంథచింతామణిలోఁ బండితు లనేకులు చర్చించిరి కాని వికల్పత్వ సంప్రదాయము నెల్లవిధములఁ జూపరు. సరళాః, అని సాముదాయికముగఁ జెప్పుటయే వికల్పత్వమున కనుకూలమనిరి. కాని యితరోపపత్తులఁ జూపరు. బ్రా॥శ్రీ॥ పారనంది రామశాస్త్రిగారీవిషయమును గొంత యుక్తరీతిని విమర్శించిరి. వీరి యభిప్రాయములు గొన్నింట గ్రంథకర్త్రభిప్రేతములసియే తోఁచును. వస్తుతస్త్వం

బులు, అన్వారంబు అను తావుల సరళాదేశము నీయక 'ఏఁబడి' ఏఁబన్రు మొదలగుచోట్లఁ జేసియు నన్నయఁ దనయభిప్రాయమును జూపె నని వ్రాసిరి. ఇది యి ట్లుండ ద్రుతప్రకృతికము లన నేమియను శంకయు వేసి సమాధాన మిచ్చిరి. కాని పూర్వులసంప్రదాయమును జూపఁదగును. ద్రుతము-ద్రుతప్రకృతికము నాంధ్రభాషలో దేవరహస్యముగనున్నది. కొంచెము వివేకింతము.

## ద్రుతము—ద్రుతప్రకృతికములు.

ద్రుతమును గూర్చి ప్రత్యేకముగ నొకపాత్రము పూర్వ మొక పండితుఁడు వ్రాసియుండెను. తరువాతఁ బ్రౌఢవ్యాకరణకర్తయు ద్రుతలక్షణమును వ్రాసెను. ఆంధ్రాక్షరతత్త్వమునఁ బ్రత్యేకముగ నంత నకారము ద్రుతమయి యుంటఁ బ్రత్యేకాక్షరమయి యుండునని సోదరభాషల మర్యాదతోఁ బోల్చి చూపిరి. ఇంక మన మీ సమయమున సమన్వయమునకు వత్తమా?

ద్రుతము, ద్రుతప్రకృతికము, పరుషాములు, కల, తద్ధర్మము, ఇందుసప్తమి మున్నగుపేళ్లు చింతామణి వాఙ్మయ ప్రపంచములోనివి. చింతామణి పూర్వమునఁ బై సంజ్ఞలు లేవు. అథర్వణ కారికలలో లేవా? అని యందు రేమొ? ఆకారికలును జింతామణి కాలికములే యగుచున్నవి. ఇఁక నన్నయ భారతమునుండి కావ్యాలంకారచూడామణిదాఁక ద్రుతనామప్రసంగము లేదు. నాంతపదంబులని యనుటయే యాచారము కళాశబ్దముల కళయు నంటు లేదు. నన్నయనుండియుఁ బదిలక్షణములు చింతామణిలో నున్నట్లే యుండినచోఁ జింతామణి వ్యాకరణము నెఱుఁగకపోయినను గొన్నిలక్షణములయిన నెఱిఁగియుండరా? వాక్యప్రధానాంగమగు క్రియాపదలక్షణమునే యెఱుఁగకపోయి యుందురా? పింగళి సూరన్న కాలమునాఁటికిని గూడఁ దద్ధర్మ మెవ్వ రెఱుఁగరు. తద్ధర్మప్రశంసలో వ్రాసితిని. ఆరయుఁడు. చింతామణిద్రుతమునకు స్వభావము ప్రత్యేకముగ వ్రాయవలసిన దగుట నిందు విడిచి ద్రుతప్రకృతికము లనువానిఁగూర్చి విమర్శింతుము. ద్రుతము ప్రకృతియందు వేనికో యవి ద్రుతప్రకృతు లని యర్థ మగుచున్నది. ద్రుతప్రకృతులను శబ్దమును బట్టి యవ్యయములైన నాంతశబ్దములే ద్రుతప్రకృతికము లనవలసివచ్చును. బ్ర॥ శ్రీ॥ పారనంది రామశాస్త్రిగారును నీవిషయమున సుముఖులు. సర్వనామసంజ్ఞయు నిట్టి సందేహము గలదియే. అవ్యయములయిన ద్రుతప్రకృతికములకంటెఁ బరములయిన పరుషములే సరళములగుచున్నవని యేవ్యాఖ్యాతలును జెప్పరు. చింతామణియు బూర్తిగ

లక్షణమునైన లక్ష్యమునైనఁ జూపక యిఁక భాషాదేవియే సమాధానము చెప్పవలయును. చెప్పినను గజడదబాదేశకార్య విషయముననే చెప్పును, గాని సంజ్ఞావిషయమునఁ జెప్పదు

ఆంధ్ర వాఙ్మయము — ప్రయోగము

నన్నయభారతముఁ దొట్టి నారాయణశతకము పుట్టినంతకును నాంత పదంబు ప్రచురంబుగఁ గాననగును. లక్షణములును జెప్పుచున్నవి. హలంత పదము లాంధ్రమున లేకున్నను నీ నాంతపద మొకఁడు మాత్రము గలదు. వచ్చెన్=వచ్చెను, అని యైనట్లు 'ఫలముల్=ఫలములు, చూతుర్=చూతురు అను నవియును నొకప్పుడు హలంతము లగుచున్నవి. నాంతపదములన్నట్లు పై వానిని లాంత పదంబు లనియు రాంత పదంబు లనియు వాడరు. కావునఁ గడ పటనున్న యీ నకారము కేవలవ్యంజనముగనే వ్రాయునాచారము గలదా యనియందమున్న వ్రాఁతలలో నట్టి స్థిరసాంప్రదాయమును గానము.

క. సుతుఁ నడిగె సుతుని నడిగెను, సుతునని చెప్పెతునినని చె సుతునింగెలిచెఁ
సుతు గెలిచెఁ బోరిలోను, ధ్రుతుఁడొకఁడన వరుసతో నుదాహరణంబుల్.

ఆం. భాషాభూ॥

సుతుఁ=అడిగె, సుతునిఁ=అడిగెను, అనిచెఁ=అనిచె, సుతు, ఈ యుదాహరణములలో నకారము వ్యంజనమాత్రముగను, లుప్తముగను, ను, అని యుత్వవిశిష్టముగను, సుతు-నిఁ అను తావున "నిఁ"అనునది ద్రుత ముపైవచ్చిన ద్రుతముగను నున్నది. ను, ని, వర్ణములు ద్వితీయ కగుచని చెప్పి నను "సుతుని" రూపాంతరము "సుతుఁ" గావలయుట బట్టి "ని" వర్ణము యొక్కవికారమే, న్, ని, నిన్, అనునవి యని తెలియుదుము. కావున వ్యంజన మాత్రము నకారము (ద్రుతము)గాఁ జెప్పరాదు. 'సుతున్' అనునది నాంత పదవాచ్యమెట్లగునో "సుతు" సుతుని, అనునవియు నాంతపదవాచ్యములగు చున్నవి. ఈమర్యాద యన్నివ్యాకరణములకును సమ్మతమే. నన్నయప్రయోగ ములు చూడుఁడు.

ఉన్నతిఁ, కాంతిఁ, సంపదఁ, కరుణతోడ, భక్తితోన్,
ఎంత, యున్, తలంచుమన్, భూరియశోవిరాజితున్,

నిర్వహింపఁగన్, విశేషవిధుల, మాకున్, చేయుచుండు, వెలయున్, పెరుఁగు=వృద్ధియగు, భూవివరమునఁ, కరుణాపరత్వమున్, (పద్యాంత

మునుఁగల ప్రయోగములు - భార - ఆది - ఆశ్వా)

క॥ పర్వయుగం, బుధమైత్రై ... భార- ఆ ౧ ఆ 59
మ॥ ...పాండవాడంబరం। బుగు భీష్మాదికుగు ... ,, ,, ,, 74
తరలము॥ ...వారికం। లెను బలాధికులైన వారి ... ,, ,, ౨ ఆ 3
క॥ ...రిం। టను బ్రియనందనులు ... ,, ,, ,, 5
చ॥ తన విమవహ్ని కుజ్జనకుఁ దక్షకుఁడెల్లు దహించె
  నట్లయే। నును సహామిత్ర బాంధవజనుండగు ... ,, ,, ,, 202
మ॥ ...కాకుండఁగాఁ గాచెనం। చును నస్తిక ... ,, ,, ,, 232
క॥ తనువును జీవనుసత్వ్రా। బుగు బడసితి ... ,, ,, 3 అ 122
క॥ అంబుజలోచన గని విన
  యంబున నమ్మునికిఁ బ్రొమ్కి యనురాగముతో
  డంబుష్పాపచయవ్యా
  జంబున విహరించుచుండె సఖులుం దానున్. ... ,, ౪ఆ 41
మధురాక్కర॥ తనరజనకుండు నన్నుఁ బ్రవాతమును
  భయత్రాత। యునునసఁగ ... ,, ,, 47
క॥ ...ఇరువురి। కును వంశకరుండు ... ,, ,, 111
క॥ నాకభినుతంబునిట్టిద ... ,, ,, 127
మ॥ ...సమస్త క్షత్రవంశేసు లె
  ల్లను భక్తింబనిసేయు చుండఁగ ... ,, ,, 161
క॥ ...ప్రథవిం। చెంబాంను రాజు ... ,, ,, 254

ఈ భారత ప్రయోగములం బోలిన ప్రయోగము లెల్లపో త్తములఁగాన నగును. కావున వ్రాయ విడిచితిని. ఇఁక నంతన కార ప్రకారమును గొంత పరిశీలింతము. "న్" వ్యంజనమాత్ర ప్రయుక్తమగు నకారము స్వచ్ఛముగను, నిరచ్కముగను లుప్తముగను, బిందురూపముగను మాఱుచున్న ట్లెఱుంగుదుము. ఈ నకారమునకు ననేకరూపములున్నవి. న్, ను, ని, నున్, నిన్, ం, లోపమును, మకారమును, గూడనగును. ఇట్లు నానారూపములఁ బొందు నకార మాత్రుకమూలలోఁ బ్రత్యేకముగ నొకఁడుండెనా? కాక మొందలి నకారముయిన నీరూపవైవిధ్యమునుబొందునా? అని శంకింతము. వర్ణసమామ్నాయమునఁ బ్రత్యేకముగ నీనకారము లేదు. ఉన్నట్లు ప్రమాణమును లేదు. చింతామణియు నేమైనఁజెప్ప

దు. మఱియు ద్రుతసంజ్ఞక నకారము తవర్గీయ నకార మనియే చెప్పుచు ఒక వేళ "జ్ఞ" కారమునకు "న" కార మాంధ్రములోఁ బూర్వ ముండెనేమో యని యన్నఁ జెల్లును. కాని యరవములోనంత నిందునుండె ననియనరాదు వేఱొ కనకారముండుట యే యరవముతోడి సాజాత్య మగుట తగదు. అట్లయినచో నాంగ్లములోఁ గొన్ని పదముల యంతనకారము శ్రుతము గాకుండుటచే (Autumn, Column, etc) మన ద్రుతమ్మట్టిదందుమా? ఈ సాజాత్యము బద రీబాదరాయణమే. ఎందున్న నకారమును రూపవైవిధ్యము నొందదు కాని పరుష సరళ పరకమును ద్విత్వవిశిష్టమును నగు నకార మది మొదలిది (అచ్ఛమున) నైనను వ్యంజనమాత్రముగ నిల్చునదియై సాధారణముగనున్నది ను, లు, డు,రు, ల యుత్వలోపము పై కారణముననే శాసింపఁబడెను. అది యాం ధ్రసాంప్రదాయము.

గీర్వాణభాషయందును బదాంతనకారమునకు వేదములోఁ గ్వచిత్కముగ లోపమును (విశ్వా (ని) రూపాణి అథర్వ) లౌకికములో బిందువును (తాన్ + తాన్=తాంస్తాన్) నగుట కలదు. అట్లే యాంధ్రమునను నగుచున్నది

ఇఁక ద్రుత మని చింతామణిచే నిర్దిష్టమయిన నకారము పై భారతాది ప్రయుక్తనకారమే యగుటను దెలిసితిమి. ద్రుతమననేమి యనువచ్చో పూర్వో క్తరీతిరూపవైవిధ్యముగలదని చెప్పవచ్చును కాని యన్నిరూపములనొందునదే యననక్కఱలేదు. ఆవిధరూపములలోఁ బ్రధానలక్షణము లున్నవి. ఏనకార ములోపించునో యది ద్రుతము. *లోపియగుట ద్రుతప్రధానలక్షణము ద్రుతం బు నకారంబనియన్నంత స్పష్టముగాదనియెంచి "నకారంబసాధారణంబు ద్రుతం బు" ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసం జ్ఞకంబని యర్థము ద్రుతమనఁగా నొల్లనియెడమఱఁగిపోవునది యనుట... ద్రు తాఖ్యోనః, అని కేవలనకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును." అని ప్రౌఢవ్యాకరణమున వ్రాయఁబడెను. ఈనిర్వ చనమునను దోషము గల దని బ్ర॥ శ్రీ వఝల చిన్నసీతారామస్వామిశాస్త్రి గారు పరిషత్పత్రిక, "4 వ సంపు—7 వ సంచిక" లో వ్రాసిరి దానినరయుఁడు. ద్రుతమీమాంసయందు "ద్రుతము కేవలహల్లు, ఇ, ఈ, ఐభ్యః పరం స్వాశ్వాం నిస్యాదన్యత్రవుర్భవేత్" అనికలదు. ద్రుత ముత్వవిశిష్టమే కాక యిత్వవిశిష్టము నగుచున్నది.

---

* ఈన్నాను, ద్రుతప్రకృతికమా ? ప్రమాణమేమి ?

చ. ద్రుతము నకారమంచనిరి తొల్లిబుధప్రవరుల్ నిజంబుగా
ద్రుతమున నేనకారమొగిఁ దోఁచియుఁ దోఁకకయుండ నేర్చియు
చ్చ్యుతికినఁ బాపినన్నిలుచునట్టి నకారమె శాస్త్రపద్ధతిన్
ద్రుతమని చెప్పఁగాఁ దగును యాథిగనమ్ముఁడు దీనిఁ బండితుల్.

సూ॥ నకారము ద్రుతము,

సూ॥ ఇద్గమకము ద్రుతస్వత్వము (ఇత్ = ఇ—ఉ)

సూ॥ విధ్యర్థకమునందు ప్రత్యయానుగతమునౌనంత్యమును ద్రుతంబ.

వ్యా॥ ద్రుతంబెల్ల నంతనకారంబ ఎల్లయంతనకారంబు ద్రుతంబుగాదు.

సూ॥ లుక్కగుగుణవర్ణము ద్రుతకమునాఁ బడును.

సూ॥ ద్రుతము సామ్రేడితమును

సూ॥ ఆమ్రేడితపూర్వద్రుతం బిద్గమకము నిత్యముగానగు.

—। ఆంధ్ర వ్యాకరణ పారస్పర్యము ।—

సమాసాసమాసక భేదముల కల్పనఁబోలె బిందుబిందుక ద్రుతద్రుతక భేద కల్పన ముచితమని నామతము. వదియె ట్లున్నను నాంధ్రమున నొకనకారముగలదనియు నయ్యదిరూపవైవిధ్యమును బొందు ననియు నదియే ద్రుత మని చింతామణి గ్రహించెననియుఁ జెప్పఁజెల్లునుగదా; ఇఁకఁ జింతామణ్యభిప్రాయమును మనకనుకూలించునో చూతము.

ద్రుతము నకారమనియుఁ గచటతపగజడదబలు క్రమముగఁ బరుషసరళములనియుఁ బేర్కొని యితరహల్సామాన్యమునకు స్థిరసంజ్ఞ నిడెను. ద్రుతమునకు స్థిరసంజ్ఞ లేదు. తవర్గీయనకారము ద్రుతమని చెప్పినను ద్రుతధర్మముగలనకారమే ద్రుతమని చింతామణ్యాశయము. కావుననే ద్రుతాఖ్యము నకారమని విధించెను. ద్రుతము నకారమనక యాఖ్యాశబ్దము చేర్చుటచే ద్రుతధర్మఖ్యాదిగలనకారమే ద్రుతమని యభిప్రేతము. అగుచో "లుగ్వాద్రుతప్రకృతికాత్పరతస్సరశేష్వి రేచ నస్యస్యాత్" అనుసూత్రము "చూచెన్ + నందుని" అనునప్పుడు ద్విత్వరూపమే యుండవలసివచ్చునని (చూచెన్నందుని) యులోపరూపము (చూచెనందుని) రాదనియు నందు లేని వినుఁడు-పరమగునకారము ద్రుతసంజ్ఞకముగాక స్థిరమే యగుచున్నది. ఎన్నఁడును ద్రుతము పదాదినుండదు. పదాదినిగూడ ద్రుతమున్నచో నప్పుడు ద్రుతమునకు స్థిరసంజ్ఞ చెప్పవలసివచ్చును. అట్లెందును లేదు. ఈయుద్దేశమువలననే,

"తి జ్మధ్య శేషషష్ఠీసుప్సర్మప్రవచనీయజభిభక్తీః,
కించిత్ప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాంశ్చ,
క్త్వాకిలతూష్ణీమాద్యానభిదధతికలా ద్రుతో న యేషాం స్యాత్,
అన్యే ద్రుతప్రకృతయో యేస్యుర్హ్యనుజీవితద్రుతానిత్యం."

అని సూత్రించెను. ద్రుతము వీనికి లేదో యని కళలనెను. ఎక్కడద్రుతము లేకుండుటయో తెలుపఁడు. ద్రుతమంత్య మనియే యర్థము కాకున్న "నాటి, నడిచి" మున్నగు క్త్వార్థకములయందు నకారముంట ద్రుతమున్నదని చెప్ప ద్రుత ప్రకృతికముగా వలసివచ్చును. మఱియుఁ గేవలద్రుతిధర్మవంతమగు నకారమే ద్రుత మగునుగాని యంతనకారము ద్రుతముగాదు. చేసు, వేసు, బోసు,(సుస్) అని, మాని, పూని, (క్త్వా) మున్నగు శబ్దములయంతిమున నకారమున్నది కాని ద్రుత ము లేదు ఇక్కే చింతామణియభిప్రాయము అనుజీవితద్రుతాః, అను తావున స్పష్ట ముగ నంతనకారమును చెప్పెను. ద్రుతమును పేరిలోనే లోపించి తెలిపియున్నాఁ డు. తద్రుతంచ బిందుస్స్యాత్, అను దానివలననే పదాదినకారమునకు ద్రుతసం జ్ఞ లేదని నిర్ణయింపఁగలము. 'అదియునుంగాక, యనుదానిపవిభాగించునప్పుడు' అది, యును, న్, కాక, అని యగును. "లుగ్వా ద్రుతప్రకృతికా" దిత్యాది సూత్రమునఁ గలుగులుకృక్షమున "అదియునుగాక" అనురూప మేర్పడునుగాని శబ్దలక్షణము సందిగ్ధమగును ఇఁకలోపస్వత్వాదిపక్షములరూపములు నిష్పన్న ములుగావు. అదియున్నుంగాక, అదియునునుగాక, ఇత్యాద్యపరూపములు సంభవము లగును. ద్రుతముపై ద్రుతం బగునను సంప్రదాయమెఱుఁగక యు స్థిరసంజ్ఞావ్యాప్తిఁదెలియక కొందఱు పండితు లనిష్టరూపముల కుపస్కారకము చే యుచున్నారు. ద్రుతముపై ద్రుతమగు ననఁగా స్వత్వాశిష్టద్రుతముపై వ్యంజన మాత్రద్రుతమగుననియర్థము. ఈయర్థమునకు విరుద్ధమగు ప్రయోగములు భాష లో లేవు. "వచ్చున్ + అతఁడు = వచ్చున్నతఁడు" అను ప్రయోగములు దుష్టము లా? శిష్టము లనుటకు ద్రుతస్థైర్యము చాలునందురా? అది సూత్రకృదాశయ ముగాదు. వ్యాఖ్యాతలును నీవిషయమున నేమియు వ్రాయరు. అథర్వణకారికా వళి "నోవాద్విత్వ" మిత్యాదికారికచే ద్విత్వమును ద్రుతమునకు స్థిరసంజ్ఞయు న్నచో విధింపదు. ఈద్విత్వరూపము కొందఱు సమ్మతించిరి. కొందఱు సమ్మతింపరు. భారతాదిప్రయోగములే లభ్యములగునప్పుడును సమ్మతింపకుండుట తగునా? కావ్యములను (ప్రామాణికములు) వ్యవహారమునఁగానవచ్చినను గాదను టెట్లు?

# గ్రంథస్వీకారము.

---

• (1) భారవి. గ్రంథకర్త: బ్ర॥ భువనగిరి విజయరామయ్యగారు, బి. ఎ.

కథ. కాళిదాసునుగూర్చి యున్నట్లే లోకములో భారవింగూర్చియుఁ గొన్ని తాలుదంతకథలు గలవు. వానిని గవిగారు చమత్కరించి పద్యకావ్యముగా రచించిరి. వాడుకలో నున్నకథలను బోకుండ నిల్పుట మంచిదియే కాని, తల, తోఁక లేకుండ నున్నవిషయము లన్నియు నాతనివే యని వ్రాయుచుండిన లోకము భ్రమించునేమో యని భీతిల్లవలసి యున్నది. కాళిదా సెప్పటివాఁడో యేదేశమువాఁడో యిప్పటికి నిశ్చయము కాలేదు ఉత్తరదేశమువాఁ డని మేఘసందేశాదులం బట్టి ప్రతీతి. అట్టివానికి బోగముదిగల దని, "చల్లయోః వెల్లకుక్కయోః" అన్నాఁడని-"అస్తి లేదు గిస్తి లేదు చచ్చినట్టు తొంగో" అన్నాఁడని వ్రాయుట, దానినే నమ్మి యితరులు చెప్పుకొనుట చరిత్రకు భంగముగదా! ఏవో కొన్ని చాటుశ్లోకముల నాధారము చేసికొని వంగదేశీయులు "యథా కిల వినైవ నవద్వీపయాత్రాయాసమ్, అన్తరేణ చ కష్టకల్పనామ్బుధౌ నిమజ్జనమ్ లీలయైవ శక్యతే సాధయితుం కాళిదాసస్య వంగీయత్వం...చ శూద్రత్వంచ" అని లిఖించి వంగశూద్రునిం గావించినారు అట్టే భారవిస్థితియునున్నది. బ్ర॥ వడ్డాది సుబ్బారాయుఁడుగారు మున్నగుపెద్దలు "జనశ్రుతులలో నిది యొక విప్రకుమారునకుఁ జెందినట్లు వినికి" యనిన "నాయెఱుక భారవికిఁ జెందినట్లే" యనియు "నీజనశ్రుతి భారవికిఁ జెందినదియే యని యూహింప ననువుపడుచున్నదని నాతలంపు." ఇత్యాదిగాఁ గవిగారు దోఁచినట్లుగా నెవ్వరినైనను దమతలంపులోనివానింగాఁ జేసికొనఁజూచుట—లోకమున కెల్లు తోఁచునో యను వెఱపు గలుగుచున్నది. భారవికాలముంగూర్చికాని యేయితరవిషయములంగూర్చికాని చారిత్రికులమూలమున నిక్కము దొరకలేదని కవిగారెఱుఁగుదురు. జనశ్రుతులను విశ్రుతములు చేయ నెంచి బుద్ధిమంతులు గావునఁ గథలో నవధానములు మున్నగునవి చేర్చి, కవులు గావున వర్ణించి రంజకముగా గ్రంథమును రచించిరి. ఇది ప్రథమభాగముమాత్రమే-517 పద్యములు, 60 పుటలు ముందు "భారవిప్రవాసము" అను రెండవసంపుటము వెలువడఁగలదఁట. అపుడైనను బండితులచే నఁదందుగాక పూర్ణముగానే సంస్కరింపించి నిర్దుష్టముగాఁ బ్రకటింపఁగోరుచున్నారము. నకారప్రాసమున చంపకమాలికలు

డకారప్రాసముతోడి యుత్పలమాలికయును రచించి శ్రమపడిరి. ఈపుస్తక ముపైఁ బలువురు పండితులు సదభిప్రాయముల నిచ్చిరి.

(2) విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము.

ప్రథమభాగము (క్రీ. శ. 1330-1500):—గ్రంథకర్త బ్రహ్మశ్రీ చిలుకమర్రి అచ్యుతరావుగారు, ఎం.ఏ , ఎల్.టి. క్రీ. 1330 మొదలు 1500 వఱకుఁ గల విజయనగరసామ్రాజ్యమందలి యాంధ్రవాఙ్మయచరిత్రముంగూర్చి వ్రాయుచు గ్రంథకర్తగారు తత్కాలమునఁ గల, నాచన సోమనాథుఁడు, జక్కనకవి, వల్లభరాయఁడు, దూబగుంట నారాయణకవి, దగ్గుబల్లి దుగ్గనకవి, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, నంది మల్లయ్య, ఘంట సింగయ్య, మనుమంచి భట్టు ననుకవులను వారి గ్రంథములను గూర్చి విపులచర్చ గావించిరి. విజయనగరరాజ్యోత్పత్తి, తద్రాజ్యోత్పత్తికిఁ బూర్వపు తెనుఁగువాఙ్మయస్థితి, ఆసామ్రాజ్యమునందలి సంస్కృతాది వాఙ్మయముల చరిత్రమును రచించిరి. పదునాలు గధ్యాయములును నాలు గనుబంధములును టీకాదులుం గలవు. ఆవిజయనగరసామ్రాజ్యకవులను సమకాలికు లగు నితరకవులతోఁ బోల్చి చూపిరి. అందు వారివారి గ్రంథనిర్మాణసాదృశ్య సాధర్మ్యముల తారతమ్యము నిరూపించిరి. ఇందలి వ్యాసములు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక భారతి మున్నగుపత్త్రికలలోఁ దొలుతఁ బ్రకటింపఁబడి పిదపఁ బుస్తకరూపమున ముద్రింపఁబడినవి. ఈగ్రంథవిషయమై గ్రంథకర్తగారి సదభిప్రాయములఁ గొన్నిటిని జూపెదము.

"ఈగ్రంథమందు నే వాక్రుచ్చిన యభిప్రాయములు సరియైన వని గాని సమగ్రమైన వనిగాని నే నెంతమాత్రము నపోహమును బొందుట లేదు. ఈ యభిప్రాయములు కాలక్రమమున మారిపోవచ్చును. భావిపరిశోధనలవలన నూతనవిషయములు చేకూరినయెడల వెనుకటి యభిప్రాయములు మారుదు నే యుండును.... ఈనాగ్రంథము సక్రమమైన వాఙ్మయ చరిత్ర మని చెప్పుటకు వీలు లేదని నాకే తెలియును. ఇయ్యది ముఖ్యముగా నాకాలమందలి మహాకవుల కవిజీవితములను వారి కావ్యవిమర్శనములను యితర్వాదులను చూపించుచున్నది. ఇట్టిగ్రంథములు మన యాంధ్రదేశమందలి యితరకాలములకును యితరరాజ్యములకును సంబంధించినంతవఱకు సంపూర్ణముగా రచించినఁ గాని సరియైన ఆంధ్రవాఙ్మయచరిత్రము క్రోడీకరించి వ్రాయుట కవకాశ ముండదు. కావున నాయీగ్రంథము భావికాలమున వ్రాయువలసి వచ్చెడు ఆంధ్ర

వాఙ్మయచరిత్రమునకు నొకమూలగ్రంథము (Source Book) అనియే యాలోచింపఁదగినది."

చారిత్రకులు వీరిం బ్రోత్సహించి ద్వితీయభాగమునుగూడఁ బ్రకటింపించి లోకోపకారము భాషోపకారముం గావింపఁ గోరెదము.

308 పుటల పెద్దగ్రంథము వెల రు ౨. విద్యార్థులకు రు 1-8-0.

రాజమహేంద్రవరములో గ్రంథకర్తగారియొద్ద దొరకును.

(3) అహోబలపండితీయమ్ — నన్నయభట్టారకుని యాంధ్రశబ్దచింతామణికి, అహోబలపండితులు వ్రాసినవ్యాఖ్యానము. దీనికిఁ గవిశిరోభూషణమని పేరు. ఇది మూఁడవకూర్పు గ్రంథము ద్వితీయముద్రణగ్రంథమునకంటె నిందు, అహోబలపండితుని వంశాదికము దెల్పు పెక్కుశ్లోకములు (తెనుఁగు తాత్పర్యముతో)ను, బ్రతిసూత్రమునకును బ్రతిపదాంధ్రటీకయును నెక్కుడుగాఁ జేర్పఁబడినవి. ఇట్టి యుద్గ్రంథమును, ఆంధ్రసాహిత్యదర్పణకర్తలును, మంజువాణీముద్రాక్షరశాలాధికారులు నగు బ్ర॥ నందిరాజు చలపతిరావుగారు శ్రమకోర్చి లోకోపకృతికై మూఁడుసారులు ప్రకటించి రనుట స్తోత్రపాత్రమైనవిషయము. ఇక్కాలమున నట్టి గ్రంథము మూఁడుసారు లచ్చుపడిన దనినఁ దద్గ్రంథమునకు దాని వ్యాఖ్యానమునకును గలగౌరవ మెట్టిదో యోజింపఁదగినవిషయము. ముం దచ్చువేయింపఁ బోవు నాల్గవకూర్పులోనైన నాంధ్రతాత్పర్యములో నందందుల గల యసంపూర్ణతను దొలఁగింతు రని చలపతిరావుగారిని వేఁడుచున్నారము. సంస్కృతవ్యాఖ్యాన మర్థమగువారికిఁ దెనుఁగుతాత్పర్య మవసరము లేదు. సంస్కృతమునందుఁ బరిశ్రమ లేనివారి కాంధ్రతాత్పర్యము పూర్ణమగు సాయము చేయఁజాలకున్నదని తలంతుము. ముద్రణస్ఖాలిత్యములు కొన్ని చాలతావులఁ గలవు.

వెల రు 3-8-0 క్యాలికో చక్కని బైండుతో — ఏలూరులోఁ బ్రకాశకులకడఁ దొరకును.

(4) ఆంధ్రవాల్మీకిరామాయణమునకు మందర మను కవికృతవ్యాఖ్యానము.

ఆంధ్రవాల్మీకి బ్ర॥ వావిలికొలను సుబ్బారావుపంతులుగారు తమ రామాయణమునందలి ప్రతిపద్యమునకు, టీకాతాత్పర్యములు నందందు విశే

షములనుగూర్చి రచియించినది. బాలకాండము-పూర్తిగను, అయోధ్యాకాండములోఁ గొంతయును ముద్రితమైనది. ఇప్పటి కాఱుభాగములు వెలువడినవి.

ప్రథమభాగము (పెద్దది) రు 3-8-0. తక్కినవైదును 1 కి రు 1-0-0.

అయోధ్యాకాండములో 1759 వ పద్యమువఱకు నచ్చుపడినది. తక్కిన భాగములను వెలువఱుచుపని పాఠకులలో నున్నది. సిద్ధమైనభాగములను గొందురేని తక్కినభాగములు ప్రకటించుటకుఁ గారకు లగుదురు. ఇదియే పాఠకులు చేయవలసినపని. ఆంధ్ర వాల్మీకిరామాయణమువంటి పెద్ద తెనుఁగు గ్రంథము లేవియైనఁ గవిగారు జీవించియుండఁగా నైదాఱుసారులు ప్రకటింపఁబడిన ట్లెవ్వరైనను విని కని యున్నారా! భాషాదేవతకుఁ దుఃస్థితి పట్టి యున్న యిక్కాలములోఁ గవిగారియొక్క చేతిమీఁదనే పెక్కుసారు లంతపెద్ద గ్రంథము ముద్రింపఁబడుటయు దానికే మందరమను పెద్దవ్యాఖ్యానము కవిగారే రచియించి ప్రకటించుచుండుటయు భాషాభాగ్యముగదా!

(5) రామాయణసంగ్రహము. గ్రంథకర్త: బ్ర॥ పత్రి విశ్వేశ్వరశాస్త్రి గారు. వీరు కొల్లాపురము శ్రీ లక్ష్మారాయ మిడిల్‌స్కూలులోఁ దెనుఁగు పండితులు.

సంస్కృతశబ్దమంజరిలోఁ జివరఁ జేర్పఁబడిన శ్రీరామాయణసంగ్రహమున కిది యనువాదమఁట. 116 పద్యములు. రామకథ. ఉభయతారకమైనది. పద్యముల శైలిం దిలకింపుఁడు.

చ. పవనసుతుండు రావణుని బంగరుగద్దెను మించియున్న నై
జవిజయవాలపీఠమున జంకక 'కూర్చుని' యుండఁజూచి నీ
వెవఁడవు నిన్నెవం డనిపె నెచ్చట నుండి యేల వచ్చి యుం
టి వనుచు రావణుం డడుగ నిక్కము దెల్పె నతండు వానికిన్.

ఉ. రావణు పంపునం గపటరాముశిరంబు శరాసనంబు మా
యావి యొసంగఁ జూచి జనకాత్మజ మూర్ఛను జెంద నంతలోఁ
బావనియౌ విభీషణుని భార్య యెఱింగి వచించె నిక్కముల్
గావని యాప్తభాషణములన్ క్షితినందన నూఱడించుచున్.

కొల్లాపురము, స్నేహలతాకవితాసంఘములో దొరకును.

దీని వెల రు 0-4-0.

---

శ్రీరామ.

# ఆంధ్రకౌముది.

---

క. శ్రీభామానస్తోక్తిక, భాభవనిజమందహాసధాగధగ శ్రీ
శోభితశుభతత్త్వచకుం, భాభోగకిలాస వేంకటాచలవాసా.

వ. అవధరింపుము.

## సీసమాలిక.

శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకుఁ గలలక్షణములు చెప్పి
తెనుఁగున నావిధమ్మున లక్షణము చేయ రాకున్కి యదియు నేరంబు గాదు
తొల్లిటిసుకవుల కెల్లను నను ధన్యుఁ గాఁ నెంచుతలఁపింతె కాని యనుచుఁ
గుకవిజనాజ్ఞానఘోరాంధతమసముఁ బోఁగొట్టఁగల్గు కౌముదివిధాన
నిల మున్ను దెలుఁగున నెవ్వారెఱుంగని యాంధ్రకౌముది యను నట్టికృతిని
సీసమాలిక గాఁగఁ జేసితి నిపు డున్నకవులకు రానున్నకవుల కెల్ల
నుపకారముగ నిది యెపుడు నాచంద్రతారార్కమై కౌముది యటుల వెలయుఁ
గన నిందు సంజ్ఞాప్రకరణము మొదలుగఁ దత్త్వప్రకరణముల్ దనరు వరుసఁ
దత్త్రిలింగపదంబు తద్భవం బగుటచేఁ దెలుఁగనఁ దగె నట్టి తెలుఁగు ప్రాకృ
తాభిధానముగాన నాలక్షణమ్ములు తొలుతఁ గవులకెల్లఁ దెలియవలయుఁ
దత్సమం బనఁగను దద్భవంబును నాఁగ దేశ్య మనఁగ నచ్చతెనుఁగనంగ
గ్రామ్యంబు నాఁగను గలవైదు తెఱఁగులు నానిని వివరింతు వరుసతోడ
నది యెట్టు లన వినుఁ డజ్ఞాతుఁడు గురుండు గురువు వనమ్మును దరువన నిఁకఁ
దద్భవంబులు పొల్చు ధర్మంబు దరమంబు ద్రుహిణుండు దుగిణుండు ద్రోహి దోగి
శిఖ సిక లక్ష్మి లచ్చి లఘువు లగువు సముద్రము సంద్రము ముగ్ధ ముగుద
ముఖము మొకము ధనము దనము ఖని గని గర్వమ్ము గరువముఘనముగనము
రోషము రోసము రుద్రాక్షమగు రుదురాక దాక్షిణ్యము దాకిరమ్ము
మర్యాద మరియాద కార్యంబు కర్జంబు స్మరుఁడు మరుఁడు నృకేసరి నెఱసరి
కావ్యంబు కబ్బము గంధంబు గందము యక్షులు జక్కులు యశ మసంబు
దీర్ఘిక డిగ్గియ యర్ఘ మగ్గువ శుద్ధి సుద్దగు శుక్రుండు సుక్కురుండు [కౌమరుఁడు
హర్షమానరుసంబు యముఁడు జముఁడు చంద్రముఁడు చందురుఁడు కుమారుఁడు
ఛాయయు చాయయు దోషము దోసము చక్రము జక్కవ సంధ్య సంజ

స్నిగ్ధంబు నిద్దంబు శ్రీ సిరి మతి మది భగ్నంబు బన్నంబు బ్రహ్మ బొమ్మ
ఆజ్ఞప్తి యానతి యజ్ఞంబు జన్నంబు విష్ణుండు వెన్నుండు విద్య విద్దె
వైరము వేరము భారము బారము స్నానంబు తానంబు ధార దార
ద్యూతము జూదము స్థూలము తోరము స్తంభము కంబము ధాత తాత
భేదంబు బిద్దంబు భిక్షము బికిరము కుబ్జుండు గుజ్జగుఁ గులము కొలము
ఆత్మ యాతుమగుఁ బుణ్యంబు పున్నెంబు యత్నము జతనమ్ము రత్నము రతనము
దుర్గ దుగ్గి ద్వయము దోయి దిశ దెసయగు వీర్యంబు బీరంబు పృథివి పుడమి
శయ్య సెజ్జగు బ్రహ్మచారి బొమ్మచారి రాశి రాసి యగుఁ జంద్రుఁడు చందు
ఢాలు డాల్ వాలము వాలు ఫలము పొల శల్యుఁడు సెల్లుండు సంఖ్య సంక
గుణము గొనమ్ము దక్షిణము దక్కినము కంఠమ్ము కంటము ఢక్క డక్క విధము
వితము వేశంతము వెంచ ఋక్షము రిక్క వీథి విది వీథులు వీదు లనఁగ
దేశ్యము లగు నింక తెంపరి పొత్తిక కఱద లదరులు చక్కటి రపాలు
మక్కువ మెరకువ పొక్కుడు రకాలు కడిఁది యేడ్తెఱ గొంగ్లి కడఁక క్రేవ
కడవన మిక్కిలి వెడ మొగి మొనకంబు పొలపంబు మఱకువ పొరి బిడారు
తివురుట వెనక్రేణి తెంకువ పూఁ పొగి వీచోపు నవి లలి విన్నఁదనము
పుచ్చడీక నిలాతి రొచ్చుల పుయిఁగోట వదరులు మలఁత మెల్లిదము తెన్ను
క్రచ్చుఱ మర ప్రబ్బ యక్కిళ యసలారు సూడిద కడిపాయ బోషు లులివు
వేనవేలాకె నెవ్వ గొచ్చె మెదరేసు గొల్లెన యుంగద మొల్లి విసివి
రొమారిసామారి యుప్పనఁబట్టియ యుఱిముఱి క్రన్నన యాల మలఁతి
యాబిడ నిరుడు నయ్యాటంబు నెమ్మోము బక్కెర కైలాటకమ్ము కనువు
క్రొన్నెలఁ నెత్తమ్ము క్రొన్నన వంగుడు క్రిక్కలు వాలాయ మక్కు వాఁక
తక్కటి యేఁకట మొక్కటి బ్రుంగుడు వఱువాత వండలి వంత వఱపు
లగ్గు పల్లియ వెండి యగ్గంబరిది జన్నపలుకులు చెచ్చెరఁ బాఱుఁడు కరి
సోబె రోడలదొంతి శేబర డెంకణా లుప్పవడం బర రోల మనలు
కరకరి సివిరి కలువడం బన్నువ తెమ్మెర రజ్జులు దిమ్మనంగ
తత్సమదేశ్యతద్భవములఁ గలయని తేటనుడుగు లచ్చతెనుఁ గనఁ దగు
నది యెట్లనఁ:—ఎంక నలరు పేరు కొలంకు నూనెనా నాముదం బానవాలు
బండి పసర మొద్దు వండు పప్పు ప్పుప్పు రూక లాకులు సాకు బాఁకు మేకు
గుజ్జు మేనిక మొండ కోట వెన్నెల కొల్ల గడి పులి నెల వలి మడుఁగన నిఁక

గ్రామాలజాలు పురాణాలు దోషాలు శాస్త్రాలు వేదాలు నంబరాలు
గంతులు పొక్కులు గ్రద్దలు బొందలు గానాలు మొదలుగాఁ గల పదములు
వాపేవు పైర్లు రాగేసేవు నీవూను కూచుకుంటా గొంతి గుద్దరాకు
పాడేవు కాలెత్తి యాడేవు వస్తానె సూసేవు దాని కంతానమీరె
ననుక్రియ ల్లోదలైన యీ గ్రామ్యములగు నిట్టివి తెగడునెప నగవుతజేఁ దగు
సరవిగ దీనను సంజ్ఞాప్రకరణంబు వివరింతుఁ గలదంత కవులు వినుఁడి
ఆదులు స్వగములు నచ్చు లనఁగ నొప్పుఁ గాములు హల్వ్య జనాఖ్యలఁ దగుఁ
రహి, అకారము కవర్గము హకారము విసర్గలు కంఠభవములై నలువుగాఁ జుమఁ
గన, ఇకారము చవర్గము యకారశకారములు తాలుభవములై యలరుమిగుల
నిఁక, ఉత్వము పవర్గ మిఁకపలు నోష్ఠభవములు దంతోష్ఠభవము వకార
మొగి ఋటురషము లతగుమూర్ధభవములై యగు ౡతులసలు దంత్యములనంగఁ
గన నేత్వ మైత్వంబుఁ గంఠతాలవ్యంబు లోత్వ మౌత్వంబు కంఠోష్ఠ్యము లగు
నరయంగ యరలవ లంతస్థ లనఁ బొల్చు శషసహ లూష్మాఖ్యఁ జనును మఱి జ
ఞమణన లనునాసికములునొ నిఁకలిఁప లిఁజిహ్వామూలభవమనంగఁ
నలయుపధ్మానీయ మనఁ దగు నీరెండు తెలుఁగు పదములలో వలఁగలవిఁక
నవల నజంతహలంతసంధులన సంధులు ద్వివిధంబులై వెలయు నందు
ల నజంతసంధి యెట్లన వినుం డాది శబ్దాంతవర్ణంబు తదగ్రశబ్ద
(పూర్వ)వర్ణంబుతోఁ బొందునందిన సంధి యగు దీని కింక లక్ష్యము లొనర్తు
నచ్చుపై నచ్చున్న నది యకారం బగు నెంతయమ్మా యింతి యివియన మఱి
యాదంత మీదంత మూదంతముల మీఁద నచ్చున్ననుయకార మగునదివినుఁ
డానవాలాయిల్లు మానిసీయొక్కరుం డిందూ యనుచు వేఁడె నిందన నిఁక
నవలనిదంతము (లయి)నట్రిక్రియలకుఁ దగు కిషష్టికి నుదంతంబులకును
బైనచ్చు గల్గినఁ బవరూప మంతట నిత్యంబుగా వచ్చి నెగడుఁ గృతులఁ
గంటి కివెల్లను ఘనున కిచ్చి రనంగ శి (ఖరిణి) కెంతహర్షించి రనఁగఁ
దగిన తనకుదారధర్మపాలనలీల యనఁగఁ ద్రేతాగ్ను లేమయ్యె నాఁగ
నలయదంతములకే యచ్చు పైనుండినఁ బరరూప మొక్కచోఁ బరఁగునంద్రు
ము ని కిను కుడిగె గంగిను కాసె చష్టాప్పె మహిమెట్టె దెంతొరు లహాయనమఱి
యాపరరూపంబె యగు నిదంతముఁ కొక్కెడలఁ జేతిది చేతియిది యనంగ
నఖిలప్రబంధంబులందలిలక్ష్యము ల్వేర్వేఱ యొకకొన్ని విస్తరింతు

నెమ్మెచ్చె నాఁగను దమ్మంట్లు నాఁగను దివ్వెంత యనఁగ మదించె ననఁగ
వానిదవంధ్యజీవన మనంగ ననలజ్యోతుండ నన నిచ్చుచుండు ననఁగ
నంతం తనఁగఁబరమాత్ముండు రనఁ దామరసనేత్రలిండ్లన బ్రహ్మతఁడన
శౌరిచ్చు భక్తి వేసారక యెంతధికంబైన గురువాజ్ఞ గనుఁగొన నన
మీ రిప్పుడ ద యొమ్మికను బొత్తిది యన నేయు మేయు మన నేయేయనంగ
వెలయుచునుండు నిర్వ్యధముగ నిఁక హలంతసంధులు కొన్ని యమర వినుఁడి
అఖిలశబ్దాంతక్రియాంతనకారము ల్నిలుచును బై నచ్చు గలుగు నెడలఁ
గలుగని యెడలఁ బై కచటతపలు గల్గ నవి గజడదబలై యానకార
ములు సున్నలగుచుఁ బొల్పుగఁ దగు నీయైదు వర్ణము ల్గాకను బైని వేఱె
హల్లున్నఁ జరు వచ్చు నల్లనకారము వరుస దీనికి నుదాహరణ లెన్న
రిపు నోర్చె బహుమతి నృపుచేతఁగంటివి నీకంటెఁ జతురుండు నీకుఁ దరము
నీకెన్నఁ బ్రతియు భూలోకాన లేఁడౌర కవుల రమ్మని వేడుకన్వచింతు
వర్థులవీక్షింతు వవని నీవనముల నింతువనఁగ నిట్లు నెగడు నింక
రహిం కైక్ర లుప్తవర్ణపదసంధులు గల తెలుఁగులు కొన్నింటిఁ దేటపఱుతు
నచ్చ తెన్గునుడుల నంత్యము లగు డురునులులు నడుమను గడలఁ దగిలెడి
తఱిని వానఁగల యుత్వము నిల్చుఁ బోవును వల్లులపై నున్న నది యెటులన
నీడు రాజులనంగ నీడ్రాజు లనఁ దోడు గలిగె ననంగఁ దోడ్గలిగె ననఁగ
నూరుఁగాయ యనంగ నూర్గాయ యన జాఱుఁగొప్పునా నిడుద జార్గొప్పనంగఁ
గనుపండుగ యనంగఁ గన్పండుగన ఓనువాఁక యనంగ ఓన్వాక యనఁగ
వాలుమించులునాఁగ వాల్మించులన మేలుకనె నన మేల్కనె ననఁ దగు మఱి
యొక పేరఁగూర్చి పలుకుచోఁ డుపురుతులఁగల యుత్వమట్టుల నిలుచుఁ బోవు
గాడుపు గాడ్పనఁ గడుపు కడ్పన నొప్పు నప్పు డప్పన నిట్టు లమరుచుండు
నేరుపు నాఁగను నేర్పునాఁ దనరు నెత్తురనంగ నెత్రునాఁ బరఁగు మఱియు
నులులపై నుత్వ మట్టుల నడుమఁ దగుఁగడనులుల యుత్వ మట్లు తగదెందు
కానుపు కాన్పునాఁ గనుము కన్మన నొప్పుఁ గలను చదలన నీగతిఁ దగునిఁకఁ
బరికింపఁ బూర్వప్రబంధప్రయోగము ల్వివరింతు నొకకొన్ని వినుఁడు తెలియ
నఱ్ఱంతములకు షష్ఠ్యర్థమా నిఱ్ఱంతముల కట్లు కూరిచి పలుకుతఱిని
అగడి తగడ్త పొగడిత పొగడ్తనా గిలక గ్లిల్లయనంగ మొలక మొల్క

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.*

(ప్రథమభాగము)

## ప్రథమాశ్వాసము.

—॥ కృత్యాది, దేవతాస్తోత్రాదికము ॥—

శా. శ్రీమత్పర్వతనందనా[1]తనులతాశ్లిష్టాంగ మై బాహుశా
ఖామధ్యంబున నున్నపన్నగఫణౌఘం బాకు లై యొప్ప ను
ద్దామం బౌ శశికాంతి పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమం బౌ హరపారిజాతము నుతింతు[2] న్వాక్ఫలావాప్తికిన్. ౧

చ. పులుఁగులపెద్ద వారువము, పోటరి బిడ్డఁడు, ఱాఁగరాతు॥, పా
ములగమికాఁడు సెజ్జ, నలుమోములవాఁ డిలుతీర్పుపట్టి, వే
ల్పులు బలుబంటు, లాకమల[3] పొల్తుక, తెల్లనితల్లి పెద్దకో
డ లనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. ౨

ఉ. దక్షిణనేత్రకాంతి నుచితంబుగ నర్థవికాస మొంది వా
మాక్షిరుచిప్రసారమున నర్థము విప్పకయున్న పుండరీ
కాక్షుని నాభిపద్మనిలయంబునఁ దుమ్మెదభంగి లోలుఁడై
యక్షయవేదనాదమయుఁ డైన విరించిఁ దలంచి మ్రొక్కెదన్. 3

ఉ. కట్టినపుట్టముం దనువు గద్దియతమ్మియు నక్షమాలయుం
బట్టినచిల్కయు న్నగవుఁ బాపటజల్లియు నొక్కవన్నెగాఁ
బుట్టుచుఁ బుట్టువిద్యలకుఁ బుట్టినయిల్లనఁ జెల్లి బ్రహ్మవా
కట్టొనరించి తన్ముఖవికాసినియౌ సతి మమ్ముఁ గావుతన్. ౪

ఉ. నిద్దము లైన భూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులన్
దొద్దలువ్రచ్చి తల్లిచనుదోయిసరిం[4] దలకట్టు మించఁగా
ముద్దులు సూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁదనాడు నా
ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కెద నీకృతికార్యసిద్ధికిన్. ౫

క. రుణ్మదపరివృఢసురగణ, తృణ్మోచను సురశరణ్యు ధృతశక్తి ఫణి
ద్విణ్మయువాహను, [5]హరినిభు, షణ్ముఖు నభిముఖునిగాఁ[6] బ్రశంసింతు మదిన్.

---

*సింహాసనద్వాత్రింశతియనియుం గలదు 1. నందినీ. 2. భజింతుఁ. ॥రాగరౌతు, రాగకాతు.
3. లాల్యకమలపొల్తుక. 4. నడిం. 5. హరికిప్రియు, హరిప్రియు, హరిసఖుఁడు. 6. నతిసుముఖుఁగా.

క. ప్రమథులుఁ డని గ్రహరాజని, కవితాప్రియుఁ డని జగత్ప్రకాశకుఁ డనియున్
భువివిక్రమార్కనృపసం, భవ కారణుఁ డనియు[1] లోకబాంధవుఁ దలఁతున్.
క. పులుఁగునకై యెప్పనిమది, నొలికినశోకము లకారయుతమై కవితా
కలనకుఁ దెరువయ్యెఁ దలం, పుల నాతని గొల్తుఁ బుట్టుఁ బుట్టిన సుకవిన్. ౮
ఉ. శ్రీనిలయంబునాఁగ మురజిద్గుణరత్ననివాసమై యుపా
ఖ్యానతరంగిణీభరితమై కడగానఁగరాని భారతా
ఖ్యానపయోధిలోనఁ గలమై నిజయుక్తిభుజంబుఁ గ్రన్థా
రానుకృతిం గృతార్థత మహాఘనుఁడై మునిఁ బ్రస్తుతించెదన్. ౯
క. ఆభారతపర్వత్రయ, మీభారతివర్షమెల్ల నెఱుఁగఁ దెనుఁగునన్
శ్రీభారతిగతిఁ జెప్పిన, నాభావుకమును[2] దలంతు నన్నయభట్టున్. ౧౦
క. వేములవాడక సుచిరమై, [3]వేములవాడం జరించు వేములవాడం
దా మెఱసిన భీముని సుత, భీముని బలభీము విమలభీమునిఁ దలఁతున్. ౧౧
చ. అనఘు హుళక్కి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును, ఘను నాగరాజుఁ, గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, సుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజుసో
మన, సమరేశ్వరుం, దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్. ౧౨
వ. అని యిట్లు సకలవరప్రదానకారణదేవతలను జతురవాగ్విద్యానవద్యగద్య
పద్యవిద్యావిద్యోతితు లయిన కవీశ్వరులను బ్రశంసించి తత్ప్రసాదాసా
దితసమాజసాహిత్యతరంగితాంతరంగుండనై సకలజనసాధారణం బగు నట్టి
ట్లని విన్నవించెద.[4] ౧౩
ఉ. ఆదరణంబులేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పు గల దన్యులకేమని చెప్ప పిసితో
వేదియుఁ గాదు పద్మసక యిందులచంద మెఱుంగి తప్పినం
గా దని తీర్చి యొప్పుగని కైకొని మెత్తురు గాక సత్కవుల్. ౧౪
ఉ. [5]మానుగఁ దప్పులున్న నసుమానము సేయక మోదమానస
స్థానసు లైనవారు కలిమాఱు పరీక్ష [6]లొనర్చి తీర్చునన్

1. కారణమనియు. 2. నాభరతుండని, నాభావకుఁడని క. చే, తే, యని రెండుప్రతుల కెండ రీతులు (వేములవాడ, వేముల్వాడ). 4. విన్నవించెద, విన్నపించెద. 5. మానము దప్పనీక. 6. లొనర్చి రేనియున్.

హీనకవిత్వ మైన మెఱుఁగెక్కదె నేర్పరులైనవారిచే[1]
పానలఁబట్టి తీర్చినను సన్నపురత్నము వన్నెకెక్కదే. ౧౫

ఉ. భావరసానుకూలమృదుపాకపదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పుకావ్యముల మార్గము[2] గానఁగలేక దుర్మతుల్
కావనఁ గాని మొట్టికడఁ గట్టడిఁ జెప్పఁగ నేర, రెట్లొడం
బ్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్చు గ్గునే. ౧౬

చ. చులుకని పద్యమైనఁ గనుఁ జోద్యము చేయుచుఁ జిన్నవానిఁ బె
ద్దలు గొనియాడఁగాను విని తప్పులుపట్టఁదలంతు రజ్ఞులుల్
బిలిబిలి మాట లాడఁ దమఁ బెంచినవానికి ముద్దుగాక యా
పలికెడు చిల్లపిల్లఁ గని బాగురుఁబిల్లలు[3] సంతసిల్లునే. ౧౭

ఉ. భీమనపద్య మన్నఁ గనుఁ బ్రీతి వహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాపము కూర్చినాఁడ వా
నే మిది కాదు దీనివడి కిక్కడి కగ్గ మిదెట్లు దీకణం
బే మని పెట్టినాఁడ వని యొగ్గులు పట్టఁగుబుద్ధి పెద్దలన్. ౧౮

క. వివరికి వివరించిన కృతి, చవిపాలు బాచదార సరి కూర్పుట[4] యా
యవివేకికి వినిపించిన, కవిత వఱుకేఁ జాతపంచు గలుపుట చుమ్మా. ౧౯

ఉ. పూనినరీతి వానితలఁపుల్వడిఁ బ్రానములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్పఁగవచ్చుఁగాక యా
ఖ్యానకథానుకూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె పన్నమై
కానఁగ జల్లి నేయునది కట్టెదుపుట్టము నేయనేర్చునే. ౨౦

క. ఉర్విఁ గలశబ్దజాలము, నిర్వచనస్థితుల నెఱిఁగి నేర్చిన విద్యా
నిర్వాహకుఁ డనఁజెల్లెడు, సర్వజ్ఞుఁడు గానివాఁడు సత్కవి యగునే. ౨౧

క. ఎప్పటి కేయది ప్రస్తుత, మప్పటి కావిద్య మహిమ[5] మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము, దొప్పగునే కావ్య మంత సులభమె ధాత్రిన్. ౨౨

క. దుర్వాదము గాకుండ న,పూర్వపుఁ గృతిఁ జెప్పుసుకవిపుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ నని మాటల, గర్వింపఁగనేల తోడవు గానంబడఁగన్. ౨౩

క. చనుఁ "గవివైభవవిద్యా" యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లి
ల్లున గుడియుఁ జెఱుపువిధియును, ధనము సుతుఁడు సంతతులుభవస్థితిగతికిన్

1. నేర్పరులైనవోజులై. 2. పద్ధతి. 3. బావురుఁబిల్లులు. 4. గూర్చునదా. 5. మర్మమచ్చు...జెప్పెడు.

క. ఎవ్వరు కృతు లొనరింపుదు, రెవ్వరు కృతిలోన వినుతి కెక్కుదు రారుచే
నవ్విమల[1]కీర్తి సంతతు, లివ్వసుమతిఁ జెడక నిలుచు నిదకల్పముగన్.

క. సుగుణులు "బాణోచ్ఛిష్టం, జగత్త్రయ"మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే
తగఁ దోడంటిన[2] పాలిం, పుగఁ బెరుఁ గయియున్న నది యభోజ్యంబగునే.

క. సంబంధము లగురసభా, వంబులు మునుకంటె నభినవంబులు గలవే
యంబుధిని కాక బహురత్నంబులు వర్తకుల కేమి తాఁ బండినవే. ౨౭

క. తల్లి యగు వాణికరుణం, దొల్లిటికవు లధికు లనఁగఁ దోఁచిరి పిదపన్
బల్లిదు లిప్పటిసుకవులు, తల్లికిఁ గడగొట్టు[3]కొడుకు దాఁ బ్రియుమగుటన్.

క. ఏజనులకైన సద్గుణ, యోజితులై భావ మెఱిఁగి యుచితార్థకళా
రాజితు లగు కవిరాజుల, రాజులు చేపట్టిరేని రాజ్యము గాదే. ౨౯

క. సరసులు చేపట్టినచో, నిరసం బగుకావ్య మైన వినిపించిన నా
దరణీయం బయి వెలయుదె, ధరఁ బుష్పాళిఁ దాల్చి తుంగ[4]తల కెక్కుగతిన్.

క. అప్పరమేశ్వరు కరుణం, గుప్పలు గొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు, ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్.

చ. తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మొ
త్తన వన చాల దంద్రము విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగుదేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. ౩౨

క. పదిలముగ మృదులవచనా, స్పదపదసంపదల రసము చదనిడక మహా
పదముల నైనను జల్లులఁ, బొదుపెట్టిన దుడుకుఁగవిత[5] పొదలునె సభలన్.

గీ. తనవచోవిశేష మెనయక పూర్వక, థామితోక్తిఁ జెప్పు టేమికడిఁది
యొకఁడు గోలవట్టి యొయ్యనఁ గొనిపోవ, నంధుఁ డెచటికైన నరుగుటరుదె.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్ల వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురగ చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసినవానిద సూటిగావునన్. ౩౫

చ. తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు తెలుంగుచోఁ బదవిభాగము నన్వయ మర్థమంచు నీ

1 నవ్విభుల. 2 తోడంటునఁభా. 3 గడపుట్టు 4 వంకఁదుంగ. 5 దుండుకవిత,

ములకలకంటె నంపుల నమ్మకము దేటతెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకు ల్తినుకంటె ఘనంబు గ్రోలినన్. ౩౮

క. పురమథుజంగలీలాంబుధి, పరిణయనయవిప్రలంభపతిగుణపుశభా
స్వరచంద్రోదయరణగతి, గిరివనదూతస్తురతులఁ గృతి చెప్పఁదగున్.

క. కావునఁ బహునేనిమిది యగు, నీవర్ణనలచటనచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కిఁక, రావనకుఁడు లక్షణాభిరాముఁడు లగుటన్[1].

వ. అని విన్నవించి కృతకృత్యుండ నై సింహాసనద్వాత్రింశతి కథాకథనమూల
కారణం బైన యంబికారమణుండు ను [2]మ్యూ వితానసంపత్తి సంధాయకుం
డగు లక్ష్మీనాయకుండును గావ్యనాయకులుగా నియమించుటం జేసి. ౩౯

సీ. పాఁపపెండెముగాఁ గనఁడియందియ యెమునసడుగుఁదామరలపై నమరువాఁడు
పెద్దమెకముతోలు విద్దంపుఁబట్టును మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు
ఎముకపూసలును ముత్యములుఁ జేరులు గాఁగ నక్కునఁ దాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుం బెరుగుల్ల యును గేలుదమ్ముల నంచలమ్మార్జిఁ బాటించువాఁడు
నగముపొడవునఁ దెల్పు నానగము నల్పు
నయ్యె మెడ న్వ్యక్తవన్నియ యగుచు మేను
తెనయ మ్ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
బొల్పు నా వేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత. ౪౦

—(కవివంశావతారవర్ణనము)—

క. తత్పదపద్మారాధన,తత్పరులను రాజమంత్రిధర్మజ్ఞుల మా
సత్పురుషుల వినిపించెద, మత్పారంపర్య మొకక్రమంబునఁ దెలియన్.

సీ. కలువమండలికభేకఫణీంద్రుఁ డన రాయగజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డాహూఘబిరుదవిరోధి కళింగవిరోధి యనఁగ
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథివీశ్వరుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలు గన్నడీ లఱవలుఁ దెలుఁగులుఁ దనబిరుదందియఁ దగిలి కొలువ
నెగడి సనదప్రోలు[3] నెలవుగా భూసుర,వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధన్యుండు, విక్రమార్కవిభుఁడు వెన్నవిభుఁడు.

ఉ. సాంద్రజవంబున,[4] న్నతి, నిజస్థితి, నేర్పునఁ, బేర్మి, సత్యవృ
త్తిం, ద్రుతబాణ[5]పాతనిరతిం, గళల, న్నరివత్తు రెట్లు వ

1. పెంరయన్, పెంరయన్. 2. ముక్తివితానసంపద్విధాయకుండు. 3. నంధపోల్లు.
4. సాంద్రబలంబున. 5. దృఢబాణ.

క్షీంద్రుఁడుఁ బన్నగేంద్రుఁడు నగేంద్రుఁ డుపేంద్రుఁడు నింద్రుఁడున్ హరి
శ్చంద్రుఁడు రామచంద్రుఁడును జంద్రుఁడు పెన్నయ మంత్రిచంద్రుతోన్[1]

క. అమరఁగ పెన్నయమంత్రికి, నమితకళాకీర్తిపాత్రుఁ డగుపౌత్రుం డై
యమరేశ్వరమంత్రినిభుం, డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్.

క [2]సంగతి నమరేశ్వరునకు, గంగాంబకుఁ బుట్టి రట్టి ఘను లన్నయయున్
సింగయమంత్రియుఁ దమలో, సంగీకృతరామలక్ష్మణాకారములన్. ౪౫

ఉ. అన్నయనామధేయసచివాగ్రణి పుత్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి [3]పల్లికొం డజనపాలుఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగఁ గుంచె లందలము నెల్లియుఁ గైకొని మంత్రియై ప్రతా
పోన్నతి కెక్కె ధర్మముల నొప్పెను బ్రహ్మవనప్రతిష్ఠలన్. ౪౬

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి సత్త్వనా
ర్గన యనఁ గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్. ౪౭

క. ఘను లగ్రజులకు నీడై, వనములుఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి, రనపోతకుమారసింగయకు మంత్రులనన్.

క. రామాయణకృతికృతియై[4], తా మెఱయుచు నంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించినభీమన, నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.[5] ౪౯

ఉ నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగమసింగమంత్రి కిం
పూరిమిఁ బట్టి నాఁ బరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ బెం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతికెక్కెఁ దారతా
రారుచికీర్తి యాకసవరాజతనూజుఁడు దాఁ బ్రసిద్ధుఁడై. ౫౦

వ ఇట్లు గోవరాజతనూజుండైన కసవరాజు దానగుణ రాధేయుం డగు రాణా
మల్లనరేంద్రునకుఁ బరమగురుండై శైవాచారప్రథమసింహాసనాధీశ్వరులైన
[6]బ్రహ్మదేవరయొడయుల కూఁతు కామాంబిక యను కామినీరత్నంబుఁ బరి
గ్రహించి సుగుణగణగణ్యుం డై నెగడె. ౫౧

ఉ స్థేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళి రా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకాం

---

1, చంద్రుమన్, 2 గంగాంబకుఁ బుట్టిరి భువి, నంగజసన్నిభులు ఘనులు అన్నయయును సింగయ మంత్రియు, 3. పల్లకొండ గుణసంగుఁడు సింగనయుం బ్రియంబునన్. 4. రామాయణకృతి పతియై, 5. కవియై, 6. బ్రహ్మదేవవడియలు.

తేయుఁడు నిత్యకీర్తి సుకవిప్రణేయుఁడు భావశుద్ధి గాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁడమేయుఁడజేయుఁడున్నతిన్. ౫౨

సీ. ప్రకటిత సరసవాక్పతి యనఁగాఁ జెల్లి చతురాస్యుఁడై పద్మజన్ముఁ డౌఁగ
నార్యానుకూలమౌ కార్యంబు దీర్చు సర్వజ్ఞుఁడై మహేశ్వరుఁ డనంగఁ
గామాంబఁ దనపత్నిగా గారవించుచుఁ బురుషోత్తముండయి హరియనంగ
గోపకుమారుండు కొడుకుగా నక్రూరదృఢమిత్రుఁడై వాసుదేవుఁ డనంగ
వేముగల్లు జన్మభూమిగాఁ బెరిఁగియు, [1]దీవులెల్ల మాటఁ దేటపఱచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి, రాజసంగఁ గసవరాజు మించె

క. తంత్రముచేఁ గార్యము పర, తంత్రము గాకుండఁ బతిహితమె చేయుమహా
మంత్రులలోపలఁ గసవయ, మంత్రి విచారమున దివిజమంత్రియుఁ బోలెన్.

వ. ఇట్టి మంత్రిశిరోమణికి నునికిపట్టగునట్టి పట్టనం బెట్టిదనిన. ౫౫

శా. రాణామల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి య[2]
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగల్లిమహిన్. ౫౬

వ. అట్టి పురంబునందు. ౫౭

క. పూజితులగు కవులకృపన్, భ్రాజిష్ణుఁడఁ గొంత [3]యాంధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁ డైన కసవయ, రాజతనూభవుఁడ గోకరాజనువాఁడన్, ౫౮

శా. చిత్రఖ్యాతి [4]వితీర్ణవిక్రమనిధి శ్రీవిక్రమాదిత్య చా
రిత్రఖ్యాపనశాసనంబులకు భూరిస్తంభసంభారమై
ధాత్రీపాలురఁ గావ్యవేదులను మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల న్గుణంబులుగఁ గావ్యం బొప్పఁగాఁ జెప్పెదన్. ౫౯

వ. అది యెట్టిదనిన. ౬౦

— కథాప్రారంభము —

ఉ. సారబలప్రసారపరిశంసితవింశతిబాహుబాహుకే
యూరచిరత్నరత్ననికషోపలమౌ రజతాద్రిపై మనో
హారకహారము ల్పలిపి యచ్చట నచ్చట విశ్రమించుచుం
జారువిచారుఁ గింకరవశంకరు శంకరు గౌరి యిట్లనున్. ౬౧

---

1. మేటినృపులమాటగీటుపఱచి 2. యీ క్షోణిన్ శ్రీపుర...శోభిల్లి. 3. యప్పభాషావిదుఁ డన్ 4. వితీర్ణవిక్రమ.

క. చిత్రజహర మీవలనం, గ్రొత్తకథ ల్గలిగెనేని గోరి వినంగాఁ
జిత్తం బుత్తలపడియెడి, నిత్తఱిసిం బ్రొద్దుపుత్త మెఱిఁగింపఁగదే. ౧౨

క. నావుడు దేవుం డిట్లను, దేవీ కల విల్ల నీకుఁ దెలిపితి మొదలన్
దేవాసురమానుషముల, నీవెఱుఁగనియట్టికథలు నేఁ డిఁక నేవీ! ౧౩

క. ఇప్పటికి భోజునకుఁ గడు, నొప్పిద మగు మణిమయాసనోపాంతములన్
ముప్పదియు రెండుబొమ్మలు, చెప్పిన యాకథలు గలవు చెప్పెద వినుమా.

క. అనవుడు నామణిసింహా,సన మెవ్వరిసొమ్ము భోజజనపతి కేలా
గునఁ జేరె నేమి కారణ, మున నతనికి నిన్నికథలు బొమ్మలు సెప్పెన్. ౧౫

క. నాకుం జెప్పఁడు నావుడు, నాకైలాసంబుపై సుఖాసీనుం డై
యేకతమునఁ గథ లన్నియు, శ్రీకంఠుఁడు గౌరి కిట్లు చెప్పందొడఁగెన్.

సీ. కాంచనకుంభసంగతశృంగములు గలమేడలు గడకట్లు మేరు వనఁగ
రామణీయకగుణారామంబు లైన మందిరములు తిరముఁ లౌ పురము లనఁగఁ
గట్టాయితం బైన కట్టడ గలకోటపుట్ట యా చెలియలికట్ట యనఁగఁ
గడ గాన రాక భీకరమకరాలయం బైనయగడ్త మహాబ్ధి యనఁగ
మించి భూమండలంబు నిర్మించు వేళఁ, దెలివిపడ బ్రహ్మ వడియచ్చు దెచ్చుకొన్న
ద్వీప మనఁ జెల్లు బహురత్నదీప్యమాన, గోపురంబుల నుజ్జయినీపురంబు.

క. ఏకడఁ జూచిన రత్న,వ్యాకీర్ణము లై వెలుఁగు నవ్వీటి గృహ
ప్రాకారంబుల మహిమను, జీఁకటియును జోరకులనుఁ జేరఁగనోడున్.

క. కోట నొకచోట మరకత,కూటముఁ దృణ మనుచు నిలిచి కోమటియుండ్రం
గోటికి నెత్తినపడగల, యాటున కై యులికి పాఱు నర్కుని హయముల్.

ఉ. చంబిసగాలి చేరుల నభఃస్థలి త్రొక్కెడదండె సేసి నా
కంబు మహీతలంబుఁ గుదుక ల్రచియించి విరించి తొలి తు
ల్యంబుగ నెత్తుచోఁ జులుకనై యమరావతి మీఁది కేగె న
త్యంబున నెక్కుడై యట నవంతిపురం బది ప్రాలెఁ గ్రిందికిన్. ౨౦

క. క్రిందయ్యును నమరావతిఁ, గ్రిందుపఱుచు ననుచుఁ గవులు కీర్తింపు మహీ
బృందారకవరులకు నా, నందంబుగ నయ్యవంతినగరం బొప్పున్. ౨౧

ఉ. జాగులు లేక యిచ్చు నెఱచాగులు, నంచితకీర్తి సంచయో
ద్యోగులుఁ, బాపవర్జనవియోగులుఁ, గల్పితయాగులు, స్ఫుటా
రాగులు, వీతరాగులు, నిరస్తవిరోధి కృతానురాగులున్
భోగులు, నిర్విభాగులును, బుణ్యనియోగులుఁ దత్పురీజనుల్. ౨౨

వ. ఇట్లు విధంబున నత్తాపసోత్తములం బూజించి యద్దశరథేశ్వరుండు కృతాంజలి యై తత్ప్రసాదంబు గోరి యున్నయెడ ౧౨౮

సీ. శ్రీరస్తు విజయోస్తు చిరకీర్తిరస్తు తే శత్రుక్షయోస్తు సత్సౌఖ్యమస్తు
మందిరం తవ రమాసుందరం భవతు భద్రాణి భవంతు సుధర్మమస్తు
పద్మగర్భస్యేవ పరమాయురస్తు దేవబ్రాహ్మణే ష్వతిభక్తిరస్తు
భగవత్ప్రసాదోస్తు బహుధనమస్తు మాతంగతురంగశతాంగమస్తు
సపది పూర్ణమనోరథాస్సన్తు సత్య, మస్తు చతురాత్మజావాప్తిరస్తటంచు
మునులు దీవించి సేసలమ్మనుజపతికి, నెలమితో నిడ నాతండొందలధరించె.

వ. అసమయంబున నమ్మునీంద్రు లన్నరేంద్రుం జూచి. ౧౨౯

క. జననాయక మము రప్పిం, చిన కార్యము జెప్పు మన్నఁ జెలఁగుచు వారిం
గని యిట్లను మునులారా, ఘనకృప నను జూచి మనవి గైకొనుఁడింకన్.

క. నిస్తులనిగమఘనాగమ, పుస్తకములు చదువు బుధు "లపుత్రస్యగతి
ర్నాస్తి" యని వచింపుదు రది, వాస్తవ మగుఁ గాదె శిష్యవత్సలులారా!

వ. కావున. ౧౩౦

గీ. అశ్వమేధంబుగావించియనఘులైన, యాత్మజులనొందఁగోరిమీయనుమతంబు
వలన నది సేయఁదగునని తలఁచిమిమ్ముఁ, బిలువనంపితి నేనతిప్రియముతోడ.

మ. అనిన న్వారలు సంతసిల్లి విను నీ యాగంబు గావింపు మో
మనుజాధీశ్వర భూరితేజులు సుధీమాన్యు ల్సుతుల్ నీకుఁ జ
య్యన జన్మింతురు మా సరస్వతు లమోఘార్థంబు లింతైన నీ
వనుమానింపకు మాకు సత్యవచనవ్యాఖ్యానము ల్బొంకులే. ౧౩౨

క. అనుచు వసిష్ఠాదులు ప్రియ, మునఁ బలికిననుడులు వినుచు భూవరుఁ డపుడే
తనయులఁ గన్నవిధంబున, మనమున హర్షించి పలికె మంత్రులతోడన్ ౧౩౩

గీ. సచివవరులార! నేఁడు నిశ్చయముగాను, సిద్ధుఁ డాదగఁ గలమునిశ్రేష్ఠులెల్ల
బహుళకరుణాంతరంగులైపలికినట్టి, వచనములు మీరలును విన్నవారుగాదె.

సీ. కావున మీరు వేగంబ నేఁ జేయుతురంగమేధాఖ్యాధ్వరంబునకును
వలయు యూపాదిసద్వస్తువు లమరఁగూర్చి సరయూత్తరస్థలి సవనవాట
మొనరింపుఁ డని వారి మునులను వీడ్కొల్పి సరగ నాతండంతిపురమునకును
జని యందు విలసిల్లు జాయామణులఁ జూచి తనయభిప్రాయ మంతయును జెప్పి
ఘనవసిష్ఠాదిమునివాక్యగరిమఁ దెల్పి, వాజిమేధంబుఁ జేయఁగ వనితలార!
దీక్ష గైకొనుఁడన వారిజాక్షులధిక, హర్షమును బొందుచుండిరయ్యవసరమున.

క. భూకాంతునిఁ గనుఁగొని తా, నేకాంతమునందు సూతుఁ డిట్లను జనలో
కైకశరణ్యా రిపుగణ, భీకర యొకగాథ విన్నవించెద నీకున్. ౧౩౬

చ. అనఘుఁడు కశ్యపుం డనుమహాత్ముఁడు మౌనివరుండు గల్గు నా
యనకు విభాండకుం డనఁగ నాత్మభవుండు జనించెఁ బూజ్యుఁ డా
తనికిని ఋశ్యశృంగుఁ డను ధన్యుఁడు పుట్టెను భానుతేజుఁ డ
మ్మునిపతి రోమపాదుకడ మోదముతో నివసించె భూవరా. ౧౩౭

క. ఆతని నీవు కళత్రస, మేతునిగాఁ దోడి తెచ్చి మృదువచనములం
బ్రీతునిఁ జేయుచు సధ్వర, మీతఱి నొనరింపవలయు హితమతితోడన్.

వ. మఱియును. ౧౩౮

గీ. ఋశ్యశృంగుండు పుత్రకామేష్టి నీకుఁ
గరుణఁ జేయింప నలుగురు ఘనులు సుతులు
పుట్టెదరు సందియము లేదు భూరితేజుఁ
డగు సనత్కుమారుఁడు సెప్పె నమర నిట్లు. ౧౪౦

క. అనవిని సూతుఁడ నేనా, ఘనమునికృప నధ్వరంబు గావింపంగాఁ
దనయులు గలుగుదురు గదా, యనఘం బమ్మునిచరిత్ర మంతయుఁ జెపుమా.

— ఋశ్యశృంగచరిత్రము —

వ. అని యిట్లు దశరథేశ్వరుండు ఋశ్యశృంగముని ప్రభావంబు వినం గోరిన మున్ను సనత్కుమారుండు మహామునులసభలోనం దచ్చరిత్రంబుఁ జెప్ప నివ్వింటిఁ గావున నది యెల్ల నీకెఱింగించెద సావధానుండవై యాకర్ణింపు మని సూతుం డిట్లనియె. ౧౪౨

సీ. పార్థివోత్తమ రోమపాదుం డనఁగ నొప్పు నంగదేశాధీశుఁ డధికకీర్తి
యతనిదేశంబునం దద్భుతంబుగ మున్ను వర్షమింతయుఁ గొన్నివత్సరములు
గురియకున్నను బ్రజ లురుపీడఁ బొందిరి మృగఖగాదులకును మేఁతలుడిగె
నది యంతఁ గన్గొని యారాజపుంగవుం డతిబుద్ధిమంతు లైనట్టి మంత్రి
వరులఁ గన్గొని ధరణిని వాన లొదవఁ, బ్రాకటంబుగ రుద్రాభిషేకములను
ఘనసవగ్రహశాంతులుఁ గడక విప్ర,వరులచేతను జేయింపవలయు ననుడు.

క. మీ యానతి సకలంబును, జేయించెద మధిప యొకవిశేషము గలుగున్
మా మదిఁ గృపతో విను భూ, నాయక యెఱిఁగింతు మిపు డనంతప్రీతిన్.

చ. ఘనమతి ఋశ్యశృంగుఁ డనఁ గల్గును గశ్యపపౌత్రుఁ డాతపో
ధనమణి వేదశాస్త్రనిధి ధన్యగుణుండు విభాండకాత్మజుం
డనఘుఁడు బ్రహ్మచారి యమలాత్ముఁడు గావున నమ్మునీంద్రునిం
బనివడి తోడితెచ్చిన శుభం బగు ధాత్రిని వృష్టి గల్గెడుꣳ. ౧౬౩

క. అన విని మీ రాతనిఁ దో, డ్తేని రం డని పలుక నతనిఁ గొనిరాఁగా నా
కును వశము గాదు పణ్యాం, గనలం బనుపంగ వలయు ఘనమునికడకుꣳ.

క. వారాంగన లరిగిన న, వ్వారిజహిత తేజు నెన్నివరుసల నైన
న్వారలు మాయలఁ బెట్టుచు, వారక తోడ్తెత్తు రిటకు వసుధాధీశా. ౧౬౫

క. అని తెల్పఁగ భూకాంతుఁడు, ఘనముదమున నపుడె వారకాంతలఁ బిలిపిం
చి నితాంతాదరమునఁ గని, వనితామణులార! మీరు వారని వేడ్కꣳ. ౧౬౬

గీ. ఋశ్యశృంగాశ్రమంబున కేగి యతని, నెన్నివిధముల నైనఁ బ్రసన్నుఁ జేసి
తోడుకొని రావలయు నేఁడుచూడఁ బనుపు, మీ చతురతావిశేషము ల్మేరలనియె.

మ. జననాథాగ్రణి యిట్లు పల్క ముకురాస్యల్ దేవ నీయానతిం
జని యమ్ముగ్ధతపోనిధిం గనుచు నేచందంబు గావించి నై
నను దోడ్తెత్తు మటంచుఁ బల్కి మది నానందంబుతో మ్రొక్కి చ
య్యన వీక్షించు మునీంద్రుఁ గానఁ బయనం బై మొత్తమై యత్తఱిꣳ.

సీ. ఆదిని మిత్రత్వ మందఱి మంది యాస్యంబుల నబ్జప్రసాద మొంది
ఘనగుణంబులను మంగళలక్షణముఁ బొంది మతిని సర్వజ్ఞతామహిమఁ దాల్చి
కుచకందుకంబుల గురుత ప్రాపించియుఁ గచపాళి కవ్యభిఖ్యల ధరించి
చరణాబ్జముల శనైశ్చరత సంపాదించి రోమరాజిని దమోమహిమఁ బూని
నుతులఁ గాంచిన వగ్రహానుగ్రహమున, వెలయుమనకీ ప్రయత్నంబు వెలభించు
ధర నవగ్రహదోషంబు దరలిపోవు, ననుచు సంతోషపూరితస్వాంత లగుచు.

క. పల్లవకర లై తగున, వ్వల్లవకరలు దరహాస భాసురముఖు లై
తెల్లని సన్నపు వలువల, నల్లను లలరారఁ గట్టి యురుతర లీలꣳ. ౧౭౦

క. మంచికుసుంభారుణనవ, కంచుకములు దొడిగి రెలమి గదియఁగ దిగువం
గొంచెము రోజంబులుగను, పించఁగఁగుచమాధ్యములకు బిగి ముడులలరꣳ.

సీ. తమ్ముల మించు పాదమ్ముల బంగారు పావడాలందియ ల్పాదుకొల్పి
చిగురుటాకుల నెన్ను చేతుల రతనంపుఁ గంకణంబులు హూడిగములుఁ దొడిగి
మృగరాజు నోడింపఁ దగు నెన్నడుములందు గంటలొడ్డాణము ల్గట్టి బిగించి
కంబుబిబ్బోకంబు గల గళసీమల మౌక్తికావళులను మట్టుకొలిపి

దండలను బాహుబంధములఁ దనరఁ జేసి, వరగఁ బావటవిరిదీ ల్గొనలఁ గూర్చి
శిఖల నెలవంక రాగిడు శ్చెక్కి మఱియుఁ, దగిన తొడవులు దాల్చియు తరుణులపుడు.

గీ. మేను లలరంగ మృగమదమిళితమారి, గంధచందన మలఁదుచుఁ గన్నులందు
నంజనముదిద్ది కర్పూరరంజిత మగు, విడెము గావించి నగరను వెడలి రంత.

వ. ఇట్లు వెడలి యగ్గడ నడపడఁతు లెడనెడ గడెగడె కొప్పూడి నడిపడి నడువ నడుగులు దడఁబడ నుసుగక విడివిడి నడచుచు నక్కాననోద్యానబిద్దుం బిత్తఱి మొత్తన చేసి తెత్తు మని తత్తఱపడి మొత్తం బైన బిగ్గరులను గావున మనవృత్తాంతంబు క్రొత్తగ విన్న నియ్యత్తలచరు లైన మొత్తరు గదా యని పలుకుచుఁ జని చని యమ్మునితనయుం డున్న వనంబుఁ బ్రవేశించి రంత

క. అమ్ముని వినుటకుఁ జిత్రక, రమ్యగుసంగీత మచట రమణులు కలనా
దమ్ముగఁ బాడిరి రాగర, సమ్ములచే ముదము మదిని జగియింపంగన్. ౧౫౭

క. ఆనాదము వినఁబడిన, స్థానస్థున ముని యెఱుఁగక ఘనతర వేద
స్వాన మని యెంచి యమ్ముని, మానుం డరుదెంచి వారిఁ జూచెం బ్రీతిన్.

వ. చూచి స్త్రీపుంసభేదం బెఱుఁగని ముగ్ధుండు గావున వస్త్రగుపల మును లని తలంచి యర్ఘ్యపాద్యాదులం బూజించి యిట్లనియె ౧౫౮

సీ. ఓ మునీశ్వరులార మామీఁదఁ గృపచేసి వచ్చిన వారు మీ వరుసఁ జూడ
దివినుండి భువికి నేతెంచినట్లులు దోఁచె మీరు గట్టినవారచీర లరయఁ
గడు మంజుళంబులు గళముల మీరు ధరించినమాలిక లెంచఁ దరమె
ధగధగ మెఱయును దనువులు మీరు పూసినభూతి మంచివాసనలు నీను
మీరు నేర్చినవేదము మ్రోగ మెఱుంగ, మిట్టిమీదర్శనమున మాకిట్టిభాగ్య
మబ్బెనని చెప్పవలె వరా నెయ్యహా హా మీకుఁ, బూనిశుశ్రూష చేయఁగా బుద్ధిపొడమె

వ. ఇట్లనేకవిధంబుల ముగ్ధాలాపంబులు పలుకుచున్న మునిం జూచి సంతుష్టలై తమ తెచ్చిన యపూపాదిభక్ష్యంబు లతని కొసంగి తద్భక్షణంబునఁ బ్రీతుం జేసి. ౧౬౧

క. వనితలు తమలో నిప్పుడు, మనభాగ్యవశంబువలన మహితాత్ముం డీ
మునిదారకె నిశ్చయించిది, యనుచున్ భాషించుకొనిరి వాలిదలిర్పన్.

ఉ. మక్కువ మీఱ నాతని సమస్తవిధంబుల సన్నుతించుచుం
జెక్కులు ముద్దుగొంచు నగుఁ జెందఁగఁ జెన్నలిగింత పెట్టుచుం

దక్కుచు విక్కుచున్ క్షణము తాళుచుఁ బాడుచుఁ గౌఁగిలించుచుం
బక్కున నవ్వుచు న్మొగముపై మొగముం గదియించి పల్కుచున్. ౧౬౩

గీ. సరసిజేక్షణ లా బ్రహ్మచారినిట్లు, పెక్కుభంగులఁ దముఁ బాసి యొక్కగడియ
తాళలేకుండ మచ్చిక లగ్గ నొనర్చి, యతని వీడ్కొని తమపురికరుగుదెంచి.

వ. అమ్మఱునాఁడు పూర్వప్రకారంబునం జని తమరాక కెదురుచూచుచున్న
మునికుమారుం గని సరసమృదుమధురవచనంబులం బ్రీతుం జేసి. ౧౬౫

క. మాకొనకు విచ్చేయు ప్ర, భాకరసమతేజ యనినఁ బ్రమదముతో నీ
రాక మదిఁ గోరి యుంటిని, నీకడను మెలంగుచున్న మేలగునాకున్.

క. అని పలుకు ఋశ్యశృంగుని, వినయంబునఁ దోడుకొనుచు వేశ్యలు దమకం
బునఁ దమనగరంబునకును, జని ఘనుఁడగు రోమపాదు సన్నిధి నిడిరన్.

వ. తత్క్షణంబున. ౧౬౮

క. ధరణీతలమున వర్షము, గురిసెను బ్రజపీడ దొలఁగెఁ గుతుకముతో న
న్నరవరుఁడు మునికిఁ బూజలు, సరగున నొనరించె సచివసహితుండగుచున్.

వ. అప్పు డన్నరేంద్రుం డావారాంగనలం జూచి. ౧౭౦

క. రంభోరువిలాసలు మీ, రంభోరుహచారునేత్ర లబ్జారిముఖుల్
రంభోరులు మత్కార్యా, రంభోరుతర ప్రమోదరాజితమతులున్. ౧౭౧

ఉ. కావునఁ దోడి తెచ్చితిరి కశ్యపపౌత్రుని నాదు చెంతకు
స్త్రీవరచాతురీమహిమ మెచ్చఁగ నేరికి శక్య మౌనె రా
జీవనిభాస్యలార! యని శీఘ్రము వీరికిఁ బారితోషికం
బీవలె నిం డటంచుఁ దనయిష్టులతో నెఱిఁగింపఁ గ్రక్కునన్. ౧౭౨

క. వారటు సేయఁగ రహి న, వ్వారవిలాసినులు మనుజవల్లభుదండం
జేరి తదాజ్ఞం గైకొని, వారక నెలవులకుఁ జనిరి వైభవ మొప్పన్. ౧౭౩

వ. తదనంతరంబ. ౧౭౪

చ. వరుఁ డగురోమపాదజనవల్లభుఁ డమ్ముని కిచ్చెఁ గూఁతు భా
సురగుణకాంత శాంత నతిశుద్ధనవాంబరభూరిభూషణా
దరను దరోల్లసద్గళ నుదారచరిత్రను గుందదంతఁ దా
మరసముఖి న్మృగేంద్రతనుమధ్య విసారనిభాక్షి సద్విధిన్. ౧౭౫

క. మహిమాన్వితుఁడై తగున, మ్మహిపతి తనయింట నునిచె మన్ననతో న
ద్దుహితను జామాతను దన, దుహితములై లోకసన్నుతులు దాఁగన్నుచున్

క. ఆరాజు దత్త్రపాదం, బారూఢిగఁ గాంచి కాంచనాచలధీరుల్
శూరు లుదారులు నైనన, మూరులఁగని యున్న వాఁడు మహితోత్సవుఁడై.
తోదకవృత్తము కావున వేగముగాఁ జని నీవ, బ్ర్యాభవరునింగని పొందుగ నా కాం
తావరుఁ దెచ్చి ముదంబున యాగం, బావరమానిద యుం దగుఁ జేయన్.

సీ. అవనీశ ఋశ్యశృంగాభిధానమునీంద్రుఁ డధ్వర్యుఁడుగ యాగ మాచరింపఁ
గొడుకుల నీ విఁకఁ బడసెద వటంచు సూతుండు సనత్కుమారుండు సెప్పి
నట్టి రహస్యంబు గట్టిగాఁ జెప్పిన దశరథుం డాస్థతోఁ దనరి తనదు
గురు వసిష్ఠుని దోడుకొని వచ్చి పూజించి యతని కీవృత్తాంత మంత దెల్పి
తదనుమతి గొని రోమపాద ప్రజాధి,పతిపురంబున కరుగంగఁ బయనమగుచు
మంత్రి ముఖ్యుల కెఱిఁగించి మాన్యలీలఁ, జెలఁగి ప్రస్థానభేరి ఘోషింపఁ జేసి.

వ. మఱియు మాతంగ తురంగ శతాంగ పదాతి ప్రముఖబలసమేతుండై పాండురచ్ఛత్రచామరాది చిహ్నంబులు మెఱయఁ బురంబు నిర్గమించి యెడనెడ గ్రామంబులు వనంబులు మహానదు లాదిగాఁ గలుగునవి యెల్ల నతిక్రమించి కతిపయదినంబులకు నంగదేశంబు సొచ్చి తద్రాజధానిం బ్రవేశించి యచ్చట ఋశ్యశృంగమునిదర్శనపూర్వకంబుగా రోమపాదుం జూచి యిట్లనియె.

క. భూనాయక నీచెంగటి, కే నొక కార్యంబుగలిగి యేతెంచితి స
న్మానమున నన్నుఁ గని నా, పూనిక నెఱపంగవలయు బుధు లగ్గింపన్.

గీ. అనిన దశరథువచనమ్ము లాలకించి, రోమపాదుండు సంతతరూఢభక్తి
యానతిం డనఁ దనమదియందు మున్న, కోర్కి దెలుపంగ నా రాజకుంజరుండు.

వ. అట్లగుంగాక యని యద్దశరథేశ్వరు నతివినయసంభాషణంబుల సంతుష్టుం జేసిన నతం డమ్మునిం జూచి. ౧౮౩

క. నీదర్శనమున నా కతి,మోదము వాటిల్లె సకలమునినుత విలస
ద్వేదాధ్యయనరతా సుజ,నాదర శాంతావరా కృతార్థుఁడనైతిన్. ౧౮౪

వ. ఇట్లనేకప్రకారంబుల స్తుతియించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి యమ్ముని ప్రసాదంబు వడసి యచ్చోటఁ గొన్ని దినంబు లుండి యొక్కనాఁడు రోమపాదుం జూచి. ౧౮౫

క. జననాయక మానగరికిఁ, బనివిని యెదఁ గాక నీదుపట్టిని శాంతన్
ఘనుఋశ్యశృంగు నాతోఁ, బనుపంగా వలయు ఘనకృపామతి వగుచున్.

చ. అన విని రోమపాదవసుధాధిపుఁ డల్లునిఁ గూఁతుఁ జూచి వి
రనువుగ నిమ్మహారథుని యందుఁ గృపామతిఁ జేసి యిప్పు డీ

తనపురి కేఁగఁగావలె హితం బిది నాకని తెల్ప నట్టులే
చని యెద మంచు వారు గను సమ్మదవృత్తిఁ జెలంగి రయ్యెడన్. ౧౮౭

క. ఆదశరథభూనాథుం, డాదంపతులకు సువాహనారూఢత సం
పాదించి నెమ్మదిని గడు, నాదరమున రోమపాదు ననుమతి గొనుచున్.

ఉ. ఆపురి నిర్గమించి సుబలాన్వితుఁడై సకళత్రుఁడైన య
త్తాపసు వెంటఁ బెట్టుకొని తామరసప్రియవంశసంభవుం
డాపగలు న్వనంబులు నహార్యములుం గఁత్రోవదాఁటి తా
నోపికతోఁ బుతం దన యయోధ్యసమీపముఁ జేరి యంతటన్. ౧౮౯

క. తనరాక పౌరజనులకుఁ, బనిపడి చెప్పుమని యొక్క పరిచారకునిం
బనిచిన నతఁ డటు సేయఁగ, విని పౌరులు మనము లలర వీథులయందున్.

గీ. అమితచూతపల్లవతోరణములు గట్టి, కలితచందన హిమజలంబులను జల్లి
ముత్తియంబులు మ్రుగ్గిడి తత్తరమునఁ, బురము గై సేసి రంత నద్ధరణివిభుఁడు.

శా. భేరీశంఖమృదంగకాహళల గంభీరధ్వను ల్భాసురా
శీరాళిస్ఫుటనాదముల్ చెలఁగఁగా సీమంతిను ల్వేడ్క సిం
గారం బొప్ప నివాళు లీయ గణిక ల్గానంబు గావించి కై
వారంబుల్ దగఁ జేయఁ బట్టణము తేవం జొచ్చె నింద్రుండనన్. ౧౯౨

వ. ఇట్లు పురంబు ప్రవేశించి. ౧౯౩

క. తనగృహము సొచ్చి జనపతి, వనితాయుతుఁడైన మునియువలనుగఁ దనతోఁ
జను దేర జనము లందఱు, మనముల హర్షించి మిగుల మన్నింపంగన్. ౧౯౪

గీ. పిదప నమ్మునిఁ బూజించి ప్రియముతోడ, దశరథక్షితినాథుఁ డుదారకీర్తి
తదనుమతి గొనియాతని ధర్మపత్ని, శాంత నంతటఁ బనిచె శుద్ధాంతమునకు.

క. అశాంత వినుతగుణ యగు, నాశాంతాహ్వయ సుదంత యతిరమణీయా
కాంధునీకాపవనీ,కాశలసత్కీర్తి మందగమనముతోడన్. ౧౯౬

క. ఇంతులు దన చెంతలఁ గడు, సంతసమున వచ్చుచుండ సవినయముగ శు
ద్ధాంతమున కేఁగఁగా న,క్కాంతకు నెదు రరిగి రాజకాంతలు ప్రీతిన్. ౧౯౭

క. కొమ్మా రమ్మా యమ్మా, సమ్మానితచరిత పరమసంయమిముద్దుం
గుమ్మా నుతిగై కొమ్మా, యిమ్మా భద్రములు మాకు నింపు దలిర్పన్.

క. అని తోడి తెచ్చి కనకా, సనమునఁ గూర్చుండఁ జేసి సరసిజనేత్రన్
వినయమునఁ బూజసేయుచు, వినుతింపఁగ మనమునందు వేడుక పొడమన్.

లయగ్రాహి.

శాంత ఘనదాంత పరశాంత నిగమాంత విద
నంత నిధ సంతతసుచింతమునికాంతా
కాంతతను కాంతియుతచింతితనితాంతశుభ
దంతిగతిసంతమసకుంతలఘుదంతా
యింతి యిది యింత పతిపొంతఁ గడకింత గఁజ
రింతువు నిరంతరదిగంతసదుదంతా
యెంతని వచింతుము వలంతులను కొంతయినఁ
జెంత వినుతింతుమని యెంతుము నెలంతా. ౨౦౦

క. ఇటు సన్నుతించుచును ముని, కుటిలాలక కెదను ముదము గూర్పఁగఁ దమయం
తటఁ గావలసిన పనులను, ఘటియించిరి నమ్రభావగతమతియుతలై.

వ. ఇట్లు దినదినం బమ్మునిదంపతులకు దశరథుండు భార్యలుం దానును సవిశేష
కల్పిత పరిచర్యలు సలుపుచుండఁ గొంతకాలంబునకు సలసిపాలిభాగ్యదే
వతచందంబున వసంతసమయం బరుదెంచిన. ౨౦౧

—॥ వసంతర్తువర్ణనము ॥—

సీ. పండుటాకులు క్రిందఁ బడవైచి మామిళ్లు గజ్జెలంజాయచిగుళ్లు దొడిగెఁ
జిగురాకులను మెక్కి చెలఁగి కొమ్మల నెక్కి కోయిలతండము ల్గూయఁదొడఁగెఁ
బువ్వుఁదేనియలాని పొలుపారు తుమ్మెదల్ హాయిగా గానము సేయసాగె
మముఁజూడఁగా వచ్చు మదనుఁడిచ్చటికన్న చెలువునఁ జిలుకలు కులుకఁజొచ్చె
నించుపిలుకాని బలములో నెంచమమ్ము, మించువారేరియని మెచ్చుకొంచునున్న
కరణిఘనబర్హిణములు కేకలను మించె, నవ్వసంతాగమంబున నఖిలవనుల.

గీ. ధరణిఁగొందఱుసుజనులు దారలీల, సుందరులఁగూడి మనములానంద మొంద
బహులపల్లవకుసుమితఫలితవనుల, యందువిహరించుచుండిరయ్యవసరమున.

క. నిండు కొనిపండు వెన్నెల, యుండఁగఁ బికములు కుహూకుహూయంచు లొదల్
దండిగఁ జేయఁగఁ బాంథులు, గుండియ లదరంగ మూర్ఛగొని రారేలన్.

వ. అట్టి నిశాసమయంబులందు. ౨౦౪

చ. వఱలు వనీవసంతులు వివాహమహోత్సవమందుచుండ స
త్తఱి యనుబాణకారి ప్రమదంబునఁ గాల్చిన చిచ్చుబుడ్ల బల్
మెఱపులపిండులో యనఁగ మించెఁ దలిర్చిన మావులందుపై
నొఱ పగు కోకిలాళులు సమున్నతధూమములో యనం దగన్. ౨౦౫

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.



కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు. (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటాద్రియయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబహ్మారావు నాయఁడుగారు.

| | | | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | ... 0 | 10 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు ... | ... 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | ... 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టుసర్వశాస్త్రికవి ... | ... 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | ... 0 | 2 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు | ... 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... | ... 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | ... 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | ... 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | ... 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | ... 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... 0 | 4 |
| 18 | ప్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... | ... 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | ... 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... | ... 0 | 8 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁడు | ... 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | 1 | 4 |
| 23 | రెడ్లనాఁటి రెండుశాసనములు | ... 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | ... 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి ... | ... 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (1-2 భాగములు) ... | ... 1 | 6 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... | 0 | 8 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... | ... 0 | 8 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... | ... 0 | 8 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... | ... 0 | 8 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... 1 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ ... | ... 0 | 8 |
| 33 | అమరుకము-సాంధ్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... 1 | 0 |
| 34 | సాంబోపాఖ్యానము-రామరాజురంగప్పరాజు ... | ... 1 | 0 |
| 35 | హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ... | ... 0 | 2 |
| 36 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి ... | ... 0 | 10 |
| 37 | రాయవాచకము ... | ... 0 | 8 |
| 38 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకాసహితము | ... 0 | 8 |

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచేఁ బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1934.

# వి ష య సూ చి క.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.



సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము జ్యేష్ఠాషాఢ మాసములు. } సంచిక ౨.

## ఆంధ్రి-తద్విశిష్టత.

కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, సాలూరు.

— గతసంచిక శేషము —

కాదన్నవా రెవరు? ద్విత్వ మగుట భాషాసామాన్యతత్త్వమా? ఆంధ్రమాత్రతత్త్వమా? కిమ్+అని=కమ్మని, తెలుఁగు. కాని యాంగ్లులు 'బ్రహ్మన్ "is" బ్రహ్మన్నిస్, అని యనరు. స్వస్వభాషితతత్త్వ మందురా? తత్+ఏవ=తదేవ, లవ్+er=lover, loud+er=louder, sing+er=singer అని యగుచున్నవి. ఒకానొక భాషయం దొకానొకప్పు డొకానొక హల్లు ద్విత్వమైనఁ గావచ్చునేమో యని శాసింతురా? ఆంధ్రమున హలంతత్వమే లేదు.

అంతనకారమున కేయేరూపము లున్నవియో యవి యెల్ల ద్రుతధర్మము లగుటచేత ద్రుత మనఁగఁ బూర్వోక్తధర్మవదక్షర మనియే యర్థము. అదియే ద్రుతము.

ద్రుతము ప్రకృతియందుఁ గలశబ్దములు ద్రుతప్రకృతికము లని యన్నచో నవ్యయమాత్రములే ద్రుతప్రకృతికము లని యర్థ మగును. వాఙ్మయంబునందు గజడదబాదేశము కేవలాఖ్యయుద్రుతప్రకృతికములపైఁ జేసి యూరకుండెనా? లోడంబుప్రాపుచయము, ఓజంగాంతారము-ఇత్యాదులు గలవు. ద్రుత మంత

మందుఁ గలశబ్దములు ద్రుతప్రకృతికము లని యర్థము చేయుచో నగ్గినిప్పు జాతిలోఁ జేరును. ద్రుత మంతనకారమే కదా ? ఇఁక నె ట్లర్థమగును ?

ఏన్పర్వంబులు—ఏఁబది—

పైరెండుపదములస్వరూపము వివేకించుచో ద్రుతిప్రకృతిరహస్యము బయ లగు నని శ్రీ రామశాస్త్రిగా రనిరి. కాని వివేకమును గావింపలేదు. "తత్సమపదములు ద్రుతప్రకృతికములు గాకున్నను వాని నాధునికులు ద్రుతప్రకృతికములుగానే భావించుచున్నారు." ఈవాక్య మాంధ్రవివరణమున శ్రీ రామశాస్త్రిగారు, వ్రాసిరి. తరువాత నుదాహరణములఁ జూపిరి. తమ యభిప్రాయము స్పష్టముగ వ్రాయలేదు. తత్సమమునకుఁ దత్సమము పరమగు నప్పుడు రాదనియా ? ద్రుతప్రకృతికత్వమునను సరళవత్త్వమునను రెంటను సందేహించి రని యనుకొందును. దానికేమిలెండు. ఏను + పర్వములు, ఏన్పర్వము లయ్యెను. ఇందుఁ జేయకయు 'ఏను + పది=ఏఁబది' యిందుఁజేసియుఁ జూపెనని శాస్త్రిగా రనిరి. ఏమిచేసిరో? సరళముచేసి యనియర్థ మనుకొందము. అగుచో "ఏను" ద్రుతప్రకృతిక మని భావించిన ట్లగుఁగదా ? ఏను, ద్రుతప్రకృతికముగాదు. ఏఁబది యనుశబ్దములోని గజడదబాదేశము ద్రుతప్రకృతికపూర్వ మగుటచే రాలేదు. వర్ణలోపమువలన సాధింపఁబడును. ప్రాఁజదువు, శబ్దములోని 'ప్రాత' శబ్దము ద్రుతప్రకృతికము గాక యనంతరము సూత్రసాధనమువలన "జా"దేశము వచ్చెను. ఇఁక శ్రీ శాస్త్రిగారియర్థము సమర్థముగాకున్న ద్రుతప్రకృతిశబ్దార్థ మెట్లను సంశయము మిగిలియేయున్నది. చింతామణికర్త యేమనెను ? చూడుఁడు:—

"ద్రుతప్రకృతయో యేస్యు రనుజీవితద్రుతాః నిత్య" మ్మని చెప్పెను. అనుజీవితద్రుతములు ద్రుతప్రకృతు లని యర్థము. "అనుజీవితాః అనువర్తితాః ద్రుతాః యైః తే శబ్దాః ద్రుతప్రకృతయః" అని విగ్రహవాక్యము. అనువర్తిత ద్రుతములు గలది. అనఁగా:—ద్రుతధర్మము లనువర్తింపఁబడునప్పుడు ద్రుతప్రకృతి యగు నని యర్థము. నిత్య మనుటకుఁ బూర్వవ్యాఖ్యాతలు చెప్పినయర్థ మగుచున్నను విశేషముగలదు. అన్నివిధముల ననువర్తితద్రుతము లగుచో ద్రుతప్రకృతు లగు ననియు నర్థము. కాని ద్రుతిప్రకృతికములు ద్రుతప్రకృతివిలక్షణములా ? కావా ? అని శంకగల్గును. సంజ్ఞ నెట్లుచెప్పెనో శాస్త్రమును నట్లే వర్తింపఁ జేయుదురు. ద్రుతప్రకృతు లని సంజ్ఞాపరిచ్ఛేదములోఁ జెప్పి సంధిలో

‘ద్రుత ప్రకృతికము లని వాడెను. ఛందస్సే కారణమా? శాపవిశేషము కార
ణమా? ద్రుతప్రకృతికములు ద్రుతప్రకృతిమాత్రములు గావని యర్థము సేయ
వలయును.

“ప్రథమామాత్రా దాత్తాన్తదోః” అనుసూత్రమున ‘నేను, తాను’ శబ్ద
ములఁ బ్రస్తరించెను ప్రథమలే మొదలు ప్రస్తరింపదనెను “వాత్తాన్తదో ద్రుత
స్య వాల్లుక్” అనుసూత్రము చెప్పుటచే ‘నేను, తాను’ లు ద్రుతాంతశబ్దము
లని యర్థమగుచున్నది. నేను తానులు ద్రుత ప్రకృతికములే యగునప్పుడు
“లుగ్వా ద్రుత ప్రకృతికాత్” అనుసూత్రముచే వచ్చిన వికల్పలోపమును
దిరిగి, “వాత్తాన్తదో” అనుసూత్రమున నేల చెప్పెను? నేను తానులు ద్రుత
ప్రకృతులు గావా? వాపడినసందియము వ్యాఖ్యానాంబలపతియుఁ బడి యొక
రీతిసమాధానపఱుచుకొనెను. కాని యది కర్తృహృదయము గాదని తోఁచె
డిని. మఱియు నన్య కృత్ఖండన మగుచున్నది. గపడదవాదేశముకడ నే “తాను
నేను”లు గ్రహించెనో యిచ్చటను వానినే గ్రహించెను బిందుసంశ్లేషలు
వారించుట కనుసమాధానము పొసఁగదు. ‘క్వచిత్ కేచిత్’ పదములే సమ
ర్థములు. మఱియు బిందు వనఁగ నర్థబిందు వనియు నర్థమగును. దీర్ఘముల
కాకార్యము గాదని క్వచిత్పదమునఁ దెలిపెను. కాన్ + కాన్, కాన్గాన్,
కాంగాన్” అను సవిష్ఠరూపములు సంభవించును. దీర్ఘపరద్రుతకార్యములు
సామాన్యముగ లుగ్వా యనుచోటఁ దెల్పినట్లే యగును. ఇఁక నర్థమెట్లు?
‘తాను నేను’ లు ద్రుతప్రకృతు లగును. కాని ద్రుతప్రకృతికములు గావు.
ద్రుతప్రకృతి ద్రుతప్రకృతికసామాన్యవిధి చేయునప్పుడు ద్రుతప్రకృతిక మని
యు విశేషముగఁ జెప్పవలసివచ్చుచో ద్రుతప్రకృతి యనియుఁ జెప్పును.
కావుననే “వాత్తాన్తదోః” అనుసూత్రము ప్రారంభించెను. స్పష్టపఱిచెను.
కావునఁ బదములు ద్రుతప్రకృతు లనియు నితరములకు గ్రహణమున్న ద్రుత
ప్రకృతికము లనియు నర్థమగును. ఇట్లు చెప్పకున్న సంజ్ఞాసంధుల సమన్వ
యము గుదురదు. సుమాద్యాగమములు గలప్రాతిపదికములు ద్రుతప్రకృతి
కము లగును. అట్లు గాకున్న గజడదబాదేశము రాదు ప్రాతిపదికములకును
విధించుచున్నాఁడు గదా? ‘సర్వత్ర లుక్సమాసేషు’ అనుసూత్రము ద్రుతప్ర
కృతి (పదము) ద్రుతమున కనువర్తించును. ఎల్లన్ + పాపములు, ఎల్లపాప
ములు, అని యగును. ‘అధికారగతే’ అనుసూత్రమున కిటఁ బ్రసక్తి లేదు. అది

ద్రుతప్రకృతికసామాన్యాశ్చ ఇతి వచనము, ఇది ప్రాతిపదికము, అను నిశ్చయజ్ఞాన మాంధ్రమున నుపేక్షింపఁబడుటచే విభిన్నయుపమార్గములు త్రొక్కుచున్నారు. మహాపండితులే యీవిషయమున నిర్లక్ష్యము సూపుచున్నారు. సోదాహరణముగ వ్యాసాంతమునఁ బ్రతిపాదింతును. సంగ్రహముగ "యున్" అనుదానిఁ బదమనుట తప్పని నొక్కుఁగ రని యాసుచు యున్, పదమే యగుచో "యాది" పద మగునా? ఇట్టి పెక్కులు గలవు. ఇది సమయము గాదు.

ఇంత విమర్శించెను ద్రుతప్రకృతి కర్థము స్పష్టము గా దందురేమో? ప్రకృతియందు ద్రుత ముండునది యనునర్థము సరియైనది కాదు. ద్రుతస్యేయా ప్రకృతిః స్వభావః సా యస్య సః, ద్రుతప్రకృతిః- అని యర్థము. ద్రుతప్రకారమెల్ల నేపదమున ననువర్తించుచున్నదో (అంతమున నే యనుట) యది ద్రుతప్రకృతి.

ద్రుతప్రకృతికముకంటెఁ బరములయిన పరుషములు సరళము లగునను సూత్రము వికల్పముగ బోధించి యనంతరసూత్రమున గజడదబాదేశము నిత్యమని విధించెను. సాంస్కృతికపరుషవర్ణములయందు బహుళముగ వ్యాపించుటకును నచ్చమున నిత్యముగ నుండుటకును నట్లు రెండు సూత్రములు చెప్పెను. సున్నపోఁడునసే గజడదబాదేశ మగుననుమతము చింతామణిసమ్మతము గాదు.

ఈ విమర్శమువలనఁ జింతామణిలోని సంధిపరిచ్ఛేదస్థ మగు "ద్రుతప్రకృతికాత్పరుషాః" ఇత్యాది సూత్రము వికల్పత్వమును బోధించుచున్న దనియుఁ దరువాతి సూత్రములయాసును బూర్వపద్ధతి మగుసాంప్రదాయమే యున్నదనియుఁ దెలిపితిమి. అట్లే గసడదవాదేశము ను వికల్పమని యే చెప్పఁదగును. కాని శ్రీ రామశాస్త్రిగా రన్నట్లు సూత్రమునందుఁ గల "ఆత్మాస్మదోః" అను పదమువలనఁ బూర్వపద మాచ్ఛికముగ నుండు నని తోఁచును. "ఆచ్ఛికము లగుప్రథమావాత్రములకంటె వచ్చిన కచటతపలు గసడదవ లగును" అని శాసనార్థము తరువాతిసూత్రములో నిషేధము గలదు సాంస్కృతికములకే యానిషేధ మనువర్తించుటచేఁ బరుషసంజ్ఞయు సాంస్కృతికముల కనువర్తించుచున్న దనవలయును. ఇఁక నిషేధము దేని నుద్దేశించి వచ్చెనో యరయుదము.

సూ॥ గసడదవా స్స్యుః ప్రథమామాత్రాత్ ఆత్మాస్మదో ర్ద్వన్ద్వైతే॥
23-౯-౨- ఈసూత్రము రెండుసూత్రములుగ నన్వయించుకొన్నచో నుపలభ్యమానప్రయోగములును నవిరుద్ధములగును. అదియే గ్రంథాభిప్రాయము న్నై యుండవచ్చు నని తలంతును.

(1) గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్

(2) ఆత్మాస్మదో ర్ద్వన్ద్వైతే.

వ్యా॥ ప్రథమామాత్రాత్, అత్ర, మాత్రశబ్దస్య కైవల్యార్థం కార్త్స్న్యార్థంచ వదంతి. కైవల్యం భవతిచేత్ ద్వ్యక్షరాణాం ప్రయోగాణామపి కైవల్యం ఖలు భవతు. కైవల్యార్థో నచేత్ కథం తాను, నేను, ఇత్యేతయోః ప్రథమాదిః ప్రాప్తః, ఇతి చేన్న, కలానాం మధ్యే న్యస్తప్రకృతికానప్యేతాం, కార్త్స్న్యార్థేనాపి ప్రాప్తే ప్రథమావిభక్తిత్వే తన్నిరాకరణం కృతమితి సుకరః, కార్త్స్న్యార్థేన సర్వేషామవ్యయానామపి కార్యం భవతి, ప్రథమాయాః ఇత్యుక్తే౽వ్యయానాం కేవలం ప్రథమాత్వం నాస్తి, సులభత్వమస్తు, ఇతి ప్రథమామాత్రా దితి సాకల్యార్థో గ్రంథనిర్ణయః, క్త్వాంతావ్యయానాం ప్రాప్తే నివృత్త్యర్థం భవతి, క్రియార్థ్యాః కలార్థ్యాశ్చ వ్యాప్తిః, పరతః పరుషాః పర్ణాః, గసడదవాః, వికల్పేన, స్యుః, ఇతి ప్రాకరణికోర్థః॥

(2) ఆత్మాస్మదోః, తాను, నేను, ఇత్యేతయోః శబ్దయోః సంబంధం వినా ఏతేష్వే వేవ, ఆత్మాస్మదో రితి గ్రహణేన కేవ లాంధ్రపదస్యగ్రహణం, ప్రథమామాత్రా దాచ్ఛికాత్ పరతః పరుషాః అచ్ఛికాః గసడదవాః స్యురే వ, నిత్యం స్యు రిత్యర్థః॥ అచ్ఛికపరుషా ఇత్యస్య ప్రమాణ ముత్తరసూత్రమ్. సాంస్కృతికానాం, ఇతి, సాంస్కృతికపరుషాః వికృతిశబ్దాత్ ప్రథమామాత్రాత్ గసడద వాః నిత్యం నస్యుః, ఇత్యర్థః, ద్వితీయసూత్రస్థేన "ఏవ" పదేన నిత్యత్వే ప్రాప్తే, అనేన నిరాకృతమ్. కింతు వికల్పత్వమే వే త్యభిప్రాయః, తత్సమాత్ తత్సమసంబంధినాం, వికల్పత్వ మేవ. సర్వత్ర వికల్పత్వ మేవ. విస్తరే ణాలమ్. "అ॥ వ్యా॥ పా"

ప్రథమామాత్రము లనఁగ ప్రథమావిభక్తులును నవ్యయములు మున్నగునవి గ్రహింపఁబడును. కళలు గ్రహింపఁబడు ననుటకుఁ బ్రమాణము లేదు. ద్రుతప్రకృత్యవ్యయములును గ్రహింపఁబడును. అన్యసూత్రముచే నివారింపఁబడును. ప్రథమామాత్రము లయినశబ్దములకుఁ బరము లయిన (తత్సమాదు

లనేదైన సమమే) కచటతపలు గసడాదు లగుచు. కాని వికల్ప మని యర్థము. ప్రకరణమునుబట్టి యు నట్లే యున్నది. ఆచ్ఛికముల కాచ్ఛికములు పరమగు నప్పుడు నిత్యము, ఆచ్ఛికములకుఁ దత్సమములు పరము లగునప్పుడు నిత్యము గాదు. అని సంగ్రహసుగ్రహార్థము.

కావున "ఏను + పర్వములు" అనుచోట నేయాదేశమును రాక ద్విగు సమాసపద మై తత్పదమధ్య నలడరల యుత్వమునకు లోపము గలిగి "ఏన్పర్వంబు" లయ్యె నని నిర్ణయము.

— పంచదివసంబులు —

'పంచవటి, పంచనదము, త్రిలోకి' ఇత్యాదులఁబోలె నీ "పంచదివసము" లనుపద మేకవచనమున లేదు, బహువచనమున నున్నది. పాణినీయము ప్రకారము తప్పగుచున్నను వేదభాషాప్రకారము సరియగుచు త్రివిష్టాః, పంచజనేభ్యః ఇత్యాదులు యజురథర్వణములఁ గలవు. వాఙ్మయమున (లౌకికమునను నాంధ్రవాఙ్మయమునను బహువచనరూపములు సిద్ధములై యున్నవి. వాసుదేవపండితుఁడును దన వైకృతచంద్రికలో "ద్విగోర్బహువచనమ్" మిశ్రేతాచ, అని సూత్రించెను. ఆచ్ఛికమున నేకవచన మని యభిప్రాయపడెను. మువ్వన్నె, ముతుము, ఇరుచక్కి, నలుగడ, ఇత్యాదు లుదాహరణములు.

పంచదివసంబు లనుప్రయోగమున మిశ్రత కలదా? 'చ' (మిశ్రేతాచ) శబ్దమువలన సాంస్కృతికసమాసములు నని గ్రహింపవలయును. మఱియుఁ దెనుంగున సంస్కృతసంఖ్యావాచకశబ్దములు వ్యస్తములుగ నుంటపోనం గమిని వ్యస్తత్వమును భావించి మిశ్రసమాస మనియుఁ జెప్పవచ్చును. యథావిధి, యథాశక్తీత్యాద్యవ్యయీభావసమాసములు మన తెనుఁగులో భిన్నలక్షణములఁ దాల్పవా? ఇట్లే సమాహారద్వంద్వమును గలదు. వాక్పాణిపాదపాయూపస్థ మని యేకవచనమున నుండవలసినది బహువచనముననే యున్నది. సమాసవృత్తుల నేకవచననియమము గీర్వాణమున (లౌకికమున) వేనికిఁ గలదో యవియెల్ల బహువచన మగుచున్నవి. "సమాహారం బనియతవచనకం బగు," నని వాఙ్మయావలోకనమునఁ దెల్పఁదగినదియే. బ్ర॥ శ్రీ॥ వేదము వేంకటరాయశాస్త్రిగారు పరిషదధ్యక్షోపన్యాసమునఁ గొంచె మీవిషయ మై శంకించి విడిచిరి. "తెనుఁగున, అష్టగజములు, నవబ్రాహ్మణులు, ఏకాదశశిష్యులు, వింశతిభటులు- అనిసమాసము లుండును. అది యెట్లు?" ప్రశ్నవా

క్యమున కభిప్రాయ మేమియో తెలియదు. నన్నయనుండి నిన్నటివఱకు నన్నింట నున్న యీవచనవ్యత్యయము నిత్యసంప్రదాయ మని గ్రహించుటయే శరణము. సూత్రమా? రచింపుఁడు. తప్పుగాఁ జెప్పుట కేరికి శక్యంబెకదా?

— ఎవ్వని యేని ముఖామృతాంశుబింబమున —

'ఎవ్వనిముఖామృతాంశుబింబంబున నేని' అనుటకు మాఱుగ సమాసమధ్యమున నేనిపదము పెట్టి చోద్యంపుఁబ్రయోగమును జూపె నని మనము కొందుము. కాని "ఎవ్వని" అనునది నన్నయనాఁడు వ్యస్తపదముగ నుండెనో? షష్ఠీతత్పురుషసమాసమాంధ్రమున నింతగనే యున్నది. ఇట్టి యొకవచనమును భారతాదిపర్వచతుర్థాశ్వాసమునఁ గలదు. 'ఎవ్వని యేనివీర్యంబున' అని యున్నది. ఇంకను నిట్టిప్రయోగము లందందుఁ గననగును. వానికెల్ల గతి కల్పింపరు. ఇట్టిసమాసచిత్రము లీభారతమున ననేకలవు. అనంతరకవులు వీనిని గ్రహింపరు. నేఁటికాప్రయోగవాసన యేనిని గానము. ఇఁక నన్నయ యన్యత్రవ్యస్తముగఁ బ్రయోగించిన ప్రయోగముల నుదాహరింతును.

సీ. అంగనాజనులయుత్తుంగసంగతకుచకుంకుమచందనపంకములయు
వారివ ధమ్మిల్లభారావకలితదివ్యామోదనవపుష్పదామములయు,
వారివ ముఖసకర్పూరతాంబూలాదివాసనాసురభినిశ్వాసములయు
వారివ పంథానచారుధూపములయు నలసితసౌరభావలులు దాల్చి
అనిలుఁడను దూత వోయి తోడ్తోనుచుఁ దెచ్చె... భార॥ఆది॥ ౬॥ ౧౫౮

ఇట్టి నాల్గవయాశ్వాసమున సిరుపదొక్కఁ డగుపద్యమునను బ్రయోగించెను. సమాసమధ్యమునఁ బ్రయోగించుచున్నా నని యెఱిఁగి నన్నయ ప్రయోగించెనా? ప్రమాదపతనమా? ఆంధ్రభాషకాదిమగ్రంథమును వ్యాకరణసర్వాధారమును నగుదానియందుఁ బ్రమాద మున్న దనుట కర్థ మేమి? భారతప్రమాదములు భాషాప్రయోగచిత్రములు, లక్షణములపైఁ ద్రోయుదమా? అనంతరకవుల పడసివసి లక్షణుఁ డెట్లు వ్రాయును. వ్యవహారమటుండె నందురా? ఆధార మేమి? అనంతరకవు లిదును సిపంతిఁ గూర్పరేల? ఇష్టము కాదా? అట్లును నన లేము.

'నితదర్థము' అనుప్రయోగముగూడ నిట్టిదే కదా? ఇదియు ననంతరకవు లుపయోగింపరైరి. అయినను సర్వజ్ఞశతకములోఁ గలదు. అట్లింక నితరులు ప్రయోగించిరేమొ యరయవలసి యుండును. కాని యనంతరకవు

తవచనప్రతీతి గలుగుట యెట్లు ? గీర్వాణమునను "ఇవ" తో సమాసమును విభక్త్యలోపమును విధించినట్లు సముచ్చయము తోడి సమాస మాంధ్రమున నగు నని చెప్పవచ్చునేమొ ? కాని నన్నయకృత మగుసమాసమధ్యవ్యస్తపద వ్యవధాన మమర్యాదము సమాసలక్షణవిరుద్ధమును నగును ఇట్లు వైదికవాఙ్మయమునను లేదనియే తలంతును. ఇంకొకదగ్గఱ నన్నయ ప్రాతిపదికప్రత్యయముల వియోగమును గావించెను. సముచ్చయార్థముననే చేయుచు. 'పాండవులయుఁ గౌరవులయుఁదోడ, అనునట్లు చేసెను. ఎందేనినుండి యొక్కమహాముని, భార "ఆది · ఆ, 177" స్థలమునఁ బ్రయోగించెను. దానివిమర్శించుచు భారతపత్రికలో నిట్లు వ్రాసిరి. "ప్రభ్రంశయాం యో నహుషం చకార" అని వ్రాసిరి. కాని ప్రకృతిప్రత్యయవిభాగ మనక "తోడన్" అనునది తోడు శబ్ద మని చెప్పినఁ బ్రమాదమేమి ?

"సత్యవతి తొల్లి కొండి(డు)క నాఁడు దనకన్యయై యున్న కాలంబున" భార -ఆది- ర ఆ, 226, వచనము—తాను గన్యయై యున్నకాలంబున, అనియో, కన్యయై తనయున్నకాలంబున, అనియో, యుండుటకు మాఱు "పదద్వయవ్యవహితసమాస" మయ్యెను. వీనిపాఠముల స్వరూపమును దరువాతివాఙ్మయరూపమును జూచి సమన్వయించుకొనవలయును. మఱియు నట్టి ప్రయోగము లార్షము లని నమస్కరించి విడుపే కార్యము. భాషాచరిత్రము క్రిందఁ గావలయునేనిఁ గణ్ణేభి యున్నట్లు చూపవచ్చును. ఆనాఁటివాఙ్మయ మట్టిది. తరుణులు, అనుటకు "తరుణీయులు" అనియు, గడ్డయు, చింతయు, తాళ్లకేవ, అనియు నున్నది. అని నన్నయభారతము ప్రయోగము లనర్హము లనుటయే శరణమా ? ఇంక ననంతరకవుల యనుసరణము నందంఘుఁ గాన వచ్చుచుండుట సంప్రదాయమును వెనుకఁబలయునా ? క్వాచిత్కముగ నుంట హేయమని యనఁదగునా ? ఈపట్టు గడ నరయిఁకఁ బొరసియున్నదియు.

"చందురు చెలికాఁడునైఁ దోడుఁగూడి నీయుల్లంబు మొల్లంబు నుపచరింపఁ"

ఉత్త,హరి.

ఇట్టిప్రయోగము లున్నవి. చందురు చెలికాఁ డనుప్రయోగము సమాసమా ? వ్యస్తమా ? కఠ భావము వ్యస్త మనియే కదా ? కావున షష్ఠీవిభక్తి రూపము నిరూపింపఁబడవలసియుండును. ఒక్కషష్ఠి యనియు యొక్కషష్ఠి యనియుఁ బ్రత్యేకముగ నీషష్ఠీవిభక్తిని మాత్రము ప్రత్యయముతోఁ గలిపి

పేరుపెట్టు నాచార మందందు లక్షణములయందుఁ గానఁగును. చేతతృతీయ, కొఱకుచతుర్థి, ఇత్యాదిగనే విభక్తినిఁ బేర్కొనక షష్ఠీవిభక్తినిమాత్రము యొక్కషష్ఠి యనుటయేల ?

షష్ఠివిభక్తి విభక్తి నిర్ణయమునను నాంధ్రవ్యాకరణములు సందేహముగనే నిర్వచించెను. ఏడువిభక్తులనక యెనిమిదివిభక్తు లని కొందఱు పేర్కొనిరి. ప్రకృతిప్రత్యయవిభాగము సేయువారివలెఁ జేయుచుఁ బ్రత్యయములను బదములుగ విధించిరి. ఆంధ్రవిభక్తిప్రత్యయములు కొన్నిపదములే యనువాదము సార్థక మగుచున్నది. ఇట్లాంధ్రమే యననేల ? ఎల్లభాషలకును విభక్తిప్రత్యయములు తొల్లిఁ బదములయియే యుండును. కాని శాస్త్రరచనాకాలమునఁ బ్రకృతిప్రత్యయవిభాగమును కావింపవలసియుండదా ?

గీర్వాణాదిభాషలలోఁ గలప్రత్యయములు తమప్రత్యయత్వమును స్ఫుటపఱుచున ట్లాంధ్రమున నన్నియు లేవని యందురు. ప్రకృతిప్రత్యయముల కరంబితస్థితి నరసి పాశ్చాత్యులు ప్రత్యేకముగ నొకనామ మిడిరి. 'Inflexional languages ' (సప్రత్యయభాషలు—ప్రత్యయపర్యవసాయిభాషలు) ప్రత్యయప్రత్యయితభాష లని చెప్పుదురు. ప్రత్యయైక్యము గలజాతిలో నాంధ్రాదులు సేరవనియే యొకమతము. ఏది యెట్లున్నను విభక్తిప్రత్యయము లని యనుకొనునవి పదము లని మనతెలుఁగులో స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. గీర్వాణమునఁ గలప్రత్యయములును బదములఁనములే యయ్యు నేఁడు వానిఁ బరీక్షింప దుస్సాధము లయ్యెను.

అఖండముగ ధారాప్రాయముగ నున్న వాక్యమును విభాగింప నేర్పడినవి కావున విభక్తు లని పిలువఁబడినవి. ఆవిభక్తులు వాక్యాంతర్భాగము లగుటను బదవాచ్యము లగుచున్నవి. పదమున పదత్వము వాక్యావగమకము.

శ్లో॥ నహి కించి త్పదం నామ రూపేణ నియతం క్వచిత్ ।
పదానా మర్థరూపంచ వాక్యార్థాదేవ జాయతే- శాయనభాష్య॥

కారకప్రతీతిని బట్టి విభక్తు లేడని చెప్పుట శాస్త్రీయ మయ్యెను. జాతకభాగమున ద్వాదశభావము లిమిడ్చినట్లు సాహిత్యభాగమున సీసప్తవిభాగములను జేసిరి. ఇట్లు వేదకాలమునుండియు నున్నది. శాస్త్రపద్ధతియుఁ దర్శింప నట్లు విభక్తి యేర్పడు నని నిరూపితమగును.

ఇది యి ట్లుండ నాంధ్రభాషకు నరయనరయ విభక్తు లేడనుట సంస్కృ

తవ్యామోహాముగాని యొంటుగా దని యు విభక్తులు రెండై యాశ్రయాశ్రిత విభక్తినామకము లగు ననియుఁ గొంద ఱనిరి.

"Every Telugu grammarian has said that nouns have seven cases in Telugu as in Sanscrit. But it seems to me unreasonable to blindly follow Sanscrit in this respect" బులుసు పాపయ్యశాస్త్రి వ్యాకరణము. ఇట్లు వ్రాయుచుఁ గర్తృవిభక్తి యనియుఁ గర్మవిభక్తి యనియు రెండే విభక్తు లని యనిరి. కోరాడ రామకృష్ణయ్య M. A గారొక్క విభక్తియే య నియుఁ గ్రియాపదములు లేవనియుఁ జెప్పిరి. "ఈపదము లన్నియు సంబంధార్థద్యోతక మగుషష్ఠీవిభక్త్యంగమునకుఁ జేర్పఁబడుచుండుటచే షష్ఠి నొకవిభక్తిగాఁ దలంపవచ్చును." అని వ్రాయుచు "విశేషణవిశేష్యభావసంబంధమే యీభాషలలో (ఆంధ్రాదుల) వాక్యసంఘటనారీతి కాధారంబై లక్షణము గూడ నై యున్న దని యుఁ దెలియవచ్చుచున్నది." అని యు వ్రాసిరి. అన్నిభావములను నేఁడింటఁ గుదిగ్రుచ్చి యెట్లు పెట్టఁగల మనియు శంకించుచున్నారు. వీనికెల్ల సమాధానము నీసందర్భమున నీ నవకాశము లేదు.

అయినను సంప్రదాయములఁబట్టి యుంచుక్రమమును గొంతవిలోకింతము. అంతకుఁ గాని యాంధ్రభాషావిభక్తి తత్త్వమును సుగ్రహము గాదు.

విభక్తిసంఖ్యావాదమునకుఁ బండితుల చూపుహేతువు నరయుదము గీర్వాణమున శబ్దము లైయ్యెవిభక్తిరూపములఁ బొందునప్పు డత్యంతవికారమును బొందుచున్నవి. అట్లాంధ్రమున లేదని యందురు. ఏ. రామః-ద్వి. రామౌ. బ. రామాః- ఇత్యాదిరూపములలో రామశబ్దము తత్తద్వచనములఁ బ్రకృతిప్రత్యయసంశ్లేషవశతముభయభిన్నరూపమును బొందినట్లు తెలుఁగులోఁ బొందదు. ఇదియేపూర్వపక్ష మగుచో నిల్వదు. రామశబ్దము తరువాత వచ్చిన 'ః' 'ఔ' అః, అమ్, ఔ, అస్, ఇన, ఆభ్యాం, ఐః॥ అనునవి యుఁ బూర్వము పదములుగనే యుండియుండును రామసః, రామసౌ, రామౌ, రామః అని క్రమముగమాఱియుండెనేమొ! భాషాభావఘటనాసంప్రదాయ మిప్పటికిని"రామః సః దశరథపుత్రః-రాముఁ డతఁడు దశరథపుత్త్రుఁడు, అను రీతి గలదు. ధాతువులరూపమునందును బదములే ప్రత్యయములైనట్లు విజ్ఞులు తలఁచుచున్నారు. 'దా + స్య + తి' ఈ స్య యను నది ప్రాయికముగా "అస భువి, యా ప్రాపణే" అనుధాతుద్వయసమ్మేళనమువలనఁ బుట్టిన దని మన మూహింపవచ్చును. అని ప్రాకృతభాషోత్పత్తిలో వ్రాయఁబడియున్నది. అశ్వమద్గవ మిత్యాదు లిత

రత్ర వర్తించుచున్నట్లును జూపుచున్నారు. సంధిసంప్రదాయమును బట్టి శబ్దము మాఱవలసివచ్చుచున్నది. కాని పాళి, గాథ, మున్నగుప్రాకృతభాషలలోఁ జూడుఁడు. మాఱకయె కొంతవఱకు నున్నవి గీర్వాణమున 'రామ్' అనునది మాఱక యుండ నాంధ్రమున 'రాము' అనునది మాఱక యుండును. గీర్వాణమున స్థిరము హలంతము, నాంధ్రమున నజంతము స్థిరము విభక్తిప్రత్యయములు పరము లగునప్పుడే కాక యజాదిపదములు పరము లగునప్పుడును మార్పు గలదు.

రామ అనుజ్ఞ=రామానుజ్ఞ, రామ ఇతి=రామేతి, రామ ఏకము=రామైకము, రామఓదనము=రామౌదనము—"రామ్ అనుదానిహలంతమే మాఱకయున్నది.

రాము అనుజ్ఞ=రామునసుజ్ఞ, రాము ఇష్టము=రామునిష్టము, రాము ఏకము=రామునేకము, రాము ఓదనము=రామునోదనము. 'రాము' అనుదాని యజంతమే మాఱక యున్నది.

ఒక్కొక్కవచనమున కొక్కొక్కతెఱఁగైన ప్రత్యయ మున్న దందురా? అన్నింటను లేదు. గీర్వాణాదిభాషామర్యాదయే యాంధ్రమునకు ను గలదు. ప్రాకృతభాషాపదములరూపములు మున్నగువానియందును స్థిరరూపము గల శబ్దము లన్నివిభక్తులలోఁ జూతుము.

ఇఁకఁ గారకవిభాగమును బట్టి గీర్వాణమున నెట్లు విభక్తు లేర్పడెనో యాంధ్రమునను నట్లే యేర్పడును. ఆఱుకారకములకు నాఱువిభక్తులును సంబంధమునమష్టివిభక్తియు నుండెను. ఆంధ్రమున ననేకప్రత్యయము లొక్కవచనమునకుంట గీర్వాణవిరుద్ధ మందురా? గీర్వాణమునను గొన్నింటఁ గలదు. అయినను దత్తద్భావములకుఁ దత్తత్ప్రత్యయము లాంధ్రమున నుండ గీర్వాణమునఁ గారకేతరము లగునుపపదవిభక్తు లని ప్రత్యేకముగఁ బ్రత్యయభేదము లేకున్నను నర్థభేదములతో నున్నవి. కావున నవి కారకవిభక్తులు గాకున్నవి. "అత ఏవ చర్మణి ద్వీపినం హంతి దంతయో ర్హంతి కుంజరమ్,..."ఇత్యాదౌ నిమిత్తాదే రపి న కారకత్వం॥ అని కారకవాదార్థమున జయరామపండితులు నిరూపించిరి. దీనిఁబట్టి యాలోచింప గీర్వాణమువలె నిందును విభక్తివిభాగము సప్తసంఖ్యాకముగుట యుక్తియుక్తముగ నున్నది. మాఱను కావునను విశేషణవిశేష్యభావసంబంధ మున్నది కావునను నాంధ్రసంప్రదాయము వేఱు నరాదు. ఒక్కచోఁ దెలుఁగులో మార్పు వేఱొకచో గీర్వాణమున మార్పు

ను గలదు. విశేషణవిశేష్యభావసంబంధమే పదముల సంయోగమున (సమాసమున) నైన నుండు ననియే పెద్దల యభిప్రాయము. గీర్వాణమునఁ గన్పట్టు నేఁటిప్రత్యయములు పూర్వ మొకప్పుడు పదములే యగుటను (ప్రాకృతభాషోత్పత్తి నరయుఁడు) పదద్వయఘటన మెందున్న విశేషణవిశేష్యభావ మవశ్యభావి యగుటను నాంధ్రము గైర్వాణికమే.

అన్నిభాషలలో నేడు విభక్తు లుండవలయు నని నిర్ణయము గాదు కాని యార్యభాషల సంప్రదాయ మట్లుండు నని నానుడి.

The number of cases is different in different languages. There are five in the Greek, six in the Latin and there are said to be ten in the Armenian languages....It is perhaps unnecessary to observe, that there are some of the cases in the ancient languages which for particu- lar reasons cannot be represented by any prepositions. These are the nominative, accusative and vocative cases. ADAM SMITH.

పాశ్చాత్యభాషాశోధకులు విభక్తివైవిధ్యమును జూపుచుఁ బ్రథమయు ద్వితీయయు నుండవలసినట్లును వ్రాయుదురు. విభాగము సేయునప్పుడు క్రియాపదమును దదన్వయవ్యాప్తిని బట్టి యూహింతురు కావునఁ దత్తత్కారకములు సంగ్రహముగ నాలని యేర్పఱిచిరి. కారణనిరూపణము గలదు ఇది యదను గాని క్షమింపుఁడు. ఆంధ్రభాషాతత్త్వవిమర్శనములో విపులముగఁ జర్చింతును. ప్రాతిపదికస్వరూపము కర్తృపదముగ ను విశేషణముగ ను నుండుట ద్రావిడసంప్రదాయ మని యనుట కర్థము తెలియఁబడదు. వెండి—చెంబు అని యుదాహరించిరి. ఇట్లే గీర్వాణమునను గలదు మధు + రూపమ్-మధురూపమ్, చెట్టు + కొమ్మ—అయినట్లుగా లేదా?

విభక్తివిమర్శాయామలమునఁ గాని భాషావిష్కరణసామగ్రీసజాతీయతారతమ్య పరిశీలనమునఁ గాని యాంధ్రత్వ మార్యత్వమే ఇండోయూరోపియన్ భాషాతత్త్వమే యిందునుగలదు. డు, ము, వు, లిత్యాదులు విభక్తిప్రత్యయములు గాక యాదేశము లని యన్నచో నీవివాద ముండ దనుకొందును. దాని కేమి లెండు. ఆంధ్రవ్యాకరణకర్త లీవిభక్తుల జూపునపు డాయాప్రత్యయములఁ జెప్పుట కాని విభక్తినిష్ఠసప్తత్వముగాని గీర్వాణసంప్రదాయ మని యెఱింగియు విధించునపుడు గొంచెము లోపముగనే విధించిరి. ఈక్రిందియుదాహరణము లరయుఁడు.

ఆంధ్ర భాషా భూషణములో —

క. సుతుఁడు సుతు సుతునిఁగనియెన్, సుతుచేతన్ సుతునిచేత సుతునకునిచ్చెన్
సుతునికిని సుతునివలనన్, సుతువలనన్ సుతునిధనముసుతుధనమొందెన్.

తత్సుపదాంతంబులగు సప్తవిభక్తుల యేకవచన రూపము లని చూపెను ఇట్లే బహువచనమునను రూపము లిచ్చెను ఇందుఁ బ్రధానము విభక్తిపదములఁ జూపుటయేకదా ; సుతుఁడు ప్రథమ-సుతు- సుతుని ద్వితీయ-సుతు చేతన్, సుతునిచేత తృతీయ-సుతునకున్, సుతునికిని చతుర్థి-సుతునివలనన్, సుతు వలనన్ పంచమీవిభక్తి.

ఇంచాఁక నీయఁబడిన యుదాహరణము లించుమించు నేఁటి మనపద మర్యాదకు సరిపడి యున్న దనవచ్చును. కాని “కై, కొఱకు” లపయి దృష్టి నిలుపక “కిన్, కున్” లను జతుర్థీప్రత్యయములుగఁ జెప్పెను. అయినను జూపి నయుదాహరణములను విభక్త్యంతములతోఁ (ప్రత్యయములతో) జూపెను. కాని “షష్ఠీవిభక్తి” నుదాహరించునప్పు డట్లుదాహరింపఁడు. షష్ఠీవిభక్తి ఏ. సుతునిధనము సుతుధనము, బ. సుతులధనము.

అని యుదాహరించెను. ఇందు షష్ఠ్యంతపద మేదని భావించెను. ధనము ప్రత్యయము కాదుగదా? ఇఁక నీవైయాకరణుని భావమేమి? ‘సుతుని, సుతుల, ననునవియే షష్ఠ్యంతపదము లని భావించెను ఇట్లే, వృక్షముతుది, తల పెండ్రుక, (తలలకు—కు, షష్ఠికిఁ జూపెను) కరికుంభము, కూఁతులధనముల్, నీధనంబు, అన్నింట నుదాహరించెను. వృక్షము, తల, కరి, కూఁతుల, నీ, అనునవియే షష్ఠ్యంతము లగు పదము లని భావించి యుండనోపును ఇతరవి భక్తులకుఁ బ్రత్యయములఁ జూపుచు షష్ఠిమాత్రము ధనవంతము గానేల? షష్ఠి వ్యస్తముగ నుండ దని యాశయమా? ‘తలలకు’ అని యొకఁడొక యుదా హరణము గలదు కావున మన మనుకొను “నీ” ఇత్యాదిప్రాతిపదికములు షష్ఠీ విభక్త్యంతము లనియే తలంపవలయును. షష్ఠీద్వితీయాతుల్యా, అను చింతా మణి సూత్రసందర్భమునను అహోబలపతి “రామునిగుణములు, రాముగుణ ములు, రాములగుణములు” అని యుదాహరించి యకృతవ్యూహ పరిభాషా ధా రమున మకారోపర్యుకారము విభక్తినిమిత్తక మయ్యు విభక్తిలోపమున లుప్తము గాదని సాధించెను. సూత్రమునందు “తత్పురుషసంస్థితా” అనియుంట “రాము గుణము”లనునది సమాసమనియే యభిప్రాయ మగుచున్నది. కావ్యాలంకార

చూడామణియుఁ దత్సదృశాభిప్రాయమునే సూచించును. కాని యతఁడు ప్రత్యయములను బదములుగఁ జెప్పెను.

క. పదముతుదవలన ననియెడు, పదముండిన బంచమీవిభక్తి య... షష్ఠీవిభక్తికి 'కు' శబ్దము వచ్చు నని యనెను. కానిమ్మని యేదో వ్యాకరణము వ్రాయుదమని భావించినట్లుగనే వ్యాకరణము వ్రాసిరి కాని యొక మర్యాద నియమించుకొన్నట్లు గానము. అహోబలపండితీయమున 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అను దాని వ్యాఖ్యానమునం దిట్లున్నది. "తత్పురుష సమాసే మిశ్రసమాసక యోశ్చ విభక్తిసంబంధినః ద్రుతస్య లుక్స్యాత్ – అతని యాకృతి, రామునిగుణములు, వారలయాకృతి, సీతారాములప్రాపు, ఇత్యాది తత్పురుషమిశ్రతత్పురుషౌచ- అని యున్నది. అతనియాకృతిలో నెందో ద్రుత మున్నదఁట? ఆద్రుతమునకు లోపము చేయఁబడిన దఁట అయినను దీనిని సమాసమే యనియెడు. వ్యస్తమును నొకదో నగునని యుఁ జూపి యుండెను. "నను 'నెలఁతముద్దుమోము నెఱికురుల్ గుబ్బలు, ఇత్యాది ప్రయోగే వ్యస్త సమాసేఽపి షష్ఠీ ద్వితీయాతుల్యైవ వర్తతే. తత్ర కిం మూల మితిచేత్ మహాత్ములైన భూపతులయు విప్రముఖ్యులసభ క, ఎవ్వని యేనిమునామృతాంశు బింబంబున "ఇత్యాద్యాచార్యవచనమేవ మూలమ్" అని వ్రాసి యెట్టకేలకు భారతప్రయోగమే దీని కాధార మని నిర్వచించెను. ఏనిపదవ్యవధాపిత మగుట చేతనే "ఎవ్వని" యనునది వ్యస్తపదమని నిర్ణయించెను. అప్పకవి నృసింహకవి, మున్నగువా రట్లు వ్యాఖ్యానము చేయక యింకొకరీతిఁ జేసిరి. అప్పకవి.

గీ. వనధితన యేశయైనటువంటి యనుచుఁ
బరపదవిశేషణము తేటపఱచుకొనుచుఁ
దొలుతటిపదంబు కొననుండు ద్రుతము గుడియు
సమసనమునందుఁ జెందు లోపములు కృతుల.

ఉదా. కమ్మనిదావి-కమ్మదావి, ఇత్యాదులు.

శ్రీపావనంది రామశాస్త్రిగారు చూపినయుదాహరణములలో నొకటి మాత్రము చక్కఁగనే యున్నది.

కవిసంశయవిచ్ఛేదకర్త యొండొకరీతి విధించియున్నాఁడు. భుజాటోప భయంకరుఁ డర్జునుకోపానలము" అను భారతప్రయోగమును జూపెను. అర్జును-

అనున దెట్టిపద మని యెంచియుండును? "ప్రాగ్రసరుండు ధర్మజునిపంపు" ము న్నగుప్రయోగములఁ జూపెను.

క. అగు నను క్రియతోఁ బాసియుఁ, దగుఁబెక్కువిభక్తులం బ్రథమఁ జెందును భ
క్తగణదయమానచిత్తుం, డగజాధిపు కీర్తి దిశల నలమె ననంగాన్.

అని లక్షణము చెప్పియుండెను. తనచూపినలక్ష్యము "భక్తగణదయమానచిత్తుం డగజాధిపుకీర్తి" చూడుఁడు అగజాధిపు-వ్యస్తమా సమస్తమా? "అగు, నను నది క్రియయా? ఇందలిషష్ఠి తత్పురుషగత మనియు, సామర్థ్యభేదముచే సంబంధాన్వయమున సాధింత మన్న వేఱొకచో వ్యస్త మని యుహాలోబలపతి చూపియున్నాఁడు. ప్రాతిపదికప్రత్యయములకును వ్యవధాన మున్నట్లు కొందఱు తలంచుచున్నారు. ఇన్నిసందేహములు గల్గి యున్నది.

గీ. మహినకారాంతములు తత్సమంబుసేయు
నెడలఁ బ్రథమకు వచ్చు "డుల్" చెడు సమాస
ములను నొక్కెడ ఘనుసేయుపుణ్య మనిన
నదియె కొందఱు షష్ఠియం చంద్రు శర్వ.

అని సర్వలక్షణసారసంగ్రహకర్త యనెను సమాస మనుచున్నాఁడు, కాని "డుల్" చెడు ననుట కర్థమేమి? దీనినే షష్ఠియందు రఁట. తా నే మనెనో! ప్రథమాతత్పురుష సమాస మనునా? ప్రథమావిభక్తి యనునా? సమాసమున "డుఙ్" చెడు ననుట సమాసమనియే యర్థము గదా! వీని నెల్ల సమాసము లనియు నీతత్పురుషమును సామర్థ్యలక్షణముచే నన్వయించుటయే సుఖమార్గము.

---

# పిడుపర్తికవులు.

—బండారు తమ్మయ్యగారు—కాకినాడ.

చ. కులగురుఁ డైనపాల్కురికి కోవిదునందలి భక్తిపెంపుని
స్తులగతిఁ జాటి యాఘనుఁడు చూపినత్రోవను వీరశైవమ
త్యలఘుగతిం జరింపఁగ నుదారకృతుల్ వచరించినట్టి ధ
న్యులఁ బిడుపర్తిసత్కవుల నూర్జితభక్తిని సంస్మరించెదన్.

ఆంధ్రదేశమున వీరశైవవాఙ్మయాభివృద్ధికిని అందుమూలమునఁ దన్మతవ్యాప్తికిని పాటుపడిన వారిలోఁ బాల్కురికి సోమనాథుని తరువాతఁ బేర్కొనఁ దగినవారు పిడుపర్తికవులు. వీరు సోమనాథునిశిష్యప్రశిష్యకోటిలోఁ జేరి కులగురువుగా నాతనిని దమకృతులలోఁ బ్రశంసించి యాతనియెడ నపారగౌరవమును బ్రదర్శించినవారు. ఆంధ్రవీరమాహేశ్వరులలోఁ(జంగములలో) బురాతను లనియు, నూతను లనియు, విభేదమొకటి నేఁటికిని పాటింపఁబడుచున్నది. పురాతను లనఁగా ననాదినుండియు దేశమందున్న సహజవీరశైవులు. నూతను లనఁగాఁ దరువాతఁ దరువాతఁ బురాతనులనుండి వీరశైవదీక్షను బడసి యా మతములోఁ జేరినవారు. పాలకురికి సోమనాథుఁ డీపురాతనశాఖకుఁ జేరిన సహజవీరశైవుఁ డని నాయభిప్రాయము. పిడుపర్తివారు మొదట నాంధ్రనియోగిబ్రాహ్మణులు. వీరిపూర్వులు పాల్కురికి సోమనాథునివలన దీక్షను బడసి యజ్ఞోపవీతాదులను త్యజించి వీరశైవమతములోఁ జేరినవారు. అందుచేతనే తమకును సోమనాథునకును నడుమఁ దరతరములు గడచినను, ఈపిడుపర్తికవులు కులగురువుగా నాతని దమగ్రంథములలోఁ జెప్పికొనియున్నారు. ఈపిడుపర్తివారే గాక మఱి యిట్టిబ్రాహ్మణులు, చిలువూరు, మున్న, చదువుల, మొదలగు గృహనామములు గలవారు మొత్త మఱువదియాఱుకుటుంబములవారు వీరశైవులలోఁ గలిసిపోయి నేఁటి యాంధ్రవీరమాహేశ్వర (జంగము) శాఖలో నఱువదియాఱిండ్ల సంప్రదాయమువా రని పరిగణింపఁబడుచున్నారు. పురాతనులకును వీరికి సంబంధబాంధవ్యములలోను గౌరవప్రపత్తులలోను గొన్నిపట్టింపులు గూడఁ బాటింపఁబడుచుండినట్లు వినియున్నాను. రానురా నీదేశమున వీరశైవసంఘము క్షీణించుచు రాఁగా సంబంధబాంధవములలోఁ గలుగునిబ్బందులచే నేఁటి కీవిభేదము చాలవఱకు నశించి విస్మృతప్రాయ మయినది. బస

వపురాణపీఠికలో (ఆంధ్రగ్రంథమాలాప్రచురము పుట 77) బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారీయుభయపదియారాధ్యకుటుంబములవారిసంగతి కొంత తడవినారు. కాని వీరు స్వీకరించినది యారాధ్యబ్రాహ్మణమత మనియు నేఁటి యాంధ్రదేశపుటారాధ్యబ్రాహ్మణకుటుంబములవారికుటుంబము వారల సంతతియై యుందురనియు నపభ్రమల పాలయి "తెలుఁగునాఁటియారాధ్యులు వీరశైవులు గారు పారిపూర్వులు లింగధారులు గారు. కృష్ణదేవరాయలకుఁ బూర్వ మాంధ్రదేశమున నారాధ్యబ్రాహ్మణులు లింగధారులయి యుండిరనుటకుఁ బ్రబలాధారములు గలవేమో పరిశోధింపవలసియున్నది." అను నపసిద్ధాంతముల నెలకొలిపిరి. వీరియీసిద్ధాంతములను శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారు తమశైవరహస్యబోధినీపత్త్రికలోఁ బ్రకటించిన బసవపురాణపీఠికా విమర్శనములోఁ గొంత ఖండించియున్నారు. తక్కినగ్రంథములమాట యెట్లున్నను, పాలకురికి సోమనాథుని బసవపురాణపండితారాధ్యచరిత్రములను బట్టియే బసవేశ్వరునికాలమునాఁటికే లింగధారణమునొందిన యారాధ్యబ్రాహ్మణశాఖ యొకటి యాంధ్రదేశమున నుండినట్లు స్పష్టముగాఁ దెలియఁగలదు. మల్లికార్జునపండితుఁడును, పండితారాధ్యచరిత్రశ్రోత యగు పాల్కురికి సూరనామాత్యుఁడును నీశాఖకుఁ జేరినవారే. మల్లికార్జునపండితుఁడు లింగధారి కాఁడనియుఁ బాశుపతమతస్థుఁ డనియు శ్రీప్రభాకరశాస్త్రిగారు తలంచుట యకారణము తప్ప వేఱు కాదు. ఈ తెలుఁగునాఁటి యారాధ్యబ్రాహ్మణశాఖ ప్రభాకరశాస్త్రిగారూహించినంత నవీనముగాని నాగలింగశాస్త్రిగారు చెప్పినంత పురాతనముగాని కాదని నాయాశయము. ఇందుఁగూర్చిన నాయభిప్రాయములు నేరచింపఁబోవు "తెలుఁగునాఁటియారాధ్యులు" అను మఱియొక వ్యాసమున వివరింపఁబడును. శ్రీవీరేశలింగముపంతులుగారు విషయవిమర్శనము సరిగా నొనర్పక పిడుపర్తి సోమనాథాదులు శైవబ్రాహ్మణులని తమ కవులచరిత్రమునందు వ్రాసిరి. అది పొరపాటు. నేను పైని జెప్పినట్లు పిడుపర్తివారు వీరశైవదీక్షను బడసి జంగములలోఁ గలిసిపోయిన నియోగిబ్రాహ్మణులు కాని, యారాధ్యబ్రాహ్మణసంప్రదాయమునకుఁ జెందినవారు కారు

ఈపిడుపర్తివారివంశచరిత్రము మనకుఁ గొంతవఱకుఁ బిడుపర్తి సోమనాథకవి రచియించిన పద్యబసవపురాణావతారికను బట్టి తెలియఁగలదు. వీరిపూర్వులసలు పిడుపర్తిగ్రామకరణములో, వాస్తవ్యులో యగుటచే వీరికిఁ

పిడుపర్తి వారనుగృహనామము గలిగినట్లు లూహింపఁదగియున్నది. ఈపూర్వులలో, పిడుపర్తి శివరాత్రికొప్పయ్య యనునతఁడు పాల్కురికి సోమనాథునివలన దీక్షనొంది యాతనికి శిష్యుఁడుగా నుండెను. అప్పుడు సోమనాథునిశిష్యకోటిలోఁ జేరిన యిందులూరి యన్నయ్య కాకతిప్రతాపరుద్రునొద్ద మంత్రిగా నుండెను. ఆతఁడు ప్రతిదినము నిత్యవ్రతముగా నెనమండ్గురు మాహేశ్వరుల నర్చించుచుండెడివాఁడు. తద్వ్రతప్రీతిగాఁ రాజుతోఁ జెప్పి తనశిష్యుల కొక గ్రామ మిప్పింపు మని సోమనాథుఁ డానతీయఁగా వారికతఁడు దోకిపర్తి గ్రామ మిప్పించెను. అప్పటినుండియు సోమనాథునిశిష్యులలో పైని జెప్పిన కొప్పయ్య మున్నగు నెనమండ్గురు నాగ్రామమున నివసించుచుండెడివారు. ఈకొప్పయ్య పుత్రుఁడు పిడుపర్తిలో సోమనాథుని పేరను-ప్రాకారము, పూఁదోఁట, బావియు నేర్పఱిచెను. తరువాతఁ గారణాంతరములచే దోకిపర్తి గ్రామమునకు భంగము కలుగఁగా నీబసవయ్య జ్యేష్ఠపుత్రుఁడు సోమయ్య ప్రౌఢరాయమహీధవునివలన నాగ్రామమును మరల బడసెను. ఈసోమయ్యకు ద్వితీయ పుత్రుఁడు దేవయ్య-అతనికి సోమయ్య, బసవయ్య యను నిరువురు పుత్రులుదయించిరి. వీరిలో రెండవవాఁడగు బసవయ్యయే పద్యబసవపురాణకర్తయగు సోమనాథునితండ్రి. ఈతనియానతిమీఁదనే సోమనాథుఁడు పాల్కురికి సోముని ద్విపద బసవపురాణమును బద్యకావ్యముగా నొనర్చి యాసోమునకే యంకితమొసంగినాఁడు.

వీరివంశమువారు తరతరములనుండి కవులుఁ బండితులుఁ గా నున్నను మన మెఱిఁగినంతలో వీరిలో ముఖ్యులైనకవులు ముగ్గురు. (1) పిడుపర్తి దేవనార్యునిపుత్రుఁడు బసవకవి (2) ఈబసవకవి ప్రథమపుత్రుఁడు సోమనాథకవి. (3) బసవకవి ద్వితీయపుత్రుఁడగు పాలనార్యుని కుమారుఁడు బసవప్ప. వీరిలోఁ బ్రథముఁడగు బసవకవి వీరశైవదీక్షాబోధ, పిల్లనయనారుకథ, బ్రహ్మోత్తరఖండము మున్నగుద్విపదకావ్యముల రచియించెను వీనిలో దీక్షాబోధమాత్రము ముద్రితమయి యిప్పుడు ప్రచారములో నున్నది. ఇది కెరెయ పద్మరసు కన్నడములో రగడలుగాఁ జెప్పిన కృతికి ద్విపదరూపమునఁ జేయఁబడిన యాంధ్రానువాదము. గురుశిష్యసంవాదరూపమున వీరశైవమత తత్త్వమును గురుశిష్యలక్షణములను దీక్షావిధానాదికములను దెలుపు నుత్తమ గ్రంథము బసవకవి దీనిని సూర్యవంశజుఁడగువీరకాణావనీశుని మరుమఁ

డును, తిమ్మభూవిభుని పుత్రుఁడును వీరశైవాచార ధౌరేయుఁడును నగు వీర భూపాలునియానతిచే రచించి యాతనికే యంకిత మొసంగెను. వీరభూపాలుని కాలము గాని, యాతఁడు రాజ్యము చేసిన దేశము వివరము గాని గ్రంథమువలనఁ దెలియుటలేదు. ఈకవి రచించిన కృతులలో నిదియే కడపటి దనియు, పిల్లనయనారుచరితము మున్నగునవి యింతకుఁ బూర్వమే రచియింపఁబడిన వనియు నీగ్రంథావతారికలోని క్రిందివాక్యములవలనఁ దెలియఁగలదు.

"పిన్నప్రాయమునఁ జెప్పితి శివకథలు-ప్రన్నని తెనుఁగునఁ బలికితిఁ గొన్ని
నడివయసునఁ బిల్లనయనారుచరిత- నుడివితి ద్విపదగా నూతనోక్తులను
కాలమాసన్నంబుగాకటమున్నె- లాలిత కావ్యకళాప్రౌఢి పేర్మి
సకలాగమపురాణసమ్మతమైన- యొకశివకథ నింక నొనరింపవలయు."

పిల్లనయనారు అనునతఁడు జైనబౌద్ధమతముల నిర్మూల మొనర్చి కులోత్తుంగచోడుఁడు, సుందరపాండ్యుఁడు మున్నగు భూపాలురను శివభక్తిపరులఁ గావించి శైవమతవ్యాప్తి యొనరించిన మహాభక్తుఁడు. ఇతఁడు శ్రీకాళియను పురమునఁ గుమారస్వామియంశమున నొకశివబ్రాహ్మణునకుదయించినవాఁడు. ద్రవిడవాఙ్మయమున నితనినే తిరుజ్ఞానసంబంధి యని వ్యవహరింతురు. ఈతని చరిత్రము బసవపురాణమున షష్ఠాశ్వాసములో సంగ్రహముగ వర్ణితమయి నది బసవకవి దానినే విస్తరించి ప్రత్యేకకావ్యముగా రచియించియుండును. బ్రహ్మోత్తరఖండము స్కాందపురాణఖండములలో నొకటి పట్టమట్ట సోమనాథకవియు, శ్రీధరమల్లె వేంకటరామకవియు దీని కొనర్చిన పద్యాంధ్రీకరణములు కవులచరిత్రమున కెక్కినవి కాని యీబసవకవిచరిత్ర మాగ్రంథమునఁ జేరకుండుటచే నీపద్యకావ్యములకు ముందే బసవకవి దీనిని ద్విపదరూపమునఁ దెలిఁగించియుంట లోకమెఱుఁగదు. పద్యబసవపురాణపీఠికలో (ఆ. ౧ ప. ౭౩-౭౮) నీబసవకవి యిట్లు వర్ణింపఁబడినాఁడు.

సీ. "గురునాథుఁడగు పాలకురికి సోమేశుండు చెప్పినకృతులెల్ల నిష్ఫాడమని
ప్రకటింపవచ్చిన ప్రత్యక్షబసవేశుఁ డని భక్తజనములు సన్నుతిసేయ
భక్తిమర్మములు దప్పకయుండ నర్థముల్ చెప్పి శిష్యులను రక్షింపనేర్చి
యొనర దీక్షాబోధయును బిల్లనయనారు కథయు బ్రహ్మోత్తరఖండము నను
నాదిగాఁ గల శివరహస్యములు పెక్కు, శివకవులు మెచ్చ ద్విపదలు చేసి భక్త
సభల వెలయించి మించిన సజ్జనుండు, బంధుసురమణి పిడుపర్తి బసవకవి"

సీ. ద్రవిడకర్ణాటాంధ్ర యవనభూములఁ జెల్లు గొన్నాఁడు పెక్కులు సన్నుతముగఁ
దలయెత్తినది మొదల్ ధరఁ గల్గుదుర్గాధిపతులచేఁ బూజలు వడసినాఁడు
కాలకంధరుని షట్కాలంబు పూజించుఁ బంచాక్షరి జపించుఁ బాయ కెపుడు
భవిపాకవర్జిత ప్రవిమలవ్రతుఁ డన్య మంత్రాంగదాహముల్ మానినాఁడు
కవితభవులకుఁ జెప్పని సవినయుండు, సాధుజనములఁ బ్రోవఁ బాల్పడ్డవాఁడు
నిత్యజంగమపూజనాన్వితసుబుద్ధి, వశమె పొగడంగఁ బిడుపర్తిబసవఘనుని.

(2) పిడుపర్తి సోమనాథకవి.

ఈతఁడు బసవకవిప్రథమపుత్రుఁ డని వెనుకఁ జెప్పియుంటిని ఇతఁ డష్టభాషాకవితాప్రవీణుఁడు. ఈతఁడు రచియించినగ్రంథములలో ముఖ్యములును, ముద్రితములు నైనవి, (1) పద్యబసవపురాణము. (2) ప్రభులింగలీల (ద్విపద) మొదటిది పాల్కురికి సోమనాథుని ద్విపదబసవపురాణము ననుసరించి తండ్రి యానతిచే నీతఁ డొనర్చిన పద్యకృతి యని వెనుక నే చెప్పియుంటిని. రెండవది కన్నడములో, చామరసు, అనునతఁడు రచించిన వచనములఁ బట్టి ద్విపదరూపమునఁ గూర్పఁబడిన యుత్తమకావ్యము ఇందు బసవేశ్వరుని కాలమున వెలసిన యల్లమప్రభువను నిర్వికారనిర్గుణమూర్తియొక్కలీలలు వర్ణింపఁబడినవి. వేదాంతగ్రంథములలో ప్రభులింగలీలను బోలినది లే దని పలువురు తత్త్వజ్ఞుల యభిప్రాయము. ఇందలి భాగములకు గతు లనిపేరు. అల్లమప్రభుని లీలలిందు 25 గతులుగ వర్ణింపఁబడినవి. సోమనాథుఁడు దీనిని-చిఱుతొండనంబి వంశజుఁడగు నెల్లూరిరామలింగయ్య యను వైశ్యశిఖామణిప్రేరణమున నాతనిదీక్షాగురుఁడును దక్షిణామూర్తి యవతారము నగు శ్రీసిద్ధవీరేశ్వరుని స్తుతిపూర్వకముగ రచించినాఁడు. అవతారికయందలి క్రింది వాక్యములవలన గ్రంథస్వరూపమును దానిప్రాశస్త్యమును జదువరులకుఁ గొంత గోచరము కాఁగలదు.

"ప్రభులింగలీలకుఁ బ్రతిచెప్పనేది-యథవు భక్తిస్థితి కది మూలవాల
మజ్ఞానతమమున కదియె దీపంబు - విజ్ఞానమున కది విహారణపీఠము
అదిషట్స్థలజ్ఞప్తికావాసభూమి - అదిశివయోగవిద్యానిధానంబు
సదమలసౌభాగ్యసదనంబు నదియుఁ - జిదచిద్వివేకవిశేషంబు నదియు
... ... ... ... ... ...
మఱియిది యొక కావ్యమాత్రంబు గాదు - వఱలెడు గురుగుహేశ్వరలింగమూర్తి
లీలావిహారంబు లెస్సగా భక్తు - లాలింపుఁడిందు మోక్షవాప్తియగును

ప్రౌఢ్వశోకము విని పోయెడు వట్టి – సుద్దులు గావు విశుద్ధమై విన్నఁ
దనుమనోధనములతగులూడ్చిశివుని – నెనయుమహోపాయమిదియనివినుఁడు
అన్నదమ్ములును బోట్లాడిన సుద్దు – లెన్నఁడు కథలు గా వింతుల తోడి
విషయభోగంబుల వెతల వర్ణించు – విషమకావ్యము గాదు వివరించిచూడఁ
గడుపుకక్కుర్తికిఁ గర్మకాండంబు – తడయక పెక్కు తంత్రంబును గాదు
రణ మింద నంతఃకరణములతోడ – ఘణికన్యతోడిసంబంధంబు సురత
మల చిదాకాశమయత్వంబు తృప్తి – పిలసిల్లు నీశ్వృతి వేడ్కతో వినుఁడు
సచ్చరిత్రుల సుప్రసంగంబు గాని – నిచ్చనిచ్చలు జన్మనీరధిం గూలి
పొరలుచు దరిఁజేరఁ బోలేనిహీన – నరకీటకముల వర్ణన మిదిగాదు
కర్మాంధకారసంగతిఁ జిక్కి శైవ – ధర్మంబెఱుంగక తమయిచ్చ నడుచు
దుర్మదాంధులఁ జెప్పు దుష్కథ గాదు – నిర్మలశివభక్తినిశ్రేణి మఱియు
భుక్తిముక్తులనిచ్చు పుణ్యపణ్యంబు – భక్తులాలింపుఁడీ ప్రభులింగలీల"

"ఈహితానుషంగ! యేకామ్రగురుచిత్త, నళినభృంగ సోమనాథలింగ" అనుమకుటముతో పాలకురికి సోమనాథకవి కంకితముగా నాతనిశిష్యప్రశిష్య కోటిలోఁ జేరిన యొకకవిచే రచింపఁబడిన అన్యవాదకోలాహల మనుశతక మొకటి ముద్రిత మయి ప్రచారములో నున్నది అందు గ్రంథకర్త పేరు గానరాదు. శ్రీ శేషాద్రిరమణకవు లది పిడుపర్తి సోమనాథకృత మని వ్రాసిరి, కాని, యందుల కాధారము మృగ్యము. శతకకర్త పిడుపర్తివారికుటుంబములోనివాఁడే కాఁదగును గాని యతఁడు సోమనాథుఁడే యని నిర్ధారింప వీలుఁ లేదు ఇందుఁ గూర్చి దుందుభిసంవత్సరములో ఆంధ్రపత్రికాసారస్వతానుబంధములో నేను వ్రాసిన "పిడుపర్తి సోమనాథకవి అన్యవాదకోలాహల కర్తయా ?" అనువ్యాసమును జిత్తగించునది.

### (౩) పిడుపర్తి బసవప్ప.

ఇతఁడు పైని జెప్పిన సోమనాథకవితమ్ముఁ డగుపాలనార్యునిపుత్రుఁడు. ఈతఁడు పూర్వోక్త మయిన ప్రభులింగలీలనే సోమనాథుని ద్విపదకావ్యము నుబట్టి యయిదాశ్వాసములపద్యకావ్యముగా రచియించి, భృంగిరిటిగోత్రుఁడు వీరశైవాగ్రగణ్యుఁడు నగుచల్లపల్లి మల్లయారాధ్యున కంకిత మొనర్చెను. కవి శైలి తెలియుటకయి యిట నొకటి రెండుపద్యములను మాత్ర ముదాహరించెదను

"గద్దరియంత్రము నెచ్చెలులు కార్యముఁ జెప్పిన రాజు విన్న నా
పద్దశ, భూమిలోన నగుఁబాటగుఁ గూటమి నిందచెందు, నీ
సుద్దులఁ దోడిభామిను లసూయమొదర్తు రెఱింగి రేని యీ
మద్దెలకాఁడు నన్నును భ్రమంపడఁజేసెను బాపు దైవమా !
పరువడి సాధుసంగతులఁ బాయక, నిత్యము రోగపీడలం
బొరయక, దుఃఖముల్ సుఖముఁ బోఁడిమినొక్కటి చేసి, తిట్టినన్
విఱుగక ప్రస్తుతించినను వేడుకచెందక, సౌమ్యబుద్ధితోఁ
దిరిగెడు భక్తమండలికిఁ దేకువ మోక్షము గల్గువందెనా !"

ఇతనియాశ్వాసాంతగద్యవిధము నీదిగువ నుదాహరించెదను. "ఇది శ్రీమత్పాలకురికి సోమేశ్వరవరప్రసాదలబ్ధ కవితాచాతుర్య ధుర్య పిడుపర్తి పాలయాచార్యసత్పుత్ర కులపవిత్ర బసవప్పనామధేయప్రణీతం బైన ప్రభులింగలీల యనుశివజ్ఞానమహాప్రబంధంబునందు............... ''

కాలము:—పాల్కురికి సోమనాథకవి మొదటిప్రతాపరుద్రుని కాలమున ననఁగా క్రీ॥ శ॥ 1190 ప్రాంతమున నున్నవాఁడని నిర్వివాదముగ నిర్ధారణ మయిన విషయము. పద్యబసవపురాణావతారికను బట్టి సోమనాథునిశిష్యుఁడయిన శివరాత్రి కొప్పయ్యకును పిడుపర్తి బసవకవికిని నడుమ మూఁడుతరముల యంతరము మాత్రమున్నట్లు కనఁబడును. దీనినిబట్టి తరమునకు 40 సం॥ చొప్పున గణించినను పిడుపర్తి బసవకవికాలము రమారమి క్రీ॥ శ॥ 1400 ప్రాంతమగును, కాని, యది సరికాదు. ఈబసవపురాణావతారికలో నొకపద్యమున శ్రీనాథుని నైషధఖండితారాధ్యచరిత్రములు పేర్కొనఁబడినవి. అందుచే బసవకవియు నాతనికుమారుఁడు సోమనాథకవియు శ్రీనాథునితరువాత నధమపక్షము 50, 60 సంవత్సరములకు, అనఁగా, క్రీ॥ శ॥ 1500, 1520 ప్రాంతమున నుండియుందు రనుట సమంజసము. కావున బసవపురాణావతారికలోఁ జెప్పఁబడిన వంశానుక్రమము సరిగాదని తలంపనగును.

క "ధరఁ బాలకురికిసోమే, శ్వరగురుకారుణ్యహస్తసంభవుఁ డగుటన్
గురుదత్తలింగభావాం, తరుఁడై శివరాత్రి కొప్పనాథుం డొప్పెన్.
క. ఆకొప్పయ్యకుఁ బుణ్య, శ్లోకుఁడు బసవయ్య పుట్టెసోమేశునకున్
జోకఁ బిడుపర్తిలోపలఁ, బ్రాకారముఁ బుష్పఁదోఁట బావిఘటించెన్."

అనుపద్యములలో 'ఆకొప్పయ్యకు' అనుపదమునకు ఆకొప్పయ్య

వంశమున నని యర్థమూహింపఁదగు నని నాయభిప్రాయము. దీక్షాబోధకృతిపతి యగు వీరభూపాలునియొక్కయు, ద్విపదప్రభులింగలీల రచియింపించిన నెల్లూరి రామలింగయ్యయొక్కయుఁ గాలము తెలిసిన నీకవులకాలమును సులువుగా నిర్ణయింపనగును. కాని యందులకుఁ దగినయాధారములు గానరావు.

దేశము:—వీరిపూర్వులనివాసస్థల మగు పిడుపర్తియు వారగ్రహారముగాఁ బడసిన దోకిపర్తియు నిజాము రాష్ట్రస్థము లని తలంచి శ్రీశేషాద్రిరమణకవులు పిడుపర్తి సోమనాథునిఁగూర్చి వ్రాయుచో నాతని నిజాము రాష్ట్రికునిగాఁ బరిగణించిరి. కాని యాగ్రామము లారాష్ట్రమున నేజిల్లా యేతాలూకాలో నున్నవో వివరింపరయిరి. ఈగ్రామము లచ్చటివే యైనచో వీరి నారాష్ట్రికవులుగా గణించుట కెట్టియభ్యంతరము నుండనేరదు కాని వీరికులగురుఁ డగు పాల్కురికి సోమనాథుఁడు నిజాము రాష్ట్రీయుఁ డయిన కారణమునుబట్టి యైనచో మాత్రము వీరుఁగూడ నారాష్ట్రీయు లే యని తలంపరా దని నాయభిప్రాయము వీరివంశీయు లని చెప్పికొను వారు జంగము లిప్పుడు గుంటూరుమండలములో కనగాల, గరుడాచలపాలెము మున్నగుగ్రామములలో నున్నారు మఱియు నీమండలములోనే తెనాలితాలూకాలో పిడుపఱ్ఱు, అనుగ్రామ మున్నది. డోకిపఱ్ఱు, దోకిపఱ్ఱు అను నామములుగల గ్రామములు కూడ నాప్రాంతముననే మొదటిది కృష్ణామండలములో గుడివాడతాలూకాలోను రెండవది గుంటూరుమండలములో సత్తెనపల్లితాలూకాలోను నున్నవి పద్యప్రభులింగలీల కృతిపతి యగుచల్లపల్లి మల్లయారాధ్యుఁ డాగ్రంథమున, "చల్లపలిశాసన! వైభవపకశాసనా" అని సంబోధింపఁబడినాఁడు. చల్లపల్లి యనుగ్రామము కూడఁ గృష్ణామండలములో నున్నది. వీరివంశీయుల మని, చెప్పికొనువారు తెనాలితాలూకాలోని పిడుపఱ్ఱు, అనుగ్రామము తమపూర్వుల కగ్రహారముగా నొసంగఁబడె నని చెప్పుచున్నారు. కొండవీటిదండకవిలెలో నుదాహృతములయిన మొదటి ప్రతాపరుద్రుని శాసనములలో నొకదానిలో "సోమనారాధ్యగురవే పిడుపర్తిపురం దదౌ" అని యున్నది. ఆశాసనముననే మఱికొందఱితరులకు దాన మొసంగఁబడినట్టు లుదాహృతము లయిన ధరణికోట, ఇక్షుపురి (చెరుకూరు) మున్నగు గ్రామములు కూడ నాప్రాంతముననే గుంటూరుమండలములో నున్నవి. అందుచేఁ బాలకురికి సోమనాథుఁడు ప్రతాపరుద్రునివలన నగ్రహారముగా నొందిన పిడుపఱ్ఱు తెనాలితాలూకాలోనిగ్రామమే

యనియు దాని నాతఁడు శివరాత్రి కొప్పయ్య మున్నగు తనశిష్యుల కొసంగఁ
గా వారచ్చట స్థిరనివాస మేర్పఱచికొని యుండు రనియు, ఆకారణముననే
వారియింటిపేరు, తరువాత, పిడుపర్తివా రని మాఱి యుండు ననియు నేఁ దలం
చుచున్నాను—ఇత్యాది కారణములచే నీపిడుపర్తికవు లసలు గుంటూరుమం
డలము వారేమో యని నాయనుమానము. నిజామురాష్ట్రములోఁ గూడ
వరంగల్లుప్రాంతమున పిడుపర్తి, దోగిపర్తి యనుగ్రామము లున్నట్లు విని యుంటి
మని నామిత్రులు శ్రీ చిపరెమరము వీరభద్రశర్మగారు నాకుఁ దెలియఁబఱిచిరి.
స్థలజ్ఞులగు విజ్ఞులను సత్యనిర్ణయ మొనరింపఁ బ్రార్థించెదను.

ద్విపదరచనము:—తమకులగురుం డగుపాలకురికి సోమనాథునిమార్గ
మనుసరించి వీరుకూడఁ దమప్రధానగ్రంథములను జానుదెను గున జాతీయ
చ్ఛంద మగుద్విపదలో రచించి మతవ్యాప్తికిఁ దోడ్పడుట యెంతయుఁ బ్రశం
సనీయము. కాని సోమనాథునికవితలో నున్నంత పాటవము జాతీయత వీరికవి
త్వమునఁ గానరాదు. సోమనాథునికావ్యములు స్వతంత్రకృతు లగుట యు,
వీరివి కర్ణాటకావ్యముల కాంధ్రీకరణము లగు వేదాంతగ్రంథము లగుట యు
నిందులకుఁ గొంతవఱకుఁ గారణము కావచ్చును. ఉన్నంతలో దీక్షాబోధ
కంటె ప్రభులింగలీల రచనములో జాతీయత హెచ్చుగాఁ గానవచ్చును. సోమ
నాథునిశైలికన్న వీరిశైలి సరళముగా నుండును. శ్రీప్రభాకరశాస్త్రిగారు
భారతిలో (సం॥౧ సం॥౧) ప్రకటించిన "శివకవులు" అను వ్యాసమందును, బస
వపురాణపీఠికయందును భాషావిషయమున సోమనాథాదిశివకవులు చూపిన
వైలక్షణ్యమును గూర్చి కొంత చర్చించిరి. పాల్కురికి సోమనాథుఁడు 'అనియత
గణైః' 'యతిర్వా' 'ప్రాసో వా' అను సంస్కృతసూత్రముల నుదాహరించి,
ద్విపదలలోఁ బ్రాసయతి చెల్లు ననుట ప్రాచీన కవిసమ్మతమే యనియెంచి తన
గ్రంథములలో దానిని బాహాటముగాఁ బాటించినాఁడు. అతనికిఁ బూర్వపు
ద్విపదకావ్యములు మనకు లభింపనందున నీయతిని సోమనాథునిపూర్వకవు
లెంతవఱకుఁ బాటించిరో నిర్ణయింప రాకున్నది. కాని సోమనాథునకు సమ
కాలీను లగురంగనాథాదులు దీనిని క్వాచిత్కముగఁ బాటించిరి "మఱిబసవ
పురాణ"కర్త యగు బచ్చు సిద్ధకవి సోమనాథుని మార్గమునే యనుసరించి యం
దుల కుపబలముగా నిట్లు చెప్పికొనినాఁడు.

"..................ఇలఁ బాలకురికి సోమేశుండు మున్ను
తొలఁగక ప్రాసయతుల్ ద్విపదలను-లలి రచించుట యది లక్ష్యంబుగాను
నెలమి రేఫఱకారములు శివకావ్య-ములయందుఁ జెల్లుఁ దప్పులుగావుగాన
ఆపాల్కురికి సోము ననుమతి నేను - దీపితప్రాసయతిచ్ఛందసరణి
నామహాగురుదేవు ననుమతియల్లె - శ్రీమెఱయంగ రచించితి నిట్లు."

కాని సోమనాథునిఁ దమకులగురువుగా నారాధించు పిడుపర్తికవు లాతనికి సమ్మతమయిన యీప్రాసయతిని దమద్విపదలలో నారాధింపకుండుట యాశ్చర్యముగా నున్నది. నేఁ బరికించినంతవఱకు దీక్షాబోధయందుఁ గాని ప్రభులింగలీలలోఁగాని ప్రాసయతి ప్రయోగము గానరాలేదు. ఇందుకుఁ గారణము ద్విపదలలోఁ బ్రాసయతి చెల్ల దనునభిప్రాయము వీరికాలమునాఁటికి మరల వ్యాప్తమగుటయు, అనంతుఁడు మున్నగు లాక్షణికులు "శ్రీమందిరాకారు జితదైత్యధీరుఁ, గీర్తించుచోఁ బుణ్యావర్తనుం డనుచు, యతి మాఱు ప్రాస మట్లచ్చోట నిడక'' అని శాసించుటయు నిట్టి యభిప్రాయములను శాసనములను వ్రోసివేయుసాహస మీకవులకు లేకుండుటయు నని నేఁ దలఁతును.

—। ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనము ।—

పయిని వ్రాసినట్లు దీక్షాబోధకర్త పిడుపర్తి బసవకవి యనియుఁ బద్యబసవపురాణకర్త యాతనితనయుఁడు సోమనాథకవి యనియుఁ దద్గ్రంథముల వలనఁ దెలియుచుండఁగా బసవపురాణపీఠికలో శ్రీప్రభాకరశాస్త్రిగారు "పద్యబసవపురాణకర్త యగుపిడుపర్తి బసవన తండ్రి సోమనాథుఁ డీదీక్షాబోధను దెనిఁగించెను" (పుట 57) అనియు "ఈబసవపురాణమును బద్యకృతిగా రచించిన పిడుపర్తి బసవన కడునేర్పరి" (పుట 125) అనియు నిత్యాదిగా వ్రాసి చరిత్రజ్ఞులకుఁ జాల నాశ్చర్యము గలిగించిరి. ఈవ్రాఁత లోకవేళఁ బ్రామాదికమో లేమో యని యనుకొంద మన్న నొకటిరెండుచోట్ల గాక సర్వత్ర యట్లేవ్రాయుటయేగాక పయిగా 128 పుటలో అధోజ్ఞాపికలో (foot note) నిట్లు హెచ్చరించి తమయభిప్రాయమే సరియైన దని సమర్థించినారు. "పద్యబసవపురాణకర్త పిడుపర్తి సోమనాథుఁ డని కవులచరిత్రము మొదలగు గ్రంథములు పేర్కొన్నవి. ఆగ్రంథములందు గద్యములందుఁ గూడ నట్లే కానన గును. కాని కృత్యవతరణికలోఁ జూడఁగాఁ దత్కర్త పిడుపర్తి బసవన యని యేర్పడును పరిశోధించియే నే నీమార్పును జేసితిని. గద్యములందు సోమ

నాథుఁ డని యుండుటకుఁ గారణము మృగ్యము.'' శ్రీ శాస్త్రిగారి కిట్టి విపరీతములు పొడకట్టె నేమో కాని యస్మదాదుల కేరికిని బసవపురాణావతారికను బట్టి యట్టి వేవియు గోచరింప వని నాతలంపు కవి యవతారికకు భిన్నముగా గద్యము నెట్లు వ్రాయునో తెలియకున్నది. బసవకవియే బసవపురాణకర్తయై గ్రంథావతారికలో నాతఁ డట్లే చెప్పుకొన్నచో గద్యము మఱొకవిధమున వ్రాయఁ గారణమేమి? గ్రంథకర్తృత్వము తనపై వేయించుకొను దురుద్దేశముతో సోమనాథుఁడే గద్యను మాత్ర మట్లు మార్చి పితృద్రోహ మొనర్చె నని శాస్త్రిగారు చెప్ప సాహసింపరుగదా! తాము పరిశోధించిన దేదియో యెట్టు లీనూత్నవిషయమును దాము కనిపెట్టఁ గల్గిరో శాస్త్రిగారు విస్పష్టముగ వివరించిన బాగుండును. శాస్త్రిగారి వ్రాఁత చూచిన తరువాత నాశ్చర్యముతో నీగ్రంథావతారికను నేను మరలఁ బరిశీలించితిని, కాని వీరియీవిపరీతాభిప్రాయమున కాకరము నాకెందును గానరాలేదు. పూర్వాపరసందర్భములను సరిగా గమనింపకయుఁ గొన్నిపద్యములను సరిగా సమన్వయము చేసికొనకయు వీ రిట్టిదుర్భ్రమలపాలయియుందు రని నాయభిప్రాయము. గ్రంథావతారికలో సోమనాథుఁ డొసంగిన వంశానుక్రమణిక నీవిషయమున మన కవసరమయినంతవఱ కీక్రిందఁజూపుచున్నాఁడను.



అవతారికలో 73, 74 పద్యములలోఁ (వీనిని బైని నుదాహరించి యుంటిని) దనతండ్రి బసవకవిని, 75-76 పద్యములలోఁ దల్లి నాగమాంబను వర్ణించిన తరువాత 77-వ పద్యమును సోమనాథుఁ డిట్లు వ్రాసినాఁడు.

సీ. "ఆనాగమాంబకు నత్యంతశివభక్తి యుక్తుఁడౌ బసవనార్యునకుఁ బుత్త్ర
లనుపమానచరిత్రు లతిపవిత్రులు నల్వురైరి ధర్మార్థకామామృతములు
మూర్తులుదాల్చినా మొదలసోమన్నయుఁ జాలన్న గురవన్న బసవనయును
వారిలోనను నేనవరజుండ బహుకావ్య నాటకాలంకార నటన వేదిఁ
జెప్పఁదొడఁగినాఁడ శ్రీబసవపురాణ, మవలిఁ బద్యకావ్యమై చెలంగ
మంజులోక్తియుక్తి మత్కులగురుఁడైన, పాలకురికి గురునిఁ బతిని జేసి"

ఇందులో 4 వ పాదములో 'నేనవరజుండ' అనుదానికి శాస్త్రిగారు "నేను + అవరజుండ" అని పదవిభాగము చేసికొని మూఁడవపాదమునఁ బేర్కొనఁ బడిన సోదరులు నల్వురిలోఁ గడపటివాఁ డగుబసవనయే గ్రంథకర్తయవు నని తలంచిరి కాఁబోలును. కాని పూర్వసందర్భములను బర్యాలోచించినచో నీపదవిభాగము సరియైనది కాదని తెలియఁగలదు. 'నేన + వరజుండ' (అగ్రజుఁడనగు నేనే) అనునదియే కవి యభిప్రాయమై పూర్వాపరసందర్భముల కనుగుణముగా నున్నది. పయివంశవృక్షములో మూఁడవపురుషుఁ డగు పెదసోమయ్య పెద్దకుమారుఁ డగు పినసోమయ్యయొక్క పుత్త్రుల వర్ణించుటలోఁ గూడ నీకవి 6[illegible] వ పద్యములో 'వరజుం డగు నిశ్శంకయ-గురువరు.........'అని వ్రాసి యగ్రజుఁడను నర్థములో వరజశబ్దము నుపయోగించినాఁడు. మఱియు నితఁడు 68 వ పద్యములోఁ దనపెదతండ్రి యగుసోమయ్యను వర్ణించుచు, ఎత్తుగీతిలో 'మద్గురుండైన సోమయ సద్గురుండు సాధుసమ్మతసద్గుణాసక్తుఁ డగుచు' అని వ్రాసి యటుతరువాత 70, 71 పద్యములలో నాతనిపుత్త్రులను వర్ణించి యాపిమ్మట 'ఆసోమేశు ననుసంభవుఁడు' అని చెప్పి 73, 74 పద్యములలోఁ దన తండ్రి బసవకవిని వర్ణించినాఁడు. ఈపయిని జెప్పిన సోమయ మనకవికి దీక్షాగురుఁడో విద్యాగురుఁడో యైయుండును. అందుచేతనే యాతని నట్లు వర్ణించినాఁడని నాయభిప్రాయము. తండ్రికంటెఁ బెద్దవాఁ డున్నప్పు డాతనివలననే దీక్ష నొందుట ధర్మము గదా! ఈసందర్భముల నిట్లు సరిగా సమన్వయము చేసికొనక పద్యబసవపురాణకర్త పిడుపర్తి బసవకవి యనియు, 68-వ పద్యములోఁ

బేర్కొనఁబడిన సోమయయే యతనితండ్రి యనియు, నతఁడే దీక్షాబోధకర్త యనియు శాస్త్రిగారు దుర్భ్రమలపాలయినట్లు తోఁచుచున్నది. అట్లయినను 77-వ పద్యములో మొదటిపాదమున "బసవనార్యునకుఁ బుత్త్రు" లను సమాసమును, 73 పద్యములో దీక్షాబోధాదికర్తృత్వవివరములతోఁ జేయఁబడిన బసవకవివర్ణనమును గుర్తింపకుండుట శోచనీయము. ఇంతయేల ? 'గ్రంథకర్తృ వంశానుక్రమము' అనుశీర్షిక క్రింద నున్న యీపద్యములమాట యటుండఁగాఁ గృత్యాదిని "గ్రంథోత్పత్తికారణము" అను శీర్షికక్రింద సోమనాథుఁడు తనపినతండ్రి బసవకవి యాజ్ఞచొప్పననే తానీపద్యకావ్యకరణమునకుఁ గడంగితినని చెప్పిన వృత్తాంతము సకలశంకయములను నివారించి సోమనాథుఁడే గ్రంథకర్త యను విషయమును విస్పష్టపఱుపఁగలదు ఈక్రిందిపద్యములఁ జిత్తగింపుఁడు.

సీ. "  ...  ...  ...  ...  ...
అనుచుఁగొనియాడవహిశక్తి నట్టిమునుఁడు, దేవనార్యుని నెయ్యంపు దేవియైన
మల్లమాదేవిపుత్త్రుఁ డామ్నాయవేది, భవ్యగుణహారి పిడుపర్తి బసవశౌరి.

క. ననుఁ నొకనాఁ డాత్మాంకస్థునిఁ గనుఁగొని పాలకురికి సోమేశునిపే
రను బసవపురాణము ప, ద్యనిబద్ధత నెలయఁజేయఁ దలఁచితిని సుతా!

మ. అది వేదాగమసారసంగ్రహము  ...  ...  ...  నీ
వది చెప్పం దగుఁ బద్యకావ్యముగఁ గావ్యప్రజ్ఞ సేవ్యంబుగన్.

క. ఆవేదార్థము ద్విపదలు, నీవిప్పుడు పద్యములుగ నిర్మించిన భ
క్తావలి మెచ్చున్ శివకవు, లీవిధ మంగీకరింతు రిష్టము మాకున్.

క. నీవును సోమేశుని ద్విప, దావళి పద్యములు సేయు ముందుల యర్థం
బావంతయు దిగవిడక, యేవియు మున్నందు లేని విడకు కుమారా.

సీ. చదివించినారము శబ్దార్థసారముల్ కావ్యనిర్మితశక్తి గలదు నీకు
మనకులాచారుఁడై మహివీరశైవైకమార్గంబు చూపినమహితయశుఁడు
సోమేశ్వరుని గృతిస్వామిగా నియమించి బసవపురాణంబు పద్యకావ్య
మూర్తిఁ గావింపుమీ యని యానతీయఁగఁ గరములు శిరమునందిరవుకొల్పి
మీకు నంకితముగ నాకాంక్ష నొకకృతి, సేయు వేడ్క నాకుఁ బాయదెపుడు
మీయనుజ్ఞనైన మీయట్టి నడవ నెట్లు, సేయు మన్న నట్లు సేయువాఁడ.

క. అని నేను విన్నవించిన, విని ననుగారుణ్యదృష్టి వీక్షించి మహా
త్మునిఁ బాలకురికి సోమే, శునిఁ గృతిపతి సేయు సకలశుభదము సునకున్.

క. నాకొకకృతి నీఁదలఁచుట, చేకొని సంతసము నాకుఁ జేయుట యైనన్
ఆకృతి గురువులకిచ్చిన, నాకును సంతసము శతగుణంబగుఁ బుత్రా!

వ. కావున నీవు మాపేర నంకితంబుగా వేఱొక్కప్రబంధం బనుసంధించు తలం పుజ్జగించి............సోమేశ్వరుఁడు ద్విపదలు సేసిన బసవపురాణంబు సోమేశ్వరునిపేరన............పద్యకావ్యంబు గావింపు మని యాన తిచ్చినం దద్వచనంబు శిరంబునం ధరించి చెప్పంబూనిన కావ్యకన్యకా ముఖమండనాయమానం బగుకృతిపతిమాహాత్మ్యంబు ప్రథమకథనీయమానంబు గావున దాని వర్ణించెద... ..."

కావున దీనిని జదివినచో బసవకవి కుమారుఁడు సోమనాథుఁడే పద్యబసవ పురాణకర్త యని యెట్టివారికిని విశదముగాకమానదు. అందులకనుగుణముగనే యాశ్వాసాంతగద్య మీవిధమున నున్నది. "ఇది శ్రీ మత్పాలకురికి సోమేశ్వర ప్రసాదలబ్ధ ప్రబంధనిబంధనశక్తియుక్త శ్రీ పితుపర్తి బసవనార్యసత్పుత్ర కుల పవిత్ర సోమనామధేయ శివకవిప్రణీతం బయినబసవపురాణంబు ........."
ఇదియునుం గాక ప్రభులింగలీల యందు నెల్లూరి రామలింగయ్య సోమనా థునిఁగూర్చి చెప్పినట్లు గా నున్న యీక్రిందివాక్యములు గూడఁ బైవిషయము ను రాద్ధాంత పఱుపఁగలవు.

"రసికుఁడు నెల్లూరి రామలింగయ్య
నన్నరప్పించి మన్నన గారవించి, యున్నతాసనమున నునిచి పిడుపర్తి
సోమయదేవ సంశుద్ధసద్భావ, శ్రీమన్మహాదేవసేవానుభావ
కులగురుండగు పాలకురికిసోమేశుఁ, డెలమిఁజెప్పినకృతు లిలవెలయించి
భవదీయజనకుఁడు బసవనార్యుండు, సపశేషశైవదీక్షాబోధ చెప్పి
బసవపురాణంబు, పద్యకావ్యముగ, రసికులౌననఁగ విూరలు చెప్పినారు"

కావునశాస్త్రిగారివ్రాఁతలు వీరశైవమతచరిత్రముఁగూర్చి వారు వెలు వరించిన సిద్ధాంతములవలెనే విపరీతపరిశోధనఫలితము లని వేఱ చెప్ప నవసర ము లేదు.

దీక్షాబోధకర్త యీసోమనాథునితండ్రి బసవకవి యని పైయుదాహర ణాదులవలన సువ్యక్తమగుచుండ శాస్త్రిగారు, బసవనతండ్రి సోమనాథుఁ డా గ్రంథము తెనిఁగించె నని వ్రాయుట తప్పని వేఱ చెప్పనక్కఱలేదు. బసవకవి తండ్రి దేవనార్యుఁడు గాని సోమనాథుఁడు కాఁడు దేవనార్యునిపుత్రుఁడును,

సోమనాథుని తండ్రియు నగు బసవకవియే దీక్షాబోధకర్త. ఆగ్రంథావతారిక యందలి వాక్యములును, ఆశ్వాసాంతగద్యమునుగూడ నీవిషయమును స్థిరపఱుపఁగలవు. చూడుఁడు.

"తెలుఁగుకవిత్వంబు, తేటగాఁజెప్ప-బలియుండుపిడుపర్తిబసవనాహ్వయుఁడు
వారిచేఁ జెప్పింపవలయు నీచరిత - మారూఢి ద్విపదగా నని తలపోసి
వీరబాణక్షమాభిభూతిమ్మశౌరి - వీరభూపాలుండు వేడ్క దైవాఱ
దీవిధి పిడుపర్తి దేవతయ్యాఖ్యను - మానిని మల్లమాంబకుఁ దనూభవుని
... ... ... ... ... ... ...
పరమమాహేశ్వరపదసేవనైక - పరతంత్రుఁ బిడుపర్తి బసవనాహ్వయుని
నన్నుఁ బిలిపించి సన్మానంబుచేసి - వినయంబుతో భూతి వీడ్యమర్పించి."

"ఇది పాలకురికి సోమేశ్వరారాధ్య - పదములశిష్య శిష్యప్రశిష్యుండు
... ... ... ... ... ...
త్రివిధప్రసాదపరిమితసుజ్ఞాన - భవపూర్తి పిడుపర్తి బసవనాహ్వయుఁడు
రచియింప శైవపురాణతంత్రములఁ, బ్రచురమా భక్తిసభాయోగ్యమైన
ఘనవీరశైవదీక్షాబోధయందు ... ... ... ..."

ఈవిషయములఁ గూర్చి శాస్త్రిగారి కింకను సందేహము లుండి వారి సిద్ధాంతము లే సరియైన వనునమ్మక మున్నచోఁ దనుపరిశోధనవివరములనువిస్పష్టపఱిచిచరిత్రజిజ్ఞాసువుల సంశయములఁదొలఁగింతురుగాక యని ప్రార్థించుచు నీవ్యాస మింతతో ముగించుచున్నాఁడను.

---

# త్రైవిక్రమము.

ఈగ్రంథము బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచేఁ బ్రకటింపఁబడినది. ప్రథమమున విశ్వకోటీగారిచే 'శ్యామా' అనుపత్రికయందుఁ బ్రకటింపఁబడినటులఁ దెలియుచున్నది. ఇందు రూపకములరీతి నంకవిభజనము లేదు. నటీసూత్రధారులసంభాషణముతో నీగ్రంథము సాగియున్నది. పారిషదుల సమక్షమున నొకచిత్రపట మమర్పఁబడి యుందలి యితివృత్తము నటీసూత్రధారులసంభాషణమున వర్ణింపఁబడును. ఇట్టివి దశరూపకములందుఁ గాని యష్టాదశోపరూపకములందుఁ గాని లేదు. రఘువంశాదులవలెఁ గవివర్ణితము గాదు. శాకుంతలాదులవలెఁ బాత్రసంభాషణమును లేదు. ఆలంకారికమతానుసారము కావ్యనాటకములమధ్యఁ జేర్పఁదగిన గ్రంథమై యున్నది. నాటకముల రీతి నితివృత్తము నడచుచుండును కాని నటీసూత్రధారులసంభాషణముతో నిది ముగియును.

—ప్రాచీనులు-కథాకథనము—

చైత్రిక, గ్రాంథిక, సౌభికము లని ముత్తెఱంగులుగ నిర్వచించియున్నారు అందు, చైత్రిక మనునది చిత్రరూపప్రాధాన్యమునఁ జెప్పంబడునది. అభినవగుప్తుఁడును దననాట్యశాస్త్రవివృతియందుఁ (బరోడాప్రతి పుట 174)

"తత్రాపి నాట్యచ్ఛాయాత్మకత్వైవ నాట్యస్యైవ వ్యాఖ్యా భాగశిమ్పం దా శ్చిత్రపుత్రికా పుస్తప్రభృతయో గ్రంథికాది పరికల్పిత పాఠ్యాకారకల్ప ప్రత్యయసంపదా కథాపర్యంతమ్-" అని వ్రాసియున్నాఁడు ఇట్టివానినే భోజుఁడు శృంగారప్రకాశమున నాఖ్యానకము లని వర్ణించియున్నాఁడు. "ఆఖ్యానకసంజ్ఞాంత ల్లభతే య దభినయన్ పఠన్ గాయన్। గ్రంథిక ఏకః కథయతి గోవిందవ దవహితే సదసి'' కాన త్రైవిక్రమము నాఖ్యానక మనవలయును. క్రీడాభిరామమున నొకపడఁతి పల్నాటివీరులచరితంబుఁ బాడుచుండె ననియు నట వారిచరిత మొకచిత్రఫలకంబున వ్రాయఁబడె ననియు వర్ణింపఁబడియున్నది. అదియు నిట్టిదై యుండనోపు నని కవిగారు వ్రాసియున్నారు.

త్రైవిక్రమమున విష్ణువు వామనావతారము నొంది బలిచక్రవర్తిని మూఁడడుగులు యాచించి తనవిశ్వరూపముతో స్వర్గమర్త్యపాతాళముల నాక్రమించె

ననుకథాంశము వర్ణింపఁబడినది. ఇం దెచ్చటను కవినామము గానరాదు. భాసుని దని ప్రకటింపఁబడిన తిరువనంతపుర నాటకములతో నిది దొరకిన దఁట, కాని, యీ నాటకములపఙ్క్తి నిందుఁగన్పడుట లేదు. ఒకవేళ నిది పల్లవ రాజులగు నరసింహవిష్ణుమహేంద్రవిక్రమవర్మలరచనమయి యుండనోపు నని కవిగారు వ్రాసియున్నారు. అదియు నిరాధారము.

ఈగ్రంథ మలంకారగ్రంథములం దెచటను నుదహరింపఁబడ లేదు. కాని సుమారు 15 వ శతాబ్దమునాఁటిదగు 'చర్చనా' యను శాకుంతలనాటకవ్యాఖ్యానమున దీనిప్రశంస గలదు. ఈ వ్యాఖ్యానము మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమునఁ గలదు. అందు త్రైవిక్రమమును గూర్చి యిట్లుఁదెలుపఁబడినది.

"త్రైవిక్రమేతు సూత్రధారేణసహ నట్యాః ప్రవేశః కథ్యతే తతః ప్రవిశతి సూత్రధారః సహప్రియయేతి తన్న చతురశ్రమ్, సూత్రధారేణ ప్రస్తుతాశేషో స్వకార్యవిమర్శార్థం సమాహూతానాం నటీప్రభృతీనాం పృథక్ ప్రవేశో యుక్తః అథేహ తాదృశకార్యాభావాత్ సహప్రవేశ ఇతి మన్యతే తత్సాధు, సూత్రధారస్య నాట్యప్రయోగాత్మకం స్వకార్యం వచనంచ నాస్తీత్యపూర్వమేతత్, క్వచిత్ పునః నాంద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః- సూత్ర- ఆర్యే- తృతీయే ఖలు చిత్రపటే ఇత్యాది దృశ్యతే తత్రాపి సహ ప్రవేశః సిద్ధః అన్యప్రవేశాకథనాత్- నటానటీత్యంతరా పాత్రనిర్దేశాత్- తస్యచ వచనోపలంభా చ్చ"

అని నటీసూత్రధారప్రవేశము విమర్శింపఁబడినది మఱియెచ్చట నీగ్రంథము ప్రశంసింపఁబడి యుండ లేదు. గ్రంథవిమర్శనోత్సుకులకయి యిందు మూలముఁగూడఁ జేర్పఁబడినది. విజ్ఞు లిందలి నూతనవిషయముల విమర్శింతురు గాక యని మనవి.

---

# త్రైవిక్రమమ్.

(నాన్ద్యన్తే తతః ప్రవిశతి సూత్రధారః సహప్రియయా)

---

సూత్ర—ఆర్యే, తృతీయేఖలు చిత్రపటే—

దైత్యేన్ద్రమౌళిమణిఘృష్టికిణీకృతస్య
పాదస్య యస్య గగనోద్గమగర్వితస్య
త్రైవిక్రమం త్రిభువనాతత మద్భుతం య
ద్భాతి త్రివిముక్త మఖిలం వటువామనస్య.

నటీ—ణమో భఅవదో వడువామణస్స, అయ్య, తదో తదో (నమో భగవతే వటువామనాయ, ఆర్య, తతస్తతః)

సూత్ర—ఆర్యే, శ్రూయతాం దైత్యేన్ద్రం బలిం వైరోచనం కృతాశ్వమేధ మవభృథస్నాతం ముక్తాజాలాలఙ్కృతోత్తమాఙ్గం కృష్ణాజినావలమ్బితోత్తరీయం పత్నీసహితం వరప్రదానాభిముఖం త్రిదశగణభూతహితార్థముపాధ్యాయరూపం బృహస్పతిం పురస్కృత్య స్వయం వటువామనో భూత్వా వామదేవ్యం సామోద్గాయ యజ్ఞసమృద్ధిం ప్రశంస న్నుపసృతో భగవా న్మహావిష్ణుః.

నటీ—తదో తదో (తత స్తతః.)

సూత్ర—తత స్తం దృష్ట్వైవ ప్రహ్లాదితమనసా బలినా వ్యభిహితం వృణీష్వ వర మితి

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తత ఆజ్ఞాపయన్నివ మమ గురో ర్యజ్ఞకరణార్థం త్రీన్ విక్రమా నిచ్ఛామి త్యుక్తం భగవతా.

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తత ఐశ్వర్యమదగర్వితేన తేనా వ్యవిచార్యమాణేన బాఢం దదామీ త్యుక్తం బలినా.

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తతో లక్షణై ర్విమలవిశాలబుద్ధిహృదయేన ప్రహ్లాదనామ్నా మాత్యేన వారితం న దాతవ్య మితి.

అయం స కృష్ణు ర్మనసా ప్యజేయః
సురాసురాణాం సుఖశోకకర్తా
పటుశ్చ నాయం సకలం విజేతుం
ప్రాప్తో యది స్యా న్న జలం ప్రదేయమ్.

అపిచ—

భిత్వా గురుం తవ జఘాన నృసింహరూపీ
వక్షఃస్థలం నఖముఖై ర్నిశితైః పురా యః
సాక్షా ద్ధిరణ్యకశిపుం సుర దైత్యనాథం
ప్రాప్తా ఖిలా జితవరప్రవరం విరిఞ్చాత్.

ఇత్యుక్తః సంహ్లాదేన.

నటీ—తదో తదో (తత స్తతః.)

సూత్ర—తతః.




సోఽయం యది స్యా దహిభోగశాయీ
శార్ఙ్గాసిచక్రోద్గదశార్ఙ్గపాణిః
యుద్ధే ప్యసహ్యో యది యాచతే మాం
దాస్యామి సత్యవ్రత మాస్థితోఽహమ్.

అపి చైతద ప్యుక్తం బలినా-

దేహీతి యో వదతి తం ప్రవిశ త్యలక్ష్మీ,
ర్నాస్తీతి యో వదతి తం పున రభ్యుపైతి
తస్మా ద్దదామి పృథివీం మధుసూదనాయ
శ్రీరేవ మాం భజతు తం ప్రవిశ త్వలక్ష్మీః.

ఇ త్యేవ ముక్త్వా విసర్జితః సంహ్లాదో బలినా—

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తతః ఖరమురనరకనముచిప్రభృతిభి ర్వార్యమాణః ప్రతార్యమాణ స్తాంస్తా న్నిర్భర్త్స్య సత్యవచనమే వాస్థా యాసురగణహితకరాభ్యాం సురగణాహితకరాభ్యాం కరాభ్యాం జామ్బూనదమయం భృఙ్గారమాదాయ ఇత ఇతో భగవా న్యథేష్టం తోయం గృహాణే త్యుక్తం బలినా.

నటీ — తదో తదో (తత స్తతః.)

సూత్ర—తతః సురగణహితకరే అసురగణనిధనకరే అమలకమలదళసదృశే తస్మిన్ కరతలే ప్రసృతమాత్రే తోయే ద్విగుణచతుర్గుణోర్మి రలఙ్ఘ్యాత్య త్రైలోక్యప్రమాణం ప్రవిజృంభితో భగవాన్ దివ్యమూర్తిః

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తతో వివృతవదనదష్టోష్ఠభ్రుకుటీపుటవిషమీకృతరక్తనయనాః ససంరంభ మహామహమికయా సముత్థితా దైత్యేంద్రసఙ్ఘాః.

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తత స్తస్తేజసైవ త్వం విష్ణు రయం విష్ణు రిత్యన్యోన్యం ప్రహత్య నష్టా దైత్యాః, హృష్టా దేవాః, ఆహతా దేవదున్దుభయః, అత్యుద్ధూతా వాయవః, అతితపతి స్మాదిత్యః, పతితా వృక్షాః, భ్రాన్తా మేఘాః, శాన్త మివ నభః, స్ఖలితాః పర్వతాః, క్షుభితాః సాగరాః, ప్రలీనా వాసుకిప్రభృతయో భుజఙ్గేశ్వరాః కిం ను ఖ ల్విదం—

ప్రలయ మిద ముపేతం కిం ను మాయా న విద్మః
ప్రభు రవతు హరి ర్నో హన్త హాహా హతా స్మః
ఇతి వివిధనిమిత్తై ర్మోహ మభ్యాగతా స్తే
భువనపతి ముపేన్ద్రం సర్వలోకాః ప్రణేముః.

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—తతః—

నారాయణాయ హరయే సురశాసనాయ
త్రైలోక్యజన్మలయపాలనకారణాయ
దేవాయ దైత్యమథనాయ జగద్ధితాయ
విశ్వమ్భరాహితకరాయ నమో౽చ్యుతాయ.

ఇ త్యుక్త్వా ప్రణిపతితాని సర్వభూతాని—

నటీ—తదో తదో (తత స్తతః)

సూత్ర—విష్ణో ర్విజయం విజయ మి త్యుక్త్వా త్రీన్ లోకాంస్త్రి సప్తకృత్వః భేరీం ప్రహారన్ పర్యట జ్జామ్బవాన్.

దర్పాన్ధః పాదలగ్నో నముచి రపసృతో యా త్యేవ గగనం
సంహ్లాదః పాదయోగా దుపల ఇవ గిరే ర్భూమౌ నిపతితః

నిక్షిప్తా యస్య భూమిః సగిరివనపురాధత్త్రైవ చలితా
ధర్మజ్ఞః సత్యసన్ధః సుకృత ఇవ బలి ర్ధైర్యా న్న చలతి.

అపిచ—

స్వర్గం సురేన్ద్ర ఇవ దత్త మనేకభోగం
పాతాల మేత్య సుతలం హరిణా స దైత్యః
భక్త్యార్చయన్ పరమయా రమతే విభక్తం
కిం వా కరోతి మహతా న సమాశ్రయోయమ్.

నటీ—రమణిజ్జో ఖు కహాజోఓ, అంణం చిత్తపడం వణ్ణేను అయ్యో-
(రమణీయః ఖలు కథాయోగః, అన్యం *చిత్రపటం వర్ణయ త్వార్యః.

సూత్ర—

ఆర్యే బాఢం హరిపదకథా సేయ మస్తం ప్రయాతా
భక్తి ర్భూయా త్తవ చ మమ చ శ్రీధరస్యాంఘ్రిపద్మే
నశ్య త్త్వేవం దురిత మసకృ త్స్పృశ్యతాం నృత్యతాం నః
స్వస్థో రాజా ప్యవతు వసుధాం స్వస్తి గోబ్రాహ్మణేభ్యః.

(త్రైవిక్రమం సమాప్తమ్)



---

* చిత్రపటప్రదర్శనముతోఁ గథలు చెప్పుటయే చైత్రికవిధానము. ఈవిధానమున నిప్పటికిని పల్లెటూళ్లలో గొల్లలను యాచించు "తెరచీరలవా"రను నొకజాతివారిచే నద్దకపుచీరల పైఁ గల బొమ్మలను జూపుచు గొల్లల పూర్వవృత్తాంతము చెప్పుట కలదు.

# కావ్యాత్మ యెద్ది.

ఉభయభాషాప్రవీణ అయలసోమయాజుల నరసింహశర్మగారు, కలవరాయి.

---

వీనులకు విందులై డెందంబున కమందానందంబు నిచ్చు కావ్యము లనేకములు భరతఖండంబునఁ బూర్వమునుండి విఖ్యాతిఁ గాంచినవి. అట్టికావ్య తత్త్వంబుల విమర్శించు సమయమునఁ గావ్యాత్మను గుఱించి యనేకు లనేకవిధముల నిరూపించియున్నారు అం దేది రమ్యమో నిరూపించుట యే నావ్యాసాభిప్రాయము.

I "వక్రోక్తిః కావ్యజీవితమ్" అని కుంతలాదులు వక్రోక్తిని కావ్య జీవితముగ నుడివిరి

II "జీవితం వ్యంగ్యవైభవమ్" అనివ్యంగ్యమే కావ్యజీవితముగ విద్యానాథాదులు పలికిరి.

III "వాగ్వైదగ్ధ్యప్రధానే౽పి రసఏవాత్ర జీవితం" అని రసమే జీవితముగ నగ్నిపురాణమున నున్నది.

IV "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" అని క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చయం దున్నది.

V "రీతి రాత్మా కావ్యస్య" అని వామనుఁడు రీతినే కావ్యాత్మగ నిరూపించియున్నాఁడు.

ఇందు జీవితమున కౌపమ్యము కలిగినపుడు జీవుఁడు ప్రతివ్యక్తియందు నెట్లుండునో యట్లే యుపమేయవస్తువు ప్రతికావ్యమందును నుండవలయును గదా? అట్టిసామ్య మెవ్వరిమతమం దుండునో మన కదియే యాదరణీయము.

"వక్రోక్తి కావ్యజీవిత" మన్నచో-

"గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభయా ద్భూయసా పూర్వకాయమ్
దర్భై రర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి"

అను మొదలగు కావ్యములందు స్వభావోక్తి గాని వక్రోక్తి లేమిఁ జేసి జీవము లే దనవలయును, ప్రాణము లేని మనుజునివలె శవమనవలయును. కాన నియ్యది యుక్తంబు కాదు.

వ్యంగ్యమే కావ్యజీవ మన్న వ్యంగ్యము లేని చిత్రకావ్యములయందు-అనఁగా,

క్షోణీరక్షణదక్షణాః క్షతజగక్షోభాధురీక్ష్యక్రమాః
క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధౌ ప్రోక్షి ప్తకాక్షేయకాః
ఉద్దామోద్యమనస్య రుద్రనృపతే ర్దోర్దండయోశ్చండయోః
గర్జద్దుర్జనగర్వపర్వతభిదాదంభోళయః కేళయః.

అను మొదలగు కావ్యములందు ధ్వన్యభావముచే జీవితము లేదనియే చెప్పవలయును గాన నియ్యదియు నసమంజసమే యనవగును.

ఇఁక రసమే జీవిత మనుటయు నసమంజసమే యగును.

ఏకైకరసమే కావ్యజీవితమా ? లేక నవరసములు కలసి కావ్య జీవితమా ?

ఏకైకరసమే కావ్యజీవిత మన్నచో "కాకతీయవిభోః కీర్తిపుండరీకే విజృంభితే । ధత్తే మధుకరక్రీడాం తమాలశ్యామలంనభః"

ఇట్టియలంకారేణాలంకారధ్వన్యాదులంను రసము లేమిఁజేసి జీవితాభావము కలుగును.

నవరసములు కలసి యున్ననో నవరసములకు నేకత్రావస్థానము లేమిఁజేసి యదియుఁగుదురదు- కాన నీమత మసమంజసమే యన నగును—

ఔచిత్యమే కావ్యజీవిత మను వారియాశయము నవలోకింతము.

కావ్యమున నౌచిత్య మనఁగా రమణీయార్థప్రతిపాదనహేతువగుకళ. ఇయ్యది శబ్దార్థసందర్భనిష్ఠమగును-

ఇది లేనిచో రమణీయార్థమే లేదు. కాన నియ్యది ప్రతికావ్యమందు నుండును. కాన నియ్యది కావ్యాత్మయనుట సమంజసము

రీతి రాత్మా కావ్యస్య-అను వారిమతమును విమర్శించుటకు రీతిలక్షణముఁ దెలిసికొని లక్షణము విమర్శింతము.

వామనసూత్రములకు వృత్తి కారుఁడు "విశిష్టా పదరచనా రీతిః" విశిష్టత్వంచ గుణసమ్మిళత్వం" అని వ్రాసియున్నాఁడు.

ఈవ్యాఖ్యానము ననుసరించియే పీయూషవర్షియమున "నిర్దుష్టాలక్షణవతీ సారీతి ర్గుణభూషితా" అనియే రీతిలక్షణమును వ్రాసియున్నాఁడు. కాని యియ్యది సూత్రకారుని యాశయవిరుద్ధము. చూడుఁడు-

గుణవిశిష్టమే యర్థమయినచో దశగుణవిశిష్టమా? లేక యేకైకగుణ విశిష్టమా?

దశగుణవిశిష్టమన్నచో నసమగ్రగుణభూయిష్ఠము లగు గౌడీపాంచాలీ రీతులు గలకావ్యముల కాత్మ లేదనవలయును-

ఏకైకగుణవిశిష్టరచనే రీతియన్న

“మయిఃశ్యతి సాకేశై స్నిమంతమణిమావృణోత్” అను మొదలగు స్థలములందు గుణాభావముచే జీవితాభావ మొప్పవలయునుగాన నీవ్యాఖ్యాన మంగీకరింపఁదగినదికాదు.

విశిష్టమనఁగా విలక్షణ మని యర్థము. అనఁగా లోకవిలక్షణమగు పద రచన రీతియని యాశయము.

పైవ్యాఖ్యానకర్తల వ్యాఖ్యానమునే స్వీకరించి మమ్మటాచార్యాదు లీ రీతి రాత్మా కావ్యస్య అను మతమును “ఏకగుణవిశిష్టం వా ఉత దశగుణవిశిష్టం వా పదరచనా రీతిః'' అని పై రీతిని ఖండించియున్నారు.

వక్త కట్టి యర్థ మభిప్రేతముకామిఁజేసియు వానియాశయ మెఱుంగక ఖండించుట వీరిపొరపాటనఁగును.

పై లక్షణఖండనావసరమున మమ్మటాచార్యులు వేఱొకఖండనమును వ్రాసియున్నారు. “అద్రావత్ర ప్రజ్వల త్యగ్ని రుచ్చైః ప్రాజ్య ప్రోజ్యం ను ల సత్యేవ ధూమః” అను మొదలగుస్థలములందు కావ్యాత్మ యగుగుణవిశిష్టపద రచన యున్నను గావ్యప్రసంగము లేమిఁజేసి యాలక్షణ మగ్రాహ్యమని విశిష్టశబ్దమునకు విలక్షణార్థముఁ జెప్పుటఁజేసి యిట్టిఖండనమున కవకాశము లేదు. కాని యీఖండనప్రణాళిక ప్రతికావ్యమునకును జీవిత ముండవలయు ననిసిరూపించుచున్నది.

కాఁగా పై లక్షణమునకు లోకవిలక్షణ మగుపదరచన కావ్యాత్మయని భావము.

రీతి యనఁగాఁ బదరచనయందలి కళయని భావము. దీనినే శబ్దౌచిత్య మందురు. ఔచిత్యము కావ్యజీవిత మను లక్షణము అర్థసందర్భౌచిత్యము లను వ్యాపించుచున్నది ఇయ్యది యట్లు కాక శబ్దౌచిత్యమును మాత్రమే గ్రహించుచున్నది. కాని యియ్యదియుఁ బ్రాణమువలెనే ప్రతికావ్యమునం దును వ్యాపించియే యుండును.

అట్లైనచోఁ గావ్యమున ధ్వని యప్రధాన మని నా యాశయము కాదు. మనుజునకు బుద్ధి వెలను తెచ్చునట్లు కావ్యమునకు వెల తెచ్చునది ధ్వనియే కాని జీవితము మాత్రము ధ్వనికాదు.

# మనుచరిత్రవిమర్శనము.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

---

సారస్వతాభివృద్ధికిఁ గావ్యము లెంత ముఖ్యములో వానివిమర్శనములు ను నంతముఖ్యములయి యున్నవి. నాగరకత గల దేశములయందలి సారస్వతము లన్నిటియందును జక్కని విమర్శనములు విరాజిల్లుచునే యున్నవి. కాని యే దేమికారణముననో కాని మన తెలుఁగునందు మాత్ర మయ్యవి యంతగా లేవు. ఈలోపమును నివారించుటకై నేను గొంతకాలమునుండి విమర్శనములు వ్రాయ మొదలిడితిని. ఇయ్యవి యువ్విత్సువులకు గుణాగుణవిమర్శనజ్ఞానమును గలిగించి లోకసామాన్యమునకు మెఱుఁగుల నెఱుఁగు శక్తిని హెచ్చించి తద్వారముగా నిక్క మగు సారస్వతాభిరుచిని హెచ్చించుటకే కాని రంధ్రాన్వేషణపరాయణత్వమును జూపుకొనుటకుఁ గాదు. సత్యవాఙ్మయాభివృద్ధిని మనసునం దిడుకొని నే నొనరింపఁబూనుకొనిన కావ్యవిమర్శనము ప్రప్రథమముననే పెద్దనార్యకృత 'మనుచరిత్రము'పైఁ గావింపవలసివచ్చినది. ఏలయన నాకావ్య మాంధ్రలోకములోఁ జాల వాడుకగా నున్నది. అట్టిప్రసిద్ధగ్రంథరాజమునందలి గుణాగుణములను జూపినప్పుడే కదా లోకమునకద్దానివలన లాభము హెచ్చుగా నుండును అదియుంగాక ఈకృతిరాజము ప్రబంధరచనాప్రారంభప్రయత్నములోని దగుటచేతనో మఱియే కారణముననో గాని విమలసారస్వతాభివృద్ధికి నను వ్రు గాని కావ్యదోషములను గొన్నింటిని గలిగియున్నది. ఇద్దానిని గ్రహించుకొనంజాలక యిక్కాలమున దానిపై విమర్శనముల వ్రాయఁ దలంచుకొనినవారలు పల్వురు నిక్కము లగు గుణములను దోషములనుగాను దోషములను గుణములనుగాను బరిగణింప మొదలిడుచున్నారు సారస్వతమున విమర్శనములు లేకుండుట యంతగా హానికరము కానేరదు కాని పైరీతి యక్రమవిమర్శనము లుండుట మఱింత హానికరమగును. కాఁబట్టి తగుచర్చ గావించి మనుచరిత్రమునందలి గుణదోషముల నిరూపించి చూపి యిప్పుడు బయలువెడలుచున్న విమర్శనపద్ధతి నొకదారిలోఁ బెట్టుటకై దానిపై విపుల మగు విమర్శనమును వ్రాసి ప్రకటించితిని. ఇది మనుచరిత్రమునందలి సత్యసారము బయల్పఱుచుటకై వ్రాసినదే కాని

దానిని వృథాగా న్యూనతపాలు చేయ వ్రాసినది కాదు. నేను నాశక్తికొలఁదిని మనుచరిత్రమునందలి గుణదోషములను రెండింటిని జూపి యుంటినే కాని దోషైకోద్ఘాటనపరుండనై దోషములను మాత్రమే చూపఁ బ్రయత్నించి యుండలేదు. గుణములను దోషములనుటయు దోషములను గుణములనుటయుఁ దప్పగును గాని దోషములను దోషము లనియు గుణములను గుణము లనియు నిర్ణయించి చెప్పుట తప్పు కానేరదు. గుణాగుణవిమర్శనము సారస్వతాభివృద్ధికి మూలకారణ మని భావించుచునే యుంటిమిక దా!

అయినను నీరహస్యమును గ్రహించుకొనఁజాలక పెద్దనార్యునియం దభిమానము కలవార మని భావించుకొనువారు కొందఱు బయలు వెడలి యాంధ్రకవితా పితామహునియందలి దోష మనినంత మాత్రముననే యాగ్రహము తెచ్చుకొని యావేశపూరిత మగుఖండనముల నావిమర్శనముపై వ్రాసి ప్రచురింపఁజొచ్చిరి. సత్యసారస్వతాభివృద్ధియందలి యభిమానముచే వాని కన్నింటికిని నేను సమాధానముల నిచ్చుచువచ్చితిని. ఇంతలోనీనడుమ బ్రా॥శ్రీ రేకుమళ్ళ అచ్యుతరావు ఎం. ఏ., ఎల్. టి. గారు కూడ నావిమర్శనమును జిత్తగించి దానిపై నావేశపూరితమైన ఖండన మొకదానిని వ్రాసి యీనడుమ జరిగిన యాంధ్రసాహిత్యపరిషద్వార్షికోత్సవసభలోఁ జదివిరి. అది మొన్నఁటిపరిషత్పత్రికలోఁ బ్రచురింపఁబడినది. శ్రీమదచ్యుతరావుపంతులు గారు గొప్పవిద్వాంసులు. ఆంధ్రమునందును నాంగ్లమునందును సంస్కృతమునందును గూడఁ జాలఁ బరిశ్రమ మొనరించినవారు- రాజమహేంద్రవరమునందలి బోధనాభ్యసనకళాశాలలో నుపాధ్యాయులుగా నున్నవారు ఇట్టి పండితవరులు కావ్యవిమర్శనమునకుఁ బూనుకొనుట భాషాభివృద్ధికి మూలమే యగును గాని శ్రీమదచ్యుతరావుగారు వినిర్మలచిత్తముతోఁ బ్రతివిమర్శనమునకుఁ గడంగుటకు మాఱుగా నావేశపూరితులై క్రమమార్గమును విడిచి యక్రమమార్గ మవలంబించి సత్యదూర మగు విమర్శనమునకుఁ బూనుకొనుటచే విమర్శనము సత్యమును బయలుపఱచుటకు మాఱుగా నసత్యసిద్ధాంతములను గావించునదిగా నుండుటచే మేలునకు మాఱుగాఁ గీడే కావించునదిగా నున్నది.

వీరు ద్వేషపూరితులయి నావిమర్శనముపయి ఖండనము వ్రాసిరనుటకు ననేక కారణములు కలవు. ప్రస్తుత మిచ్చట నొకయుదాహరణము నిచ్చెదను.

—। నన్నుదోషైకదృక్కునుగా నెంచుట ।—

సత్యములయిన విమర్శనములును వానిపైఁ బుట్టుప్రతివిమర్శనములును న్యాయమార్గమున నుండుచో వానివలనఁ బ్రయోజన మపారమై యుండును. అట్లుకాక వక్రమార్గమున నుండుచో నవి హానికరము లగునని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు గదా! ఈవిమర్శనములలో సందర్భముంబట్టి విమర్శకునివయి సందర్భానుసారము లగునింద లుండినను సహింపవచ్చును గాని వృథానిందారోపణ లుండిన నయ్యవి సహింపఁదగినవి కావు ఏమన నట్టినిందలు ద్వేషైకజనితములై విమర్శనములఁ బ్రయోజనరహితములఁ జేసివేయును. తమప్రతివిమర్శనములో నాపై లేనిపోనినిందలు చాలమోపిరి.

కొన్నిఘట్టముల విమర్శించుటలో నన్నుఁ గుటిలబుద్ధి యనిరి. బడిపిల్లలతోఁబోల్చిరి. కించిద్జ్ఞునిగా నిరూపించిరి. రసికత యెఱుఁగనిమానిసి యనిరి.

ఇట్టినిందలఁ గావించుటకుఁ దగినయవకాశము నావిమర్శన మొసంగుచుండిన నట్లు చేయవచ్చును గాని నాగ్రంథ మట్టియవకాశ మింతయు నొసంగకుండినను మనరావుగా రానిందలను బలిపూని కావించిరి- ఈనిందలకుఁ దగుసమాధానము నాయాఘట్టములఁ బరిశీలించుసందర్భములలో నిచ్చెదను. కాన వానిమాట నటుండనిండు; మనరావుగారు నావిమర్శనము నంతను బరిశీలించిచూడ నంతను గలిపి కావింపవలసిన నింద యొకటి యున్నట్లు నిశ్చయించిరి. నావ్యాసమునంతను బరికించిమాడ నేను దోషైకదృక్కునుగాఁ గాన్పించితినఁట. అయ్యది వారువ్రాసిన యీక్రిందివ్రాఁతలవలనఁ దేలుచున్నది. ఎట్లనఁ "పెద్దనార్యునిదోషములకై వెదకులాడెడు దృష్టితీవ్రతచే సచురమైనవిమర్శవిచారము చేయక దోషములను దోషారోపితముల నన్నిటినిగలగాయపులుసుగాఁ గలిపి పెద్దనార్యునితలపై రుద్దిరి" అని లిఖించిరి. ఇందువలన నెట్టిన దోషములనెంచవలెనను వృత్తితో మాత్రము నేను నావిమర్శనము వ్రాసినట్లు తేలుచున్నది.

ఇంకను "బ్రహ్మయ్యశాస్త్రిగారన్నవో విమర్శకున కుండవలసిన శాంతచిత్తతయు, నిష్పక్షపాతబుద్ధియు విడనాడి కేవలము పురోభాగిదృష్టిని రంధ్రాన్వేషణమే ముఖ్యకర్తవ్యముగ నెంచి" అని యిఁకనొకచోట లిఖించిరి.

మఱియును "శ్రీశాస్త్రిగారు వారియపారశేముషీవైభవమును బెద్దనార్యునియందు లోపములను గనిపెట్టుటకును, గల్పించుటకును వినియోగించి, గోరంతలు కొండంతలుచేసి యు నపార్థములఁ గల్పించియు, నపవాదబాహు

శ్యమున రోఁతగలుగునటులు ప్రేరేపించియు, ననేకవిధముల నిష్పాక్షికబుద్ధిని విడనాడి యన్యాయముగ విమర్శనము గావించిరి.'' అనియును వ్రాసిరి.

ఇవన్నియును నేను మనుచరిత్రముపై దోషారోపణములను మాత్రము చేసినట్లుగా లోకమునకు వ్యక్తము చేయుచున్నవి- ఇవి యేదో యొకఘట్టమును గూర్చి ముచ్చటించునవి గాక నావిమర్శనమున కంతకును జెందు నింద లగుటచే వీనికి ముందుగా సమాధాన మిచ్చుచున్నాను.

వీరు నన్నీరీతిగా దోషైకదృక్కునుగా నెంచుట యనుచితము. ఏమన (1) నేను నావిమర్శనములో గుణదోషముల రెండింటిని గూడఁ బేర్కొనినాఁడను కాని మనరావుగారు పాఠకులకుఁ దెల్పినరీతిగా దోషములను మాత్రమే వ్యక్తము చేసి యుండలేదు. నేను నావిమర్శనములోఁ గావించిన గుణోద్ఘాటనముల నన్నిటిని దీసి పండితవరులగు బ్ర॥ సోమంచి సూర్యనారాయణశర్మగారొకవ్యాసముగా వ్రాసి దాని నాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందే ప్రకటించియున్నారు. చదువరు లావ్యాసమును జూచిన నీయంశము స్పష్టముగాఁ దెలియఁగలదు. అది 16 సంపుటములో "పెద్దనార్యుని మనుచరిత్రమునందలి మెఱుంగులు" అను పేరతోఁ బ్రచురింపఁబడియున్నది. గ్రంథవిస్తరభీతిచే నే నిచ్చట నిచ్చుటను మానుచున్నాఁడను. గుణదోషముల రెండింటిని నెంచుట నిక్కమగు విమర్శకుని పని యని మనరావుగారొప్పుకొనియే యున్నారు. ఇఁక నన్నుదోషైకదృక్కనుట యనుచితముకాదా?

(2) నేను నాపొత్తములో గుణములను దోషములను గూడఁ జూపుటయేగాక యితరులు గుణములను దోషములుగా నిరూపించియుండ, ఆనిరూపణము తప్పనియు, నయ్యవి గుణములే కాని దోషములు కావనియు నేను బెద్దనార్యుని సమర్థించుచు వ్రాసినఘట్టములును గలవు. ఇందులకొకయుదాహరణ మిచ్చుచున్నాను.

ఇతరులు దోషముగా నెంచినదానిని నేను గుణముగా సిద్ధాంతీకరించుట.

పెద్దనార్యుఁడు ప్రవరుని వర్ణించుచు నాతఁడు రాజులు మున్నగువారి కడ నేమియును బుచ్చుకొనఁడనియు, నప్రతిగ్రహీత యనియు వ్రాసియున్నాఁడు. మాయాప్రవరుఁ డన్ననో ప్రవరుఁ డింట లేనికాలమున నచ్చట సంప్రాప్తమగుచున్న యనర్థములం గూర్చి ముచ్చటించుచు రాజులనగరులనుండి యేకాసువీసములును రాకపోవుటచే నింట నిబ్బంది గలుగుచున్నయది యని

చెప్పినట్లు కవి వ్రాసినాఁడు. ఇది పరస్పరవిరుద్ధముగా నున్నదని యును మొదటఁ జెప్పినదానిని ఖండించి వేయుచున్నది, యనియునుఁ గొందఱు విమర్శకులు వ్రాసిరి. అనఁగా మనుచరిత్ర మీఁపట్టున దోషముపాలయిన దని తెల్పిరి. ఇందుః బరస్పరవైరుధ్య మేదియు లేదనియు నగర కాసుపీసములు వచ్చుట లేదని పలికినవాఁడు మాయాప్రవరుఁడు కాని ప్రవరుఁడు కాఁ డనియు దొంగవేషము వేసినవాఁడు నిజపురుషుని గుణములఁ దెలుపుటలో ననుభవము లేని కారణమునఁ దప్పులపా లగుచుండుట సహజమే యనియుఁ గాన-ప్రవరునిచరిత్రము చెప్పించుటలో దొంగవేషము వేసికొనిన వాఁడచ్చటచ్చటఁ దప్పినట్లు పెద్దనార్యుఁడు చూపుట సహజముగానే యున్న దనియుఁ బ్రవరునిచరిత్రమును వరూథిని యెఱింగియుండునది కాదు, కావున, నాదోషము నావేళ్య గ్రహించుకొన లేదనియు నేను వ్రాసి పెద్దన వ్రాసిన వ్రాఁతల రెండింటిని సమర్థించితిని- నేను దోషైకదృక్కు నే నైనయెడల, పెద్దన నిట్లుల సమర్థింతును. ఇతరులుకూడ దీనిని దోషమే యని తెలిపిరి. కావున నేను దానిని బెద్దచేసి మఱింతయాక్షేపించియే యుందును. అట్లుచేయ లేదు కావున నన్నుదోషైకదృక్కనుటయధర్మము.

—నేను గుణముగాఁ జెప్పినదానిని రావుగారు దోషముగాఁ
జెప్పిన ట్లారోపించుట—

పైరీతిగా నేనును మనుచరిత్రమునందలి వ్రాఁతల రెండింటిని సమర్థించి యుండఁగా రావుగా రీసందర్భములో నావ్రాసిన దాని నెత్తికొని నేను గుణమును దోషముగా నిరూపించినట్లు తాము తమపునర్విమర్శనములో సాహసించి వ్రాసిరి. ఇదియెంత నింద్యమగు కృత్యమో లోకులు గ్రహించుకొందురుగాక. శ్రీరావుగారు సరిగఁ జదివిచూచుకొన లేదు. చూచిన దానిని సరిగ గ్రహించుకొన లేదు. అయినను నావిమర్శనముపైఁ జేతికివచ్చిన వ్రాఁతల నెల్ల వ్రాసివైచిరి- రావుగారిలోను నాలోను దోషైకదృక్కు లెవ్వరో చదువరులే యూహించుకొందురుగాక.

(౩) ఇతరులు పెద్దదోషములనుగా నిరూపించినవానిని గొన్నింటిని నే నల్పదోషములుగాఁ దెలిపియుంటిని. నేను నిజముగా దోషైకదృక్కునై పెద్దనార్యునియం దెక్కైన దోషారోపణము చేయుటకై ప్రయత్నించిన వాఁడనే నైనయెడల నితరులు పెద్దదోషములుగా నిరూపించి వ్రాసిన వ్రాఁతలను నాధారముగాఁ దీసికొని నేను గూడ వానిని ఘనదోషములుగాఁ దెలిపియేయుందు

నుగదా ? నాకట్టి యవకాశ మున్నను దాని నాధారముగాఁ దీసికొని పెద్ద నార్యునియందలి పెద్దదోషములుగా వానినిం జెప్పక పెద్దగా గణింపఁ దగని స్వల్పదోషము లని నే నెందులకు వ్రాసియుందును. ఇందులకుఁ గూడ నొక యుదాహరణము దీసికొందము. పెద్దనార్యుని కావ్యములోఁ గుతపకాలవిష యికదోష మున్నదని విమర్శకులు పల్వురు పెద్దదోషనిరూపణము గావించిరి. అది యల్పదోషము కాని యెన్నఁదగిన పెద్దదోషము కా దని నేను నావిమర్శ నములో వ్రాసితిని. నా వ్రాసినదానింగూర్చి మన శ్రీరావుగారే "ఇది యొక ప్ర మాదము. అంతగాఁ బ్రజ్ఞాలోపముఁ దెల్పునదికా దని చెప్పి శ్రీశాస్త్రిగారే యౌదార్యముఁ గనుపరిచిరి." అని యత్యుదారబుద్ధితో లిఖియించియుండిరి. నేను నిజముగా దోషైకదృక్కునే యైయుండినయెడల నెట్లైనను బెద్దనయందు దోషారోపణముఁ జేయుటయే ప్రధానముగా నెంచుకొని యున్నయెడల నీరీతి నేల వ్రాయుదును.

(4) అనేకసందర్భములలో నేను, బెద్దనార్యునికవిత్వమును హెచ్చుగా నుతించినతావులును గలవు. అవి పత్రికలలోఁ బ్రచురింపఁబడియే యున్నవి. నేను ద్వేషైకదృక్కునే యైనయెడల నాతనికవిత్వము స్తుతిచేయుట యెట్లు కలు గును ? నేను ఖండింపఁదగినయంశముల ఖండించినంతమాత్రమున మనుచరి త్రముపై నసూయకలవాఁడ నని భావించుట యుచితముకాదు. పెద్దనార్యుని మనుచరిత్రములో నేను శిరసావహించు భాగము లనేకములు కలవు.

(5) కొందఱు మనుచరిత్రములో గ్రంథచౌర్య మున్న దనఁగా నది గ్రంథచౌర్యము గా దని వ్రాసితిని. దోషైకదృక్కు నైనయెడల నట్లు వ్రాసి యుందునా.

ఈవిధముగా సత్యపరిశీలనము చేసి యుండినయెడల నన్నుఁ "బెద్దనా ర్యునిదోషములకై వెదుకులాడెడు దృష్టితీవ్రత" కలవానినిగా భావించుట పాడి కానేరదుకదా. అయినను నేనెంచినగుణములను కప్పిపెట్టి వానిమాట తలపెట్టక దోషములను మాత్రమే నేనెంచినట్లు వ్రాయుట చదువరులహృద యమునందు నావిమర్శనముంగూర్చి రోఁతఁబుట్టించుటకై యెత్తిన యెత్తుకాని మఱియొకటికానేరదు. ఇది ద్వేషైకజనిత మగుపనిగాక మఱేమగును.

—రావుగారికి ద్వేషమెందుకు జనింపవలయును—

శ్రీరావుగారిప్రతివిమర్శన మంతయు నన్నేటులయిన బరిహాసపాత్రునిఁ జేయవలె ననువక్రోద్యమములతో నిండియున్నది. అది క్రమక్రమముగా నా

ప్రతివిమర్శనమును జూచినతరువాత నందఱికిని దేటతెల్లము కాఁగలదు. ఇఁక రావుగారి కీద్వేషభావ మెందులకుఁ గలుగవలె ననువిషయముంగూర్చి చర్చించుకొనవలసియున్నది. శ్రీరావుగారికి నాకును నేవిధమగుసంబంధమును లేదు. ఇదివఱకు వారిపై నే నేమియు వ్రాసి యుండలేదు. నాపైకి మాత్రము వారకారణముగ నొకటిరెండుసారులు దండెత్తిరి. అందులకును గారణము గాన్పింపదు. నన్ను వారుసరిగ నెఱుంగనేయెఱుంగరు. అయినను వారికి నాపై ద్వేషము కలుగుటకుఁ గారణ మే మందురా, యది యేదియుఁ గాన్పింపదు. అది యేమి చమత్కారమో కాని యకారణముగ వారికి నాపై ద్వేషము కలిగినది. అట్టిది కలుగునా ? యందురేని కలుగు నని మనశ్రీరావుగారే తమవిమర్శనములో నిర్ధారణము చేసిరి. "అరిస్టైడీసు" అను గ్రీకుమహాపురుషుఁ డొకఁ డుండెను వాఁడఁట- అతఁడు నిత్యన్యాయైకశీలుఁ డఁట. అందు మూలముచే న్యాయమూర్తి యని పేరు వచ్చెనఁట. అతని నొకపౌరుఁడు నిష్కారణముగా ద్వేషించె నఁట- ఈకథను రావుగారే తెల్పిరి. కావున కారణము లేకయే యొకనియందసూయ పెట్టుకొనుపురుషు లుందు రని దీనివలనఁ దేలుచున్నది. 'అరిస్టైడీసు'పై పౌరుఁడు నిర్హేతుకముగా నసూయను బెట్టుకొనినట్లే మనశ్రీరావుగారును నాపై నిర్హేతుకముగా నసూయను బెట్టుకొని నన్నుఁ బరిహాసపాత్రునిఁ జేయుటకై సందర్భము లేకున్నను 'అరిస్టైడీసు'ను పౌరుఁ డొకఁడు ద్వేషించినకథను తమప్రతివిమర్శనములో నెక్కించిరి. ఆకథ వీ రుదాహరించుట కేవిధమగు సందర్భమును లేదు నన్నుఁ బరిహాసపాత్రునిఁ జేయుటకయియే దానిని దెచ్చిపెట్టిరి. దానికి సందర్భము కలిగించుటకై పాపము మనశ్రీరావుగారికిఁ గొన్నియసత్యపువ్రాఁతలు వ్రాయవలసివచ్చినది.

—అరిస్టైడీసుకథనుగూర్చి—

"అరిస్టైడీసు" న్యాయదృష్టికలవాఁడై మిక్కిలి యోగ్యతతోఁ బ్రవర్తించుచుండుటం గని యొకపౌరుఁ డాయోగ్యతం గని సహింపలేక కారణాంతరము లేకున్నను నాతని ద్వేషించె నఁట. అట్టిసందర్భము పెద్దనార్యునిమనుచరిత్రముపై విమర్శనము వ్రాయుటలో నాయెడలఁగూడ సంప్రాప్తించె నఁట. ఇంక వీరతికిన యుతు కేదన "ఆంధ్రప్రపంచమంతయు ననేకవిధములఁ బెద్దనార్యుని మహత్తరకావ్యము నుగ్గడింప వీరికి (అనఁగా నాకు) విసువుగలిగి యొకవిలక్షణమైన విమర్శనవ్యాసమును వ్రాయనెంచితి"నఁట. ఇది వీరు కలిపినయుతుకు.

"అరిస్టైడీసు"ను ప్రజ లెల్లరు మెచ్చుకొనుచుండఁగా నాతని నందులకై యొక పౌరుఁడు ద్వేషించినట్లే, ఆంధ్రప్రపంచమంతయు పెద్దనార్యునికావ్యమును మెచ్చుకొనుచుండఁగా నాకారణమున నేను దానిని ద్వేషింప మొదలిడితి నంట ఇది వట్టియనుచితపువ్రాఁత. పెద్దనార్యునిగ్రంథమును- ఆంధ్రప్రపంచ మంతయు మెచ్చుకొనుచున్నా రనునది కల్ల. "అరిస్టైడీసు" కథను నాకతుకు టకై శ్రీరావుగా రీవాదమునకు దిగిరి. ఇదివఱకు మనుచరిత్రముపై నెవ్వ రును ఖండనములను వేనిని వ్రాయక మెచ్చుకొను చుండుటయు నేనొక్కఁడను మాత్రమే దాని పై ఖండనమును వ్రాయుటయుఁ గలిగినచో నొకవేళ "అరిస్టై డీసు"కథను నా కతుకుట యొకింత తగి యుండును. కాని మనుచరిత్రముపై నేనెంచినదోషములవంటి దోషములను బహువిమర్శకులు చూపుచున్నారు. దానిపై ఖండనము వ్రాయుటకుఁ బూనుకొనినవాఁడను నే నొక్కఁడనే కాను. అనేకపండితు లాపని నొనర్చిరి. ఇదివఱకు మనుచరిత్రముపై ఖండనము లేవి యు లే నట్లును నున్న దంతయు గుణోద్ఘాటనమే యైనట్లును శ్రీరావుగారు సాహసించివ్రాయుట యాశ్చర్యమును బుట్టించుచున్నది. లోకమున కీభ్రాంతి కలుగకుండుటకై మనుచరిత్రముపై లోకమున బయలువెడలుచున్న ఖండ నము లేరీతి నున్నవో వానిని వ్రాయుచున్న వా రెవరో యీక్రిందఁ జూపు చున్నాను. చదువరులు శాంతచిత్తముతోఁ జిత్తగింతురుగాక.

—॥ కీర్తిశేషులైన వనప్పాకం అనంతాచార్యులవారు. ॥—

వీరు బి. ఏ. బి యల్ పరీక్షల నిచ్చి చెన్నపురియందుఁ గల యున్నత న్యాయస్థానమున న్యాయవాదులై యుండుటయే గాక సంస్కృతాంధ్రముల యందుఁ గూడ గొప్పపండితులై యనేకగ్రంథములకుఁ బీఠికలు వ్రాసియును సద్విమర్శనముల నొనరించియును వాసిగాంచియున్నవారు. వీరికి "విద్యాబ్ధి నోధి" బిరుదము కూడఁగలదు. ఇట్టిపండితశిరోమణులు మనుచరిత్రముం గూర్చి యీక్రిందిరీతిని వ్రాసిరి.

" He has treated as to the common places of human affairs and to the physical affects of the sort of love, which coarser minds gloat over, and which we want no poet describe to the world."

(సామాన్యమానవపూరితము లగుతావులను పామరజనైకరంజక మగు నట్టియు, నేకవియు లోకమునకుఁ దెలుపఁదగు నని మనము కోరనట్టియు కా మవర్ణనములను నాతఁడు (కవి) వర్ణించి మనకుఁ జూపెను.) (స శే)

గీ. మధురకంచికాశిమాయాపురముద్వార,వతియయోధ్యయు యవంతిపురము
నాఁగ నెగడు ముక్తినగరంబులం దున్న, నరులు పుణ్యభాజనములు గారె.

శా. వేణీలోచనలుం గవీశ్వరులుఁ బ్రత్యేకాఢ్యులున్ జాణలు
న్వీణావేణుకళాప్రవీణమతులు న్విద్వాంసులు న్వీరులున్
క్షోణీదేవతలు న్మహోత్సవముల న్శోభిల్లఁగా నిత్యక
ల్యాణం బై చెలువొందు నాపురము దివ్యం బైన సంపత్తితోన్. ౭౮

సీ. దానప్రశస్తహస్తప్రభావము గల్గు భూవల్లభులును దంతావళములు
వివిధపదక్రమవిహితవర్తన గల్గు కుంభినీసురులును ఘోటకములు
బహుళసంఖ్యాతనిర్వహణచాతురి గల్గు నుత్తమగణకులు యోధవరులు
నక్షపాటవసంభృతార్థభావముగల్గు నాదిజాదవులును సరదములును
బదడు పసిఁడిగాఁగ భాండసంపద గల్గు, గ్రొత్తవర్తకులును గుమ్మరులును
జొప్పదప్పకునికి నెప్పున నొప్పుల, కుప్పయనఁగఁ బరఁగు నప్పురంబు.

గీ. అందుఁ జంద్రగుప్తు నాత్మజుండగు భర్తృహరియు రాజు విక్రమార్కుఁ డతని
సవతితల్లికొడుకు యువరాజు తన్మంత్రి, భట్టి నాఁగ నీతిపరుఁడు గలఁడు.

చ. అలక లలివ్రజంబు, వదనాబ్జము చంద్రుఁడు, సుస్వరంబు కో
కిలములు, మంజువాక్యములు కీరగణంబుల సొంపు, చల్లనూ
ర్పులు మలయానిలం, బయిన రూపము దాల్చి యనంగసేననాఁ
జెలఁగె ననంగసేన యను చేడియ భర్తృహరీష్టభార్య యై. ౭౯

క. తరుణులలో మిక్కిలి నీ, తరుణికడం జిక్కి పీతధరణీవరుఁడై
యొఱపునఁ దదీయచేతో, హరుఁడై హరివోలె భర్తృహరి విహరించెన్.

ఉ. అత్యనురక్తి భర్తృహరి యంతిపురంబునఁ గేలిలోలుఁడై
నిత్యరతిప్రసంగముల నిల్వఁగ నాతనిదర్శనంబు సాం
గత్యము లేకయుం బ్రజలు కార్యమువట్లను భట్టి విక్రమా
దిత్యులనేర్పునం దగవు దీఱఁగ నుండిరి నైజవృత్తులన్. ౮౦

క. ఆదినముల నప్పురిలో, వేదవిదుం డైన యొక్క విప్రుఁడు మిగులం
బేదఱిమి నోగిలి ధనసం, పాదనమతి భద్రకాళిపాలికిఁ జనియెన్. ౮౧

క. చని యాగుడిముందట నుం, గ్రనియతిఁ దప మాచరింపఁగా నాదిమయో
గిని మెచ్చి దివ్యరూపం, బున నిలిచె స్వప్రుతలఁపుపొం దొనగూర్పన్.

ఉ. అత్తఱిఁ జాగి మ్రొక్కుచు ధనాఢ్యత వేఁడుట దప్పి, యాత్మలోఁ
దత్తఱ మంది బ్రాహ్మణుఁడు తా నమరత్వము వేఁడినం గృప

యత్తమునస్సయైన జగదంబిక యేకజనోపభోగ్యమా
త్రోత్తఫలంబు దెచ్చి యిది గొమ్మని యిచ్చిన వచ్చె నాతఁడున్. ౮౨
క. వచ్చుట విని తన కెదురుగ, వచ్చినసతిఁ జూచి పిన్నవారలసేమం
బచ్చుపడ నడిగి యూషం, డిచ్చి యమర్త్యత్వ మిచ్చు నిది యని చెప్పెన్.
క. అనవుడు విని యతనికుటుం, బిని యును దారిద్ర్య దుఃఖపీడిత యగుటం
దనపతిఁ గడు దూఱుచు ని, ట్లనియె మనస్తాపమున నిరాకరణముగాన్.
ఉ. అచ్చట మెచ్చు గాంచి యిట కర్థము దెచ్చెద వంచు నమ్మి ము
చ్చిచ్చున నెచ్చి పొట్ట కొక చేరెఁడు గంజియు లేక యాఁకటం
జచ్చియుఁ జావ మించుక విషంబయినం గొనిరాక దేఁచెఁ
దెచ్చితి విట్టిపండు విధి ద్రిప్పఁగ ఛాందసబుద్ధి దప్పునే. ౮౫
క. కనుపునకుఁ గూడు గానక, పడి మిడిమిడి మిడుకునట్టి బడుగున కియ్యా
అడి యమరత్వంబేటికిఁ, గడు పిటఁ గాలంగఁ గంటఁ గాటుక యేలా.
క. గతి దప్పిన పనికేమని, పతి దూఱఁగవచ్చు నట్టి ఫలమున నొక సం
గతి ధనము వడయవచ్చును, మతిలో స్త్రీబుద్ధి యనక మన్నింపఁదగున్.
మ. ధరణీకాంతునకైన నొప్పు నమరత్వం బింక నీవేగి యా
నరనాథుం గని దీని నిచ్చి బహురత్నస్వర్ణనిష్ఠోజ్జ్వలాం
బరభూషాది సువస్తువు ల్వడసి రమ్మా యంచుఁ బొమ్మన్న భూ
సురుఁ డేగెన్ ఫలహస్తుఁ డయ్యును *విహస్తుండై నృపాస్థానికిన్.
శా. ఆవేళన్ రమణీమణుల్గొలువఁగా నాస్థానభూమి న్సుఖ
శ్రీ వెంపారఁగ నున్న భర్తృహరిధాత్రీనాయకుం గాంచి భూ
దేవుం డుత్సవ మంది యాదరముతో దీవించి యాపండు న
ద్భావంబొప్పఁగ నిచ్చి చెప్పె వరుసం దత్ప్రాప్తి సత్త్వంబులన్. ౮౯
చ. బహుజనరక్షకుండ వగుపార్థివ నీక తగు న్ఫలం బను
గ్రహమునఁ బుచ్చుకొమ్మనినఁ గైకొని భూపతి వేడ్కతో యశో
మహిమకుఁ జేరుగాఁ బసిఁడిమాడలుఁ జెప్పినపట్టుచీరలు
న్సహితముగైన రత్నములు మన్నన నాతని కిచ్చి పుచ్చి తాన్. ౯౦
క. నే నుండఁగ నిది నచ్చిన, నే నుండుట గడిఁది యిట్టినెలఁతుక గలుగ
న్నే నున్న నొప్పు నని తన, చేనున్న ఫలం బనంగసేనకు నిచ్చెన్. ౯౧

* విహస్తుఁడు=చేయుతేనివాఁడు, వ్యాకులుఁడు.

సీ. ఆపొలఁతియు దాఁచి యాపండుఁ దనతోడ నూని కూడెను మందఁడీనికిచ్చె
వాఁడును దనుఁ గోరి వచ్చి యాసాలలోఁ గసవూడ్చునట్టి బానిసకు నిచ్చె
యదియును దనకోర్కి పడిలఁబుగా మున్న తనకూర్చు పసులగోపునకు నిచ్చె
వాఁడును దనకుఁ దావలచి కొట్టములోని పెండ యెత్తెడునట్టి ముండకిచ్చె
నదియు దాసిరాక మొదలె టెఱుఁగమిఁ జేసి, పేఁడబుట్టిలోనఁ బండు పెట్టి
కొంచు నింటి కేఁగుదెంచుచోఁ దెరువున, నరుగుచుండి భూమివరుఁడు గనియె.

క. కని దానిఁ బిలిచి యిది యే, యనువున నీకుఁ జేరెఁ జెప్పు మనవుఁడు నాత
మ్మునిమఱఁది పసులఁ గావఁ, జని యది యిచ్చె ననఁగ జనవిభుఁ డలుకన్.

గీ. తొంటివిప్రుని బిలిపించి ధూర్త నీవు, తెచ్చియిచ్చిన ఫలమని తెల్పి ధనము
గొంచు నేగిరి పడి మొల్ల క్రొత్తయోడి; దీని కిచ్చినదనుడు నా ద్విజవరుండు.

క. నే నిచ్చినదియె యిది మఱి, కానేరదు నన్నుఁ గల్లగాఁ జేయకుమీ
యే నెపమున నిటు చేరెనొ, దీనిని శోధింపు వసుమతీవర యనినన్. ౯౨

క. ఉల్లమునఁ గనలి ధరణీ,వల్లభుఁడుం దానిఁ బిల్చి వనితా యిది నీ
యిల్లే విధమునఁ జేరెను, గల్లాడక చెప్పు*మిన్నుఁ గాచితి ననియెన్. ౯౩

మ. అనిశం జెప్పక తీర దంచు నది నెయ్యం బొప్ప నాగోపుఁ జె
ప్పినఁ దన్మాలమునం గ్రమక్రమమునం బృథ్వీశ్వరుం డంతయు
న్విని దండింపక యాత్మ రోసి కలికి న్వేయింపుల నొంపులం
దనియం జేసిన నిల్చునే వనితచిత్తం బంచు నిందించుచున్. ౯౪

గీ. కర్పూరంపుఁగుదుటఁ గస్తూరి మెరుపుతో, నల్లి నాటి చందనోదకములఁ
బెంపిరేని దానికంపుమాయని భంగి, నెంతయైన నిలువ దింతిమనము ౯౫

క. వనిత యొరుఁ జూచిలోనగు, నపనిక్కము పతియు దోడియతివలుఁ బరులుం
గని విని యెగ్గొనరించెద, రని మానిన మానుఁ గాక యడ్డము గలదే. ౯౬

సీ. మదవెక్కుచన్నులు మాంసపుముద్దలు హేమకుంభములకు నెక్కు డనుచు
దూషితమూత్రపురీషదుర్గంధమౌ జఘనంబు కరిశిరస్సదృశ మనుచు
జిలిబికిం బులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు సుధాంశుఁ డనుచుఁ
గండలఁ దోలు†బొక్కలుఁగూడఁ బొదికిన యాకృతి పసిఁడిసలాక యనుచుఁ
‡ దేగడైన పెదవి త్రేగు డమృతమని, కవులు వొగడఁ బేరు గలిగెఁ గాక
తత్త్వ మెఱిఁగి యిట్టు తలపోసి చూచిన, నింతి రోఁత కెల్ల నిల్లు గాదె.

---

* తప్పాగాచితి † డొక్కలు ‡ ఉమియు పెదవి త్రేగుడమృతంబటంచును— తేగడైన పెదవి—

చ అనుచు బహుప్రకారముల నంగనల న్మది రోసి యాత్మకా
మినులఁ బరిత్యజించి యిఁక మీమతి కింపగువారిఁ జేసికొం
డని సెలవిచ్చి రాజ్యసుఖమంతయు మాని విరక్తచిత్తుఁడై
యనుజుని విక్రమార్కునిఁ బ్రియంబుగఁ బిల్వఁగఁ బంచి యిట్లనున్. ౧౦౧

క. మనతండ్రి సారమంత్రం, బున దప మొనరించ మెచ్చి మున్న ర్కుఁడు దాఁ
దనయుఁడ నై పుట్టెదఁ బొ, మ్మని నీవై పుట్టె విక్రమార్కుం డనఁగన్. ౧౦౨

గీ సర్వలక్షణముల సంపూర్ణుఁడవు నీవు, భట్టి మంత్రి గాఁగఁ బ్రజలనెల్ల
నేలు మంచు ముద్ర యిచ్చి దేశాంతరం, బరిగెఁ బరమయోగిచరితమునను.

క. అన్నరనాథుఁడు విడిచిన, యన్నులమున్నూ ఱు నతని యనుమతి *గలుగన్
మున్నూ ఱుఁ జేసికొని ధర, మున్నూ ఱుకులం బనంగ మొనసిరి సిరులన్.

శా. రాజ్యం బేలుచు విక్రమార్కుఁ డిట సంరంభోచితోజ్జృంభణ
ప్రాజ్యప్రాభవసంభృతద్విపహయప్రారంభ సైన్యంబుతో
నజ్యం బైనధనుర్బలంబు కలిమిన్ సామంతులన్ గెల్చి త
త్ప్రాజ్యంబై ధనధాన్యలక్ష్మిఁ బరఁగెం బుణ్యం బగణ్యంబుగన్. ౧౦౫

క. అతఁడు మహాకాళున కా,తత మగుతప మాచరంచి తన కమరత్వ
స్థితి వేఁడిన నరులకు †నీ, గతిపడ దొండమగు మానినఁ గడిఁదిగ మఱియున్.

క. ఒకదివసం బెక్కుడుగా, నొక యేఁ డగు పిన్నపాప కుదయించిన బా
లకుచేతఁ గాని తాఁ జా, వక యుండను వేఁడికొనిన వర మతఁ డిచ్చెన్.

వ ఇట్లిచ్చి. ౧౦౮

క. వెయ్యేఁడులు రాజ్యసుఖం, బయ్యెడఁ బొమ్మనిన దేవునానతి నారా
జియ్యకొని వచ్చి భట్టికి,నయ్యానతి క్రమముఁ జెప్ప నతఁడును మఱియున్.

క. నే మఱియును నొక వేయేం, డ్లీమహి యేలంగ నీకు నిచ్చెద నని భీ
తిూమార్గి నగుచు రాజ్య, ‡ వ్యామోహం బర్ధవర్ష మడఁచుము చాలున్.

గీ ఆఱునెలలు నగరియందు నిల్వుము మీఁది,యాఱునెలలు యోగివై చరింపు
పురిసహస్రవర్షములు చెల్లఁ బొన్నూళ్లు, నున్న వేయుఁ జెల్లుచుండు ననియె.

క తద్వచనము నిజహితముగ, హృద్వనజములోఁ దలంచి యిల యెల్ల నుపా
యద్వయమున నరయుచు భూ,భృద్వల్లభుఁ డేలెఁ బ్రజలు ప్రియమందంగన్.

వ. అంతనొక్కనాఁడు ౧౧౩

* మిగులన్. † నిదిగతిపడదు. ‡ వ్యామోహం బదియు నర్ధవర్షము చాలున్

సీ. ఒకయోగి యతనిఁ గాటికిఁ దోడుకొనిచని బేతాళునర్పించి ప్రీతినునిచి
వేలిమిచేసి తా విపరీతగతిఁ బొందె బేతాళుఁ డారాజువెంపు మెచ్చి
యెడరైనఁ దలఁపుమీ యే వచ్చి పనులెల్లఁ జేసెద మఱి యష్టసిద్ధులొందు
ననిపోయె బ్రహ్మాదులును మీఁద విద్యాధరాధిపత్యం బగు ననుచుఁ జనిరి
భూవిభుండు మగుడఁ బురమున కేతెంచి, సప్తసంతతులను సత్రములను
సంతతాధ్వరములఁ గాంతేయుగతి శక, కర్తయై ధరిత్రిఁ గీర్తినెఱపె. *

ఉ. సజ్జితదానధర్మగుణచారువిచారుఁడు వైరిదారదృ
క్కజ్జలమార్గనప్రథమకారణచారుకృపాణపాణి వి
ద్వజ్జనబృందవందిజనతాజలజార్కుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున నయోన్నతి రాజ్యముసేయుచుండఁగన్. ౧౧౫

వ. తొల్లింటి కాలంబున. ౧౧౬

క. విశ్వామిత్రుఁడు తప మతి, శాశ్వతముగఁ జేయ నెఱిఁగి శంకించి యమ
ర్త్యైశ్వర్యుఁడు కొలువులోఁ దన, విశ్వాసము† గలుగునట్టి వెలఁదులకనియెన్.

క. ఓయూర్వశి యోరంభా, మీయిద్దఱిలోన నొక్క మెలఁతుక నటనో
పాయంబునఁ జిక్కిడి ముని, సేయుతపంబునకుఁ గీడు సేయఁగవలయున్

చ. అన విని పాత్ర నీయెదుర నాడిన నిద్దఱిలోన దీనిచేఁ
బని యగు నంచు నీ కెఱిఁగి పంపుము నావుడు నల్లకాకలం
డనవుడు నాఁడు రంభ తగ నాడినఁ జూచి ప్రహృష్టచిత్తుఁడై
యొనర ననుక్రమంబునను నూర్వశి యాడిన నట్ల మెచ్చుచున్. ౧౧౯

క. వారల యెక్కువతక్కువ, లేరీతుల నెఱుఁగలేక యింద్రుం డిఁక నె
వ్వారెఱుఁగుదురో యని బృం, దారకమునివరుల నడుగఁ దత్సభలోనన్.

క. సారదయామృతమతి యగు, శారదకృప వడసి యతివిశారదుఁ డగునా‡
నారదుఁ డుపమితశారద, నీరదుఁ డావిక్రమార్కనృపతిం జెప్పెన్.

ఉ. అర్కునిమూర్తి సర్వకళలందుఁ బ్రవీణుఁడు సంగరస్థలిం
గర్కశరాజలోకలయకాలుఁడు దానవినోది సాహసం
పర్కవిదూరుఁ డార్తపరిపాలనశీలనశాలి విక్రమో
దర్కుఁడు విక్రమార్కుఁ డిట కాతనిఁ బిల్వఁగఁ బంపు నావుడున్. ౧౨౨

మ. మునివాక్యంబున నింద్రుఁ డిట్టిగుణధాము న్విక్రమాదిత్యుఁ దో
డ్కొని రమ్మా యని పంపె మాతలి నతండుం దేవునం బాగన ¶

---

* గీర్తినిలిపె. † విశ్వసనము ‡ దయ్యున్. ¶ దేవునుపచ్చని-

చ్చని గుజ్జంబులఁ బూన్చికొంచు నధికోత్సాహంబుతో మింటిపైఁ
జని యుజ్జైనికి డిగ్గి యచ్చట నృపాస్థానంబు వీక్షించుచున్. ౧౨౩

మహాస్రగ్ధర-
సభలోనం గాంచె వర్ణాశ్రమజనపరిరక్షాపరారంభలీలా
శుభనిత్యాచారు లోకశ్రుతవిశదనిజస్ఫూర్తిసత్కీర్తిలక్ష్మీ
విభవాకృష్టార్థిజాతాభినుతవితరణాన్వీతహస్తప్రభావ
ప్రభవశ్రీరమ్యు ఖడ్గప్రకటితజయసంపద్గు సద్విక్రమాగ్ర్యున్. ౧౨౪

మ. కని యింద్రుం డిదె నిన్నుఁ బిల్వఁబనిచెన్ స్వర్పాల విచ్చేయుమా
యనిన న్గొబ్బున లేచి మాతలికి నాహ్లాదంబుగా నాదరం
బొనరం జేసి మహోత్సుకత్వమున నాయుర్వీశుఁ డుం గాముఁడో
యన వచ్చెన్ హరితాశ్వరత్నయుతదివ్యస్యందనారూఢుఁడై. ౧౨౫

వ. వచ్చి కామధేను కల్పతరు చింతామణీ సంతతనివాసం బై యమరు నమరావతీపురంబు సొచ్చి తేరు డిగ్గి మాతలియునుం దోడరా నమరకిన్నరవిద్యాధరయక్షరక్షోనికరపరివారుండును దిక్పాలముకుట తటఘటిత మణిగణకిరణారుణిత చరణకమలుండును నప్సరోహస్తచామీకరదండచారు చామరవ్యజనవీజ్యమానుండును నై సుధర్మాసభామధ్యంబునం దారకిత తారాపథమధ్యభాగంబునఁ దారాగణపరివృతుం డై వెలుఁగు చంద్రునిచందంబున నందం బగు బృందారకేంద్రునిం గని ప్రణమిల్లిన నతనిం గౌఁగిలించుకొని గారవించి దీవించి యాసన్నమణిమయసింహాసనంబుపై సుఖాసీనుం జేసి కుశలం బడిగి సురపతి కిట్లనియె. ౧౨౬

గీ. ఊర్వశియు రంభయును నాడఁగా మాకుఁ, దారతమ్య మెఱుఁగఁ దరముగాదు
సర్వకళలయందు జాణవు నీ వంట్రు, దీని నిర్ణయింపు మానవేంద్ర. ౧౨౭

గీ. అనుచుఁ బలికి మఱియు సాంగసంగీత వా, ద్యాదికృత్యములకు ననువు మెఱయఁ
గడఁగి నిలువుఁ డనుచు గంధర్వులకుఁ జెప్పి, యున్న రంభ నాడు మన్న నంత.

శా. గంధర్వు ల్పదునాల్గు దోషములు దక్కం దాళమానంబుతోఁ
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిం* గావింపఁగా వాద్యముల్
ధింధింధిక్కధిమిక్కతక్క ధికతోంధిక్కత్తకోఝు కిణం
ధింధాఁ ఝుంకకు ఝుక్కుధిగ్ధిగుడధాధీయంచు మ్రోసె న్వెసన్. ౧౨౮

---

* ధ్రువాదిబంధసరణిం.

క. జంభారి యొకరు నాట్యా, రంభమ్మున నూర్వశీపరాజయకృత సం
రంభయు నూపుద్వయజిత, రంభయునై రంభ నిలిచె రంగస్థలిపై. ౧౩౦

క. స్ఫురకతిపంపురఁ గూడిన, మురజధ్వను లభ్రశబ్దములుగా శృంగా
రరసముఁ గురియఁగ నాడెను, దిరుపుల మిపముల మెఱుపుఁదీగయుఁ బోలెన్.

వ. ఇట్లు రంభ యాడినం జూచి నాకలోకభూలోకనాయకులు మఱునాఁ
డూర్వశి కవసరం బిచ్చిన నదియును సంగీతశాస్త్రానుసారంబుగా* నిలిచి
విలక్షించుచు—

క. తనువున గీతాలంబన, మును జేతుల నర్థప్రదర్శితమును నేత్రయుగం
బున భావముఁ బదములఁ దా, ళ నిర్ణయమ్మును మెఱయఁగ లాస్యము నెఱపెన్.

క. సురకామిని తననయనము, లరుమగఁ దలచుట్టివచ్చు ననుట నిజముగాఁ
దిరుగుచుఁ బరిమండలితాం, బరపల్లవ మొనటించె మనుగొడుగుక్రియన్.

క. ఈ క్రియ నూర్వశి యాడిన, విక్రముఁ డిది యె మఱియు నెరవరియనినన్
శక్రుఁడు మర్మము దెలుపుము, యే క్రమమున దీని నిర్ణయించితి వనినన్.

ఉ. నావుడు నాతఁ డిద్దఱును నాట్యమున న్సరివత్తు రిందు శా
స్త్రావగతప్రసంగముల సాంగముగా నిది యాడె గాన ని
ట్లే వివరించి యూర్వశియ యెక్కుడుగాఁ గయికొంటి నన్న న
ద్దేవ్రుఁడు మెచ్చి యాతనికి దివ్యవిభూషణ మిచ్చి పొండియున్. ౧౩౫

సీ. ప్రభల నొప్పొంగు ముప్పదిరెండుబొమ్మలు నన్నివాకిళ్లఁ బెంపడరుచున్న
నవరత్నఖచితమై వివిధసోపానమై భాసురంబైనసింహాసనంబు
మెచ్చుగా నిచ్చిన మెయికొని ప్రణమిల్లి దేవేంద్రు వీడ్కొని తేరిమీఁద
నిడికొని యుజ్జైని కేతెంచి వేడ్క సింహాసనం బెక్కి యాయవనివిభుఁడు†
సిద్ధులెనిమిదియును జేకూరఁ బగతుర, పేరడంచి యాజ్ఞ పెంపుమీఱ
నేకవీరుఁడై యనేకవర్షంబులు, ధరణి యేలెఁ బుణ్యచరితుఁ డగుచు

శా. సత్పాత్రప్రతిపాదితార్థుఁ డయి రాజ్యం బుర్విలో సర్వసం
పత్పూర్ణంబుగఁ జేయుచుం బ్రజల భూపాలుండు పాలింపఁగాఁ
దత్పూర్వార్జితపుణ్యభోగముల కుత్పన్నత్వసంపాదులై
యుత్పాతంబులు పుట్టె నుజ్జయినిలో నుల్కాదిలక్ష్యంబులై. ౧౩౬

---

* సంగీతప్రసంగానుసారంబుగా. † నిడికొని యుజ్జయినికిఁ దెచ్చి యొకవేళ నమ్మహా
సన మెక్కి యవనివిభుఁడు.

క. అట్టివి గని జనపాలుఁడు, భట్టిం బిలిపించి నీవు భావజ్ఞుఁడ వీ
పట్టున నేతెఱఁ గగునో, యట్టి తెఱంగెఱుఁగు మనిన నతఁ డిట్లనియెన్.
గీ. కడగ నేలఁ గూలెఁ బట్టమేనుఁగు వ్రాలె, మేడఁ గాకి కదుపు గూడి యుఱుచె
నిన్న వారువముల కన్నుల నీరొలికె, దీన నీకుఁ గీడు తెల్ల మింక. ౧౪౦
క. ఇది నిజ మనవుడు నతఁ డే,కదినాధికవర్షయైన కన్యకు సుతుఁ డె
ట్లుదయించు నాకుఁ గీడౌ,ట్లాదవ్వ న్నదిలోన బెగడకుండుము.* భట్టీ. ౧౪౧
క. జమునికి నెరగొసెద† నా, క్రమ మెఱుఁగ వెయనుడు నతఁడు కమలజఘటనా
సమయం బైన నసంభావ్యము లైనను సంభవించు నది యెట్లనినన్. ౧౪౨
క. ఇది మానిసి యిది సింగం, బిది దేవత యను వివేక మెడలఁగ బలసం
పద నుక్కుఁగంబమున హరి, యుదయించెఁ డె దైత్యవరుని నుక్కడఁగింపన్.
క. ఏకద్విత్రిచతుఃపం,చాకృతికృతసంఖ్యముఖుల కవి జేయుం డై
కైకొనిన తారకాసురుఁ, బోకార్పఁగ షణ్ముఖుండు పుట్టుట వినవే. ౧౪౪
మ. వరపుత్రుం డమరేంద్రవైరి పరిఖ ల్వారాశి యాలంక దా
గిరిదుర్గం బసురు ల్బలంబులు దశగ్రీవుండు రా జిట్లు బం
ధురమౌ రాజ్యము వాలు దేలగిల మిత్రు ల్పుత్రులం గూడఁగా
నరులు న్వానరులుం గొనం దలఁచి చన్నం జేటు వాటిల్లదే. ౧౪౫
ఉ. కావున నిట్టి బాలకుఁడు గల్గుట తథ్యము నీకు నిష్టులౌ
వేవులవారి చేతఁ బృథివీస్థలిలో నరయింపుమన్నఁ దా
నావచనంబు లియ్యకొని యాత్మహితుం దలపోసి విక్రమా
ర్కావనివల్లభుం డెడ రంచుఁ దలంచెఁ బిశాచముఖ్యునిన్. ౧౪౬
క. ఆతలఁపున వచ్చిన నతఁ, డాతెఱఁ గెఱిఁగించి యరయ ననిపిన పిదపన్
బేతాళుఁడు పాతాళము, భూతలమును నరసి వచ్చి భూపతితోడన్. ౧౪౭
సీ. జననాథ నీవు పంచిన నెల్లచోటులుఁ దిరిగి ప్రతిష్ఠానపురములోనఁ
గుమ్మరి యింట శేఁగొమ్మముందట మఁటిబలములతో నాడెడు బాలుఁ జూచి
యెవ్వరివాఁ డను నెడ నొక్క విప్రుండు తనకూఁతు కొడుకు తజ్జనని యిద్ది
యేఁటిపైనొకదినం బేగుచో ‡నాగేంద్రుఁడీ పొసఁ గూడిన§ నితఁడు పుట్టె
దీని కారణంబు దేవర గాక యెం, డెవ్వఁ డెఱుఁగు ననుచు నిట్లు పలికె
నింక రాజ్యభోగ మింక కుండఁగ నీవు, సాహసంబు సేయు సాహసాంక.

* బెదరకుండుము. † నొరగొసెద. ‡ బోగిన. § గోరిన.

నాఁగ మలక మ్వల్ల నాఁగఁ బలక ప్వల్ల నాఁగఁ గొఱఁత కొర్త నాఁగ నిటులు
చెరలాట చెర్లాట చెలికానిరాక నాఁగఁ జెలికాన్రాకనఁగఁ దగునిఁక
నేకపదమ్ముల కిత్వ మణఁగుఁ గల్గుఁ గొలిమి కొల్మి యనఁ దగు మఱి పొట్టి
రేను పొ్రటే నన నౌను మన్నెఱికము మన్నెర్క మన నిట్లమరు నవలను
దెనుఁగున నైయాలకును విరళత్వంబు వచ్చు నణంగుచు నయిని పైని
అయిదును నైదును దయివాఱ దైవాఱ నవు నౌను గవులు కౌలనఁగనిటులు
దలఁపఁ గ్రియాపదాంతము లైన రేఫలపయి నుత్వ మంతటఁ బరఁగు నణఁగు
నొకచోట హల్లుపై నున్న రమాధవుఁగొలుతురు తలఁపుమద్గురువు ననఁగఁ
దోయజకువలయాప్తులు పశ్చిమాద్రిపైఁ గ్రుంకుదు ర్వడిగనా నింక నవల
లఘువులతుదిహల్లులకును డాపలనున్న సున్న లూఁదుచుఁ దేలుచును దలిర్చు
ఘనుఁడు ఘనుండు నా నినుఁగ నెను నినుంగ నెనన నన్నును నిన్నునని యెడినుఁడు
వులపై నకారంపుఁబొల్లల్ నిలుచుఁ బోవు నచ్చుపై నుండెడియట్టిచోట
నిన్ను నెఱుంగును నిన్నెఱుంగును నన్ను నెఱుఁగు నన్నెఱుఁగునానిటులఁ దనరు
నవలదీర్ఘములపై నఱసున్న నూఁదరు గూఁడు తూఁడన నిట్లు గొఱలుచుండు
నరయంగ నీఁకమీఁద నన్నకారపుఁబొల్ల నూఁదఁగఁ దగు నచ్చుపైఁ దగునెడఁ
బన్నుగ నందిని యన్నేటితరఁగనా వెన్నుండు నరున కిచ్చెన్నుదుటన
నిటుల వెలయుచుండు నీఁకజ శ్వరీతులు తెలిపెదఁ బ్రథమాంతములపయి కచ
టతపలై మను గసడదవలౌ రాముండు గనియె లక్ష్మణుఁడు సెప్పెను గురుండు
డక్కరి భరతుండు దక్కు శత్రుఘ్నుండు వుట్టెనా లక్ష్యము లిట్టి వింక
నవల సుబంతపర్యాయంబు నేర్పడ సర్వవిభక్తులసరణి దెలుపు
దలద్వితీయయు మొదలౌ విభక్తుల యాకాంక్ష లేనిచో నలరుఁ బ్రథమ
యలప్రథమయు ద్వితీయయుఁ దృతీయ చతుర్థి పంచమి షష్ఠి సప్తమియు నవల
సంబోధనయు నాఁగ సరవితో నెనిమిదివగల విభక్తులు వఱలుచుండు
డుమువులు ప్రథమగ నమరునా నిను లనునవి రెండునుద్వితీయయనఁ జెలంగుఁ
జేత చేతో డతోఁ జెలఁగుచుండుఁ దృతీయ యావల కై కొఱ కనఁ జతుర్థి
వెలయుమఱి, కతన, వలన, కంటెను బొంటి*యనఁగను బంచమియై యెసంగు
నూహింపఁ గి, కినులు, యొక్క, కు, కునులన షష్ఠియై చెన్నారు సరవి నింక
నిందు నందు ననంగ నిఁకయు సప్తమిగ నొప్పు నెదిరిపిలుపు సంబోధన మగు

*పట్టి.

వరుస వీనికి నుదాహరణలు రాముఁడు, రాముని, రాముచే, రాముకొఱకు,
రామభద్రువలన, రామచంద్రునకు, శ్రీరామునందు, నోరామ యనఁగ
నవలఁగూర్చునద్వితీయకు గుఱించి యనసాహారిగుఱించని రిట్లు లమరు లనఁగ
నల చేసి యనుతృతీయకు వచ్చుటంజేసి యనఁగ రాజిల్లు వలన ననియెడి
పంచమి కలదు శ్రీవలన ననఁగ లోపలను షష్ఠి కిలలోపల ననంగఁ
దనరును విషయార్థమునను వర్తించు సప్తమికి భరతవిషయమునఁ జతురుఁ
డనఁదగు నిఁకఁ దత్సమాదులకు విభక్తు లెక్కడిచందంబు లెవ్వి యనినఁ
బొల్లులును విసర్గములుఁ బోవ సంస్కృతపదములఁ దెనుఁగువిభక్తు లెక్కుఁ
బురుషవాచకములై పరఁగునదంతశబ్దంబు లన్నియు నుదంతమ్ము లగుచు
నలయుదంతంబు లుదంతంబు లగుచోట నొకనిఁ జెప్పఁ దలంపనొదవు 'డు' వది
తోడనె యఱసున్నతోఁగూడి రాఁదగు ఘనయశుఁ డనఁగ రాఘవుఁడన నిఁకఁ
గన నాంతసాంతఋకారాంతశబ్దాలలో నొకకొన్ని పొల్పుగ వినుండు
తగ బ్రహ్మ వేధ మాంధాత నేత నియంత హర్త కర్త మొదలైనట్టిశబ్ద
ములకు డుప్రత్యయ మలయుత్వమునురాదు ధాతధాతృఁడనంగఁ దనరునొకటఁ
దగ భూర్తమఃఖ్యపదచతుష్టయముతుద వచ్చు నడంగు డుత్వంబు వినుఁడు
భూర్తుండుభూర్తు వృద్ధుఁడు వృద్ధు నీచుండు నీచు మూర్ఖుఁడుమూర్ఖు నెగడిరనఁగ
లక్ష్యంబు లిట్లు చెలంగును వరుసగ నింకఁ దద్భేదంబు తేర్పఱింతుఁ
గనఁగఁ దిర్యగ్వాచకపదమ్ము ల్వొకెడఁ బురుషాఖ్యల వికల్పముగ డువు గని
కొఱలు నెట్లన నురగుం డురగము గజేంద్రుఁడు గజేంద్రమన ఘనుఁడుఘన మన
నరసింహుఁ డనఁగను నరసింహ మన నృకంఠీరవుఁ డన నృకంఠీరవమన
నశ్వోత్తముఁడు నాఁగ నశ్వోత్తమమన నైరావతుండనఁగ నైరావత మనఁ
బక్షీంద్రుఁడనఁగను బక్షీంద్రమనఁ గోకిలేంద్రుండనఁగఁ గోకిలేంద్రమనఁగఁ
జేర్చైన మఱి వర్ణభేదములఁ దలిర్చు జాత్యశ్వవాచకశబ్దములను
డుప్రత్యయమె యొప్పునుగతిఁ దెల్పెదఁ గఱినిలందు బొల్లందు నీలఁ డనఁగ
మఱి జన్నఁ డనఁగ జమ్ముండన సారంగుఁ డనఁగనిట్లు లుదాహరణములలరు
స్థావరమ్ములఁ గొన్ని సరసిఁ దుపుఁగని మందరుఁడు మందరముననంగఁ బర్వఁ
తుఁడుఁబర్వతమ్ముగోత్రుఁడుగోత్రముసముద్రుఁడుసముద్రమననిట్టులంసురతరుఁడు
సురతరు వనఁ బొల్చు మఱి యీగతిని బ్రయోగములు శబ్దంబులఁగానమింకఁ
దలఁప నిదంతశబ్దముల కన్నింటికిఁ బ్రథమైకవచనంబు పరఁగ దెందు

హరి మతి వారి యన్నరవిచేఁ బ్రాతిపదికము లిదర్థంబు తేటపఱుపఁ
దగ నుకారాంతపదము పురుషాఖ్యల పుత్వంబు నుత్వంబుఁ బొందుచుండుఁ
బ్రభువు ప్రభుండన రహిఁగ నిర్వ్యథముగ గురుఁడు గురువు నాఁగఁ బరఁగు మఱి
యీదారి నుడులు లే వొ దింక స్త్రీలింగ పదములయందు పుప్రత్యయంబె
వచ్చును ధేనువు వధు వనఁగ నింకఁ దక్కిన యులయువంతముల కెల్ల
పుత్వంబు గల్గుఁ బోవును మీఁద రాహువు రాహు నా బాహువు బాహు నాఁగ
మేరు మేరు వనంగ నూ రూరు వన రఘు రఘు వన నిట్లు పరఁగు నవలను
సరవిగ గటు పటు శబ్దముల్ రెండు ప్రకారంబునే చెంది కటువు పటువు
నావిరాజిలు నిట్టు లావల నింకొక్కనటుశబ్దము ముపుల వఱలు నెటన
నటుఁడు నటువన నీపరున నుదాహరణంబులు తెల్ప దనర్చుచుండు
నివి యజంతప్రథమైకవచనములౌ నిఁక హలంతప్రథమైకవచన
ములవి యెట్లన్నఁ దెల్పెద నొకకొన్నింటి సరవిమీఁఅ మధులిట్ఛబ్దమునకు
మధులిహ మనఁ బొల్చు మఱియు భూభృత్పదము తుదనున్నక కారమున కదంత
మైన జత్వము వచ్చి తోన భూభుజుఁ డనఁ జెలఁగుచునుండు నిట్టులను మఱియుఁ
దెలియ శబ్దాంతహల్లులకు ద్విత్వము నుత్వమును రాఁగ వాక్కు స్రక్కును విరాట్టు
మధులిట్టు దిక్కను మ్మూర్త్తి నొప్పును గొదవ హలంతములకెల్ల బయిను కార
మమరెను కతన నుదంతశబ్దమ్ములకై వడి లక్ష్యముల్ గనుఁడు మీఁద
విత్పదంబునకును ద్విట్పదంబునకును వేదవిదుండు నా విద్విషుఁ డనఁ
దనరారుచుండు నీదారిగ నావల నింక నాంతమ్ముల కేర్పఱింతు
ఇన్నంతములవయి నెనఁగెడు ప్రథమైకవచన మిదంతాలవలెన కృతులఁ
జక్రియు వజ్రియు శార్ఙ్గి యన్నట్టులఁ దగు నింక బ్రహ్మశబ్దంబు దక్కఁ
దక్కిన నాంతశబ్దమ్ముల కన్నింటి కౌరునామధేయమై యొప్పునెడల
*ఱువువికల్పమునఁ గలుగుఁ జేయు గానిచో నాంతాలఁడుప్రత్యయంబె వచ్చుఁ
గృతవర్ముఁ డనఁగను గృతవర్మ యన దేవశర్ముం డనఁగ దేవశర్మ యనఁగఁ
బుణ్యాత్ముఁ డనఁగను బుణ్యాకర్ముఁ డన నా రాజన్పదమునకు రా జనఁదగు
నలయచేతనముల నాంతాల నొక్కచోటుల ముకారవుకారములు వరుసగఁ
బొసఁగెడువిధము దెల్పెద నింకమీఁదటఁ గనుఁగొనఁ గర్మముఁ గర్మువనఁగఁ
దనరంగ ధర్మము ధర్మువునాఁ జెల్లు నవల మతుప్ప్రత్యయాంతములకు

---

*డలలకు మైత్రి.

మంతుఁడనంగను మఱియు వానంతంబులకు వంతుఁ డనఁగఁ జెలంగు నిటులు
మతిమంతుఁ డన బుద్ధిమంతుం డనంగ భాస్వంతుఁ డనఁగఁ గుణవంతుఁడనఁగఁ
బరగు నేకాక్షరపదములఁ దక్కఁగ శబ్దాంతదీర్ఘముల్ చనుఁ దెలుఁగున
శ్రీయన స్త్రీయన ధీయన క్ష్మాయన జ్యాయన *రాయన మాయనంగ
నబల కామిని తను యజ్వ చక్రి యనంగ వరుసతో నివి యుదాహరణములగు
నవలను మున్ప్రత్యయము వచ్చుతెఱఁ గింకఁ దెలివిడి చేసెదఁ దేట పడఁగఁ
దెలియుండు స్థావరతిర్యక్ప్రాణివాచకముల నేకవచనము మునగు
నగము పన్నగము గంధము నాఁగ నిట్టులఁ గృతులందు లక్ష్యంబు లెసఁగు మఱియుఁ
గనఁ బ్రథమైకవచనము కారమునకుఁ †గడుబిందుయుక్తము కారమొదవి
దానంబు ధర్మంబు గానంబు కదనంబు వదనం బనఁగ నిట్లు వఱలు నింక
నాశబ్దమున కౌవ్వు నావ ద్యోభూశబ్దములు దివి భువి యనఁ బొసఁగు నింక
భ్రమపదం బభిలాషపదము నొక్కొకచోట స్త్రీలింగరూపమై చెలఁగు నెట్టు
లన భ్రమ భ్రమ మన నభిలాష యభిలాష మనఁగ నీరీతుల నమరు మఱియు
స్త్రీలింగరీతిఁ జరిత చరిత్రము లోకచక్షుఁ డనరు రామచరిత యనఁగ
హరిచరిత్ర యనంగ నసురశబ్దము నట్ల యసుర యసురుఁ డన నలరుచుండు
దనరంగ దూతపదమ్మును స్త్రీలింగరీతిఁ జెందును హరిదూత యనఁగఁ
దెలుఁగున నేకవచనముల్ బహువచనములెగాని ద్వివచనంబులు గలుగవు
రహి నింకఁ బ్రథమాది బహువచనమ్ములు తెలివిడి సేసెదఁ దేటగాఁగఁ
బురుషవాచకములై పరఁగు నదంతశబ్దంబు లన్నియు నుదంతమ్ము లగుచు
బయిని దెలుంగు విభక్తు లెక్కెడి తఱి నని మున్ను దెల్పుట నలయుదంత
ములమీఁదను లుకారములు వచ్చు బహుతను రాములు భీములు సోములనఁగ
నలద్వితీయమొదలౌ నాఱువిభక్తులు పయిచున్నతఱిని లత్వములె వచ్చు
రాములఁ గనియెను రాముల చేతను రాములకొఱకును రాములకత
మున రాములకును రాములయందు ననునిట్టివియుదాహరణములై వెలయునింక
సంబోధనలకు ‡అత్వంబు కలుగఁ బొల్చు జనవర జనవరుం డనఁగ బహుత

---

* రైశబ్దమునకుఁ దత్సమరూపములు 'రై, రో' అని సార్వత్రికము. కాని వ్యవహారమున నాలుగురాళ్ళు చేతిలో నున్నవి. అని ధనార్థమున 'రా' ఉపయోగింపఁబడుచున్నది.

† కడుబిందువు, అనఁగాఁ బూర్ణబిందువు. ఇట్టిప్రయోగములు- చింత్యములు. అ, ఖండ

హ్రస్వదీర్ఘాంతములై యూర యనవచ్చు యకులార విబుధులారా యనంగ
నటుల యిదంతంబు లందు దీర్ఘము లగు శౌరి యనంగను శౌరి యన యీ
దంతమ్ములం దుత్వ మత్వమ్ము నాత్వమా సురగురువా కల్పతరువ యనంగ
స్థావరతిర్యక్పదముల ముత్వము మీఁది యుత్వ మత్వం బయి యొనరు చుండుఁ
జందనద్రుమము హంసము యవ్వహి బహుళ నరవి లాంతములైన శబ్దముల తు
దల ఉత్వములు రుత్వములగు గోపాలురు బాలురు దీవదయాళు రనంగ
వరుస లక్ష్యము లివి యనయంగ నింక ఇదాంతముల్ బహుళ నుదంతము లగు
హరులు కవు ల్గిరు లాదియగు శబ్దమ్ము లింక హలంతమ్ము లేర్పరింతుఁ
దెలుఁగులకడల హల్లులకును ద్విత్వంబు నుత్వంబు జరుగు యొనరుఁ గనుక
త్వక్కును వాక్కును ప్రాక్కును బహుళకు ద్వక్కులు వాక్కులు ప్రాక్కు లగును
రాజన బహుళకు రాజులు నాఁజెల్లు బహుళఁ గొన్నిటి ద్విరూపములు వినుఁడు
వేదవిత్తు లనంగ వేదవిదు లనంగ విద్వాంసు లనఁగను విద్వాసు లన
భూభుక్కు లనఁగను భూభుజు లన నింక స్త్రీలింగములకు నీరెంకు పేళ్ల
దారిగా నల "హలంతాద్వా" యనెడి సూత్రభంగి హలంతశబ్దములమీఁదఁ
డాబ్వికల్పతచే నడరఁగ నలసమిత్పదము సమిత్తులు సమిథ లన మఱియు
దిక్పదంబును దిశల్ దిక్కు లనఁగ నిట్లు వెలయును లక్ష్యము ల్వేయి వేఱఁ
దగు నింక మీఁద ద్విత్వముగల్గ నణఁగంగఁ దాంతంబులివి యేకతను బహుళను
రూపద్వయమున మరుతు మరుత్తన మరుతులు మరుత్తులన రాజిలు మఱి తగు
నింద్రజితుఁ డనంగ నింద్రజిత్తుఁడు నా పరీక్షిత్తుఁ డనఁగ బరీక్షితుఁ డన
నింక యుష్మచ్ఛబ్ద మేకత నీ యన బహుళను మీ యనఁ బ్రబలు దానఁ
బ్రథమైకవచనాన వచ్చు వు కారంబు రహిబహుత్వమున రుకలును వచ్చు
నీ వనుచోటుల నీవనియును దనరారు నీ వీవు మీరు మీర లనఁగ
నానఁగు నస్మచ్ఛబ్ద మేకత నేయన బహుళను మే యనఁ బరఁగి ప్రథమ
నేకవచనమున నెఁగు నుకారంబు బహువచనమున ము వచ్చు నవల
నరయ నా, మా, యన నఖిలవిభక్తుల నేకత్వబహుత్వల నెనఁగు వరుస
నే ననువలుకున నే ననఁగా వచ్చు మే మనువలుకున నే మనఁదగు
భూమి నే నేనన మే మేమనఁగ నొప్పుఁ గవిరాజు లివి తెల్పు గనవలె నిఁక
నరయంగఁ బంచవిధాంధ్రశబ్దములలో దేశీయముల నచ్చతెనుఁగులందు
సరవిగా నేకవచనబహువచనముల్ వివరింతుఁ గొన్నింటి విశదముగను

గమ్ముఁడు తిర్యగ్వాచకపదమ్ములందునఁ బరఁగు నొక్కెడను ముప్రత్యయంబు
వారువ మనఁ బారువ మన నుదాహరణంబు లీక్షింపఁ దనర్చు నవలఁ
దెలుఁగుల దేశ్యాల నల ప్రాతిపదికంబె ప్రథమైకవచనమై పరఁగుచుండుఁ
గలువ వలువ నాఁగ గడి మడియుఁగను జెఱువు హరువు నాఁగఁ జెలికపాలఁకు
ఎన్మి గేదెయు గాదె తమ్మి దివ్వె యనంగ మల్లె యొల్లె యనంగఁ జెల్లు నవలఁ
దగఁ బడి సోలముంత మొదలౌ నుడుగుల బార మూర మొదలౌ పేరులందు
నల మొఁడుప్రత్యయం బలసున్నతోఁ బ్రమాణార్థసూచకములై యురుచోటఁ
బడెఁడు సోలెఁడు ముంతెఁడు నాఁగ బారెఁడు మూరెఁడు నాలక్ష్యములగును మఱి
అచ్చు తెనుఁగున నదంతపురుష వాచకపదమున డుప్రవికల్పత తగి
వరుసగ-పాప పాపఁడు గొల్ల గొల్లఁడు మాల మాలఁ డన నీమాడ్కిఁ దనరు
నవల నుదంతములందు ఁడుప్రత్యయము తగి చెంబుఁ డనఁ బొలుచు నొకట
బహువచన మగు లు పరమైన పూర్వవర్ణముల కుత్వం బిదంతముల వచ్చు
సరి యనునేకవచనముపయి లుకార మమర బహువచన మగు నరు లన
నిఁక మీఁద నొకకొన్ని యేర్పఱుతు వినుండు రహికెక్కు మీఁదక్షరముల చేత
బరఁగు నిదంతశబ్దంబుల నడిమి యక్షరముల యిత్వంబు గలిగెనేని
గనఁ దుది నడిమి యికారమ్ములకు రెంటి కుత్వంబు వచ్చి బహుత్వమునను
గలుములు ములుకులు గనుములు నా నిట్టి లక్ష్యముల్వొసఁగ దెలుంగు నవులఁ
గొల నను శబ్దముఁ గో నను శబ్దముఁ లలి బహువచనమ్ములకు గులు గని
కొలనులు కొలఁకులు గోనులు గోఁగులు నానొప్పు మఱి పేరు మీను చేన
న నివియు బహువచనముల లుత్వము వచ్చి పేలు నా మీలు నా జేలనఁ దగుఁ
గనఁ బెండ్లి యన్పదమునఁ గల లత్వంబు విరళమై పెండిల న్సరణిఁ దనరు
బహుత నిం డ్లనియెడిప్రత్యయం బది చెంది పెండ్లిండ్లు నాఁగను వెలయు నవలఁ
బల్లు నిల్లనుచోట బహుతను బిందుపూర్వకముగా డులువచ్చి పండ్లు పండు
లిం డ్లిందు లన నిట్టు లెనఁగును మఱి యచేతనము లైనట్టిశబ్దముల కెల్ల
బహుత నట్టులు టులు వచ్చి కంట్లును ముంట్లు ననఁగ నీరీతుల నమరు మఱియు
వినుఁడు విల్లనుచేతనశబ్దమున కెన్న బహుత డులులు రెండు వచ్చు నెడల
విండ్లన విండులు విల్లులు నాఁగను రూపత్రయంబున రూఢిగాంచు
మటులపై యచ్చు లుండును బోవుఁ బాడులు పండ్లు నాఁ జెండులు చెండ్లనంగఁ
దేఁటులు తేంట్లు నా బోఁటులు బోంట్లు నానగడుఁ జుండిఁక చేయి నేయి వాయి

యనెడు పేరులతుదలను బహువచనమ్ములఁ దులువచ్చుఁ గనుండు లక్ష్యములను
జేతులు నేతులు వాతు లన్నట్టుల నావల నంత్యములైన డురులు
లకు లుకారము వచ్చు డత్వాది ళత్వమౌఁ బైనున్న యుత్వంబు వాయు నొకట
వినుఁడు త్రాడులు త్రాళ్లు పేరులు పేళ్లు కాళులు కాళ్లు నాఁగను వెలయు ఱాయి
వేయి రేయుల ఱాయి నాయుక్త లట్టులౌ ఱాలు వేలును రేలు ఱాలనంగ
నిఁక నేకవచనమ్మునకు బహుత్వ మొకపగ నయ్యు డాలు కేలనఁగ నిరులు
పాలు చాలన నిట్లు పరఁగు ధాన్యములపేళ్లకుములు జొన్నలు నాళ్లు వడ్లు
గోదుమ లులువలు కొఱ్ఱలనఁగఁ జెలియలు కోడ లాల్మఱఁద లనుపదము
లతుదలఁ డ్రులు వచ్చు లరుఁ జెలియండ్రు కోడండ్రు నాండ్రును మఱఁదండ్రు నాఁగ
నావలను మొగలిపూవులు దక్కను దీవెలం దరుల వర్తిలెడి పేళ్లు
వానిపూవులయందు వర్తిల్లు బహుత్వము మల్లెలు సంపెగ ల్మొల్ల లనఁగ
నిఁక మీఁద నొకకొన్ని యేర్పరించెద తెల్ప యరయుఁడీ నాఁడు వీఁడన నివి బహు
వచనములను వాండ్రు వారు వార లనంగ వీండ్రునా వీరునా వీర లనఁగ
నీరీతిఁ దనరారు నీశబ్దముల కెల్ల బహుత్వను డ్రురు లివి వచ్చు నిటుల
గాఁడునకును గాండ్రు గారునాఁ దగు పాళెగాండ్రు నాఁగను బాళెగారనంగఁ
గొండ పోఁదండ రేయెండ చంద్రను శబ్దములను బహువచనమ్ముల లు వచ్చి
గొండ లనంగఁ బొందండ లనంగ రేయెండ లనంగను జంద్ర లనఁగఁ
దగుఁ గూఁతుర నెడి శబ్దమునకు రుత్వంబు తొలఁగును నిలుచు గూఁతురును గూఁతు
కూఁతురు ల్గూఁతులు కొఱలును రన నిట్టు లిఁక ద్వితీయ విధంబు తేర్పరింతు
నాదేశముల నగు నలయుదంతములకు స్వాభావికోదంత శబ్దములకుఁ
బురుషాఖ్యలగుచోటఁ బొసఁగు నిన్ నులు రెండు రాముని గాంచెను రామునరసె
శంభుని నడిగెను శంభు నర్థించె నా వరుసతో నివి యేకవచనము లగుఁ
బౌరి నుదంతంబులు పురుషాఖ్య గానిచో భువిన కారపుఁ బొల్లు నువు ను నిలుచు
నజరభూమీజముఁ హరిహయధేనువు నడిగెఁ జెట్టుం గట్టు నడుగఁ దనఁగ
నలయిదంతముల నదంతమ్ములను నట్ల పొసఁగు నకారంపుఁ*బొల్ల యొకటి
శౌరి నీక్షించెను శౌరిఁ గనుంగొనె నతివ నారసె బ్రహ్మ నడిగె ననఁగఁ
దగునుదాహరణము లగు నింకిట సకర్మకములైన క్రియలపైఁ గలిగెనేనిఁ
గన నచేతనవాచకపదముల ద్వితీయ లొకచోటఁ బ్రథమయై యొప్పుచుండు

---

* పొల్లయని యిదంతరూపముకూడ నీకవి కిష్టము. అది యుచితమును గావచ్చును.

బలుఁడుసొమ్ములఁ బాల్చెఁ జెలులకోకలుఁగట్టిరనఁబూలిమిన్నదన్న నన మఱియు
వలనకర్మకములై వఱల నారీతుల గిరు లొప్పె ననఁ దరు ల్పెరిఁగె ననఁగ
నగునిట్లు యిఁకఁ ద్వితీయకు వివరించెద స్థావరతిర్యక్పదములు విడిచి
కనఁ ద్వితీయాదులకును లోనుగాఁ బురుషాఖ్యపదములపైయుత్తరముల
తుదలయుత్వములపై నొదవు నికారము వహి వికల్పమ్ముగ వచ్చుఁ గృతులఁ
దగుకిషష్ఠికి నిత్య మగుఁ గుషష్ఠికి నత్వ మమరుచునుండు నీక్రమము వినుఁడు
సోమునిచేతను సోముచేత ననంగ గురునికొఱకు గురుకొఱకు ననఁగఁ
గేశవునివలనఁ గేశవువలననా నజుని కజునకన నలరుచుండు
నావల మఱి తృతీయావిభక్త్యర్థంబున మయి మై యనునుడు లమరు వినుఁడు
మానివర్యులఁ బ్రీతిమయి నొప్పు హరుఁడనహరిభక్తిమైఁబొల్చునభవుఁడనఁగ
నిఁకఁ జతుర్థి వచింతు నేర్పడ రామునికై రాముకొఱకనంగ మఱి యవల
సరవిఁ జతుర్థికి షష్ఠి వచ్చును బ్రాహ్మణునికి దానం బిచ్చె ననఁగఁ బ్రాహ్మ
ణునికొఱకిచ్చె నంచు నెఱుంగఁ దగు మఱి వేంకటాచలపతి కంకిత మన
నాహరికొఱకు సమర్పితం బనుటయే పాద్యంబు వేదాంతవేద్యున కన
దండితరాత్మసాధ్యత్మునకుఁ బ్రొక్కు లనఁగ నిట్టివి చతుర్థ్యర్థము లగుఁ
బయిని బంచమికిఁ బొం టెయనంగఁ దనరారు బుధుఁ డెవ్వఁడు నలువపొంటెననఁగఁ
గృష్ణునికంటెను గృష్ణుకంటె ననినా నింక షష్ఠీక్రమం బేర్పరింతుఁ
దగునుకారాంతశబ్దములకు కునులు పై నగునెడల నకార మూది నిల్చు
ననుటచే నలిబలమున కింద్రజిత్తునకును దేవగురునకు ననఁ దగు నిఁక
వరుసఁ బెండ్లాముకు వంతుకు రాజుకుఁ గైలాసముకుఁ బ్రయోగములు గలవు
మొనయఁగ నలిబలముకు నింద్రజిత్తుకు ననియిట్లు ముకుతుకు లమర వెందు
వహికినులకు నులవుయి నకారవుఁబొలు లుండుఁ బో నచ్చు పైనుండు నెడల
మునికి నెనయె మునికెనయె తనకు నెనయె తనకెనయె నాఁగ నిటుల నవల
నల ప్రాతిపదిక ముదంతంబు గానిచోఁ గుకినుల కాదినెక్కొనదు నత్వ
మచలకు రమకు నృహరికి గిరికి నాఁగ వరుస నిట్టుల నుదాహరణము లగు
షష్ఠి కొఱకైద విశేషణములఁ బ్రథమలో ఘనభుజాబలుఁడు భీముని కనంగ
నమితబలుఁడు కౌరవాధీశున కనంగ-నింక సప్తమి తెఱం గేర్పరింతుఁ
బురుషాఖ్యల నుదంతముల కేకవచనంబు నయినుండిన ని వికల్పముగ వచ్చు
నాని కారము దాని ఛో నకారము వచ్చు హరునియందు హరునం దనఁగ మఱియు

## ఆంధ్రసాహిత్యపరిషత్తు — ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ , బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు. (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటాద్రియయ్యగారు.

కేశవరపు రామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

## కాకినాడ—ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకు దొరకు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము—చదలువాడ మల్లయ్యకవి | రు 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము—వేములవాడ భీమకవి ... ... | 0 | 10 |
| 3 | చంపూరామాయణము—ఋగ్వేదికవి వేంకటాచలపతికవి ... | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము—తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు ... ... | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము—శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు ... | 0 | 8 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము—శిష్టుసర్వశాస్త్రికవి ... ... | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్యగారు ... ... | 0 | 2 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము—జ. రామయ్యపంతులుగారు ... | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దయకవి ... ... | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము—తరిగొప్పుల మల్లనకవి ... ... | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథమాలిక ... ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము—మల్లికార్జున పండితారాధ్యులు ... ... | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాథమహాకవి ... ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు ... | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు ... | 0 | 4 |
| 18 | హ్రస్వరంగములు—కొత్తపల్లి సూర్యరావుగారు ... ... | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము—హరిభట్టు ... ... | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... ... | 0 | 8 |
| 21 | జైమినిభారతము—వచనము—వేంకటకృష్ణప్ప నాయఁడు ... | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి ... | 1 | 4 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు ... ... | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి ... ... | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి ... ... | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (1-2 భాగములు) ... ... | 1 | 6 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) ... ... | 0 | 8 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... ... | 0 | 8 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... ... | 0 | 8 |
| 30 | చాటుధారాచమత్కారసారః— (సంస్కృతము) ... ... | 0 | 8 |
| 31 | ఉత్తరరామచరిత్రము—జయంతి రామయ్యపంతులుగారు ... | 1 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము—వెన్నెలకంటి అన్నయ ... ... | 0 | 8 |
| 33 | అమరుకము—సాంధ్రము—జయంతి రామయ్యపంతులుగారు ... | 1 | 0 |
| 34 | సాంబోపాఖ్యానము—రామరాజు రంగప్పరాజు ... ... | 1 | 0 |
| 35 | హంససందేశము—కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ... ... | 0 | 2 |
| 36 | సింహాసనద్వాత్రింశిక—ద్వితీయభాగము—గోపరాజకవి ... ... | 0 | 12 |
| 37 | రాయవాచకము ... ... | 0 | 8 |
| 38 | ఆంధ్రశబ్దచింతామణి—బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము ... | 0 | 8 |



Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)


సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.








కాకినాడ:

కొత్తపల్లి సూర్యరావుచే బరిషత్కార్యాలయమున

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-0-0.

విడిసంచిక రు 0-౮-0.

1934.

# విషయసూచిక.

ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨3. { భావనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. } సంచిక 3.



## వేణీసంహారము-నాయకుఁడు.

—: యామిజాల పద్మనాభస్వామిగారు, విజయనగరము :—

పరిషత్పత్రికలో శ్రీ యం. సూర్యనారాయణమూర్తిగారి "వేణీసంహారే భీమ ఏవ నాయకః" అనువ్యాసముఁ జదివితిని. వారివ్యాసప్రభావమున నాహృదయఫలకమునఁ జిత్రితములైన కొన్నిస్వకీయభావచిత్రములను బైకిఁదీసి పరిషత్పత్రికాముఖమునఁ బండితప్రవరులహస్తముల కందిచ్చుచున్నాఁడను. నాయీచిత్రమునఁ గలలోపములను దీర్చి దిద్దుభారము సకలకళాప్రవీణు లగువారి లేఖినీపింఛికలకే విడిచిపెట్టుచున్నాఁడను.

నాయకశబ్దమునకు వ్యుత్పత్తిమూలముగ నర్థముఁ జెప్పి తత్ఫలమును చౌర్థమధ్యమునొడిలోఁ బడవేసిరి. అదియంత సమంజసము కాదు. ఏల యందురా! అభిజ్ఞానశాకుంతలమున శకుంతలాదుష్యంతుల పునస్సమాగమమునకుఁ బ్రధానభూత మంగుళీయకము కదా యని తన్నాటకమున నాయకత్వము నంగుళీయకమున కంటఁగట్టుట న్యాయమా? జానకీపరిణయమున హరుని ధనువు శుల్కముగ రాముఁడు సీతమ్మను వివాహమాడుట సంభవించెఁగదా యని పురారిశరాసనమునకే నాయకత్త్వ మాపాదించుట యుక్తమా? అట్లే శపథము ననుసరించి వేణీసంహార మొనర్చినంతమాత్రాన భీముఁడే నాయకుఁ డనుట సమంజసమా? యుక్తియుక్తమా?

ధర్మరాజు సచివాయత్తసిద్ధిగల నాయకుఁడా? కాఁడా? ధర్మరాజు సచివాయత్తసిద్ధి గల నాయకుఁ డగుచో నాతనినే నాయకునిగ నంగీకరింతు మనునుద్దేశ

ముతో నొకహేతువును జూపి ధర్మరా జట్టివాఁడు కాఁ డని త్రోసివేసిరి. దాని కుదాహరణము—"అ ద్యైకం దివసం''......ఇత్యాది. భీముని కిది కళంకము. తాత్కాలికవృథారోషపిశాచీవికారావేశపురుషాలాపములే కాని తదాధార క్రియాచరణాయత్తచిత్తవిస్రబ్ధాలాపములుగా భీమవాక్కులు మాఱలేదు. "నా హం విధేయ స్తవ'' యని భూనభోంతరాళములు మార్మ్రోగునట్లు బిగ్గరగఁ బెడబొబ్బ వెట్టిన భీముఁడే "దేవ-అజాతశత్రో-భీమార్జునగురో-యథైవాజ్ఞాపయసి-నతథైవేతత్-'' అని పలికినాఁడు కదా! దీనినిబట్టి భీముఁడు ధర్మరాజునెడల సంతతము వినయవిధేయతలు కలవాఁడై యున్నాఁ డని తేలుచుండుట నిజమే కదా! "నా హం విధేయ స్తవ''యని సాక్రోశముగఁ బలికినశూరశిఖామణి యగువాఁడే పాదములఁబడి "జయతు జయ త్వార్యః''యని వచించినపు డీతనియందుఁ గలవిరుద్ధభావ మేమై పోయినది? "గురు మనువర్తస్వ'' యనుభీముఁడు విధేయుఁడా? అవిధేయుఁడా? అప్పుడు ధర్మరాజు సచివాయత్తసిద్ధిగల నాయకుఁ డని చెప్పుట సాహసము కాదు. ఇంకను సూర్యనారాయణమూర్తిగారు ధర్మరాజునకుఁ గేవలము భీమునే సచివునిగాఁ జెప్పుట తొందరపాటుగా భావించెదను. ధర్మజుఁ డెన్నఁడును భీముని సచివునిగాఁ దీసికొని యేకార్యమునకును నుపక్రమింపలేదు. ముఖ్యముగ భీమసహాయత్తవ్యాపారుఁడై ధర్మరాజు జయించుట లే దని కూడ విన్నవించుచున్నాఁడను. ద్రౌపది-లేక శ్రీకృష్ణుఁడు. ఈయిద్దఱితో, మంత్రాలోచనసేయక ధర్మరా జెట్టిపనికిని జొరఁబడలే దని చెప్పవచ్చును. మఱియు ద్రౌపదిమా టటుండనిండు. శ్రీకృష్ణుఁడు లేనిదే ధర్మరా జేకార్యమును గలలోనైనఁ జేసి యెఱుంగఁడనుట వీరెఱింగియేయుందు రని నాయుద్దేశము. అప్పుడు యుధిష్ఠిరుఁడు శ్రీకృష్ణసచివాయత్తసిద్ధిగలవాఁడా? భీమాయత్తసిద్ధిగలవాఁడా? ఈనాటకమున నది సరిపడ దందురా? అప్పు డీవేణీసంహారఫలమును ధర్మరా జొందుచున్నాఁడా? ద్రౌపదియా? ఆవిమర్శకుఁ గడంగునపుడు ద్రౌపదికే ప్రాధాన్యము కలదు కాని ధర్మరాజున కొంత వెతకినను గన్పట్టదు. తుదకు ధర్మజుఁడును గాఁడు భీముఁడును గాఁడు.

ఇంకలక్ష్యలక్షణసమన్వయమా?—ఈనాటక మప్పటి లక్షణగ్రంథములకన్న మున్న రచింపఁబడినదిగాన నాగ్రంథములకును దీనికిని లక్ష్యలక్షణసంబంధమనావశ్య మనుభావమును సూచించిరి. దీనినిబట్టి యేకవివ్రాసిన గ్రంథమేని లక్షణశాస్త్రవిరుద్ధము కాకుండ నుండవలె నని సూర్యనారాయణమూర్తిగారి యుద్దేశ్య

మైయున్న దని నాయూహ. కాని యిప్పుడు కుప్పలుగ నుత్పత్తిల్లుచున్న గ్రంథము లలో ముప్పాతికమూఁడువంతులు లక్షణగ్రంథముల ననుసరించియే యున్నవా?

"నిరంకుశాః కవయః" యను సూత్రమెంతవఱకు నిల్చును?

పైసూత్రమునకు సరిపోయినంత సంబంధ మున్నది. ఏ మందురా? గణ యతిప్రాసములకును విషయనిగరణమునకును దిగునప్పు డసాధ్యములగు స్థలము లందే కవులు పెడత్రోవలకుఁ బోవుచున్నారు, కాని, మాయిష్ట మని సారస్వత ప్రపంచరంగస్థలమునకు దిగుట లేదు. తావన్మాత్రమున నట్టి నిరంకుశత్వాధిపత్య కళంకసూత్రమును గవులగళసీమలఁ బూర్తిగబంధింపకుఁడు. ఇందు మఱొక చిన్ని రహస్యము కలదు. తన కసాధ్యము లగుపట్ల వ్యాఖ్యాత యాయసామర్థ్యమును గవి కాపాదించుటకై "నిరంకుశాః కవయః" యనుచున్నాఁ డని నాయూహ.

ఇందలి రసము వీరమా? రౌద్రమా? రసవిషయమై శ్రీ కల్లూ అచ్యుత రామశర్మగారు కొద్దిదినముల క్రిందటనే యొక వ్యాసము వ్రాయుచు రౌద్ర మని నిరూపించిరి. మొన్నఁటి పరిషత్పత్రికలో మన సూర్యనారాయణమూర్తిగారుకూడ రౌద్రమును గానె యొప్పుకొనుచున్నట్లు కుడ్యమార్జాలన్యాయముగ సూచించిరి. వీరిరువురివాదనఁ గొంత పరిశీలింతము.

"రసము రౌద్రము——రౌద్రమునకు స్థాయి క్రోధము. ధర్మరాజునకుఁ బంచ మాంకమువఱకు ప్రవేశమే లేదు. షష్ఠాంకమందే ధర్మరాజోత్సాహము కొంత వర్ణిత మైనది. భీమున కట్లు కాక ప్రథమాంకద్వితీయాంకములలోనే ప్రవేశ మిచ్చి రౌద్రస్థాయి యగు క్రోధ మధికముగ "చంచద్భుజే"త్యాదులచే విశేషముగవర్ణిం పఁబడినది. వీరరసమున కట్లుకాలేదు. రౌద్రమే అంగిరసము."

ఇది వీరిభావము. కాని దాని నంగీకరింపఁగూడదు. ఈనాటకమున రౌద్రము విశేషముగ వర్ణితమైనను, దాని నంగరసముగఁ గవిచేఁ బ్రత్యవేక్షిత మా నట్లూ హించుట కవకాశమున్నది. 'యత్సత్యవ్రతే'త్యాది వర్ణనలచే వీరరసబీజము స్పష్ట ముగ నుపక్షిప్త మయినట్లు దెలియవచ్చుచున్నయది- ఇంకను బంచమాంకమున "భోభో భీమార్జునౌ నిహితాశేష అరాతిచక్ర ఆక్రాంతపరశురామయశాః, ప్రతా పస్థాపితదిఙ్మండలః శ్రీమాన్ . . . . . . దేవో యుధిష్ఠిర ఆజ్ఞాపయతి" ఇత్యాదివాక్య ములచేతను, "కుర్వంత్వాప్తాహతానాం" ఇత్యాదివర్ణనలచేతను, యుధిష్ఠిరోత్సా హము పునఃపునః అనుసంధానమై వీరమునకే యంగిత్వము నాపాదించుచున్నది. మఱియు రౌద్రరస మధికము వర్ణిత మైనను దాని నంగత్వేన స్వీకరింపవలసినదే

కాని యంగిత్వేన స్వీకరింప వలనుపడదు. దానినే "అవిరోధీ విరోధీ వా రసోఽంగిని రసాంతరే, పరిపోషం ననేతవ్య స్తథా స్యా దవిరోధితా" అని యానందవర్ధనాచార్యులవారు వ్రాసియున్నారు. మఱియుఁ "జంచద్భుజే"త్యాది వాక్యానంతరమే "అనుగృహ్ణంతు తే భ్రాతరః"యను ద్రౌపదీవాక్యములచేతను, "భోభో శృణ్వంతు భవంతః" ఇత్యాది నేపథ్యగతవృత్తాంతముచేతను, రౌద్రము ధర్మజాయత్తమై యున్నవీరమున కంగముగనే వివక్షచేయఁబడుచున్నది. ఇంక ననేకములగు నుపపత్తులు వీరరసామోదములు గన్పట్టుచున్నవి. కనుక రసము వీరమే యగును.

ప్రథమాంకమున "యత్సత్యవ్రతభంగభీరుమనసే"త్యాదివాక్యశ్రవణానంతరము భీమసేనుఁడు పలికిన"జృంభతాం జృంభతా మార్యస్య క్రోధజ్యోతిః"యను వాక్యమును, "ఆర్య గచ్ఛామో వయ మిదానీం గురుజనానుజ్ఞాతే"త్యాదిసహదేవవాక్యములును, "వత్స ఏతే వయ ముద్యతా ఏ వాచార్య స్యాజ్ఞా మనుష్ఠాతుం" అనుభీమసేనవాక్యమును, ధర్మరాజునకే నేతృత్వము నాపాదించుచున్నవి. మఱియు, "చత్వారో వయ మృత్విజః" అనుభీమవచనము రణయజ్ఞమున ధర్మజుఁడు యజమానుఁడనియు, భీమాదులు ఋత్విక్కులే యనియుఁ జెప్పుచు ధర్మజునకే నాయకత్వమును జూఱయిచ్చుచు భీముఁడు నాయకుఁ డనువారివాదమును ద్రోసిరాజనుచున్నది. మఱియు "వ్యాసోయ"మిత్యాది శ్రీకృష్ణవాక్యము సకలసామ్రాజ్యాధిపత్యమునకు ధర్మరాజునే నిలిపి పుణ్యోదకములను వానిపైనే చల్లుచున్నది. మఱి భీముని మాటేలేదు. ఇట్టి యుపపత్తులనుబట్టి "ధర్మరాజే నాయకుఁడు" అని చెప్పనొప్పును. వీరరసమే యంగిరస మని చెప్పఁదగును.

---

# ఆంధ్రవాఙ్మయసౌధము-విమర్శకుల కర్తవ్యము.

సా. వి. ప్ర. ఓలేటి వేంకటసుబ్బారాయశాస్త్రిగారు, ఇంజరము.

---

విచక్షణులారా !

ఇతరవాఙ్మయములతోఁపా టాంధ్రవాఙ్మయము గూడ దినదినాభివృద్ధి నొందుచున్న దను విషయము సర్వజనవిదితమే. ఆంధ్రమున కెవ్వరు ప్రథమభిక్ష పెట్టినను నన్నయయే ప్రథమగణ్యుఁ డగుచున్నాఁడు. ఆతఁడు సదుద్దేశముతో నాంధ్రవాఙ్మయసౌధమునకు బల మగు పునాది నిర్మించుటనే సౌధ మున్నతస్థితిఁ బొందుటకు సమర్థ మగుచున్నది యని చెప్పవచ్చును. ఈసౌధమునకుఁ దొలుదొల్త సమర్థులగు కవీశ్వరులు సంస్కృతగ్రంథములను, ఆంధ్రములోనికిఁ బరివర్తించి సంస్కృతమిళితాంధ్రగ్రంథేష్టకల నర్పించిరి. అందువలననే సౌధము కట్టుదిట్టముగా నున్నతస్థితిఁ బొందుటకుం దగున ట్లుండెను. "విషమోఽపి విగాహ్యతేనయః కృతతీర్థః పయసా మివాశయః । సతు తత్ర విశేషదుర్లభ స్సదుపన్యస్యతి కృత్యవర్త్మ యః" అనునట్లు సౌధనిర్మాణమునకై తగుపునాది నిర్మించునతఁడు దొరకుటయే చాలకష్టము. అట్లు కష్టపడి నిర్మింపఁబడినపునాదిపైఁ దిక్కనసోమయాజి మున్నగువారు గోడలను సాగించిరి. ఇందులకుఁ జాల సంతసింపవచ్చును. కాలవిపర్యయమువలన గోడలు కొంతవఱకు సాగినతరువాతఁ బని నెఱవేఱుట కాటంకములు వచ్చుటచేఁ గాఁబోలును నది నెఱవేఱినది కాదు. ఆకాలమున నాంధ్రభాషామతల్లి విచారింపకపోవునా ? కాని నిర్మాణముహూర్తము బలమైన దగుట నదృష్టవశమున సమర్థు లగుకవీశ్వరులు బయలుదేఱి తగుగ్రంథములను భాషాంతరీకృతములతోఁపాటు స్వతంత్రములఁ గూడ రచించి సమర్పించిరి. ఆమంచి యిటుకలతోఁ బని చుఱుకుగా నెఱవేఱుచు వచ్చెను. చాలవఱ కొక యచ్చుతోఁ దీసిన యిటుక లైనను గొన్ని క్రొత్తవన్నెచిన్నెలతో మంచికట్టుఁబాటుగా నుండి సౌధమును గట్టిపఱిచినవి. కాని యాకాలమందు నచులులేని ముక్కలు లేకపోలేదు. అవన్నియుఁ బైపైకి రాక లోలోపలనే యిమిడిపోయినవి. ఆపూర్వపుగ్రంథేష్టకల మంచిచెడ్డల విమర్శింపఁ దలంచుకొనలేదు. విమర్శించుట కిది తావు కాదు. కాకున్న నొకకవివాక్యముల జ్ఞాపకము మాత్రముచేయుదును. "చందనవృక్షాల

సర్పాలగములు, క్షీరసాగరమందు క్ష్వేడంపుముద్ద- అమృతాంశుబింబాననంకవి స్తృతియు, మంచిలోపలఁ జెడ్డ మలయుఁగాఁబోలు."

ఆంధ్రవాఙ్మయసౌధ మిట్లు భాషాంతరీకృతగ్రంథములచేతను స్వతంత్రగ్రంథములచేతను నిర్మింపఁబడుచున్నను స్వతంత్రములపై మొగ్గ తూఁగినట్లుండెను. స్వతంత్ర మెట్లైన స్వతంత్రమే. రానురాను నేహేతువునో భాషాంతరీకరణముపై నెక్కువమక్కువ కలిగినది. మక్కువకుఁ దగున ట్లుభయభాషలయందు నసమానప్రజ్ఞ యుండి భాషాంతరములనుండి యాంధ్రమునకుఁ దీసికొని వచ్చినం జాలసంతసమే. కాని భాషాంతరములలోని కొద్దిజ్ఞానముతో నాంధ్రీకరించిన గ్రంథముల నిర్మించుట చాల నయుక్తము. అట్లు నిర్మించినగ్రంథములలో శాస్త్రగ్రంథములు, కావ్యములు, నాటకములు మున్నగునవి చాల నయుక్తములుగా నుండుటయేగాక మూలగ్రంథమున కగౌరవమును గూడఁ దేఁగలవు. ప్రకృతకాలమున నాంధ్రీకృత గ్రంథములలోఁ జాలభాగ మనుచితముగానే యున్న వని వ్రాయుటకుంజేయి సందేహించుటలేదు. భాషాంతరీకరణమునందు భాష యెట్లున్నను మూలగ్రంథములోని భావము స్ఫుటముగ వ్యక్తము కావలయును. భాషాంతరీకరణమందు భాషకన్న భావవ్యక్తియే ప్రధానము కదా? భావము స్ఫుటముగా వ్యక్తముకాని దో విపరీత భావస్ఫూర్తి యగుటయే గాక మూలగ్రంథములో ని ట్లున్న దని మూలగ్రంథమున కగౌరవము వాటిల్లుటయే గాక, పాఠకులకు విపరీతజ్ఞానముకూడఁ గలుగును. "విపరీతజ్ఞానముకన్న నజ్ఞానమే శ్రేయస్కర మని నాతలంపు'' అని మహామహోపాధ్యాయులు పరిషత్సభలో సెలవిచ్చినవాక్యమును బునఃపునః మననము చేయుట మంచి దని నామనవి.

ఆంధ్రధ్వనిని తాము పరిశీలించియేయుందురు. ఆనందవర్ధనాచార్యకృత మగుధ్వన్యాలోకమున కాంధ్రీకరణము. "కావ్యస్యాత్మా సఏవార్థ స్తథా చాదికవేః పురా, క్రౌంచద్వంద్వ వియోగోత్థః శోకశ్శ్లోకత్వమాగతః'' అనికారిక. ...... "నతు మునే శ్శోకః'' ఇతిమన్తవ్యం, ఏవం హి సతి తద్దుఃఖేన సోపి దుఃఖిత ఇతి కృత్వా రసస్యాత్మతేతి నిరవకాశం భవేత్ నతు దుఃఖసంతప్తస్యైషాదశా'' అని లోచనకారుఁడు స్పష్టముగా వ్రాసియున్నాఁడు. ఇట్లున్నను దా మాదికవియొక్క శోక మని పద్యము వ్రాసియున్నారు. ఆంధ్రధ్వనికారులు:—

"అర్థమిదియ కావ్యంబున కాత్మయగును, అట్లగుట పూర్వకాలమం దాదికవికిఁ
గ్రౌంచవిహగయుగళవియోగమున నాత్మ, లోజనించిన శోకంబు శ్లోకమయ్యె''

ఇది విపరీతజ్ఞానదాయకము కాదా? నూతనకవిభూషణులు హంససందేశ మాంధ్రీకరించిరి. ఈ గ్రంథము పూర్తిగా నిద్దఱును నసంపూర్తిగా న్శ్లోకఱును నాంధ్రీకరించిరి. వీరుచతుర్థులు. "కృత్వా తస్మిన్ బహుమతి మసౌ భూయసీ మాంజ నేయా ద్గాఢోన్మాదః ప్రణయపదవీం ప్రాప వార్తానభిజ్ఞే, విశ్లేషేణ క్షుభితమన సాం మేఘశైలద్రుమాదా యాచ్ఞాదైన్యం భవతి కిముత క్వాపిసంవేదనార్హే" అని హంససందేశములోని శ్లోకము వేదాంతాచార్యవిరచితము. మ. "అనిలా త్మోద్భవుకంటె నంచఁ గడుఁ దా నర్చించి వార్తానభి, జ్ఞునియందుఁ దృఢచిత్త విభ్రమముచే సొంపేది స్నేహాయనం, బును బొందెన్ విరహంపువేళఁ గలుగుంబో క్షుబ్ధచిత్తాళికిన్, వనదక్ష్మాధరధామణీజములయాచ్ఞాదైన్యముల్ చెచ్చెరన్" అనిపద్యమును వ్రాసిరి. ఇదివిపరీతభావస్ఫోరకము కాదా? శ్రీభాష్య శ్రీనివాసా చార్యులు హంససందేశమునకు వ్యాఖ్య వ్రాసియున్నారు. "కథం వార్తానభిజ్ఞే హంసే మారుతేరపి బహుమానం కృత్వా ప్రణయపదవీ మవాపేత్యాశంక్య పరి హరతి కృత్వేతి-కథ మతివివేకినాం తిర్యగాదిషు స్నేహః? క్షుభితమనస్త్వాత్ మేఘశైలద్రుమాదా అభ్రపర్వతవృక్షాదా యాచ్ఞా రూపదైన్యం సమ్భవతి, సం వేదనార్హే వృత్తాంతశ్రవణయోగ్యే క్వాపి కుత్రచి ద్విషయే చైతన్యవిశిష్టే కిము తయాచ్ఞా సంభవత్యేవ. అయంభావః చైతన్యరహితే మేఘశైలద్రుమాదౌ ప్రార్థ నాకృతాచే చ్చైతన్యవిశిష్టే యాచ్ఞాకరణం సుసంగత మితి" ఇట్టి స్పష్టమగువ్యా ఖ్యయున్నను ప్రధాన మగుభావమును ద్రోసిరాజన్నారే. నే నిట్లు తమకెందులకై మనవిచేసితినో విమర్శించుట మీకృత్యము. నేను విమర్శనచేయు నుద్దేశ్యముతోఁ గాని, వారికవితల నిందించు నూహతోఁ గాని వ్రాయలేదు. విపరీతవిషయనిరూప ణకై యథాలాభముగాఁ జూపించితిని. నాయందుఁ బొరపాటున్నచో క్షంతవ్యుఁ డను. ఆంధ్రవాఙ్మయసౌధమిట్టి భాషాంతరీకృతములచేఁ గూడనిర్మింపఁబడుచుండగాఁ బూర్వ మొకయచ్చుతోనే చేసినయిటుకలు, మేము వ్యక్తి కొక్కొక యచ్చుతో నిటుకల సిద్ధముచేయుదు మనుపట్టుదలతో భావుకులు భావకవిత యనుపేర స్వతంత్ర గ్రంథమని తామనుకొను గ్రంథముల వ్రాసి సౌధమును నిర్మించుచున్నారు. పూర్వమువలె నిప్పుడు ను లేకపోలేదు. ఇప్పటివలెఁ బూర్వమును లేకపోలేదు. కాలభేదముమాత్ర మెక్కువ యున్నది. ఈనవీనగ్రంథములు గూడ సౌధమును నిర్మాణముచేయుటకు సమర్థములగుచున్నవి. ఇట్టియిటుకలలో నేవి చౌడురాలునో, పాడగునో, ఎవరుచెప్పఁగలరు. నవలలు మున్నగునవి కూడ సౌధమును దదియాధు

చేయ సమర్థములే, కాని వానిలోఁగూడ నెంతపాడు, చెత్త, యున్నదో విజ్ఞానులకే తెలియును. ఇట్టి గ్రంథేష్టకలచే సర్వకళల కాలయమైన యాంధ్రవాఙ్మయసౌధము పునాదినుండి, యంతస్తులవఱకును దినదినము వృద్ధిపొంది లోకమున వన్నెవాసి కలిగి చిరస్థాయిగా నుండి యితరవాఙ్మయసౌధములతోఁ పాటు తులతూఁగుచున్నం దుల కెంతయో సంతసము. కాని యీసౌధోపయుక్తేష్టకలలోఁ జాల ననుచితములు, నసంబద్ధములు నుండుటచే సౌధ మున్నతస్థితిని బొందినకొలఁదిఁ గ్రిందికిఁబడి పోవునేమో యని భయముగా నుండకతప్పదు. అందులకై విమర్శకులు విమర్శనసుధచే గట్టిపఱుపవలయును. అట్లైనచో నీసౌధ మెంతయో సముచితముగ, సుదృఢముగ నుండి పడిపోక యున్నతస్థితి పొందినకొలఁది సముచితముగా నుండి యాచంద్రార్కస్థితిని బొందఁగలదు.

ఆంధ్రవాఙ్మయసౌధమును విమర్శనసుధచే బాగు చేయుటకు "విమర్శకమండలి" లేక "విమర్శకసమితి" యనుపేర నొకమండలిని స్థాపించి దానిలోఁ గనీసము తాలూకా కొక్కరేని సభ్యులుగ నుండి, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, భారతీపత్రిక మున్నగు విద్యావిషయక పత్రికలయందు విమర్శనకుఁ దగు స్థలమును బత్రికాధిపతులదయచే సంపాదించి యథార్థమును బయలుపఱుచుటకై సమమగు దృష్టితో గ్రంథముల విమర్శించి నియమితకాలముల సభలను గావించుచు సభ్యులందఱిచేతను బరిష్కృతమైన పిదప వానిని బ్రకటించుచుండవలయును. ఇందులకుఁ దగునిబంధనలు మున్నగునవి సముచితమయిన రీతి సభ్యులొకటొకటిగ నాలోచించి సిద్ధముచేయవచ్చును. తామీవిషయమై తగు శ్రద్ధవహించి యాలోచనసభలఁ గావించుచుఁ, గార్యముల నిర్ణయించి యాంధ్రభాషామతల్లి కాసేవకుఁ గొంతకాలము వ్యయపఱుపక తీరదని యీకార్య మవశ్యకర్తవ్య మని పలుమఱుఁ బ్రార్థించుచున్నాను.



# మనుచరిత్ర విమర్శనము.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

---

[గతసంచిక శేషము]

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు:—సుప్రసిద్ధ దినాంధ్రపత్రికారాజమును, భారతి యను మాసపత్రికాతల్లజమును బ్రచురించుచున్న గొప్ప భాషాభిమానులు "ఆంధ్రవాఙ్మయసూచిక" అను నుద్గ్రంథమును వ్రాసి ప్రచురించి యందుఁ బెద్దనార్యునిగూర్చియును, నాతని మనుచరిత్రమును గూర్చి యును నిట్లు లిఖించియుండిరి.

విశ్వశ్రేయస్సునకు సాధన మైన కావ్యప్రయోజనము ను రాజాశ్రయము సంకుచితము చేసినది. శుద్ధశ్రోత్రియుఁ డైన ప్రవరాఖ్యుఁడు నిమిత్తమాత్రుఁడు. శిష్టాచారపరాయణుఁ డైన ప్రవరాఖ్యుఁడు నిరవలంబనుఁడు. నిస్సహాయుఁడు. ప్రవరాఖ్యుఁడు ప్రకటించిన ప్రధాన మైన శాంతరసమునకు గావ్యమునం దప్రధానస్థానమును, వరూథినివరించిన కామాయత్తమైన శృంగారరసమునకుఁ బ్రధానస్థానమును గల్గినవి. ఇందువలననే కవి "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని వ్రాయవలసివచ్చినది. కావ్య మంతయునుఁ గామపర మై కావ్యప్రయోజనమును సంకుచితముచేసినది. తిక్కనపోతనాదులవలెను, బెద్దన కావ్యనిర్మాణమునకుఁ బరమార్థమును సంకల్పించి యుండలేదు. రాజానుగ్రహమును బ్రజాదరణమును నుదారమైన కావ్యప్రయోజనమును దుస్తరముచేసినవి."

కీర్తిశేషులైన వంగూరి సుబ్బారావుగ్గారు:—వీరాంధ్రభాషాపరిశోధనమును విశేషముగాఁ జేసిన పండితులు. "ఆంధ్రవాఙ్మయచరిత్ర" మను గొప్పగ్రంథమును విరచించి యందుఁ బెద్దనార్యుని మనుచరిత్రమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"ఆయనచేసిన బ్రహ్మాండ మైన కార్యము లేదు. మార్కండేయపురాణాంతర్గత మైనకథను మూలముగాఁ దీసికొనెను. కథ పెంచెను. ఎట్లు? శ్రీనాథుని సీసపద్యముల పోకడలను పినవీరన వేటవర్ణనలందలి వివరములును నున్నవి యున్నట్లు లాక్షణికుల యభిమతానుసారమే యాసందర్భములను జేర్చెను. తన యాలోచనలకు భావములకు నీవర్ణనలు కలిపినపుడు వృద్ధియైన కథనే మను చరిత్ర మనుపేరు పెట్టెను. కాని ప్రథమప్రయత్న మగుటచే వస్త్వైక్యత లేకపో

యినది. ప్రబంధమునకుఁ బట్టని పెద్దకథను దీసికొనెను. తననూతన ప్రయత్నము నకు భంగము కలుగు నని పెద్దన భయపడి కథావస్తువు నెక్కువగాఁ దీసికొనెను. వేఱు వేఱు కథలఁ గూర్చిన కావ్యముల జంట యైనది. కాని మనుచరిత్ర మేక ప్రబంధము కాలేకపోయినది. అయిన నీపెద్దన్న మహాకార్యోత్సాహ సమయమున నాంధ్రులీలోపమును గనుపెట్టలేదు."

మహారాజశ్రీ పి. చెంచయ్య, ఎం. ఏ., గారును, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావుపంతులు బహద్దర్ జమీందారుగారును:—వీరుగొప్ప విద్వాంసులు. ఉభయులును గలసి యింగ్లీషుభాషలో నాంధ్రవాఙ్మయచరిత్రమును వ్రాసిరి. అందు మనుచరిత్రమునుగూర్చి వీ రిట్లు వ్రాసిరి.

"Unities are lacking and the various parts of the story do not properly articulate. Sweet imagery is meagre though descriptions are delightful and conversations cunningly managed" (ఐక్యములు సరిగ లేవు. మఱియును వివిధములగు కథాభాగములు విన నింపుగా లేవు. మనోహరోహాచమత్కారము తక్కువ. కాని వర్ణనము లానందదాయకముగా నున్నవి. ప్రసంగములు చమత్కృతి కలిగియున్నవి.

పేరుదాఁచుకొనిన ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహకారు లిట్లువ్రాసిరి:—"ఈ చెప్పిన సుగుణములు తృతీయాశ్వాసమువఱకే. తరువాత సన్నగిల్లినవి. మనోరమ భయపీడిత యై రాక్షసుండు వెన్నంటి తరుముచున్నను కథనంతయుఁ జెప్పవచ్చినది. విద్యలకై భార్యలను జేకొన్నాఁడు స్వరోచి! ఎట్లో సాగినది కథ. కాని వర్ణనావైశద్యము శైలిమాధుర్యము తగ్గలేదు. పదసారళ్యము మాత్ర మించుకమందగించిన దేమో ? తుదకు వండైనది. ప్రబంధముల బురద మెత్తుకొనినది.''

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు:—సుప్రసిద్ధపండితసార్వభౌములగువీ రిట్లు వ్రాసిరి. "ఇందు రసోత్తరముగ రచింపఁబడిన వరూథినీప్రవరవృత్తాంతము మూఁడవయాశ్వాసముతో ముగిసిపోవుచున్నది. నాలవయాశ్వాసమున ఉపక్రమింపఁబడిన స్వరోచివృత్తాంత మాఱవయాశ్వాసములోఁ గొంతవఱకె గలదు. ఆవల స్వారోచిషమనువృత్తాన్తముతోఁ బ్రబన్ధము ముగింపఁబడినది. ఇట్టివిచ్ఛేదము శ్రోతలకుఁ గొండొక పట్టుల నిరుత్సాహము గల్పించుచుండును. అందును నిందు సరసగమువఱకు గ్రంథమునఁ బెంపొందిన ప్రవరవరూథినీవృత్తాన్తము విచ్ఛిన్న మై వేఱొకకథలో సంక్రమించిపోవుట యెంతయుఁ బాఠకుల యుత్సాహమును వెన్వడంజేయుచున్నది.''

బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు:-ఈపండితప్రకాండులు మనుచరిత్రమునందలి తప్పులం గూర్చి యిట్లు వ్రాసిరి.

“స్వారోచిషమనుసంభవమున స్వారోచిషమనువునుత్పత్తి యత్యల్పపద్యములతో మాత్రము వర్ణించుటనో, మఱియొకకారణముననో దానికి మనుచరిత్ర మనుపేరు రూఢమయ్యెను. “మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేగఁ బల్లకి తనకేలఁబట్టియెత్తె’’నని పెద్దనార్యుఁడే చెప్పియున్నాఁడు. ఈపేరైన నంతగా సరిపడియుండలేదు. స్వారోచిషమనుచరిత్రము సహిత మల్పముగనే వర్ణింపఁబడెను. ఆగ్రంథమునఁ బ్రవరవరూథినీస్వరోచిః ప్రభృతుల వర్ణనమే యధికముగా నున్నది. ఇట్టివస్త్వైక్యములేని యాఱాశ్వాసముల మనుచరిత్రమును ధిక్కరించుటకుఁ గావలయు రామరాజభూషణుఁడు దానును నాఱాశ్వాసముల ప్రబంధము రచించి ‘వసుచరిత్ర’ మని పేరుపెట్టి సకలాశ్వాసములును నాయకవసురాజకథాగుంభితములే యగునట్లు సందర్భపఱిచెను.”

పిఠాపురసంస్థానవిద్వత్కవివరు లగు రామకృష్ణకవు లిట్లు లిఖించిరి.

“గీ. మారనకథావిధానముఁజూఱలాడి, కోట్రశ్రీనాథువెరువులఁ గొల్లఁగొట్టి,
కొఱఁతఁబడునని కుకవిని గోసరితిట్టి, పెద్దనయొనర్చినట్టి తప్పిదము నిదియె.’’

మహారాజశ్రీ యడ్లపాటి వేంకటసుబ్బారావుగారు:—వీరు మంచిపండితులు. ఆంధ్రపత్రికాసంవత్సరాదిసంచికలో మనుచరిత్రముంగూర్చి యొకపెద్దవ్యాసమును వ్రాసిరి. అం దిట్లున్నది.

ఈప్రబంధమునకు ‘మనుచరిత్ర’ మనియు ‘స్వారోచిషమనుసంభవము’ అనియును రెండుపేర్లు గలవు. ఈప్రబంధమున కీనామములు సమంజసములేనా? యని ప్రథమమున విచారింతము. కథాభాగమును పరికించిన నీరెండుపేర్లును వివాదాంశములే. గ్రంథముపేరు వినినంతనే అది యంతయును మనువుయొక్క చరిత్రమే యని భ్రాంతి కలుగును. కాని యెంతచదివినను వాని ప్రసక్తియే యుండదు. మనువుచరిత్రమునే తెలిసికొనఁగోరి చదువువారి కెంతయు విసుగు జనింపకమానదు. ఇట్టిస్థితిలో గ్రంథమునకు ‘మనుచరిత్ర’ మని ఏల పే రుండవలయును. ఉత్తరకథకు నాయిక యగుమనోరమ మనువునకు తల్లి కాదు. అకస్మాత్తుగ తటస్థించిన వనదేవతకును స్వరోచికిని మనువు జన్మించినాఁడు కనుక చరిత్రముతో నంతగా సంబంధములేని జననమును చరిత్రకు నామకరణముగా వినియోగించుట బాగుగ లేదు. ఘోరరాక్షసులచేఁ దఱుముఁబడి మనోరమ విశ్రాంతుఁ డగు

రాజును శరణు వేఁడినదికదా! భయవిహ్వలచిత్త యయినమనోరమ స్వరక్షణార్థ మితని నర్థించుటకు బదులుగ తనపుట్టుపూర్వో త్తరముల నెకరువుపెట్టుట యేమంత యుచితము? మఱియును మనోరమనుండి మంత్రము గ్రహించి దానవుని నిగ్రహించినటు లున్నది. ఈ అంశమువలన స్వరోచిశౌర్యమునకు కళంకము కలుగుచున్నది. మనోరమ తనచరితమును ప్రథమముననే చెప్పక దానవునికథానంతరము చెప్పిన నెంతయో రమ్యముగ నుండెడిది. మఱియొక సంశయము కూడ కలుగుచున్నది. దానవుఁడు వెంటాడుచున్నప్పుడు స్వచరితమును జెప్పునంతటి యవకాశ మెట్లు కలిగినదో కదా? మనోరమ చెలికత్తెలు తమతమ విద్యలను స్వరోచి కిచ్చి వానిని వివాహమాడిరి. అనఁగా రాజు విద్య నాశించి వారిని బరిణయమైన ట్లున్నదేకాని ప్రేమచే కా దని తేలుచున్నది........రాజునకు పక్షిభాష నేర్పినది విభావసి. పక్షులుమాటలాడినపుడు విభావసి యచ్చట నేయున్నది. ఈపక్షుల హేళనను ఆమె గమనింపకుండుట వింతలో మఱొకవింత. ఈకథాసందర్భమును ప్రధానచరిత్రలో చొప్పించుట నిరర్థక మైనది. ఏ మనఁగా నందువలన స్వరోచివర్తన మేమియును మారలేదు." *

" శ్రీ ఉకుమళ్ళ అచ్యుతరావు ఎమ్. ఏ ఎల్. టి. గారు:—ఇంతయేల పెద్దనార్యుని బూసికొనివచ్చి యస్మదాదులను మనుచరిత్రమునందుఁ గొన్ని దోషములు కూడఁ గల వనినందులకై పెక్కువిధములఁ దిట్టిపోసిన శ్రీరావుగారే తుదకుఁ బెద్దనగారి గ్రంథమునందలి పెద్దదోషములనే యిట్లు గ్రంథస్థము చేసిరి.

—: (1) రసవిషయకలోపము :—

ఈవిషయమై శ్రీరావుగారు తమ ప్రతివిమర్శనములో ని ట్లధిక్షేపించిరి. "ఈకథయందలి సార మంతయు వరూథినీప్రవరుల యుపాఖ్యానమునందే యున్న దనియుఁ దక్కినభాగ మంతయు, రసోత్సేకము గలుగఁజేయలేని వల్లీబంధమనియుఁ 'బెద్దనార్యుఁడు, తన లోకోత్తరకావ్యప్రజ్ఞ నంతయు నీయుపాఖ్యానమునందే చూపించె ననియు వారి నమ్మకము. కావునఁ బెద్దనార్యుని కావ్యప్రతిష్ఠ యీయుపాఖ్యానమున నిలిచి యున్నది. ఈభాగము రసమునందును నీతియందును జెడినయెడలఁ బెద్దనార్యుఁడు తలయెత్తుటకు వేఱె యవకాశముండదు."

దీనింబట్టి మనుచరిత్రమునందలి తుదియాశ్వాసత్రయమును రసవిహీన

* నావాదమున కనుకూలించుభాగములనే కొన్నింటి గ్రంథవిస్తరభీతిచే నిందుఁ దెత్తొలఁగించితిని.

మైన వట్టివల్లీబంధ మని తేలుచున్నది. ప్రబంధమునందలి సగపాలు రసము లేని వల్లీబంధ మనునది సామాన్యాక్షేపణ మగునా ? తుదియాశ్వాసములే కదా స్వారోచిషునిసంభవాదులు కలిగి ప్రధానకథతో నలరారుచున్నవి. అవియే రస హీనము లనినఁ గావ్యము పెద్దరసలోపముకలదై యున్న దని వేఱుగఁ జెప్పవలె నా ? రసములేదనక రసములేని వల్లీబంధ మనుట యాక్షేపణము చేయుట కాక మఱేమగును ?

—: (2) గ్రంథము దుర్నీతిబోధకమనుట :—

మనరావుగారు మనుచరిత్రము దుర్నీతిబోధకము కా దని ఋజువుచేయు టకై పడఁగల పాట్ల నెల్లఁబడి వింతవాదములఁ గావించి కావించి తుదకీ క్రిందివా క్యములలో నీపాత్రమున దుర్నీతి కల దని యంగీకరించిరి.

"మఱియొకవిషయము:—వరూథిని విరహావస్థయం దుండఁగా సూర్యా స్తమయవర్ణనమునఁ బెద్దనార్యుఁ డాయవస్థ ని ట్లుత్ప్రేక్షించెను.

"చ, తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి.............................దీక్షితిన్.''

ఈపద్యమునందలి భావము జారత్వబోధకమని శ్రీ శాస్త్రిగారాక్షేపించిరి. ఇది న్యాయమైన యాక్షేపణయే. పెద్దనార్యుం డిచట నిక్కముగఁ బెద్దతప్పుఁ జేసి నాఁడు. ఇది కవియభిప్రాయమునే సూచించుచున్నది. కాని, పాత్రోచితవాక్యము కాదు. పెద్దనార్యుని శృంగారరస మిచటఁ బొంగిపొరలినది. శ్రీ శాస్త్రిగారి చీవా ట్లకుఁ బెద్దన్న యిచ్చుటఁ దప్పకయర్హుఁడే.''

దీనింబట్టి పెద్దన్న నీతికి విరుద్ధ మగువ్రాతల నీసందర్భమున వ్రాసె నని తేలుచున్నది. వేశ్య యనన్యకాంతకావున దానింగూడుట తప్పుకాదనియు, దాని మోహమును దీర్పకుండుటయే తప్పనియుఁ బ్రవరుఁ డట్లుదానిఁ గూడక త్రోసి వేసెను, గావున, నధముఁడై నాఁ డని యు నిందుఁ దెలుపఁబడియున్నది. వేశ్యను గూడుట తప్పేయని మార్కండేయపురాణము నొక్కివక్కాణించుచుండఁగా మనకవి దానికి వ్యతిరేకముగాఁ జేసిన యీబోధ దుర్బోధయే యని యంగీకరింపనివా రుందురా ? ఇచటఁ బెద్దనార్యుఁడు పెద్దతప్పే చేసినాఁ డని రావుగారే యుద్ఘోషిం చుచున్నారు. ఈరీతిగా నీతిమార్గమునుండి మరలి కవి దుర్నీతిని బోధించుటకుఁ గారణముకలదు.

—: (3) అసంగత ప్రసంగముచేయుట :—

ప్రవరుని వేషమును ధరించి వరూథినిని మోసగించి యామెంగూడి తాను జిరకాలమునుండి యాశించుచున్న కోర్కెను దీర్చుకొనుటకై నిశ్చయించుకొని గంధర్వాధముఁడు పలికినపలుకులు సందర్భశూన్యముగానే యున్న వని రావుగారును లిఖించిరి. వీనినిబట్టి మనుచరిత్రమునం దున్నది పండితు లొల్లని పసుశృంగారం బనియు నీగ్రంథమును వ్రాయుట లోఁ గవి యుదారభావములు పెట్టుకొని యుండక విశ్వశ్రేయస్సునకు మూలమయిన కావ్యధర్మమునే పాడుచేసె ననియు, గ్రంథము దుర్నీతిబోధక మనియుఁ గథాసందర్భము పాత్రౌచిత్యము రసస్ఫురణము చెడిన వనియుఁ దేలుచున్నది.

మఱియును గురుజాడ శ్రీరామమూర్తిగారు తమకవిజీవితములలో మనుచరిత్రమునందుఁ బ్రబంధమునం దుండవలసిన ప్రౌఢత లేదనిరి. మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిలవా రాముక్తమాల్యదాపీఠికలో దీనిపాకము పాషాణతుల్య మనిరి. కవికులతిలకు లగుదేవులపల్లి నృసింహశాస్త్రిలవారు, కోపల్లి రమణారావుగారు దీనియం దనేకదోషముల నెంచిరి. మహేంద్రవిజయపీఠికాకారులు, ఇతివృత్తము సరిగ లే దనియు గ్రంథనామమే చెడిన దనియుఁ దేల్చిరి. కవిశేఖర వసురాయకవిగారు లో నగువారు "కొఱంతఁ బడుఁ" మున్నగు ప్రయోగము లసాధువు లనిరి. తప్పు లున్నయప్పుడు వాని నెంచుటయు ను గలుగును. ఇంకను ననేకఖండనములు కలవు, కాని, గ్రంథవిస్తరభీతిచే వానింగూర్చి ముచ్చటింపక విడుచుచున్నాను. ప్రాచీనులలో రామరాజభూషణాదులు పెద్దనార్యుని కథాసంవిధానాదులు ప్రౌఢముగా లే వని తేల్చినట్లు రసికులు చెప్పుదురు.

వీనింబట్టి పండితలోకాభిప్రాయము నాచేసినయాక్షేపణముల కనుగుణముగానే యున్న దనియు నాది విలక్షణమైన విమర్శనము కా దనియుఁ దేలుచున్నది.

ఆంధ్రసారస్వతప్రపంచమున నీరీతిఖండనములు మెండుగ వెలయుచుండఁగ, మనరావుగారు మనుచరిత్రముపై ఖండనమును వ్రాసినవాఁ డొక్కఁడయీ ప్రతివాదియే యని లిఖించుట లోకవంచనము చేయుటకాక మ తేమగును ? నన్ను నిందించుటలో సత్య మెట్లుండఁగలదు? లోకమంతయు మెచ్చుకొనుటయు, నేనొక్కఁడనేఁ దప్పులు పట్టుటయుఁ దటస్థించిననే "అరిస్టయిడీసు" కథ నాకన్వయించును, కాని లేకున్న నాకన్వయింప దని లోకము గ్రహించుకొనవలసియుండును.

పై పండితప్రకాండులు దోషములనే కాక గుణములఁగూడఁ దమవిమర్శన

ములలోఁ జూపియున్నారు. నీవిమర్శనమునలో నీవు మనుచరిత్రములో దోషము లున్నట్లు నిరూపించితివే కాని గుణములున్నట్లు తెలుపలేదు, కావున, నీవు నిందార్హుఁడవే యందురా యనఁదగదు. విమర్శకు లందఱవలెనే నేనును గుణదోషముల రెండింటినిఁ గూడఁ జూపితిని గాని యొక్క దోషములమాత్రమే చూపియుండలేదు. నావిమర్శన గ్రంథములో గుణపరిగణనమునుజాలఁగలదని నేనిదివఱకే వ్రాసియున్నాను. మఱియు శ్రీరావుగారు కొన్నిచోట్ల నేను జూపిన దోషములు నిజమైన దోషములు గానే యున్నవని యంగీకరించిరి. కొన్ని నేనెంచినదోషములు నాకు దోషములుగాఁ గాన్పించినను వారి కట్లు గాన్పింపనంతమాత్రమునఁ బ్రతివాదిని దుచ్ఛనిందల పాలుచేయఁ జూచుటయు ను, పరిహాసపాత్రుని జేయ నుద్యమించుటయును సద్విమర్శకున కుచితమైన పని గాదు. కొన్నిట భేదాభిప్రాయము గలిగినంతన దుర్వృత్తి నారోపించుట మఱింత తగదు. సందర్భరహితముగా "అరిస్టయిడీసు" యొక్కయు, పౌరునియొక్కయు కథనెత్తికొని నన్నుఁ బరిహసింపఁజూచుటను గన నాకును నొకకథ జ్ఞప్తికి వచ్చుచున్నది. పూర్వ మొకప్పు డొకపాఠశాలలో గురు వొకశిష్యుని "పంద్రెండెనిమిదు లెంత" యని బ్రశ్నించె. నూటతొమ్మిది. యని శిష్యుఁడు సమాధానముచెప్పె. పంద్రెం డెనిమిదులు తొంబదియాఱని నేనీ కనేకపర్యాయములు చెప్పితినే యది నీకు జ్ఞాపకము లేదా? యని గురుఁడు ప్రశ్నించె. జ్ఞాపకమున్నదికాని మీ రింకొకప్పు డేదేని విషయము తేల్పవలసివచ్చినప్పుడు సదా పరబుద్ధినే నమ్ముకొనఁగూడ దనియు, స్వబుద్ధిని ముఖ్యముగా వినియోగించి సిద్ధాంతము చేయఁ బ్రయత్నింపవలయు ననియు నొక్కి చెప్పియున్నారు కాఁబట్టి మీమాటల మీఁదనే యాధారపడక నాబుద్ధిని వినియోగించి నూటతొమ్మిది యని చెప్పితి నని శిష్యుఁడు ప్రతివచన మిచ్చె. మన శ్రీరావుగారిగమనిక యాశిష్యునిగమనికను బోలియున్నది. మనుచరిత్రమును విమర్శించుటలో సుప్రసిద్ధపండితలోకము త్రొక్కినమార్గమును ద్రొక్కనొల్లక శ్రీరావుగారు స్వబుద్ధినే ప్రమాణముగాఁ గొని క్రొత్తమార్గముత్రొక్కి తుదకు హాస్యాస్పదములగు సిద్ధాంతములఁ జేయఁ జొచ్చిరి. ఇదియా మచ్చువిమర్శనము వ్రాయువాని క్రమము? నావ్రాసినదానిని ఖండించివేయుదురుగాక! నాపై ద్వేషము పూనుటేల? ఎట్లైన నన్ను నిందలపాలుచేయఁజూచుటేల? తుదకుఁ దామే పరిహాసపాత్రులు గారా?

వాదమునిమిత్త మిదివఱ కెవరును మనుచరిత్రమునందలి దోషములను

రింతము. ఇదివఱకు కెవరును దోషములను జూపకుండినంతమాత్రమున నే నెంచిన దోషములు దోషములు కాకపోవునా? వంగూరి సుబ్బారావుగారు చెప్పినట్లుగా, ప్రబంధనిర్మాణములో మనుచరిత్రము మొదటిది గావునఁ గ్రొత్తగఁ బ్రబంధము పుట్టిన దను నుత్సాహములో మునిఁగిపోయి, లోకు లందలి దోషములనుగ్రహించుకొను స్థితిలోనికి రాకపోవచ్చును. ఇటీవలఁ బరిశీలన మెక్కుడయిన తరువాత నందుఁ గాన్పించుదోషముల నిరూపించి చూపరాదా? తిన్నగఁ జూడక లోకము మొదట మెచ్చుకొనినంతమాత్రమున గ్రంథమునందలి దోషములు గుణములై పోవునా? తొల్లియాంగ్లేయులలో "మాంట్గ్యుమట్రి" యనునొక కవిసామాన్యుఁ డుండెడివాఁడు. అతఁ డనేకకావ్యములను వ్రాసినాఁడు. సరిగఁ బరిశీలించి చూచుకొనక యాకావ్యముల లోకము మెచ్చుకొనఁజొచ్చినది. ఇట్టిప్రఖ్యాతి గలిగినపిమ్మట "మెకాలే" యనువిమర్శకుఁడు బయలువెడలి యాకావ్యములు కుకవిత్వదూషితము లని ఋజువుచేయుచు ఖండనముల వ్రాసెను. వానిం జదువుకొని లోకము సత్యజ్ఞానము సంపాదించుకొని "మాంట్గ్యుమట్రి" గ్రంథములనుజూచుటమానె.

అంతియే కాని యిదివఱకందఱును మెచ్చుకొనుచుండఁగ నేఁడు నీవొక్కఁడవే బయలువెడలి మాంట్గ్యుమట్రి గ్రంథములపై ఖండనములు వ్రాసితి వనియు, కావున నవి యగ్రాహ్యము లనియు, మెకాలేపండితుని నిందింప నెవరును సాహసింపలేదు. మెకాలేవ్రాంత లందఱికిని గ్రాహ్యములే యైనవి. కావున నీవు నేఁడు బయలుదేఱి మనుచరిత్రముపై దోషముల నెంచిన వానినొప్పుకొన మసరాదు. అట్లనుట సద్విమర్శకధర్మము కాదు. మెకాలే, మాంట్గ్యుమట్రి కుకావ్యములు ప్రసిద్ధికి వచ్చుచున్నవిగాన నే ఖండనము వ్రాసితిననె. దోషములు గుణములుగా నెంచఁబడుస్థితిలోనికి వచ్చినప్పుడు తప్పకఖండనములుండవలెను. కాన మనుచరిత్రముపై మండనమేకాక ఖండనము వ్రాయవలసివచ్చిన దని రావుగారు తెలిసికొనవలెను. పెద్దనార్యుని గ్రంథమునందు దోషము లున్నసంగతినే తలపెట్టక కేవలస్తుతిపాఠములతోఁ దమవిమర్శనముల నింపినవారు శ్రీ వె. రామచంద్రరావు పంతులుగారు మున్నగువారు కలరు. వీరుదోషములనుగూడ గుణములనుగానే యేదో యొకవిధముగా మనస్సును తృప్తిజేసికొని వ్రాసివేసిరి- లోకమును దప్పుత్రోవఁ బెట్టు నిట్టివిమర్శనాభాసములు బయలువెడలుటచేతనే సత్యనిర్ధారణార్థమై నేను విమర్శనమును వ్రాయఁ బూనుకొంటినని యిదివఱకే వ్రాసియున్నాను.

# రుయ్యకునికృతులు.

—:యీాయూణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, యం. ఏ., కాకినాడ:—

రాజానకరుయ్యకుని జన్మాదికమును గాలమును గుఱించి క్రిందటిసంచిక [23 వ సంపు. 1 సంచిక] లోఁ జర్చించియున్నాఁడను. ఈవ్యాసమున నాతని గ్రంథములంగూర్చియు, రానున్న వ్యాసములలో నాతని 'యలంకారసర్వస్వము' ను గూర్చియుఁ, దద్వ్యాఖ్యలం గూర్చియు వివరింపఁబడును. ఇతఁడు పదియలంకారగ్రంథముల రచించె ననియు నిన్ని యలంకారగ్రంథముల నన్యు లెవరును రచించియుండ లేదనియు నిదివఱలోఁ దెలిసికొనియున్నాము. కాని సాహిత్యసాగరమును మథించి దృఢవ్యుత్పత్తినందిన యీమహాసీయుని కృతిప్రసూనములలో నేఁటివఱకు సూర్యాలోకముం బడసినవి మూఁడుమాత్రమే కల వని చెప్పుటకు విచారించుచున్నాఁడను. తక్కిన గ్రంథరాజము లుత్పన్నకల్పము లనియే యెంచ నగును. ఇఁక నాతనిగ్రంథముల నన్నిటి నకారాదిక్రమమున వివరింపఁ గడంగెద.

I. అలఙ్కారమఞ్జరి :—దీనిని రుయ్యకుఁడే తన 'యలంకారసర్వస్వము'[1] న సూచించియున్నాఁడు. 'తత్ర రసాదిధ్వని రలఙ్కారమఞ్జర్యాం దర్శితః' [15 పు]. దీనిని గుఱించి ప్రకృత మింతకంటె నేమియుఁ దెలియదు. ఇందు శబ్దార్థాలంకారములు వివరింపఁబడియుండు ననుకొందును. సుఖలాలపండితుఁ డొక 'యలంకారమంజరి'ని రచించినట్లు తెలియుచున్నది.[2] కాశీనివాసి యగుత్రిమల్లభట్టు 'అర్థాలంకారమంజరి' యను నామాంతరముగల 'యలంకారమంజరి'[3] యనుకృతిని రచించెను. దీనికి సుధీంద్రయతి 'మధుధార' యను వ్యాఖ్యను రచించెను.

II. అలఙ్కారవార్తికము :—దీనిని రుయ్యకుఁడు రచించినట్లు జయరథుఁడు 'విమర్శిని' (అలంకారసర్వస్వవ్యాఖ్య) లో సూచించియున్నాఁడు. 'అనే నైవ చాశయే నాత్రాలఙ్కారవార్తికే గ్రంథకృతా వైశిష్ట్య మస్యా దర్శితమ్.' [71 పు].

III. అలఙ్కారసర్వస్వము :— సూత్రవృత్త్యాత్మక మగు నిది యాతని కృతులలో నగ్రగణ్యము. ఇది బొంబాయి 'కావ్యమాల' లోను, 'తిరువనంతపుర సంస్కృతగ్రంథావళి' లోను వ్యాఖ్యానములతోఁ బ్రకటింపఁబడినది. దీనిమీఁది విమర్శనము రానున్న వ్యాసములో సమగ్రముగఁ గననగును. దీనికి జయరథుఁడు [విమర్శిని], సముద్రబంధుఁడు [శబ్దనిబంధనము], విద్యాచక్రవర్తి [అలంకారసం

1. నిర్ణయసాగరముద్రితము.

2. పి. పాండురంగవామనకాణే: 'అలంకారవాఙ్మయచరిత్ర.' CLXI పు.

జీవని]యు వ్యాఖ్యలు రచించియున్నారు. మఱియుఁ గేశవమిశ్రకృతమగు 'నలంకారసర్వస్వ' మొకటి కలదు.[4] గ్రంథకర్తనామము తెలియని మఱొక 'యలంకారసర్వస్వము' గలదు. ఈయజ్ఞాతగ్రంథకర్తగురువుకూడ గోపాలదేవునికిఁ గృతిగా నొక'యలంకారసర్వస్వము' ను రచించినట్లు తెలియుచున్నది.[5]

IV. అలఙ్కారానుసారిణి :—ఇది రుయ్యకకృతముగా జయరథునిచే నాలుగుసారులు పేర్కొనఁబడియున్నది.

(i) 'గ్రంథకృతా ప్యలంకారానుసారిణ్యా మత్ర శ్రద్ధాహేతుత్వా చ్ఛ్రద్ధే త్యభిధాయావిశేషే నైకస్మి న్ననేకవస్త్వారోపా న్మాలారూపక మి త్యభిదధతాయ మేవ పక్షః కటాక్షితః' [36 వ పు.]. అధోరేఖాంకితమగు పైపదమునకుఁ గావ్యమాలాసంపాదకు లగు, మ. మ. దుర్గాప్రసాదపండితులు, కాశీనాథసూరియు 'కాశ్మీరకమహాకవిజల్హణప్రణీతసోమపాలవిలాసకావ్యటీకాయాం' అని యధోజ్ఞాపిక వ్రాసియున్నారు. కాని 'అలంకారానుసారిణి' జల్హణుని'సోమపాలవిలాసము'[6] నకు వ్యాఖ్య యనుట భ్రమప్రమాదజనిత మని ముందు తెలియఁగలము.

(ii) 'ప్రాయః శబ్దేనచ హేతుఫలయోః కుత్రాపి సంభవోఽ స్తీతి దర్శితమ్. అతఏ వాలంకారానుసారిణ్యాం గ్రంథకృతానయోరపి సంభవో దర్శితః.' [57 పు].

---

4. 'అలంకారశేఖరము'నందలి పీఠికలోని మూఁడవశ్లోకమునుబట్టి తత్కృతికర్తయగు కేశవమిశ్రుఁడు 'అలంకారశేఖరము'ను రచించుటకుఁ బూర్వము పండితోపకారకము లగు నేడుగ్రంథముల రచించినట్లు తెలియుచున్నది. ఈయేడుగ్రంథములలో 'అలంకారసర్వస్వము' ను [9; 88 పు] 'కావ్యరత్నము'ను [72 పు] మాత్రమే యాతఁ డిటఁ బేర్కొని యున్నాఁడు. 'వాక్యరత్నే' [12 పు] అనునది 'కావ్యరత్నే' యనుట కపపాఠము కానోపు.

5. కాణే: 'అలంకారవాఙ్మయచరిత్ర.' CLXII పు.

6. జల్హణునిగూర్చి యించుక: మంఖుకుని 'శ్రీకంఠచరితము'లో [XXV స. 76 శ్లో.] జల్హణమహాకవి యభివర్ణింపఁబడెను. కాశ్మీరదేశములోని రాజపురీప్రభు వగు సోమపాలుని చరిత్రయే జల్హణుఁడు కావ్యముగా రచించియున్నాఁడు. ఈసోమపాలుఁడు, కాశ్మీరాధినాథుఁడగు సుస్సలభూపతితో యుద్ధముచేసినట్టులు 'రాజతరంగిణి' [VIII త. 631 శ్లో. వలనఁ దెలియుచున్నది. క్రీ శ. 12 వ శతాబ్దములోఁ బూర్వార్ధమున విలసిల్లిన యీజల్హణకవి, 'సూక్తిముక్తావళి' సంధాతయగు, ద్వాదశశతాబ్దోత్తరార్ధమున నుండిన ఆరోహకభగదత్తజల్హణదేవునికంటె భిన్నుఁడని తోఁచుచున్నది. కాని 'ఔఫ్రెక్టు' పండితుఁడు 'సోమపాలవిలాసము'ను గూడ నీ భగదత్తజల్హణదేవునకే యారోపించెను. [Catalogus Catalogorum. I. సం. (208 a)]. కాని యిది సరి గాదు.

V. కావ్యప్రకాశసఙ్కేతము[9]:— అలంకారశాస్త్రమున నానందవర్ధనాచార్యులు, మమ్మటాచార్యులు, జగన్నాథపండితరాయలు త్రిమూర్తులవంటివారు. అందు మమ్మటుని 'కావ్యప్రకాశము'నకు వచ్చిన ప్రతిష్ఠ మఱియేయలంకారగ్రంథమునకు రాలే దని చెప్పవలయును. దీనికి వ్యాఖ్యానములు, (వ్యాఖ్యానములకు వ్యాఖ్యానములును) కనీసము డెబ్బది యున్నట్లు తెలియుచున్నయది. వీనినిగూర్చి మున్ముందు ప్రత్యేకవ్యాసము వ్రాయఁబడును. సంస్కృతవాఙ్మయములో నెట్టియు గ్రంథమునకును నిన్ని వ్యాఖ్యలు లేవు. కాళిదాసుని మేఘదూతకు మాత్ర మేఁబది వ్యాఖ్య లున్నట్లు తెలియుచున్నది. మొన్నమొన్నటివఱకు నుండిన మల్లాది లక్ష్మణసూరి 'కావ్యప్రకాశము'న కొకవ్యాఖ్య రచించెను. నైయాయికులేమి, వైయాకరణులేమి మఱి యే యితరశాస్త్రమునందు ప్రగాఢవైదుష్యమును సంపాదించిన పండితులేమి, భారతవర్షమున వివిధప్రాంతములందలి పండితులు దీనికి వ్యాఖ్యలు రచించియున్నారు. నేఁడు 'భట్టాచార్య'బిరుదము (Ph. D.,) నకుఁ బరిశోధనగ్రంథము (Thesis) ను రచియించినట్లు, నాఁడు 'కావ్యప్రకాశము'నకు వ్యాఖ్య వ్రాయ సమర్థుఁడగువాఁడే యాచార్యబిరుదమున కర్హుఁడుగా నెంచఁబడియుండును. అందువలన దీని కిన్నివ్యాఖ్యలు వ్రాయఁబడియుండును. దీనివ్యాఖ్యలింక నెన్ని యుత్సన్నము లయ్యెనో! సుభాషితగ్రంథములవలెనే యిట్టివ్యాఖ్యలవలన, విస్మృతినందినకవులును నుత్సన్నము లగు ననేకగ్రంథములును మనకుఁ దెలియుచున్నవి. ప్రకృత మగు 'కావ్యప్రకాశసంకేతము' మమ్మటుని 'కావ్యప్రకాశము'నకు వ్యాఖ్య-ఇది రుయ్యకకృత మని జయరథుఁడు వ్రాసియున్నాఁడు.

---

9 'కావ్యప్రకాశము' నీనడుమ నీ 'సంకేతవ్యాఖ్య'తోడను, మఱినాలు గితరవ్యాఖ్యలతోడను యస్. యస్. సుక్థంకరుపండితుఁడు, (M A., Ph D.,) కొంతకాలముకుఁ బ్రచురించియున్నాఁడు. రుయ్యకునికంటె దిద్దంతి వ్రాసిన యీవ్యాఖ్య సమగ్రముగ నెన్నఁడు ప్రచురింపఁబడునో యని యువ్విళులూరుచున్నాము. ('Kavyaprakasa' Ullasas I, II, & III with five Commentaries, edited with an Introduction, English translation & Explanatory Notes-by S. S. Sukthankar. The Bombay Book Depot, Girgam, Bombay 1933; Vide 'Indian Historical Quarterly'- Vol. X No. 2; P 376-7; June 1934) ఈసంపుటమున (1) రుయ్యకుని 'సంకేతము,' (2) నరహరిసరస్వతీతీర్థుని 'బాలచిత్తానురంజని,' (3) గోవిందఠక్కురుని 'ప్రదీపము,' (4) నాగేశుని 'ఉద్ద్యోతము,' (5) వైద్యనాథుని 'ప్రభ' అను నైదువ్యాఖ్యానములు గలవు.

'యత్తు కావ్యప్రకాశసంకేతగ్రంథకృతా వస్తుధ్వనేః శబ్దశక్తి మూలత్వం చిన్త్య ముక్తం తదుదాహరణాభిప్రాయే ణైవోన్నేయమ్' [102 పు.] రత్నకంఠుఁడు కూడ నిట్టులే యుదాహరించియున్నాఁడు. 'కావ్యప్రకాశసంకేతము'నందలి పీఠికా శ్లోకము [2 శ్లో] లో నీగ్రంథకర్త తాను తిలకునియొద్ద నలంకారశాస్త్రము నధ్యయన మొనరించినట్లు వ్రాసికొనియున్నాఁడు. ఈవ్యాఖ్యాతయు (రుచకుఁడు) మన రుయ్యకుఁడు న్యాకఁడే.

'కావ్యప్రకాశసంకేతము' వ్రాఁతప్రతిలో మొదటియుల్లాసము చివర—

'ఇతి శ్రీమద్రాజానకామల్ల మమ్మట రుచకవిరచితే నిజగ్రంథకావ్యప్రకాశసంకేతే ప్రథమఉల్లాసః' అనియు, దశమోల్లాసము తుదను 'కృతీ రాజానక మమ్మటాలక రుచకానాం' అనియుఁ గానవచ్చుచున్నది. 'కావ్యప్రకాశ'వ్యాఖ్యానములలో మాణిక్యచంద్రుని 'కావ్యప్రకాశసంకేతము' మొదటిది. సోమేశ్వరుఁడు, సరస్వతీతీర్థులు, జయంతుఁడు రచియించిన వ్యాఖ్యలును బ్రాచీనములే. క్రీ. శ. 15 వ శతాబ్దిలో విలసిల్లిన గోవిందఠక్కురుని 'కావ్యప్రదీప'వ్యాఖ యపారపాండితీద్యోతకముగా నున్నది.

VII నాటకమీమాంస:—మహిమభట్టుని 'వ్యక్తివివేకము'[10]నకు వ్యాఖ్యయగు 'వ్యక్తివివేకవిచారము'లో వ్యాఖ్యాత [యగురుయ్యకుఁడు] ఈ 'నాటకమీమాంస' స్వోపజ్ఞోదాహృతముగాఁ జేర్కొనియున్నాఁడు.

VII బృహతి:—'వ్యక్తివివేకవిచారము' [45 పు.] ననుసరించి, తన్నిర్మాత [రుయ్యకుఁడు] 'బృహతి' యనునొకవిపులగ్రంథమును రచింప సమకట్టియుండె నని స్ఫురించుచున్నది. ఈగ్రంథమే పూర్తిగ రచియింపఁబడి మనకు లబ్ధమగుచో నలంకారాహవరంగమున మహారథుఁడగు రుయ్యకునంతవానిచే నలంకారశాస్త్రగ్రంథ లనేకములు విడఁగొట్టఁబడియుండెడివే.

VIII వ్యక్తివివేకవిచారము:— అలంకారసర్వస్వమునందలి వృత్తిని నిర్మించిన యాతఁడే [రుయ్యకుఁడే] 'వ్యక్తివివేకవిచారమ'ను కృతిని - రచించినట్లు

10. 'అస్యచ విధేయావిమర్శ స్యానన్తరప్రసిద్ధలక్ష్యతాత్ త్వే నాస్మాభి ర్నాటకమీమాంసాయాం సాహిత్యమీమాంసాయాంచ తేషు తేషు స్థానేషు ప్రపఞ్చః ప్రదర్శిత ఇతి గ్రన్థవిస్తరభయాదిహ ఏ వోపరమ్యతే'. [32 పు.]

'అస్మాభి స్త్వేతత్ ప్రపఞ్చో బృహత్యాం కరిష్యతే' [45 పు. 'ద్రావిణమాపది' అను శ్లోకమునకుఁ బిమ్మట.]

జయరథుఁడు తన 'అలంకారసర్వస్వవిమర్శిని'లో సూచించియున్నాఁడు.[11] మహిమభట్టుని [1020—60. క్రీ. శ.] 'వ్యక్తివివేకము'నకు వ్యాఖ్య యగు పై 'వ్య. వి. వి' అసమగ్రముగఁ బ్రచురింపఁబడినది.[12] ఈవ్యాఖ్యాత పేరు తెలియుటలేదు. కాని యితఁడు రుయ్యకుఁడే యనుటకుఁ బ్రబలప్రమాణములు లభించుచున్నవి. వ్యక్తివివేకవ్యాఖ్యాత తాను 1. 'హర్షచరితవార్త్తికము'ను[13]

2. 'బృహతి'[14]

3. 'సాహిత్యమీమాంస'[15]

4. 'నాటకమీమాంస'[16] యనునలంకారగ్రంథములను నిర్మించినట్లు చెప్పికొనియున్నాఁడు. ఈగ్రంథములలో, 'నాటకమీమాంస'ను వ్యక్తివివేకవ్యాఖ్యాతయే నిర్మించినట్లును, ఆతఁడే 'బృహతి'ని గూడ రచింపసమకట్టెనట్లును వ్రాసియున్నాను. ఇఁక నిందుఁ జెప్పఁబడిన 'హర్షచరితవార్త్తికము'ను 'సాహిత్యమీమాంస'యును రుయ్యకకృతములుగా 'అలంకారసర్వస్వము'లో నుదాహరించుకొనఁబడియున్నవి.[17] (రుయ్యకునివంటి యాలంకారికచూడామణి) పైరెండు గ్రంథములు నితరకవికృతములే యగుచో వానిని స్వనిర్మితము లని తనగ్రంథమునఁ జెప్పసాహసించునా! వ్యక్తివివేకవ్యాఖ్యనుండియు, నలంకారసర్వస్వమునుండియుఁ బ్రకృత ముదాహరింపఁబడిన పంక్తులసామ్యమును బట్టి యీరెండుపంక్తులును [దీనింబట్టి పైరెండుగ్రంథములును] ఏకకర్తృకము లని తెలియుచున్నది.

---

11. "వాచ్యస్య ప్రతీయమానేన తాదాత్మ్య తదుత్పత్త్యభావాది నేహ ప్రతన్యత ఇతి వ్యక్తివివేకవిచారే హి మయైవ తద్వితత్య నిర్ణీతమితి భావః" [అలం. సర్వ. 13 పు.]

12 'అనంతశయనసంస్కృతగ్రంథావళి, 5 వసంఖ్య. త గణపతిశాస్త్రిసంశోధితము. (Trivandrum 1909.)

13. "ఏతదస్మాభిర్హర్షచరితవార్త్తికే విస్తృత్య ప్రతిపాదితం తత ఏవావసేయమ్." వ్యక్తివివేకవ్యాఖ్యా. 44 పు.

14. చూ. అధోజ్ఞాపిక. 10.

15. చూ. అధోజ్ఞాపిక. 10.

16. ,, 10.

17. "ఏషా (ఉత్ప్రేక్షా) సమస్తోపమాప్రతిపాదకవిషయేఽపి హర్షచరితవార్త్తికే సాహిత్యమీమాంసాయాం చ తేషు తేషు ప్రదేశేషూదాహృతా (దృశ్యతే)". [61. పు.]

మఱియు వ్యక్తివివేకమునందలి సిద్ధాంతములను ఖండించు నలంకారసర్వస్వపంక్తులపై వ్యాఖ్య వ్రాయునపుడు జయరథుఁ డొకానొకచో 'వ్యక్తివివేకవిచారము'ను రుయ్యకనిర్మితముగాఁ బేర్కొనినట్లు చూచియే యున్నాము. రచనాకౌశలమునుబట్టియు, శయ్యాప్రౌఢిని బట్టియు వ్యక్తివివేకవ్యాఖ్య 'యలంకారసర్వస్వముం దలపించుచు, నీవ్యాఖ్యయే జయరథునిచే సూచింపఁబడిన 'వ్యక్తివివేకవిచారమే' అనునభిప్రాయమును దృఢీకరించుచున్నది. ఈయైక్యాభిప్రాయము సమంజసముగాఁ జూపట్టనిచో రుయ్యకునికంటెను బూర్వుఁడగు నేసుప్రసిద్ధాలంకారికుఁడో యీవ్యాఖ్యను రచియించినట్లు లెంచఁదగు నని'వ్యక్తివివేక' సంపాదకులగు గణపతిశాస్త్రిగారు పీఠికలో వ్రాసియున్నారు. కాని యీవిషయము సందేహాస్పద మెంతమాత్రముఁ గా దనియుఁ, బైవ్యాఖ్యయు 'వ్య. వి. వి.' ను భిన్నములుగా వనియు, నిది రుయ్యకనిర్మితమే యని కంఠోక్తిగాఁ జెప్పఁదగు ననియు మనవిచేయుచున్నాను.

మహిమభట్టుఁ డనుమానపక్షవాది, వ్యాఖ్యాత యన్ననో యత్యంతపరాకాష్ఠ గల ధ్వనిమతానుయాయి. ఉభయులమతములును బరస్పరవిలక్షణములగుటం జేసి,మహిమభట్టు నభిప్రాయములఁ దఱచు వ్యాఖ్యాత ఖండించుచుండును. ఆనందవర్ధనుని యభిప్రాయములను మహిమభట్టు తీవ్రముగా ఖండించియుండఁగా, నానందవర్ధనుని యనుయాయి యగు(రుయ్యకుఁడు) ప్రకృతవ్యాఖ్యాత మహిమభట్టుని సిద్ధాంతముల నంతకంటెఁ దీవ్రముగాఁ బూర్వపక్షము చేసియున్నాఁడు.

'శ్లో. ఇహ సంప్రతిపత్తితోఽన్యథా వా ధ్వనికారస్య వచోవివేచనం నః[18]
నియతం యశసే ప్రపత్స్యతే య న్మహతాం సంస్తవ ఏవ గౌరవాయ॥'

—పీఠికాశ్లోకములు, 3 శ్లో.

అను మహిమభట్టుని శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు వ్యాఖ్యాత దూషణగర్భముగా నిట్టులు నుడివి యున్నాఁడు.—"యథాస్థితపాఠే తు ధ్వనికారస్యేతి వచః శబ్దాన్విత మిష్యమాణం ప్రాధాన్యా ద్వివేచనశబ్దాన్వితం ప్రతీయతే ఏత చ్చాస్య సాహిత్యవిచారదుర్నిరూపకస్య ప్రముఖ ఏవ స్ఖలిత మితి మహాన్ ప్రమాదః."[19]

18. "అత్ర 'ధ్వనికృద్వాక్యవివేచనం తదేతద్' ఇతి పఠనీయమ్."—వ్య. వి. వ్యాఖ్య, 1 పు.
19. వ్యక్తివివేకవ్యాఖ్య, 1 పు.

మహిమభట్టుని యాత్మోత్కర్షను వ్యాఖ్యాత యనేకపర్యాయము లధిక్షేపించియున్నాఁడు.[20] ఇట్టు లనుటచే మహిమభట్టగుణమును వ్యాఖ్యాత గుర్తింపలేదనుటకు వీలు లేదు. మహిమభట్టుని 'మహామతి' యని వ్యాఖ్యాత స్తుతించియే యున్నాఁడు.[21] ఉదార మగుభావసంపదచే నేమి, సునిశితము స్వతంత్రము నగు హేతువాదముచే నేమి, సంక్షిప్త మగు భావావిష్కరణముచే నేమి, యీవ్యాఖ్య సర్వథా మూలగ్రంథగౌరవమున కనురూపముగా నున్నది. వ్యాఖ్యాత ధ్వని సిద్ధాంతానుయాయి యగుటచే నాసిద్ధాంతమునకు మహిమభట్టుచే నారోపింపఁబడిన దోషములను విశేషసామర్థ్యముతోఁ, బ్రబలహేతుపురస్సరముగా నిరసించియున్నాఁడు.

మహిమభట్టు 'సంగ్రహశ్లోకములు' [సంగ్రహార్యము లని కాని] అను నామముతోఁ గొన్నిశ్లోకముల నెడనెడఁ దనకృతియందు వ్రాసియున్నాఁడు.[22] పూర్వము చర్చింపఁబడిన విషయసార మీశ్లోకములలో సంగ్రహముగా నొసంగఁబడును. ఇట్టులే వ్యాఖ్యాతయు స్వనిర్మితము లగు 'సంగ్రహశ్లోకముల' నటనట నొసంగియున్నాఁడు. పూర్వవ్యాఖ్యాతల నీతఁడు 'కేచిత్తని [32 పు.] సూచించి యున్నాఁడు.

'శ్లో. హేమ్నాం(మ్నో)భారశతాని వా మదముచాం బృన్దాని వా దన్తినాం
శ్రీహర్షేణ యదర్పితాని గుణినే బాణాయ కుత్రాద్య తత్
యా బాణేన తు తస్య సూక్తివిసరై రుట్టఙ్కితాః కీర్తయ
స్తత్ కల్పప్రలయేఽపి యాన్తి న మనాక్ మన్యే పరిమ్లానతామ్.'

---

20. "తదేత దస్య విశ్వమగణనీయం మన్యమానస్య స్వాత్మనః సర్వోత్కర్షకాలితాఖ్యాపన మితి." [41 పు.]

"అ(త్రి)చోపమారూపః ఖిమతే ఏవం విధే చ ప్రదేశే గ్రంథకారో హేవాకితయైవ దూషణమదాత్." [44 పు.]

"నతు హేవాకస్య పశ్చాల్లగనీయ మిత్యాస్తాం తావత్" [44 పు.]

21. "యదేత దివా గ్రంథకృతా విచారసరణి మాశ్రిత్య విధేయావిమర్శాదిదోషప్రపంచః ముద్భావితం, న తత్రాద్యతనపురుషమాత్రబుద్ధిప్రియ నానాయాయా నాదరః కరణీయః. పూర్వైరేవంవిధదోషోద్భావనరూపస్య విచారస్య ప్రణీతత్వాత్." [వ్య. వి. వ్యా. 15 పు.]

"తదేవం మహావిదుషాం మార్గమనుసృత్య సహృదయశ్లాఘనాయ విచారయ(న్దరం ?) తోఽస్య మహామతే ర్న్యకశ్చిత్ పర్యనుయోగలేశస్యావకాశ ఇత్యల మతిప్రసక్తేన" [16 పు.]

22. మూ. 6; 14; 18; 22-23; 26; 32; 34-35; 56 పుటలు.

అను భట్టబాణహర్షవర్ధనవిషయక మగు శ్లోక మిం దుదాహరింపఁబడియున్నది.[23] మఱి యు 'హయగ్రీవవధ' యను సంస్కృతకావ్యమును నిర్మించిన భర్తృమేణ్ఠునిగూర్చిన యీ క్రిందిశ్లోకము గూడ నీపుటలోనే యుల్లేఖింపఁబడి యున్నది.

శ్లో. "పుండ్రేక్షోః పరిపాకపాండునిబిడే యో మధ్యమే పర్వణి
ఖ్యాతః కిఞ్చ రసః కషాయమధురో యో రాజజంబూఫలే
తస్యాస్వాదదశావిలుంటనపటు ర్యేషాం వచోవిభ్రమః
సర్వత్రైవ జయన్తి చిత్రమతయ స్తే భర్తృమేణ్ఠా(ణ్ఠో?)దయః."

వ్యాఖ్యాతలచేఁ బేర్కొనఁబడిన గ్రంథగ్రంథకర్తలనామములలోఁ బ్రధానములు:—

గ్రంథకర్తలు :

1. అక్షపాదుఁడు (40 పు)
2. ఉద్భటుఁడు
3. కాత్యాయనుఁడు (15 పు)
4. దండి ['దాణ్డో గ్రన్థః' 47 పు]
5. ధర్మకీర్తి [కృతవార్త్తికము. 34 పు]
6. ధ్వనికారుఁడు. (15, 44 పు)
7. పతంజలి. (26 పు)
8. పరిమళుఁడు. (52 పు)
9. వామనుఁడు. (29, 45; 52 పు)
10. సౌగతులు. (41 పు)

గ్రంథములు :

1. కావ్యకౌతుకము (13 పు)
2. దర్పణము [హృదయదర్పణము, ధ్వనిధ్వంసగ్రంథము 1; 13 పు]
3. నాటకమీమాంస[32పు]
4. బృహతి (45 పు)
5. వక్రోక్తిజీవితము(16;44పు)
6. సాహిత్యమీమాంస(32పు)
7. హర్షచరితవార్త్తికము(44;50)
8. హృదయదర్పణము(1;13పు)

వ్యాఖ్యాత మూలమునందలి పాఠభేదములను[24] బ్రక్షిప్తములనుగూడఁ జర్చించి యున్నాఁడు.[25] అలంకారసర్వస్వమునందలి 'వృత్తి'కారుఁడు (రుయ్యకుఁడు) నీవ్యాఖ్యాతయు భిన్నులు కారు కావున నీవ్యాఖ్య క్రీ. శ. 1150 ప్రాంతముల రచింపఁబడె నని యెంచఁదగును.

IX. శ్రీకంఠస్తవము—ఇది యుత్పన్నప్రాయ మనఁదగును.

'అలంకారసర్వస్వము'న నీగ్రంథము స్వనిర్మితము గా రుయ్యకుఁ డుదాహరించుకొనియున్నాఁడు.

---

23. చూ. 20 పుట.
24. చూ. 33; 35 పు.
25. చూ. 51 పు.

"ఉదాహరణం మదీయే శ్రీకణ్ఠస్తవే యథా:—

*   *   *   *

'శ్లో. అహీనభుజగాధీశవపుర్వలయకఙ్కణమ్
శైలాదినన్దిచరితం క్షతకందర్పదర్పకమ్
వృషపుఙ్గవలక్ష్మాణం శిఖిపావకలోచనమ్
ససర్వమఙ్గలం నౌమి పార్వతీసఖ మీశ్వరమ్॥
దారుణః కాష్ఠతో జాతో భస్మభూతికరః పరః
రక్తశోణార్చి రుచ్ఛ్రణ్డః పాతువః పావకః శిఖీ"

ఏతచ్చ సుబన్తాపేక్షయా. తిఙన్తాపేక్షయాచ యథా తత్రైవ—

భుజఙ్గకుణ్డలీవ్యక్త శశిశుభ్రాంశుశీతగుః
జగన్త్యపి సదాపాయా దవ్యా చ్చేతోహరః శివః" [అలం. స. 19 పు.]

X. సహృదయలీల[26]:—

(1) గుణోల్లేఖము, (2) అలంకారోల్లేఖము, (3) జీవితోల్లేఖము, (4)పరిక రోల్లేఖము, అను నాలు గుల్లేఖములు గల చిన్నగ్రంథము. ప్రథమోల్లేఖమున నాకర్షణీయము లగు రమణీమణుల రూపవర్ణప్రభాదు లగు దశగుణములు నభివర్ణింపఁబడినయవి. ద్వితీయమున ముక్తాస్వర్ణరత్నాత్మకము లగు వివిధాలంకారములు, నభ్యంజనయోగ్యము లగు ననులేపాదులు, నారీమణులు ధరించు పుష్పములు మొద లగునవి వర్ణింపఁబడినవి. తృతీయమున రామణీయకమునకు సారభూతమగు యౌవనముంగూర్చి వివరింపఁబడెను. చతుర్థమున సౌందర్యాతిశాయు లగు సామగ్రులను గూర్చి విచారింపఁబడెను.

XI. సాహిత్యమీమాంస:—ఈకృతిరత్న ముత్పన్నమైన దనియే చెప్పఁ డగును. ఇది 'అలంకారసర్వస్వము'నందును, 'వ్యక్తివివేకవిచారము'నందు నుదా

---

26 'కావ్యమాల' V గుచ్ఛకము, బొంబాయి, (నిర్ణయసాగరముద్రిణము) 'పిషెల్' [Prof. Richard Pischel] పండితుఁడు కూడ దీనిని బ్రచురించియున్నాఁడు. 1886.

శ్రీమాన్ మాడభూషి కృష్ణమాచార్యులవారు తమ 'సంస్కృతవాఙ్మయ చరిత్రము'లో "ప్రకృతము మనకులభించిన రుయ్యకుని ద్వితీయగ్రంథము 'సహృదయలీల' యను రసగర్భగీతము (Lyric)" అని వ్రాసియున్నారు. ["A History of the Classical Sanskrit Literature' by Prof. M. Krishnamacharya, M. A. B. L., 1906, Page

హరింపఁబడియున్నది.[27] విద్యానాథుఁడు [1325 క్రీ. శ.] కూడ దీని నుదాహరించియున్నాఁడు.

"ప్రబంధరాజే ర్మహాపురుషగుణవర్ణనం సోమ్యః పర మామోదః ... ........................ప్రపంచితం చ సాహిత్యమీమాంసాయామ్ 'నాయకగుణ గ్రథితా సూక్తిస్రజ సుకృతినా మాకల్పాంతి' ఇతి.[28]" ఈ గ్రంథరాజమునుగూర్చి యింతకంటెఁ బ్రకృత మేమియుఁ దెలియుటలేదు.

**XII.** హర్షచరితవార్తికము—ఈ గ్రంథముకూడ నుత్పన్నకల్ప మనియే నుడువఁదగును. అలంకారసర్వస్వమునందును వ్యక్తివివేకవ్యాఖ్యయందు నీగ్రంథము పేర్కొనఁబడియున్నది. ప్రకృతము మనకు లభియించిన హర్షచరితవ్యాఖ్యలలో శంకరపండితుని 'సంకేతవ్యాఖ్య' ప్రాచీనతమముగాఁ జూపట్టెడిని. ఇతఁడు బహుశః కాశ్మీరదేశీయుఁడే కావచ్చును. అయినను దనవ్యాఖ్యలోఁ గాశ్మీరపండితులగు భామహోద్భటుల నీతఁడు పేర్కొనియెఁ, గాని, మమ్మట రుయ్యకుల నుదాహరించి యుండలేదు. అందువలన నీతఁడు రుయ్యకునికంటెఁ బూర్వుఁడని యే నిర్ణయింపనగును. శంకరుని వ్యాఖ్యకంటెఁ బూర్వము మఱికొన్ని వ్యాఖ్యలున్నట్లు, "కేచిత్, అన్యే, అపరే" అను నీతని సూచనలవలనఁ దెలియుచున్నది.

మఱియు నాధునికుఁడగు యస్.డి. గజేంద్రగడ్కర్ పండితుఁడు కూడ హర్షచరితమునకు 'బాలబోధిని' యనునొక వ్యాఖ్య రచించియున్నాఁడు.

ఇతోఽధికముగ నీగ్రంథమును గూర్చి తెలియుటలేదు.

కావ్యమునకు శబ్దములు శరీరమువంటి వని దండి నుడివియున్నాఁడు. అట్లగుచోఁ గావ్యమున కాత్మ యేది యని ప్రశ్న కలుగుచున్నది. దీని కాయాయాలంకారికులు వారివారిమతముల ననుసరించి వివిధము లగుసమాధానముల నొసఁగియున్నారు. ఆమతములలోఁ బ్రధానములు కాలక్రమమునుబట్టి యేవనః—

1 రసమతము, 2 అలంకారమతము, 3 రీతిమతము, 4 ధ్వనిమతము, 5 వక్రోక్తిమతము. మఱియు ననుమానమతము, ఔచిత్యమతము, చమత్కారమతము మొదలగున వనేకములు గలవు. అలంకారవిషయమున రుయ్యకుఁ

165.] కాని యిది ప్రామాణికము. ఈకృతి 'సహృదయలీల' కాని 'సహృదయరీతి' కాదు. ఇది యలంకారగ్రంథమే కాని రసగర్భగీతము కాదు.

27 చూ. అధోజ్ఞాపికలు 10; 18.

28. ఉపోద్ఘాతప్రకరణము, 9 పు. (వావిళ్ళవారిప్రతి)

డుద్భట కుంతకులమతము ననుసరించినను, నీతఁడు ధ్వనిపక్షవాదియే కాని యలంకారమతానుయాయి కాఁడు. సునిపుణధిషణుఁ డగునీతఁడు చిరంతనాలంకారికుల యభిప్రాయములను నవీనులయభిప్రాయములను విశేషసామర్థ్యముతో సమన్వయ మొనరించియున్నాఁడు. ప్రాచీనాలంకారికులగ్రంథములకు రుయ్యకునియలంకారసర్వస్వము పరిశిష్టగ్రంథమువంటిది. ధ్వనికారుఁడు కావ్యమును—ధ్వని, గుణీభూతవ్యంగ్యము, చిత్రము-అని మూఁడువిధములుగా విభజించియున్నాఁడు. అందు మొదటిరెండువిధములును ధ్వన్యాలోకమున వివరింపఁబడియున్నవి. శబ్దార్థాలంకారప్రధాన మగుచిత్రకావ్యమున కంతఁ బ్రసక్తిలేకపోవుటచే నీభాగమును రుయ్యకుఁడు సర్వంకషముగాఁ జర్చించియున్నాఁడు. నవీనాలంకారికులలోఁ బ్రధానులగు విశ్వనాథుఁడు, విద్యాధరుఁడు, విద్యానాథుఁడు, అప్పయదీక్షితులు నీతని యభిప్రాయములను బరమోపాదేయము లని యెంచి యున్నారు. ఒక్క రసగంగాధరకారుఁడు దక్క రుయ్యకునిమతమును ఖండించినవారే లేరు. దీనినిబట్టి చూడఁగా రుయ్యకుఁ డలంకారసారస్వతసామ్రాజ్యమున నెంతయుత్కృష్టస్థానము నలంకరించియున్నాఁడో తెలియఁగలదు.

# గ్రంథస్వీకారము.

1. శ్రీశతకరత్నాకరము:—ఇందు భాస్కరోపాసకులు శ్రీయుత, అకుల భూపతికవిగారిచే రచియింపఁబడిన నవరత్నద్వాదశప్రాసభాస్కరశతకమును, మానసబోధశతకమును, శౌరిశతకమును—భూపతికవిగారి కుమారుఁడు శ్రీయుత పెద్దయ్యకవిగారిచే రచియింపఁబడిన రాఘవశతకమునుం గలవు. భాస్కరశతక రాఘవశతకములు వృత్తములు. మానసబోధ, శౌరిశతకములు కందములు. భూపతికవిగారు దివంగతులైరి. వీరికవిత్వము భక్తిరసప్రధానమై నిర్దుష్టమై ధారాళముగ నున్నది. దీని వెల రు 0-4-0. అకుల పెద్దయ్యగారి యొద్ద అములాపురము తా॥ కూనవరములో దొరకును.

నవరత్నద్వాదశప్రాసభాస్కరశతక మొక్కొక్క ప్రాసమునకు తొమ్మిదేసిపద్యములచొప్పునఁ బండ్రెండక్షరముల ప్రాసములతోడివృత్తములు. మచ్చు-

మ. పగలే పూనెద వెల్లకాలమును నాభాగ్యంబ దెంతందు భూ
తగణంబు ల్మినుజూచిన న్భయముచేతం బాఱు పేయేల నీ
రుగ మాఱుం గద రోగపుంజములు నీరూపంబు లగ్గింపఁ బ
న్నగరాజేంద్రనిశైనగామ వినుదీనాధార యోభాస్కరా. గకారప్రాసము.46

ఉ. దండిగ నేఁడు మండినవసంబున కొక్కటె చక్రముండెనా
యుండుట కేమివింత సుగుణోత్తమ రజ్జులు పాములేకదా
నిండుబయ ల్మినుంగొనఁగ నెమ్మదిఁబూనుము సత్ప్రవీణాను నీ
యండకు రాఁదలంపుగల యాకులభూపతికొక్కటె భాస్కరా.-డప్రాసము. 90

క. మిన్నున నేనున్నాఁడను, మన్నన నీవుండినావు మానక యెపుడున్
నిన్నుం గరుణించు టెట్లని, పన్నుగ శ్రీభాస్కరుండు పలుకఁడు మనసా. 41

క. కిరణంబులు తాఁకినచో, దురితము లేమైనఁ గాని తొలఁగక నిలువం
దరమా యిది గావున భా, స్కరునికిఁ గడుమ్రొక్కు లిడుము చపలపు మనసా.

క. పాపాత్మసభను ద్రౌపది, కేపట్టును లేక యుండ నిభరాడ్వరదా
కాపాడు మనినఁ గాచితి, వాపద్బాంధవుఁడ వనుట కరుదే శౌరీ. 17

చ. ఘనమగు కామమాదిగల గ్రాహకదంబముచే వెలుంగు నీ
తనువనునబ్ధిలోన భయదంబగు వ్యాధితరంగవల్లిలో

మునుఁగుచుఁ దేలుచుండి తటముం గనలేని మదీయజీవనౌ
కను నొకయొడ్డుచేర్చి మనఁగాఁ గరుణింపవె స్వామి రాఘవా. 46

ఉ. బాహుబలుండ నే నొకని ప్రాపును గోర పటుండ గర్వసం
దోహముఁ బొందరాదు తపనుండు సహస్రకరాన్వితుండు మం
దేహవినాశనార్థ మొకదీనధరామరు నర్ఘ్యతోయసం
దోహ మపేక్షచేయుటఁ బుధుల్ వచియించుట లేదె రాఘవా. 61

ఈపెద్దయ్యగారు రచించిన బిల్హణీయము ను మఱికొన్ని శతకములును వెలువడనున్నవి.

2. హంసతారావళి - లలితాశతకము.

హైదరాబాదు నైజాంకాలేజీ ప్రొఫెసరు, విద్వాన్ బ్ర. సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి, యం. ఏ. గారు రచించినవి. వీరు కొల్లాపురము స్నేహలతాసంఘమునం దొకసభ్యులు. ఆసభవారి ప్రోత్సాహమునఁ బ్రసంగవశమున హంసతారావళి - “మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్” అను మకుటముతోను, నకారప్రాసయుతముగను — లలితాశతకము, “లలితా రశ్మిఁకఁ గాలయాపనము లేలా ? రాజబింబాననా ?” యనుమకుటముతో లకారప్రాసముతోడి మత్తేభములుగను రచియించిరి. వీరు సంస్కృతాంగ్లములలో యం. ఏ. పరీక్ష నిచ్చిరి. ఆంధ్రమున విద్వత్పరీక్ష నిచ్చిరి. కావున మూఁడుభాషలలో నసమాన మైనపాండిత్యము గలవారు. బుద్ధిమంతులు, నిగర్వులు నగువీరిభాషాభిమానము తదనుగుణముగనె యుండు ననుటకు సంశయములేదు. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారును శతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారును వీరి కవితను మెచ్చుకొనిరి. మచ్చునకు రెండుపద్యములు.

1. మానవు నీకుబుద్ధి వినుమానసము లబ్ధము లెన్నియేజ్జనన్
మేనులు పెంచువాంఛలను మేఁపఁగఁ జూచితి వంతెకాని నీ
దీనత తీఱిపోయినదె ? తెల్పుము నన్నిటుఁ ద్రిప్పనెంచితో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

1. అలరుందావులు వ్యాప్తమైనగతి విద్యాగంధవాహంబు భా
సిలుచందంబున నక్షరంబగు యశశ్శ్రీసౌమ్యకర్పూరకాం
తిలతాజ్యోతులు వెల్గుచాడ్పునఁ గదే ధ్యేయంబు నీచాయలో
లలితా ! రశ్మిఁకఁ గాలయాపనము లేలా రాజబింబాననా !

పద్యములంబట్టి వీరియుపాసనావిధము తెల్లము గాఁగలదు. దీనికి ముందు స్నేహలతాకవితాసంఘమున కధ్యక్షులు సోదరకవులు, వి. రామసుబ్బారాయఁడుగారును, వేంకటనారాయణగారును వ్రాసిన పీఠిక కలదు. వెల రు 0-4-0. కర్నూలుజిల్లా మొరవకొండపోస్టు కొల్లాపురములో స్నేహలతాకవితాసంఘములో నీపొత్తమే గాక యనేకగ్రంథములు దొరకును.

3. పళ్లమాంబికాతారావళి.

శ్రీయుత వడ్లమాని సూర్యనారాయణశాస్త్రిగారి ప్రోత్సాహముచే వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు రచించినతారావళి. గోదావరీమండలములో వానపల్లి పళ్లాలమ్మ మిగులఁ బ్రసిద్ధికెక్కినది. పలువురు, తమబిడ్డలకు పల్లయ్య, పల్లమ్మ, పల్లమరాజు, పళ్లాలు- అని యాదేవతపేళ్లను బెట్టుకొనుచున్నారు. వైశాఖమాసములో సంవత్సరోత్సవము విరివిగా జరగుచుండును. ఇందు మొదట నాయంబవృత్తాంతము చేర్పఁబడినది. ఇది యమూల్యము. కొల్లాపురములోనే దొరకును.

ఏదో చిక్కుదయించువేళలనొ లే కేదో భయభ్రాంతినో
యేదో దైన్యము గల్గువేళలనొ నీవే దిక్కుగాఁ గొల్తు రే
తాదృగ్దైవత మెందు లే దనుచు నాధర్మంబునం గాక నీ
పాదాబ్జంబు లనుక్షణంబు నెదలో భావింతుఁ బల్లాంబరో.

4. నాగానందనాటకము.

శ్రీహర్షదేవుని సంస్కృతమునకు,పాలెపు వేంకటసూర్యగోపాలప్రధానుల యాంధ్రానువాదము.రెండవకూర్పు. దీనిని 1890 సం॥లోఁ గాకినాడలోఁ గవిగారు న్యాయవాదులుగానున్నపుడు మొదటిసారియచ్చువేయించిరి. దానికంటె దీనిలో మార్పులేమియుం జేయలేదు. ఈనాటకము తెనుఁగుదేశములో విరివిగా వ్యాపించినట్లు లేదు. ఇందు నాయకుఁ డగుజమూతవాహనుఁ డొకనాగుని రక్షించుటకై తనశరీరమును గరుత్మంతున కర్పించుట వర్ణితము. దానిచేతనే యతనిని శిబి, దధీచి, కర్ణాదులగు మహాదాతలలో నుగ్గడించుచున్నారు. 4, 5, అంకములు చదువునప్పుడు కరుణ ముట్టిపడుచుండును. గరుడునకు-దినమున కొక్కనాగుని దినునట్లు వాసుకి సమయముచేయించినాఁ డనినమాట విని జీమూతవాహనుఁ డనినక్రింది యొక్క పద్యమేచాలును జీవకారుణ్యమునకు——

శ్లో. జిహ్వాసహస్రద్వితయస్యమధ్యే, నైకాపి సా తస్య కిమస్తి జిహ్వా
ఏకాహిరక్షార్థమహిద్విషోద్య, దత్తోమయాత్మేతి యయాబ్రవీతి.

గీ. అహిపతికి జిహ్వాద్విసహస్రమందు, మిఁది యొకపాము నైన రక్షించుకొనుటకు
నిదిగో నా దేహమును గొను మిత్తుననఁగ,జాలనిది యయ్యె నే యొక నాలుకైన.

నాటకము తెనిఁగింపును మృదుమధురముగా నున్నది. శ్రీ వేంకటసూర్యగోపాలముగారు వెనుక, జానకీపరిణయమును, గమలినీకలహంసమును గూడ నాంధ్రీకరించి ప్రకటించిరి.

క్రోడీకరోతి ప్రథమం జాతం నిత్యమనిత్యతా
ధాత్రీవ జననీ పశ్చాత్ తదా శోకస్య కః క్రమః.

క. అొమ్మున నిడుకొను దాది వి,ధమ్మున మునుము న్ననిత్యతయె, జాతువులం
బిమ్మటనే మాతగదా, యమ్మా యిట శోకహేతు వరయఁగ నేదీ.

ఈనడుమ ముద్రారాక్షసమును దెనుఁగుచేసి ప్రకటించి యుండిరి.
దీనివెల ౮ అణాలు. అమలాపురములోఁ గవిగారియొద్ద దొరకును.

5. వైజయంతి.

భావ సం॥ చైత్రమాసములో కొల్లాపురము స్నేహలతాకవితాసంఘము నుండి వెలువడిన ద్వితీయవార్షికపత్త్రిక. శ్రీ చేబ్రోలు సరస్వతీదేవిగారు సంపాదకురాలు. క్రౌను నాల్గుపుటలతోడి 60 పుటల సంచిక. ఇందుఁ బలువురు భాషాభూషణుల గద్యపద్యవ్యాసములను జేర్చిరి. జనమంచి వేంకటరామయ్యగారి మేఘసందేశము, నిడదవోలు సత్యనారాయణగారి తిక్కనస్వతంత్రరచన, అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గర్వితకన్య, భాగవతం సీతారామశాస్త్రిగారి దేవకీనందన తారావళి, మిన్నగ నున్నవి. ముందుం దీసంవత్సరాదిసంచికయు హృష్టపుష్టమై వెలువడఁగలదని యూహించుచున్నాము. దీని వెల రు ౧. భాషాధిపులు దీనిలో నమూల్యవ్యాసముల రచించియుఁ బాఠకులు దీనిం గొనియు స్నేహలతాకవితా సంఘమువారికిఁ దోడ్పడుదురుగాక !

# సేతుబంధమహాకావ్యభూమిక

—: శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు :—

శ్లో. "అత్ర సమాప్యత ఏత త్సీతాలంభేన జనితరామాభ్యుదయమ్
రావణవధ ఇతి కావ్య మనురాగాంకం సమస్తజననిర్వేషమ్''

(15 ఆశ్వా-15 స్కంధకము) సీతాప్రాప్తిచే లబ్ధరామాభ్యుదయ మైన యీకావ్యమునకు రావణవధ మని పేరు. ఇందులోఁ బ్రత్యాశ్వాసాంత్యస్కంధకము ననురాగపదాంకిత మైయున్నది.

శ్లో. "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగర స్సూక్తిరత్నానాం సేతుబంధాదియ న్మయమ్.''

అని యాచార్యదండి తనకావ్యాదర్శమం దీకావ్యమునకు సేతుబంధ మని మఱి యొక పేరు పెట్టెను. అష్టవిధప్రాకృతభాషలలో మహారాష్ట్రభాష యుత్తమ మైన దనియు నాభాషలో నీసేతుబంధమహాకావ్యము వ్రాయఁబడిన దనియుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. "అభినవరాజారబ్ధా చ్యుతస్ఖలితేషు విఘటితపరిస్థాపితా
మైత్రీవ ప్రముఖరసికా నిర్వోఢుం భవతి దుష్కరం కావ్యకథా"

అని ప్రథమాశ్వాసనవమస్కంధకముచేతను, ప్రత్యాశ్వాసాంతమందు "ఇతి శ్రీప్రవరసేనవిరచితే'' అని యుండుటచేతను,

శ్లో. "కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా
సాగరస్య పరం పారం కపిసేనేవ సేతునా''

అని హర్షచరిత్రోపోద్ఘాతమందు భట్టబాణుఁడు వ్రాసి యుండుటచేతను "యథా సేతుబంధే ప్రవరసేనస్య-

శ్లో. దనుజేంద్రరుధిరలగ్నే యస్య స్ఫురతి నఖప్రభాసమూహే
వ్యాకులీభవంతి విపులాయితా గళితస్తనాంశుకా మహాసురలక్ష్మీః."

అని పదునొకండవశతాబ్దమందు జీవించిన కాశ్మీరదేశస్థుఁ డగుమహాకవి క్షేమేంద్రుఁడు తాను రచియించిన "ఔచిత్యవిచారచర్చ''లోఁ జెప్పియుండుటచేతను ప్రవరసేనుఁ డనునొకమహారాజుండె నని తోఁచుచున్నది. ప్రవరసేనుఁ డను పేరు గలరాజులు నలుగు రున్నారు. వారిలో నిరువురు కాశ్మీరదేశస్థులు. రాజతరంగిణీతృతీయతరంగమందు కల్హణునిచే వర్ణింపఁబడిరి.

శ్లో. "శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే
కలేర్గతేషు వర్షాణా మభవ న్కురుపాండవాః'' (రాజ-1-51)

కలియుగము 653 సంవత్సరములు కాఁగా, కురుపాండవు లుండిరి.

శ్లో. "వర్షాణాం ద్వాదశశతీ షష్టిః షడ్భిశ్చ సంయుతా
భూభుజాం కాలసంఖ్యాయాం తద్వా పంచశతో మతా" (రాజ-1-54)

అను వాక్యమును బట్టి 1266 సంవత్సరములలో నేఁబదియిద్దఱు రాజులు గతించిరి.

శ్లో. "చతుర్దశాధికం వర్షసహస్రం నవవాసరాః
మాసాశ్చ విగతా హ్యస్మి న్నేకవింశతిరాజసు''

అనురాజతరంగిణీ (1-84) శ్లోకమందు వర్ణింపఁబడిన ప్రకారము లవమహారాజు రాజ్యప్రారంభకాలము 1014.

శ్లో. "శతద్వయే వత్సరాణా మష్టభిః పరివర్జితే
అస్మిన్ ద్వితీయే వ్యాఖ్యాతాః షట్ప్రఖ్యాతగుణా నృపాః"

అని ద్వితీయతరంగమందు

శ్లో. "తస్మి న్నస్తంగతే భుక్త్వా క్ష్మాం చ తు స్త్రింశతం సమాః
అనాదిత్య మివా శేషం నిరాలోక మభూ జ్జగత్''

అని మేఘవాహనమహారాజు పరిపాలనకాలము ముప్పదినాలుగుసంవత్సరములు గతింపఁగా,

శ్లో. "అథ క్ష్మాభృ ద్దరక్ష క్ష్మాం శ్రేష్ఠసేన స్తదాత్మజః
ఆహుః ప్రవరసేనం యం తుంజీనం చాంజసా జనాః''

శ్లో. "ఈశో నృపాణాం నిశ్శేష క్ష్మాకేదారకుటుంబినామ్
ససమా స్త్రింశతంభూభృ దని స్త్రింశాశయోఽభవత్''

(రాజ 3-101) అను శ్లోకమును బట్టి. ప్రథమప్రవరసేనుని రాజ్యకాలము ముప్పదిసంవత్సరములు కలిపికొనఁగా 3159—89 కల్యబ్దములు కాఁగాఁ ప్రథమ ప్రవరసేనుఁడు కాశ్మీరమండలమందు రాజ్య మేలెను.

శ్లో. "పౌత్రః ప్రవరసేనస్య గిరా మాతు ర్స్వపాత్మజః
పైతామహేన నామ్నైవ కులాల్యాఖ్యాపితోభవత్"'' (రాజ-3-109)

శ్లో. "నివార్య మరణోద్యోగం మాతుర్నిర్వేదఖేదితః
యయౌ ప్రవరసేనోఽథ తీర్థాత్సుకాన్ ద్దిగంతరమ్'' (రాజ 1-123)

శ్లో. "రక్షిత్వా దశమాసోనాః ప్త్వా మేకత్రింశతం సమాః
తస్మిన్ క్షణే హిరణ్యోపి శాంతిం నిస్సంతతి ర్వ్యగాత్" (3-124)
శ్లో. "తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షాపరాభిధః
ఏకచ్ఛత్ర శ్చక్రవర్తీ విక్రమాదిత్యఇత్యభూత్" (3-125)

ప్రవరసేనుని మనుమఁడు తల్లియాజ్ఞ ననుసరించి తాతపేరునే పెట్టుకొనెను. తల్లి మరణోద్యోగమును నివారించి నిర్విణ్ణుఁడై తీర్థయాత్రలకుఁ జనెను. పది మాసములు తక్కున ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసి నిర్వేదమును జెంది తీర్థయాత్రలకుఁ బోయెను. ఆకాలమందు హిరణ్యుఁ డనువాఁడు సంతతి లేకుండఁ గాలధర్మము నొందెను. ఆకాలమం దుజ్జయినీనగరమున హర్షుఁ డను నామాంతరము గల విక్రమాదిత్యుఁ డేకచ్ఛత్రాధిపతి యై రాజ్య మేలెను. ఇట్లు పూర్వోక్త శ్లోకప్రామాణ్యముచేఁ బ్రవరసేనుని జ్యేష్ఠపుత్త్రుఁ డగు హిరణ్యుని రాజ్యపరిపాలన కాలము 31 సంవత్సరములు కలుపఁగాఁ దేలిన 3220 కల్యబ్దములకు ముందే ప్రవరసేనుని కనిష్ఠపుత్త్రుఁ డగు తోరణుని కుమారుఁ డైన ప్రవరసేనుని జన్మము. ఇట్లు క్రీస్తుశకము ద్వితీయశతకమందు కాశ్మీరకద్వితీయప్రవరసేనునికాలము నిశ్చయింపఁ బడుచున్నది.

Dr G Buhler Ph. D మహాశయుఁడు వాకాటకవంశమందుఁ గూడ నిద్దఱు ప్రవరసేను లున్నా రని "ఇలిచపూరుశాసనము" వలనఁ గనఁబఱిచెను.

"ఓం ఓం స్వస్తి ప్రవరపురా దగ్నిష్టోమాప్తోర్యామోక్థ్యషోడశ్యతిరాత్ర వాజపేయసవసాద్యస్క చతురాశ్వమేధయాజినః విష్ణువృద్ధసగోత్రస్య సామ్రాజో వాకాటకానాం మహారాజశ్రీ ప్రవరసేనస్య సూనోః అత్యంత స్వామిమహాభైరవభక్తస్య అంసభారసన్నివేశిత శివలింగోద్వహన శివసు పరితుష్టసముత్పాదిత రాజవంశానాం పరాక్రమాధిగతభాగీరథ్యమలజలమూర్ధాభిషిక్తా నాదశాశ్వమేధావభృథస్నాతానాం భారశివానాం మహారాజభవనాగదౌహిత్రస్య గౌతమీపుత్త్రస్య వాకాటకానాం మహారాజశ్రీ రుద్రసేనస్య సూనో రత్యంతమాహేశ్వరస్య సత్యార్జవకారుణ్యశౌర్యవిక్రమ నయవినయమాహాత్మ్యాధిమత్వపాత్రాగత భక్తిత్వ ధర్మవిజయిత్వ మనోనైర్మల్యాదిగుణై స్సముపేతస్య వర్ష మభివర్ధమాన కోశదండసాధనసంతానపుత్రపౌత్రిణః యుధిష్ఠిరవృత్తే ర్వాకాటకానాం మహారాజశ్రీ పృథివీషేణస్య సూనో ర్భగవత శ్చక్రపాణేః ప్రసాదోపార్జిత శ్రీసముదయస్య వాకాటకానాం మహారాజశ్రీ రుద్రసేనసూనో ర్మహారాజాధిరాజ శ్రీదేవగుప్తసుతాయాం

ప్రభావతీగుప్తాయా ముత్పన్నస్య శంభోః ప్రసాదధృతికార్తయుగస్య వాకాటకా
నాం పరమమాహేశ్వర మహారాజశ్రీ ప్రవరసేనస్యవచనా భోజకటరాజ్యే మధు
నదీతటకే చర్మాంకనామగ్రామః రాజమానిక భూమిసహస్రైరష్టాభిః 8000 శత్రు
ఘ్నరాజపుత్ర కోండరాజవిజ్ఞాప్త్యా నానాగోత్రచరణేభ్యో బ్రాహ్మణేభ్య సహస్రాయ
దత్తః యతో స్మత్సంతకాః సర్వాధ్యక్షాధియోగనియుక్తా ఆజ్ఞాసంచరి కులపుత్రా
ధికృతా భటా శ్చాత్రా శ్చ విశ్రుతపూర్వ యాజ్ఞయాజ్ఞాపయితవ్యా విదిత మస్తు
వో యథేహా స్మాకం మనోధర్మాయుర్బలవిజయైశ్వర్యవివృద్ధయే ఇహాముత్రహితార్థ
మాత్మానుగ్రాహాయ వైజకే ధర్మస్థానే అపూర్వదత్త్యా ఉదకపూర్వ మతిసృష్టః।
అథాస్యోచితాంపూర్వరాజానుమతాం చాతుర్వైద్యగ్రామమర్యాదాన్వితరామ
స్తద్యథా। అకరదాయీ అభటచ్ఛాత్రప్రావేశ్యః అపారపరగోబలివర్దః అపుష్ప
క్షీరసందోహః అవరాసనవర్మాంగారః అలవణక్లిన్నక్రేణిజనకః సర్వవేష్టిపరిహార
పరిహృతః సనిధి స్సోపనిధిః సంక్లుప్తోపక్లుప్తః। ఆచంద్రాదిత్యకాలీయః పుత్రపౌత్రా
నుగమకః। భుజతాం న కేనచి ద్వ్యాఘాతం। కర్తవ్య స్సర్వక్రియాభి స్సంరక్షిత
వ్యః। పరివర్ధయితవ్య శ్చ। యశ్చాయం శాసన మగణయమానో స్వల్పమపిబా
ధాం కుర్యాత్కారయితావా తస్యబ్రాహ్మణై ర్వేదితస్య సదండ నిగ్రహం కుర్యామః।
అస్మింశ్చ ధర్మావరకరణే అతీతానేకరాజదత్త సంచింతన పరిపాలనం కృతపుణ్యాను
కీర్తన పరిహారార్థం న కీర్తయామః వ్యాసగీతౌ చాత్ర శ్లోకౌ ప్రమాణీకర్తవ్యాః।
స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం। గవాం శతసహస్రస్య
హంతు హరతి దుష్కృతం। షష్టి వర్షసహస్రాణి స్వర్గే మోదతి భూమిదః।
ఆచ్ఛేత్తాచానుమంతాచ తాన్యేవ నరకే వసేత్। ఇతి శాసనస్థితి శ్చేయం బ్రాహ్మణై
రీశ్వరై శ్చానుపాలనీయా యథా రాజా సప్తాంగే రాజ్యే అద్రోహ ప్రవృత్తానాం
బ్రహ్మఘ్నచోరపారదారికరాజాపథ్యకారి ప్రభృతీనాం సంగ్రామకుర్వతాం అన్యగ్రా
మేష్వనపరాద్ధానాం ఆచంద్రాదిత్యకాలీయః అతో௨న్యథా కుర్వతా మనుమోద
తాపోర్రాజ్ఞః భూమిచ్ఛేదం కుర్వతః అస్తేయ మితి ప్రతిగ్రాహిణ శ్చాత్ర వార
నియుక్తాః శాట్యాయనః గణార్యః వాత్స్యదేవార్యః భారద్వాజ కుమారశ
ర్మార్య పారశర్య గుహశర్మా కాశ్యపదేవార్యః మహేశ్వరమాత్రార్య కౌండిన్య
రుద్రార్య సోమార్య హరిశర్మార్య భారద్వాజ కుమారశర్మార్య కౌండిన్య మాతృ
శర్మా వరశర్మా గోండశర్మా నాగశర్మా భారద్వాజ శాంతిశర్మా రుద్రశర్మా వాత్స్యః
భోజక దేవార్య మఘశర్మా దేవశర్మా భారద్వాజమోక్షశర్మా నాగశర్మా రేవతీశర్మా

ధర్మార్య భారద్వాజశర్మార్య నందనార్య మూలశర్మా ఈశ్వరశర్మా వరశర్మా వాత్స్య స్కందశర్మా భారద్వాజ బప్పార్య ధర్మార్య ఆత్రేయస్కందార్య గౌతమసోమశర్మార్య భర్తృశర్మార్య రుద్రశర్మ మఘార్య మాతృశర్మార్య ఈశ్వరశర్మార్య గౌతమసగోత్ర మాతృశర్మార్య కౌండిన్యదేవశర్మార్య వరశర్మార్య రోహార్య గౌతమసగోత్ర స్వామిదేవార్య రేవతీశర్మార్య జ్యేష్ఠశర్మార్య శాండిల్య కుమారశర్మార్య స్వాతిశర్మార్య చాక్రాయణకోండార్య ప్రభృతయః సేనాపతౌ ఖత్రవర్మణి సంవ్వసరిష్టాదయో ౧౮ జ్యేష్ఠమాస శుక్లపక్షే త్రయోదశ్యాం శాసనం లిఖిత మితి వాకాటకలలామస్య క్రమప్రాప్తనృపశ్రియః। రాజ్ఞః ప్రవరసేనస్య శాసనం రిపుశాసనం.”

ఇటిండియన్ యాంటిక్వెరీ (Indian Antiquary) 12వ-వాల్యూమ్. 243 పేజీలోఁ గనఁబర్చఁబడినది. దీనివలనఁ బ్రథమప్రవరసేనమహారాజు క్రీస్తుశకము చతుర్థశతకమందును ద్వితీయప్రవరసేనమహారాజు పంచమశతకమందును రాజ్యము చేసి రని నిశ్చయింపఁబడినది. ఇట్లు కల్హణుని రాజతరంగిణీప్రమాణాన్ను సారముగా నిద్దఱు ప్రవరసేనులు, పూర్వోక్తశాసనమువలన నిద్దఱు ప్రవరసేనులుఁ గానవచ్చుచున్నారు. వీరిలో సేతుబంధమహాకావ్యమునురచించిన ప్రవరసేనుఁ డెవ్వఁడో నిశ్చయింపఁబడలేదు.

భోజుఁడే ప్రవరసేనుఁ డని కొందఱవాదము. “అభినవరాజార బ్ధా చ్యుత స్థలితేషు విఘటితపరిస్థాపితా” అను ప్రథమాశ్వాసములోని నవమస్కంధకమును వ్యాఖ్యానముచేయుచు నేతద్వ్యాఖ్యాత యగురామదాసు “ప్రవరసేనో భోజదేవ ఇతి కేచిత్” అని వ్రాసెను. కాని యిది సరికాదు. ఏల యనఁగా- హర్షచరిత్ర భూమికలో బాణుఁడు “కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా। సాగరస్య పరం పారం కపిసేనే వ సేతునా” అని చెప్పి యుండుటచే భోజుఁడు బాణునికంటెఁ బూర్వజుఁడై యుండవలెను. ఇది యనేకగ్రంథవిరోధముగావున భోజుఁడు ప్రవరసేనుఁడు గా నేరఁడు. దీనివ్యాఖ్యాన మయిన రామసేతుప్రదీపమందు-

“ధీరాణాం కావ్యచర్చా చతురిమవిషయే విక్రమాదిత్యవాచా
యం చక్రే కాళిదాసః కవికుముదవిధు స్సేతునామప్రబంధమ్
తద్వ్యాఖ్యా సౌష్ఠవార్థం పరిషది కురుతే రామదాస స్స ఏవ
గ్రంథం జల్లాలదీంద్రక్షితిపతివచసా రామసేతుప్రదీపమ్”

అని గ్రంథప్రారంభమం దున్న యీశ్లోకముచే మహారాజప్రవరసేనునికొఱకు మహారాజాధిరాజ విక్రమాదిత్యునాజ్ఞచే నిఖిలకవిచక్రచూడామణి యగు కాళి

దాసమహాశయుఁడు సేతుబంధ మనుప్రబంధమును రచియింపఁబోవువాఁడై నిర్విఘ్నపరిసమాప్త్యర్థమై రామచంద్రాత్మక మధుమథనరూపేష్టదేవతానమస్కారోపదేశముఖముగా మంగళము నాచరించుచున్నాఁడు.'' అని ప్రథమస్కంధకావతరణికచేఁ బ్రకృతగ్రంథమందుఁ బ్రత్యాశ్వాసాంతమందు "ఇఅసిరి పవరసేనవిరఇఅ కాళిదాసకఅ దహముహవహే మహాకవ్వే'' అని వ్రాయుటచేత నీకావ్యము ప్రవరసేనకారిత మనియుఁ, గాళిదాసకృత మనియుఁ దోఁచుచున్నది. కాశ్మీరికద్వితీయప్రవరసేనవిక్రమాదిత్యు లుభయులు సమకాలికులై యున్నను విక్రమాదిత్యునికాలమందు ద్వితీయప్రవరసేనుఁడు రాజ్యప్రాప్తికంటె ముందే తీర్థయాత్రార్థమై కాశ్మీరదేశమును విడిచి వెళ్లిపోయెను.

"యయౌ ప్రవరసేనోఽథ తీర్థౌత్సుక్యా ద్దిగంతరమ్। తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షోఽపరాభిధః। ఏకచ్ఛత్రశ్చక్రవర్తీ విక్రమాదిత్య ఇ త్యభూత్'' (3-125) అని రాజతరంగిణి చెప్పుచున్నది. విక్రమాదిత్యునిస్వర్గారోహణసమనంతరమందే మాతృగుప్తుఁడు కాశ్మీరదేశమును విడిచి పైకిఁబోఁగా ద్వితీయప్రవరసేనునికి రాజ్యము లభింపఁగా విక్రమాదిత్యప్రవరసేనులకు సమకాలికత్వ మెట్లు సంభవించును. రాజతరంగిణియందుఁ గాళిదాసుయొక్కయు సేతుకావ్యముయొక్కయుఁ బేరైనఁ గానరాదు. ఈకావ్యమునుఁ గాళిదాసు రచించి యున్నయెడల బాణాదులచే నతనికృతులయం దేందునుఁ జెప్పఁబడలేదు? మాతృగుప్తునికే కాళిదా సని నామాంతర మున్న యెడల రాజ్యమును బరిత్యజించి కాశిలో నివసించువానికి ద్వితీయప్రవరసేనునితో మైత్రి యెట్లు సంభవించును? ఈవిమర్శమంతయు విచారసహముగా నుండలేదు. ఏల యనఁగా:—ఔచిత్యవిచారచర్చాదులయందు "యథామాతృగుప్తస్య, యథా కాళిదాసస్య" అని వేఱువేఱుగాఁ బేర్లు కానవచ్చుచున్నవి. కావున ననిశ్చితపదార్థమందు యాథాతథ్యగ్రహణాదరముచేఁ జాలును.

ఈమహాకావ్యమునకు కులనాథరామదాసశ్రీకృష్ణకృతము లగువ్యాఖ్యానములు మూఁడు కల వని Dr. Theodor Aufrecht మహాశయుఁడు Catalogus Catalogarum అను గ్రంథములోఁ జెప్పియున్నాఁడు.

రామదాసనామధేయుఁ డైన యీగ్రంథవ్యాఖ్యాత పురాతనజయపురాధీశుఁ డైన మానసింహమహారాజునకు సమకాలికుఁ డని వ్యాఖ్యానారంభశ్లోకముల వలనఁ దెలియవచ్చుచున్నది. ఇతఁడు జల్లాలుద్దీనునకు సమకాలికుఁడు.

"చతుర్ద్యూతారశీతాంశుభిరభిగణితే(1652) సాహసాంకస్యవర్షే। వర్షే జల్లాలదీంద్రక్షితిముకుటమణే రప్యనంతాగమాఖ్యామ్। పంచమ్యాం శుక్లపక్షే నభసి గురుదినే రామదాసేన రాజ్ఞా। విజ్ఞే నాపూరి తోయం తిథితులితశిఖో రామసేతు ప్రదీపః॥ జల్లాలదీనభూపాలనిత్యసేవనతత్పరః। బభూవ రామదాసాఖ్యో విప్రాణాముపకారకః। తాదృశాన్ బ్రాహ్మణాన్ దృష్ట్వా రామదాసో మహాయశాః। వితీర్ణస్వర్ణదుర్వర్ణో బభౌ కర్ణఇ వాపరః."

**Ancient History of the Deccan by G. Jouveau Dubreuil Doctor of the University of Paris, Professor, College, Pondicherry, 4th chapter. The Dynasties of Central Deccan.**

వాకాటకవంశము.

డక్కనును బరిపాలించిన రాజవంశములలో వాకాటకవంశ మొకటి యై యున్నదని యిప్పటివఱకు నెవ్వరుం దలంపరైరి. అది యుత్తరదేశమును బాలించిన రాజవంశములతోం గూడ విమర్శింపం బడవలసిన దని పాశ్చాత్యపండితు లందఱు నమ్మిరి. వాకాటకశాసనముల నుత్తరహిందూస్థానపు శాసనములలో నంతర్భవింపంజేసిన కీల్‌హార్న్ (Dr. Kielhorn) పండితుం డీతప్పుంజేసెను.

ఇపుడు నేను డక్కనుప్రాచీనచరిత్రము ననేకగ్రంథములనుండి యెత్తి సంగ్రహముగా వ్రాయుటకుం బ్రయత్నించుచు నీదిగువ నుదాహరింపంబడిన విషయమును బ్రకటించుచున్నాను. అదేమనంగా :—వాకాటకులు డక్కను నేలిన రాజవంశములలోనే చేర్పంబడవలసినవా రను పర్యవసానమునకు వచ్చితిని. మూండవశతాబ్ది మొదలుకొని యాఱవశతాబ్దివఱకు డక్కనును బరిపాలించిన రాజవంశము లన్నింటిలోను వాకాటకవంశమువారే మహాప్రభావసంపన్ను లనియు నధికతములనియు గొప్పప్రతిష్ఠాపరు లనియుం, గీర్తిమంతులనియు, సకలవిషయములయందు నితరరాజవంశ్యుల నతిశయించినవా రనియు నిర్వివాదముగాం జెప్పం గలను.

ఈదిగువ వ్రాసినలేఖ్యప్రమాణములవలన వాకాటకులచరిత్రము వంశావళి సంగ్రహింపం బడుచున్నది.

1 Chammak Gupta Inscriptions (No. 55 P. 225)
2 Siwani Gupta Inscriptions (No 56 P. 243)
3 Dudia (Indian Epigraphy, Vol. III. P. 258)
4 Balghat (Indian Epigraphy (Vol. IX P. 268)
5 Prof. K. B. Pothak's. Plates (Ind. Antiquary Vol. XII 1912—P. 215)

6 Two inscriptions at Ajanta (A. S. W. J. Vol. IV P. 53, 124, 129)

7 The inscription in the Ghatotkacha Cave at Gurwara A. S. W J. Vol IX pp 64, 138.




ఇందు మొదటిమహారాజైన ప్రథమప్రవరసేనుఁడు వాకాటకవంశమునకుఁ బతాకవంటివాఁడైన వింధ్యశక్తికిఁ బుత్రుఁడు. ఇతఁడు రాజబిరుదము లెవ్వియును లేకుండ (A. S. W. J. Vol. IV p. 124) అజంతశాసనములలోఁ జెప్పఁబడెను. ప్రథమప్రవరసేనుఁడు క్రతుకర్త. ముఖ్యముగా నశ్వమేధయాజి మహారాజపద భాక్కు కాకపోవుటచేఁ బ్రాయికముగాఁ దండ్రికంటె ముందు కాలధర్మము నొందిన గౌతమీపుత్రుఁడు భారశివులకు రాజైన భవనాగుని పుత్రికను బెండ్లియాడెను.

# పుస్తక పరిచయము.

## —— ఆంధ్రదేశపుచరిత్రము. ——

మ॥ శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావు బి. ఏ. గారిచే స్థాపింపఁబడిన ఆంధ్ర సరస్వతీగ్రంథమాల 20 వ కుసుమము. బందరులో సుప్రసిద్ధు లగు శ్రీచిల్లరిగె శ్రీనివాసరావుపంతులు బి. ఏ. గారిచే రచియింపఁబడినది. ఇందు 150 పుటలలో ఆంధ్రదేశచరిత్రము మొదటిభాగము వ్రాయఁబడినది. శాతవాహనయుగము, పల్లవయుగము, కాకతీయయుగము, రెడ్లయుగము, విజయనగరసామ్రాజ్యయుగము, మహమ్మదీయయుగము, పాశ్చాత్యయుగము నను నిట్టిభాగములు కలవు. మొదట 108 పుటల పీఠిక రాజగోపాలరావుగారిచే వ్రాయఁబడినది. ఇది వీరు తెలుఁగులు భరతవర్షములోఁ బ్రవేశించుటను గూర్చి చేసినపరిశ్రమ ఫలితము. అందుఁ దెలుఁగజాతి-దాని ప్రాచీనబాంధవ్యము, తెలుఁగజాతి యొక దేవత యను విషయములు గలవు. మఱియు, అఱవము, తెనుఁగు, కన్నడము, మళయాళముల, ఇంగ్లీషు లాటిన్ భాషల సాదృశ్యము, శబ్దాదులంబట్టి వ్యాకరణసాదృశ్యములంబట్టి కనఁబఱుపఁబడినవి. మన మెఱుఁగకుండ నాయాదేశములలోఁ జేరిపోయిన యాంధ్రజాతులం దెలిపిరి. హిమాలయప్రాంతమునఁ దెలుఁగుమూర్తి కలఁ డనియు నతఁ డసురజాతికిఁ జేరినవాఁడ నియుం గ్రొత్తవిషయముం దెలిపిరి. నేఁటికిఁ బదునైదువేల సంవత్సరముల క్రిందట మనము (తెనుఁగువారు) సుమేరువుపీడి... నూత్నపరిస్థితులవలన భాషాచారములవలన సంబంధించిన మార్పులకు లోపడుచు గోండులతో భారతవర్షము చేరితిమి. రాజ్యములు సంపాదించితిమి, పోఁగొట్టుకొంటిమి, ఏకచ్ఛత్రముగా నాలుగుశతాబ్దములు భరతవర్షమునంతను నేలితిమి. శకపురుషులపై మనపేర శాలివాహనమును లోకమున కిచ్చితిమి... ...మనలోనుండి కొందఱు దక్షిణాభిముఖులై పోయి యఱవలైరి. పరశురాముఁడు గోదావరితీరము నుండి మనవారిని గొనిపోయి మళయాళీలను జేసె నని యిత్యాదిగాఁ దెనుఁగువారిపూర్వవృత్తాంతమును గనఁబఱిచిరి. మూలముకంటెఁ బీఠికఁ జదువఁదగినది.

దీనివెల రు 2 లు. 124 వెల్లారివీథి- పరశువాకము-వేపేరి- చెన్నపట్టణములో తేకుమళ్ళ రాజగోపాలరావుగారియొద్ద దొరకును.

---

## —: రాణాప్రతాపసింహచరిత్రము :—

కావ్యకళానిధి, కవిసింహ, అవధానిపంచానన బిరుదాంకితులు శ్రీయుత దుర్భాక రాజశేఖరశతావధానిగారు దీనికర్త. రాజస్థానములోని మేవాడుదేశము

నకు ముఖ్యపట్టణము చిత్తూరు. మేవాడుదేశాధీశులకు "రాణా" లని పేరు. వారు చిత్తూరులో నివసించి దేశపాలనముచేయువారు, వారిది సూర్యవంశము, రామునితనయుఁడు లవుఁడు వీరికి వంశకర్త. అగ్బరుచక్రవర్తికాలములో మేవాడు దేశమునకుఁ బ్రభువు, ప్రతాపసింహుఁడు. ఈతఁడే కథానాయకుఁడు. బహు కష్టములకుఁ బాల్పడియును స్వాతంత్ర్యమునకై యిరువదియైదుసంవత్సరము లసహాయశూరుఁడై చక్రవర్తి యగు నగ్బరుతోఁ బోరాడి జయముం గాంచిన యారాజుచరిత్ర మిది. చరిత్రజ్ఞు లీవిషయము నెఱుఁగకపోరు. మూలకథను మన కవిగారు టాడ్డుగారి రాజస్థానకథావళిలోనుండి గ్రహించి దాని కుపబలముగా నిత రచరిత్రములనుండి కొన్నివిషయములను సంగ్రహించి, అయిదాశ్వాసములు 285 పుటలు 1900 పద్యములు గలబ్రహ్మాండమైన చరిత్రమును గా రచియించిరి. చిర కాలపరిశ్రమమున నాంధ్రలోకమున కిట్టిపెద్దగ్రంథమును సమర్పించి వీరు ప్రశంసా పాత్రులైరి. దేశచరిత్రములలోనుండి యిదివఱ కెన్నఁడు నెవ్వరు నింతగ్రంథమును బద్యములుగ రచియించియుండలేదు. రసానుగుణవర్ణనములతోఁ బద్యములు నిర్దుష్టముగఁ జక్కనినడకతో నొప్పుచున్నవి. పలువురు తలఁచునట్లు వీరిని యతిప్రాస ము లేమియుఁ గష్టపెట్టలేదు. శంకరకవి చెప్పినట్టిందు తాము దామే యుచితస్థితి వచ్చి నిల్చి-కష్టపెట్టునని భయపడువారిని నవ్వుచున్నవి. సీ. పద్మాసనమున దైవ ధ్యాననియతి నేత్రయుగంబు మూసెఁ బ్రతాపదేవుఁడు. (4ఆశ్వా.110ప.) ఇట్లన్ని టం జూడనగును. పదజాలము వశ్యమై యున్నవారు యతిప్రాసములకు భయపడు దురా. అట్టివారి నవి యలరించుం గాని యలయింపవు. వీరరసప్రధాన మగునది యైనను "కొమ్మలకును బల్లవనివహమ్ములవలె" నితరరసము లందందు లేకపోలే దు. చరిత్రము విఖ్యాతిం జెందినదియ- కవిగారి కవిత్వశైలికి—

తూఁచియుంచినమ్మాడ్కిఁ దోఁచుశబ్దంబులహాయికి మదిలోన నలరి యలరి
సరసస్వభావపేశలమనోభావంబు లచ్చొత్తినట్లుండ మెచ్చి మెచ్చి
యాత్మావబోధరహస్యాంశములు నిండి యుబుకుట గని తలయూఁచి యూఁచి
ప్రసరించి నిలువెల్ల రసముట్టిపడునట్టి ఘట్టంబులను జూచి కరఁగి కరఁగి
యిప్పటి ప్రసిద్ధకవులుహర్షజలరాశి దేలెదరు.

సంస్కృతమునుండి యాంధ్రీకరించుటకును దేశచరిత్రముల నితరభాషల లోనుండి తీసి యాంధ్రగ్రంథమార్గమునకుం దెచ్చుటకును జాలభేద మున్నది. రెం డవది మిగులకష్టము. కవిగారిని మే మింతవఱకుఁ బ్రస్తుతించెదము. గ్రంథవిస్తర

భీతిచే రెండుపద్యములను మాత్రమె యుదాహరించెదము. పాఠకులు గ్రంథము నామూలాగ్రముగఁ జదివి యానందించి కవిగారిని బహూకరింతురుగాక.

మ. శతధా ఖండముఁగాంచు రాలె సమరక్ష్మామధ్యమందు న్విశీ
ర్ణతనుత్రాణచయంబులుగ్ దళితకుంతలశ్రేణు లాపై విలుం
తితకంఠంబులు భగ్నఖడ్గములు, కుంఠీభూతభేరుల్ నిపా
తితకేతువ్రజముల్ విఖండితముగాదీవ్యన్మహాదండముల్.

సీ. మొగలాయిసైన్యజీమూతగర్భమునుండి వెలిఁబాఱు పిడుగులపిం డనంగ
యావనసుభటబాహాప్రతాపమహాగ్ని కడ లేచు నంగారకణము లనఁగ
రణదుర్గ యుటిమి నేత్రముల రౌద్రము గ్రక్కఁ బొడమిన గొప్పనిప్పుక లనంగ
మృత్యుదేవత కోపమెత్తి తూరుపుపట్టఁ దోతెంచు కొఱవులతుంట లనఁగ
నల్లానేరేడుపండ్లంత లగుచు యవన, భటతతులనుండి వెడలు తుపాకిగుండ్లు
రాలె నీలోత్పలచ్ఛాయ రాజపుత్ర, సైనికులకుఁ గర్ణావతంసంబు లగుచు.

దీని వెల రు 1-8-0. ఇదియుగాక వీరియితరగ్రంథములును పెక్కులు గలవు. వలయువారు ప్రొద్దుటూరు మ్యునిసిపల్ హైస్కూలు హెడ్‌మాష్టరు పి. ఆర్. సుబ్రహ్మణ్యయ్యర్, బి. ఏ., యల్. టి., గారిపేర వ్రాసి పడయఁదగును.

—: వనౌషధి :—

శ్రీకాశీనుండి, శ్రీచంద్రశేఖరత్రివేదీ, ఆయుర్వేదాచార్య ఎం. ఏ. ఎస్. గారు ప్రకాశకులుగను శ్రీకేదారనాథశర్మగారు సంపాదకులుగను నూతనముగా వెలువడుచున్న హిందీవైద్యమాసపత్రిక- ఆయుర్వేదశాస్త్రములో బహుప్రసిద్ధి గొన్న పండితులచే వ్రాయఁబడుచున్నది. మాకు దీని 4-5 సంచికలొకటిగాఁగల సిన సంచికయొకటి చేరినది. ఇందులో, ఆయుర్వేదాధునికవనస్పతిశాస్త్రము, భారతీయాయుర్వేదమునకు ప్రాస మేల కలిగెను, సోమము, మసూరి దానిం దప్పించుకొను నుపాయము, శంఖినియనునది యేది? క్షయరోగముయొక్క సంక్షిప్తేతిహాసము, వేదములోని వనౌషధులు, ఇత్యాదివ్యాసములు పెక్కుగలవు. ఆంధ్రదేశములో నిపుడు వైద్యమెఱుఁగనివారును, హిందీరానివారును లేరుగావున నీపత్రికం దెప్పించి తమకుఁ దెలియనివిషయములం దెలిసికొనియు, నితరులకుఁ దెలియనివిషయముల నీపత్రికాద్వారమునఁ దెలిపియు నన్యోన్యసహాయమును బొందుదురుగాక. కాశీలో చరక-అనుసంధానభవనములో నీపత్రిక దొరకును.

చందా రు 3. వీరియొద్ద ననేకౌషధములు వైద్యశాస్త్రములును గలవు.

# అవయవికనకారమునకు ద్రుతకార్యములు బాహుళికములు.

—: వఝుల చినసీతారామస్వామి శాస్త్రిగారు—విశాఖపట్టణము :—

విచక్షణులారా! బ్ర. శ్రీ. ఉ. భా. ప్ర. దువ్వూరి సూర్యనారాయణ మూర్తిశాస్త్రులవారు భావసంవత్సర చైత్రవైశాఖపరిషత్పత్రికాముఖమున నన్నీ క్రిందివిషయమున సమాధానమును వ్రాయఁగోరి యున్నారు. ఆంధ్రవిశ్వకళా పరిషదాంధ్రచ్ఛాత్రాధ్యాపనము,ఆంధ్రవ్యాకరణరచనము, మున్నగుకార్యములచే నవకాశము చాలకున్నను శ్రీశాస్త్రులవారు సదభిప్రాయముతో సమాధానమును బ్రకటింప నియోగించినందున నిట్లు సంక్షేపముగా వ్రాసికొనుచున్నాను.

త్రిజ్ఞర్థ్యేత్యాదిసూత్రవివరణసందర్భమున నేనుదాహరించిన "రక్షింపుచున్" అనుశబ్దమును, "చన్నే" అనుదానిలోని 'చన్' శబ్దమును ధాతుజవిశేషణము లని నేనభిప్రాయపడి యుండ లేదు. (చూడుఁడు. చింతామణివిషయపరిశోధనము 125; 98 పేరాలు.) కాని ధాతుజవిశేషణములు ద్రుతప్రకృతికము లనుట చింతా మణిహృదయ మని నేనుస్థలాంతరములందు వ్రాసినమాట నిజమే. (చూడుఁడు. చింతామణివిషయపరిశోధనము 107 పేరా.)

ఇఁక సరళాదేశాదిద్రుతకార్యము లెల్లయెడలను నియతములు కావని నా నమ్మకము. ఈవిషయమునే యీక్రిందివికృతివివేకకారిక విశదీకరించుచున్నది.

శ్లో. "వినాద్వి(తృ-అనుటలెస్స)తీయం స్యా దస్య ద్వాత్రనోః స్వతయో రపి
నో రన్యస్యాపి సర్వం స్యా ద్బహుళం సత్ప్రయోగతః"

ఈయథర్వణకారికచేత నావయవికనకారముమీఁద సరళాదేశాదిద్రుతకా ర్యములు బహుళములుగా నగు నని చెప్పఁబడుచుండుటచేత శాస్త్రులవా రుదాహ రించిన 'జడిగొనన్‌కోర్చులన్' మున్నగు చోటులందు సరళాదేశాదులు రాకుండుట విరుద్ధము కానేరదు.

---

నప్రాణిపదములయందుఁ దిర్యక్పదముల నేకవచనంబు గలుగఁ బైన
నినలు రెండును రాక దనరుఁ బలకయందు నవనియందనఁ బక్షియందు నంచ
యందన్న యట్టు లుదంతమ్ములైనచో నమరు నత్వము వికల్పమున వినుఁడు
హారువునందుఁ జెఱువునం దన హారువందుఁ జెఱువందునన్నట్లుచెల్లు మఱియుఁ
బసువునందు ననంగఁ బసువందు ననఁ దేలునందుఁ దేలందు ననంగ నవల
సతిసప్తములు గల్గు జాడలయందు సప్తము లెల్లఁ బ్రథమరూపములు దాల్చుఁ
జుక్కలు వరుసఁగా సారణగండ్లరా హారి యర్జునునకుఁ బ్రాపగుచునుండె
నన మఱి హారి వెలయ నసురాళి పాలియు నిలఁ దనరఁగ గాప్పుమలయ ననఁగ
నుగ్రునిభక్తిసేయుడు ధనమిచ్చును రసికులకు ఫలంబు లొసఁగుడు నన
సరవి నిట్టివి సతిసప్తములై యొప్పు నింకఁ దద్భేదంబు లెఱుకపఱుతుఁ
గాలవాచకముల కడల సప్తమికిఁ బ్రథమ వచ్చు రేమొలంత నిదురగనెఁ
బగలు మ్రొక్కలనియుండెఁ బడఁతులతలమిన్న యొసఁగు వర్షాకాల మెట్టిదొరలు
దండువెడల రన ధరణీధవుకుమారుఁ డేఁడాది చదివెఁ గావేఁపదున్న
నెలవర్తిలునదినా నెలదినాలగు నీత యనఁగ నీక్రియ నుదాహరణములగుఁ
దెలియ నచేతనమ్ముల సప్తమికిఁ ద్వితీయకు తృతీయము వచ్చు నది యెటులన
వని నున్నది మదేభవార మనలఁ దనయసిని జక్కుగఁజేసె నంగన మెయిఁ
గలప మబందెను బలిమి నసురగెల్చె నననిట్టు లక్ష్యము ల్గనుఁడు సుకవు
లచ్చ తెనుఁగున నప్రాణివాచకోదంతములపయి సప్తమికి మఱి తృ.
తీయకు నక్ వచ్చుఁ దెలియ నాదేశమై కొమ్మున న్నిల్చెఁ గొంగునను విసరె
ననఁగ నిట్టుల నుదాహరణంబు లగు మఱి యప్రాణివాచకోదంతముల నె
కన్ను వెన్నును జన్ను మిన్నను నుడులకు : గుంట వెంటను జంట మింటననఁగఁ
జనుఁ ద్వితీయను బంచమిని సప్తమిని నొక్క రూపమా లక్ష్యముల్ రూఢి వినుఁడు
చెలికంటఁజూచెను దెలికంటఁబోడమెను నిదికంటఁగాటుక నిడియె ననఁగ
వెలయుచునుండు నావల మఱి యప్రాణివాచకాదంతశబ్దములపయి నె
సఁగు తృతీయకును బంచమికి సప్తమికి నుకారము వచ్చు లక్ష్యములు వినుఁడు
తరలాక్షి బాహులతం గట్టెఁ జెలువుని లతను విరుల్ పుట్టె లతను జివురు
తగు నన నిక ఇదంతముల నాత్రివిభక్తులందుఁ బొల్లునకార మల నికార
మమరంగ వచ్చును వినుతుం డసిని దెగటారె నసిం దెగటారె ననఁగఁ
గ్రౌంచము తొలిని రాయంచలు వెడలెనాఁ గడలి నిద్దురఁజెందెఁ గంసవైరి

యనఁగ నిట్టుల నుదాహరణలు తగు నింక స్థావరప్రాణివాచకము లగుచుఁ
దగు నుకారాంతశబ్దము లకారాంతము లగు పంచమీతృతీయలను సప్త
మి నల బహుత నేకతను రెంట ను జెలంగు గట్లనువచ్చెను గట్లవచ్చె
ననఁ జెలి వ్రేలఁ జూపెను వ్రేళ్ళఁ జూపెనా నొకయూరనిలుచు వాఁడూళ్ళనిలుచు
నన నింక నీరు గోరును నోరని యెడి శబ్దము లదంతంబు లౌతఱిని రేఫ
లకు టకారములు వాలాయంబుగా వచ్చు నీటను గోటను నోట ననఁగ
వీడు త్రాడును గోడు గూఁడను శబ్దముల డకారముల టకారములు వచ్చు
వీటఁ ద్రాటను గోట గూఁట నాఁదగు నింక నావలఁ గిౘ పరమైనయెడను
బూర్వమైన టకారముపయి నిత్వమువచ్చి యేటికి నేఁటికి నేఁటి కనఁగఁ
దనరారుచుండు నుదాహరణము లిట్లు క్రమమొకింతయుఁ దప్పక నిఁక ననల
వహిని నచేతనవాచకస్త్రీలింగములకు విశేషణా ల్పున్నపుంస
కములునై వర్తిల్లుఁ గనుఁగొనుం డిఁక తెన్ను హరిదృష్టి భాగ్యదాయక మనఁగ
వెన్నునిసభ మణీవిలసితం బన నింకఁ దెలుఁగుబహువచనములకుఁ బ్రాణి
పదము వెలిగ నేకవచన మది విశేషణమయి తగు హరిగుణములు ఖ్యాత
మనఁగ నవ్వర్షంబు లధికంబన వడగం డ్లాస్యస్రవత్ఫేన మయ్యె ననఁగ
నావలఁ దెలుఁగున నవ్యయాలయినట్టి పదములు కొన్ని యేర్పఱుతు వినుఁడి
యప్పుడిప్పుడు గాన నచ్చట నిచ్చట నక్కడిక్కడఁ గాక యాడ యీడ
మఱియు వేమఱు పలుమఱు గావున నటుగనక వెండి క్రమ్మఱ నాఁదగు నిఁకఁ
దెలుఁగున నొకకొన్ని స్త్రీ ప్రత్యయంబులు తెలియఁజెప్పెద సత్కవులు వినుండు
మొదలను గుణపదముల నెనయుచు మీఁద నాలున్న దానికి రాలు వచ్చు
రేఫ కచ్చువకును గృతుల నొక్కొకచోట యతులు వికల్పాన నమరియుండు
జవరాలు గొడ్రాలు చదురాలు ముద్దరా లనఁగ నిల్లా ల్వావలయాలు దక్క
నవల నాఁడను ప్రత్యయము వచ్చి వగలాఁడి చిన్నెలాఁడి యనఁగఁ జెలఁగు నింక
నలకత్తె యను ప్రత్యయము వచ్చి సొగసుకత్తె వెలకత్తె చెలికత్తెయనఁ దనరు
నంత ఎత ప్రత్యయము వచ్చి గుబ్బెత కొమరెత యనఁగఁ దగును మఱి యెఱు
కెత చాకెత తిరుమాలెత బోయెతన వయోజాతివాచకముల సరణిఁ దనరు
నవల సాని ప్రత్యయము వచ్చి యేలికసానినా మంతరసాననఁ దగుఁ
బూవుఁబోఁడి మెఱుంగుఁబోఁడినా సుకుమారతను మనోహరతను దనరి రెండు
ననువుగ మతుబర్థమున నిపాతము లగు రహి కెక్క నిటువంటి ప్రత్యయముల

నాద్యచ్చులను యతు లమరింపరాదింకఁ గారకములు తెల్పుతీరులు వినుఁ
డవలను గ్రియకు హేతువనంగఁ దగునది కారక మను పేరు గాంచు నదియు
రహిఁ గర్తృకర్మకరణసంప్రదానముల్ కడునపాదానాధికరణము లని
యాఱువిధమ్ముల నగుఁ గారకమ్ము లవియె త్రయోవింశతివిధములఁ దగు
కర్తృకరణకారకములయందుఁ దృతీయ కర్మకారకమున కడుద్వితీయ
రహిసంప్రదానకారకమునందుఁ జతుర్థి దారిగా నలయపాదానకార
కమున బంచమి యధికరణకారకమున సప్తమి దగు వరుసఁగ నెటు లన
నీవఱ కెవ్వ రీత్రోవ గానని యది తెలివిడిఁ జేసెదఁ దెలియుఁ డింకఁ
గడు వేడుక స్వతంత్రకర్తయు హేతుకర్తయుఁ గర్మకర్తయుఁ దగ నభిహిత
కర్త యనభిహితకర్తయు నని కర్త యైదు తెఱంగుల నలరు నందు
ఱేఁడిల నేలుచున్నాఁ డనఁగ స్వతంత్రకర్త యగుచు లెస్స గానఁబడియె
వినయవంతులు హితంబును బొందుదురు వారిఁ బొందించు హితమును బుద్ధిమంతుఁ
డనుచు నీలాగున ననువొందఁ జెప్పిన స్ఫూర్తిగా నిది హేతుకర్త యయ్యె
హీనులదోషము ల్తానె కప్పుడు నని రహిదోషపదము కర్మంబు లేక
కర్త తానే యయ్యెఁ గనుక లెస్సగ నిది కనుఁగొనంగాఁ గర్మ కర్త యయ్యె
గొనకొని సూపకారుని చేత నన్నంబు పక్వంబుగాఁ జేయఁబడియెడు నని
యన్నంబు ప్రథమయై యలరెను గనుక యభిహితకర్తయగుచు వెలయుచుండు
వండు సువారంబువాఁ డన్న మనఁగ నీకరణి యనభిహితకర్తగు నింకఁ
గర్తకుఁ గ్రియచేతఁ గడునిష్టముగఁ బొందఁ దగినదిఁ గర్మాఖ్య దనరు నదియె
ఈప్సితకర్మ మనీప్సితకర్మంబు నలయీప్సితానీప్సితాఖ్యకర్మ
మకథితకర్మంబు స్వకర్తృకర్మం బభిహితకర్మం బనభిహితకర్మ
మనుచుఁ గర్మంబు సప్తాహ్వయంబులచేతఁ దగుఁ దెల్పెదను వరుసగ వినుండు
జనపతి యన్నంబు సాపడియెడు నన నీప్సితకర్మాఖ్య నెసఁగుచుండు
మును మూర్ఖుఁడు విషంబుఁ దినియె ననఁగ నిది యయ్యనీప్సితకర్మయగుచుఁ దనరు
దొరకొని బాలుండు దువ్వగప్పినపాయసాన్నంబు మెసవెడి ననఁగ నిదియె
యీప్సింప నీప్సితానీప్సితకర్మాభిధానంబుచేతను దనరు మిగుల
నా దేవదత్తుండు యజ్ఞదత్తునెఱగొంగడి నడిగెడి నని వడిగ రెండు
కర్మంబు లునుప నకథితకర్మం బగుచుండును గృతులందు నూహసేయ
మూర్ఖశిష్యుఁడు గ్రామమునుగూర్చి పోయెడిని గురుండు తచ్ఛిష్యుని మదినిఁడలఁ

పుచు గ్రామమునుగూర్చి పోఁజేయుచున్నాఁ డనిన శిష్యుఁ డలకర్మతను గనియెను
గనుక నిట్టివి కర్తృకర్మనామంబుచేతను దనరారుచుండును గణింప
శ్రీయజ్ఞదత్తునిచేఁ జాఁప వడి నల్లఁబడుచున్న దనఁ జాఁప ప్రథమమైన
కతన నిదియె యభిహితకర్మనామధేయంబుచేఁ బొల్పుగ నలరుచుండు
యజ్ఞదత్తుఁడు చాఁప నల్లుచున్నాఁ డనుకరణి యనభిహితకర్మ మయ్యె
నల క్రియాసిద్ధియం దత్యంతసాధనం బౌనది కరణాహ్వయ మగు నదియె
గణనగ బాహ్యకరణము శారీరకరణ మని కరణంబు ప్రబలు రెండు
తెఱఁగుల నెట్లన్న దేవదత్తుఁడు కత్తిచేతను జక్కని చెట్టు నఱకు
చున్నాఁడనఁగ నిది యూహింప బాహ్యకరణ మగుచుఁ దలిర్చు రహికి నెక్క
శ్రీశుండు కన్నులచే రూపమును గ్రహియింపుచున్నాఁడన నిట్టి దెల్లఁ
బరికింప శారీరకరణాభిధానంబు చేతను మిగుల రాజిల్లు నింక
నీవి యొసంగుట కెవ్వాని గోరు నాతఁడె సంప్రదానాభిధఁ గను నదియు
మఱి ప్రేరక మ్మనుమంతృకమ్మును ననిరాకర్తృక మ్మని రహిఁగ సంప్ర
దానమ్ము త్రితయవిధము లగు నెట్లన గురుపుణ్యుఁ డగ్రజుకొఱకు నావు
నిచ్చుచున్నాఁ డన నిదియె ప్రేరకసంప్రదాన మగుచు లెస్సఁ దనరు మహిని
ఋషిరాజటు తెరువరికిఁ జెట్టునీడ యొసంగుచున్నాఁ డన సరవిగ నిది
యనుమంతృసంప్రదానాభిధానంబుచేతను రహికట్టియుండును దలంప
నరుఁడు హరికొఱకు విరియిచ్చుచున్నాఁ డనఁగ నిది పరికింప నాఁడెమమర
నల యనిరాకర్తృకాహ్వయసంప్రదాన మగుచుఁ దగుఁ బ్రబంధముల నింక
నొకచోటునుండి వేఱొకచోటి కరుగుట గానిపించిన నపాదాన మగును
జల మచలం బని యల యపాదానంబు రెండుపేరుల నొప్పుచుండు నందు
శౌతు కదలెడి గుఱ్ఱమువలనఁ బడుచున్నాఁ డన దీనిచందము గణింపఁ
దగుఁ జలాపాదాన మగుచు నీలాగున నెసఁగుచు నుండును గృతులలోన
నొగి యజ్ఞదత్తకుం దూరనుండియుఁ జనుదెంచుచున్నాఁ డనఁ దెలియ నిదియె
నలువుమీఱ నచలనామకాపాదాన మనుచుఁ బొల్పెసఁగుఁ గావ్యములనింకఁ
గడుఁ గ్రియఁజెందిన కర్తృకర్మముల యాధార మధికరణవహా రహి నిది
యలయభివ్యాపక మనఁగ నౌపశ్లేషికం బన వైషయికం బనంగ
నవల సామీపికం బన నధికరణము నలు దెఱంగు లను జెన్నలరు నందు
నువ్వులయందున నూనె గల దన నిదియె యభివ్యాపకాధికరణ మగు

మ. అని చెప్ప న్విని యావలం దెలిసి సువ్యక్తంబుగా నాత్మనా
శనమూలం బని నిశ్చయించుకొని యాశ్చర్యంబుగాఁ దొల్లి చే
సినకార్యంబులఁ దోడు వేఁడక మదిం జేడ్పాటులం దోడువేఁ
డినఁ గష్టం బగు నంచు గాఁ జనియె భట్టి న్నిల్పి తా న్నొక్కఁడున్. ౧౪౯

ఉ. ఆనరనాథుఁ డిట్లు చని యాయుధ మొక్కటి తోడుగాఁ బ్రతి
ష్ఠానపురంబు డగ్గఱు నెడం జతురంగబలంబు లన్నియు
న్వానిపిఱుంద నేగి నలువంకల నిల్వఁగ సందుఁ గొంద ఱా
లోనికిఁ జొచ్చి యావిజయలోలుని బాలునిఁ బోరఁ బిల్చినన్.* ౧౫౦

క. నాగేంద్రుఁడు జీవనవి,ద్యాగుణ మగుమంత్రశక్తిఁ దత్కృతములు నా
నాగాశ్వరథభటాదుల, కాగతిఁ బ్రాణంబు లిచ్చి యాత్మజుఁ బంపెన్. ౧౫౧

గీ. ఆకుమారుఁడు శాలివాహనుఁ డనంగ, నెగడి నగరంబు వెలువడి నిలుచునంత
శేషుపంపున వచ్చి యాశీవిషములు, విక్రమార్కునిమూఁకల నాక్రమించె. ౧౫౨

ఉ. సర్పము లీక్రియ న్భటులఁ జంపిన నాతఁడు వారిప్రాణము
ల్దర్పఁ దలంచి వాసుకికి ఘోరతపం బొనరించి యయ్యెడన్
నేర్పొకయింత లేక యది నిష్ఫలమైనఁ గలంగియు న్భుజా
దర్పము తోడుగాఁగ నిది దైవవశం బని వచ్చెఁ బోరికిన్. ౧౫౩

క. అతఁ డిటు వచ్చినఁ దక్కిన, హితులును సైన్యములు గూడ నేతెంచినఁ ద
చ్చతురంగబలము పైఁబడ, గుతలము పదహతుల నతలకుతలంబయ్యెన్. ౧౫౪

వ. ఇట్లు తేజోవిక్రమార్కుం డగువిక్రమార్కునిసేనలు శేషప్రసాదవిశేషశాలివాహ
నుం డగుశాలివాహను† బలంబులుం దలపడి పోరునవసరంబున. ౧౫౫

సీ. కాలుబలంబులు గ్రాహసంగతిఁ గ్రాలఁ దురగము ల్తరఁగలకరణిఁ జెలఁగఁ
దేరులు కలముల తెఱఁగునఁ దిరుగంగ గరులు మైనాకాదిగిరులఁ బోల
నరిగబిళ్ళలు కమఠాకృతి మెఱయంగ నడిదంబులును మీల ననుకరింపఁ
జామరంబులు సితచ్ఛత్రంబులును శంఖఫేనసాదృశ్యంబు పేర్మి‡ మెఱయఁ
బడగ లుత్పతత్ఫణికులభాతి వెలయ, రుధిరధారలు విద్రుమరుచిఁ దనర్పఁ
బటహరవములు జలఘోషభంగిఁ బొంగ, ముద్రమీఱినరౌద్రసముద్ర మొప్పె.

ఉ. అత్తఱి వీరు లేర్చుక్రియ నార్చుచు వత్తురు వచ్చి మూఁకలోఁ
జొత్తురు చొచ్చి శత్రువుల చొప్పు లడంతురు వారిబీరము

* బిల్వఁగన్. † శాలిభానుం డగు శాలివాహను ‡ సాదృశ్యంబు బెరయు

శత్తురు వెంచ్చి మార్కొనుచు మెల్పున గెల్పున భిన్నభిన్నమై
చత్తురు చచ్చి యచ్చరల సన్నిధి నిల్తురు కల్గు రాదలన్.* ౧౫౮

క. అయ్యెడఁ బెగిమెడివీరుల, నెయ్యమున వరించు వేల్పునెలఁతలు దమలోఁ
గయ్యం బహువఁగ శూరుల, కయ్యము దివిఁ జూడ నాఁడుఁగయ్యంబయ్యెన్.

సీ. మొగ్గెడు గజఘటంబుల నుబ్బితేలెడు రక్తంబు మద్యపూరంబు గాఁగ
వారక తెగినట్టి వీరులపుచుకలు కొమరారు పానపాత్రములు గాఁగ
నందంపు వాచవికందువ లగుగుంటెకాయ లన్నియు నూరుఁగాయలుగను†
గండలు తక్కిన కజ్జాలుగాఁ గూర్చి డాకినీగణము లనేకరుచులఁ
బొట్టకొలఁదిగఁ ద్రావుచు భూతములకుఁ,జవులుసూపుచు నేఁటియుత్సవముఁబోల
నొండు లే దని పొగడుచు నుల్లసిల్లి, సోలి యాడంగఁజొచ్చె నచ్చోటఁ గలయ.

క. ఆవేళఁ జిత్తముల వీ,రావేశము పొదలఁ బోటులాడఁగఁ దమకున్
దైవసహాయము లేమిని, భూవల్లభుసేన లెల్లఁ బాలియఁగఁ జొచ్చెన్. ౧౬౦

గీ. రథము లంత విరథరథికసారథులయ్యె గుఱ్ఱములును బాటి గొఱ్ఱె లయ్యెఁ
గాలుబలము లపుడు కాలుబలము లయ్యె, గజములెల్లఁ బోర నజము లయ్యె.

క. కాలము చేరినవానికి, నేలయుఁ బగ యనఁగ మింట నిలిపినబలముల్
బాలునిఁ గూడుక యాభూ,పాలునిసైన్యముల నేలపాలుగఁ జేసెన్. ౧౬౨

శా. శుండాలాదిబలంబు లిట్లరిగినన్ క్షోణీశ్వరుం డొక్కఁడుం
జండీశుండును గాలకర్మము నిజేచ్ఛం ద్రోవలేఁ డంచు ను
ద్దండాస్త్రుండయి శాలివాహనునిచేతన్ దండకాష్ఠాహతిన్
ఖండీభూతశిరస్కుఁడై యెగసి స్వర్గం బెల్లె నుజ్జేనిలోన్. ౧౬౩

క. ఆతనిదేహము వెలువడి, యాతత మగుదీప్తి నంబరాంతంబున ను
ద్యోతించుచు నెగసి మహా,జ్యోతీరూపంబు వోయి సూర్యునిఁగలసెన్. ౧౬౪

గీ. ఇట్లు విక్రమార్కుఁ డీల్గిన విజయుఁ డై, శాలివాహనుండు లీలతోడఁ
బౌరులెల్లఁబొగడఁ బైఠాణమునఁ‡ మహా,రాజనంగఁ జేసె రాజ్యమచట. ౧౬౫

సీ. అటనుజ్జయినిలోన నందఱు పౌరులు నడలఁగా భూపాలు నగ్రమహిషి
యేడువకున్నకన్నెఱఁగి మంత్రులు వచ్చి నీవు గర్భిణి వాటఁ జావఁ దగదు
వలదన్న నా ప్రభావతి మంత్రివరుల సంబోధించి యీరాజ్యమును భుజించు
నీతగవును బెల్లె నిత్తఱిఁ గడుపులో పాపని బుచ్చి మీపాల నిడుదుఁ

* గెల్తురుద్ధతిన్ † గాయలనుచు. ‡ పైఠాణమునన్ = ప్రతిష్ఠానపురములో

గొనుఁడనుచు వీరపత్ని గావునఁగడఁకఁ,బొట్ట వ్రచ్చియుశిశువునుబుచ్చి యిచ్చి
యగ్ని నివసించిదివి కేగియమరసతులు,గొలువవలరెమునిజనాథుఁగూడుకొనియె.

క. ఆపట్టనమున మంత్రులు, నాపాపను బెంచుకొనుచు నాతని రాజ్య
శ్రీపతిఁగా నొనరించిరి, భూపాలన మాత్మబుద్ధిఁ బురికొనుచుండన్.* ౧౬౭

క. ఇలలోఁ దండ్రిబలంబును, జలమును మెఱయించుకొని ప్రశాంతుఁ డనంగా
వెలయుచు నతఁ డొకకొలఁదిని,జెలువందెను మకుఁగుపట్టుచెలమయుఁబోలెన్.

చ. అనుపుగ మంత్రు లాతని మహాసనసంస్థితుఁ జేయఁబూనినం
గని యశరీరి యీపసుచుఁగార్యము లేటికి వీఁడు దీని నె
క్కిన నగుఁబాటు గాదె తలఁగించి మహీస్థలిఁ బాఁతిపుచ్చుఁడా
యనిన నమాత్యు లెల్ల వెఱఁగందుచు నమ్మణిభద్రపీఠమున్. ౧౬౮

గీ. పుణ్యభూమిఁ బాఁతి పుట్టగాఁ గట్టించి, కొంతకాల మున్న యంతలోన
దైవవశముకొలఁదిఁ దద్దేశ మెల్లను, హానిఁ బొందుచుఖిలమయ్యె† మిగుల.

సీ. అచ్చోట నొకవిప్రుఁ డగిసెలు లంకలు గోదుమల్ జొన్నలుఁ గోరి పెట్టి‡
పిట్టల నార్ప నాపుట్టపట్టున మంచె గావించి యది యెక్కి త్రోవవారి
నాచేరఁజొచ్చి తిన్నన్ని జొన్నలు గోదుమలు పిసికిళ్లుగ నలఁచి తినుఁడు[1]
అని పిల్వ నమ్మి వచ్చినవారె కవి వెట్టఁ దా దిగి వచ్చి యందఱ నదల్చి
పసులసొమ్ముల కి క్లాసపడఁగఁ దగునె,యనుచువారల వెడలంగనడిచి తిరుగ
మంచె యెక్కి రాజసమున మరలఁ బిలుచు, వచ్చిరేనియు దిగివచ్చివారిఁద్రోలు.

క. ఇవ్విధమునఁ జని మగుడుచు, నవ్విప్రుని వెఱ్ఱి యనుచు నందఱుఁ దమలో
[2]నవ్వుచుఁ గనుకనిఁ బోవఁగ, నవ్వార్త యెఱింగి భోజుఁ డట కరుదెంచెన్.

క. వచ్చినృపు భటులం గని, యచ్చటఁ దనమంచె నున్నయాతఁడు చేలో
మెచ్చయినవి భక్షింపుఁడు, విచ్చలవిడి విడియుఁ డనిన విడిసిరి వారల్.౧౭౩

ఉ. తొల్లిటియ ట్లతండు డిగి దూఱుచు భోజునిఁ జేరి యక్కటా
యిల్లొక సర్వమై తినిన నిష్టుఁడు వైరికి సత్తు విచ్చినం
దల్లి విషంబు వెట్టినను దండ్రి తనూజుల నమ్మిన న్మహీ
వల్లభుఁ డొల్చుకొన్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా! ౧౭౪

---

*భూపాలంబు నాత్మబుద్ధిఁ బురికొనుచుండఁగ † లయమయ్యె. (హానిఁబొంది మయిల మయ్యె నని చిన్నయసూరి గారిపాఠము) ‡ వి త్తి ,,1 తిన్నని జొన్నగోదుమల్ పిసికిళ్ళు నుమలు నం బిసికికొనుఁడు. 2. నవ్విధ మెఱుఁగక పోఁగఁ.

క. బలహీనులకును నృపతియు, బల మసఁగాఁ బేదఁ జెఱుపఁ బాడియె యిది నీ
బలములచేఁ బొలియించితి, వెలుగే తనచేను మేయువిధ మిట నయ్యా. ౧౭౭

క. గతి గానక యిది యొకసం,గతి బ్రదికెద మంచు నుండఁగా ధర్మముఁ ద
ప్పితి "బ్రహ్మస్వం విషము, చ్యతే" యనుచుఁ బెద్ద లెల్లఁ జదువుట వినవే.

క. బలవంతుల మని విప్రుల*, ఫలభోగంబులకు నాసపడుదురె మును వి
ప్రులకిచ్చిన భూములు దమ, చెలియం డ్రని తలఁపవలదె క్షితిపాలురకున్.

గీ. అనుచు విభుఁడు చోద్య మంది తా నమ్మించె, యొక్కి తుష్టిపుష్టిఁ జొక్కి తలఁచె
దానధర్మగతులు దప్పక రాజనై, దీనజనుల సిరులఁ దేల్పఁ దగదె.† ౧౭౮

క. వెడఁగు లగుజనుల వృద్ధుల, బడుగులనుం బ్రోవలేని బ్రదు కొక బ్రదుకే
యడిగెడు వారలు గలిగినఁ, బుడ మంతయు నిచ్చి వారిఁ బుచ్చెద వేడ్కన్.

చ. అనుచు ముదంబునం బలికి యంతటఁ దానె యెఱింగి పల్లటి
ల్లినహృదయంబు నిల్పికొని లెస్స నిధానము గల్గఁబోలు వి
ప్రునిగుణ మిట్లుగా దిచట భూమిగుణం బని నిశ్చయించి యొ
య్యన దిగి వచ్చి యొంత కొలుచయ్యెడు బ్రాహ్మణు‡ చెప్ప నావుడున్. ౧౮౦

శా. నాకుం జూడఁగ నూఱుపు ట్లగు నరేంద్రా విష్ణురూపంబవో
నీకుం జూడఁగ నెన్నిపుట్లు లగునో నీవేకటాక్షింప న
స్తోకం బాసిరి గల్గదే యనిన సంతోషించి వేయిచ్చి మం[1]
చాకీర్ణం బగుపుట్టఁ గూల్చి యొకని ల్వాక్రిందఁ ద్రవ్వించినన్. ౧౮౧

క. భోజదృగంభోజగ్రహ,రాజాకృతి నురగరాజరాజితచూడా
రాజితరత్నప్రభలను, దేజఃపుంజంబు దోఁచి దిక్కులు వెలుఁగన్. ౧౮౨

గీ. రత్నగర్భపేరు ప్రకటించునదియొక్కొ, రత్నసానుమూలరత్నచయమొ
గంటిలేని మానికంబులగనియొక్కొ, నాఁగ నవ్వెలుంగు వీఁగఁ బాఱె.[2] ౧౮౩

సీ. అందు నానారత్న సుందరప్రాంతమా చంద్రకాంతాంచితస్థలము కలిమి
బెరయు ముప్పదిరెండు పిల్లగద్దియల కాభరణంబులౌ హేమపాత్రములను
రత్నదీపమ్ములు రమణఁ జేతుల నున్న పసిఁడిబొమ్మలును ముప్పదియు రెండు
నింపైననృపునివాళింపుసొంపొందంగఁ దత్సంఖ్యమణిమయద్వారములను

* వైఁబడి, † దేల్పఁగట్టి, ‡ య్యన దిగి. చేవ నెంత కొలం చయ్యెడు బాఁపఁడు.
1. గుల్మాకీర్ణంబగు. 2. తీఁగవాఱె.

*గలిగి నలడ నాలుచేతులవెడల్పు, చాపమాత్రసమున్నతి నేపుమిగుల
విక్రమాదిత్యులక్ష్మినివేశకాంతి, నంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు. ౧౮౪

క. తద్రూపముఁ గని నృపుఁడు ద,రిద్రుఁడు ధనరాశి గన్నరీతిం బ్రమదో†
న్నిద్రితుఁడై తివిపింపఁగ, భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్. ౧౮౫

వ. తత్కారణం బెఱింగి మంత్రి యి ట్లనియె. ౧౮౬

క. అరుగరె యయాతిపృథుగయ, భరతసుహోత్రాంబరీషభార్గవ శిబిసా
గరరంతినంగరాఘవ, మరుద్దిలీపశశిబిందుమాంధాత లిలన్. ౧౮౭

గీ. వారిలోన నెట్టివారిసొమ్మో యిది, పెద్దగాలమయ్యెఁ బృథివి నణఁగి
దీని వెడలఁ దివియఁ బూనినయప్పుడు, భూతతృప్తి వలయు భూతలేంద్ర. ౧౮౮

క. అనవుడు విభుఁ డదిచేయుద, మని గొఱియలఁ జెరువువెట్టి‡ యనువగుబలిభో
జనములనసురులు సురలును, దనియంగా భూతతృప్తి తగ నొనరించెన్. ౧౮౯

గీ. దీనఁ బొంగి భటులు దివ్యసింహాసనం, బెగయనీడ్వఁ దాన యెగసి వచ్చె
మంత్రిఁ జూచి రాజు మంత్రీంద్ర నీబుద్ధి, లావుకలిమి నిట్టిలాభ మయ్యె. ౧౯౦

ఉ. మంత్రము లేనిసంధ్యయును, మానము లేనితపంబు వేదవి
త్తంత్రము లేని యాగముఁ బదజ్ఞత[1] లేని కవిత్వము న్సదా
తంత్రులు లేని వీణయును దానకరాగము లేని గీతముల్
మంత్రులు లేనిరాజ్యము సమానము లిన్నియు వ్యర్థకార్యముల్. ౧౯౧

వ. అని కొనియాడిన నది మంత్రిప్రశంసావసరం బని యమ్మంత్రివరుండు స్వార్థం
బును యథార్థంబునుగా ని ట్లనియె. ౧౯౨

సీ. జూదరిసత్యంబుఁ జోరునిధర్మంబు సరసునికోపంబు సవతిపొత్తుఁ
బాషండు మతమును బ్రాహ్మణకలహంబుఁ దులువసంగడమునుఖలునితపముఁ[2]
గులటలభక్తియుఁ గోమటినిజమును బణ్యాంగనలప్రేమ పంద బిరుదుఁ
బగతుర సైరణ యెగచు వైరాగ్యంబుఁ బేదపెద్దఱికము వాదిధనము
నధమసంశ్రయంబు నైంద్రజాలికమును, బొమ్మసొమ్ము[3] మునుఁగకొమ్మపట్టు
మంత్రిలేని రాజ్యమహిమయు నావేళ, సుస్థిరములు పిదప నస్థిరములు. ౧౯౩

గీ. [4]మంత్రశక్తి నాత్మ మఱి పెట్టెగా నుగ్ర,దండవిష మడంచి దండి గలిగి
యర్థ మొదవ భూపుఁ డనుపాముఁ బట్టి యా, డించు మంత్రి గారడీని కరణి.

---

*కలిగి నలుందిక్కు లన్నిచేతులవెడల్పు. †నతిమోదపరిపూర్ణుఁడై ‡జెఱు (రు) వువెట్టి-చెరవువెట్టి-చెరవు=బలి-అని చిన్నయసూరి) 1. బుధజ్ఞత. 2. తగవు. 3. గొడ్డుసొంపు. 4. మంత్రిశక్తిఁదన్ను మఱఁదక పామున్లు, మాంత్రికుండు త్రిప్పుమాడ్కి నెపుడు! అనుకతింగి భూపుఁడను పాముఁబట్టి,

క. కనియుం గానక యిచ్చలఁ, జనఁజూచినఁ బోవనీక జనపతిఁ గరిచా
డ్పనఁ బట్టి యంకుశముగా, ననువగు పనిఁ ద్రిప్పు మంత్రి యాధోరణుఁడై.

గీ. కావఁ బ్రోవఁ గర్త గావునఁ దనమాట, త్రోవ నలవిగాదు త్రోవ యెఱిఁగి
యాసు మంత్రిమాట లాదరించెడివాఁడె, మేదినీశుఁ డండ్రు వేదవిదులు. ౧౯౬

మ. నరనాథుండు సమస్తమైనజనుల "న్రాజ్ఞాం ప్రజాపాలనం
పరమో ధర్మ" యనంగ నీపలుకుల న్భావజ్ఞుఁడై యేలఁగా
నరులం దెవ్వరు నాజ్ఞమీఱఁ జన దన్యాయప్రవృత్తిక్రియా
పరుఁడై ధర్మముఁ దప్పఁ జేయుపనిఁ ద్రిప్పం జెల్లుఁ దన్మంత్రికిన్. ౧౯౭

క. జననాథుఁ డనపరాధిం, దునుమఁగ నెలవిచ్చి హితుల దొరల మనవుల*
న్వినకుండినఁ దన్మంత్రికిఁ, దననేర్పున నతనికీడుఁ దప్పింపఁ దగున్. ౧౯౮

క. ఈచందంబున మంత్రి మ,హాచతురుం డొకఁడు విభునియానతి మొదలం
ద్రోచియుఁ ద్రోవక విప్రునిఁ, గాచె ననఁగఁ దొల్లి యొక్కకథ గల దధిపా. ౧౯౯

క. అనవుఁడు నాకథ నాకు, న్వినవలయును మంత్రివరుఁడు విప్రుని నేలా
గునఁ గాచెఁ బతిహితంబగు, పనిఁ జేసెం జెప్పు మనినఁ బతి కిట్లనియెన్. ౨౦౦

క. †శాలిమయాన్నసదంబర, శాలిప్రియ సత్యసంగశాలీనవధూ
శాలావిశాలశీలవి,శాలాపుర మేలు నందజనపతి కడఁకన్. ౨౦౧

క. అతనికి నతిహితుఁడు బహు, శ్రుతుఁ డనఁగాఁ గలఁడు మంత్రి సురమంత్రిసముం
డతఁడు ఘననీతిఁ బరఁగెను, బతికార్యధురంధరుండు ప్రజలకు హితుఁడై.

క. ఆ నందభూపతికి సతి, యానందము రూప మయ్యె ననఁ గలిగెఁ ద్రిలో
కీనయనచకోరములకు, భానుమతీదేవి యమృతభానుద్యుతియై. ౨౦3

సీ. దీపితకనకసందేహంబు దేహంబు పచ్చకర్పూరంబుపలుకు పలుకు
పల్లవసంపదాస్పదములు పదములు శోభితావర్తనాభి నాభి
కుంఠితకలకంఠకంఠంబు కంఠంబు ముకురవిడంబాభిముఖము ముఖము
సరసిజవైభవాకరములు కరములు విజితనీలోరగవేణి వేణి
నడుము లేమికి నెప్పుడు నట్టనడుము, లోచనములు కర్ణాంతరాలోచనములు
ఇంతిపాలిండ్లు కంతుపాలిండ్లు సూడ, నట్టిరూపంబు రూపింప నరుదుగాదె.

గీ. అట్టిసతిని ఱెప్పవెట్టక చూచుచు, నిద్ర యాఁకలియును నీరు వట్టు
నడఁచి యధరసీమ‡ నమృతంబు గ్రోలుచు, దేవుఁ డనఁగ మనుజదేవుఁ డొప్పె.

---

* తగవులన్. † శాలిమయాన్న సదమల, శాలిప్రియ నవ్యసంగ- ‡ యధరరేఖ.

క. వనితలకు నురము నోరును, దను వర్ధము నిచ్చి రచ్యుతబ్రహ్మశివుల్
ఘనుఁ డామువ్వుర మీఱుచు, జనపతి దనసతికి నిచ్చె సర్వాంగములన్.

సీ. అవనీశుఁ డీక్రియ నంతఃపురంబున విహరించుచును మంత్రి విన్నపమున
బలిమిమై నొకనాఁడు కొలువున కేతెంచి యాసతితొడమీఁద నభిముఖముగ
నిడుకొని తన్ముఖం బీక్షించుచుండఁగా దొరలును భటులును బరులు హితులు
లజ్జాభయములఁ దల లాంచికొనియుండఁ గొంతతడవున కయ్యింతి చెయ్యి
పూని పట్టుకొనుచు లోనికిఁ బోయిన, మంత్రి కలఁగి యిట్టిమమత నేఁడు
మానిపింపకున్న హాని యగానంచు మోము, మోట మాని తోడ నొయ్యనేగి.

గీ. దేవ యిచట నెట్టితెఱఁగైన నొప్పు నీ, యతివ నటకుఁ దెచ్చు టనుచితంబు
అనుడు నృపుఁడు నవ్వి యచ్చటి కే వచ్చి, యున్న నేమి రాకయున్న నేమి.

క. విశ్రుతనీతివివేక బహుశ్రుత నీయట్టి సచివుఁ* డుండఁగఁ బ్రమదో
న్మిశ్రముగ విశ్రమించెద, నాశ్రితసంరక్ష నీనయంబున జరుగన్. ౨౦౯

క. ఏణేక్షణ యీసతి నా, ప్రాణేశ్వరి నిమిష మైనఁ బాసిన విగత
ప్రాణమయి మేను నిల్వదు, ప్రాణము వెడఁబాయునట్టి రాజ్యం బేలా. ౨౧౦

చ. అనిన బహుశ్రుతుండు హృదయంబున నవ్వుచు నింతప్రేమ గ
ల్గినఁ బటమధ్యమంబున లిఖించిన యీసతిరూపు నీమహా
సనము సమీప భాగమునఁ జక్కటి నిల్పిన నందు నీదు దృ
ష్టి నిలుపుకొంచుఁ గొల్వున వసింపుము నావుడు నియ్యకొలునన్. ౨౧౧

క. జనవరుఁ డొకచిత్రకుచే, వనితారత్నంబురూపు వ్రాయించి పటం
బనువందఁ జూపఁ బంపెను, తనకులగురుఁ డైనశారదానందునకున్. ౨౧౨

గీ. అతఁడు చూచి మెచ్చి యచ్చిత్రకారుని, జేరఁ బిలిచి తొల్లి చెప్పినట్లు
సతులలోన నాల్గుజాతులు గల విందు, జాతికొలఁది వ్రాత సహజమయ్యె. †

చ. తొడలును జన్ను లోష్ఠములు దొడ్డలు కన్నులుఁ గాళ్లుఁ జేతులున్
వెడఁదలు మోముఁ గంఠమును వెండ్రుకలుం గుఱుచ ల్లలాటముం
బొడవునొడ ల్వెడల్పుకడుపుం గుడుపున్నడపున్ ఘనం బగుం
జిడిముడిపాటులుం‡ దొగరుఁజీరలు హస్తిని కొప్పు నెప్పుడున్. ౨౧౪

* మంత్రి, † ఈగీతము క్రింద నొకప్రతిలో "నాల్గుజాతుల స్త్రీలకు (బద్యములు" అని యున్నది. ‡ పాటలుం.

చ. నడుము కృశంబు పిన్న జఘనంబు కుచంబులు గట్టి వెండ్రుక
ల్నిడుపులు గన్నులా మెఱుఁగు *నిగ్గులు కాంతకు వింతభోజనం
బడరుఁ బ్రియంబుఁ గోపము నయంబు సమంబులు దానఁ గొండె మే
ర్పడ విను రక్తపుష్పపటరాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ. ౨౧౫

ఉ. అన్నువ యైనకొనుఁ గుటిలాలకపంక్తియుఁ జెన్నుమీఱఁగా
వన్నెలు గట్టుఁ బచ్చమరువంబులునుం దుఱుమంగ నేర్చు మా
ఱున్నెడఁ గన్నులార్చు సురతోద్ధతి నేర్పరి యల్పభుక్తితోఁ
జిన్నిమాటలాడుఁ గడుఁ ద్రిమ్మరి చిత్తిని చిత్రవిక్రియన్. ౨౧౬

ఉ. తెల్లనిచీరలు న్విరులుఁ దియ్యఁదనంబును మెచ్చు వెండ్రుక
ల్నల్లన మోవి యెఱ్ఱన కనత్కనకద్యుతి మేను గన్నులు
త్ఫుల్లసరోజరోచులు మృదుధ్వని కంఠము పాణిపాదము
ల్పల్లవకాంతు లాననము పద్మము పద్మిని జాతి కిమ్మహిన్. ౨౧౭

క. కలియుగమునఁ బద్మిని సత్కులమున లే దిది తదీయగుణములు గలకో
మలి గాన నెడమలోఁదొడఁ, దిల ప్రమాణంబు మచ్చ దిరమైయుండున్.

గీ. అనుఁడు వెఱఁగుపడుచు నచ్చిత్రకుఁడు భీతి, తోడ నేగి పువ్వుఁదోఁటలోనఁ
జెలఁగునృపున కిట్లు చెప్పిన నతఁడు గో,ప్యస్థలంబు గనుట కాత్మఁ గలఁగి.

ఉ. నందనరమ్యమౌ గృహావనమ్మున మన్మథకేళివేళ నా
నందుఁడు భామవామజఘనంబున సన్నపు మచ్చఁ గాంచి యా
నందము డింది కందు మది నాటుకొనం దలయూఁచి శారదా
నందుని సద్గుణం బవగుణంబుగఁ గైకొని వచ్చి మంత్రితోన్. ౨౨౦

గీ. ధర్మమూర్తి యనుచు నిర్మలాత్మకుఁ డని, నమ్మినార మిట్టి నాటకములఁ
జాల ద్రోహి యైన శారదానందునిఁ, జంపు మనిన మంత్రి సంచలించి. ౨౨౧

క. దేవా యిది మదిఁ దప్పుగ, భావింపకు భువి మహానుభావులు మదిలో
దైవికమానుషములయం, దేవియుఁ బొలివోవకుండ నెఱుఁగుట వినవే. ౨౨౨

క. జాడచెడి రాచలోగిలి, పాడుగఁ గన్నంబువెట్టి బలుముచ్చులతోఁ
గూడిన నోరుఁ జంపిన యం,కాడిన మఱి విప్రుఁ జంప నర్హం బగునే. ౨౨౩

వ. ఇంతియకాదు. ౨౨౪

*నిగ్గులుగాదగు సర్దభోజనం । బడరఁ బ్రియంబు కోపము. భయం [illegible] దగదాన గుండె

సీ. పచ్చతెక్కలనొప్పు పక్షిగుజ్జము నెక్కి చెఱకువిల్లురుదుగఁ జేతఁ బట్టి
రొదసేయు గండుఁదుమ్మెదనారి సవరించి చెలువైనపూవుటమ్ములను బూని
యలరారు గండుఁగోయిలదండుఁ గని ముందు నడువుండటంచు నానతియొసంగి
సరసుఁడైన వసంతసచివునితోఁ గొంత మంతనం బొనరించి సంతసమున
ననికి వెడలి వియోగిసేజనమునొంచె, నలరుఁదూపుల మన్మథుం డనెడుజోదు
శూరు లెవ్వరుఁ దనసాటి గారటంచు, మాఱులేకపరాక్రమమహితుఁడగుచు.
గీ. కమలపాణికి నోడి సంగరములోనఁ, గమలపాణ్యభిధానము గ్రాంచుసతుల
నొంచుమరుఁ డెట్టిశూరుఁడటంచు మిగుల విరహిణులు నింద చేసిరి విషమశరుని.
వ. ఇట్లు సంయోగులకు నానందకరంబును వియోగులకు దుస్సహతరంబును నై
యతివిచిత్రం బగు నవ్వసంతసమయంబున నద్దశరథేశ్వరుండు ఋష్యశృంగమునీం
ద్రుం గాంచి. ౨౧౦
సీ. వినయంబుతో మ్రొక్కి విహితపూజలు చేసి మునివర్య కారుణ్యమునను నాకుఁ
దనయులు గలుగంగఁ దగుకీర్తి నశ్వమేధంబుఁ జేయు మటంచుఁ దగవరించి
మఱల నర్చించుచు మఱియు సన్మునులను భూసురవరులను బూజసేసి
తనమనోరథమున కనుకూలముగ వార లాశీర్వదింపఁగా నలరి యంత
మంత్రులనుజూచి హయమేధమఘ మొనర్చి, సుతులఁబడసెదఁ గావునసురుచిరముగఁ
బూజితాశ్వంబు విడువుఁ డిప్పుడనవార, లధిపునానతి నట్టుల నాచరించి. ౨౧౧
గీ. ఏమఱకయుండఁగా నొక్క యేఁడునిండఁ, గ్రమ్మఱ వసంత మరుదేర నమ్మఖాశ్వ
మవనితలమందు సంచార మమరఁజేసి, యేగుదెంచిన సచివు లిలేశుఁ జూచి.
చ. రఘుసుతపుత్ర యశ్వము నిరర్గళవృత్తిని వచ్చె నింక ని
మ్మఘమును బ్రయత్నమొప్పు నియమంబునఁ జేయఁగఁ బూనుటొప్పు నో
మఘవసమాన తేజ యని మన్ననతోడుతఁ దెల్ప నాతఁడు
న్విఘటితసంశయుం డగుచు వేడుక వారలఁ జూచి యిట్లనున్. ౨౧౩
క. సరయూత్తరతీరంబున, సరభసముగ నధ్వరార్హశాలలఁ దగుచ
ప్పరములు మొదలుగ మీరలు, సరగున నొనరింపవలయుఁ జతురతమీరన్.
క. సవనోపకరణములు నతి, జవమునఁ దెప్పింపవలయు సభ్యులు నిత్యో
త్సవములు నలరెడు విబుధుల, సవనవిధిజ్ఞులను వేగ సమకూర్పఁ దగున్. ౨౧౫
గీ. అనిన మంత్రులు దేవ నీయాజ్ఞ వలన, సవనముఖ్యోపకరణముల్ సంగ్రహించి
మునుచితాకారముగ వారు సరయూత్తరమున, యజ్ఞవాటమొనర్చితి మధిప యింక.

క. ఏమియుఁ గొఱంత లేదన, భూమీశుం డాత్మఁ బొంగి పుణ్యచరిత్రుం
గామార్యుంతశ్శత్రు, స్తోమజయాన్వితు వసిష్ఠు సురుచిరతేజున్. ౨౧౭

వ. కనుంగొని యిట్లనియె. ౨౧౮

ఉత్సాహ. తరణితేజ నీవునాదు దైవమవు గురుండవుం
బరమసత్త్వబోధనుఁడవు పాకశాసనాదిని
ర్జరనుతుండ వజముకుందశంకరోపమానస
చ్చరితుఁడవు మహాత్మ నిన్ను సన్నుతింప నేర్తునే. ౨౧౯

క. అని వినుతించుచు మునిపద, వనజంబుల కెరఁగి నృపతి వారనిభక్తిన్
ఘనయాగము నిర్విఘ్నము, గను సాగింపంగ నీదిగా భారమనన్. ౨౨౦

క. సర్వేశ్వరుకృపచే నో, యుర్వీధవ నీమక్కోర్కి యొప్పెడు నింకన్
గుర్వశ్వమేధయాగము, నిర్విఘ్నముగాఁ జెలంగు నిక్కువము చుమీ. ౨౨౧

క. భీమాసురాది దుష్ట, స్తోమంబులఁ బాఱఁద్రోలుదును భూమీశా
నామంత్రశక్తిఁ దత్క్రియ, నేమఱ కుండెదను సంశయింపకుమదిలోన్. ౨౨౨

చ. అనుచు ధరాధినాథు వినయంబునఁ బ్రీతుని జేసి యంతటన్
మునిపతి యాసుమంత్రుఁ గని మోదముతో నిటు దెమ్ము మైథిలున్
జనకుని రోమపాదవిభు సంతతమిత్రుని గేకయేశ్వరున్
ఘను లగువారిబంధులను గ్రక్కున యాగము చేయువేళకున్. ౨౨౩

వ. మఱియును. ౨౨౪

క. నాలుగుదిక్కులఁ గలభూ, పాలకులను దదనుచరులఁ బటుతరయాగ
శ్రీలు గనఁ దోడితెమ్మా, యాలస్యము చేయ కేగి యన నాతండున్. ౨౨౫

క. వల్లెయని మానిశాసన, ముల్లం బలరారఁ బూని యురుమణిభూషా
తల్లజ మృదువసనాదిక, సల్లలితోపాయనములు చయ్యనఁ గొనుచున్. ౨౨౬

చ. రయమున నేగి మాన్యుల ధరాపతులం గని సత్కరించి స
త్ప్రియవచనంబు లాడి యరుదెండు మహీపతులార భాస్కరా
న్వయపతి సేయు యాగముఁ గనంగ నటన్న సుమంత్రుతో నృపు
ల్నయ మలరార వేడ్కఁ బయనం బయి వచ్చి రయోధ్య కంతయున్. ౨౨౭

క. వచ్చిన రాజులఁ గనుఁగొని, విచ్చలవిడిఁ దగిన యట్టి విడిమరలందుం
జెచ్చెరఁ జేర్చి వసిష్ఠుం, డచ్చుగ దశరథుని జూచి యనియెం బ్రేమన్. ౨౨౮

మత్తకోకిల. రాజు లందఱు వచ్చినారు ధరాతలంబునఁ గల్గువా
రోజతోడుత యాగకృత్యము లొప్పి యున్నవి డాసెఁగా
పూజనీయముహూర్త మిప్పుడు పొంది యుండిరి యాజకుల్
వాజిమేధము వేగఁ జేయుము వారిజాక్షకులావనా. ౨౨౯
మ. అనిన న్భూపతి యాత్మఁ బొంగి తనజాయారత్నముల్ దానుఁ జ
య్యనఁ గాలోచితకృత్యము ల్సలిపి నెయ్యం బొప్ప శాంతాయుతు
న్ముని శాంతాత్ముఁ బురస్కరించుకొని సమ్యగ్భవ్య వాసిష్ఠాదులుం
జనుదేర న్మఖవాటిఁ జొచ్చె నిగమాంచద్వాక్యముల్ లేపారఁగన్. ౨౩౦
వ. ఆసమయంబున. ౨౩౧

—: దశరథుఁడు యజ్ఞమొనరించుట :—

క. భేరీమృదంగదరపీ,ణారవములు గూరివేదనాదంబులు వే
శ్యారమ్యగానరవము లు, దారములై మిన్నుముట్టెఁ దగనేకంబై. ౨౩౨
క. అప్పుడు ధరాతలేంద్రుం, డొప్పుల కుప్పలగు తనదు యువతులతోడ
న్గప్పున దీక్షం గైకొని, యొప్పెను మఖకర్మమునకు నుద్యతమతియై. ౨౩౩
వ. అంత. ౨౩౪
సీ. సరయూదకములు కాంచనకుంభములఁ బట్టి మొనసి కావళ్ళతో మోయువారు
శాలితండులములు సమకూర్చి యిచ్చిన దండిగా నన్నము వండువారు
కందపెండలములుఁ కదళీశలాటు లాదిగ శాకములు వండి నెగడువారు
గొప్పయప్పడములుఁ బప్పుఁ బచ్చళ్ళును బానకంబులుఁ జేయఁబూనువారు
మానుగాఁ బిండివంట లమర్చువారు, పాయసాన్నము లొప్పుగాఁ జేయువారు
నగుచుఁగొందఱుభూసురులన్న రేంద్ర, కుంజరునకాత్మమోదంబుఁగూర్చిరపుడు.
గీ. పనసపహకారజంభరరంభాకపిత్థ, నారికేళఫలాదు లుదారశక్తిఁ
దెచ్చి గుట్టలు వెట్టిరి తిప్ప లట్లు, గనఁబడఁగఁ గొంద ఱానందకలితు లగుచు.
గీ. దధిఘృతక్షీర శర్కరామధురసములుఁ, దైలలవణామ్లఫలములు చాలఁ దెచ్చి
యుంచి రధ్వరశాలల నొప్పుమీఱ, వానిపరిమాణ మెన్నఁగా వశమె విధికి.
వ. ఇట్లు సకలసంభారంబులు సమకూర్చువారును దత్తద్విజయోగంబుల భూసు
రాదిసకలజనంబుల నతితృప్తులం జేయువారును విశేషించి దీనాంధబధిర కుబ్జా
దులఁ బ్రియవచనపూర్వకంబుగా భుజియింపంజేసి సంతుష్టులం జేయువా
రును, సర్వజనంబులకుఁ దాంబూలవస్త్రాభరణంబు లొసంగువారును నై తత్త

త్ప్రయోజనాధికారు లేతత్ప్రకారంబున సమస్తజన మనోభిరామంబుగా నధ్వర
మహోత్సవంబు చేయుచున్నంత. ౨౩౪

క. ఘనులు వసిష్ఠాదిమహా, మునులు న్భూసురులు శీఘ్రమున నాశాంతా
వనితావిభు రవినిభుఁ గనుఁ, గొని వేడ్కఁ బురస్కరించుకొని త్త్రియుకై. ౨౩౫

గీ. విహితరీతిని బ్రారంభవిధు లొనర్చి, గరుడపక్షాకృతిగ నిష్టకాసహస్ర
ములను గూర్చుచు నత్యంత విలసితముగ, వేదిక అలంకరించిరి మోదమొప్ప.

గీ. లలితవేదుల జాతవేదులను నిలిపి, శీఘ్రముగను బ్రదీప్తము ల్సేసి యపుడ
తగఁ బ్రవర్గ్యోపసదముఁ బ్రాతస్సవనము,సాధుమాధ్యందినతృతీయసవనములను.

సీ. కావించి రభసంబుగా నేకవింశత్యరత్ని ప్రమాణవిరాజితములు
ఖదిరబిల్వపలాశఘనయూపషట్కము ల్పటుదేవదారుయూపములు రెండు
నొక్క శ్లేష్మాతక యూపంబుఁ దెచ్చి యీయిరువదియొక్కటి వరుస నిలిపి
మహితచందనపుష్పమాలికాభరణనూతనవసనాలంకృతములు చేసి
యమితరుచిజాతరూపయూపములువాని,చుట్టుశోభార్థముగనిల్పుచునుజతుష్ప
దములఁ బక్షులవారిచరములఁగూర్చి, యూపములఁబరివేష్టించియుండనునిచి.

గీ. నిగమమంత్రోక్తవిధిసమానీతమైన, యశ్వరత్నంబు యూపమధ్యమున నునిచి
యంత మున్నూఱు పశువుల నాగమోక్త,సరణిచేతను విశసించి సంతసమున.

క. జవమున నప్పశుపలలము, లవితథమంత్రములవలన నగ్నులయందున్
దివిషదులకు ముదము మొదవఁగ, హవనము గావించిరపుడుయాజకులుదగన్.

సీ. అంతఁ గౌసల్య దా యాజకు లెఱిఁగింపఁ గైనొప్పు నిశితఖడ్గత్రయమున
ఖగసమేతముగఁ దురగము వధింప నధ్వర్యుఁ డుద్గాత హోతయును గూడి
యావాజి నప్పుడు యజనంబునకుఁ జేర్చి వేవేగఁ దద్వప వెలికి వహ్ని
యందు హోమము సేయఁ బొందుగాఁ దద్ధూమబృందంబు దశదిక్కులందుఁ బర్వఁ
గాఁ దదాఘ్రాణ మొనరించి కడఁకసర్వ, భూపతులు భూరిపాతకంబులను బాసి
రఖిలజనులుఁగృతార్థులైయతిరయమున,ముదమునొందుచుఁగలుషనిర్ముక్తులైరి.

క. పిమ్మట నత్తురగావయ,వమ్ములు వేదోక్తమంత్రవాక్తతి సుపవి
త్రమ్ములు చేయుచు నగ్నికి, నిమ్ముల నాహుతులు చేసి ఋత్విజు లెలమిన్.

వ. మఱియు జ్యోతిష్టోమాతిరాత్రాభిజిద్విశ్వజిదప్తోర్యామాదిక్రతుసహితంబుగా
నష్టముకర్మకలాపంబు సంపూర్ణంబు గావింప నద్దశరథుండు లబ్ధమనోరథుండై
యధ్వరదక్షిణ లొసంగం దలంచి హోతకుఁ బ్రాగ్దేశంబును, బ్రహ్మకు దక్షిణ

దేశంబు ను, నధ్వర్యునకుఁ బశ్చిమదేశంబు ను నుద్గాతకు నుదీచ్యదేశంబు ను
నిచ్చి తక్కినభూసురులకు నయోధ్యతక్కఁ దక్కినభూతలంబు నొసంగిన వార
లాదశరథుం జూచి యి ట్లనిరి. ౨౮౭

గీ. స్నానసంధ్యాద్యనుష్ఠానసరణిచేత, నిగమపాఠాదికములచేఁ బగలు రేయుఁ
దీర దొకగడి యైన మాకీఱు దెలిసి, భూము లిచ్చుట చిత్ర మా భూపవర్య.

క. కావున భూమికి మాఱుగ, గోవులను సువర్ణములను గురుతరమణులన్
భూవర మాకిడు సొంపుగ, నీవసుమతి నీవ యేలి నెగడుము వేడ్కన్. ౨౮౯

చ. అనుచు వసిష్ఠుఁ డాది యగు నార్యజను ల్వచియింప వారి క
జ్జనవిభుఁ డాత్మఁ బొంగి మణిసంఘములు న్వరధేనువర్గము
ల్కనకము లంబరంబులును గౌరవమొప్ప నొసంగఁ గొంచు న
మ్మనుజవరేణ్యుఁ జూచి కడు మన్ననతోడుతఁ బల్కి రందఱున్. ౨౯౦

సీ. దశరథ నీసుకృతంబుచే నిమ్మహాయాగంబు సుకృతమై యతిశయిల్లె
భూరిదక్షిణలను జారుతరాన్నప్రదానంబు కర్మవిధానములును
బరమేష్ఠితుల్య భూసుర సమాగమమును బరికింపఁ జిత్రమై పరఁగె నేఁడు
నీభాగ్యగరిమ వర్ణింపఁగా శక్యమే పంకజాసనబృహస్పతులకైన
సాంద్రకీర్తి హరిశ్చంద్రసార్వభౌముఁ, డర్కకులమణి యశ్వమేధాధ్వరంబు
జానుమీఱంగ మును చేసె దానిసమతఁ, జెందె నీయజ్ఞ మవనీపురందరుండ.

క. అని బహుభంగులఁ బొగడుచు, ఘనముగ నాశీర్వదింపఁగా దశరథుఁడు
న్మనమున గురుతరహర్షం, బెనయఁగ శాంతేశుఁ జూచి యి ట్లని పలికెన్.

ఉత్సాహ. అష్టమూర్తితుల్య ఘనదయాసముద్ర నిన్ను నా
యిష్టదైవముగఁ దలంచి హితము గోరి యుంటి నీ
విష్టపత్రయంబునందు వినుతికెక్కఁ బుత్రకా
మేష్టి విధు లొనర్పవలయు నింపు గుల్కుచుండఁగాన్. ౨౯౩

గీ. అనిన నమ్ముని నిగమమంత్రానువృత్తి, నాజ్యధారాహుతులు వహ్నియందు వేల్చి
తత్క్రియాకౌశలంబునఁ దనరుచుండ, హవ్యభుజు లంబుజోద్భవు నాడి రిట్లు.

క. ధాతా త్రిజగజ్జనసుఖ, దాతా నీతోడ నెన్నఁదగువిన్నపముల్
చేతుము గావున నీతఱిఁ, జేతోమోదంబుతోడఁ జేకొనవలయున్. ౨౯౪

వ. అది యెట్టి దనిన, ౨౯౫

సీ. రావణుఁ డనువాఁడు రాత్రించరేంద్రుండు నీవిచ్చువరమున నెగడుచుండి
కావరమున దేవకాంతలఁ జెఱపట్టి గరుడగంధర్వకిన్నరనిలింప
యక్షాదులను బట్టి శిక్షించుచుండెను మునుల విదారించె ముదముతోడ
దిక్పాలకులనెల్లఁ దెరలించె రణమున సకలలోకముల కీసరణిఁ బెక్కు
బాధ లొనరించుచుండెఁదద్బాహుశక్తి,కలిమికడలుచునినుఁడెండగాయవెఱచుఁ
బవనుఁ డొంతయు సంచరింపంగ నడలు, ధరణి తద్భీతిచేఁ గడుఁ దల్లడిల్లు.
క. వారినిధు లైనఁ దద్భయ, కారణమున మ్రోయవెఱచుఁ గద కమలభవా
ధీరతవాఁ డొనరుచు బ, ల్దారుణములు దెలుప మాకుఁ దరమె మహాత్మా. ౨౧౮
క. నీవిఁక నుపేక్ష చేసిన, రావణుచే ముజ్జగములు రయమునఁ ద్రుంగుం
గావున మాపైఁ గృపచేఁ, గావింపుము వాఁడు మృతుఁడు గాఁ దగుచింతన్.
క. అని సురలు దెలుపఁ గమలా,సనుఁ డమరులఁ గాంచి మీరు సదమలమతులై
వినుఁ డిటు మున్నె యెఱుఁగుదు, దనుజాధముఁ డాచరించు దారుణబాధల్.
మ. ధర యక్షోరగకిన్నరేంద్రరిపుగంధర్వాదిదేవాలిచే
మరణం బెన్నఁడు లేకయుండి మది నున్మత్తత్వమేపారఁగా
వరముం గాంచెను గాని నావలన దేవద్వేషి యుద్ధంబున
న్నరుచేత న్మృతి నొందకుండ వర మందన్నేరఁ డప్పట్టునన్. ౨౨౧
గీ. కాన సంగరంబులోన మానవుచేత, నసుర గూలు సిద్ధ మమరులార
మును హిరణ్యకశిపుఁ డనుదానవేంద్రుని, ముదముతో నృసింహమూర్తిగూల్చె.
క. ఆదానవుండు మరల, న్మేదినిపై రావణాఖ్య మీఱఁగఁ బుట్టెన్
మాదరుఁడై వఱలెడుదా, మోదరుఁ డాతని వధించు నొప్పుగ నరుఁడై. ౨౨౩
తోదకవృత్తము. కావున మోదముగా మనమెల్లన్, దేవవరేణ్యుని దెల్విని గొల్వం
గావఁగఁ జూచునఖండదయన్రా, జీవనిభాక్షుఁడు శీఘ్రముగాఁగన్. ౨౨౪
క. అని సురవరులుం దానును, మనమున సద్భక్తితోడ మాధవు భక్తా
వనుఁ బుండరీకలోచను, ఘనముగ ధ్యానించుచుండఁగా నవ్వేళన్. ౨౨౫

— శ్రీమహావిష్ణువు బ్రహ్మాదులకుఁ బ్రత్యక్షమగుట. —

సీ. శ్రీరమణీమణిశ్రితభూరివక్షుండు నలినబాంధవచంద్రనయనయుగుఁడు
శంఖచక్రగదాసిశార్ఙ్గహస్తుండును గాంచనవస్త్రయుగ్మాంచితుండు
వర్షావసరలసద్వారిదగాత్రుండు విధిజన్మపదనాభివిలసితుండు
కోటిసూర్యకనత్కిరీటమస్తకుఁడును దండశూకాంతకస్యందనుండు

విశ్వసంరక్షణాధ్యక్షుండు శాశ్వతుండు, బ్రహ్మరుద్రాది వందితపాదపద్ముఁ
డఖిలయోగీశ్వరేశ్వరుం డనఘచరితుఁ, డాదినారాయణుండు ప్రత్యక్షమయ్యె.

వ. ఇట్లు ప్రత్యక్షుండైన ననంతకోటిబ్రహ్మాండనాయకుం డగు నప్పరమేశ్వరుపాదారవిందమ్ములకు నరవిందభవ పురందరాది బృందారకు లమందానందకందళితహృదయారవిందు లై సాష్టాంగదండప్రణామంబు లాచరించి చతుర్వేదవాక్కుసుమంబులం బూజించి సకలలోకవిద్రావణుం డగురావణుని వృత్తాంతం బంతయు నెఱింగించి యిట్లనిరి. ౨౬౭

క. దేవా మానవుచేతను, రావణదనుజుండు గూలు రణమునఁ గాన
న్నీవేగ నరుఁడ వగుచును, నీ విల జన్మింపవలయు నెమ్మి దలిర్పన్. ౨౬౮

సీ. దశరథుం డీతండు ధరణీపతులలోన ధార్మికుం డనవొప్పు ధన్యకీర్తి
యితనిసతు లువ్వు రతులపతివ్రతల్ రమణీశిరోమణు ల్రాజముఖులు
పుత్రలిప్సాయుత ల్పాత్రభూతలు గానఁ జతురంశముల నీవు సరభసముగ
వీరిగర్భములందు వేడ్కఁ బ్రవేశించి నలుగురు కొమరులై వెలయఁబుట్టి
మనుజరూపముతోడుత ఘనత కెక్కు, నీవు రావణు రణమున నెఱి వధించి
లోకములఁ బ్రోవవలయును బ్రాకటముగ, నఖిలలోకేశ విజితాశయఘవినాశ.

గీ. నిక్క మొక్క నీవు దిక్కు గావున మాకు, స్రుక్కి మ్రొక్కి తక్క కొక్క మనవి
చక్కఁ దెల్పినార మక్కఱ దీర్పుమో, పక్కి జక్కి నెక్కి నిక్కు జేఁడ. ౨౭౦

గీ. అనిన మీకోరినట్టుల యాచరింతు, ననుచు బ్రహ్మాదిసురలకు నభయ మొసఁగి
యఖిలలోకేశ్వరుం డగు నారమేశుఁ, డనఘచరితుండు నిజపదంబునకు నేగె.

వ. తదనంతరంబ. ౨౭౧

సీ. రక్తాననుండును రక్తవస్త్రుండును రవినిభతేజుండు రమ్యమూర్తి
దుంపభిస్వనుఁ డరవిందాక్షుఁ డీక్షితభద్రలక్షణగణభాసురుండు
పరమాన్నయుత హేమపాత్రహస్తుం డొక్క దివ్యపూరుషుఁడు దేదీప్యమాన
హోమాగ్నివలన సమున్నతిచేఁ బుట్టి దశరథక్షితినాథుఁ దనరఁ జూచి
క్షితిప యేను బ్రజాపతి సుతుఁడ దేవ, నిర్మితంబును జంద్రికానిర్మలంబు
గడహారం బాత్మజోత్పత్తికారణంబు, పాయసం బిది నీకిత్తుఁ బర్వమొదవ.

తే. ఘనమీపాయస మంది నీసతుల మెక్కంజేయు భూపాల స
త్తనయు లలుదు రింక నీమనము మోదం బొందు నం చాతనిం
గని తత్పాత్రము చేతికిచ్చి యతఁడుం గావించుసుస్తోత్రవం
దనము ల్గాంచి సురోత్తముండు వెస నంతర్ధాన మొందెం దగన్. ౨౭౪

క. ఆదివ్యకనకపాత్రము, చేదోయిని దాల్చి యున్న క్షితిపతి యలరెన్
భూదేవసమితిలోపల, నాదట నిధిఁగొన్న పేద యట్టుల మిగులన్. ౨౭౫

సీ. అంతనద్దశరథుం డాత్మకాంతలఁ బిల్చి సంతోషనిర్భరస్వాంతుఁ డగుచుఁ
బరమాన్నమును రెండుభాగంబులుగఁజేసి కడకఁ గౌసల్యకుఁగైకకిచ్చి
వారిభాగములందు వరుసతో సగములుదెచ్చి సుమిత్రకు నిచ్చి వేగఁ
దరలాక్షులార మీరాతలఁచిన కోరుకు లీన సిద్ధించు సందియము లేదు
కావునహరిస్మరణపూర్వకముగఁబాయ,సంబుఁదినుఁడని తెలుపసయ్యంబుజాక్షు
లతిరయంబునఁ బతి తెల్పినట్ల వేడ్క, నారగించుచు గర్భిణు లైరి పిదప. ౨౭౬

క. ఘనతహవిర్భాగంబులు, గొని దివమున కేగు దేవకోటులఁ గనుచు
న్వనజాసనుండు పలికెను, వినుఁడీ సురలార మీరు వినయముతోడన్.

శా. లోకశ్రేణిని బ్రోవఁగోరి తగ భూలోకంబునం బుట్టి యా
వైకుంఠుం డొగిఁ బంక్తికంఠముఖదేవద్వేషులం గూల్చు ని
ర్భీకుం డై సమరోర్విలోనఁ బటుదోర్వీర్యంబునం దజ్జయ
శ్రీకై మీరును దోడు గావలయు నిశ్చింతాత్ము లై యందఱున్. ౨౭౮

క. నరుఁ డగుచుఁ బుట్టు హరి యి, ద్ధరణిని మీయంశములను దగవానరుల
న్నరగునఁ బుట్టింపుఁడు కి,న్నరసురనరయక్షనాగనారులవలనన్. ౨౭౯

వ. మఱియు గరుడగంధర్వవిద్యాధరాది దేవకాంతలవలనను వనచరాంగనలవల
నను మహాబలసంపన్నులుం గామరూపులు నైన వలీముఖుల సృజింపుండు.

క. మును జాంబవంతుఁ డనియెడు, వనచరుఁ డేనావులింప వదనంబునఁ దా
జనియించి యున్నవాఁ డిల, ఘనసత్త్వపరాక్రమములు గలవాఁ డరయన్.

వ. అనినఁ బరమేష్ఠివచనంబులకు సంతసిల్లి వల్లె యని యమరులు సురలోకంబుం
బ్రవేశించి రంత. ౨౮౨

సీ. వాసవుండును వహ్ని వారిజాప్తుండును వాయుదేవుండును వసధిరాజు
గురుఁ డశ్వినీసుతు ల్నరవాహనుండును విశ్వకర్మయుఁ గడువేడ్కతోడ
వాలి నీలుని బలవంతు సుగ్రీవుని హనుమంతుని సుషేణు ఘనుని దారు
మైందద్వివిదులను మఱిగంధమాదను నలుని బుట్టించి రున్నతి దలిర్పఁ
బుడమిఁబర్జన్యుఁడునుశరభునిసృజించె, మఱియు సురవీరు లగచరమండలముల
నమరఁబుట్టించి రిలఁదమయంశములను,వనచరామరన్నుసతులవలనమిగుల. ౨౮౩

— " ౹

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్వార్షికాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షులు

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు,

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్ టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటాద్రియయ్యగారు.

కేశవపు రామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయఁడుగారు.

| | | రు | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి ... | 0 | 10 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు ... | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0 | 8 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టుసర్వశాస్త్రికవి ... | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు ... | 0 | 2 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుగారు | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి ... | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి ... | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు ... | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | 0 | 4 |
| 18 | ప్రస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు ... | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు ... | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ ... | 0 | 8 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | 1 | 4 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (1-2 భాగములు) | 1 | 6 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | 0 | 8 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి ... | 0 | 8 |
| 29 | రసాభరణము—అనంతకవి. ... | 0 | 8 |
| 30 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) ... | 0 | 8 |
| 31 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | 1 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ ... | C | 8 |
| 33 | అమరుకము-సాంధ్రము-జయంతిరామయ్యపంతులుగారు | 1 | 0 |
| 34 | సాంబోపాఖ్యానము-రామరాజురంగప్పరాజు ... | 1 | 0 |
| 35 | హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ... | 0 | 2 |
| 36 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి ... | 0 | 12 |
| 37 | రాయవాచకము ... | 0 | 8 |
| 38 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకోపేతము | 0 | 8 |



Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy·)**


సంపుటము. ౨౩ { భావనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.







కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచేఁ బరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు. ౩-౦-౦.

విడిసంచిక రు ౦-౮-౦.

1934.

# విషయసూచిక.



---

సేతుబంధకావ్యభూమికలో ౧౬౩-౧౭౦ పుటలను. ౧౫౩-౧౬౦ అని దిద్దుకొనవలెను.

# ఆంధ్రసాహిత్య

# పరిషత్పత్రిక.

కా కి నా డ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.



సంపుటము ౨౩. { భావనామసంవత్సరము. ఆశ్వయుజకార్తికమాసములు. } సంచిక ౪.

## శ్రీహర్షుఁడు—నాగానందము.

— ద్వివేది సూర్యనారాయణగారు—కొవ్వూరు. —

---

శ్రీమన్నాటకకవులలోఁ బ్రసిద్ధిఁజెందిన కవితిలకుఁడు శ్రీహర్షుఁడు. ఈతఁడు క్షత్రియకులజుఁ డని ప్రతీతి. అయనఁ బృథ్వీపతి యనియు: ఈతఁడు "ప్రియదర్శిక, రత్నావళి, ప్రకృతమగు నాగానందము" అను మూఁడునాటకముల రచించెను. పై నాగానందమందలి సూత్రధారుని "అస్మత్స్వామినా హర్షదేవేన అపూర్వవస్తురచనాలంకృతం విద్యాధరచక్రవర్తిప్రతిబద్ధం నాగానందం నామ నాటకమ్" అను వాక్యమును "ఉష్ణీషే"త్యాది రెండుమూఁడుశ్లోకములలోని సూచనలును నీ శ్రీహర్షుఁడు రాజనియే సాక్ష్యమిచ్చుచున్నయవి. పైఁజెప్పఁబడిన నాటకత్రయము నేకకర్తృకము కాదని యొకకింవదంతి కలదు. దానికిఁ జేయూఁతగా-మమ్మటుఁడు తనకావ్యప్రకాశికయందు "ధావకుఁ డనునొకకవి రత్నావళిని రచియించి శ్రీహర్షకవిరాజునకుఁ గొంతధనమున కమ్మె" నని యు "హర్షకర్తృకముగా నది ప్రకటింపఁబడియె" ననియు వ్రాసియున్నాఁడు." అని Professor Macdonell అను నొకసుప్రసిద్ధుని "History of Sanskrit Literature" అనుగ్రంథమునఁ గాన్పించుచున్నయది, కాని, నాటకత్రయమందలి శైలిని గమనింప నేకశైలిని గాన్పించుటయేకాక 8 వ శతాబ్దమున జీవించియున్న దామోదరగుప్తుఁడనువాఁడు తనకుట్టనీమతమున రత్నావళి రాజుచే వ్రాయఁబడినట్లు సుస్పష్టముగ

వ్యాఖ్యానించియున్నాఁడు. ఇంతియగాక "ఇత్సింగ్"అను చీనాదేశీయుఁడు "నాగానందనాటకము హర్షుఁడు వ్రాసినాఁ డని యొకచో వ్రాసె ననియుఁ గొండొకసందర్భమునఁ బైసుప్రసిద్ధునిచే వ్రాయఁబడియెను. రెండునాటకముల రచియింప సామర్థ్యముగల శ్రీహర్షుఁడు స్వీయగ్రంథములఁ బోలు నొకగ్రంథమును గొని తృప్తించెననుట కన్న వేఱ తెలివితక్కువ గానరా దని కొందఱు సాహసించి వాక్రుచ్చుచున్నారు. సత్యమఱయ నంతియః-ఇఁక గతానుగతికముగా నీకవికాలము నొకవాక్యమునఁ జొన్పి నాటకము స్పృశింతు. పైవిషయముచేఁ గావ్యప్రకాశిక వ్రాసిన మమ్మటునికంటెను, 8 వ శతాబ్దమున జీవించిన దామోదరగుప్తునికన్నను చీనాకోవిదునికన్నను కొద్దియేని ప్రాచీనుఁడు గాని యర్వాచీనుఁడు మాత్రము కాఁజాలఁడనియేకాని యీతనిపుట్టినసంవత్సరము విశదముగాఁ దెలియకున్నది.

ఇఁక నైషధకర్తయు నీతఁడు నొకరా! కాదా! యనుసంశయ మొందు హర్షనామశ్రవణముచేఁ బుట్టకమానదు. ఆతని కవితాకళకును నీనాటకకర్తకవితాకళకును సహస్రాంశము భేదముగాన్పట్టు. "అశేషశేముషీమూషమాష మశ్నామి మాతుల!" అని కావ్యకర్త. "రత్నాకరాదృతే కుత శ్చన్ద్రలేఖాయాః ప్రసూతిః" అని నాటకకర్త. ఇరువురకుఁ గలయంతరమును బాఠకమహాశయు లూహింతురుగాక! మఱియు నైషధమున సర్గాంతమందలి "శ్రీహర్షం కవిరాజ" ఇత్యాది శ్లోకమునఁ దనచేసిన చింతామణీత్యాదిగ్రంథములఁ బేర్కొనెను. అందు నాటకకర్తృత్వ మెచ్చటనుఁ గాన్పింపదు. ఇంతియగాక నైషధకర్త శ్రీశంకరాచార్యునితో వేదము పౌరుషేయ మని ప్రౌఢవాదన గావించినట్లును, అం దతనిజయించినట్లును దత్పాపనివారణకై నైషధముఁ గావింపఁబడినట్లునుఁ గొండొకయితిహాసముఁ గలదు. అట్టిహర్షుఁడు తాను జైనుఁ డయినట్లు "మొట్టమొదటి శ్లోకమున "బుద్ధో జినః పాతు వః" అని చెప్పి, ప్రథమాంకమున నాయికచే గౌరీపూజనుఁ గడుంగడు భక్తితోఁ జేయించెను. జైనమతస్థులలోనఁ గూడ నీశ్వరనిరీశ్వరవాదు లుండుటచే నందు నీశ్వరవాది యను జైనమతస్థునివలె సూచించుకొనినాఁడు. కాన పై శ్రీశంకరజేత యగుహర్షుఁడు వే ఱనియు నాటకకర్త వే ఱనియు స్పష్టమగుచున్నయది.

మఱియు నింకొకవిశేషము—మనహర్షకవిగారు తాము నాటకము వ్రాయుచు నాటకకవిమూర్ధాభిషిక్తుఁ డగుకాళిదాసునిం దనడెందమున నొకచో భద్రపఱిచికొనివ్రాసినట్లు దోఁచు-చూడుఁడిః-శాకున్తలలో నాయికాసఖు లిరువురు.

అందు నొకతెపేరు ప్రియంవద. ప్రకృతమునను నిపుణురు. ఇంకను నొకయామె పేరు చతురిక. ప్రియంవదను గాళిదాసు శకుంతలచే అవికెబిగింపుసమయమునను, నవమల్లికాసహకారములప్రశంసలోను, "అత ఏవ త్వం ప్రియంవదాసి"అని కొన్నివిలాసవాక్యములఁ బలికించెను. ప్రకృతకవిగారు మలయవతిచే "సత్యం హంజే, అత ఏవ చతురికాసి త్వమ్ కింతే పరం ప్రచ్ఛాద్యతే" ఇత్యాది భాషింపఁజేసినాఁడు. ఇట్టివియు నొకదోషములోఁ గొందఱులెక్కింతురు. కాని రసపోషణలో నిమగ్నుఁడైనకవి కవి లెక్కగావనియు, "భాషను గన్నవారెవరు? భావజగమ్ము ననంతమాపయిన్'' ఇత్యాదికము లాపైవారిని సమాధానపఱుపకపోవు. హాస్యమునుబోషించుటకు నావిదూషకునకు నీవిదూషకునకు సరిపోవును, జూడుఁడు. జీమూతవాహనునకు వైవాహికముహూర్తముంచి రాజుగారిసమక్షమున "హీ, హీ, సంపూర్ణా మనోరథాః ప్రియవయస్యస్య, అథవా నహి నహి, భవత్యాః మలయవత్యాః, అథవా నైతయోః మమైకస్య బ్రాహ్మణస్య.'' అని కొంతకాళిదాసువలె నవ్వించినాఁడు ప్రేక్షకులను.

"మధుర మివ వదన్తి స్వాగతం భృంగశబ్దైః" శాకుంతలపోకడ—నాయికతోరాజు- "శ్రమ మలం తపస్యైవ గతా పునః కిమితి సంభ్రమకారిణి ఖిద్యసే" దుష్యంతుఁడు నొక్కట నీరీతి ననుకొనును—

మలయవతి-"ఏకతో గురువచనం అన్యతో దయితదర్శనసుఖాని''
గమనాగమనవిమూఢ మద్యాపి డోలాయతే హృదయమ్.

దుష్యంతుఁ డొక్కచో వివాహసమయమున నిట్లేసందేహించి తుదకు "అథవా సందేహేన" అని సందేహనివృత్తి సల్పుకొనును.

కాళిదాసు-"చీనాంశుక మివ కేతోః ప్రతివాతం నీయమానస్య''
హర్షుడు- "అద్యాపి డోలాయతే హృదయమ్.''

కాళిదాసుని తపోవనచ్ఛాయలు.

హర్షుఁడు- "దక్షిణం స్పన్దతే చక్షుః"
"సురభిహరిద్గంధగర్భితోద్దామధూమనిర్గమం''
"అనుద్విగ్నసుఖనిషణ్ణశ్వాపదగణం సవిశేషఫలస్నిగ్ధపావనవిశోభి తపోవనం"-భవభూతిపోలిక.

శైలీభేదముమాత్రము చాలఁగలదు—
"తాపసకుమారికాపూర్యమాణబాలవృక్షాలవాలస్య తపోవనస్య"

"ఈషద్వలితకన్ధరాః, సుఖనిమీలితలోచనాపి, ఆకర్ణయన్త ఇవ హారిణః"

"దన్తాన్తరాళస్థితతృణకబలచ్ఛేదశబ్దమ్'' ఇత్యాది హారిణాదివర్ణనల నచ్చటచ్చట- కాళిదాసునిపోలికలఁ జూపుచు లలితభావహృదయంగమన రచనతో నిడిగాన్పించు.

ఈకవి జ్యోతిశ్శాస్త్రవేత్తయనియు సంగీతవేత్తయనియు,పైఁగాఁదోఁచుచున్నయది.

"ఉష్ణీషే"త్యాది శ్లోకముం జూడఁదగును. జ్యోతిర్విద్యకు - అతోద్యానుగతోచ్ఛ వాద్యవిధయః సమ్యక్ప్రయోదన్యతాః -సంగీతమున కుదాహృతము—

నాటకమధ్యమునఁ బతాకాస్థానములపట్ల (కావ్యార్థసూచనలు) నతిజాగరూకుఁడై నాఁడు కవి. మొట్టమొదట ననన్యాదృశఫణితి నాటక మాఁటలోఁ గథకుఁ దా విచ్చినరీతిఁ జూడుఁడు. "వనం యా మ్యహా మన్యైవ యథాజీమూతవాహనః-కథాసూచనకు-''మన్యే ఇహ వసతీ మస్మాకం నివృత్తిః'' ఇట్టివి చాలఁ గలవు. విసువుకతమున విరమింతు.

మఱియు నీకవిమీఁద నొకదోష మారోపింపక తీరకున్నది. ఏమన:—నాయికానాయకులకు మునుగా దృష్టమనస్సంగాదులఁ గల్పించుటకు గౌరీపూజ చేయుసమయమున నతివిరాగి యైనరాజును నామెముందు దింపుట యుక్తమైన కల్పనమే. కవిగారి పాత్రపోషణాపైదుషియే, కాని, తత్క్షణము తొట్రుపడినది గాఁబోలు కవిహృదయము. చిన్నకళంక మొందు తెచ్చినాఁడు. మొదటినుండియు "వాసోర్ధందయయేవ"ఇత్యాదులచే రాజును బహువిరాగివలెఁ జూపి హాస్యగానిమాటలకు లోఁబడఁజేసి అవస్థాపరిణామముఁ జూపకయే తత్క్షణము నతాత్తుగా నావిరాగునిచే,

"అనయా జఘనాభోగభరమన్థరయా తయా
అన్యతోపి వ్రజన్త్యామే హృదయేనిహితం పదమ్" ఇత్యాది శృంగారసాధారణమైన ఖేమజముల నంతలో నవ్యవధానముగఁ గల్పించెను. ఇంతియగాక-

''విదూషకః-(అనిచ్ఛన్తమపి నాయకం బలా దాకృష్య)...''స్వస్తి భవత్యై'' ఇత్యాదినిగల్పించి రసమును గూలఁద్రోయుట యుక్తము గానేరదు.

ఆకల్పనయే గాని మఱియొక పాత్రచేఁ జూపించిన నింతకంటె బాగుగ నుండునేమో, కాని, వీని కాయధికారమిచ్చుట నసమంజసముగాఁ దోఁచును.

''గ్రుడ్డిలోమెల్ల" యనునట్లీసందర్భమున

...............................................''ధ్యానావసం

భక్త్యా యాతి యదీత్థమేవ పితరౌ శుశ్రూషమాణస్య మే!-
భూపరిపాలకుఁడైన మహారాజున కింతవైరాగ్యమును వర్ణించినను జ్ఞానవైరాగ్యమును దాఁటింపలేముకావున సామంజసత్వ మొప్పు.

"స్వశరీరం ప్రభృతి సర్వం పరార్థమేవ మయా పరిపాల్యతే" "న్యాయ్యే వర్త్మని యోజితాః ప్రకృతయః" ఇత్యాదిచే లౌకికనైరాగ్యమును జెప్పించెను గావున నేఁ రాజ్యము భ్రష్టముకాలేదని సూచించుటయు నాయికానాయకపోషణలోని మనీషితాచాకచక్యము-ఏతాదృశమైన రసాదిపోషణలనముష్టియే నాటకరాజము.

ఇందలిసాహార్ద రచనను గొంత యనుకొనుట యుక్తమై యున్నది కాన నద్దియుఁ గొంతయనుకొందముగాక —

''కిం మధుమదనోవక్షఃస్థలేన లక్ష్మీ మనుద్వహన్నివృత్తో భవతి''
"చన్దనలతాగృహ మిదం సచన్ద్రమణిశిలా మపి ప్రియం నమమ."
''చన్ద్రాననయా రహితం చన్ద్రికయా ముఖమివ నిశాయాః"
''నిమ్వ్రత ఇవానేన ముఖచన్ద్రోదయేన తే ''
ఏతద్బాష్పాంబునా సిక్తం చన్ద్రకాన్తశిలాతలమ్''

ఇత్యాది హృద్యములైన బీజములు మ్రుత్తియములభాతి మధ్యమధ్యను నాటఁబడి వెలుఁగొందుచున్నయవి.

ఈహర్షునకు — "ప్రియా సన్నిహితైవేయం సంకల్పస్థాపితా పురః
దృష్ట్వా దృష్ట్వా ప్రలిఖ్యేనాం యదిత త్త్రోత్రవిస్మయః''

అని యొకపంచజాతీయవర్ణికను దెప్పించి మలయవతిచిత్తరువు నొకదానిని గల్పించెఁ గానఁ గొంతచిత్రకళాప్రవేశ మున్నదని యనుమానించుట కనువుపడుచున్నది. నాయిక సత్కులప్రసూత యని తెల్పుటకు నాయకునియం దొకశంకను గల్పించి "చతురికే జ్ఞాతం ఖలు కథావసానం త దేహి తావత్" అని యనిపించి చతురికచే "అన్యాదృశ మస్యాఃహృదయం ప్రేక్షే తన్నగమిష్యామి ఇహైవాపవారితా ప్రేక్షే కి మేషా ప్రతిపద్యతే" అని రసాలవృక్షచ్ఛాయను చతురికను మాఁతవెట్టి నాయికకు నుడియవస్థవలకును జూపించి యామెచేఁ బాతివ్రత్యములోని యేకాగ్రతను జగమునకు వెల్లడింపఁజేసెను. దీన నిందలిచతురికయుఁ గడుసమర్థురాలు.

ఇఁక నొకసంగతి. మిత్రావసునిరాక నెఱిఁగి పంచజాతీయ వర్ణికారచితమైన నాయికాచిత్రమును నొక లేఁతయరఁటియాకులోఁ గప్పించిన కవి విధా

షక దృష్టి కడుఁ బ్రశంస్యము. మఱియు మహాసత్త్వ, గంభీర, అవికత్థన, దయాళు, రూపకగుణములు నాయకాలక్షణమున ధీరోదాత్తునివి గాన నవ్వియు నిట నుండె ననుటకుఁ గాఁబోలు- ఇంతవఱకు మలయవతీవ్యామోహితుఁ డైనరాజును మిత్రావసువుతోఁ "నశక్యతే చిత్త మన్యతః ప్రవృత్తమ్ అన్యతః ప్రవర్తయితుమ్" అని పల్కించెను, కాని "కథం ప్రత్యాఖ్యానలఘు ర్మిత్రావసుః పునరపి మాంత్రయతే" అని ముగ్ధా నాయికఁబోలెఁ జూపుచున్నాఁడు మలయవతిని—

వెనుక కవిమీఁద నారోపించిన దోషమువంటిది మఱి యొకటియు దాని పరిహారమును—

ఇందు నాయకుఁడు, జీమూతవాహనుఁడు, ధీరోదాత్తుఁడు. నాటకనాయకుఁడు. మహాసత్త్వాదిగుణవిశిష్టుఁడు, ధీరోదాత్తుఁడు, అని ధనంజయాది లక్షణకర్తలు నుడువుదురు. "ఔదార్య ముండుట—అని నాయకలక్షణమందలి నిష్కృష్టార్థము. ఆయౌదార్యము విజిగీషువునియందుఁ గాన్పించు. మననాయకునకు విజిగీషుత్వ మెట్లు?

"ఆయాసః ఖలు రాజ్య ముజ్ఝితగుణః తత్రాస్తి కశ్చి ద్గుణః" ఇత్యాదులచే నాయకుఁడు మహాశాంతుఁడు పోలెను నిర్జిగీషువువోలెను జూపుచున్నాఁడు. ఇది యెట్లు? అని ధనంజయుఁడు దశరూపకమున శంకించియున్నాఁడు. కాని పీతరాగుఁడు నాయకునిచే నట్టిమలయవతీసౌహార్దాభివర్ణనముఁ జూపించిన కవి యీపాటిదానికిఁ దగఁడా? అనుశంకకుఁ దావున్న దిచట- కాని మహాభాగుఁడు ధనంజయుఁడే యద్దానిని సమర్థించుకొని తృప్తిపడుచున్నాఁడు. అది యిట్లు- ఎవఁడు శౌర్యత్యాగదానాదులచే నితరుల నతిశయించునో వాఁడు విజిగీషువు. కాని యొరుల కపకారాదులచే నర్థమును గ్రహించెడువాఁడు విజిగీషువు కాఁడు. అని కొంత ముచ్చటించుచు మనజీమూతవాహనుఁడు నితరులకై ప్రాణములఁ ద్యజించువాఁడు, కాన, లోకులను నతిశయించుచున్నాఁడు. కాన నుదాత్తతకు లోటు లేదు. కావున "ఆయాసః ఖలు" ఇత్యాదులలో విషయసుఖపరాఙ్ముఖత్వము నిశ్చయమైనను కేవలస్వార్థపరు లగుపశువులముందు నిరభిలాషులైన మహాత్ములే జిగీషువులు-చూడుఁడి:—

నాగానందము- స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తి రేవం విధైవ

అనుభవతి హి మూర్ధ్నా పాదప స్తీవ్ర ముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్.

ఇది గరుడుఁడు నాగులను దినదినము భక్షించుటఁ జూచి మననాయకుఁడు జీమూతవాహనుఁడు-ఉపాయాంతరముచే వాని కాహారమైన సమయమున గరుడునితో నిస్సందేహముగఁ దన్ను భక్షింపు మని యత్యుదాత్తబుద్ధితోఁ జెప్పెను. ఇందలి యుపమానము కడు రామణీయకము. "మండుటెండను పైని భరించుచు ఆశ్రయులకుఁ బరితాపము బోఁగొట్టు చెట్లు లేవా? కాన నే నట్టివాఁడగాన నన్ను భక్షించినను నే విచారింపను.'' అని కొంత యుపన్యసించి గరుడుని తుట్టతుదకు జయించి విజిగీషువగును. కాన నీతని యౌదాత్త్యమునకు నాయకత్వమునకు లోటించుక గానరా దని కడు యుక్తియుక్తముగా సమర్థించెను. పై విషయము ధనంజయునిరచనలోని నిష్కృష్టార్థమునకుఁ దెనుఁగని యూహించుకొనఁ బ్రార్థితులు.

ఇఁక నీతనికవితలోఁ గొంత భావోద్రేకము- భావకవులభాషలో (లోకములో) కవిత్వ మని దీనినే వాడుదురు, చూడుఁడి-

"నఖలు నఖలు ముగ్ధే సాహసం కార్యమీదృక్
వ్యపనయ కర మేత త్పల్లవాభం లతాయాః
కుసుమ మపి విచేతుం యోనమన్యే సమర్థః
కలయతి స కథం తే పాశ ముద్బంధనాయ.

ఇత్యాది సాలంకారశ్లోకములఁ జూడనగును-
శైలీప్రదర్శనార్థమై కొండొకశ్లోక ముదాహరించి యింతటితోఁ దృప్తింతు.

య ద్విద్యాధరరాజ్యవంశతిలకః ప్రాజ్ఞ స్సతాం సమ్మతః,
రూపే ణాప్రతిమః, పరాక్రమధనః, విద్వాన్, వినీతో, యువా,
యచ్చాసూనపి సత్యజేత్ కరుణయా సర్వార్థమభ్యుద్యత
స్తేనాస్మై దదతః స్వసారమతులా తుష్టి ర్విషాదశ్చ మే.

ఇందలి మూఁడవపాదము కేవలము కావ్యార్థసూచనకై కల్పితము. కవిగారు కనిత్వము వ్రాయుటకై చెమటల నూర్చి రని సంతసించుచు దీని నింతటితో విరమించుచున్నాఁడను.

---

# సర్వేశ్వరా.

రావిపాటి లక్ష్మీనారాయణగారు—గురజాల.

---

శా. చీమం జూచిన యంతఁ దోఁచెడు భవత్సృష్టిప్రభావం బహో
యేమీ యబ్బుర మింత చిన్న క్రిమి కె ట్లీరీతి నిర్మించినా
వో ముక్కుం గనులుం బదంబులు శిరంబున్ నాడులున్ శ్రోత్రముల్
రోమంబుల్ పలురోగముల్ రుధిరమున్ లోకేశ సర్వేశ్వరా. ౧

మ. ఇనచంద్రావనితారకల్ సకల మీవే కావె; నీమాయచేఁ
దనుబోలెం బరునెంచుటల్ సహజమౌ; దానన్ నిరాకార నిన్
మనుజాకారముగా నరుండు దలఁచున్; సర్వాత్మ నిన్నెన్నుచో
శునకాకారముగా నిను న్శునక మెంచుంగాదె సర్వేశ్వరా. ౨

శా. నీకుంబుట్టిన పద్మమందు జనియించెన్ బ్రహ్మయుం చంద్రు నీ
యాకారం బది జ్యోతిరూప మనియం చద్దంబునన్ దీప మే
జోకం గన్పడుఁ బద్మమందు నటులం జూపట్టె జానైన నీ
యాకారంబె విరించిగా నచట శూన్యాకార తప్పేఁ గదా. 3

గీ. ఎట్టులైన నీమహిమంబు నెఱుఁగఁ గోరి, తివిరి పెక్కుతావులయందుఁ ద్రిమ్మటియును
నరయఁగా లేక నీవు నవ్యక్తుఁడ వని, భ్రమర మవ్యక్తరవమునఁ బాడుచుండు. ౪

సీ. నీమహితోన్నతి న్నీర మారయుట కావిరిరూపమునఁ బైకి వెడలి వెడలి
యెవరస్టువఱకును నేగి కన్గొనలేక పదములెల్లనుఁ జల్లఁబడఁగ మెల్ల
గనుజాఱి నలువంకలనుఁ బాఱి పలుతిప్పలనుఁ బడి కూడఁ గన్గొనఁగ లేక
భవదీయపరిమాణపారంబునైనఁ గభీరతనైన గాంభీర్యమైన
నరయఁగాఁ గోరి వారిధి యగుచుఁ బఱచి, భంగపడియుచుఁ గన్గొనఁ బటిమ లేక
నిఖిలమును బుద్బుదంబుచు నీవనంత, మంచు భంగముఖమున ఘోషించుచుండు.

---

గంగానదీసమీపదేశము నేలినభవనాగుఁడు పద్మావతీపురపాలకు లైననాగుల వంశములోనివాఁడై యుండవచ్చును. మొదటి రుద్రసేనునివిషయమై మన కేమియుఁ దెలియదు. అతనికుమారుఁ డైన పృథ్వీషేణుఁడు చిరకాలము రాజ్యముచేసెను. Vincent A. Smith పండితుఁడు నాచ్నలో (Nachna) దొరకిన యొకశాసనము (Gupta Inscrip. No. 53, 54, p. 233) ఈరాజు దని చెప్పుచున్నాఁడు. కాని యా Smith పండితుఁడు తాను వ్రాసినగ్రంథమందు మఱియొక పృథ్వీషేణుఁ డున్నాఁ డని చెప్పు Balghat శాసనములను లక్ష్యము సేయనట్లు కానవచ్చుచున్నాఁడు. ఈనాచ్నాశాసనము మొదటి పృథ్వీషేణుని కాలమందుఁ బుట్టినదా లేక రెండవపృథ్వీషేణుని కాలమందుఁ బుట్టినదా ? ఆవిషయమును మనము విచారింపవలయును. శాసనాక్షరపంక్తియొక్క యాకారమును విచారింపఁగా రెండవపృథ్వీషేణునికాలమందుఁ బుట్టిన దని నేను దలంచెదను. ప్రత్యక్షరముయొక్క తలమీఁదనున్న చిన్నసున్నవలన నాలిపి యయిదవశతాబ్దమునాఁటి దని మన మూహించుకొనవచ్చును.

అజంతశాసనములోని యెనిమిదవశ్లోకము మొదటిపృథ్వీషేణుఁడు కదంబవంశపురాజైన కుంతలుఁ డను వానిని జయించె నని చెప్పుచున్నది. దానికిఁ దరువాతశ్లోకము బొత్తిగాఁ జెడిపోవుటచేఁ జదువశక్య మైనది కాదు. ద్వితీయరుద్రసేనుఁ డనుపేరు కానరాకుండ నున్నది. ఈరాజు గుప్తవంశములో నుదాహరణభూతుఁ డైన ద్వితీయచంద్రగుప్తునిపుత్రిక యగుప్రభావతిని వివాహ మాడెను. ఈవివాహము క్రీ. శ. 395 లో జరిగె నని Smith పండితుఁడు తలంచుచున్నాఁడు. (J. R. S. A. 1914 p. 326) ఇది యొప్పుకొనఁ దగి యున్నయది. ఈకాలమందే ద్వితీయచంద్రగుప్తుఁడు (Western Satrapas) పశ్చిమక్షత్రపుల రాజ్యమును వశపర్చుకొని వాకాటకరాష్ట్రమునకుఁ జేర్చెను.

K. B. పాఠక్పండితునిశాసనములలో (Ind. Antiquary 1962 p. 215) విధవ యగు ద్వితీయరుద్రసేనునిభార్య ప్రభావతీరాణి తనకుమారుఁ డగుయువరాజ దివాకరసేనుని బాల్యమం దొకభూదానము చేసె నని చెప్పఁబడి యున్నది. ద్వితీయరుద్రసేనుఁడు వివాహమైన కొలఁదికాలములోనే మృతినొందె ననియు A. D. 400 సం॥ లో గుప్తచక్రవర్తి కొమార్తె ప్రభావతి వాకాటకరాజ్యమునకు రాజప్రతినిధిగా నేర్పడె ననియు మొదటిపృథ్వీషేణుఁడు కదంబరాజైన కుంతలు నోడించె ననియు నిదివఱకే చెప్పఁబడెను. కుంతలదేశము కదంబుల రా

జ్యము. బెలగామ్‌జిల్లాలో నున్న హాలిసీపట్టణ మొకప్పుడు పలాసిక యనునామాంతరము గలదియై కుంతలరాజ్యమం దుండెను. (Ind. Epigraphy XIII p. 215). (Kadamba Inscriptions - verses 58-62) వాకాటకులు కదంబులకుఁ బ్రత్యనంతరులు. వాకాటకరాజ్యము కృష్ణానదీతీరమందున్న కర్నూలువఱకు వ్యాపించెను. కర్నూలుజిల్లాలో నున్న శ్రీశైల మను ప్రసిద్ధపుణ్యక్షేత్రమును మన మెఱుంగుదుము. చంద్రగుప్తుఁడను గుప్తరాజు పుత్త్రిక యగుచంద్రవతి శ్రీశైలేశ్వరునికిఁ బ్రతిదినము మల్లికాకుసుమమాలిక నొకదానిని సమర్పించుచుండె నని స్థలపురాణమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈవృత్తాంతము విష్ణుకుండివంశోత్పత్తిని దెలియఁజేయుటకు మిక్కిలి యుపయోగించునది. ఇందువలన నీవంశమువారికి శ్రీశైలపతి యిలువేల్పనియు నీవంశమునఁ బుట్టినమొదటిరాజు మాధవవర్మ, విష్ణుకుండివంశమందుఁ బుట్టినరాజకుమారికను వివాహమాడె ననియుఁ దెలిసికొనుచున్నాము. ఈరాజకుమారిక ప్రభావతికిఁ గాని రెండవరుద్రసేనుని భార్యయు రెండవప్రవరసేనుని తల్లియు శివభక్తురాలును నగు చంద్రవతికిఁ గాని కూఁతురో మనుమరాలో యై యుండుట కేవిధమైన సంశయము లేదని నేను దలంచెదను. ఇప్పుడు హైదరాబా దని వ్యవహరింపఁబడు రాజ్యము నంతను నేలిన వాకాటకవంశమువారు వాకాటకరాజకుమారిని వివాహముచేసికొనిన ప్రథమ మాధవవర్మను వేంగిసింహాసనముపై నెక్కించుటవలన విష్ణుకుండినుల వంశములను స్థాపించుటయందు నెఱవేఱుట ద్వితీయప్రవరసేనునికాలమందే ప్రాయికముగా జరిగియుండవచ్చును.

యువరాజదివాకరసేనుఁడు రాజ్యసింహాసనము నధిష్ఠించెనో లేదో మనకుఁ దెలియదు. ద్వితీయరుద్రసేనునికుమారుఁడు ద్వితీయప్రవరసేనుఁ డనునామముతో రాజ్యపాలన మొనర్చె నని మనము నిశ్చయముగా నెఱుంగుదుము. బాణకవి తాను రచించిన హర్షచరిత్రపీఠికలోఁ దనకంటెఁ బూర్వు లగు సుప్రసిద్ధమహాకవులను బేర్కొనుచు నీప్రవరసేనుఁడు సేతుకావ్యమును రచియించె నని చెప్పెను. ప్రవరసేనుని రాజధాని ప్రవరపురము. ఇతఁడే దానిని నిర్మించినవాఁడై యుండవచ్చును. ద్వితీయప్రవరసేనుఁడు జబ్బలుప్పూరునకు దక్షిణముగా నున్న దేశమును బరిపాలించె నని చెప్పుట కేవిధమైన సందేహమును లేదు. ఆప్రదేశమందిపుడు నియోని, ఇలిచపూరు, అను రెండుపట్టణములు లేచినయవి. నర్మదానది గుప్తరాజులరాజ్యమునుండి ప్రవరసేనుని రాజ్యమును వేఱు చేసెను. చాళుక్

(చర్మాంకము) మహానదీతీరమం దున్నది. (Gupta Inscriptions p. 241.) వాకాటకరాజ్యము దక్షిణమునఁ జాలదూరము వ్యాపించిన దని యిదివఱకుఁ జెప్పియున్నాము. A. D. 450 లో వాకాటకరాజ్యమునకు సహ్యాద్రి లిపి—ఉత్తరమున మహాప్రసిద్ధుఁ డైన ప్రథమకుమారగుప్తుని యేలుబడిలోనున్న యుజ్జయినీరాజ్యమునుండి నర్మదానదివలన నిది వేఱుచేయఁబడెను. తూర్పున రామపూరనుసామంతరాజ్యము, దీనిని గుఱించి యిఁకముందు మాటాడెదము. మహాసుదేవుఁ డనురాజుయొక్క రాజధాని శరభపురము. విష్ణుకుండినుల రాజ్యము తూర్పుదక్షిణముగా నున్నది. దానిని మొదటి మాధవవర్మ వేంగిలో నుండి పాలించుచుండెను. దక్షిణపశ్చిమమున భీమనది కదంబులరాజ్యమునుండి వాకాటకులరాజ్యమును వేఱుచేసెను. ఆకదంబులకు శాంతివర్మ రాజు. అతఁడు సకలకర్ణాటరాజ్యమున కధిపతిగా నుండెను. పలాశికాపుర మతనిరాజధానులలో నొకటి. పశ్చిమమున త్రైకూటు లపరాంతము నాక్రమించిరి. ఈరీతిగా వాకాటకులు మధ్యభాగము నంతను నేలిరి. ఈవంశముచేతనే గుప్తరాజ్యముయొక్క నాగరకత, సంస్కృతభాషావిజ్ఞానము డక్కనులోఁ బూర్ణముగా వ్యాపించెను. క్రీస్తు వెనుక నాలుగయిదుశతాబ్దములయందు, వీరు సర్వాతిశాయి యగు నౌన్నత్యము నొందియుండిరి. డక్కనుచరిత్రములో నైదవశతాబ్దము వాకాటకులశతాబ్ద మని చెప్పవచ్చును. ఈవంశపుశాసనములలో నున్నయక్షరములు మిక్కిలి విచిత్రముగా నున్నవి. ప్రత్యక్షరమునకుఁ దలకట్టు పెట్టవలెనుండును.

అజంతశాసనముచొప్పున ద్వితీయప్రవరసేనునికుమారుఁ డజ్ఞాతనాముఁ డెనిమిదిసంవత్సరములు ప్రాయము గలవాఁడై యున్నపుడు సింహాసనము నెక్కియుండవచ్చును. కాని యీరాజపుత్రుఁడు నరేంద్రసేనుఁడను తనతమ్మునిచే రాజ్యసింహాసనభ్రంశము నొందింపఁబడెను. ఈనరేంద్రసేనుఁడు స్వకుటుంబమువారిసంపద నంతయును దానే హరించె నని బాలఘాట్ శాసనములలోఁ జెప్పఁబడియున్నది. ఇతఁడు కుంతలేశ్వరునికొమార్తయగు నజ్ఝితభట్టారికను, A. D. 445 లోఁ బెండ్లియాడెను. ద్వితీయరుద్రసేనుఁడు ద్వితీయచంద్రగుప్తునికొమార్తను A. D. 395 లో వివాహము చేసికొనియె నని మే మొప్పుకొంటిమి. నరేంద్రసేనునాజ్ఞలను కోసలమేకలమాళవదేశాధీశ్వరులు మన్నించి రనియు నితఁడు స్వభుజపరాక్రమ నమితాశేష శత్రుమండలుండని బాలఘాట్ శాసనములు చెప్పుచున్నవి. A. D. 467 సం॥ తరువాత నీతఁడు మాళవరాజును జయించెను. ఈ

కాలమునకు ముందు నరేంద్రసేనుఁడు మాళవరాజును స్వాజ్ఞానువర్తిఁగాఁ జేసి కొనియె నన్నవిషయ మసాధ్య మని తోఁచుచున్నది. నిజముగా A. D. 455 మొదలుకొని 467 వఱకు నుజ్జయినికి రాజుగా నున్నవాఁడు స్కంధగుప్తవిక్రమాదిత్యుఁడు. (Mr. Panna Lal in "The dates of Skantha Gupta and his successors–Hindustani Review, January, 1918) స్కంధగుప్తుని రాజ్యపరిపాలనకాలము A. D. 467 తో నంత మయ్యె నని పన్నాలాల్ వాదించుచున్నాఁడు.

నరేంద్రసేనుని కుమారుఁ డగు ద్వితీయపృథ్వీషేణుని రాజ్యపరిపాలనకాలమందు, బాలఘాట్ శాసనములు వ్రాయఁబడినవి. ద్వితీయ పృథ్వీషేణునికాలమందో వానికిఁ దరువాతనో దేవసేనుఁడు రాజ్యము చేసె నన్నసంగతి కనుఁగొనుట మిక్కిలికష్టము. బహుశః అతఁడు రాజ్యము చేయుట, అయిదవశతాబ్దాంతమం దని దోఁచుచున్నది. దేవసేనునిమంత్రి యగుహస్తిభోజుఁ డజంతకుఁ బడమటవైపు పదునొకండుమైళ్లదూరమం దున్నగుల్వారా దగ్గఱ నున్న ఘటోత్కచగుహను ద్రవ్వించినవాఁడై యుండును.

దేవసేనుని కుమారుఁడగు హరిషేణుఁడు A. D. 500 మొదలుకొని 550 వఱకు రాజ్యముచేసి యుండవచ్చును. ఈరాజు సకలదిశలందు దండయాత్రలఁ జేసి యుండవచ్చును. ఏలయన, అజంతశాసనము కుంతల, అవంతి, కళింగ, కోసల, త్రికూట, లాట, ఆంధ్ర దేశములను జెప్పుచున్నది. ఈకార్యము లన్నియుఁ బ్రాయికముగా A. D. 500—515 మధ్యను జరిగియుండవచ్చును. పలాశికానగరము నేలుచున్న శ్రీవిష్ణువర్మ రవివర్మను 500 సం॥ లో వధించెను. కుంతలదేశాధీశ్వరునితో జరిగిన యుద్ధమందు హరివర్మకూడ సహాయముచేసి యుండును. ఆఱవశతాబ్దమం దున్న త్రైకూటులను గుఱించి లేఖ్యప్రమాణ మేద్దియు లభింపలేదు. కావున హరిషేణుఁ డీశతాబ్దారంభమందు వాని నన్నింటిని నశింపఁజేసి యుండవచ్చును. ఆఱవశతాబ్దప్రారంభమందే కళింగదేశపురాజైన యింద్రుఁ డనువాఁడు విష్ణుకుండినవంశస్థుఁడైన యింద్రునితోఁ బోరాడెను. హరిషేణుఁడు కళింగాంధ్రదేశాధీశ్వరులకార్యములయందు మధ్యవర్తిగా నుండెను. భానుగుప్తుఁడు కోసలరాజైన శరభుఁ డనువానిచే నొకయుద్ధమందు సహాయము చేయఁబడెనని 510—11 లోఁ బుట్టిన ఇరాన్ శాసనము చెప్పుచున్నది.

ఆఱవశతాబ్దమధ్యమందు కలిచురివంశస్థులు వచ్చి నాసక్, ఉజ్జయిని మధ్యనున్నరాజ్యమును వశపఱుచుకొని వాకాటకులను బాఱఁద్రోలిరి.

The Vakataka Dynasty of Barar in the 4th & 5th centuries by A. C. Vincent Smith.

అనేకశతాబ్దములనుండి వాకాటకవంశము పేరు, ఉనికి, కూడ బొత్తిగా మఱవఁబడినది. కాని మధ్యపరగణాలలో (Central Provinces) దొరికిన తామ్రశాసనములను 1836 సం॥రములోఁ బ్రకటించుటవలనఁ బ్రాచీనహిందూదేశచరిత్రనుఁ గృషిచేయువారి కీవంశవృత్తాంతము కొంత తెలియవచ్చినది. అది మొదలుకొని యప్పుడప్పు డనేకస్థలములయందుఁ గనిపెట్టఁబడిన శిలాశాసనములవలనను దామ్రశాసనములవలనను నీవంశమును గుఱించిమఱికొంత వృత్తాంతము పలబ్ధ మైనది. కాని యితరరాజులనువలె నీవాకాటకవంశమువారికిఁ జెల్లుబడిలో నున్న నాణెము లెవ్వియు నున్నట్లు కానరావు. ఈవాకాటకశబ్దమున కర్థ మేమో మనకుఁ దెలియదు. వీరు స్వదేశీయులో విదేశీయులో యాసంగతి కూడ నిర్ణయింపఁజాలము. ఈవంశ మేదేశమునందుఁ బుట్టినదో దానిని గూడ మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము. విదిశారాజ్య మేలిన రాజవంశములవారినిఁ జెప్పు కొన్ని పురాణములందు దస్పష్టముగా సూచన చేయుటయే తప్ప సంస్కృతవాఙ్మయము దెవ్వనిని జెప్పఁబడి యుండలేదు. పార్జిటర్ పండితుఁడు పరిశీలనచేసి యేర్చికూర్చిన పుస్తకమునుండి కొన్ని శ్లోకముల ననువదించియున్నాఁడు. వాని నీదిగువను వ్రాయుచున్నాఁడను.

"వీరు విదిశా భవిష్యద్రాజులు. భోగి యనువాఁడు నాగరా జైన శేషుని కుమారుఁడు. ఇతఁడు శత్రుపురవిజేత. నాగవంశోద్ధారకుఁడు. ఇతనికిఁ దరువాత సాధుచంద్రుఁడు, చంద్రాంశుఁడు, వీనియనంతరము దానధర్ముఁడు, వంగారుఁడు నాల్గవవాఁడు. పిదప భూతినందుఁడు. ఇతఁడు విదిశారాజ్యము నేలును. శుంగవంశ మంతమైన తరువాత శిశునంది యనువాఁడు రాజ్యముచేయును. వానితమ్ముఁడు నందియశుఁడు. వానివంశమందు ముగ్గురురాజు లగుదురు. వాని దౌహిత్రుఁడు శిశుకుఁ డనువాఁడు పురికకు రాజగును. వింధ్యశక్తికుమారుఁ డైన ప్రవీరుఁడు వాంచనకపురమం దఱువదేండ్లు రాజ్యముచేయును. బహుదక్షిణలతో వాజపేయము నొనర్చును. వానినలుగురుపుత్రులు రాజులగుదురు."

పై శ్లోకములలోఁ జెప్పఁబడిన దేశము మధ్యహిందూదేశము. (Central India) విదిశ యనునది గ్వాలియర్ ఎస్టేటులోఁ బ్రవహించుచున్న బెట్వా నదీతీరమందున్న భిల్సా (Bhilsa). అసాధారణనామ మగువింధ్యశక్తి యను పదము వాకాటకవంశవృక్షమందు ప్రధానమయినయది. "ప్రవీర" యనుపదము

ప్రవరసేనునికి నామాంతరము. ఇతఁడు వాకాటకవంశపురాజులలో మొదటి మహారాజు. చామక్ శాసనమునుబట్టి చూడఁగా నితఁడు వాజపేయమును నాలుగశ్వమేధములను మఱికొన్ని క్రతువులను జేసినట్లు కాన వచ్చుచున్నయది. వాజపేయముఁ జేసె నని పురాణములయందుఁ జెప్పఁబడిన ప్రవీరుఁ డనువానికే ప్రవరుఁడని నామాంతర మున్నట్లు తోఁచుచున్నది. పైన వ్రాయఁబడిన పురాణ శ్లోకములలోఁ జెప్పఁబడిన నాగవంశపురాజులతో వాకాటకులను శాసనములు కలుపుచున్నవి. చరిత్రమును దెలియఁజేయు లేఖప్రమాణ మెద్దియు లేకపోయి నను ఖండఖండములుగా నున్న యీవాకాటకకుల చరిత్ర మాధిక్యము లేనియది గాను దెలిసికొనుట కాదరము గలుగఁజేయనిదిగా నుండలేదు. చిరకాలము క్రిందట Buhler పండితుఁడు దృఢమయిన యాథార్థ్యముతో సంక్షేపముగాఁ జెప్పిన వారికాలనిర్ణయ మశుభ మైనప్రతిజ్ఞచే దుర్జ్ఞేయ మైనది. దానిని స్వీక రించినయెడల వాకాటకులకును గుప్తవంశస్థులకును గలపరస్పరసంబంధము మా టుపడును. అదిచారిత్రవిషయక మైన హైందవవిజ్ఞానము నాకులముగాఁ జేసెను. కొలఁదికాలముక్రిందట సమర్థుఁడైన విద్వాంసునిచేఁగనుఁగొనఁబడిన విషయము బుహ్లర్ పండితుని యభిప్రాయము దృఢమయినదనియును నతఁడుచేసినకాలనిర్ణ యము సత్యమనియు నిర్వివాదముగా స్థాపించినది. ఈవిధముగా వాకాటకులు చక్రవర్తు లయిన గుప్తరాజులతోడ సంబంధమును గలవారుగాఁ జేయఁబడిరి. ప్రా చీనగుప్తరాజులకాలము నాఁటి శిల్పము ప్రతిమానిర్మాణచాతుర్యమును వెల్లడించు చున్నది. ఇట్లు నూతనాంశములను గనుఁగొనుటవలనఁ దేలినఫలితములు వాకా టకచరిత్రమున కున్నసాక్ష్యమునంతను విమర్శించుటకును దీనికాలమును నిర్ణయిం చుటకు నర్హముగాఁ జేయుచున్నవి.

చామక్, సివానీ, దూధియా శాసనములవలనఁ దేలిన వాకాటకవంశ వృత్తాంతము.

|

మొదటిమహారాజప్రవరసేనుఁడు.

|

గౌతమీపుత్త్రుఁడు- ఇతఁడు భవనాగమహారాజపుత్రికను బెండ్లియాడెను.

|

మొదటిమహారాజరుద్రసేనుఁడు.

|

మహారాజపృథ్వీషేణుఁడు.

|

రెండవమహారాజరుద్రసేనుఁడు. ఇతఁడు మహారాజాధిరాజదేవగుప్తుని
పుత్రిక యగు ప్రభావతీగుప్తను బెండ్లి యాడెను.

|

ద్వితీయమహారాజప్రవరసేనుఁడు.
అజంతశాసనము. నెం. 622 వింధ్యశక్తి.

|

మొదటిప్రవరసేనుఁడు.

|

మొదటిరుద్రసేనుఁడు.

|

రెండవరుద్రసేనుఁడు.

|

పృథ్వీషేణుఁడు. (ఇతఁడు కుంతలరాజును జయించెను.)

|

రెండవప్రవరసేనుఁడు.

|

అనామధేయపుత్రుఁడు. ఎనిమిదవయేఁట రాజయ్యెను.

|

దేవసేనుఁడు.

|

హరిషేణుఁడు.
(ఇతఁడు కుంతలావంతికళింగకోసలత్రికూటలాటాంధ్రదేశములను జయించెను.)
పాతక్పండితుని తామ్రశాసనము.
రెండవరుద్రసేనుఁడు—ఇతఁడు మహారాజాధిరాజ ద్వితీయచంద్రగుప్తుని
కుమారికయగు శ్రీ ప్రభావతిని వివాహమాడెను.

|

యువరాజశ్రీదివాకరసేనుఁడు.

పై నివ్రాయఁబడిన మూఁడువంశవృక్షములవలన నుపలబ్ధమైన వృత్తాంతమం దుఁ గొన్నివిషయములు సంవదించుచున్నవి. మఱికొన్ని సంవదింపలేదు.

వీనిలో మొదటివాఁడైన వింధ్యశక్తి మహాపరాక్రమశాలి యనియు, వాకాటకవంశమునకు శిరోభూషణమువంటివాఁ డనియు నరాతివ్రాతవిద్రావకుం డనియు నజంతశాసనము వర్ణించుచున్నది. ఇతఁ డింత గొప్పవాఁ డని కీర్తిఁ బడసినను మహారాజబిరుదాంకితుఁడు కాకపోవుటచే రాజ్యపాలకుఁడై యుండలే దని మన మూహించుకొనవలయును. పురాణములయందుఁ జెప్పఁబడినవాఁడేయితఁడు. ఇతఁ డేదేశమందు నివసించునో తనమహైశ్వర్యము నెచట సంపాదించెనో దెలిసికొనఁజాలము.

ఇతనికుమారుఁడైన ప్రథమప్రవరసేనుఁ డీవంశమందు మహారాజపదభాక్కులలోనను మొదటివాఁడు. ఇతఁ డేలినరాజ్య మెద్దియో యెచ్చట నుండెనో యది యెంతమట్టుకు వ్యాపించి యుండెనో నిశ్చయించుటకుఁ దగిన యాధారము లెవ్వియు లేవు. ఇతఁడు సమ్రాట్టని కూడ బిరుదువహించెను. అసాధారణపరాక్రమశాలియై సకలరాజచక్రమును జయించినవాఁడుగాని చేయఁజాలని నాలుగశ్వమేధములను మఱికొన్ని క్రతువులను జేసె నని ప్రసిద్ధికెక్కెను. వీరుఁ డను నామాంతరముచే నితఁడు పురాణములలోఁ బేర్కొనఁబడెను. తగిన యాధారములు లేకపోవుటచే నితనిచరిత్రముఁ బూర్ణముగాఁ దెలిసికొనుట కవకాశము లేదు.

ఇతనికుమారుఁడైనగోమతీపుత్రుఁడు భారశివులకు మహారాజయిన భవనాగునికొమార్తను బెండ్లియాడెను. బుహెలర్ పండితుఁడు భారశివులస్థానము వాకాటకదేశమున కుత్తరముగా భాగీరథీతీరమం దున్న దని యాశాసనముల భాష కర్థ మని తెలిపెను. నాకుఁ దెలిసినంతమట్టుకు భారశివులు మఱి యెచ్చటను జెప్పఁబడి యుండలేదు. వారికి భవనాగుఁ డని యొకమహారాజున్నట్లు కానరాదు. పేరునుబట్టి చూడఁగా సముద్రగుప్తుఁడు జయించిన నాగజాతిలోనివాఁడని యర్థ మిచ్చుచున్నది. సముద్రగుప్తుని కాలమందు నాగరాజుల రాజధాని పద్మావతి దగ్గఱనో గ్వాలియర్ రాజ్యమం దున్న నార్వార్ దగ్గఱనో యుండవచ్చును. భవనాగుఁ డాదేశమం దెచ్చటనో రాజ్యముచేసి యుండ వచ్చును. భారశివులు భార్ రాజపుత్రులై యుందు రని బుహెలర్ పండితుఁడు చేసిన యూహ మంచిది కాదు. అయోధ్య, బండెల్ ఖండు మొదలగు స్థలములలో నొకప్పుడు బలవంతులైనజాతివారు భర్ జాతివారు గాని భార్ జాతివారు కారు. ఇప్పటి భర్ జాతివారు హిందూజాతిలో హీనజాతివారై యున్నారు. వీరు తమపూర్వపు గొప్పతనమును దఱచుగాఁ జెప్పుకొనుచుందురు. వా రయోధ్యలోనున్న బాయి

రాజపుత్రజాతివారితో సంబంధించినవారు. వా రాదిమజాతివా రై యున్న ట్లూహింపఁబడుచున్నారు. బుందేల్‌ఖండులో నున్న వారు కొండవాండ్రతోఁ గలిసియున్నారు. వా రెన్నఁడును క్షత్రియజాతివారుగాఁ బరిగణింపఁబడలేదని నే నెఱుంగుదును. భారశివు లెవ్వరో వారిరాజైన భవనాగుఁ డెవ్వఁడో నే నేమియు నిశ్చయముగాఁ జెప్పఁజాలను.

భవనాగుని కౌమార్తను వివాహము చేసికొన్న గౌతమీపుత్త్రుఁడు తండ్రి కంటె ముందు కాలధర్మము నొందియుండవచ్చును. అజాతవంశవృక్షములో నతఁడు విడువఁబడెను. పూర్వోక్తమైన పట్టికల ప్రకారము వాకాటకులలో రెండవ మహారాజు మొదటి రుద్రసేనుఁడు. అతఁడు గౌతమీపుత్త్రుని కుమారుఁ డని శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. భైరవరూపుఁ డయినశివుని నుపాసించువాఁ డని తప్ప మొదటిరుద్రసేనుని గుఱించి మనకు మఱేమియుఁ దెలియదు. కుమారుఁ డగుగౌతమీపుత్త్రుఁడు స్వర్గతుఁ డైనతరువాతఁ గూడ మొదటిప్రవరసేనుఁడు చిరకాలము రాజ్యముచేసె నని మన మూహించుకొనవలసియున్నది.

వాకాటకవంశమువారిలో మూఁడవమహారాజు రుద్రసేనునికుమారుఁడు నగు పృథ్వీషేణుఁడు కూడ శివోపాసకుఁడే. ఇతని ధనము రాజ్యపాలనసాధనములు నూఱుసంవత్సరములు చాల వృద్ధినొందె ననియుఁ, బుత్త్రులుఁ బౌత్త్రులుఁ జాలమంది యుండి రనియు శాసనములు చెప్పుచున్నవి. అనఁగా నితఁడు చిరకాలము రాజ్యముచేసె ననియుఁ గొమాళ్ళ మనుమలుఁ బెద్దవాండ్రగుట నితఁడు చూచె ననియు నాశాసనములకు నిజమైన యర్థ మని బుహీలర్‌మహాశయుఁడు చెప్పుచున్నాఁడు. నూఱుసంవత్సరము లనఁగా సరిగా నూఱుసంవత్సరము లని గ్రహింప నవసరము లేదు. అతనిరాజ్యపరిపాలనము నలువదిసంవత్సరములో లేక యేఁబదిసంవత్సరములో సాగె నని తలంపవచ్చును. దక్షిణములో నున్న కుంతల దేశాధీశ్వరు నితఁడు జయించె నని యజంతశాసనము చెప్పుచున్నది.

అతనికుమారుఁ డగుద్వితీయరుద్రసేనుఁడు ద్వితీయచంద్రగుప్తుఁ డను నామాంతరము గల మహారాజాధిరాజ శ్రీదేవగుప్తుని పుత్త్రిక యగు శ్రీప్రభావతి యను కన్యకను బెండ్లియాడెను. వాకాటకశాసనములలో దేవగుప్తుని కీయఁబడిన "మహారాజాధిరాజ"యను బిరుదము వాకాటకరాజులకంటెఁ గూడనీతఁడు మిక్కిలి గొప్పవాఁడై యుండె నని రుజువుచేయుచున్నది యని బుహీలర్ పండితుఁడు చెప్పినది మిక్కిలి యుక్తముగా నున్నది. దేవగుప్తుఁడు మగధరాజ్యము నేలిన గుప్త

రాజులలో నొకఁడనుటకు సంశయము లేదని (Dr. Fleet) డాక్టరు ఫ్లీట్ చెప్పి యున్నాఁడు. అనేకము లయిన వాకాటకశాసనములు భిన్నభిన్న స్థలములలో భిన్న భిన్న కాలములయందు వాడుకలోలేని ప్రాచీనలిపిలో వ్రాయఁబడి యున్న వని పైనుదాహరింపఁబడిన పండితుఁడు చెప్పుచున్నాఁడు. ఈవిషయమై యిచ్చట ననవసరమైన వివాదము పెట్టుకొనుట వలనఁ బ్రయోజనము లేదు. ఏలయనఁగా పాఠకపండితుఁ డీవిషయమై తాను నూతనముగాఁ గనిపెట్టిన విషయమును బ్రక టించుట దీనిని నిశ్చయపఱుచుచున్నది. రెండవరుద్రసేనునిభార్య మహారాజాధి రాజ ద్వితీయచంద్రగుప్తుని కొమరిత యని యు, నతనిసహవాసి కుబేరనాగుఁ డని యుఁ జెప్పుశాసనమును పాఠకపండితుఁడు కొంతమట్టుకుఁ బ్రకటించియుండుటచే నితరశాసనములలోఁ జెప్పఁబడిన దేవగుప్తుఁ డుత్తరహిందూస్థానము నేలిన చక్ర వర్తి యైనవాఁడు నాల్గవశతాబ్దము కడపటిభాగమందు మాళవసౌరాష్ట్రప్రదేశము లను జయించినవాఁడు నగు నామాంతరముతోఁ గూడిన ద్వితీయ చంద్రగుప్తుఁడే గాని వేఱయిన వాఁడు కాఁడని యొప్పుకొనవలసి యున్నది. చంద్రగుప్తుఁడు తన కూఁతును వాకాటకరాజున కిచ్చి వారితోఁ దనకు సంబంధమును గలుగఁజేసికొ నుట మిక్కిలి వివేకముతోఁ గూడినపని. ఇతని జైత్రయాత్ర క్రీ. శ. 395 ప్రాంత మునఁ బూర్తియయిన దని యూహించినయెడల వివాహము కూడ నప్పుడే జరిగి యుండును గాని దానికంటెను దూరముగా జరిగి యుండనేరదు. చంద్రగుప్తుని మిత్రుఁడైన కుబేరనాగునికి రుద్రసేనునియత్తగారికి, రుద్రసేనుని తండ్రికివలెనే నాగు లపేరుండుట గుర్తింపఁదగినది. ప్రాచీననాగకుటుంబములయధికారము నుపయోగ పఱ్చుకొనుట తనకు లాభకర మని చక్రవర్తి తెలిసికొనియెను.

ప్రసిద్ధికెక్కిన వివాహసంబంధము చేసిన రెండవరుద్రసేనుని యజంతవంశ వృక్షమేల విడిచెనో నేనుపపత్తిఁ జెప్పలేను. కాని రుద్రసేనుని రాజ్యపరిపాలన కాల మల్ప మని బుహిలర్ పండితుఁడు చెప్పినమాటను నే నంగీకరించెదను. ఈ ద్వితీయరుద్రసేనుఁడు స్వతంత్రరాజనిపించుకొన నట్టితని మామగారి గొప్పతన మతనిని గప్పివేసెను. రుద్రసేనుఁడు వానిగుప్తాధిపతివలెనే వైష్ణవమతావలంబి యయ్యెను. వానికుమారుఁ డగు ద్వితీయరుద్రసేనుఁడు శైవుఁడు. అతఁ డిరువది మూఁడుసంవత్సరములు రాజ్యముచేసె నని శాసనములు చెప్పుచున్నవి.

వానిరాజధాని యయినప్రవరపుర మతనిపేరునఁ గాని యతనితాతపేరునఁ గాని నిర్మింపఁబడి యుండవచ్చును. ఆపట్టణము పూర్వ మెచ్చట నుండెనో నిశ్చ యించి చెప్పుట కేమియు నాధారము లేదు.

ద్వితీయప్రవరసేనునికిఁ దరువాత వచ్చినరాజులవంశము 622 నంబరు గల యజంతశాసనములో సవిస్తరముగ వర్ణింపఁబడియెను ప్రవరసేనునికిఁ దరువాత ప్రణష్టనామధేయుఁడైన యెవ్వఁడో యొకరాజు సింహాసనమునకు వచ్చెనో లేక యజంతగుహాశాసనములవలనఁ దెలియఁబడిన దేవసేనుఁడే రాజయ్యెనో నిశ్చయించుటకు శక్యముకాదు.

ఈసందర్భమున కుపయోగించు పురాణవచనములఁ గొన్నింటిని Buhler పండితుఁ డిట్లనువాదచేసెను.

8. పృథ్వీషేణునికుమారుఁడు కుంతలేశ్వరుని జయించి ధర్మోత్తరముగా భూమి నేలెను.
9. అతనికుమారుఁడగు ప్రవరసేనుఁ డత్యున్నతపదవి నొందెను.
10. అతనిపుత్రుఁ డెనిమిదవసంవత్సరమం దభిషిక్తుఁడై న్యాయముగాఁ బ్రజలఁ బాలించెను.
11. ఆతనిపుత్రుఁ డగుదేవసేనుఁ డింద్రభోగము ననుభవించెను.
12. ఆతనిమంత్రిపేరు హస్తిభోజుఁడు.

పూర్వోక్తము లయినశ్లోకశకలములు ద్వితీయప్రవరసేనుని కొక కొడుకుండె ననియు, వానిపేరు నష్టమైన దనియు, వాఁ డెనిమిదేండ్లప్రాయము గలవాఁడై యుండఁగా సింహాసన మెక్కె ననియు, వానికి దేవసేనుఁ డను నొకకుమారుఁడు పుట్టె ననియుఁ జెప్పుచున్నవి. ఇది బుహిలర్ చెప్పిన యర్థము. కీల్హారన్ (Kielhorn) పండితుఁడు నష్టనాముని జెప్పక వాఁడే దేవసేనుఁ డని సమర్థించెను. ఆవాక్యమున కర్థ మిదియే యని నిశ్చయించుట దుర్ఘటము. అజంతగుహకుఁ బడమరగా నున్న గుల్సారా (Gulsora) దగ్గఱ నున్న ఘటోత్కచగుహ దేవసేనుని మంత్రియైన హస్తిభోజుఁ డనువానిచేతనో లేక వానికుటుంబములోని వానిచేతనో యధిష్ఠితమై యుండెను. అజంత దగ్గఱనున్న 17 నంబరుగల గుహలో దొరకిన యొకపాడుశాసనము హరిషేణునిపేరు క్రొత్తగా వెల్లడించినది. పాఠక్పండితుఁడు సంగ్రహించినతామ్రశాసనము రెండవరుద్రసేనునికిఁ, బ్రభావతికిఁ బుట్టిన దివాకరసేనుఁ డనువాఁడు పట్టాభిషిక్తుఁ డయ్యె నని చెప్పుచున్నది. వాఁడు ప్రవరసేననామముతో రాజ్యమేలెను. కాని ప్రాయశః వాఁడుబాల్యమందే మృతి నొందఁగా వానితమ్ముఁడు రాజయ్యెను. అపూర్ణము నతృప్తికరము నైనగ్రంథప్రమాణమువలన నీదిగువ వ్రాసెనమహారాజుల పట్టిక లబ్ధమగుచున్నది.

వాకాటకమహారాజులు.

1. మొదటిప్రవరసేనుఁడు—వింధ్యశక్తిపుత్త్రుఁడు క్రీ. వె. 300.
2. మొదటిరుద్రసేనుఁడు- వింధ్యశక్తిపౌత్త్రుఁడు, క్రీ. వె. 330.
3. పృథ్వీషేణుఁడు—రుద్రసేనునికొడుకు క్రీ. వె. 340 చిరకాలము రాజ్యమేలెను.
4. రెండవరుద్రసేనుఁడు—పృథ్వీషేణుని కొడుకు- రెండవచంద్రగుప్తునికూఁతును పెండ్లియాడెను. క్రీ. వె. 390.
5. రెండవప్రవరసేనుఁడు—రెండవరుద్రసేనుని కొడుకు- ఇరువదిమూఁడు సంవత్సరములు రాజ్యమేలెను. క్రీ. వె. 395.
6. రెండవప్రవరసేనుని కొడుకు—అజ్ఞాతనాముఁడు ఎనిమిదవయేఁట రాజ్యమునకు వచ్చెను. క్రీ. వె. 420.
7. దేవసేనుఁడు—అజ్ఞాతనామధేయుని కొడుకు- క్రీ. వె. 445.
8. హరిషేణుఁడు—దేవసేనునికొడుకు- క్రీ. వె. 465—500.

ఇ యెనమండ్రురాజుల పరిపాలనకాలము దాదాపుగా 200 సంవత్సరములు.

బుహిలర్ చెప్పినదానితో నీకాలనిర్ణయము సరిపోవుచున్నది. ప్రతిరాజు రాజ్యముచేసిన కాల మింత యని నిర్ధారణ చేయుట దుశ్శకమైనను పృథ్వీషేణుఁడందఱికంటె ద్రాఘిష్ఠముగా రాజ్యము చేసె ననియు ద్వితీయప్రవరసేనుఁడు సుమారు 23 సం॥లు రాజ్యము చేసె ననియు, హరిషేణుఁడు విస్తారముగా దేశములను జయించె ననియు నిందువలన స్థాపింపఁబడినది. మాళవదేశము జయింపఁబడిన కాలమందే రెండవచంద్రగుప్తవిక్రమాదిత్యుఁడు రెండవరుద్రసేనునికిఁ దన కొమార్తనిచ్చి వివాహము చేసెనన్న యూహ పై పట్టికలోఁ జెప్పఁబడిన తేదులు నొకరీతిగా సరిపోవుచున్నవి. పైనఁ జెప్పఁబడిన యెనమండ్రు వాకాటకమహారాజుల రాజ్యపరిపాలనకాలము 300 - 500 లలో నిమిడియున్న దని మనము నమ్మవచ్చును. హరిషేణుని తరువాత రాజ్యము చేసిన వా రెవ్వ రైన నున్న యెడల వారిని మన మెఱుఁగము. కాని యాఱవశతాబ్దములో, చాళుక్యరాజవంశస్థాపనము వఱకు నీవాకాటకవంశ మనువర్తించి యుండును. ఈవాకాటకవంశమునకు జన్మభూమి యెద్దియో మొదటిప్రవరసేనుని కధికార మెట్లు లభించెనో యావిషయమును నిశ్చయించుట కిపుడు మనకున్న యాధారములు చాలవు. సౌరాష్ట్రదేశము నేలిన శకచ్ఛత్రపుల (Saka Satraps) పట్టికలోను వాకాటకుల

నామావళిలోను కుమారుఁడయిన ప్రవరసేనునిపేరితో రుద్రసేనమహారాజుపేరు కానవచ్చుట యాశ్చర్యము కా దని Professor Collins చెప్పుచున్నాఁడు. వాకాటకమహారాజైనరుద్రసేనుఁడు వానికుమారుఁడు పృథ్వీషేణుఁడు A. D. 199-222 వఱకు రాజ్యము చేసిన యాపేరుగల ఛత్రపులతో నొకవిధముగా సంబంధించి యుండవచ్చును. కాని యి ట్లనుమేయించుట సందిగ్ధమై యున్నది.

వాకాటకవంశములలోఁ జెప్పఁబడిన వింధ్యశక్తి, ప్రవరసేనుఁడు పురాణములలోఁ జెప్పఁబడిన వింధ్యశక్తి ప్రవరసేనుఁడు నొక్కఁడే యయినయెడల నీవంశముయొక్క పుట్టుక యిప్పుడు మధ్యహిందూస్థాన (Central India) మని వ్యవహరింపఁబడు దేశభాగములో నెచ్చటనో యై యుండవచ్చును. అలహాబాదుకు దక్షిణపశ్చిమముగా నున్న యజయఘురసంస్థాన మని యిపుడు వ్యవహరింపఁబడు బుండెల్‌ఖండు రాజ్యము పృథ్వీషేణునితో సంబంధించె నని చెప్పఁగా వచ్చును. తక్కినశాసనము లన్నియు దక్షిణదేశమునకుఁ గడుదూరముగా నున్న స్థలములనుండి వచ్చినవి. చామక్కుశాసనము రెండవప్రవరసేనుఁడు (395-420) ఇలిచపూరుదగ్గఱ నున్నచామక్ (చర్మాంకము) తోఁ గలిసియున్న భోజకటకము నేలె నని స్థాపించుచున్నది. ఆతాలూకా యిపుడు ఇలిచపూరు జిల్లాకు సమానమై యున్నయది. భోజుల దుర్గ మని యర్థ మిచ్చు భోజకటక మనుపే రశోకుని శాసనములయందు, మహాభారతము, హరివంశము, దశకుమారచరిత్రము మొదలగు సంస్కృతగ్రంథములయందుఁ జెప్పఁబడిన ప్రాచీనక్షత్రియజాతి యగుభోజులు నివసించు కోటకుఁ బేరు. ఇలిచపూర్ సమీపమునందున్న ప్రసిద్ధమైన కోట గావల్‌ఘుడు కోట. ఇది నాలుగువేల యడుగు లెత్తుగా నున్న యొక కొండమీఁదను గట్టఁబడి యున్నది. సాధారణముగా శత్రువు లెఱుఁగఁజాలని యొక మాయమార్గము దానికిఁ గలదు. ఇప్పుడు పాడువడియున్న కట్టడములు 15 వ శతాబ్దముకంటెఁ బ్రాచీనమైనవి కావు. అవి ప్రాచీనకాలముక్రిందట రాజ్యపాలకు లైన వారి స్వాధీనమందుండెను. గావల్ఘుడుశబ్దమునకు, ఆదిమనివాసు లైన గయోలిస్ (Gaolis) అను జాతివారిచే నాక్రమింపఁబడిన దని యర్థ మని తోఁచుచున్నది. ఆగావల్ఘుడే భోజకటక మై యుండవచ్చు నని నే నూహించెదను. మొదటివాకాటకమహారాజు ప్రాచీనభోజ దుర్గమును స్వాధీనపఱ్చుకొని క్రమముగా నుత్తరమునకు దక్షిణమునకుఁ దనరాజ్యమును వ్యాపింపఁజేసి తనయధికారమును స్థాపించె ననుట నమ్మఁదగి యున్నది. అయిదవ వాకాటకమహారాజు పరిపాలనకాల మైన

నాల్గవశతాబ్దమువఱకు భోజకటక మనుపేరునే మనము విని యుండలేదు. ఒక శతాబ్దమునుం దున్న మొదటిమహారాజు గావల్లురులోఁ దనయధికారమును స్థాపించె ననియూహించుట సరిగా నుండలేదు.

A. D. 340-390 లో రాజ్యముచేసిన పృథ్వీషేణుఁడు కుంతలదేశాధీశ్వరుని జయించె ననియు, 465-500 లో రాజ్యము చేసిన యెనిమిదవమహారాజైన హరిషేణుఁడు కుంతలరాజునే గాక, అవంతికళింగకోసలత్రికూటలాటాంధ్రదేశాధిపతులను గూడ జయించె నని శాసనములు చెప్పుచున్నవి. దేశవాచకములైన యీపదములను వివరించుటకుఁ గొన్నిమాటలు చెప్పవలసియున్నది.

రైసుదొరగారు కుంతలదేశము డక్కనుకుఁ బడమటిభాగము మైసూరున కుత్తరభాగము, భీమ వేదవతీ నదులకు మధ్యనున్న దనియు, పడమటికొండలచేఁ జుట్టఁబడి యున్న దనియు మైసూరురాజ్యమం దున్న షిమోగ చిత్రదుర్గ జిల్లాలు, ఇపుడు చెన్నపురిరాజధానిలోఁ జేరిన బళ్లారి, బొంబాయిప్రెసిడెన్సీలో జేరిన ధార్వార్, బీజపూర్, నైజాంరాష్ట్రమునకు సమీపమం దున్న ప్రదేశములు పూర్వము కుంతలదేశ మని వ్యవహరింపఁబడె నని చెప్పెను. ఈపర్వతమువలన రాజ్యమునకుఁ ద్రికూట మని పేరు కలిగెను. ఆరాజ్యము నేలినవారు త్రైకూటకులు. వీరు కొన్ని శాసనములలోఁ జెప్పఁబడియున్నారు. A. D. 248-49 సంవత్సరములలో ముద్రితములైననాణెములు కూడ వీరిపేరుతో నున్నవి. ఈత్రైకూటకులకాలము A. D. 494. ఈవంశములో కొసరాజు వాకాటక రాజైన హరిషేణునిచే జయింపఁబడె నని యూహింపఁబడుచున్నది. త్రైకూటుల చరిత్రము వాకాటకులకాలమును స్థిరపఱుచుచున్నది. లాటదేశ మనఁగా దక్షిణగూర్జరదేశము. అది మాహి తపతి నదులమధ్య నున్నది.

అజంతశాసనములలోఁ జెప్పఁబడిన హరిషేణుని జైత్రయాత్రలు సత్యమయినయెడల బొంబాయిసముద్రతీరము మొదలుకొని బంగాళాఖాతమువఱకు నిండియాయొక్క మధ్యభాగము లోనుండి వ్యాపించిన వని చెప్పవచ్చును. హరిషేణునితరువాత రాజ్యమునకు వచ్చిన వాకాటకరాజులపేళ్లు మన మెఱుఁగము. మేమిదివఱకుఁ జెప్పిన ట్లీవాకాటకవంశ మల్పమో యధికమో యగురాజ్యముతో నాఱవశతాబ్దమందు చాళుక్యరాజ్యము స్థాపింపఁబడువఱకు ననువర్తించె నని మన మూహింపవచ్చును. వాకాటకవంశకాలముయొక్క ప్రధానమైన యాకారమును నిశ్చయించుట హిందూదేశచరిత్రకళకు మిక్కిలి యుపయోగకరమైనది.

1911 సం॥రము ప్రకటింపఁబడిన (A History of fine arts in India & Cylone) "హిందూదేశసింహళద్వీపచిత్రకళాచరిత్రము" అనుగ్రంథము కొన్ని కట్టడములకుఁ, బ్రతిమానిర్మాణములకుఁ జిత్రలేఖనమునకుఁ దాత్కాలికముగా నిర్ణయింపఁబడిన కాలమును పునర్విమర్శనములోనికిఁ దెచ్చుచున్నది.

వాకాటకపృథ్వీషేణమహారాజుయొక్క దీర్ఘరాజ్యపరిపాలనకాలము A. D. 340 మొదలుకొని 390 వఱకు నని నేను నిర్ణయించితిని. అట్లు కానిచో నంతకంటె సరిగా లెక్కించిన యెడల నాల్గవశతాబ్దముయొక్క యుత్తరార్ధ మని చెప్పవచ్చును. కావున గుప్తవంశపు చక్రవర్తి యగుసముద్రగుప్తునికి పృథ్వీషేణుఁడు సమకాలికుఁడు. ఆసముద్రగుప్తుఁడు A. D. 330 మొదలిడి 375 వఱకు రాజ్యమును బాలించెను. పృథ్వీషేణుని నాచ్నా శాసనము, సముద్రగుప్తుని ఇరాన్ శాసనము A. D. 401 లో రెండవచంద్రగుప్తుని యుదయగిరిశాసనము నొక్కలిపిలోఁ జెక్కఁబడినయవి. నాచ్నా శాసన మాకాలమందు రాజ్యముచేసిన వారి ప్రాచీనమందిరముల గోడలయొక్క రాతిపలకలపైఁ జెక్కఁబడినది. అప్పటివారి రాజధానికి కుతార మని పేరు. అది పృథ్వీషేణుని ప్రధానోద్యోగి యొక్క నివాసస్థానము. శాసనపురాయి యొక దేవాలయభిత్తిలోఁ గట్టఁబడియున్నది. దీనిని వ్యాఘ్రదేవుఁడు నిర్మించెను. ఇది యాకాలమందుఁ బ్రసిద్ధికెక్కిన యొక చిన్న పార్వత్యాలయము - అని కన్నింగుహామ్ వర్ణించెను. ఇది నాల్గవశతాబ్దమందుఁ గాని పంచమశతాబ్దప్రారంభమందుఁ గాని వర్తించిన ప్రాచీనగుప్తరాజులనాఁటినిర్మాణకౌశలమును దెలుపుచున్నది.

కన్నింగుహాము - ఈయాలయము నిట్లు వర్ణించియున్నాఁడు. "నేను జూచిన దేవాలయములలో నిది మిక్కిలి నేత్రాకర్షకముగా నున్నది. ఒక పెద్ద బండరాయియే యాలయాకారముగాఁదొలువఁబడినది. గోడలమీఁదను ద్వారమందునుఁ జెక్కఁబడిన బొమ్మలు గుప్తరాజులనాఁటి శిల్పనిర్మాణచాతురిని దెలుపుచున్నవి. ద్వారమందు-తాఁబేలు మీఁద నెక్కిన మొసలిబొమ్మ గల గంగాయమునానదుల బొమ్మ లున్నవి. సంచి, ఇరాన్, టిమోగా మొదలగు స్థలములయం దున్న గుప్తరాజదేవాలయములకు వలె దీనికిని బైకప్పు సమముగా నున్నది".

పై విషయములను బాగుగా విమర్శింపఁగాఁ దేలినఫలిత మిది.

ఎనమండ్రు మహారాజులతోఁ గూడిన వాకాటకవంశము A. D. 300-500 రెండుశతాబ్దములుండెను. వాకాటకశబ్దముయొక్క యర్థమును,వ్యుత్పత్తియుఁ దెలి

యను. వకాటశబ్దమునుండి వాకాటక యనుతద్ధితరూపము పుట్టినదని యూహింపవలెను. ఆరాజులజాతియుఁ, బుట్టుకయుఁ గూడ మనకుఁ దెలియదు. ఉజ్జయినీ సౌరాష్ట్రములతో సంబంధించిన విదేశీయులై యుందురు. ఈవంశములో మొదటి మహారాజైన ప్రథమప్రవరసేనుఁ డనేకాశ్వమేధయాగముల నొనర్చె నని యు నుజ్జుప్రక్కలనున్న రాజులపై సర్వాధికారము గల వాఁడై యుండె ననియు వాడుక కలదు. అతనిరాజధాని యెచ్చట నుండెనో యట్టియధికార మతని కెట్లు కలిగెనో, మనకుఁ దెలియదు. వానితరువాత వానిమనుమఁడు రాజై చిరకాలము రాజ్యము చేసెను. ఈవంశమందు నాల్గవ మహారాజైన పృథ్వీషేణుని గుఱించిన వృత్తాంత మలహాబాదునకు దక్షిణపశ్చిమముగా నున్న అజయఘుర సంస్థానమం దుపలబ్ధమైనది. డక్కనులో దక్షిణపువైపున నున్న కుంతలదేశమును బృథ్వీషేణుఁడు జయించెనని యు నితఁడు విస్తీర్ణమైన రాజ్యము నేలె ననియుఁ జెప్పఁబడినది. వాని కుమారుఁడైనరెండవరుద్రషేణుఁడు A. D. 490—5 లో రాజ్యముచేసిన రెండవ చంద్రగుప్తవిక్రమాదిత్యుని పుత్రికను వివాహము చేసికొనియెను. రుద్రషేణుని కుమారుఁడైన రెండవప్రవరసేనుఁడు ఇలిచపూ రనఁబడు తూర్పుబేరారునకు నిప్పటి మధ్యపరగణాలయొక్క పడమటిజిల్లాలలో జాలభాగమునకు రాజై యుండెను. ఇతఁ డిరువదిమూఁడుసంవత్సరములు రాజ్యమేలెను. నష్టనామధేయుఁడైన రాజు ప్రవరసేనదేవసేనులకు మధ్యవాఁడు. ఈతనిబ్రాహ్మణమంత్రి అజంతాదగ్గఱ నున్న గుల్వారాలో ఘటోత్కచగుహయం దీతనిగుఱించి యొకశాసనమును వ్రాయించెను. ఈవంశములోఁ గొనరాజు హరిషేణుఁడు. అజంతయొక్క నెం 16 రు గుహలో నితని శాసన మున్నది. ఆఱవశతాబ్దమందు చాళుక్యులయధికారము ప్రబలించిన తరువాత నీవాకాటకవంశము క్షీణించెను.

---

—కా. బ్రహ్మయ్యశాస్త్రిగారు-గతసంచికశేషము.—

ఇఁక వీ రొనరించిన ప్రతివిమర్శన మెట్లున్నదో కనుఁగొందము.

(1) కథాసంవిధానము, (2) రసము, నీతి, (3) పాత్రపోషణముక్రింద, జర్చనీయాంశముల వీరు విడఁదీసిరి. కాన మనమును నట్లే యొనర్తము.

(1) కథాసంవిధానము:—ఈశీర్షికక్రింద నేను జూపినదోషములు, దోషములు కావని సమర్థించుటకై రావుగారు పూనుకొనిరి. మొదటనే కవికిని గావ్యములకును గలసంబంధములను గూర్చి విచిత్రపువ్రాఁతల వ్రాసిరి.

—: కావ్యమున రసము వెలయుటెట్లు ? :—

పెద్దనార్యుఁ డేదోయొకకథను దీసికొని దానిని రసవంతము చేయుటలోఁ దననేర్పుఁ జూపక రసవంత మగు మూలకథకై వెదకికొనె ననియు నట్లొనర్చియు నుగూడ సరిగ రసము వెలయింపలేకపోయె ననియు నేనువ్రాసియుండ నాయంశముల ముందుగా నెత్తికొని శ్రీరావుగారు విపరీతసిద్ధాంతములఁగావించిరి. షేక్సుపియర్ మున్నగుపాశ్చాత్యకవులును కాళిదాసులోనగు స్వదేశకవులును గూడ రసవత్తరము లగుకథలనే వెదకికొని వానిని గావ్యములుగా విరచించి రనిరి.

లోకములోని ప్రజలు చక్కనిబాలికలను వివాహముచేసికొందురు గాని నగలునాణెములు పెట్టి దృష్టి కింపుగాఁ జేయఁగలము గదా యని కురూపురాండ్రను వివాహము చేసికొనుచున్నారా యని యడిగిరి ? ఈసందర్భములో రావుగారు వ్రాసినవ్రాఁత యసత్యములతోడను నసంగతములతోడను నిండియున్నది. నిక్కమగు ప్రతిభగలకవి యేదో యొకమూలకథను దీసికొని దానినే రసవంతముచేయుటలోఁ దననైపుణ్యమును జూపు ననునది లోకానుభవము కలవారెల్లరును నెఱింగియున్నవిషయమే. మహాకవు లెల్లరు నట్లేయొనర్చిరి కాని రావుగారు చెప్పినట్లు చేయలేదు. ఇందుకు రావుగారు చెప్పినషేక్సుపియర్ మహాకవినే మొదట నుదాహరణముగాఁ దీసికొందము. ఈతఁడు లోకములో వాడుకగా నున్న యల్పసారము గలకథలనే దీసికొని వానిని దనప్రతిభచే రసవంతము చేయుచు వచ్చె నని వ్యాఖ్యాత లందఱును వ్రాసియుండిరి. "ఆజ్ యూ లైక్ ఇట్" (As you like it) అనునాటకపీఠికలో, ఎ. డబ్ల్యు. వెరిటీ (A. W. Verity) అనుపండితుఁడు కవి యేదో సామాన్యకథను దీసికొని దానికి జీవము పోయుచు వచ్చిన ట్లీక్రిందిరీతిని వ్రాసెను.

"He often takes some existing story and shapes it anew to finer issues re-creating its characters and ad-

మఱియును పాత్రౌచిత్యము, యుక్తి, రసస్ఫురణము మున్నగునవి యన్నియును షేక్సుపియర్ యొక్క ప్రతిభాజనితములే కాని యితరమూలములనుండి పుట్టలేదని వీరే నొక్కి వ్రాసిరి. మూలకథ లనఁబడెడి వానియం దేవిధ మగు విలువయును లేదని కూడ వ్రాసిరి. ఇంకను డాక్టరు ఫర్నెస్ (Dr. Furniss) అను పండితుఁడు షేక్సుపియరునాటకములకు మూలములు (Sources) అని చెప్పఁబడునవి వట్టియాభాసమాత్రము లనియు రాత్రిపూఁట కొంచెము మెఱసి పగటిపూఁటఁ గాంతియింతయును లేక నేలం బ్రాఁకు మిడుఁగుఱుంబురువులవంటి వనియు షేక్సుపియరుగ్రంథములందలి మెఱుఁగు లన్ననో సదా ప్రకాశించు రత్నములవంటి వనియు వ్రాసిరి. డౌడన్ మున్నగువ్యాఖ్యాతలు నిట్లే లిఖించిరి.

ఇంక, కాళిదాసు వ్రాసిన శాకుంతలమును గూర్చి ప్రసంగించుకొందము. ఈనాటకమూలము భారతమున నత్యల్పముగా నున్నది. శాకుంతలమునందలి రసోత్సేకాదు లాతనిప్రతిభాసంభూతములే కాని పైనుండి వచ్చినవి కావని ప్రాజ్ఞులెల్లరు నెఱుఁగుదురు. నేను వ్రాసినదాని నెట్లైనఁ బ్రతిఘటించుటకయి యీతావున, కాళిదాసు రసవత్తర మగుమూలమును దీసికొనె నని వ్రాసినను దాము ప్రత్యేకముగాఁ గవులునాటకముల వ్రాసినమార్గమును దెల్పుసందర్భములో రావుగారును దమ "విజయనగరసామ్రాజ్యకవులచరిత్రము"లో నేను జెప్పినయట్లే వ్రాసిరి. వీరు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని గూర్చి వ్రాయుటలోఁ గాళిదాసుని శాకుంతలముం గూర్చి యిట్లు వ్రాసిరి:—

"కాళిదాసుని శాకుంతలనాటకము - భారతమందలి యీయితివృత్తమును శృంగారరసప్రధాన మగునాటకనిర్మాణముఁ గూర్చుకొని నాయికానాయకులశీలములను జేర్చియు నూతనపాత్రములఁ గల్పించియు గథాంశములఁ గొన్నిటిమార్చియు నిట్లనేకవిధములఁ బెంచియుఁ గుదించియు వ్యక్తీకరించియు సర్వాంగసుందరమగు నాటకరాజమును కాళిదాసమహాకవి రచించెను.

* * * * * * *

..కాళిదాసుని యప్రతిమానప్రతిభ రసపోషణమందే గాక తత్తదనుకూలమగు కథాశరీరనిర్మాణమునందును గాన్పించుచున్నది."

దీనింబట్టి కాళిదాసునిప్రజ్ఞావిశేష మంతయుఁ దన శేముషీవిశేషమునుబట్టి గ్రంథమును రసవంతముఁ జేయుటలో వెలయుచున్నదిగాని రసవత్తర మగు కథ నెంచుకొనుటలోఁ గాదని సూచిపడుచునే యున్నదికదా.

మఱియును నందిమల్లయ్య ఘంటసింగయ్యల వరాహపురాణముం గూర్చి ముచ్చటించుచు శ్రీరావుగారే యిట్లువ్రాసిరి.

"మాతృకలో నున్న కథాంశములను మాత్రము తీసికొని వాని ననేకవిధముల రసపుష్టిచేసి పాత్రోచిత, స్థలోచిత వర్ణనముల నకుంఠితముగఁ జేర్చి పెంచి సుమనోమనోజ్ఞముగ రచించిరి. సామాన్యముగఁ బ్రతికథయందు నిట్టిప్రత్యేకరసపోషణసంధానము కాన్పించుచున్నను ముఖ్యముగా దుర్జయోపాఖ్యానమునఁ గడుంగడు రమణీయముగ నీప్రక్రమము మెఱయుచున్నది."

మనరావుగారిట్లు చెప్పిచెప్పి దీనినుండి యొకసామాన్యధర్మము నిక్రిందిరీతిగ వెల్లడించిరి.

"మూలమందలికథారేఖాకృతిని దీసికొని దానిని మాంసపుష్టిమసృణమగుసజీవస్వరూపముగ సృజింపఁగల నిసర్గశక్తి మహాకవులయందున్నట్లు వీరియందును గానంబడును. దీనింబట్టి మహాకవులశక్తి యెట్టిదని తేలుచున్నది ? రేఖామాత్రముగానున్నమూలకథలను దీసికొని వానిని రసవంతములఁ జేయునది యని తేలుచున్నది."

మహాకవులెల్లరును రేఖామాత్రముగా నుండు మూలకథలను దీసికొని వానియందు స్వయముగ రసము పుట్టింతురనియు, కాళిదాసాదిమహాకవు లెల్లరు నట్లే చేసి రనియుఁ దమ "విజయనగరమునందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము" నందు స్పష్టముగ వ్రాసి యుండియును గూడ నా కిచ్చిన సమాధానములోఁ దద్విరుద్ధముగా మహాకవులెల్లరుఁ దమకావ్యముల రసవంతములఁ జేయఁగల మూలముల వెదకికొనియే యుండి రని వ్రాయసాహసించుట వింతకాదా? నేను వ్రాసినదాని నెట్లైనఁ గాదనుటయే తమపనియా ? సత్యమునం దాదర ముండనక్కఱలేదా ? కవి రసవంతములగు మూలములకై వెదకుచుండువాఁడగుచో నింకఁ దాను జేయు పనియేది ? రసము పుట్టించుపని కావ్యకర్త యగు కవిదే కదా "సాధ్యోహి రసో యథాయథం కవిభిః" అని కదా వాగనుశాసనుఁడు వ్రాసియున్నాఁడు. కాన మహాకవులు తమకావ్యముల రసవంతములఁ గావించుకొనుటకై రసవత్తరములగు మూలకథల నెంచుకొందు రనుట యుచితముకాదు.

—: కవి తనకావ్యమునకు భర్త యగునా ? :—

పెండ్లియాడఁ దలఁచుకొనినవాఁడు సుందరకన్యక నెంచుకొనక నగలుపెట్టఁగలుగుదున్ను గదా యని కురూపురాలి నెంచుకొనునా యనువిషయముం గూర్చి ముచ్చటించుకొందము.

కవి తనకావ్యకన్యకకు జనకుఁడు కాని పెనిమిటి కాఁడు. అనఁగా దానిని సృష్టించువాఁడు గాని పుట్టియున్నదానిని జేపట్టి యనుభవించువాఁడు గాఁడు. కావుననే:—

"క. కవితాకన్యకు నలుగురు, కవి జనకుఁడు బట్టు దాది గణుతింపంగా
నవరససరసికుఁడు పెనిమిటి, యవివేకియె తోడఁబుట్టు వనవేమనృపా !"

అని పెద్దలు వ్రాసిరి. కాన మనరావుగా రెవనిచేఁ గవితాకన్యక పుట్టింపఁ బడునో వానినే పెనిమిటిగాఁ జెప్పుట హాస్యాస్పదముగానున్నది. కవి సృష్టికర్త• కవికిని గావ్యమునకును గల సంబంధమునే రావుగా రెఱుఁగరు. వారి వయసలు లేని వ్రాఁతలు వ్రాసిరి ? పైఁగా నిప్పట్టున నన్నుఁ బరిహసింపఁజొచ్చిరి. దాని కేమి. నేను పెద్దనార్యుఁడు రసవత్తర మగు మూలకథ యనఁబడు దానిని గూడఁ బాడుచేసినాఁ డని వ్రాసియున్నాను. వర్ణనాదికముల నొనరించుటలోఁ బెద్దన గొప్పవాఁడే కాని కావ్యమును రసవత్తరముగ జేయుటలోఁ దననేర్పు చూప లేకపోయినాఁడు. కథాసందర్భ మంతయుఁ జెడినది.

—: కథాసంవిధానవిచారము. :—

ఈవిధానములో నీతఁడు మారన వ్రాసిన పురాణగమనికను జాలభాగ మనుకరించెనే కాని దానిని బ్రబంధగమనికలోనికిఁ దీసికొనిరాలేక పోయినాఁడు. అర్థప్రధాన మగుపురాణమునకును రసప్రధానమగు ప్రబంధమునకును గథాకథ నములో భేద ముండితీరును గాన, పురాణకథాప్రణాలికకును, బ్రబంధకథాప్రణా లికకును జాల భేదముండును. ఈవిషయమై శ్రీరావుగారే యిట్లు వ్రాసిరి:—

"మూలగ్రంథ మనఁగా మార్కండేయపురాణము. పురాణగ్రంథము. ప్రస్తుతవిమర్శితగ్రంథము, అనఁగా, మనుచరిత్రము, ప్రబంధగ్రంథము. పురాణ ములకుఁ బ్రబంధములకుఁ గావ్యశిల్పములోఁ జాల భేదము లున్నవి. పురాణ ములలో ననేకేతివృత్తములు పరస్పరమిళితములై వచ్చుచుండును. ఒకకథ సాఁగు చునుండఁగా మధ్యమధ్యను జిన్నచిన్నయుపాఖ్యానము లెన్నియోవచ్చుచున్నను నవి యన్నియు సమగ్రముగా నడిపింపఁబడి మూలకథ కెంతమాత్రము నిరోధక ములుగా నుండవు. మూలకథ యథావిధిగా సమగ్రము నొందింపఁబడును. కాఁబట్టి పురాణములలో వస్త్వైక్యముకన్న వస్తుభిన్నతయే కాన్పించును. ప్రబం ధములలో నట్లుగాక వస్త్వైక్యమే ప్రధానముగా నుండును, గావున నొకయితి వృత్తము కథారూపమున విస్తరింపఁబడుచున్నపుడు మధ్యమధ్యను జిన్నచిన్న

యితిహాసములును నంతరకథలును వచ్చుచున్నను నవి మూలకథ కెంతవఱకు కుప కరించునో యంతమాత్రమే గ్రహింపఁబడును. కథాప్రణాళిక కంతరాయము గలుగఁజేయు భాగము లన్నియు విసర్జింపఁబడును. ఇట్లు సంధాననియమమును బాటించుటచేఁ గథయందు వస్త్వైక్య మేర్పడుచున్నది. సామాన్యమున నే ప్రబంధముఁ జూచినను గథాకథన మీవిధముగనే యుండును గాని యన్యథా యుండదు."

మఱియును శ్రీరావుగారు స్వారోచిషమనుజననమునకు నిబ్బరముగా నడిపించెడు కథాభాగములను కథాపాత్రములనే యెత్తికొని కథాప్రణాలికనుసాగింప వలెనని కూడవ్రాసిరి.

పురాణమును ప్రబంధములోనికి మార్చునప్పుడు తప్పక యీపద్ధతియే యుండవలెనని నొక్కివక్కాణించిన శ్రీరావుగారు తాముచెప్పిన క్రమానుసారముగా మనుచరిత్ర మున్నదో లేదో విమర్శించి చూచుకొనక తమకుఁ దోఁచినరీతిగాఁ గథాసంవిధానముం గూర్చి యవిచారపూర్వక మగువ్రాతను వ్రాసివేసిరి. రావు గారితప్పును దెలిసికొనుటకై వారు పెద్దనార్యుఁడు మనుచరిత్రమునందు దేనిని జెప్పనూహతోఁ దనపొత్తము వ్రాసె ననెనో యది ముందుగాఁ దెలిసికొందము. "ఈవిషయమందుఁ బెద్దన్నగారు చెప్పఁదలఁచుకొనినది స్వారోచిషమనుసంభవము. అనఁగా స్వారోచికి మనువుపుట్టుట" అని మనరావుగారువ్రాసిరి. మనుచరిత్రములో స్వరోచికి మనువుపుట్టుట ప్రధానకథ గావున దానికి నిబ్బరముగాఁదీసికొనిపోవునట్టి యనఁగా దానికుపకరించునట్టి కథలను పెద్దనార్యుఁడు చెప్పెనా లేక, దానికి సంబంధములులేని కథలను గూడఁ జెప్పెనా, యని విచారించి చూచుకొందము. ఇంకను "అంతఃకథను బెంచి ముఖ్యకథ కంతరాయము కలుగఁజేయకుండుట కథాసంవిధానమున కొకగుణవిశేషమై యుండు నని కూడ రావుగారు వ్రాసిరి, కావున, పెద్దనార్యుఁడు ముఖ్యకథ కంతరాయము కలుగునట్లుగా, యంతఃకథలను బెంచివేసెనా లేదా యనువిషయము కూడఁ జూచుకొనవలసియున్నది.

పరికించి చూడ మనోరమాకథలు మనుసంభవమునకు నేవిధ మగు సంబంధమును లేనివిగాఁ గాన్పించుచున్నవి. మనోరమాదులు స్వారోచిషునకు మాతలు కారు. ఆతనితల్లి వనదేవత. ఆమె స్వరోచికి భార్యకాదు, కాన, మనోరమాదులు స్వారోచిషునకు సవతితల్లులుకూడఁ గారు. మనోరమాదుల వివాహమైనపట్టుననే స్వరోచి వనదేవతనుగూడఁ జేపట్టెనేమొ. ఆకారణముచే నిచే

పట్టుట లన్నింటిని గవి వరుసగాఁ దెలిపినాఁ డేమో యనుకొనుటకును నవకాశము లేదు. ఏమన-మనోరమాదులవివాహ మైనతరువాత బహుకాలము వారితోఁ గాఁపురముఁజేసి పుత్రులను బడసి వారికి రాజ్యముల నొసంగి వైరాగ్యము నొంద సిద్ధముగా నున్నస్వరోచి మరల సందర్భము లేకుండ వేఁటకుఁ జనియెను. ఇది రెండవవేఁట. ఆసమయమున వనదేవత తారసింప నామెను గూడఁగా మనువు పుట్టెను. కథాసందర్భమును నతుకుటలోఁ గవి తడఁబడి వేఁటలను రెండింటిని గల్పించె. మొదటివేఁటలో స్వరోచి మనోరమాదులను జేపట్టెను. రెండవ వేఁటలో వనదేవతను గూడె. మూలములో లేని మొదటివేఁటను దీసివేసి రెండవ వేఁటనుమాత్ర ముంచి యందు వనదేవతకును స్వరోచికిని సంబంధము గలిపినఁ గథాప్రణాలిక సరిగ నడచిపోయియుండును. చెప్పినదంతయు మూలకథకు నిబ్బరముగఁ దీసికొనిపోవునదిగ నుండియుండును. అట్లు చేయక పురాణకర్త యగు మారనకథాప్రణాళిక ననుసరించి ప్రధానకథ కిసుమంతయు సంబంధము లేని మనోరమాదులకథలను మనకవి తనప్రబంధమునఁ గూడ నెక్కించి పురాణకథలోఁ జేయవలసినమార్పులను జేయకపోవుటచే ననవసరముగను నతివిస్తారముగను గథ పెరిఁగిపోయినది. ప్రధానకథ కంతరాయము వాటిల్లినది. ఈవిషయమై శ్రీ అలంపూరు కృష్ణస్వామిగా రీసంవత్సరపు త్రిలింగలలో నిట్లువ్రాసిరి:—

"ఈకథల పరంపర కావ్యమునకు ఏకత్వమును సంపాదించే సమవేతాలైన అంగాలు కావు ఇవి అతుకులు. కనుక యిందే భాగాన్ని తీసివేసినా స్వారోచిషమనుసంభవమనే ప్రధానకథ కేలాటిక్షతీ కలుగదు. ఈకథలన్నీ గ్రంథములోని ప్రధానకథకు ఏకత్వం సంపాదించే శక్తికలిగిన భాగాలు కావు. కథానిర్వాహానికి సహితం తోడ్పడటం లేదు. కనుక ఐక్యార్థసిద్ధి కలిగేటట్లు కావ్యాన్ని కావలసిన మార్పులు చేయక పురాణకథగానే కృతికర్త రాశా డని తెలుపుచున్నాను."

మనోరమాదులకథ లిట్లు మూలకథ కంతరాయము కలిగించు ననవసరభాగములై యున్నవి, గాన, రావుగారు చెప్పినపద్ధతి ననుసరించి వానిని ప్రబంధము నుండి విసర్జించివేయవలసినది.

పోనిం డీకథలను సంగ్రహముచేసి యైనఁ జెప్పె నేమో యనుకొందు మనిన నట్లైనఁ జేయక వీని నతివివరముగాఁ బెంచి వర్ణించి మూలకథను నతిసంగ్రహము చేసి మనపెద్దన చెప్పెను. కాన నంగము లతివిస్తారములై దుర్భరాకృతి నందెను. ఉత్తమాంగ మన్ననో పొన్నకాయవలె నత్యల్పమై యుండెను. కథాశరీ

రము నీరీతిగా మన పెద్దనార్యుఁడు వికృతాకృతిలోనికిఁ దీసికొనివచ్చెను. మనో రమాదులచరిత్రము లంగములే కావు. అయినను బెద్దనార్యు నెట్లైన సమర్థించు టకై యంగములుగాఁ దీసికొనినను నవి 'సెట్టి సేరు లింగము పదిసేరు' లన్నట్లు ప్రధానాంగములకంటె విపరీతవృద్ధి నంది యుద్దండాకారము దాల్చె.

కావ్యమున ననవసరముగను హానికరముగను బెరుఁగు కథాభాగములు దేహముపై బయలువెడలు కంతులు వంటివిగను వ్రణముల వంటివిగను నుండు నని పెద్దలు చెప్పిరి. కాళిదాసు తనకుమారసంభవములో మైనాకజననముఁ గూర్చి యించుక ముచ్చటింప వ్యాఖ్యాతలు కుమారసంభవములో మైనాకుని ప్రశంస యేలయని శంకించుకొని యెంతయో శ్రమపడి దానినె ట్లెట్లో సమర్థించుకొనిరి. పార్వతి యభ్రాతృకన్యగాదనియుఁ గావున వివాహయోగ్యయే యనియుఁ దెలుపుటకై మైనాకజననప్రశంస పెట్టఁబడిన దనిరి. అట్టిస్థితిలో మనోరమాదులకథలకు మనుచరిత్రలో గతియెట్లు కలుగఁగలదు? ప్రధానకథ కుపకరింపని యీకథలే చాల హెచ్చి పోయినవి. విమర్శకులు చెప్పినట్లుగా రసికు లగుచదువరులకు నవి చాల విసువును బుట్టించుచున్నవి. కథాకథన మిట్లుండుట ప్రబంధగమనిక కాదని శ్రీరావుగారే తమవిమర్శనములో న్యాకివక్కాణించియున్నారు గావున రావుగారు వ్రాసినవ్రాఁత లీపట్టున మనుచరిత్రమునకు హానినే గలిగించుచున్నవి.

ప్రవరచరిత్రమును బెద్దనగ్రంథములో నతివిస్తారముగానే పెంచివేయఁబడినది. ప్రధానకథకుఁ బ్రవరరూపముమాత్ర మించుక యుపకరించుచున్నది. అంతమాత్రముచే నాతనికథాపూర్వోత్తరముల నన్నింటి నతివిపులముగా వర్ణించుటయేల? స్వారోచిషుని తండ్రియగు స్వరోచినిబుట్టించిన గంధర్వుని పూర్వవృత్తాంతమే యిందుఁ బ్రధానముగానిచోఁ బ్రవరునిపూర్వోత్తరకథ లెట్లు ముఖ్యములు కాఁగలవు? ప్రవరునికథ మనోహరమైనదే కావచ్చును. అయినను దాని నతివిపులముగాఁ బెంచి వ్రాయుటయు మూలకథను సన్నగిల్లఁజేయుటయు రసికాహ్లాదమును గలుగఁజేయఁజాలవు. మనకవికి మఱొకప్రయోజన ముండుటచేఁ బ్రవరాదులకథలను నతిమాత్రముగాఁ బెంచివేసె. నేను నావిమర్శనములో "స్వారోచిషమనుసంభవమునకుఁగూడ మనోరమాదులచరితములు కారణములు కావు" అనియు, "ఇందు నాయకుఁ డొకఁడు కాఁడు. నాయిక యొకర్తుక కాదు. కథ యొకటిగాదు." అనియు వ్రాసియున్నాను. ఇంతయేల యించుమించుగా విమర్శకులెల్లరును బెద్దనగారికథావిధానము సరిగ లేదనియే వ్రాసిరి. పెక్కేల పూర్వకవి

యగురామరాజభూషణుఁడును గథాక్రమముప్రౌఢముగ లేదని యీక్రిందిపద్యములో సూచించె:—

ఉ. "కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టురత్నము లవారితసత్త్వవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు సానలఁదీఱినజాతిరత్నముల్"

ఇది పెద్దనకథావిధానము నాక్షేపించునదియే యని రసజ్ఞులు చెప్పుదురు. శ్రీరావుగారీయాక్షేపణములకు సమాధాన మీయలేదు. సరికదా పైనఁ దెలిపినరీతిగా పెద్దనగారు ప్రబంధనియమములఁ బాటింపలేదను నంశమును దమవ్రాఁతలనుబట్టియే తేల్చిరికాని పాపము వీరాసంగతి నెఱుంగలేకపోయిరి. కథావిధానములోని యతుకులలోఁ గలిగినదోషములం గూర్చి నేను గొంత ముచ్చటించియుండ దానిని గూర్చి యేమేమో చెప్పఁబోయిరి కాని యదియు సరిగలేదు. ఆవిషయమై ముందుముచ్చటించెద.

—: గ్రంథనామముంగూర్చి :—

మనుచరిత్రములోని కథాసంవిధానము సరిగలేదు. కావుననే గ్రంథనామము సరిపడలే దని విమర్శకు లనేకు లాక్షేపించిరి. ఈయాక్షేపణము నేనుజేసినట్లు రావుగారు తెగించి వ్రాసిరి, కాని, నే నట్లెచటను వ్రాసియుండలేదు, సరికదా "పే రేదియైనను నంతగా హానిలేదు. అది యొకయాక్షేపణము గాదు"అని నావిమర్శనములో వ్రాసితిని. అయినను రావుగారు నావ్రాసినదానిని దిన్నఁగఁ జూచుకొనక పేరునుగూర్చి నే నధిక్షేపించినట్లు భ్రమపడి తమభ్రమాజనిత మగు నాక్షేపణమును నిరోధింపఁ బెద్ద డాంక్విక్సాటీయార్భాటము గావించిరి*

తుదకు వీరు చెప్పిన సమాధాన మే దన మనుచరిత్ర మనుపేరు పెద్దనార్యుఁడు వాడినదికాదనుట-అందుమూలముచేఁ బెద్దనపాత్త్రము చరిత్రముకాదనుట-ఇది తప్పుటూహ-పెద్దనార్యుఁడు తనమనుచరిత్రములోఁ దాను వ్రాసినది స్వారోచిషునిచరిత్రమనియే యీక్రిందరీతిని వ్రాసె.

---

* పాశ్చాత్యసారస్వతములో "డాంక్విక్సోట్" అను శూరంమన్యుఁడు వర్ణింపఁబడియున్నాఁడు. ఆతఁడు చాల పిచ్చియూహలు కలవాఁడై శూరత్వము వెల్లడించుకొనుటకై లేనిపోని యార్భాటము లొనరించె. నీటియంత్రాదులను గని దేశముపై దండెత్తివచ్చిన రిపులనుగా భావించి వానిపైకి దండెత్తె. మనరావుగారును స్వభ్రాంతిజనిత ప్రతివాదములఁ బ్రతిఘటించుటలో నారాఁటముఁ జూపిరి.

క. కోరిక నీస్వారోచిషు, చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధనధా
న్యారోగ్యపుత్రవంతులు, నైరూఢిగఁ గంద్రు పిదప నమరత్వంబున్.

కాన రావుగారు వ్రాసినదంతయుఁ దప్పే. సంభవ మనినను నుత్తరకథను జెప్పవచ్చును. కాళిదాసు నన్నెచోడుఁడు మున్నగువారట్లు తమకుమారసంభవములలోఁ జెప్పలేదా! అదిగాక పెద్దన చరిత్రమనియే స్పష్టముగా వ్రాసియుండియును గూడ దానిం జెప్పక కథను సన్నగిల్లఁజేయుట యెట్లుచితమగును? మఱియును మనుచరిత్ర మనుపేరు మృచ్ఛకటికాదులవలె సాంకేతికనామము కాదు. గ్రంథమం దున్న యితివృత్త మేదో దానిని దెలుపు సార్థకనామమే. ఈసందర్భములో రావుగారు వేణీసంహారాదిసాంకేతికనామములమాట తలపెట్టుట యధిక ప్రసంగ మగును. అవి యటులుండ నీసాంకేతికనామములంగూర్చి ముచ్చటించుటలోఁ గూడ వీరు ప్రమాదమునకు లోనైరి. "వేణీసంహారమనుపేరువలన ద్రౌపదిమానభంగచరిత్ర తెలుపఁబడుచున్న" దని వ్రాసిరి. అట్లు చెప్పుటకు వలనుపడదు. దుశ్శాసనుఁడు చేసిన కేశసమాకర్షణము ద్రౌపదీమానభంగకథను దెలుపును గాని భీముఁడు చేసినవేణీసంహారము కృష్ణామానభంగకథను దెలుపదు. వేణీసంహారము భారతకథను ముఖ్యముగా యుద్ధకథను దెలుపును. అనఁగా ద్రౌపదీమానభంగమూలకముగాఁ బుట్టిన తదనంతరచరితను దెలుపును. శ్రీరావుగారు గ్రంథములను దిన్నఁగఁ జూచుకొనక చూచినపదము నర్థముచేసికొనక తాముచ్రాయువ్రాఁతల మూలముగా వచ్చుభావమునైన సరిగఁ దెలిసికొనక, నన్నాక్షేపించుటయే ప్రధానముగాఁ బెట్టుకొని పెడచేతివ్రాఁతలు వ్రాసివేసిరి. సత్యము చెప్పవలసివచ్చుచో రావుగారివ్రాఁతలను బట్టిచూచిన- పెద్దనార్యునికథాసంవిధానము మఱింత చెడిన దని రూఢిగాఁ దేలుచున్న దనిచెప్పవలెను.

—: పాత్రపోషణము :—

ఇఁకఁ బాత్రపోషణముం గూర్చి ప్రసంగించుకొనవలసియున్నది. కాని తద్విషయమై ముచ్చటించుకొనుటకు ముందుగా రావుగారు నాయం దీసందర్భమున నెంచిన మఱియొక విశేషదోషముం గూర్చి చర్చించుకొన నవసరము కలిగినది. అదియేదియన "పాత్రోచితవాక్యములనుఁ గవియభిప్రాయములుగఁ బరిగణించుట" యంట! "ఈదోషము విమర్శిగారివ్యాసమునఁ బలుతావులఁ గాన్పించుచున్నది" అని శ్రీరావుగారు వ్రాసిరి. వీరు నేను వ్రాసినదానిని దిన్నగఁ జూచుకొనక యీవిచిత్రాక్షేపణమును గావించిరి.

—: పాత్రవాక్యములు కవివిగాఁ దీసికొనఁబడెనా ? :—

నే నెచ్చటను బాత్రోచితవాక్యములను గవిభావములను గాఁ దీసికొని యుండలేదు. పైఁగా నట్లుచేయఁగూడ దనియే నిర్ణయించితిని. ఎట్లన్న; నా మొదటి విమర్శనములోనే "ఇవి కాముకులమాట లగుచోఁ గామాంధు లిట్లు తలంతు రని భావించుకొందుము. ఇది యట్లుగాక కవి తేల్చిన భావమై యున్నది.'' అని సూర్యాస్తమయవర్ణనవిమర్శనములో వ్రాసియుంటిని. దీనింబట్టి పాత్రోచిత వాక్యములఁ గవిభావములనుగాఁ దీసికొనరా దనియుఁ బాత్రోచితవాక్యములు గాక, కవివాక్యములై యుండునవి యేవియో వానినే కవియభిప్రాయములనుగాఁ దీసికొనవలయుననియుఁ దేలుటలేదా ? నేనిట్లు వ్రాసినసంగతి రావుగా రెఱుంగుదురు. నాయీవాక్యమును వారు తమవిమర్శనములో ననువదించుకొనిరి. మఱియును నాద్వితీయవిమర్శనములో, ననఁగా కీ. శే. కేతవరపు వేంకటశాస్త్రిగారి కిచ్చినసమాధానములో "వెలిఁబెట్టిరే బాడబు" లనుపద్యముంగూర్చియే చర్చించుచు నీక్రిందిరీతిని స్పష్టముగ వ్రాసియుంటిని. "వెలిఁబెట్టిరేబాడబు" లనుపద్యము హానికర మైనది గా దని నేనును నంగీకరించితిని. ఏమన-నయ్యది కామాంధులగువారి యూహా లెట్లుండునో తెలుపునదికాని ధర్మనిర్ణయము చేయునది కాదు. దీనింబట్టి "వెలిఁబెట్టిరే" యనుపద్యమునందలి పలుకులు పాత్రోచితవాక్యములు గానఁ గవి తేల్చినధర్మముగాఁ దీసికొనరా దనియే నేను దేల్చినట్లు నిస్సందేహముగాఁ దేటతెల్లమగుటలేదా? ఇట్టిపాత్రోచితవాక్యములఁ గవివాక్యములనుగాఁ దీసికొని గ్రంథమును నీతిబాహ్యమని నిందించినవారు నవనాగరకులు. అనఁగా వీరేశలింగము పంతులుగారు మున్నగువారు. ఈపంతులుగారు తాము వ్రాసినకవుల చరిత్రములో శశాంకవిజయముంగూర్చి వ్రాసినవ్రాఁతలో కాముకురా లగు తార "వెలిఁబెట్టిరే"యను పద్యమునందలి భావమువంటి భావమును "సీ. కన్నకూఁతు రటంచు నెన్నక..............దూఱెదవు నిను చలపోరి దోషకారి." అని తేల్చియుండఁగా దాని నాధారముగాఁ దీసికొని కవిని నాతనిగ్రంథమును బెక్కుభంగుల నిందించిరి. ఇట్టిభావములఁ దేల్చుపద్యములు నీతిబాహ్యము లనిరి. కావున నవనాగరకుల యభిప్రాయమును దెలుపుసందర్భములో "వెలిఁబెట్టిరే" యనుపద్యము కూడ నీతిబాహ్యమే యగు నని నేను వ్రాసితిని. అది నాయభిప్రాయము కా దనియుఁ బాత్రోచితవాక్యము కావునఁ గవివాక్యముగాఁ దీసికొనరా దనియు సుస్పష్టముగా లిఖించితిని. నవనాగరక వాక్యములనుగా నేను దెలిపిన వానిని

నా వాక్యములనుగాఁ దీసికొని రావుగారు తప్పువ్రాతలు వ్రాయుటయే గాక యీ ఘట్టములో, నిరర్థకవాగ్వల్లీబంధనిర్మాణము చాలవఱకు గావించిరి. పాత్రవాక్యము లన్నియుఁ గవివాక్యము లని శాస్త్రిగారు చెప్పుచో శూద్రకుఁడు శకారునివలె జారుఁడు, శర్విలకునివలె చోరుఁడు, షేక్స్పియరు ఫాల్ స్టాపువలె ముండలమిండఁడు, మాక్బెత్ సతివలె శిశుహంతకుఁ గావలె ననియుఁ గవు లెల్లరును మూర్ఖులై యుండవలయు ననియు రావుగారు వ్రాసిరి! ఇది వట్టి యధికప్రసంగము. నేనెచ్చటను బాత్రవాక్యములఁ గవిభావములనుగాఁ దీసికొనలేదు.

ఇఁకఁ బ్రవరపాత్రముం గూర్చి ముచ్చటించుకొందము.

—: పెద్దన ప్రవరునిమూఢుని జేయుట :—

మనుచరిత్రమునందుఁ బాత్రము లెట్లు చిత్రింపఁబడియుండినవో వీరెఱుంగరు. ఆగ్రంథరాజమునుబట్టి ప్రవరాదు లెట్టివార లగుచున్నారో నేను నావిమర్శనములోఁ దెలిపియుండ నాయూహలు మనుచరిత్రమునకు సంబంధములేని క్రొత్తయూహలనుగా రావుగారు వ్రాసివేసిరి. పాపము వీరు మనుచరిత్రమువైపుఁ దిన్నఁగాఁ జూచుకొనలేదు. ప్రవరుని నేను మనుచరిత్రమునకు విరుద్ధముగా నిందార్హుని జేసివేసినట్లు వీరు సాహసించి లిఖయించిరి. ఆవిప్రోత్తముని నిందార్హునిజేసినవాఁడు పెద్దనార్యుఁడు కాని నేను గాదు. మారనగ్రంథమునుబట్టి చూడఁ బ్రవరుఁడు మిక్కిలి ప్రాజ్ఞుఁడుగను నుత్తముఁడుగను గాన్పించుచున్నమాట నిజము. అట్టి మహనీయుని మనపెద్దనార్యుఁడు స్వప్రయోజనము నిమిత్తమై పనిపూని మూఢుని (బేలను గోలను) జేయుచు వచ్చినాఁడు. రావుగారీసంగతిని దెలిసికొనఁజాలక తబ్బిబ్బై పెద్దన యట్లేటవ్రాసె నని శంకింపఁదొడఁగిరి? ప్రవరుఁడు వైదగ్ధ్యము లేనిమూఢుఁ డని యాంధ్రకవితాపితామహుఁడు తనమనుచరిత్రములోనే తనవాక్యములయందే తెలిపియున్నాఁడు, గనుఁడు—

—: ప్రవరుఁ డవిదగ్ధుఁ డని పెద్దన యెటు దెల్పె ? :—

ప్రవరునియందు మోహము పెట్టుకొని యాతఁడు లభింపమి విరహతాపతప్తయై యున్న వరూథినిని బ్రవరవేషముచే వంచించి పొందనిశ్చయించుకొనిన గంధర్వుఁ డావిప్రవేషముతో నామెయు నామెసఖులును గలతావునకుఁ బోయియున్నప్పు డచటజరిగిన చర్యలలో మాయాప్రవరుఁడు తాను రసికుఁడై యుండియును గూడఁ దాను ప్రవరవేషమును ధరించి యుండెను గావునను, నాప్రవరుఁడు మూఢుఁడు గావునను దాను మూఢత్వము నడుగడుగునను జూపఁజొచ్చె నని పెద్దనార్యుఁడు స్వవాక్యములలో నిట్లులిఖించె.

"సీ. కోనసాగి కామినీగోష్ఠిఁ బ్రౌఢములైన యమటుఁజూపుల తెప్పతుదలనాఁచి
సంతసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు కందళింపకయుండ డిందుపఱిచి
పొంగారు మైఁదోఁచు శృంగారచేష్టలఁ దమిఁదెచ్చికోలుమౌగ్ధ్యమున డాఁచి
పాడము రసావేశమునవచ్చువర్ణోక్తు లాదవి నాలుకకు రాకుండఁగ్రుక్కి
మస్తకమువాంచియసురనిమానముద్ర, నేలబోటవ్రేలవ్రాయుచు నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి శిరసాకింత, యెత్తి సన్నంపుఁబలుఁగుతో నిట్టులనియె."

నేనుబైనజెప్పినభావ మంతయు నీపద్యములో నిమిడియున్నది. టీకాకారు లీపద్యభావముంగూర్చియిట్లువ్రాసిరి. "ఆప్రవరుని రూపము ధరించిన గంధర్వుఁడుం దులకుఁదగినట్టికాముకురాండ్రతోడి సాంగత్యములందుఁదనకలవాటుపడిన దిట్టత నంపుఁజూపులను ఇష్టసిద్ధియయ్యె ననుసంతోషముచేత ముఖమునందుఁదోఁచుచిఱు నవ్వును ఆయువతిదగ్గఱ వచ్చుటంబట్టి తనంతటఁ బొంగివచ్చుచున్న శృంగారచేష్ట లవలనితమకమును, మోహారసమువలని మైమఱపుచేత నోటవచ్చు సరసపుమాట లనుదనలోనేయణఁచుకొని వేషమునకుఁదగినట్టి లేనిముగ్ధభావమును దెచ్చుకొని" (పెద్దన యిచట మౌగ్ధ్య మనుపదమునే వాడినాఁడు.) ఈపద్యమునుబట్టి ప్రవరుఁ డవిదగ్ధుఁ డని పెద్దనతలం పైనట్లు గా విస్పష్టముగాఁ దేలుటలేదా? ఇవి కవివా క్యులు గాని పాత్రోచితవాక్యులు కావు. మఱియు ను పెద్దనార్యుఁడు ప్రవరుని స్ఫురునిగను మహీసురాధమునిగను జేసిన సూర్యాస్తమయవర్ణనపద్యమును రావుగారే యుదాహరించి యందలివాక్యులు కవివాక్యులే యని యంగీకరించు టయేగాక యిచట పెద్దన పెద్దతప్పే చేసినాఁ డని వ్రాసియుండిరి. దీనింబట్టి పెద్దన ప్రవరుని మూఢునిగను నధమునిగను జిత్రించివైచె ననుటకు సందేహ మేమైన నుండఁగలదా? నేను నాద్వితీయవిమర్శనములో "కోనసాగికామినీగోష్ఠి" యను పద్యము నుదాహరించి దానిమూలముగఁ బ్రవరునిఁ గవి మూఢునిఁ గావించె నని వ్రాసియుంటిని. ఆవ్రాతనైన రావుగారు చూచుకొనలేదు. నిరంకుశముగ నిస్సా రవాదమును గావించిరి. పెద్దనార్యుని భావమందే ప్రవరుఁడు మూఢుఁ డని తేలి నది గాన వరూథినీసఖులు పలికిన 'బేల' 'గోల' యనుమాటలు సత్యముగ బేల తనమును, గోలతనమును దెలుపునవిగానే భావింపవలసియుండును. కాఁబట్టియే రావుగారి విదగ్ధు లగురామచంద్రరావుపంతులుగారును, తేవప్పెరుమాళ్లయ్య గారును బ్రవరుఁడు నిజముగ బేలయు గోలయునై యున్నాఁడని తెల్పిరి.* రావు

* శ్రీ న్యాయ. కృష్ణారావు, పంతులు బి. ఏ., బి. యల్., గారు, లోకజ్ఞానశూన్యుఁడని తేల్చిరి.

గారీసంగతుల వేనిని జూచుకొనక వరూథినీసఖుల మాటలు మాత్రమే నేనాధారముగాఁ దీసికొని ప్రవరుని బేలయని తెలిపినట్లుగ భావించుకొని నన్నుఁ బరిపరి విధములఁ బరిహసింపఁజొచ్చిరి! వరూథినీసఖులు సరసతమిూఱ బేల యనక మోటుతనము పూని నపుంసకుఁ డనినచో నా వాక్యముల యథార్థముగ నమ్మి నీవును బ్రవరుని నపుంసకుఁ డనువాఁడవే కదా యని నన్ను వేళాకోళముచేసిరి. వరూథినియును నా మెసఖులును నేకాలమున నెచ్చట ప్రవరుఁ డుండెనో యాకాలమున నచ్చట నుండి యాతనిస్వియముగఁ జూచినవారు. అట్టివారు ప్రవరుని నపుంసకుఁ డనినచో నీకాలమున నిచ్చటనున్న నే నది కా దనియు నాతఁడు పుంస్త్వము గల వాఁడే యనియు నెట్లు తెలుపఁగలను? ఆధార మేదియును లేదు. ప్రవరుఁడు సంతానవంతుఁ డని కూడఁ దెలుపఁబడియుండలేదు. మఱియును వరూథినికి సంతానము పుట్టించుటకయి మొదట నామె యున్నతావునకుఁ దీసికొనిపోఁబడినాఁడు. కాని యందులకు వినియోగించుకొనకయే త్రోసివేయఁబడినాఁడు. పిల్లలఁబుట్టించుపనికై రావుగారి వియచ్చరప్రవరుఁడు నియమింపఁబడినాఁడు. ఇంకఁ బ్రవరుఁడు పుంస్త్వముగలవాఁ డగునో కాఁడో తెలుపుటకు నస్మదాదుల కవకాశ మెట్లుండఁగలదు? అట్లు తెలుపుటకుఁదగిన యాధారము రావుగారికిఁ గాన్పించినది కాఁబోలు? దాని కేమి? ప్రవరుఁడు బిడ్డలఁబుట్టించుపనికై వినియోగింపఁబడలేదు. కాన నాతనిపుంస్త్వవిషయక చర్చ యనవసరము. ప్రవరుఁడు పెద్దనార్యునివాక్యములను బట్టియే మూఢుఁడు గావింపఁబడినాఁడు. వరూథినీసఖులు బేల యనునట్లు చేయఁబడినాఁడు. ఇంతయేల ప్రవరుఁడే తాను 'బుద్ధిజాడ్యజనితోన్మాదుఁడ'నని చెప్పుకొనునిటికిఁ దేఁబడినాఁడు. ఇంక, పెద్దనచేఁ బ్రవరుఁడు మూఢుఁడుచేయఁబడినాఁ డనుటకు సందేహ మెట్లుండఁగలదు? పెద్దన ప్రవరునిఁ దనయిష్టమువచ్చినట్లాడించినాఁడు. ఇష్టము వచ్చినవేషము వేయించినాఁడు.

## —: ప్రవరునివేషముంగూర్చి :—

ప్రవరుఁడు విరాగియనియుఁ గర్మఠుఁ డనియు నమాయికుఁ డనియు నదాంభికుఁ డనియు రావుగారు సెలవిచ్చిరి. అట్టి ప్రవరునిచే మన పెద్దన శృంగారప్రియులగుదాంభికులు వేయువేషమును వేయించెను. మొలకు బంగరుబిళ్ల లమొలత్రాడు, రాకట్టు, బంగరుపనిగలయరుణాంశుకోత్తరీయము, పిఱుఁదులవఱకువ్రేలాడు జుట్టుముడిమున్నగునవి యాతనికిఁ దగిలింపఁబడినవి. ఇట్టివేషము శృంగారపురుష వేషమని రావుగారును నంగీకరించిరి. కాని యాకాలములో శ్రోత్రియయువకులు

గూడ నిట్టివేషమే వేసెడివారనియుఁ గావునఁ బెద్దనచేసినవర్ణనము కాలానుగుణముగా నొప్పే దైయున్న దనియు వ్రాసిరి! ఇటఁ గాలానుగుణ మన నేకాలమో? ప్రవరునికాలమా లేక పెద్దనకాలమా? పోనిండు. ఏదో యొకకాల మనుకొందము. కాని ప్రవరునివంటి విరాగు లెన్నఁడు బెద్దనవేయించిన రీతి వేషములను వేసియుండలేరు. అట్లు వేసెడివారనుటకై రావుగారు శ్రీనాథకృత శివరాత్రిమాహాత్మ్యమునుండి యొకపద్యము నుదాహరణముగా నిచ్చిరి. ఆపద్యము స్మార్తబ్రాహ్మణయువకుని వర్ణన మైనమాట నిజము. అందలి వర్ణనము పెద్దనచేసిన వర్ణనమువంటిదిగా నేయున్న మాట యు నిజము. కాని యాబ్రాహ్మణయువకుఁడు ప్రవరునివంటి సౌశీల్యాదులుగలవాఁడు కాఁడు. పరమనీచుఁడు. కాముకాధముఁడు. శృంగారవేషములను వేసికొని యువతీజనమును దనవశముచేసికొనఁ జూచుచుండెడివాఁడు. స్వకులధర్మమును విడిచి రాచఱికపుగోటు మున్నగువానిని ధరించెడివాఁడు. ఇట్టివాని వేషము పై రీతిగా దాంభికత్వముతోఁ గూడుకొనుటలో వింతయేమున్నది. కేవల శృంగారప్రియుని వర్ణించుటలో శ్రీనాథుఁడు పాత్రమునకుఁ దగినవేషము వేయించియుండఁగా నాపద్యమును బాత్రాపాత్రవిచారము చేయక పెద్దనార్యుఁ డనుకరించి గ్రంథమును బాడుచేసెను. శ్రీనాథునివిప్రకుమారుఁడు ముండలమిండఁడు. ఒకమాలదానితో సంభోగించు స్థితిలోనికిఁ గూడ వచ్చినాఁడు. ఇట్టివాని వేషమును మనపెద్దనార్యుఁడు పరమయోగ్యుఁడగు ప్రవరునిచే వేయించుట యెంత యనుచితమో వేఱుగఁ జెప్పవలయునా ? రావుగారిమచ్చువిమర్శనము పెద్దనను హాస్యాస్పదునిఁ జేయుట కక్కఱకు వచ్చుచున్నది, కాని, కాపాడుట కక్కఱకు వచ్చుట లేదు. రావుగారు శ్రీనాథునిపద్యమునంతను నుదాహరింపక " సరిగొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ రత్నాలతారహారముధరించి" యనుమొదటిపాదమును మాత్రమే యుదాహరించిరి. పద్యమునంతను నుదాహరించిన " గీ. ఆత్మవంశపరంపరాయాతమైన, వైదికాచారమార్గంబు వక్కణించి, మూరజము రాచఱికమును వలవరించి! నగరివీథులఁ జరియించుఁ బ్రెగడసుతుఁడు.'' అనుమాటలంబట్టి రహస్యము బయలుపడిపోవు ననుభీతిచే రావుగారు పద్యముయొక్క మొదటిపాదము మాత్రమిచ్చిరి. ఈరీతిగా లోకమును మోసముచేసి యైన నావ్రాసినదానిని గాదనుటకై శ్రీమదచ్యుతరావుగారు హాస్యాస్పద మగు ప్రయత్నము గావించిరి. వీరిచ్చిన ప్రమాణముం గన నాకును నొకకథ జ్ఞాపకము వచ్చుచున్నది. తొల్లియొక యిల్లాలు తనపిల్లకుఁ గ్రొత్తగ రాకిడి వేయ దలఁచుకొని యొక వృద్ధబ్రాహ్మణుని

జూచి నేఁడు రాగిడి నూతనముగా ధరించుటకుఁ దగిన మంచిదినమా యని యడిగెను. నేఁడు సోమవారము "శుక్రేత బుధసోమయోః" అనినాఁడు, కాన, మంచి దినమే యని యాతఁడు పలికె. అది తలపనికిఁ గాదా యని యామె యడిగినది. రాగిడి ధరించుట మాత్రము తలపని కాదా యని యాతఁడు సమాధానముఁజెప్పె. ఈవృద్ధవిప్రుఁడు ప్రమాణముచూపుట యెంతసరసముగ నున్నదో మనరావుగారు పెద్దన్నను గాపాడుటకై చూపిన ప్రమాణమును నంత సరసముగా నున్నది. పాపము రావుగారి జ్ఞాన మపూర్వ మైనదిగాఁ గాన్పించుచున్నది. నేను మార్కండేయపురాణముల ననుసరించి ప్రవరాఖ్యుని సర్వోత్తమునిగానే యీక్రిందికీతిని వర్ణించితిని. "ప్రవరుఁడు వీరాగ్రేసరుఁడు. అంతశ్శత్రుజయము పొందిన మహావీరుఁడు, ధర్మవీరుఁడు.'' నే నెచ్చటవ్రాసినను ప్రవరుని నుత్తమోత్తమునిగాఁ జెప్పితినే గాని మఱి యొకలాగునఁ జెప్పి యుండలేను. పెద్దనమాత్రము తనమనుచరిత్రములోఁ బైరీతిగాఁ జిత్రింపక స్వలాభముకొఱకై చేతికి వచ్చిన ట్లెల్లఁ జిత్రించె. ఆతఁ డట్లొనర్చిన సంగతిని గూడఁ జదువరులకుఁ దెలిపితిని. రావుగా రెవరియభిప్రాయ మేదియో తెలిసికొనఁజాలక తబ్బిబ్బై తుదకు నావిప్రోత్తముని, నేనధము నిఁ జేసినట్లు వ్రాసివేసిరి! ఆద్విజపుంగవుని నధమునిఁజేసినవాఁడు పెద్దనార్యుఁడు గాని నేనుగాను. చదువరులు మామావ్యాసముల శ్రద్ధతోఁ జదువుకొని రావుగారిప్రజ్ఞావిశేషమును దెలిసికొందురుగాక.

రావుగారికి నెట్లైన నన్ను నధిక్షేపించుటయే కావలెనుగాని సత్యప్రకటనము కావలసినదికాదు.

## —: స్వరోచింగూర్చి :—

స్వరోచింగూర్చి ముచ్చటించుటకుఁ బూర్వము మనరావుగా రొకవిచిత్ర ధర్మోపన్యాసము నుపోద్ఘాతముగా మొదటఁ బెట్టిరి. అధర్మమును ధర్మముచేయఁ దలఁచుకొనినప్పుడెల్ల నిట్టిముగ్ధోపన్యాసముల ముందుంచి వాగాడంబరము చూపుటలో రావుగారు తమనైపుణ్యమును వెల్లడించుచు వచ్చిరి! దోషదూషితమైన స్వరోచిపాత్రమును నిర్దుష్టముచేయనెంచి ప్రథమమునఁ బాశ్చాత్యవివాహపద్ధతికిని బ్రాచ్యవివాహపద్ధతికిని గల భేదమును గూర్చి చిన్నియుపన్యాస మొకదానిని జిత్రించిరి. అదిబాగుగనే యున్నది. కాని యదది యీఘట్టమునఁ బెట్టవలసిన యవసరముమాత్రము మృగ్యము. ప్రాచ్యదేశశృంగారమునకును బాశ్చాత్యదేశశృంగారమునకును మూలసూత్రములలోనే, భేద మున్న దనియుఁ బాశ్చాత్య

దేశమందు నాచరణములో నెట్టివిశృంఖలస్వేచ్ఛారతియున్నను శాస్త్రీయముగా, నేకపత్నీస్వీకరణమే యంగీకృతము కాన క్రైస్తవదేశ వాఙ్మయములలో నొక నాయకునకే బహునాయిక లేకకాలమున నుండరా దనియుఁ బ్రాచ్యదేశములం దన్ననో, యేకకాలమం దొక నాయకునకుఁ బలువురు భార్యలు శాస్త్రోక్తముగా నుండవచ్చునుగాన బహుభార్యలతో నొకఁడు కాఁపురముచేయవచ్చు ననియు నీ ప్రాచ్యశృంగార రసమందలి యీపరిణయవిధానపు మూలసూత్రమును దమప్రతి వాది ముఖ్యముగా గమనింపవలసియుండు ననియు శ్రీ రావుగారు లిఖించిరి. ఇది యంతయు ననవసర ప్రసంగము. ఏమన, నే నెచ్చటను స్వారోచి బహుభార్య లతోఁ గ్రీడించుట తప్పని వ్రాయలేను. బహుభార్యాత్వము పనికిరా దనలేదు. ఇంక శ్రీ రావుగారుచూపిన యీవాగాడంబర మంతయు నెందులకు? ఇట శ్రీ రావు గారు ప్రకటించుకొనిన పాండిత్యమంతయు జంకిన్నను* పాండిత్యమును బోలియు న్నది. అది యటు లుండనిండు. అస్మదాదులను స్వారోచియందు నెంచినదోష మతికామపరాయణత్వము కాని, బహుభార్యాత్వము కాదు.

అతనిబహుభార్యాత్వమును నిందించినవారు పెద్దనార్యునిపక్షమునుబూని యాతనినెట్లయిన సమర్థింపయత్నించినవారు. శ్రీ న్యాపతి కృష్ణారావుపంతులు బి, యే., బి, యల్., అడ్వొకేట్టుగా రీక్రిందిరీతినివ్రాసిరి.

"స్వారోచి పెక్కండ్రభార్యలను బెండ్లాడుట పెద్దనకు రుచింపలేదు. అయ్యది నీతిబాహ్యమని తోఁచెను. అట్టిది లోకమునఁ బ్రచురింపకూడదను నాశతో నీ సంభాషణనిర్మించెను."

దీనింబట్టి శ్రీ రావుగారు స్వపక్షమువారి వ్రాఁతలనే ఖండించు కొనిరిగాని యస్మదాదులవ్రాఁతల ఖండింపఁగలిగియుండలేదని తేలుచున్నది.

* జంకిన్నను గోల్డుస్మిత్తను నింగ్లీషుకవివిరచిత నవలలో నొకపాత్రము. ఈతఁడందఱ బుట్టలోఁ బెట్టు స్వభావముకలవాఁడు. ఇతనికిఁ బాండిత్యముగాని, వేదాంతపరిచయముకాని లేకున్నను బ్రపంచముంగూర్చి మంచివేదాంతవ్యాఖ్యలఁ గొన్నిటిని నెట్లో సంపాదించుకొని వానిని బండితులు తార సించినప్పుడు సందర్భములేకున్నను నొక్కటియే పాటగాఁ బాడుచుండెడివాఁడు, సందర్భరహితముగాఁ బలికిన పలుకులైనను సారవంతము లయిన వగుటచే వానినిబట్టి పండితులు జంకిన్నను ని... వలలోఁ బడుచుండెడివారు.

# గ్రంథస్వీకారము.

ఆంధ్ర వాచస్పత్యము:—ఇది, ఆంధ్ర విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులు బ్రహ్మశ్రీ కొట్ర శ్యామలకామశాస్త్రిగారిచే రచియింపఁబడిన నిఘంటువు- వీరి జనకులు శుద్ధాంధ్ర నిఘంటువును, లక్ష్మీనారాయణీయ మని తమనామముతోడ రచించి స్వగృహమునందు స్వకీయ ముద్రాక్షరశాలయందే ముద్రింపించి ప్రకటించిరి. వారిపుత్రులు వీ రుభయభాషలకుఁ గూడనుపయోగించునట్లు నూతనముగ రచియించి స్వముద్రణాలయమునందే ముద్రించి యీ వాచస్పత్యమును బ్రకటించుచున్నారు. ఈకోశము ప్రతిమాసమునకు 100 పుటలచొప్పున సంచికలుగా వెలువడుచుండును.

ఆయాపదముల పర్యాయపదములఁ దెలిసికొనుటకై యెక్కడఁ జూడవలయునో యవి తెల్పఁబడియుండుట యీకోశములోని యొక విశేషము—

ఈకోశమునకు, శ్రీమాన్ కొమాండూరి శఠకోపాచార్యులు ఎం.ఏ.బి.ఎల్. గారి యింగ్లీషుపీఠికయును శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి తెనుఁగుపీఠికయును గలవు. అందితర నిఘంటువులలోనున్న పద్ధతియు నీవాచస్పత్యములోని పద్ధతియు వివరించియున్నారు.

సంపూర్ణముగా నిఘంటువు 25 సంచికలలో ముగియవచ్చును. సంపూర్ణ ప్రతివెల రు 25 లు. భాషాభిమానులు చందాదారులుగాఁ జేరి, శాస్త్రిగారియుద్యమమునకుఁ దోడ్పడఁదగును. గ్రాహకులు కాఁగోరువారు, కాకినాడ సమీపమునందలి కరప(పోస్టుగలదు)గ్రామములోనున్న శ్రీ శాస్త్రులు వారికి వ్రాయవలయును.

---

సీతాకళ్యాణము:—కవిభూషణ, శతావధాని గోరుగంతు అచ్యుతసూర్య నారాయణశర్మగారు రచియించిన పద్యకావ్యము, అయిదాశ్వాసములు- ఉభయ భాషాపదయుతమై పలుతావుల రసోచితపదయుతవర్ణనలతో నీకవిగారికవిత యలరారుచున్నది. చూడుఁడు—

ఉ. వాలులఁబోలు మేలుజిగివాలుజడల్ నెఱిఁగొప్పు లొప్పుగా
లీల బిగించి పయ్యెదల లేనడుముల్ బిగియించి మించి కెం
గేల నొకొళ్లొకళ్లఁ గొని కేకిసగొట్టుచుఁ బూవుఁబోఁడులు
య్యాలల నూగఁ జొచ్చి రెసలారు కలారసికత్వ మేర్పడన్. 42- పుట.

మ. ఇనుఁడై కీర్తికృతేంమఁడై విబుధుఁడై యెంతేగుసుఖ్యాతియై
ఘనుఁడై వర్ధిత భూమిజుండయి సుధీకల్పక్షత్రవి వ్రాతచం
దనుఁడై శాత్రవరాజరాహువయి గోత్రాధృద్భుజాకేతువై
యినభూధర్మముతో నవగ్రహ భయాదీతుల్ హరించున్ వెసన్.

కథ ప్రసిద్ధమైనదే: సీత భూమిలో దొరకినఁ గొని పెంచి పెద్దదానిం జేసి జనకుఁడు ధనుర్భంగము పణముగాఁ బెట్టుట, విశ్వామిత్రుని మూలమున రామ లక్ష్మణులు వచ్చుట, మొదలైనదియే. కథాసందర్భమునుబట్టి యహల్యా శాప మోక్షణాదులు చేర్పఁబడినవి: సీతారాముల శోభనోత్సవముతో నిది ముగింపఁబడి నది. కొన్ని యచ్చుతప్పులకు శుద్ధపత్త్రముం జేర్చినారు; తోట్రువపాటు (పుట 21.) కూరుచొనంగ (61) మొదలగు ప్రమాదములు సవరింపఁబడలేదు. పుటల పైభా గమున నాశ్వాసములం దెల్పవలసినది. పద్యసంఖ్యకూడ నుండినఁ జదువువారికి సాయ పడుచుండును. ఈరెండు ముఖ్యవిషయములును ముద్రణసమయమున విడువఁబడినవి— ఇది, విశాఖపట్టణముజిల్లా యెలమంచిలి, క్రొత్తపేటలోఁ గవి గారియొద్ద రు. 1 వెలకు దొరకును.

---

విష్ణుమాయానాటకము:—ప్రాచ్యపరిశోధనాలయాంధ్ర శాఖాప్రచురణము- 3 వ గ్రంథము. రాధామాధవ బిరుదమునొందిన చింతలపూఁడి(యె)యల్లనార్య ప్రణీతము. సంపాదకులు బ్ర॥ కోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారు. (మద్రాసు విశ్వకళాపరిషత్తులో, ప్రాచ్యపరిశోధనాలయమునం దాంధ్రోపన్యాసకులు) కవి చింతలపూఁడియెల్లనార్యుఁడా యల్లనార్యుఁడా! పీఠికయందంతటను ఎల్లనార్యుఁడు, యెల్లనార్యుఁడునని వ్రాసి-ముఖపత్త్రములో యల్లనార్య (Yallanarya) యని యు నాశ్వాసాంత్యగద్యములలోఁగూడ యల్లనార్యయనుటలో వీరి కీభేదమును గూర్చి సందేహమున్నట్లు కనఁబడుచున్నది. పీఠికలో నావిషయము నుగ్గడింపకుం డుటచే ప్రమాద మేమో యనుకొనవలసియున్నది. ఎల్లనార్యునందఱు నెఱుఁగ మందురేమో, కాని, శ్రీకృష్ణదేవరాయల యాస్థానములో నగరు, తగరు, వగరు, తొగరు, అను పదములను బ్రాసములందుఁగూర్చి రామాయణభారతభాగవతకథ లంబద్యములుచెప్పి రాజును మెప్పించెనన్న కథ యీతనిదే యనినఁ నందఱుఁ దమ కుఁబరిచితుఁడే యని తెలిసికొందురు. కృత్యాదిపద్యములు లేవు; నన్నయభట్టార కునివలె మొదలిడియెనేమో యని-

చ. కనుఁగొన నింద్రనీలమణికాంతి నొకప్పుడుఁ బూర్ణచంద్రచం
దనరుచి నొక్కవేళ నరుణద్యుతి కుంకుమదీప్తి నొక్కచోఁ
దనరి గుణత్రయాత్ముఁడయి తాన సమస్తము నైన దేవునిన్
వనరుహనాభుఁ బల్లఱు మనంబున భావనచేసి వెండియున్.

అని ప్రథమాశ్వాసము రెండవపద్యమును-దానితరువాత-
“అఖిలంబు నిండి ప్రహ్లాదప్రమాణోక్తి వెలయఁగనిలిపిన విశ్వమయుత.”
అను పద్యమును జూడఁ దోఁచును.

ఇక్కవికి రాధామాధవకవియను బిరుదు గలదు. అది రాధామాధవమను కావ్యమును రచించుటచే వచ్చినది. ఈరెండును గాక యీయెల్లయకవి తారక బ్రహ్మరాజ మను నొక గ్రంథమును రచియించెను. ఈతనికవిత్వము బహు సరస మైనది. మచ్చుచూడుఁడు.

చ. పరమమునీంద్ర యోభువనపాత్రచరిత్ర మృకండుపుత్ర నీ
గురుపరమార్థబోధమునకున్ మదిఁగొల్పక బ్రహ్మదానహం
కరణ పరాయణత్వమునఁ గానక నన్ను నధఃకరించి దు
ష్కరతరపీడ చేసెఁ ద్రిజగంబుల కంచుఁ దలంక నేటికిన్. 3-255

మ. మదగర్వంబును యౌవనోదయము రమ్యత్వంబు మాధుర్యమున్
మృదులాలాపదరస్మితాంశుకలనాస్మేరాననాబ్జంబు పెం
పొదవన్ మన్మథరాజ్యలక్ష్మిక్రియ నేత్రోత్సాహసంపత్కళా
సదనంబై విలసిల్లె నాకపటభాషాదేవి లీలాగతిన్. 3-291

మ. గతమత్సర్యులు సంగవర్జితులు రాగద్వేషదూరుల్ మహా
మతు లాత్మీయతపోధిదైవముగ సన్మానించి నిన్నాత్మసం
స్థితుఁగావించి భజించి మోక్షపదముం జేకొందురుగా కిట్లు దు
ర్మతికి న్నాకేటులబ్బు నాతరమె నీమర్మంబెఱుంగన్ హరీ. ౫-146

అందందుఁ బురాణములలోఁ గల విష్ణుమాయ లన్నియుఁ జేర్చి యీగ్రంథమును రచించినాఁడు. ఇట్టి విష్ణుమాయావిలాసములు పెక్కులు గలవు-కంకంటి పాపరాజు “విష్ణుమాయావిలాసాభిధాన యక్షగాన నిర్మాణధురీణుఁ” డని కలదు. కంకంటివారిలో నింకొకఁడు ద్విపదలో రచియించియున్నాఁడు. అది బహుకాల ముక్రిందట నచ్చుపడినది. ఎక్కడనో గాని దొరకదు. చెన్నపురిలోఁ గొందఱ యొద్దఁ గలదు. రోసనూరి వేంకటకవి, ఎఱ్ఱగుడిపాటి వేంకటకవులు కూడఁ బద్యకా

వ్యములుగ రచించిరి. నాటకమనుట, నిది మాయానాటక మని వాడుక మాటగా నున్నది. ఈగ్రంథమునకుఁ బ్రకాశకులు విపులమగు పీఠికను వ్రాసియున్నారు. అందనేక విషయములు తెలియవచ్చును. దీనివెల రు. 2 లు. మద్రాసు యూనివర్సిటీ ఆఫీసులో దొరకును.

---

శ్రీకృష్ణరాయబారము:—కళాప్రచారక సమితివారు బరంపురములోఁ బ్రకటించుచున్న గ్రంథములలోనిది. సంజయరాయబారమును గొంతకాలముక్రిందటఁ బ్రకటించిరి. ఇది శ్రీకృష్ణరాయబారము. కృతికర్త బ్ర॥ దేవరాజు వేంకట కృష్ణరావుగారు, బహువిధముల భారతము నామూలాగ్రముగాఁ బరిశీలించి యీ రెండు రాయబారములను గళాసమితికిఁ గళఁ దెచ్చుటకై రచియించిరి. శ్రీకృష్ణుఁడు నడపిన రాయబారమును దుర్యోధనాదుల కుచేష్టలును జక్కఁగ వివరించినారు. భారతములోని సారములే యీ రెండు రాయబారములును—అట్టివానిని మనోహరమైన శైలిలో నిరుపమయిన రీతిని కృష్ణరావు పంతులుగారు రచించుట శ్లాఘ్యము. వీరివలె నిక్కాలమున నిట్టిశైలిని గద్యరచనము గావించినవా రరుదు.

కౌరవపాండవుల దాయభాగనిర్ణయవివాదము నింను రెండు తెఱఁగుల నెత్తికొని విమర్శించిరి.

దుర్యోధనుఁడు చెప్పినమాటలలోఁ బాండవులు గాలికి దూలికి బుట్టిరని, మాతండ్రియే సింహాసనమునఁ గూర్చుండెను, పిన్నతండ్రి దేశములుగొట్టి తెచ్చువాఁడు. సింహాసనముమీఁదనున్నవాఁడు రాజుగాని కన్నుకలిగి నలుదెన్నులు తిరుగుచుఁ బ్రజలకుఁ దలలోనాలుకయైన......మాత్రమునఁ బాండునకు రాజ్యమున స్వత్వమెక్కడ......తండ్రికే లేనియధికారము కొమరుల కెటులభించును. ఇద్దఱు రాజులుండుటకాని...పంచికొని తినుటకాని సంప్రదాయముకాదె- అను మాటలకుఁ గృష్ణుఁడుచెప్పిన సమాధానము బహునిపుణముగా నున్నది. గ్రంథవిస్తరభయమున విరమించెదము.

తొమ్మిది ప్రకరణములును, (అంతర్భాగములతోఁ గూడ) పరిశిష్టము, ఉపసంహారమును గూడి (డెమ్మీ) 200 పుటలు గలది. 1937 సంవత్సరము బి. ఎ. పరీక్షకు మద్రాసు విశ్వవిద్యాలయమువారు దీని నొక పాఠ్యగ్రంథముగా నిర్ణయించిరి. వెల రు 1.

---

శ్రీరామవిజయము:—గ్రంథకర్త బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి సోదరులును చిరకాలము (34సం) పిఠాపురము మహారాజావారి (కాకినాడ) కాలేజీలో సంస్కృతపండితులునగు బ్రహ్మశ్రీ సుబ్బయ్యశాస్త్రిగారు. వీరు సంస్కృతపండితులు వైయాకరణులు, కీ. శే. శ్రీ పరవస్తు రంగాచార్యులువారి శిష్యులు. వీరింతకుమున్ను - ఆంధ్రములో నుపన్యసించుటయుఁ బత్రికలలో వ్యాసములు వ్రాయుటయేఁ గాని గ్రంథరచనకుఁ గడఁగియుండలేదు. బహుభాషలలో, కావ్య నాటక పురాణాది రూపములఁ గల పెక్కు రామాయణగాథలను బరిశీలించి శ్రీమద్రామాయణమును మూలగ్రంథముగాఁ గొని యీయపూర్వరామాయణమును గద్యముగా రచియించుచున్నారు. శ్రీమద్రామాయణములో వాల్మీకి చెప్పక విడిచినగాథల నితరరామాయణములనుండి గ్రహించి సందర్భానుసారముగాఁ జేర్చిరి. అతఁడు సూచించి విడినచివిషయముల విరివిగా నిందు సమకూర్చిరి.

శాస్త్రులుగారు, తమ రీరామాయణము నెనిమిది కాండములుగా విభజించిరి. అం దిది పూర్వకాండము. ఈ పూర్వకాండములో దిలీపచరిత్రము మొదలు దశరథుఁడు పుత్రకామేష్టి చేయువఱకుఁ గలదు. ఎనిమిదవది యుత్తరకాండమఁట-అందుఁ బ్రస్తుత ముత్తరకాండ మని పేర్కొనఁబడుచున్న దానిలోని కథ గా దఁట. కుశలవచరిత్రముతోఁ బ్రారంభింపఁబడి నలచరిత్రముతో ముగియునఁట-వీరీరామకథను వ్రాయుటకుఁ గలకారణము "నాయూహ" యను మొదటి పీఠికలో—

"ఈదినమణి సంతతి సంభవు లగుబాలుర పరాక్రమక్రమములు సురాసుర వీరులను గూడ బెగడొందఁ జేయుచున్నవి. అట్టి పురుషసింహుల యుదార జీవితములతోడను, అంతటి సతీలలామల పుణ్యచరితములతోడను, అట్టి బాలవీరుల మనోహరోపాఖ్యానములతోడను, విరాజిల్లుచున్న భాస్కరాన్వవాయచరిత్రములఁ జనువువారి జిహ్వయే రసాభిజ్ఞ యగు రసన. వాని నాకర్ణించు శ్రవణములే నాదకళోపాసకము లగు శ్రుతిపుటములు.

"సూర్యవంశ మింతటి మహిమాఢ్యము కావుననే శ్రీహరి యితరరాజన్యకులముల విడిచి, ఈభానుగోత్రమున మానవుఁడుగా జనింపఁ గుతూహలి యయ్యెను. శబ్దార్థసార వేది యగు కాళిదాసకవీంద్రుఁడును, అనేక దివ్యావతార చరితము లున్నను జేకొనక ఈసూర్యవంశ్య సార్వభౌముల జీవితములనే తనప్రథమకావ్యమగు రఘువంశమున ఘనముగా వర్ణించి, నిజకావ్యకల్పకముయొక్క యను

పమాన భావసుమసౌరభములఁ గవితోద్యానవీథులఁ బ్రసరింపఁజేసి విబుధానందమును సమకూర్చియున్న వాఁడు.

"కావున నట్టియమూల్యగుణశోభితమగు సూర్యవంశ్య చరిత్రమౌక్తికహారమును ఆంధ్రసరస్వతీమాతృకంఠమున సమర్పింపఁ గుతూహలుఁడనయి యీతెనుఁగు కబ్బమును సమకూర్చితిని" అని తెల్పిరి.

శాస్త్రిగారి గద్యశైలికిని పైరుచిరవాక్యములనే యుదాహరణముగా గ్రహింపవచ్చును.

ఈ రీయుత్తమరామాయణమునందలి పూర్వకాండమును వారి ప్రియమిత్రములగు దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుఁడుగారి కంకితము గావించిరి. విజయదశమినాఁ డాకృతిసమర్పణోత్సవము కాకినాడలోఁ గడు రమ్యముగ జరిగినది.

ఈభాగము పదునెనిమిది యధ్యాయములు, నూటముప్పదియాఱు పుటలలో నిమిడినయది. పుస్తకము ముద్రణాది సర్వవిషయములలోను సుందరముగా నున్నది. వెల రు 0-12-0.

---

వేయి స్తంభాలగుడిశాసనము.

ఈగ్రంథము పూలతోఁట గ్రంథమాలా ప్రచురణములలో రెండవది. శాసనమును జరిత్రాంశమూలానువాదసహితముగాఁ బరిష్కరించి శ్రీ విద్వాన్ అప్పన్న శాస్త్రిగా రాంధ్రలోకమునకు సమర్పించిరి. ఆంధ్రచరిత్రపరిశోధనమున కాంగ్లభాషాభ్యసనమె ముఖ్యము గాదు. ఆంధ్రసంస్కృతభాషల రెండింటియందును పాండిత్య ముండినఁ గాని యట్టిపరిశోధనము వన్నె కెక్కదు. శ్రీ శాస్త్రిగారి యాంధ్రసంస్కృతపాండితి కాంగ్లభాషాజ్ఞానము తోడ్పడి బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లు వారిపరిశోధనకు వన్నె తెచ్చినది.

ఈశాసనము సాధారణముగాఁ జరిత్రకారుల 'కనుమకొండశాసన' మను పేరుననే యిదివఱకుఁ దెలియును. కొంతకాలము కాకతీయులకు రాజధాని గానుండి యీనగరము మహోన్నతస్థితిని గాంచెను. తన్నగరస్థితమైన వేయిస్తంభాలగుడియం దీశాసనము లిఖించుటచే శాస్త్రులవా రీశాసనమునకు వేయి స్తంభాలగుడిశాసన మని గంభీరనామ మొసంగిరి.

త్రిలింగసామ్రాజ్యస్థాపకుఁ డగు కాకతిప్రోలరాజుకుమారుఁడైన రుద్రదేవుని పరాక్రమాతిశయములను వర్ణించుచు నచింతేంద్రవరుఁ డను కవి దీనిని లిఖించెను,

ఈరుద్రదేవుఁడు క్రీ. శ. 1158-1195 సంవత్సరమువఱకు త్రిలింగసామ్రాజ్యమును బరిపాలించి, వైరివీరనికాయమును సంహరించి,బల దర్ప శౌర్యములతో సామ్రాజ్య మేలిన మేదినీధవుఁడు. శాస్త్రిగారు శాసనమూలమును, శ్లోకముల కర్థమును, దాత్పర్యమును, శాసనమునం దుదాహరింపఁబడిన చారిత్రికస్థలములయొక్కయుఁ బురుషులయొక్కయు సంగ్రహచరిత్రము నిచ్చి, శాసనకవి యైనయచింతేంద్రవరుని కవితాచాతుర్యము, నాంధ్రలోకమునకు వెల్లడించిరి.

౧. మూఁడొకొండదియవపుటలో 'రాజ్యం ప్రాజ్యం లవణజలధే' అనుశ్లోక ములోని 'ప్రాజ్యం' అనుపదము 'ప్రాచ్యం' అని యుండిన, బాగుగా నుండు నని వారు సెలవిచ్చిరి. కాని పూర్వశాసనములలోను, ఆంధ్రసంస్కృతకావ్యములందును నీప్రాజ్యశబ్దము బహుస్థలములలో విశేషణముగాఁ బ్రయోగింపఁబడినది. అది యుచితముగానే యున్నది. చూడుఁడు:—

(1) జగదేకప్రాజ్యసామ్రాజ్య-కాశీఖండము, తృతీయాశ్వాసము ప. 246.

(2) ప్రాజ్యలక్ష్మీం ముదావహత్ J. A. H. R. S. Vol. V. P. 43.

(3) 'ప్రతిదినపరివృద్ధప్రాజ్యరాజ్యోవిభాతి' Epi-Ind.Vol. III.P.86.

(4) 'ప్రాప్తేభ్యంప్రాజ్యవిక్రమః' కుమారసంభవము.Conts. II. V. 18.

౨. తొంబదియేడవపుటలోని 'కందూరోదయచోడవంశవిలసత్' అను శ్లోకములోని 'కందూరోదయ'అను పదసంధి తప్పనియు, లేఖకప్రమాద మనియు శాస్త్రిగారు తలఁచిరి. కాని ప్రాచీనశాసనములలో 'ఊరు' పదము 'ఊర' యని, అకారాంతముగా నున్నది కాని ఉకారాంతము గాదు. కావున- ఆపదవిభాగము 'కందూర + ఉదయ'యనియేచేసికొనవలయును. ఇది లేఖకప్రమాదము మాత్రము కాదు. ఊరపద మే ఊరయ్యెను. కొన్నియుదాహరణము లిత్తును. 'ఊర' అంత ములుగ నుండెడి ప్రాచీనగ్రామనామము లెన్నియో గలవు.

| | | |
|---|---|---|
| నెం. 1202 | మహాకందూర | Epi-Ind. Vol. X. Luder's Lists. |
| ,, 1209 | నడతూర | |
| ,, 1213 | తురులూర | |
| ,, 1295 | కూడూర | |

'ప్రాలూరగ్రామే' J. A. H. R. S. Vol. I. P. 92.

శాసనలేఖకుఁడైన అచింతేంద్రకవి తనపాండిత్యమును, అనర్గళకవితా ధోరణియుఁ జూపుచు శాసన-మంతయు వివిధవృత్తములతో, నుత్ప్రేక్షాలంకార

ములతోను బూర్తిగావించెను. గ్రంథమునందు మూఁడు దేశపటములును, బదు నాల్గు చిత్రపటములునుముద్రింపఁబడియెనుగాని, శాసనఫలకముమాత్రమువదలి వేసినారు. ఆంధ్రభాషలో శాసనమును బుస్తకరూపకముగాఁ బ్రకటించుట కిది రెండవతడవ. శాసనపటము లేకపోవుట యీగ్రంథమునకుఁ గలగొప్ప కొఱఁత.

గ్రంథనిబంధనము సులభసాధ్యము గాదు. శాస్త్రిగారు విశేషశ్రమ కోర్చి కాకతీయ చరిత్రాంశమునకు ముఖ్యమయిన శాసనమును బుస్తకరూపమున వ్రాసి యాంధ్రలోకమున కొసఁగుటచే వా రాంధ్రుల కృతజ్ఞతకు సర్వదా పాత్రులు.

గ్రంథప్రకాశకులు, పూలతోఁటగ్రంథమాల, హనుమకొండ, నైజాం. వెల రెండురూపాయలు. కుందూరి ఈశ్వరదత్తు.

---

# కవి, కవిత.

—జి. జాషువాకవిగారు—వినుకొండ—

గీ. సందిటక్షరాని వృద్ధభూషణము లెన్నొ, తనువునఁ దగిల్చి కావ్యసుందరిని దిద్ది
బరువుమోయించితత్త్వంబుమఱచిపోవు, కవియెఱుంగఁడువ్యంగ్యవాగ్గర్భమహిమ.

గీ. పొడుగుబరువుననలనల్లఁబదములిడుచుఁ, గదలిచనుదెంచుజన్నంపుమొదవునట్లు
విపులరసభావభరితగంభీరగమన, మమరి చూపట్టవలయుఁ గబ్బములకునెరు.

మ. అసమానంబుగ, ద్వ్యర్థికావ్యరచనావ్యాయామముంజేసి, "స
ర్కసుడేరా"బిగియించి సూరకవి, యాకాశంబునం బల్లటీల్
"బసికీ"ల్గొట్టియుఁ గావ్యతత్త్వమును జూపంగోరి గ్రంథాంతర
ప్రసవంబుల్ వెలయింపఁడే ? నవరసప్రాధాన్యధన్యోక్తులన్.

సీ. గీర్వాణకవులు ద్రాక్షిసకావ్యపథముల నొడలు చెమ్మటలూర నడువవలయు
మనకవిత్రయము పెట్టినకావ్యభిక్షకుఁ బలుమాఱు దోయిలింపంగవలయు
నన్యదేశీయకావ్యాంబుధుల్ మథియించి గుణరత్నముల నేఱికొనఁగవలయు
నధునాతనకవీంద్ర ల్లల్లుకబ్బములతాలింపుసొంపుల నాకళింపవలయుఁ
దెలుఁగుసాహిత్యసుందరీదేహవల్లి, కెరవుసొమ్ముల సొగసు రానీక హృదయ
మెఱిఁగి మధురంపునడకలుగఱపవలయు, నది కవిత్వంబతండుశారదకుగురుఁడు.

---

ప్రకాశవర్షకృత*

# రసార్ణవాలఙ్కారము.

## ప్రథమపరిచ్ఛేదము—'దోషప్రమోషము.'

పద,వాక్య,వాక్యార్థ దోషములు.
1. పదే వాక్యేఽథ వాక్యార్థే దోషవర్గస్త్వయం త్రిధా
క్రమశః పూర్వభఙ్గ్యాతు తత్ప్రపఞ్చః [ప్రకీర్త్యతే].

చతుర్దశపదదోషములు.
2. [అసాధుచా] నిబద్ధం చ కష్టం క్లిష్ట మనర్థకమ్
అపుష్టార్థం చ గూఢార్థ మప్రతీతం ససంశయమ్.

3. నేయార్థ మసమర్థం చ యచ్చ తత్రాప్రయోజకమ్
దో ♦ ♦ షమితి స్పష్టం పదదోషా శ్చతుర్దశ.

అసాధువు.
4. శబ్దశాస్త్రవిరుద్ధం య త్త దసాధు నిగద్యతే
అనిబద్ధము.
న ప్రయుక్తం[కృతీన్ ?కవీన్ ]ప్రై?ర్యదనిబద్ధంతముచ్యతే.

కష్టము.
5. ప్ర ♦ ♦ చ్చార్యవర్ణ్ణస్తు కష్టం శ్రవణమర్భగమ్
క్లిష్టము.
పారమ్పర్యేణ చార్థస్య సూచకం క్లిష్ట ముచ్యతే.

అనర్థకము.
6. పాదపూరణమాత్రం య త్తచ్చ ♦ ♦ దనర్థకమ్
అపుష్టార్థము.
వాచ్యతుచ్ఛతయా క్లిష్ట మపుష్టార్థం మనీషిభిః.

గూఢోక్తి.
7. అప్రసిద్ధార్థసమ్బద్ధం గూఢోక్తి రభిధీయతే
అప్రతీతము.
శాస్త్రస్ ♦ ♦ ♦ యుక్తంయ దప్రతీతం తదుచ్యతే.

ససంశయము.
8. యత్రార్థాన్తరసమ్బంధ స్తద్వ దస్తి ససంశయమ్
నేయార్థము.
స్వయంకల్పితసఙ్కేతం నేయార్థ [మభిధీయతే].

అసమర్థము.
9. అసమర్థంతు య ద్బద్ధం రూఢివర్త్మవ్యతిక్రమాత్
అప్రయోజకము.
వివక్షితప్రమేయస్య నోపకా ర్యప్రయోజకమ్.

దేశ్యము.
10. దేశ్య ♦ థవా[?]యన్న్యస్తం దేశరూఢిగతం పదమ్
గ్రామ్యము:[అసభ్యము, అమంగళము, ఘృణాకరము.]
అస భ్యామఙ్గలం గ్రామ్యం తథా యచ్చ ఘృణాకరమ్.

---

* ప్రకాశవర్షునియుదంతమును, రసార్ణవాలంకారసమాలోచనమును గాలాంతరమునఁ బీఠికారూపమున నొసంగఁబడును. ♦ఈచుక్కలున్నచోట నెన్నిచుక్కలున్న నన్ని యక్షరములు లేవనియర్థము. [యా. వే. వీ. రా. సంపాదకుఁడు.]

11. సాక్షాత్తత్ స్మృతిహేతుత్వాత్త్రివిధా * * * భవేత్

చతుర్దశవాక్య దోషములు. శబ్దహీనం క్రమభ్రష్టం విసన్ధి పునరుక్తిమత్.

12. వ్యాకీర్ణం భిన్నవృత్తం చ సంకీర్ణం గర్భితం తథా
విభిన్నలిఙ్గవచనే ఖఞ్జం న్యూనాధికం భవేత్.

13. శ్లేషాదిగుణహీనం చ వాక్యదోషా శ్చతుర్దశ

శబ్దహీనము. భిన్నభాషాపదావిద్ధం శబ్దహీనం [ప్ర] కీర్తితమ్.

క్రమభ్రష్టము. 14. శబ్దార్థవ్యత్క్రమో యత్ర క్రమభ్రష్టం తదిష్యతే

విసంధి. విరుద్ధసన్ధి నిస్సన్ధి విసన్ధీతి నిగద్యతే.

పునరుక్తి. 15. తాదృక్పదపదార్థానాం నిబన్ధే పునరుక్తిమత్

వ్యాకీర్ణము. అనేకపదసన్తానవ్యవహితస్మృతికైః పదైః.

16. యోజనా యత్ర తద్వాక్యం వ్యాకీర్ణ మభిధీయతే

భిన్నవృత్తము.[వర్ణభ్రంశము; యతిభ్రంశము.] ఛన్దోలక్షణహీనం తు భిన్నవృత్తం విదు ర్బుధాః.

17. తద్వర్ణ యతి భేదేన ద్వివిధా తద్జ్ఞై రుదాహృతమ్

సంకీర్ణము. వాక్యాన్తరపదోన్మిశ్రం [య]త్తత్సంకీర్ణ మిష్యతే

గర్భితము. 18. వాక్యాన్తరసగర్భం యత్తద్వాక్యం గర్భితం విదుః.

భిన్నలింగము. భిన్నలిఙ్గ మలిఙ్గత్వే ఉపమానోపమేయయోః

19. యస్మిన్ వచనవైషమ్య ముపమానోపమేయయోః

భిన్నవచనము. తద్భిన్నవచనం నామ నిబధ్నన్తి న [హి?] సాధవః.

ఖంజము. 20. క్రియావిరహితం వాక్యం ఖఞ్జ మి త్యభిధీయతే

న్యూనోపమ. జ్ఞేయం న్యూనోపమం న్యూనై రుపమాయా విశేషణైః

అధికోపమ. 21. విశేషణాధికౌపమ్యం విజ్ఞేయ మధికోపమమ్

[శ్లేషాదిగుణహీనము.]

గుణత్రయము. శబ్దార్థోభయభేదేన విప్రకృష్టే త్రిధా గుణాః.

దోషత్రయము. 22. [తద్వి] పర్యయతో దోషా స్త్రిధా వాక్యే వ్యవస్థితాః.

శబ్దగుణములు:- శ్లేష, సమత, సుకుమారత. తత్ర శబ్దగుణాః శ్లేష స్సమతా సుకుమారతా.

అర్థగుణములు. 23. అర్థవ్యక్తిః ప్రసాద శ్చ కాన్తి రి త్యర్థసంశ్రయాః

ఉభయగుణములు. ఓజో మాధుర్య మౌదార్యం సమాధిశ్చోభయాత్మకాః.

| | |
|---|---|
| శ్లేషవిపర్యయము. | 24. తత్ర త చ్ఛిథిలం వాక్యం భవేత్ శ్లేషవిపర్యయః |
| సామ్యవిపర్యయము. | విషమం తు తదిచ్ఛన్తి యత్ర సామ్యవిపర్యయః. |
| సౌకుమార్యవిపర్యయము. | 25. తత్రతోరం భవే ద్యత్ర సౌకుమార్యవిపర్యయః |
| అర్థవ్యక్తివిపర్యయము. | సత్త్వః శం [సన్తి] నేయార్థ మర్థవ్యక్తివిపర్యయః. |
| ప్రసాదవిపర్యయము. | 26. అప్రసన్నం తదే వాహు ర్యః ప్రసాదవిపర్యయః |
| కాంతివిపర్యయము. | అవ్యుత్పన్నం తమి త్యాహు ర్యత్ర కాన్తివిపర్యయః. |
| ప్రౌఢివిపర్యయము. | 27. ♦ ♦ శ్శబ్దార్థయోః ప్రౌఢి రప్రౌఢి స్తద్విపర్యయః |
| మాధుర్యవిపర్యయము. | మాఢిభఙ్గా దనిమ్నవ్యూఢం మాధుర్యస్యవిపర్యయః. |
| ఔదార్యవిపర్యయము. | 28. నిరలఙ్కారమ్[ఇత్యా]హు రౌదార్యస్య విపర్యయః |
| నిస్సమాధి. | ఋజుమార్గ ఇతి జ్ఞేయో నిస్సమాధి ర్గిరాంక్రమః. |
| వాక్యార్థదోషములు పదునాఱు:— | 29. అపార్థం వ్యర్థ మేకార్థం ససంశయ మపక్రమమ్ |
| | ఖిన్నం చై వాతిమాత్రం చ విరసం పరుషం తథా. |
| | 30. హీనోపమ్యాధికౌపమ్యే తథా విసదృశోపమమ్ |
| | అప్రసిద్ధోపమం చైవ నిరలఙ్కార మేవచ. |
| | 31. అశ్లీలం చ విరుద్ధం చ వాక్యార్థే షోడశ స్మృతాః |
| అపార్థము. | సముదాయార్థశూన్యం [యత్తద]పార్థం ప్రచక్షతే. |
| వ్యర్థము. | 32. యదప్రయోజనం యచ్చ గతార్థం వ్యర్థ మేవచ |
| ఏకార్థము. | ఉక్తాభిన్నార్థ మేకార్థం వ్యాహరన్తి విశారదాః. |
| ససంశయము. | 33. ససంశయం తు యత్ప్రాహు ర్యత్రార్థస్య న నిశ్చయః |
| అపక్రమము. | అపక్రమంతు తద్యత్ర పౌర్వాపర్యవిపర్యయః. |
| ఖిన్నము. | 34. జాత్యాద్యుక్తా ♦ ♦ ♦ ఢం ఖిన్న మి త్యభిధీయతే |
| అతిమాత్రము. | లోకాతీత ఇవార్థో యః సోఽతిమాత్ర ఇహోచ్యతే. |
| విరసము. | 35. అప్రాకృతరసం జ్ఞేయం విరసం [రస]కోవిదైః |
| పరుషము. | అతిక్రూర స్తు వాక్యార్థః పరుషో విదుషాం మతః. |
| హీనోపమ. | 36. హీనంయత్రోపమానంస్యాత్సోఽర్థోహీనోపమః స్మృతః |
| అధికోపమ. | [యత్రో]పమాన మధికం తద్జ్ఞేయ మధికోపమమ్. |
| విసదృశోపమ. | 37. అతుల్య ముపమానం చే ద్భవే ద్విసదృశోపమమ్ |
| అప్రసిద్ధోపమ. | అప్రసిద్ధోపమానంచే ద[ప్ర]సిద్ధోపమంతు తత్. |

నిరలంకారము. 38. నిరలఙ్కార మిత్యాహు రలఙ్కారవివర్జితమ్.
అశ్లీలము. యదసభ్యార్థసమ్బద్ధం తదశ్లీల ముదాహృతమ్.
విరుద్ధము:- 39. ప్ర [త్యక్ష ?] వ్యాహతమ్ వస్తు విరుద్ధ మభిధీయతే
మూఁడువిధములు. ప్రత్యక్షాది ప్రభేదేన త్రిధా శాస్త్రవిదో విదుః.
ప్రత్యక్షవిరుద్ధము. 40. ప్రత్యక్షవ్యాహతం దేశకాలలోకవిరోధకృత్
అనుమానవిరుద్ధము. యుక్త్యౌచిత్య ప్రతిజ్ఞానాం విరోధ స్త్వనుమానభూః.
ఆగమవిరుద్ధము. 41. ధర్మార్థకామశాస్త్రాణాం విరోధ స్త్వాగమోద్భవః
త్రివిధమగుప్రత్యక్ష విరుద్ధము. ఏవం త్రయ మపి త్రిత్వాన్ నవతాం ప్రతిపద్యతే.
దేశవిరుద్ధము. 42. తత్ర దేశవిరుద్ధం త ద్యత్ర్ ♦ ♦ ♦ న యద్భవేత్
లోకవిరుద్ధము. తచ్చ లోకవిరుద్ధం య త్సర్వలోకై రసమ్మతమ్.
[కాలవిరుద్ధము?]
అనుమానవిరుద్ధము:- 43. తత్తు యుక్తివిరుద్ధం స్యా దవిచారేణ [యత్కృతమ్]
యుక్తివిరుద్ధము. తదౌచిత్యవిరుద్ధం స్యాత్ పాత్రే యద్య[భ?]నో♦♦
ఔచిత్యవిరుద్ధము.
ప్రతిజ్ఞావిరుద్ధము. 44. తత్ప్రతిజ్ఞావిరుద్ధం స్యాత్ ప్రతిజ్ఞా యేన బాధ్యతే
ధర్మశాస్త్రవిరుద్ధము. ధర్మశాస్త్రవిరుద్ధం యద్ జ్ఞేయం ధర్మవిరోధి తత్.
అర్థశాస్త్రవిరుద్ధము. 45. అర్థశాస్త్రవిరుద్ధం తద్ జ్ఞేయం నీతిబహిష్కృతమ్
కామశాస్త్రవిరుద్ధము. కామశాస్త్రకళాశాస్త్రవిరుద్ధం య న్నిబధ్యతే.
కామశాస్త్రవిరోధీతి తత్సర్వ మభిధీయతే.

ఇతి రసార్ణవాలఙ్కారే దోషప్రమోషో నామ

ప్రథమః పరిచ్ఛేదః.

---

గురుఁడు మంచమునందుఁ గూరుచున్నాఁ డన నల్ల యౌపశ్లేషికాధికరణ
మగు బ్రాహ్మణుండు గావ్యమునందుఁ గుశలుఁడౌ నన నిది వైషయికాధికరణ
మగును ఘోషముఁ గంగ యం దన సామీపికాధికరణ మగు నవల నింక
నదె మొదలి పదము తుదియక్షరమ్ముతోఁ బెఱనుడిమొదలియక్కరము గదియ
నదికించిన సమాస మంద్రు కోవిదు లందు నంధ్రభాషకుఁ జెల్లు నవియు వినుఁడు
తత్పురుషము కర్మధారయమును బహువ్రీహి ద్విగువు ద్వంద్వవిధము నవ్య
యీభావ మనఁ దగి యిత్తిగఁ దెలుఁగుల నమరు సమాసము లవియె యరయ
వింతమీఱఁగఁ బంచవింశతివిధములఁ బరఁగును దెలిపెద వరుస మీఱ
రహిగ నుత్తరపదార్థ ప్రధానం బయి తత్పురుషం బది తనరుచుండు
ననువొంద నన్యపదార్థ ప్రధానమై యొండు బహువ్రీహి యెసఁగుచుండు
నమరంగ నుభయపదార్థప్రధానమై ద్వంద్వసమాసంబు వఱలుచుండు
నరయంగఁ బూర్వపదార్థప్రధానమై యవ్యయీభావ మొప్పగుచునుండు
పయిమెయి నడుగుమెయి యన నివి ప్రథమాతత్పురుషములయి మలయుచుండు
దట్టిమోపరి కొండతాల్పరి యన ద్వితీయాతత్పురుషములయి యలరుచుండుఁ
జేయీఁతయన దొంగచిల్లర యనఁ గత్తినఱకునాఁ బలుగంటినాఁగ గోటి
జీర యనఁగ రాచపోరునా నివి తృతీయాతత్పురుషములయి యమరుచుండు
వలపుతిలక మనఁ దలుపుపలక యన గడియమ్రా నన మంచుకాటుక యనఁ
దేలుమందనఁ బాముమూలిక యనఁ జతుర్థీతత్పురుషములయి తేజరిల్లు
మోమోట మనఁగను బాముబీ తనఁగ నెత్తురుకళ యనఁగఁ గిత్తుబయు మనఁగ
ఖ్యాతి నన్నియుఁ బంచమీతత్పురుషనామమున వెలయుచునుండు ననువుమీఱ
దొరతీవి యడవిజోదులు రాచకొమరుండు కందోయి పూఁదావి కల్వదండ
పగడాలగని మునుపుగము లనంగ షష్ఠీతత్పురుషములయి చెలువుగాంచుఁ
దగ మఱి షష్ఠ్యర్థతత్పురుషములందుఁ గర్మధారయములఁ గన్గొనంగ
నలవిశేష్యపుఁబద మాత్యముకారమ్మునకుఁ బునాదేశ మంతటను వచ్చు
హల్లుపై నుండిన నచ్చుపైనున్నఁ బుటాదేశ మగును నెల్లనిన వినుఁడు
వాదపుఁబంతంబు జూదపునవ్వు సున్నపురాగు సున్నపుఱ్రం గనంగ
ముత్తెపుంబాపట ముత్తెపుపాప టన నెయ్యపుటాదరమ్ము మోదపుటలు కన
వేలుపుటింతి నా వేల్పుటా వన నందలపుటను సన నిట్లు లక్ష్యము లగు
నిఁకఁ బుటాదేశ మొక్కెడ లే దుదంతాల మిన్నేఱు మొగమంద మన్నయట్లు

ర్యాఢి షష్ఠీతత్పురుషములం దుత్వ మంత్యమునందుఁ గల్గు పదములపైని
గలిగిన కచటతపలకు ద్విత్వము వికల్పముగ నొక్కొకచోట వచ్చు వినుఁడు
పువుఁబాళె నాఁగను బుప్పుఁబాళె యనఁ బువ్వుంబాళె యనఁ ద్రివిధంబులఁ దగె
ములుఁగొన పలుదీపుఁ ముకుఁజెఱమలు రేఁగుఁబండ్లన నిట్టులఁ బరఁగు మఱియు
షష్ఠ్యర్థతత్పురుషమునందుఁ గొన్నిపేళ్లకు ద్విత్వ మది వికల్పగతి రాదు
పాముకోఱ యనంగ వేముతీ పనఁ బలుకుచురు తీరనఁగ ముక్కుచెమట యనఁ
జను, కను, నా-నిట్టి శబ్దములతుదల నెఱసున్న దగు నూఁద నెగడుఁ దేల
నఱసున్నయై యుండు నరయుంగఁ బైని హలాచ్చులసంధి సేయఁ గనెడితఱి
షష్ఠ్యర్థతత్పురుషను జనుంగవ యనఁ జన్నుంగవ యనఁగఁ జనుఁగవ యనఁ
గన్నుంగవ యనంగఁ గన్నుఁగవ యనంగఁ గనుఁగవ యనఁగ నీకరణి మఱియు
నీరెండుశబ్దము లేకాక్షరములైనఁ బయినుకారము పొల్లయయి తనరును
సున్నగా దెటువలె శోధించి చూచిన నవల హల్లుల ద్విత్వ మగును సంధి
ఘటియింపఁ జగ్గవ కగ్గవ యనఁదగు దీనికి బిందుయతి యిడఁ జెల్ల
నేకాక్షరముల కొక్కెడఁజెల్లు నీరెంట రెండక్షరముల నుం*డలయతి
యవల జక్కవకవ యనఁదగునట్టి త్ర్యక్షరములకవకు ద్విత్వంబు చెల్ల
దదిదంతము లయినపదములు గొన్నింటి జాడ లెఱిఁగింతు సరవి వినుఁడు
మొలకట్టు వలచూపు తలపొక్కు తలతిమ్మిరి యనుపేళ్లకు ద్విత్వరీతి చొరదు
మడిచాలు పులికూన కుడిప్రక్క సిరితెల్వి యనుపదముల ద్విత్వ మమర దింక
మును సంస్కృతము లయ్యుఁ దెనుఁగులౌ నొకకొన్ని శబ్దములౌ వానిజాడ లెల్లఁ
గనిపింతుఁ బనసపం డనఁ గుండలోపల ననఁ గంధకుంప నా నలరు నింకఁ
గనుఁగొన షష్ఠ్యర్థమున నుకారాంతశబ్దములపై నచ్చున్నఁ దగు నకార
మధిపునానతి యన నభవునాజ్ఞ యనంగఁ గూఁతునోడ మెనాఁగఁగొఱలుమఱియుఁ
దెనుఁగుటక్కర మొక్కటునిచి యాదిని బయి సంస్కృతపదము లుంచఁగ సమాస
మగును నా, నీ, తన, యనునుడితోఁ దుత్వ మబ్బును భోవు షష్ఠ్యర్థమందు
మఱియు నీ, నా, యను మాటల వెంట సమాసవశా ద్విత్వ మమరదు వినుఁడు
నావచోవైఖరి నీవిభవస్ఫూర్తి తసకళాసంపత్తి యనఁగ నింక
నామువిద్యాప్రౌఢి నీమువిలాసంబు తనమభుజాబలం బనఁగ మఱియుఁ
దనఘనకీర్తిప్రతాపకాంతు లనంగ నీఘనసమానసాహితి యనంగ

*ఇట్టి ద్రుతసంధులు కవిత్రయేతరగ్రంథములందుఁ గ్వాచిత్కముగాఁ గనుపట్టుచున్నవి.

నావిక్రమనిరూఢి నా లక్ష్యములు మఱి యిసుదంతసంస్కృతపదములపయిఁ
దెనుఁగుసమాసపుఁ దెఱఁగు లెఱిఁగింతు మునిపట్టి తరువాకు లనఁగ దంతి
కొమ్ములు సుకవిపల్కు నరాతిపోరు నా నెసఁగు షష్ఠ్యర్థమం దిటుల నింక
నమరు నదంతశబ్దముల కొక్కొకచోట నిన వెచ్చు చుఁగను దినవహి యన
సంబంధషష్ఠి యెసఁగుఁ దెన్గుపదముపై సంస్కృతపద ముప్ప సరవి నదియుఁ
గనిపించుఁ గొనశాఖ లన దొంగవిద్యనా వానకాల మనంగ వఱలు మఱియు
నూహింప నింతిమృదూక్తిమాధురి కన తవణిల్లు పాటపాటవ మన నిఁక
సంబంధషష్ఠి కెచ్చటను బ్రమ వచ్చు గుడుప్రమాటన సైన్యమురభటి యనఁ
దేటగా నిఁక నొప్పు స్త్రీలింగము తెనుఁగింపఁగ నెంత సమాసమద్యమమునఁ
దతనావకాళిందితటమున మహానుగలతమసతీరసికతయన నిఁక
ముల్లు విల్లు ల్లిల్లు బొమ్మ వెన్నను శబ్దములకెల్లఁ బైహలాను లవి కెడియు
పుటు జడ్డ లెల్లను బోవును వీనికి ములువగ విలువంపు లిలువడి పలు
వరుస కనుబొమ్మ కేవ వెరువెంటనఁగ మిన్నునది యనుటకు మినునదన నిఁక
సంస్కృతమునఁ దెన్గు సమసూర్వనొప్పని తెఱఁగు లెఱిఁగింతుఁ దేటపడఁగ
ననిమిష నెలఁ తన నర్ణవకొడుకనఁ జనదు తొల్లిటివిధమ్మునఁ దగు నిఁక
సాముతమి యనంగఁ జమువుబాళి యనంగ సప్తమీతత్పురుషమయి యొప్పు
రహి కెక్క వరుసమీఱఁగ సప్తవిధకర్మధారయములు దెల్పెదను వినుండు
తగువిశేషణము భేదక మనఁగను విశేష్యమ్ము భేద్య మన నెసఁగు నెటు లన
అరిధరుండు హరినా నలికాక్షుఁడు హరుం డనఁగ నాద్యుఁడు బ్రహ్మనాఁగఁ బొసఁగు
గుణిపదము పయిఁగ గుణమున్న నవ్విశేషణముమీఁదినికార మణఁగుఁ గలుగు
నలువుగా నొకచోట నల్లనికలువవా నల్లకలువ యనఁ జల్లతావి
పచ్చసెల్లా యెఱ్ఱబంటు తెల్లకరినా సరవి మఱియుఁ గఱిచల్లడంబు
చలువగట్టన విశేషణపూర్వపదకర్మధారయం బగుచుఁ జెన్నారు మఱియు
నరయ నా యీ యేల యవల వర్ణాల్గొప్పుజాడలఁ గలుగును జడ్డ లొకట
రహిగ సూచించెద రలశపసహలను నక్షరములు దక్క నది యెటులన
నాకాంత యక్కాంత యాకల్కి యిక్కల్కి యేయింతి యెయ్యింతి యిది యనంగ
నారాజు నాలక్ష్మి యాశౌరి యామట్ట మాసామి యాహరి యనఁదగు నిఁకఁ
గన నుదంతంబులో కర్మధారయముల కచ్చుపైఁ దగ టును లాగమము ల
వును విచ్చుటాకులుం బోతుటీఁగలు తళ్కుటంపరలు గడుసుటసురు లనఁగ

నెసఁగు నద్దపుబిల్ల నిచ్చు నంబుజనేత్ర నాడించు నందాన నధికుఁ డనఁగఁ
దగు రేఫమీఁది యుత్వమ్ములకెల్ల వికల్పమ్ముగను టు వు గలిగియుండుఁ
జిగురుటాకనఁగను జిగురాకన వెనురుటాకనఁగను వెనురాకన మఱి
యలరుటమ్ము లనంగ నలరమ్ము లన నిటు లనువొందఁగా నుదాహరణము లగు
నీక్రియఁ డుత్వంబు రాకను బొమ్మరి ల్లొప్పదరి ల్లనెడిరెండు పొలుచు నందు
నరయంగఁ బొదరుటి ల్లని చంద్రభానుచరిత్ర నొక్కెడ నుండె రీతిగ నిఁక
హల్లుపై నున్న నత్యయుకారమునకుఁ బునాదేశ మెచట నిత్యముగ వచ్చు
నిద్దంపుబరణినా నిగరంపుఁగెంపస సోయగపున్నవలా యనంగ
గాటపుసన్నపుగాఱ యనంగఁ జొక్కపుఁగమ్మ చొక్కపుంగమ్మ యనఁగ
సొబగొందు నిఁకఁ గొన్ని సుకవులు తెలియుఁడీ యదిమదంతమ్ములై యొలరు నచ్చు
తెనుఁగునుడుగుల రెండును మూఁడు నాలు గై దా ఱేడు నెనిమిది యక్షరముల
పయి సంస్కృతపదంబు పరఁగు లక్ష్యములింకఁగఱకంఠుఁ డన వాఁడికాండములనఁ
గొమిరెవలుదకుచకుంభంబు లన నిడుదమధూళి కన వెడఁదశర మనఁగ
నొగఁదాఁకవేయిమున్నూఱుదంతు లనంగ నఱువదివేలుదివ్యాబ్దము లన
నప్పున్నఁదావినవాదనం బును నాఁగఁ గటికిచీఁకటిదిండికరమన నిఁకఁ
గనఁగఁ గకార మొక్కటి వెలిగాఁగఁ గచటతపవర్గపంచకము పయిని
నమరియుండిన నకారము బిందు వగు నది జశ్త్వంబుగాంచు నజ్జాడ వినుఁడు
క్రొ న్ననునుడికిఁ దెన్గునఁ గ్రొత్త యను నెడఁ గ్రొంజాయ క్రొందళ్కు క్రొంబఱ పనఁ
బరఁగు వకారంబు పై నున్న ద్విత్వంబు వచ్చి దాని కల క్రొవ్వాఁడి యనఁగ
నెగడు నిట్టుల మఱి నే యనునక్షరం బుచితార్థమును దెల్పుచుండు చోటఁ
బైవర్ణములకు ద్విత్వంబె కల్గి తనర్చు నెమ్మోము నెత్తావి నెన్నడ యనఁ
గనఁగ సంఖ్యావాచకముకారముపయిని దగువర్ణములకు ద్విత్వంబు వచ్చి
ముక్కన్ను ముచ్చిచ్చు ముత్త్రోవ మున్నూఱు ముప్పద ముమ్మొన మువ్వెలుఁ గన
నెసఁగును మఱియొక్కటిటులఁ బైవర్ణంబు ద్విత్వంబు గని డెబ్బదియనఁ బొల్చుఁ
దెలుఁగులఁ గెమ్ము చెమ్ము లరుణాఖ్యకుఁ జెల్లి పరఁగుచునుండును బాళి వినుఁడు
కెందామర లనంగఁ గెందలిరు లనంగఁ జెందమ్ము లనఁగను జెంగలు వనఁ
బేరను నుడొకటి పెద్దయనుట కగుఁ బేరోలగం బనఁ బేరుర మనఁ
దనరారు భద్రదంతావళంబు లటంచుఁ గొఱలు శ్రీవృతుకిఘోటకమ్ము

క. భూపాల గురునిఁ జంపెను, పాపము వల దనుచు మ్రొక్కి పలికిన "గామాం
ధోపి నపశ్యతి" యనియెను, నాపలుకు నిజంబు చేసె యతఁ డుగ్రుం డై. ౨౨౫

గీ. చెడుగుబుద్ధిని లింకఁ జెప్పక నామాట, ప్రోవనైతి వేని ద్రోహిఁ జంపు
మనుచు మాఱుమాట లాడక శారదానందునిఁ దెచ్చి బంధనం బొనర్చె.

మ. ఇటు విప్రోత్తముఁ గట్టి కొంచుఁ జని మంత్రీంద్రుండు చింతించి యు
త్కట చంపించిన బ్రహ్మహత్య నను ముట్టం జేయు నారాజు ని
చ్చటఁ బాపంబునఁ బ్రుంగుఁ గావునఁ దవార్ష్ణాలంఘునుం డైన నొ
త్కటఁ గావించి జగత్త్రయంబు హితముం గావింతు నంచు న్వెసన్. ౨౨౭

ఉ. ఆతనికట్లు లూడిచి గృహంబున కంపి యమాత్యుఁ డేగి నే
నా తెఱఁ గట్లు చేసితిఁ బ్రియుం బగునే యని చెప్పి వచ్చె త
ద్భీతియు నీతియుం గలుగ భీమునిఁ బాఱని నేలమాలెలోఁ
బ్రీతి వహించి దాఁచి తనపెంపునఁ బ్రోవఁగఁ గొన్ని యేండ్లకున్. ౨౨౮

క. పాలసుఁడు కితవకేళీలాలసుఁ డస్థిరుఁడు పరభిలాషుఁడు మృగయా
లోలుఁడయి నందధరణీపాలతనూభవుఁడు విజయపాలుఁడు గడలెన్. ౨౨౯

వ. తదనంతరంబ. ౨౩౦

సీ. పిల్లులు పోరాడె బల్లి యూరక త్రుళ్లె దమ్ముళ్లి పోడసూపెఁ దుమ్మి రెనుఁ
దొఱఁగుపోయిన లేఁగ కొఱలుచు నొకకుత్రి పఱతెంచెఁ గ్రంపపైనఱచెఁ గాకి
యులుమఁ డొక్కఁడు నూనె తలతోడ నేతెంచె మైలచీరలచాకి మ్రోలనదిరెఁ
[1]గాకియును గోరవంకయును దెక్కలపోతు నేటిరింతయు దాఁటె నెడమదిశకు
[2]బైట వెరవుదప్పఁ బాలగుమ్మయుఁ బొఱ్ఱె, నొంటిపాటఁ బైఁడికంటి వీచె
నెలుఁగుచేసెఁ బెద్దపులుఁగు పా మటు దోఁచె, దబ్బి బొబ్బలిడియె నుబ్బులడర.

గీ. వానిఁ గనుఁగొని పరివారమ్ము గలఁగుచు, శకునబలము లేమ చనకు మనిన
విజయపాలుఁ డివియు నిజములో కల్లలో, తెలిసికొంద మనుచుఁ దిసుగఁ డయ్యె.

క. దుర్మతికి ధర్మబుద్ధియు, నిర్మలునకు దుర్గతియు గణికలకు దృఢ మా
కూర్మియుఁ గలిమికి నిలుపును, గర్మములకుఁ దప్పుటయును గలుగవు జగతిన్.

శా. ఈరీతిం జను లెల్ల నుల్లముల నూహింపంగ శంపారుచి
స్ఫార[3]జ్యాయుతచాపరోపధరుఁ డై సన్నద్ధసైన్యంబుతో

1. కాకియునొకగోరంకయును- అని చిన్నయసూరిగారు. కాకియు నొకపెరకయు నెనకల పోతు- 2. పైటవెరవుదప్పబారె చెమరుపోతు. 3 జ్యాలలితోరుచాపధరుఁడై.

ఖేకీభైరవభాంకృతు లద్రిశల నిర్భేదింపఁగా నేగె ని
[1]ష్కారుణ్యుండు సమస్తమద్గుణగణాగణ్యుం డరణ్యానికిన్. ౨౩౭

గీ. అచటఁ జెమటకోక యమరించి కుడిచేతఁ, గడిఁదిడేగఁ బట్టి యెడమచేత
నెఱిక లొయ్యఁ జక్కఁ జెరివి మోమీక్షించి, కౌఁజుకక్కెరలను గదియవైచె.

వ. ఇట్లొండొంటఁ బులుఁగుల నీల్గించి[2] యొక్కపెట్ట సాళువంబు నెగయించిన.

క. తత్పక్షపాతరవము వి,యత్పథమున జలదనినద మన విహగము ల
త్యుత్పాతవృష్టిసమయప,తత్పాషాణములు వోలె ధరపైఁ గూలెన్. ౨౩౮

సీ. కేరిజంబులఁ గోరి కేరుట దీరించి పూరేండ్లఁ బుడకల బూఁడ్చెఁ గలిపి
పాలగుమ్మల నేలపాలుగా నొనరించి వెలిచెలమెలఁకువ వెలితిచేసి
బెగ్గురుకదుపుల బెగ్గిల మ్రగ్గించి కొంగలపొగరెల్లఁ ద్రుంగఁ[3]ద్రొక్కి
కక్కెర నెత్తురు గ్రక్కించి కొక్కెరపిండు గుండియలెల్ల బెండుపఱిచి
కారుకోళ్ల నెండఁ గారించి గోరవంక, బింక మింక వానిపొంక మణఁచి
చెమరుఁబోతుగములఁ జమరి కౌఁజులఁ జించి, సాళువంబు విజయపాలుఁ జేరె.

ఉ. అట్టిఖగంబు వేఁటకు నరాధిపనందనుఁ డిచ్చ మెచ్చుచుం
బిట్టల నెల్ల లోఁబఱిచి భృత్యుల కిచ్చుచుఁ బెక్కువేడుకల్
పుట్టఁగ నొక్కచో మడుఁగు పొంతకుఁ బోయి జలంబు ద్రావి యా
[4]పట్టున మీలఁ గాంచి యొకబాయవలం దివియించి యేపుగన్. ౨౩౯

సీ. కొఱ్ఱమీలను దండ్రికోలువులెంకల కిచ్చె, వాలుగలను సంగడీలకిచ్చెఁ
[5]బాఁపరలను బిన్నపడవాళ్లకును నిచ్చె మాఁదువులఁ జనవువారి కిచ్చె
బేడసంబుల నిచ్చె వేడుక కాండ్రకు గెండెల బలుదుండగీల కిచ్చె
వెలిమొట్టలను దండువుల దలాయుల కిచ్చెఁ గోడిసెలఁ బరిహాసకులకు నిచ్చెఁ
బక్కెమొట్ట రొయ్య పరిగ యింగిలికము, చీరచింపుజెల్ల నారజెల్ల
కుంటముక్కుమొదలుకొని కల వన్నియుఁ, బంటువారి కెల్ల నొంటియిచ్చె. ౨౪౦

వ. ఇచ్చి యచ్చోటు వాసి బాణాసనబాణపాణి యై వాగురికవాగురాకరాళం బగు
వనాంతరాళంబు సొచ్చి. ౨౪౧

క. బాలుఁడు మెలఁగెను మృగకుల,కాలాకృతిఁ బవనజవన ఘనశునకాళీ
కోలాహలకాలాహిత,కోలాహలకాహళానుకూలక్రీడన్. ౨౪౨

1. ష్కారుణ్యుండతఁడు గ్రపాపజనతాగణ్య. 2. ఇట్లుదొడ్డపులుఁగులనీక్షించి 3. గ్రుంగ. 4. చట్టునమీలఁగాంచి యొకజాలిక్రియందివిపెంచి. 5. పాపెరలను బస్తుపడుచులకునునిచ్చె. పాపమీనుల-చిన్నయనూరిగారు.

క. తోలిఁదోలిఁ జింకల మనుఁబోతులఁ గడఁజుల లేళ్ల[1] నిర్ల దుప్పుల మఱి యే
కలముల నెలుఁగులఁ బులులను, బలువిడిగాఁ[2] దునిమెఁ జలముబలము న్నెఱియన్.
క. అయ్యెడఁ గోఱలు దీటుచు, దయ్యముక్రియ నొక్కపంది తాఁకుచుఁ దనువ్రల్
వ్రయ్యలుగఁ బొడిచెఁ దోలఁగఁ, జయ్యన నలుదెసలఁ బఱచి సైన్యము లెల్లన్.
వ. అప్పుడు కుమారుండు కృతవాహనారోహణుండై యావరాహంబు నుం దోలి
వెనువెంట నొంటిం జని చని కాఱడవి నీరంబులలో జాడవప్పి దప్పిఁగొని యొ
క్కమడుఁగు చేరి యచ్చోటఁ దురంగంబు డిగ్గి చెట్టునం గట్టి సరసిలో జలంబు
లు గ్రోలి యభయుండై యచట విశ్రాంతికై నిలుచునంత. ౨౮౫
శా. శీఘ్రాపాతనితాంతతాంత[3]తురగస్వేదంబుఁ దీర్పంగ హృ
ష్టాఘ్రాణంబున మోరయెత్తి తనమీస ల్నిక్కఁ దత్సౌరభం
బాఘ్రాణించి చరించి పొంచి కృతముఖ్యాయామభీమాకృతిన్
వ్యాఘ్రం బొక్కటి వచ్చి యచ్చట నృపవ్యాఘ్రాత్మజుం జూచుచున్. ౨౮౬
గీ. హయము దానిరాక కదరి కట్టినవాఁగెఁ[4], ద్రెంచుకొనుచుఁ బాఱె దిక్కులద్రువఁ
బోరిగొనం దలంచు పులిఁజూచి బెగ్గిలి, విజయపాలుఁ డొక్క వృక్షు మెక్కె.
ఉ. అమ్మెయి నెక్కఁ గోపమున నాపులియుం బఱతెంచి తత్పరి
శమ్మున నిల్చిన న్వగడి శాఖలమీఁదికి డాఁగ నేగియుం
గొమ్మను నొక్కభల్లి యెలుఁగుం గని తల్లడమంది దుర్నిమి
త్తమ్ముగ నాఫలంబు లిటఁ దప్పక వచ్చెనె దైవమా యనున్. ౨౮౭
క. క్రిందఁ బులి మీఁద నెలుఁగును, నందప్రియనందనుండు నడుమం గలుగ
న్నందట నొకనుయ్యియు వెను,కందగ నొక గొయ్యిభంగిఁ గానఁగనయ్యెన్.
వ. అప్పుడు. ౨౯౦
గీ. రెంటనిలువు లెగయుఁ బుండరీకం బిది, నీకు నచట నుండ నేర్పుగాదు
నమ్మి[5] వేగమిటకురమ్ము బాలక యని, యెలుఁగు పిలిచెఁ గాఱుటెలుఁగు సెలఁగ.
ఉ. అక్కుమారుండు దాఁప ? హృదయంబు యథావిధి నిల్పి రెంటిలో
నిక్కడఁ గొంత యాస గల దిప్పటి కేగెద నంచు మీఁదికిన్
స్రుక్కుచుఁ బోయెఁ గ్రిందఁ బులి చూచి చలంబున మీఱ లిద్దఱుం
జిక్కితి రంచు నాఁగి నిలిచెం దనకన్నుల నిప్పు లొల్కఁగన్. ౨౯౧

1. గండలలేళ్ల, 2. చలమరిగాఁ దునిముబలము చలము న్నెఱియన్. 3. నితాంతవేగ
4. యప్పుడవాఁగె- (యెంతయువాఁగె) చిన్నయసూరి రి నెమ్మి.

గీ. పుండరీక మిట్టు లొండొండఁ జూపుల, మండఁ గోపవహ్ని మెండుకొనఁగ
నుఱుము లెఱిఁగి మాఱుమండుట మానె నా, నెండ జేఁడు గ్రుంకుఁగొండ నడఁగె.
క. పులి యాఁగినఁ జిక్కితమ, మెలుఁగును వెదకంగ వచ్చి యెల్లెడఁ గలయం
బొలయు నెలుఁగులో యన గుం, తల మిట్టలఁ జీఁకువాలు దళమై పర్వెన్.
క. గగనమణి సాళువము క్రియ, నెగసినఁ దలసూపకుండి యింతట నతఁ డ
స్తగిరిచటిన్ వ్రాలిన పెల్లగు ఖగముల కరణిఁ జుక్క లయ్యెడ నిక్కెన్.[1]
శా. ఆవేళన్ భువిఁ బీఁటవెట్టిన మహావ్యాఘ్రంబు వీక్షించుచున్
దైవంబు న్మది దూఱుచుం దలఁకుచుం దద్రాత్రి యర్థంబుఁ జిం
తావేశంబునఁ బుచ్చి కూర్కఁ దలపోయంగా నెలుం గంత యుం
డా వీక్షించి నిజాంకసీమఁ జెలువా తల్పంబుగాఁ జూపుచున్. ౨౫౬
క. నిద్ర చనుదెంచె నేనియు, నిద్రింపుము వెఱవ నేల నీకిట ననినన్
నిద్ర సుఖ మెఱుఁగ దనఁగా, నిద్రించెఁ దదంకశయ్య నృపసుతుఁ డంతన్.
సీ. శార్దూల మటు చూచి నిర్దయత్వముతోడ భల్లూక! పగవట్టి బ్రమకఁగలవె
వాఁడు నీ కేల సన్నవాఁ డయ్యెఁ బరజాతి నృపతిపుత్త్రుండు నిష్కృపుఁడు వీఁడు
మనకులం బాదిగా వనగోచరంబుల వేఁటచాటున నొక్క నూటఁ జంపె
నిల నొక్కగూఁటిపిల్లల మిద్దఱము దుష్టబాలునకై పోరనేల మనము
వీనిఁ గ్రింద వైవు విడిచిపెట్టెద నిన్ను, సగము నీకు నిత్తు నగవు గాదు
నరుని నమ్మవలదు నమ్మి మున్నొకపాము, చిచ్చులోనఁ గాలి చచ్చెఁ గాదె.
క. ఆకథ విను వింధ్యాటవి, నేకలుఁ డనుబోయ తోఁటయోరమున మహా
శాకోటముఁ[2] దెగనఱకఁగ, నాకోటరసీమ నొక్కయహిపతి వెడలెన్.
గీ. వెడలి యేను నిలిచి విహరించుతా విది, వలను దీన నేమి గలదు నీకు
నన్నుఁ గలసి బ్రతుకు[3] మెన్నఁడుఁ జేటులే, దనిన వెరఁగుపడుచు నట్ల తలఁగె.
క. తలఁగిన వానికి సది తన, తలరత్నం బిచ్చి పుచ్చి తా నేగిన ని
మ్మల వాఁడు నేగి పురిలో, పల నొకవర్తకున కమ్మె పదిగద్దెలకున్. ౨౬౧
చ. అట మఱునాఁడు వచ్చిన మహాభుజగేంద్రుఁడు గారవించి ని
న్నటిమణి యెంత కమ్మితి వనా యన మూల్యమెఱుంగఁ జెప్ప న[4]

1. స్తగిరిన్ వ్రాలినపెల్లగు, ఖగములక్రియఁ జుక్కలంతఁ గానఁగనయ్యెన్. 2. తొంటియిర
వెఱిఁగి మహానోకహముం. 3. ఇదిగోనమ్ముకొనియుం నెన్నఁడుఁ 4. వర్తకుని మూల్యము నెట్టె
ఱింగె యక్కటా.

క్కట పదివేల కమ్మక వికల్పము చేసితి వింతనుండి మి
క్కుటముగ నమ్ముకొ మ్మనుచుఁ గ్రొత్తఫణామణి యిచ్చె వానికిన్. ౨౬౨

క. తనయిల్లుఁ గాచినాఁ డని, మనమునఁ బ్రియమంది యిచ్చు మణు లనుదినముం
గొనిపోయి యమ్ముకొనుచును, ధనికుండై వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. ౨౬౩

గీ. దీని కెచటఁ గలుగు దివ్యరత్నంబులు, దీని మొకలితావుఁ దెలియవలయు
ననుచుఁ గోరిపోయి యాపాముచనుజాడ,వట్టి యేగియొక్కపుట్టఁ గనియె. ౨౬౪

క. కని తిరిగి పోయి మఱునాఁ, డనలంబును గసవుమోపు హస్తంబులఁ గై
కొని వచ్చి తొఱ్ఱలోపలఁ, జొనిపె భుజంగంబు మిడుకుచు న్మడియుంగన్. ౨౬౫

క. జాల్ముం డిటు గాలిచి యా,వల్మీకముఁ ద్రవ్వఁ జనిన వడి విషములచే
గుల్మాములు దరికొనఁగా, నుల్ముకములభంగి మఱియు[1] నురగము లెగసెన్.

గీ. ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె, నట్లు గాన వీని కడలనేల
పాము క్రూరమంత్రు ప్రాణులలోనెల్లఁ, బాముకంటె నరుఁడు పాతకుండు. ౨౬౭

క. నామాట నమ్మి డిగ్గన, నీమనుజుని ద్రోవ మింక నేగెద ననిరన్
మోమోటలేక నవ్వుచు, నేమీ సభ్యుఁడవె యనుచు నెలుఁ గిట్లనియెన్. ౨౬౮

క. ఇలఁ గలపశువుల నెల్లను, బొలియించుచుఁ బాపములకుఁ బొడవయ్యెడు బె
బ్బులితోడి పొత్తు గలదే, పులి నమ్మియ కాదె తొల్లి పులుఁ గొక టిలిగెన్.

మ. వినుమా చెప్పెదఁ దొల్లి యొక్కపులి కావేరీతటిం బ్రాణులం
దనయిచ్ఛ న్వధియించుచుం దినుచు నుత్సాహంబుతో నుండి కా
లెనుబోతుం దినునాఁడు మాంసకబళాన్వితంబుగా నొక్క బొ[2]
క్కనిజాస్యంబున నొక్కనాఁడు మెడ వీఁకం జొచ్చిన న్నొచ్చుచున్. ౨౭౦

క. వదనము విడువకొను చడి, తుదినాలుకయెత్తుచేత దూపొడమ క్రియం
గదలించుఁ దాలువొరఁగ, న్నదలించుం దగ్గు ద్రొగ్గు మేదినిఁ బొరలున్. ౨౭౧

మ. ఇటు దుర్వేదనఁ జిక్కి మాన్పుకొనఁగా నెం దేగినం బ్రాణసం
కటమై ప్రాణులు మారి వచ్చె నని డాఁగంబాఱఁగా నొప్పి యె
చ్చటనుం బాపెడు దిక్కులేక చనుచున్ శైలస్థలిం జేరి ముం
దట సూచీముఖపక్షిఁ గాంచి తనఖేదం బంతయుం జెప్పెన్. ౨౭౨

క. సూచీముఖంబు డగ్గఱి, నీచెనుగుందనము మాని నిలువవు నీనో
రోచెల్లఁ జొరఁగవలె హిం,సాచారివి కాలుఁ గైన నలుగఁడె నీకున్. ౨౭౩

---

1, కొన్ని యఱుఁగ 2, బొక్క = ఎముక.

చ. అనవుడు నోరుసాచ్చి వ్యథ[1] యార్పఁగదే ముసు చచ్చినట్లు ప
ల్లును మెదలింపకుండెద నలోలత నంచు మొగంబు వంచి వ్రా
లిన నది నోరు సాచ్చి కదలించి క్రమంబున దాడబ్రొక్క[2] ము
క్కునఁ గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటినకొయ్య నొయ్యనన్. ౨౭౪

గీ. అట్లు పుచ్చిన ముద మంది సూచీముఖుఁ, బాగడి యేగి క్రూరమృగముమఱియుఁ
బసులఁ జంపితినఁగఁ బలలంబుతో దాడ, నాఁటిజాడ నెముక నాటినంత.[3]

ఉ. క్రమ్మఱ వచ్చి పుమ్చ మని కైకొని వేఁడినఁ బుచ్చివైచి స
ఖ్యమ్మొనరించి నిచ్చలు సుఖస్థితి నుండఁగ నొక్కనాఁడు మాం
సమ్మొకయింత గానకయుఁ జయ్యన నాపులి వచ్చి వక్త్రము
న్నమ్మిక దోఁపఁగాఁ దెఱచిన న్విహగంబును జొచ్చె నాక్రియన్. ౨౭౬

క. చొచ్చినయంతన కాటునఁ, జచ్చె న్విహగంబు పులులసంగడ మిదిగో
నిచ్చకములాడె దీతని, నిచ్చుటకై యంత యేమి యే నజ్ఞుఁడనే. ౨౭౭

క. జాతివిభేదం బేటికిఁ, బాతకునకునైన నెడరుఁ బాపి[4] మహావి
ఖ్యాతిఁ గొననొప్పుఁ దిర్య,గ్జాతికపోతంబు చెంచుఁ గాచుట వినవే. ౨౭౮

క. గోదానము ధనదానము, భూదానము నన్నదానమును బధికహితాం
భోదానము నుత్తమవి,ద్యాదానము గూడ నభయదానము సరియే. ౨౭౯

గీ. వెన్నుసొచ్చువానిఁ దన్ను నమ్మినవానిఁ, జంపిరేని శిశువు జంపుటండ్రు
వంతమెఱుఁగు జాంబవంతునివారము, బాస తప్పమిట్టియాస విడువు. ౨౮౦

చ. అనుచు నిరుత్తరంబుగ దయామతిఁ బల్కెడు నంత రాజనం
దనుఁడును లేచినన్ క్షణము దానికిఁ గూర్కెద నిద్రవోకుమీ
యని తొడమీఁద నూఁదికొని యామెలుఁ గించుక కన్నుమూయఁగాఁ
గని పులి వ్రాలె వాని మెయిఁ గంపము పుట్టఁగ బీతు వెట్టుచున్. ౨౮౧

గీ. కోటులు గలవాని గోళులు గలవానిఁ, గొమ్ములు గలవాని నమ్మవలదు
బమ్మరించెనేని బ్రతుకంగవచ్చునే, యెలుఁగు తోడి చెలిమియేల[5]నీకు. ౨౮౨

క. మొన్న నొకనిఁ దోలితి వాఁ, డిన్నగ మిల్లెక్కె వాని నిది కరుణాసం
పన్నునిక్రియ లోనిడుకొని, నిన్న విఱిచి పెట్టె నేఁడు నిజమరివోలెన్. ౨౮౩

---

1. నమ్మిచొచ్చివెతయార్ప. 2. దౌడబొఖ్ఖిముక్కున గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటిన కొఱ్ఱు.
3. పుచ్చినను ముదమందుచుఁ బులుఁగుఁజాలఁ, బొగడియును నేగి యాకూ్రరమృగముమఱి యుఁ, బసులఁజంపి తఁనంగజావలముతోడఁ, నాఁటిదౌడనె యెముకయు నాటె మగుడ.
4. ఘాతుకునకునైన నెడయగల్గిన దనలో నాతుకనవచ్చు. 5. పొందులేల.

క. కూరిమి గల దని నమ్మకు, క్రూరమృగంబులకుఁ గపుల గూడునె యిది నీ
చేరువ నుండుట నేఁటికి, నీకేతుల బుజ్జగించె నల్లిటి కొఱకై. ౨౮౪

గీ. దానిఁ జెప్ప నేల దేనిదె యొకయేఁడు, పట్టు నాఱు నెలలు పట్టఁ గాక
మిమ్ముఁ జంపి తిను నమ్ము మీమెడనాను, దీనిఁ ద్రోచి బ్రదుకు తెరువు గనుము.

చ. అనవుఁడు వాఁడు నిక్కముగ నాత్మఁ దలంచి మెలంగుఁ గూలఁద్రో
చిన నది జాఱుచుం దెలిసి చేతికి లోఁగుఁ గొమ్మవట్టి యొ
య్యనఁ బఱతెంచి బెగ్గలునృపాత్మజుఁ గగ్గొని యల్పబుద్ధి వే
మన నను నమ్మిమంటి భయమందకుమీ యని పట్టుకుండఁగన్. ౨౮౬

క. కలకలఁ బలికెడుపక్షుల, కలకలములు సకలదిశలఁ గలయఁగఁ బొలయం
దళదళికులముగ దశశత,దళదళములు విరియఁ బ్రాగ్దిశ తళతళఁ బొడిచెన్. ౨౮౭

గీ. తమముతోడఁ గూడఁ దరలి శార్దూలంబు, శైలగుహలకేగెఁ జాల డస్సి
తరణికిరణపంక్తి సరసఁ జెట్టునవుండి, యెఱుఁగుఁగూడి బాలుఁ డిలకు డిగ్గె.

క. ఆమెలుఁ గతనిఁ బిలిచి య, న్యాయపు పరలోకపీడనం[1] బగుమరితం
బీమెడన పాయఁ జేసెద; రాయిటవినుమిఁక "ససేమిరా" యను మెప్పుకున్.

క. ఈనాలు గక్షరంబుల, నీనేరమి నోరుఁడు చెప్పనేని వికారం
బూనక తొల్లిటిక్రియ స,న్మానము గైకొనుము మంచిమాటలతోడన్. ౨౯౦

క. అని వీక్షాలిపినతఁడి న, ట్లనెయాతఁడును 'స్ససేమిరా' యనుచు వనం
బున భూతావిష్టుని చాడ్పునఁ దిరుగఁగ వానిహయము పుఱిఁ జేరుటయున్.

సీ. అశ్వరత్నం బొంటి నరుదెంచె నిన్నఁటి శకునము ల్పాపనిఁ జంపె నొక్కొ
యని తలంకుచు నందజనపాలుఁ డాజాడఁ బఱతెంచి యడవిలోఁ బాలుఁ జూచి
యన్న యిదేమి రా వన్న "ససేమిరా" యనుచుఁ గలఁగి యొత్తి యడుగుటయును
నాలుగక్షరముల నోలిఁ బల్కెడువానిఁ దోడ్కొనిపోయి మందుల నొనర్చి
వీనిభూతశంక విడిపించువారికి, నర్ధరాజ్య మిత్తు ననుచుఁ జాటి
వేలుపులకుఁ బెట్టి వేఁడికొన్నను నాలు, గక్షరములు విడువఁ డమ్మెవాఁడు.

ఉ. నందనృపాలుఁ డిట్లను మనంబునఁ గుల్లుచు నెల్ల వేల్పులున్
మందులు మ్రొక్కులు న్మణులు మంత్రములున్ వృథయయ్యె శారదా
నందుఁడ యిప్పుడున్నఁ బ్రియనందనుఁ దెల్పఁగ నోపు నట్టి పె
ద్దం దునిమించినాఁడ వలదా హితు లెవ్వరు నడ్డపెట్టఁగన్. ౨౯౩

1. యన్యాయపరతఁజేయుపీడన.

ఉ. నా నృపు మంత్రి చిత్తమున నవ్వుచు నావిధ మయ్యె నాఁడు, నే
డీవిధ మయ్యెఁ, జేరుకొన నేటికి నిందలపాల దృష్టమా
దైవము గల్గెనేని భువిఁ దత్సముఁ డొక్కఁడు గల్గనేరఁడే
కావున బన్మరింపఁ బని గా దని యూఱడఁ బల్కె భూపతిన్. ౨౯౪

ఉ. ఆవిభు నూఱడించి నిలయంబున కేగి బిలంబు విప్రుతో
నీవిధ మెల్లఁ జెప్పిన మహీసురుఁడు న్సచివాగ్రణీ భవ
ద్భవనఁ జేరి నాఁటిగుఱుపుత్రిక యేడవయేఁటి పాప నీ
జీవముదీర్చుదీర్చు నని[1] చెప్పుము నీ వని పంచె నాతనిన్. ౨౯౫

వ. అటకుం జని. ౨౯౬

ఉ. ఆతఁడు విన్నవించినఁ బ్రియాన్వితుఁడై సుతుఁ దోడుకొంచు ధా
త్రీతలనాథుఁ డింటి కరుదెంచుచు నాధరణీసురుండు క
న్యాతిలకంబు నాజవనికాంతరకాకృతి నిల్పి పద్యవి
ద్యోతితపంక్తి దోఁప వినుచుండెఁ గుమారు 'ససేమిరా' ధ్వనిన్. ౨౯౭

వ. ఇట్టి నాలుగక్షరంబుల నాలించి విని యందఱు నూరకుండుం డని కుమారు నుద్దేశించి పద్య మిట్లని చదివె. ౨౯౮

క. "స"జ్జనభావము గలుగు సు,హృజ్జనముల మోసపుచ్చు టిది నేరుపె నీ
యజ్జతొడమీఁదఁ గూర్కిన, యజ్జంతువుఁ జంపఁజూచు టది పౌరుషమే. ౨౯౯

వ. [2]అని చదివిన బాలుఁడు దా విని ప్రథమాక్షరము విడిచి పెట్టి "సేమిరా" "సేమిరా" యనుచున్నంత నందఱు నా నందనరేంద్రుతో నానందంబు నొంది మేలు మే లనుచు నుండఁ దత్కలకలంబు మాన్పి జవనికలో గురుండు. ౩౦౦

క. "సే"తువుఁ గని జలనిధిసం,జాతధనుష్కోటిఁ బడిన సద్ద్విజహతికిం
బాతకము వాయు మిత్రవి,ఘాతికిఁ బాతకమె కాని గతి గలుగ దనా. ౩౦౧

వ. అని రెండవపద్యంబుఁ జదువఁ గుమారుండు రెండవయక్షరంబు విడిచి "మిరా మిరా" యనుచుండ నిట నయ్యాచార్యుండును. ౩౦౨

క. "మి"త్రద్రోహికృతఘ్నప,విత్రగురుద్రోహిచౌర్యవిద్యాపరులున్
మిత్రశశిస్థితి మేరగఁ, బుత్రులు గలిగియును నరకమునఁ బడుదు రనా. ౩౦౩

వ. అని తృతీయపద్యంబు పఠించినఁ దృతీయాక్షరంబు విడిచి "రా, రా" యను నందనుం జూచి యమరదానందుం డగు నందు నుద్దేశించి శారదానందుండు.

1. జీవము వేదదీర్చునని 2. ఈవచనము మొదలు కందపద్యమువలె నడచుచున్నది.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్న పంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు,

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్ టి.

దర్భా వేంకటశివరామరాసుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటాశ్రియయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిశ్వారిసెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

## కాకినాడ–ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | రు | |
|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము–చదలువాడ మల్లయ్యకవి | 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము–వేములవాడ భీమకవి | 0 | 10 |
| 3 | చంపూరామాయణము–ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము–తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము–శ్రీమాన్ కడిస్థళం కృష్ణమాచార్యులుగారు | 0 | 8 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము–శిష్టుసర్వశాస్త్రికవి | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము–యథావాక్కుల అన్నమయ్యగారు | 0 | 2 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము–జ. రామయ్యపంతులుగారు | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి–విన్నకోట పెద్దయకవి | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము–తరిగొప్పుల మల్లనకవి | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి–శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము–మల్లికార్జున పండితారాధ్యులు | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | 0 | 4 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము–శ్రీనాథమహాకవి | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము–శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | 0 | 4 |
| 18 | హ్రస్వరంగములు–కొత్తపల్లి సూర్యారావుగారు | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము–హరిభట్టు | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | 0 | 8 |
| 21 | జైమినిభారతము–వచనము–వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబ[illegible] | 1 | 0 |
| 23 | రెడ్డినాటి రెండుశాసనములు | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (1.2 భాగములు) | 1 | 6 |
| 27 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | 0 | 8 |
| 28 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి | 0 | 8 |
| 29 | రసాభరణము—అనంతకవి. | 0 | 8 |
| 30 | చాటుధారాచమత్కారసారః.(సంస్కృతము) | 0 | 8 |
| 31 | ఉత్తరరామచరిత్రము–జయంతి రామయ్యపంతులుగారు | 1 | 0 |
| 32 | షోడశకుమారచరిత్రము–వెన్నెలకంటి అన్నయ | 0 | 8 |
| 33 | అమరుకము–సాంధ్రము–జయంతిరామయ్యపంతులుగారు | 1 | 0 |
| 34 | సాంబోపాఖ్యానము–రామరాజురంగప్పరాజు | 1 | 0 |
| 35 | హంససందేశము–కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | 0 | 2 |
| 36 | సింహాసనద్వాత్రింశిక–ద్వితీయభాగము–గోపరాజకవి | 0 | 12 |
| 37 | రాయవాచకము | 0 | 8 |
| 38 | ఆంధ్రశబ్దచింతామణి–బాలసరస్వతీకృతాంధ్రటీకోపేతము | 0 | 8 |



Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౩ — భావనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. — సంచిక ౫.





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బఁషత్కార్యాలయమునఁ
ప్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు. 3-౦-౦.

విడిసంచిక రు. ౦-౮-౦.

1935.

# విషయసూచిక.

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

**కాకినాడ.**

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**సంపుటము ౨౩.** { భావనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక [illegible]

## మంగళసూత్రములు.

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు, బి. ఏ., కొల్లాపురము.

(పాళీభాషనుండి యనువాదము.)

---

గీ. బుద్ధదేవుఁడు "సావత్థిపురము" నందుఁ, దగ "ననాథపిండకు"ని "జైతవనమం"దు
నొక్కదినమున విహరించుచుండ దరినిఁ, జేరియొక దేవదూత ప్రశ్నించె నిట్లు. ౧

గీ. సకలశుభముల నెప్డుఁ గాంచవలె నంచు
మర్త్యులు నమర్త్యులు వచించు మాటలందు
నధిక మైనశుభం బేది యనఁగ బుద్ధుఁ
డప్డువివరించి చెప్పె సుస్వాంతుఁ డగుచు. ౨

గీ. మూర్ఖులకు సేవసేయంగఁ బోసఁగ దెప్డు, జ్ఞానకోటిని సేవింప మానరాదు
పూజ్యులకు సేవఁజేసిన మోక్ష మబ్బు, మానవుల కిది యుత్తమమంగళంబు. ౩

గీ. వసతికనుకూలమగుచోటవాసముండి, పుణ్యకార్యంబులను జేయఁబూనవలయు
నాత్మతత్త్వవిచారంబు నరయవలయు, మానవుల కిది యుత్తమమంగళంబు. ౪

గీ. సత్యపథమందు నేగుట సత్కళలను, నేర్చియుంట మంచిపనులఁ గూర్చుచుంటఁ
బరుషవాక్కుల నెప్పుడేఁ బలుకకుంట, మానవుల కిది యుత్తమమంగళంబు౫.

గీ. తల్లిదండ్రులయానతిఁ దప్పరాదు, ఆలుబిడ్డల నెప్డుఁ బాయంగరాదు
కులబలాచారములు వీడఁదలఁపరాదు, మానవుల కిది యుత్తమమంగళంబు. ౬

గీ. చేతనైనంత దానంబు సేయవలయు, బంధువులపైనిఁ బ్రేమంబుఁ బాయరాదు
పాపకార్యంబులను జలుపంగరాదు, మానవుల కిది యుత్తమమంగళంబు. ౭

గీ. క్రోధలోభమోహములఁ జిక్కువడరాదు, మద్యపానంబుసేయుట మానవలయు
ధర్మమందున నాసక్తి తగులవలయు, మానవుల కిది యుత్తమమంగళంబు. ౮

గీ. పరులభాగ్యంబుఁజూచి యోర్వమియుఁ దగదు
మ్రొక్కవలయును భక్తితో మునుల కెప్డు
విమలధర్మంబు లెల్ల సాధింపవలయు
మానవుల కిది యుత్తమమంగళంబు. ౯

గీ. గౌరవాదరములనెప్డుఁ గాంచవలయు,నున్నయంతలోఁ దృప్తిని నొందవలయుఁ
బరులొనర్చెడుమేలును మఱవరాదు,మానవుల కిది యుత్తమమంగళంబు.౧౦

గీ. బ్రహ్మచర్యనిష్ఠల నెప్డు వదలరాదు
మంచిపనులకు బుద్ధి నుంకించవలయు
మోక్షమునుబొందుయత్నంబుఁ బూనవలయు
మానవుల కిది యుత్తమమంగళంబు. ౧౦

గీ. కలిమి లేములపట్ల నిశ్చలతయున్నఁ, గష్టసుఖములఁ జిత్తంబు కలఁగకున్న
శోకమనుమాట యెవ్వేళ లేకయుండు, మానవుల కిది యుత్తమమంగళంబు.

గీ. ఇట్టి ధర్మపథమునందు నెవ్వఁడేగు, వాఁడె పో ధన్యతముఁడు నీ వసుధలోన
నతఁడె యెల్ల వేళల సౌఖ్యమరయుచుండు, మానవుల కిది యుత్తమమంగళంబు.

---

# అఖండయతి.

ఆకుల పెద్దయ్యగారు—కానవరము.

---

అఖండయతి యనఁగా విశ్రమాక్షరమునం దర్థఖండనముగాని శబ్దఖండనముగాని యుండఁగూడ దనియేనా యర్థము? ప్రయోగము లట్లు కానరావు లక్షణంబును—

ఉ. మానుగ విశ్రమాక్షరస మంచితమై స్వరమూఁదినం దదీ
యానుగుణాక్షరంబుఁ గొని యైనను జెప్పఁగవొప్పు నిక్కయం
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండవళి పొల్పగు నాదికవిప్రణీతమై.

అని యుండుటచేత నర్థఖండనము మాత్రము గాకున్నచో నఖండవళి యని యూహింపవచ్చును. అప్పకవి దీనినే నిత్యసమాసయతిగాఁ జెప్పియున్నాఁడు. అర్థఖండనము గాకపోయినను విశ్రమాక్షరమునందు స్వరమూఁదఁబడి శబ్దఖండన మగుచుండుటచే దీని నఖండవిరామ మనుటకంటె నిత్యసమసనవిరామ మనుటయే యొప్పిద మని యప్పకవి తలంచెను గాఁబోలు. కాని యఖండవడి యనుపేరును బూర్ణముగ నడఁగఁద్రొక్కలేదు.

గీ. ఒక్కసమసనమున శబ్దయుగము గూడి, పదము లేర్పాటుగాఁగానఁబడనిప్రాణ
సంధులకు నిత్యసమసనశ్రాంతులును న, ఖండవిశ్రమములు నన రెండుఁ జెల్లు.

అని వ్రాసియున్నాఁడు. ఇఁకఁ బ్రయోగము లెట్లున్నవియో దిక్ప్రదర్శనముగఁ జూతము.

గీ. వారు నిరయంబునకుఁ గాపువచ్చువార
లనుచుఁ బుద్ధిగఁజెప్పె మార్తాండసుతుఁడు......

క. చండవిరోధితిమిరమా
ర్తాండు లనఁగఁ దగినవీరు దమలో నిట్లుద్దండతఁ.........

ఉ............

ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నయై, గోపతి...

శా. ద్వీపప్రోద్భవసూక్తపంచమమహావేదంబు దీపించె నే
భూపాలోత్తముపేర.........

ఇట్టివి గీర్వాణభాషాసమసనంబులపట్లను—

గీ. శబ్దశాసనముఖకవీశ్వరకృత గ్రంథములలక్ష్యములఁ గనుపట్టుకతన
దేశ్యనిత్యసమాససంధికిఁ బొసంగు, వడి స్వరం బైన వ్యంజనవర్ణ మైన.
అనుదీనికి లక్ష్యములుగ :—

ఉ. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
క్కఱ రభసంబు మై నడరఁ గవ్వడి ద్రోణియు నీడఁబోకయత్తఱి ... ...

ఉ. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
క్కఱఁ దాఁకెం దమసైన్యముల్ సెలఁగ శౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్.

అను నిట్టి "పెంపఱ, క్రచ్చఱ" మొదలైన "అఱ" శబ్దముత్త్యమందుఁగల పదములకుమాత్రమే దేశ్యనిత్యసమసనాఖండయతులుఁగా లక్ష్యములనప్పకవి గనఁబఱిచినాఁడు. కాని యొం డెవ్వియు నుదాహరించి యుండలేదు.

మఱియు,

క. పనుపుము కౌరవసభకేఁ, జను లెట్లును మేల యర్థ సంసిద్ధి యగున్
మనకొకటం బాపము రాఁ, కునికికిఁగతమైన పలుకు లొండెను గలుగున్. భా.

క. నను నీవు పదస్థునిఁగా, ననఘా చేయంగఁ దలఁచి నప్పుడు నీభృ
త్యనికాయము కఱపులఁబడ, కునికియు నాబుద్ధివినుటఁకును మఱవమికిన్. భా.

అనుతిక్కన ప్రయోగములను బట్టిచూచినచో "తినకుంట, కానకనుట" ఇత్యాదులును దేశ్యనిత్యసమాసములుగాఁ గనఁబడుచున్నవి. ఇక్కడకు దేశ్య నిత్యసమసనములను సంస్కృతనిత్యసమసనములనే కాని యొండు సంధు లఖండ యతుల కుపయోగార్హములు కావని తోఁచెడిని. ఇదమిత్థమనుటకును వీలులేదు.

ఉ. భూవిభునొద్ద కెట్లు గొనిపోవుదు శూన్యరథం బవశ్యముం
దావకసేవకుండ భవదంఘ్రుల నేనిటఁ గొల్చివచ్చెదన్. 1. భాస్కర.

ఇట్టివికూడ నిత్యసమసనము లేనా ?

చ. గొఱియల మేఁకపోతులనుఁ గొమ్ముపొటేళ్ళను గావుగొంచు పి
వరయఁగ సందెకాడఁదగవత్తునటంచు ... ... ...2. శ్రీనాథుఁడు.

దీని నేవిశ్రమం బనవలయునో తెలియదు. ఈపై రెం డుదాహరణములం బోలినప్రయోగములఁ గొన్నిఁటి జూచి యిటీవలివారు కొందఱు-

గీ. ... ... ... ... మఱి, నాతనికుటుంబముఁ గృపాగుణంబుచేత—

(చా. విశ్వపతిశాస్త్రి.)

చ. మునిజనమానసాంబుజసమూహములన్ విహరించుభృంగ మై
జనకమహీపురందరనిజాత్మజ............... యస్. నారాయణరాజు.

సీ. ప్రతిమానుకారులౌ పరివారపంక్తులు గలుగునట్లుగకన్యకాలయంబు

ఎత్తుగీతి. ...ఈరీతిశాస్త్రజ్ఞులెలమిఁబలుకను, చుంకరీటునేయశుభవ్యక్తిశోభిలఁగడు
జనమంచి క్షేమా ప్రిశాస్త్రి.

ఇట్లు ప్రయోగించి యఖండయతిఁగా వాడుచున్నట్టులు గన్పట్టెడిని. వీనిం జూచి నావంటి యల్పజ్ఞులును సంధింపుటకు సందియమేమున్నది? కనుక యాంధ్ర సాహిత్యవిమర్శనాలంకారములచే భాషాసతీమణికిఁ బ్రొత్తయందముల నాపాదింపఁజేయుచున్న పండితవరు లెవ్వరో యొకరీయల్పవిషయమును (అఖండయతిని) గూడఁ బరిశోధించి బహుకృతుల నొప్పుచున్న దీని కొకత్రోవఁ గన్పఱిచి ముందు పత్రికలోఁ బ్రకటించెద రని నమ్మి నే నీస్వల్పవ్యాసమును వ్రాసితిని.

---

# కావ్యలక్షణవిమర్శనము.

శ్రీభాష్యం తిరువెంగళరామానుజాచార్యులుగారు, ఇచ్ఛాపురము.

---

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక [సంపుటము 21, సంచిక 3.] యందు పర్ణశాలవాస్తవ్యులు అయలసోమయాజుల నరసింహశర్మగారు గీర్వాణాలంకారికులు వ్రాసినకావ్యలక్షణములను విమర్శించుచు నొక వ్యాసమును బ్రకటించియున్నారు.

మొదటిభాగము (పేరా) లో వ్రాసిన విషయమేమో గుర్తించి యాపైనా యాశయమును వ్రాయుదును.

కావ్యమున కనేకు లనేకలక్షణములను వ్రాసి రనియు నందు దండి మొదటివాఁ డనియు నీతఁడు కాలముచేతనే మొదటివాఁడు గాక లక్షణరచనచేఁ గూడ మొదటివాఁడే యగుననియు శ్రీశర్మగారి యభిప్రాయము. దండికంటెను భామహాచార్యుఁడు పూర్వుఁడని పండితజనసిద్ధాంతితమై యున్నది. భామహుఁడు 'శబ్దార్థౌ సహితౌ కావ్యం' అని కావ్యలక్షణమును నిర్వచించియున్నాఁడు. కావున దండియే మొదటి లాక్షణికుఁ డని వ్రాయుట పొసఁగదు.

రెండవభాగములో నితరలాక్షణికులమతమును నిరూపించు సందర్భమునఁ గావ్యప్రకాశమునందలి "తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి" అను లక్షణమును వ్రాసియున్నారు. గుణాలంకారసహితములై దోషరహితములగు శబ్దార్థములు కావ్య మగు ననియు నొకప్పుడు స్ఫుటాలంకారములు లేక యస్ఫుటాలంకారము లున్నను గావ్యము గావచ్చు ననియు మమ్మటాచార్యుని యాశయము.

మీఁదిలక్షణము సముచితముగ లేదని చెప్పఁదలఁచినచో గుణాలంకారవర్జితశబ్దార్థములు కావ్యము గావచ్చు ననియు దోషసహితములైనను గావ్యమగు ననియు వ్రాయవలసియున్నది గాని, శర్మగా రట్లు వ్రాయక గుణాలంకారవర్జితములకుఁ గావ్యత్వవ్యపదేశము లేమింజేసి యు, అని వ్రాయుట వారివాదమున కెట్లుపయోగింపఁగలదు ?

పిదప విద్యానాథమతఖండనపురస్సరముగ శర్మగా రింకను, అలంకారసర్వస్వకారాద్యాలంకారికుల మతములందలి దోషములను జగన్నాథపండితుఁడునిరూపించియే యున్నాఁ డని వ్రాయసాగిరి. పండితరాజు కావ్యలక్షణవిషయమునసర్వస్వకారునిమతమునుఖండింపలేదు. అయలంకారసర్వస్వము కేవలము శబ్దార్థాలం

కారములను నిరూపించు గ్రంథము. అది కావ్యాలంకార సంగ్రహమువంటిది. అం దుఁ గావ్యలక్షణమునకుఁ బ్రసక్తియే లేదు.

పండితరాజు వ్రాసినలక్షణముగూడ దోషయుక్త మనియు నాలక్షణమును వ్రాసి తానే సరసముగ లక్షణమును వ్రాసితి నని యతఁడు గర్వించె ననియు శర్మ గారు వ్రాయు టెంతయు సాహసైకమూలము. పండితరాజు మతమున శబ్దమే కావ్యమై యుండుటచే నతఁడు శబ్దగతగుణదోషములనే నిరూపింపవలెను గాని యర్థగతగుణదోషములను గాని యర్థశక్తిమూలధ్వన్యాదులను గాని నిరూపించుట యప్రసక్త మగును. అని శర్మగారు వ్రాసియున్నారు. కాని, జగన్నాథపండితుని మతమున రమణీయార్థమును బ్రతిపాదించు శబ్దమే కావ్య మగుచున్నది. కాని, శబ్దమాత్రము గాదు. ఈయంశము లక్షణమునుబట్టియే తెలియుచున్నది. ప్రథమ మునఁ బండితరాజులక్షణము నుట్టంకించినశర్మగారేల యాలోచించి వ్రాయలేదు ?

లాస్యాంగములను గూర్చి వారేమో వ్రాసిరి కాని యావిషయము ప్రస్తు తమున కుపయోగము కానందున విరమించుటయే శ్రేయము.

మఱియు శర్మగారు శబ్ద మనఁగా శ్లోకపదము మాత్రమే యని భ్రమపడి యున్నారు. వీరు శబ్దస్వరూపము నాలోచింపక యిట్లనిరి, కాని, పదము లేక వాక్యము వాక్యసమూహముంగూడ శబ్దము లనంబడును. కావున హరిః, కృష్ణః, రామః, అను నిట్టిపదము లెట్లును రమణీయార్థప్రతిపాదకములు కానందున నిట్టి వానికిఁ గావ్యత్వము సంభవింపదు. అనివ్రాయుట యనవసరము. ఇట్టివి కావ్యము లు గా వనియే రసగంగాధరాభిప్రాయము. వాక్యమే కావ్య మగును. కేవలపద మునకు రమణీయత లేనందున నది యెన్నఁడును గావ్యమగుట సంభవింపదు.

కావ్యము రచించుకవికి శబ్దార్థములు రెండింటియందును సంరభ మవస రము. శబ్దార్థములకు రెండింటికిని నవినాభావసంబంధము కల దనుట నిర్వివాదాం శము. ఈవిషయమును బండితరాజు మాత్రము కాదని త్రోసిపుచ్చెనా !

తక్కిన లక్షణము లేవియు బాగుగలే వని నిరూపించు శర్మగారు దండి రచించిన "శరీరం తావ దిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ" అను లక్షణమే యుచిత మైన దని నిరూపించిరి. విచారించి చూచినచో, పండితరాజు వ్రాసిన "రమణీ యార్థప్రతిపాదకః శబ్దః కావ్యం" అను లక్షణమునకును నీమీఁదిలక్షణమునకును భేదములే దని శ్రీశర్మగారే యూహింపకపోరు. ఇష్టార్థ మనఁగా లోకోత్తరానంద మును గలుగఁజేయు నర్థ మని శ్రీ శర్మగారే వ్రాసినారుగదా !

శబ్ద మనఁగాఁ బదముఁగాక పదసమూహరూపవాక్య మని యిదివఱకేని రూపింపఁబడియున్నది. ఇట్టిచో సమానము లగులక్షణములలో నొకటి యాదరణీయమనుటకును మఱియొకటి యనాదరణీయ మనుటకును గలకారణము పక్షపాతమగుచున్నయది.

"రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం" అను లక్షణమున నర్థగతగుణదోషాదులను జెప్పట యప్రసక్తకథన మని వ్రాసిన శర్మగారికి "ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం" అను లక్షణమున నీశంక యేలకలుగలేదో ? "కావ్యం పఠితం అర్థస్తు నజ్ఞాతః" అను వ్యవహారవిషయమై శర్మగా రాశ్రయించిన లక్షణను గూర్చి చర్చించి విచారించుట యప్రస్తుతము. శబ్దము కావ్యమా శబ్దార్థములు కావ్యమా యనువిషయము చర్చకు వచ్చినపు డావిషయమును విశదీకరింపవచ్చును.

సిద్ధాంతపక్షముగాఁ దీసికొనిన దండిమతమునఁ గూడ శబ్దమే కావ్యమగుటచే మీఁదివిషయము వివాదవిషయమే కాఁజాలదు.

మఱియు శర్మగారు"కావ్యం పఠితం అర్థస్తు నజ్ఞాతః" అన్నచోట లక్షణ నంగీకరించి లోకోక్తిని సరిపెట్టుట వారివాదమునకే సరిపడకున్నయది. ఆశబ్దమునకుఁ గావ్యత్వము నంగీకరించిన శర్మగారు తమమతమున కవలంబనముగా మీఁదివ్యవహారము నిచ్చినప్పుడు పూర్వపక్షి యట్టిచో లక్షణ నాశ్రయింతు మని సమాధానము చెప్పవలసియున్నది, కాని, యీ సమాధానమును శర్మగారే చెప్పినచో వారిమత మెంతవఱకు స్థిరీకృత మగునో యూహ్యము.

సంస్కృతసారస్వతచరిత్రము.

# ద్వ్యర్థిత్ర్యర్థికావ్యములు.

యీయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, యం. ఏ.,
పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

---

శ్లో. అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూఢ
మప్రాప్తచుంబన మవీక్షితవక్త్రకాన్తి
కాన్తావిమిశ్రవపుషః కృతవిప్రలమ్భ
సమ్భోగసఖ్య మివ పాతు వపుః పురారేః''—చిత్తపకృతము.

[భోజదేవుని 'శృఙ్గారప్రకాశము'న నుద్ధృతము.]

ఈ శ్లోకరత్నము సుప్రసిద్ధకవిరాజు ను, రాజకవి యు, వైయాకరణశిరోమణియు, నాలంకారికచూడామణియు నగు భోజదేవుని 'శృఙ్గారప్రకాశము'నం బ్రథమస్థానము నలంకరించుచున్నది. ఈశ్లోకసారస్యము సన్యభాషలోనికిం దెచ్చుట దుస్తర మని, విద్యామహోదధిబిరుదాలంకృతు లగు, బారిష్టర్ కాశీప్రసాదజయస్వాల్ మహోదయులు నుడివియున్నారు.[1] దీనిభావము ప్రకృతోపయోగముగా నున్నది.

ఈవ్యాసమును రెండుభాగములుగా విభజింపనగును. పూర్వభాగమున ద్వ్యర్థిత్ర్యర్థికావ్యముల యుత్పత్తియుఁ బరిణామమును విచారింపఁబడును; ఉత్తరభాగమున నాయాకవులంగూర్చియుఁ దత్కావ్యములఁ గూర్చియు నించుక వివరింపఁబడును. ఏకనాళావలంబి యగుఫలద్వయమువలెఁ గావ్య మంతయుఁ గథాద్వయాన్విత మయి యుండినచో నక్కావ్యము ద్వ్యర్థికావ్య మనఁబడును. రాఘవపాండవీయమువంటి యుత్తమద్వ్యర్థికావ్యమును మనము భారతకథాజిజ్ఞాసతోఁ బఠించిన సామాన్యముగా మనః క్లేశమునుం గల్గింపక తదనుగుణముగా నాకావ్య మం

1. "It is a salutation to the Hindu deification of the ideal and married life and wedded love—the God-with better-half. The *Ardhanarisvara* figure of Purari (Siva) in *Vipralambha* and unity is painted : not even looking at each other, so close, yet so distant, an apparent and assumed aloofness but really eternal unity and complete identity, without caresses, without embraces, separated and joint!—the god of gods, the paragon of husbands: with the holy wife, the goddess of devotion, wife first and goddess after-wards, both in one form—in an artificial misunderstanding of love—too delicate to translate."

తయు నన్వయించును.అట్టిపియే రామాయణార్థము నెఱుఁగు సంకల్పముతోఁ జదివితి మేని తత్తత్కథానుగుణముగ నాకావ్య మంతయు విశద మగును. ఇట్టులే కథాత్రయసమ్మిళిత మగుకావ్యము త్ర్యర్థికావ్య మనఁబడును. క్లిష్టరచన రహితముగ ద్వ్యర్థికావ్యమును రచించుటయే బహుకష్టసాధ్యము. ఇఁకఁ ద్ర్యర్థికావ్యములలోని క్లిష్టరచనముఁ గూర్చి చెప్పవలసిన దేమి? వక్రోక్తిసాహాయ్యముననే, యిట్టి బహుళార్థకకావ్యములు రచియింపఁబడును. కవితకు వక్రోక్తియే ప్రధాన మని యాలంకారికులలో వక్రోక్తిమతప్రతిపాదకుఁ డగుకుంతకుని యభిప్రాయము. [చూ. వక్రోక్తిజీవితము.][2] వ్యాసగౌరవభీతి నిట వక్రోక్తిస్వరూపమును నిరూపింపఁజాలను.

పార్వతీపరమేశ్వరుల యర్ధనారీశ్వరస్వరూపమే యప్రతిమప్రతిభాభాసు రు లగుసంస్కృతకవీశ్వరులకు వక్రోక్తి (లేక శ్లేష) స్వరూపమును స్ఫురింపఁజేసి యుండు నని తోఁచెడిని. కవిరాజసూరి తన 'రాఘవపాండవీయము' నిట్టు లర్ధనారీశ్వరమూర్తితోఁ బోల్చియున్నాఁడు.

"శ్లో. రమ్యా రామాయణీ యైషా భారతీ సైవ భారతీ
అర్ధనారీశ్వరమయీ మూర్తి రేకత్ర శోభతామ్"—I. 42.

ఇంతకుఁ గొన్నిశతాబ్దములకుఁ బూర్వమే కాళిదాసకవీంద్రుఁడు నిట్టులు నుడివియున్నాఁడు :

"శ్లో. వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ"—రఘు. I. 1.

ఇట, "పార్వతీప, రమేశ్వరౌ" అని విశిష్టాద్వైతపక్షమును గూడ మల్లినాథసూరి చమత్కరించి యున్నాఁడు. హరిహరహిరణ్యగర్భాత్మక మగు సవితృస్వరూపమే త్ర్యర్థికావ్య రచనమును స్ఫురింపఁజేసి యుండు నని యూహించుచున్నాఁడను.

సాహిత్యశాస్త్రమున, భరతాచార్యపూజ్యచరణుల 'నాట్యశాస్త్రము' లోఁ బ్రప్రథమమున 'శ్లేష' ప్రబంధగుణముగా నుల్లేఖింపఁబడియున్నయది. శ్లేష స్థూలదృష్టికి సుగమముగాఁ గాన్పించినను, నిజముగాఁ గష్టైకసాధ్య మనియే యెం

2. సుశీలకుమారదేపండితునిచేఁ టీకాటిప్పణులతోఁ గలకత్తా ప్రాచ్యగ్రంథావళిలోఁ బ్రచురింపఁబడినది. ద్వితీయావృత్తి 1928.

3. చూ. సంస్కృతరాఘవపాండవీయవిమర్శనము- [ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక—విభవ- XVII సం. 2 సంచిక- 67-69 పుటలు.]

చెందగును. ప్రాచీనులగు కాళిదాసాదుల కావ్యములలో శ్లేషాభిలాష బహువిరళ ముగాఁ జూపట్టెడిని. [రఘు. XI. 20; కు. సం. VIII. 22.] భారవి,మాఘుఁడు మొదలగువారికావ్యములలో నిట్టిభాషాచమత్కారాభిరుచి విశేషముగాఁ గాన వచ్చుచున్నది. ఈవ్యసనము సుబంధుభట్టబాణుల కవితలలోఁ దలస్ఫుటముగఁ గానఁబడుచుఁ, బ్రకృతము మనము విచారింపఁబోవు బహ్వర్థకకావ్యములలో మిన్ను ముట్టినది యని చెప్పవచ్చును. ఇట నీకావ్యరచనాకాలముం గూర్చి కూడ నించుక విచారింపవలసియున్నది. ఏతత్కాల కవితాప్రపంచములో గారడివిద్యయే సామాన్యముగాఁ గానవచ్చుచున్నయది కాని యుత్తమకవితాసంపద సాధారణ ముగా దృగ్గోచర మని సాహిత్యవేత్తలు పలుకుదురు. గర్భ, బంధ, చిత్ర, యమ కవ్యామోహ మీకవితలో విశేషముగాఁ గానవచ్చెడిని. ఈదృశచతుర్విధకవితా సంపన్నుఁడు సంస్తుతింపఁబడుచుండెడివాఁడు. ఇట్టికవిత్వనైపుణ్య మాశ్చర్యజనకమై నను సహృదయహృదయముల కానందమును గల్గింపఁజాలదు. ఇట్టికవిత మనస్సు నాశ్చర్యనిమగ్నముఁ గావించినను, హృదయమును గరఁగింపఁజాలదు. అరసికుల కాశ్చర్యహేతువైనప్పటికి నిట్టికవిత రసికశిరఃకంపముం బడయనేరదు. ఇట్టికృతక కవితానిర్మాత యభినందార్హుఁడైనఁ గావచ్చు నేమో కాని, యాదర్శకవి కానో పఁడు. ['He is rather to be admired than imitated'] ఇట్టి కవిత భావకునకు గవికిఁ గూడఁబతనహేతు వని యాలంకారికు లందురు. రసపరిపంథి యగు నిట్టికవిత నుత్తమాలంకారికులు నిరసించియున్నారు. విశ్వనాథకవిరాజు 'సాహిత్యదర్పణము'న

'కావ్యాంతర్గడుభూతాయా నేహ తత్ర ప్రపంచ్యతే'

అని శ్లేషకవితను నిరసించియున్నాఁడు. ఇట్టికృతకకవిత్వము, కవితాభ్యు దయమునకే కాక, భావకునకు బతనహేతువే. కవి యనుత్తముఁ డయినను శ్లిష్టరచ నావసరమునఁ గ్లిష్టాన్వయాదులఁ బరిహరింపఁజాలఁడు. పదములకు లేని యర్థ ములఁ దనపాండిత్యప్రౌఢిచేఁ గాని, నైఘంటుకసాహాయ్యమునఁ గాని సాధించి, భావసంపద గాని, రససంపద గాని లేని తనగారడికవితచేతను, దనపాండితీకౌశల ముచేతను నీకవి, పఠితల నాశ్చర్యనిమగ్నులఁగాఁ జేయును గాని రసపరవశులఁగాఁ జేయఁజాలఁడు. ఇఁక సామాన్యకవింగూర్చి నుడువనేల ? ఈకాలపుఁగవిత కృత కకవితాభిలాషులకు నభ్యుదయము నందుచున్నయట్లు గానవచ్చినను, సత్కవిత కీకా లము పతనదశ యని చెప్పవలసియున్నది.

అమరకోశము మొదలగు నిఘంటువులలో నానార్థసర్గములమాటయటుండ, నానార్థనిఘంటువు లుత్పత్తిల్లుటయే కాక యీకాలమున, శ్లేషకవితకు బహులార్థకావ్యరచనమునకు నుపకరించు నిఘంటువులు బయలుదేఱినవి. [ఉదా. వేదాంతదేశికుల 'దశదీపకనిఘంటువు.'] అరిసింహామరచంద్రులు రచించిన కవిశిక్షాగ్రంథమగు 'కావ్యకల్పలతావృత్తి' లో 'శ్లేషసిద్ధి' యను తృతీయపరిచ్ఛేదము చివర శ్లేషోపయోగిశబ్దము లొసంగఁబడియున్నవి.

---

## శ్లేషకావ్యము—ద్వ్యర్థికావ్యము.

శ్లేషకావ్యద్వ్యర్థికావ్యములభేదము నిట నిరూపించుట యప్రస్తుతము గాదని యెంచెదను. వివిధశ్లేషవిశిష్టము లగుటచే సుబంధుని "వాసవదత్త"యు భట్టబాణుని "కాదంబరీ హర్ష చరితములు" ను శ్లేషకావ్యము లనఁబడును. కవిరాజు 'రాఘవపాండవీయము' నందువలె వీనియందుఁ గథాద్వయసమ్మేళనము లేకపోవుటచే నివి ద్వ్యర్థికావ్యములు గాఁజాలవు. సుబంధుభట్టబాణులు శ్లేషకవులుగాని ద్వ్యర్థికవులు గారు. కవిరాజు శ్లేషకవి యనియేకాక ద్వ్యర్థికవియు ననఁబరఁగును.

విశ్వగుణాదర్శము, లక్ష్మీసహస్రము, కరిగిరిచంపువు, ఉత్తరరామచరితచంపువు, శ్రీనివాసవిలాసము మొదలగు వానింబట్టి వేంకటాధ్వరి 'శ్లేషయమకచక్రవర్తి' యైనను 'యాదవరాఘవీయ' రచనముచేతనే యాతఁడు ద్వ్యర్థికవి యనియు, విలోమకావ్యనిర్మాత యనియు ననఁ బరఁగుచున్నాఁడు. [రామరాజభూషణుని 'వసుచరిత్రము' శ్లేషకావ్యము; 'హరిశ్చంద్రనలోపాఖ్యానము' ద్వ్యర్థికావ్యము.]

'శ్లో. ప్రత్యక్షరశ్లేషమయప్రపంచవిన్యాసవైదగ్ధ్యనిధిం ప్రబన్ధమ్
సరస్వతీదత్తవరప్రసాద శ్చక్రే సుబన్ధుః సుజనైకబన్ధుః. '

అని సుబంధుమహాకవి తాను 'ప్రత్యక్షరశ్లేషమయప్రపంచవిన్యాసవిదగ్ధుఁడ'నని పలుకుట యాతనికావ్యముంబట్టి యతిశయోక్తి కానప్పటికి నాతనికావ్యము 'శ్లేషకావ్యమే' కాని ద్వ్యర్థికావ్యము గా నోపదు. ఇం దితివృత్తద్వయసమ్మేళనము లేకపోవుటంజేసి యిది ద్వ్యర్థికావ్య మనఁబడదు. సుబన్ధుభట్టబాణులకావ్యములలో నీవైలక్షణ్యము లేమిచే నవి శ్లేషకావ్యము లనియే యనఁబరఁగును.

ద్వ్యర్థికావ్యము లితివృత్తద్వయపరముగా విభజింపఁబడుటచే [వ్యస్తముగాఁ జేయఁబడుటచే] ననఁగా నేకకాలముననే, యొకవాక్కుతోడనే కథాద్వయము నభివర్ణించుటంజేసి, యీకావ్యములు, 'వ్యస్తకావ్యము' లనియు ననఁబడు

చున్నవి. [దైవజ్ఞసూర్యసూరి 'రామకృష్ణవిలోమకావ్యము' నందలి యుపసంహార శ్లోకములలోఁ జెప్పియున్నాఁడు.]

శ్లో. సమాక్షరాంఘ్రి ద్విషమాక్షరార్థ ద్వేధా భవే ద్వ్యస్త కవిత్వసీమా-

ద్వ్యర్థికావ్యరచనము కష్టైకసాధ్య మని కవిరాజసూరి యిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. పద మేక మపి శ్లిష్టం వక్తుం భూయా న్పరిశ్రమః
కథాద్వయైకనిర్వోఢుః కిం ధరాపతితోఽధికః"—1-స.[4]

హరదత్తసూరి తన 'రాఘవనైషధీయము' నకు స్వవిరచిత వ్యాఖ్యానములో నిట్లు లని యున్నాఁడు. "సంస్కృతభాషాయా పోఽర్థాన్తరసంఘటితో దుర్ఘటః కవ్యన్తరైః స్వప్నేఽపి వ్యథాయి ప్రబన్ధోఽయమ్" [1 స. 7 శ్లో. వ్యాఖ్య]

ఆంధ్రాదిద్రావిడభాషాపరిచయలోపముచేతఁ గావలయు నాచార్య 'మెక్డానెల్' పండితుఁడు తన "సంస్కృతసారస్వతచరితము"లో (331 పు.) సంస్కృతములోని ద్వ్యర్థికావ్యరచనము సార్వలౌకికసారస్వతములలో నిరుపమాన మని వ్రాసి యున్నాఁడు.

" A *tour de force* of this kind is unique in the literatures of the world." రాఘవపాండవీయమువంటి యుత్తమద్వ్యర్థికావ్యముం బఠించుచోఁ బ్రాయికముగా నర్థవిదు లగు పాఠకులకుఁ దత్తద్వివక్షితార్థంబును దత్తత్ప్రధానకావ్యమువలెనే యాకావ్య మన్వయించుచుండును. అర్థసమన్వయ మరసి యుచితరీతిం బఠించినచోఁ దత్తదర్థము సుబోధమయి యుండును. సామాన్యద్వ్యర్థికావ్యములు గొన్నింటివలె నిట్టి యుత్తమకావ్యము నానార్థకకోశాన్వేషణావసరమును దఱచుగాఁ గల్పింపదు. ఒకసారి చదివిన రామాయణార్థంబును, వేఱొకసారి చదివిన భారతార్థంబును గ్రహించునెడఁ బాఠకుల కావృత్తికల్పనంబున వ్యాపారగౌరవంబు గల్గినను నొక్కకావ్యమె యుభయార్థప్రతిపాదకం బగుటఁ బ్రయోక్తకు-"మాత్రాలాఘవం పుత్త్రలాభమివ మన్యన్తే వైయాకరణాః" మాత్రాలాఘవము పుత్త్రలాభతుల్య మని సంతసించు వైయాకరణులకు సమ్మతం

---

4. దీనిని గాంచియే పింగళి సూరనార్యుఁడు-

శా. రెండర్థంబులపద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబుగా
దుండుం దద్గతిఁ గావ్య మెల్లనగునే నోహో యనం జేయదే.

అని తన రాఘవపాండవీయ పీఠికలోఁ జెప్పినాఁడు.

బగు నుచ్చారణలాఘవంబును దానం జమత్కృతివిశేషంబును సహృదయైకవేద్యం బైయుండు నని కొంద అందురు. కాని యీయభిప్రాయము సరి గాదేమో యను కొనుచున్నాఁడను. బహుళార్థకకావ్యము రచనమున రచయిత మనస్సును, పఠన మున రసికునిహృదయమును క్లేశపఱచును. శ్లేషచిత్రయమకభూయిష్ఠ మగుకవి తలోఁ బ్రాయికముగా రసపుష్టి మృగ్య మనియే సాహిత్యవేత్తలు పలుకుదురు. శ్రీ. శ్రే. వీరేశలింగముపంతులుగారు సారస్వతసిద్ధికి భంజకమగు నిట్టిరచనను నిరసిం చుచు, రాజమార్గమున గమ్యస్థానము చేరుటకు బదులు, కంటకశిలామయ మగు దుష్పథమున, దొరలిదొరలి గమ్యస్థానముం జేరునట్టు లున్న దని 'ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాస' రచనముం గూర్చి నుడివియున్నారు.

పాశ్చాత్యసంస్కృతపండితుఁడు, "డాక్టర్ ఏ. బెరిడేల్ కీత్" మహాశయుఁ డిట్టి కావ్యముల "A triumph of misplaced ingenuity" అని నిరసించి యున్నాఁడు.[5] ఆపండితుఁడే స్వరచితమగు "సంస్కృతసారస్వతచరిత" మను[6] లఘు గ్రంథములోఁ గవిరాజుం గూర్చి, బహునియమములు గలిగి దుర్ఘట మగు నిట్టి ద్వ్యర్థికావ్యమునే యింతసౌలభ్యముతో విరచించి తన వాచామగోచరప్రజ్ఞావైభ వముం జూపిన కవిరాజు తనకవితాధురిని గుటిలమార్గమునం గాక సన్మార్గమునఁ బ్రవేశపెట్టి, పైనియమములేనికావ్యమును రచించియుండినచో నెంత చేతోరంజక ముగా నుండెడినో యని వచించియున్నాఁడు.[7]

"లోకో భిన్నరుచిః" అను న్యాయముననుసరించి యిట్టికావ్యములను సమ ర్థింపఁదగును. ఎట్లనఁ బైకి గొగ్గిగొగ్గి యగువికృతస్వరూపము గలిగి లోపలఁ జేఁ దుగానుండు కాఁకరకాయలు నావంటి మందరుచికి రుచింపకపోయినఁ బోవుఁగాక, లోకములో వాని నెంతవెలకైనను గొని యనుభవించెడివా రెంతమంది లేరు ? బంగినిపల్లి మామిడిపండ్లను, మాహిషం బగుపిచ్ఛిలదధిని, గోదుగ్ధమును, గోఘృ తము సేవగించుకొనువారిని నేనెఱుంగుదును. సంస్కారియుఁ గవియు నగుమామిత్రుఁ డొకఁడు మొదట వేంకటాధ్వరికవితకు నమస్కరించి పిమ్మటఁ గాళిదాసుని కవితకు

---

5. A History of Sanskrit Literature.
6. A History of Classical Sanskrit Literature.
7. ఒకానొకవిమర్శకాగ్రణి యిట్టులు నుడివియున్నాఁడు:—

"It may perhaps be ture that in those degenarate ages of artificial poetry, he who thinks himself capable of astonishing the intellect may write such a work, but he that hopes of appealing to the heart must resort to a more legitimate end."

నమస్కరింతు నని యనియెను. వేంకటాధ్వరి నాయభిమానకవులలోఁ బ్రధానుఁ డైనను నేను బైయభిప్రాయముతో నేకీభవింపఁజాలను.

గ్రంథముయొక్క యచ్చుప్రతు లచిరకాలమున విక్రయింపఁబడుట యా గ్రంథమునెడలఁగలజనానుమోదమునకు నిదర్శనమైనచోఁ,గవిరాజ సూరి "రాఘవపాండవీయము"ను నైఘంటుకధనంజయుని "ద్విసంధాన"మనురాఘవపాండవీయమును విశేషజనాదరముం బడసిన వని చెప్పవచ్చును. ఈకావ్యములు వ్యాఖ్యాసనాథముగ నిర్ణయసాగరయంత్రాలయమునఁ 'గావ్యమాల' లో నలువదిసంవత్సరములక్రిందటఁ బ్రకటింపఁబడియున్నవి. ఈకావ్యములకంటెఁ బ్రశస్తతరమును,ఆకాలముననే ముద్రింపఁబడినదియు, 'సాహిత్యదర్పణో' ద్ధృతము నగు కృష్ణానందమహాకవి 'సహృదయానందపు' మొదటిముద్రణపుఁ బ్రతులు నేటికిని లభించుచుండ, 'రాఘవపాండవీయ' 'ద్విసంధానములు' చిరకాలముక్రిందటనే చెల్లిపోయినవి. వావిళ్లరామస్వామిశాస్త్రిగారు 1861 లో నొకసారియు, 1874 లో నొకసారియు వ్యాఖ్యానసహితముగ ముద్రించిన చిదంబరసుమతి 'రాఘవపాండవయాదవీయము' ప్రతులు చిరకాలముక్రిందటనే దొరకుటలేదు. ఆంధ్రదేశముననేకాక యితరదేశములలోఁ గూడ విశేషవిద్వదామోదముం బడసిన ధర్మసూరి 'సాహిత్యరత్నాకరపు' ద్వితీయముద్రణపుఁ బ్రతులు (1885) నేటికిని లభించుచున్నవి. తక్కినవిషయములలోవలె నభిరుచులలోఁ గూడ లోకము గతానుగతిక మనియే తోఁచెడిని. లోకములో నుత్తమరసికులు బహుస్వల్పముగా నుందురు. సారస్వతోపాసకులలో ననేకులు పరప్రత్యయనేయబుద్ధులే యనవచ్చును.

ద్వ్యర్థికావ్యరచనావిధానము కవిరాజుచే నిట్టులు సూచింపఁబడియున్నది.

"శ్లో. ప్రాయః ప్రకరణైక్యేన విశేషణవిశేష్యయోః
పరివృత్త్యా క్వచిత్తద్వ దుపమానోపమేయయోః
క్వచి త్పదైశ్చ నానార్థైః క్వచి ద్వక్రోక్తిభంగిభిః
విధాస్యతే మయా కావ్యం శ్రీరామాయణభారతమ్". రా. పాం. 1. 37-38.

ఇట్లే పింగళి సూరనార్యుఁడు-

"ఆంధ్రభాషాసంస్కృతాభిభాషాశ్లేష యొక్కొక్కచోట నొక్కొక్కచోట,
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట ....................................."

అని తన రాఘవపాండవీయములో (1 ఆ.) వ్రాసియున్నాఁడు. "బెరిడేల్ కీత్" ద్వ్యర్థికావ్యరచనము స్థూలదృష్టికి గోచరించునంత దుర్ఘటము గా దనియు,

సంస్కృతభాష యిట్టి రచనమునకు విశేషముగా ననుకూలించుననియు వ్రాసియున్నాఁడు:[8]

శ్లేషాభిలాష బహుళార్థకకావ్యములకు నిదాన మని తెలిపియున్నాఁడను. ద్వ్యర్థికావ్యరచనమునఁ దమకుఁ గలిగినమనఃపరిశ్రమను గుర్తెఱింగిన కొందఱు కవులు, పాఠకులు కవిహృదయము నెఱుంగలేరేమో యనుభీతిచేఁ దమకావ్యములకుఁ దామే వ్యాఖ్యానములను వ్రాయఁజొచ్చిరి. [హరదత్తసూరి తన 'రాఘవనైషధీయము' నకుఁ దానే వ్యాఖ్యను రచించెను.] ఇట్టి బహుళార్థకకవితావ్యామోహము కవితను విశేషక్లిష్టముగా నొనరించినది.

ధనంజయుని 'ద్విసంధానము'లోఁ ద్ర్యర్థకశ్లోకములుఁ, జతురర్థకశ్లోకములును గలవు. ఈసూచనయే త్ర్యర్థక, చతురర్థక, పంచార్థకకావ్యములకు దారిఁ జూపినట్టులు తోఁచెడిని. చిదంబరసుమతి 'రాఘవపాండవయాదవీయము'లోని యీక్రిందిశ్లోకమునకుఁ బదియర్థములు గలవు.

శ్లో. వాచంవో రచయతు సర్వదా న్తరఙ్గే గాఙ్గేయః సరసనయోదయాం దధానః
సత్యాప్తో బుధకులపాళిబన్ధురోజః శ్రీరామః స్తుతగురుమానసాబ్జహంసః.

కవితంద్రియగు ననంతనారాయణసుమతి యీకావ్యమునకు వ్యాఖ్యవ్రాసెను. పైశ్లోకము వ్యాఖ్యచివర నాతఁ డిట్టులు వ్రాసియున్నాఁడు.

---

8. "The feat (i. e. of composing a 'Dvyarthikavya)which at first sight appears incredible, is explained without special difficulty by the nature of Skt. Treating each line of verse as a unit, it is possible to break it up very variously into words by grouping together the syllables. Then the meaning of compounds is often vitally affected by the mode in which the relations between the words composing them are conceived, even when the words are understood in the same sense and the compound is analysed into the same terms. Further, and this is of special importance, the Skt. lexica allow to words a very large variety of meanings and they supply a considerable no. of very strange words which have a remarkable appearance of being more or less manufactured, in the sense that the meaning or form ascribed may have been derived from some mere misunderstanding or in some cases from a mere misreading. [Hist. of Skt. Lit. P. 137 ff.]

ఈయభిప్రాయములు సత్యదూరములు గాకపోయినను, ద్వ్యర్థికావ్యరచన మీపండితుఁడను కొనునంతటి సుసాధము గాదు. ద్వ్యర్థికావ్యరచనము బహుకష్టైకసాధ్య మని యట్టి కవులకే కాని యన్యులకుఁ దెలియుట కష్టము. (సం శే)

(కా. బ్రహ్మయ్యశాస్త్రిగారు—గతసంచికశేషము.)

—: స్వరోచివర్తనముంగూర్చి :—

దీనింగూర్చి మే మేమియు నంతగా వ్రాసియుండలేదు. బహుభార్యాత్వము రసాభాసమునకు మూల మని మనుచరిత్రము చెప్పెను. అది గాక యాతఁ డతి కాముకుఁడై వర్తించినట్లు పెద్దనయే తెల్పియున్నాఁడు. ఈస్వరోచిదగు కామాంధతను మానవులు నిందించుటమాట నటుండ నిండు. మృగములును ఖగములును గూడ బహువిధముల నిందించినట్లు మనుచరిత్రమే చెప్పుచున్నది. పెద్దన తనగ్రంథములో స్వరోచి తనపై వచ్చునాక్షేపణముల "నెఱింగి సిగ్గునన్ తల వంచి యుస్సురని మది దలపోసె"నని వ్రాక్కి చెప్పుచుండఁగా రావుగా రాయనుచితప్రవర్తనమును నుచిత మని సమర్థింపఁ జూచుట పెద్దవింత కాదా ? రావుగారు తా మెవరి నధిక్షేపించుచున్నారో యెవరిని సమర్థించుచున్నారో కూడ నెఱుంగరు. ఏమన: పెద్దన వ్రాసినదానినే ఖండించుచు మరల దానినే సమర్థింపఁబూనుకొనిరి.

ఇఁక రావుగారు కావించిన సమర్థన మెట్లున్నదో యదిగనుఁడు. స్వరోచి తాను విధివిహితముగాఁ బెండ్లాడిన భార్యలను మాత్రమే కూడెడువాఁడు కాని తాను బెండ్లాడని వనితలఁ గూడెడువాఁడు కాఁడఁట. స్వవనితలఁ గూడుట తప్పు కా దఁట. ఇది వీరు తుదకుఁ జేసిన సమర్థనము. ఇది మూలమును జూచుకొనకయే వ్రాసినవ్రాఁత. స్వరోచి స్వారోచిషుని నేకాంతయందుఁ బుట్టించెనో యామెయే స్వరోచిభార్య కాదు. అయినను నామెయందు మనువును బుట్టించెను. కాన రావుగారు వ్రాసినది తప్పు. దాని కేమి, స్వరోచి యతికామముతోఁ భార్యలఁ గూడెను గాన నదియుఁ దప్పే. ఇందులకై పెద్దనను నిందింప నవసరము లేదు. మూలము లాతఁ డతికామాంధుఁడై వర్తించె నని తెలుపుచున్నవి కానఁ బెద్దనయు నట్లు చెప్పవలసినదే. కాని యిప్పట్టున, పెద్దనచేసిన తప్పొకటి కలదు. స్వరోచి కామాంధుఁడై తిరిగి తిరిగి హంసహంసీసంభాషణము నువిని బుద్ధిదెచ్చుకొని విరాగియై తప స్సొనరించి యుత్తమలోకమునకుఁ బోయినట్లు మూలమునఁ గలదు. ఆకథను మనకవి తీసి పాఱవైచెను. అట్లు చేయుట తప్పు కాకపోలేదు. ఆకథను మూలకథతోఁ సంబంధము లేని దగుటచేఁ బెద్దన తీసివేసె నని రావుగారు వ్రాసిరి. అది స్వరోచియొక్క శృంగారవర్తనమునకు నడ్డుగా నుండును, గావునఁ దీసి పాఱవైచె నని తేవప్పెరుమాళ్ళయ్యగారు చెప్పిరి. పెరుమాళ్ళయ్యగారు చెప్పినదే కొంత బాగుగ నున్నది. ఏమన, స్వరోచివర్తన

మునకుఁ గొంత సరిపడుచున్నయది. రావుగారు చెప్పినది సరిపడి యుండలేదు. ఏమనఁ బెద్దన మూలకథలో సంబంధింపని కథలఁ దీసివేయు స్వభావము కలవాఁ డుగాఁ గాన్పించుట లేదు. మనోరమాదులకథలను బ్రధానకథతో సంబంధింప కున్నను నిలిపి యుంచుటయే గాక విశేషముగాఁ బెంచి వ్రాసెను. అదిగాక యీ తనికిఁ దపస్సులు గిపస్సులు ననినఁ గిట్టవసియే చెప్పకొనవలసియున్నది. ఏమనఁ దపస్సు చేసి స్వరోచి యుత్తమలోకములకుఁ బోయినట్లుగా మూలము చెప్పు చుండఁగా దానిఁ దీసివేయుటయే కాక స్వారోచిషునిఁ బుట్టించుటచేతనే యుత్త మలోకావాప్తి కలిగినట్లు మనకవి వ్రాసెను. దీనింబట్టి తప స్సవసరము లే దని తేలుటలేదా ? ఈసందర్భములో మనరావుగారే "స్వరోచి పుత్త్రుఁ డగు మను వును గనిన వెంటనే దేవతలవరముచొప్పున పుణ్యలోకమునకుఁ బోయెను. వేఱె తప స్సెందుకు?" అని వ్రాసిరి. కాన పెద్దనార్యుఁడు తప స్సవసరము లే దని భావిం చినట్లు తేలుటలేదా ? సంతానముం గనినఁ జాలును. వేఱె తప స్సేల యని వాదించుట వరూథినీవాదమునకుఁ దోఁబుట్టు వగుట లేదా? అది గాక యుత్తమ మైన తపస్సు చేసి పొందు నుత్తమలోకమునకును బిడ్డలను గని పొందు నుత్తమ లోకమునకును దారతమ్య ముండును. తపస్సువలనఁ గలుగు ఫల మెక్కువది. ఈయంశమును విద్యారణ్యభాష్యమే తేల్చుచున్నది. ఇవి యిటు లుండ నిండు. మనువునుఁ గనిన వెంటనే స్వరోచి పుణ్యలోకమునకుఁ బోయినట్లు రావుగారు వ్రాసిరే, దీని కాధార మేది ? మనువు కడుపులోఁ బడినవెంటనే పెద్దన స్వరోచి కాసీమాంతమును జెప్పెను. మనువు పుట్టినతరువాతఁ గూడ స్వరోచి జీవించి యుండి తనస్త్రీలంపటత్వమును యథాప్రకారముగా సాగించినట్లు పురాణము చెప్పుచుండె. ఇఁక మనువు పుట్టినవెంటనే తొల్ప్రక్రముచేసి స్వరోచిని బుణ్యలో కములోనికి నెగఁ ద్రోసినవా రెవరు ? శ్రీరావుగారే మాట దక్కించుకొని యుండ వలెను. ప్రక్కేల, పెద్దన వ్రాఁతలును శ్రీరావుగారు వ్రాసినదియును గూడ స్వరోచి పాత్రమును సందిగ్ధస్థితిలోఁ బెట్టినవి. ఔచిత్యము పాడుచేయఁబడినది.

—: మనోరమాశీలముంగూర్చి :—

పెద్దన మనోరమావివాహఘట్టములోఁ బెద్ద మార్పును బెట్టెను. అది మనోరమాసౌశీల్యానలఁ బాడుచేయుచున్నది. ఈసంగతిని రావుగారును నెఱుం గుదురు. ఐనను నావ్రాసినదాని నెట్లయినఁ గాదనవలెనను పట్టుతో నసంగతపు వ్రాఁతలఁ బెక్కింటిని వ్రాసి నిర్మలమైన పురాణస్థకథపై మోసపువ్రాఁత లనెడు మసి

పూసిరి. కల్మషయుతము లగుపెద్దనవాక్కులపై సౌమ్యోక్తు లను వెల్లవేసియు సత్య మును గప్పిపెట్టుచు వచ్చిరి. సత్యమైన విమర్శకుఁడు చేయు పని యిదియా ? వీరిగమనికను నీక్రిందఁజూపుచున్నాఁడను. చదువరులు శ్రద్ధతోఁ జిత్తగింతురుగాక. మొదుగా మాఱ్పులనుగూర్చి ముచ్చటించెదను.

తండ్రి మనోరమను స్వరోచి కిచ్చి వివాహము చేయుదు నని చెప్పఁగా దాని కామె సంతోషపూర్వకముగ నంగీకరించి తననెచ్చెలులు తన నిమిత్తమయి రోగముల పాలై బాధపడుచున్నారు కాన వారిరోగముల మొదు మాన్పి తరు వాతఁ బెండ్లి కావింపుఁ డని తండ్రినిఁ గోరినది. ఇది ప్రౌఢముగా లే దని యెంచి పెద్దన్న పెద్ద మాఱ్పును బెట్టెను. మనోరమ తనసఖుల రుజలను మాన్పు మని తండ్రిని గాక కాఁబోవు పతిని గోరునట్లును బెండ్లికిఁ బూర్వమునందుఁ గాక పర మున గర్భాధానపుగదిలో నాథుఁడు చుంబనాలింగనాదుల నెల్లఁ గావించి యింక సురతక్రీడ నొనరింప వలె నని యుత్సాహపడుచుండఁగా నాసమయమున దనకోర్కైను దీర్పు మని కోరుటకు మంచి తఱి యనుచు నెంచి ముందుగా నేడ్చి నాథుఁడు విరక్తిఁ జెంది యిదియేమి యని యడుగుచుండఁ దననెచ్చెలుల రోగము ల ముందు నివారింపకున్నఁ దనకు సుఖము లే దని కంఠోక్తిగాఁ జెప్పివేసి నాథుని నిరుత్సాహపఱిచి వెంటనే శోభనపుగదినుండి ఘోరకాననములోనికి నోషధుల నిమిత్తమై తీసికొనిపోయినట్లు పెద్దన వ్రాసెను. ఇది యెంత యనుచితపుమాఱ్పో వేఱుగఁ జెప్పవలయునా ? పెండ్లికి ముందుఁ గోరినకోరికను బదుకగదిలో సురత సమయమునఁ గోరునట్లుచేసిన, ప్రాజ్ఞులు నవ్వుదు రని యెంచి సత్యమును వ్రాయు టకు సిగ్గుపడి "వివాహమునకుఁ బూర్వమున నున్నదానిని వివాహానంతరమున గర్భాధానపుగదియొద్దకు మార్చె"నని రావుగారు వ్రాసిరి ? కాని మైథునసమయ మునకు మార్చె నని సాహసించి వ్రాయలేక పోయిరి. పెద్దన వ్రాసినదాని నున్న దున్నట్లు లిఖించుటకు రావుగారే లజ్జించుచున్నపు డావ్రాఁత యెంత హేయ మై యుండునో వేఱుగఁ జెప్పవలయునా ?

మఱియును రావుగారు మూలమును బెద్దన్న దిద్ది వేయుటకుఁ గల కారణ ముల నీక్రిందిరీతిని దెలిపిరి. మనోరమ పెండ్లికిఁ బూర్వమందుఁ గన్య కావునను గన్య భర్తయింకను గానివానితో ననఁగాఁ బరునితోడ ముచ్చటించుటకు సిగ్గుప డును గావునను వివాహానంతరమున నన్ననో యామె స్వరోచికి భార్యయే యగును గావునను బెండ్లి కనంతరమున నాథునితోఁ బ్రశంసించినట్లు దిద్దె

నని తేల్చిరి. ఇదియు హాస్యాస్పదమే? యేమన, మనోరమ తనకాఁబోవుభర్తతో ముచ్చటింప లేదనియుఁ దండ్రితో ముచ్చటించిన దనియు నిదివఱకే వ్రాసినాను. అది గాక యాయుర్వేదవిద్యానిపుణుఁ డగు నిజజనకుఁడు తన యెదుట నుండఁగా ముచ్చటించుటకైన సిగ్గుపడఁదగు కాఁబోవునాథునితోఁ బ్రసంగింపనేల? గర్భాధానసమయము వచ్చినపిమ్మట గదిలోఁ జేరువఱకు నిలిచి యటుపిమ్మట సురతసమయ మెప్పుడువచ్చు నని వేచి యుండియుండి యాపైఁ జెప్పనేల? ప్రాణసఖుల బాధలంగూర్చి యాప్తులతోఁ జెప్ప మనోరమ యాతురపడు చున్నది గదా? యట్టిది తనతండ్రితో ముచ్చటించుటయే యుచితముగదా?

“ఇది దాంపత్యధర్మనర్మమర్మసమస్యగాన నాథునితోఁ జెప్పఁదగినది గాని తండ్రితోఁ జెప్పఁదగినది కా దని రావుగారు వ్రాసిరి. ఇది వింతలలోఁ బెద్దవింత. ఇచట “ఇది” యననేమి? తన నెచ్చెలులను రోగవిముక్తలుఁగఁ జేయు మని కోరుట కదా? ఇదియే కదా మార్పఁబడిన దని రావుగారు మొదటనే తెల్పిరి. నాసఖుల రుగ్ణతలను మాన్పు మని కోరుట దాంపత్యధర్మనర్మమర్మసమస్య యె ట్లగును? దాంపత్యధర్మనర్మమర్మసమస్య యన నర్థమేమి? దీనిభావమేమితిరుమలేశ యనవలసివచ్చు చున్నది. ఇది యభావకవిత్వము కాఁబోలును? పూర్వాపరసందర్భముల నన్నింటిని బరిశీలించి చూడ వీరి విచిత్రవాగ్వల్లి సురతక్రీడను సూచించునదిగ నున్నట్లు తోఁచుచున్నది. పెద్దన దీనిని గర్భాధానపుగదిలోఁ బెట్టుటచేతనో యందులో సరిగ సురతసమయమున నతుకుటచేతనో దీనిని మైథునవిషయముగా రావుగారు భ్రమపడినట్లు తోఁచుచున్నది. కావుననే దాంపత్యసంబంధ మగు నర్మమర్మసమస్య యనిరి. ప్రణయసుకుమారవిషయ మని నుడివిరి. తండ్రియెదుటనుండఁగా ముచ్చటింపరా దనిరి. కాన పైభావము చెప్పకున్న రావుగారివాగ్వల్లి రసహీన మైపోవును. పోనిండు? రావుగారు తలఁచినట్లుగా నిది దంపతుల మర్మనర్మకర్మసమస్య యని యెంచుదము. అయినను బెద్దనార్యునిపాత్రము లగుకన్యలు కాఁబోవునాథులకడ నీమర్మనర్మకర్మసమస్యను గూర్చి ముచ్చటించుటకు సిగ్గుపడువారు కారు. అదెట్లన-మనోరమాసఖియే యగుకళావతి కాఁబోవునాథుఁ డగుస్వరోచితోడనే పైసమయముననే యెట్లుపలికినదో కనుఁడు.

“గీ. చెయ్యిపట్టిన మాత్రాన శిరసు వంచి, యవశచందావఁ బైవ్రాలు నవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు, తెరలుకోర్కులఁ గందర్పకేళిఁదేలె.”

"క. తప మంతయుఁ బోలివోవఁగ, నపు డన్నియు నుజ్జగించి యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా,విపులైశ్వర్యంబు లనుభవించుచు నుండెన్."

పై పద్యములలో రావుగారు చెప్పినదాంపత్యసంబంధ మగు మర్మసర్మకర్మమే నుడువఁబడియున్నది. ముచ్చటించినయది కన్యయే! నలువురిలోనే ముచ్చటించినది. ఈరీతిగాఁ గన్యలచేఁ గాఁబోవునాథులకడ ముచ్చటింపించిన పెద్దనార్యుఁడు మనోరమచేత నారీతిగాఁ బలికించుటకు మాత్రము వెనుదీయునా ? ఎంతమాత్రమును వెనుదీయఁడు. కావున వివాహమునకుఁ బూర్వమం దున్న దానిని బరమున గర్భాధానపుగదిలో సురతసమయమునకు మార్చుటకుఁ గలకారణము వేఱై యుండ వలయును.

వేశ్యలు శృంగారశాస్త్రప్రవీణ లయి యుందు రనియు లోకజ్ఞానయుత లయి యుందు రనియుఁ గాన వారిచేష్టలు చాలఁ బ్రౌఢము లయి నాగరకతను వెల్లడించు ననియు నమ్మకము పెద్దనకుఁ గలదు. అట్టి వెలయాండ్రు విటులవలనఁ దమకోరికలను దీర్పించుకొనవలసి వచ్చునప్పుడు సురతసమయమునే తగినతఱిగఁ దీసికొందురు. కోరిక తీరువఱకు సురతము నరికట్టుదురు. ఆకామోద్రేక సమయమున విటకత్తె కోరినకోర్కుల విటులు తీర్చితీరుదురు. ఆజిత్తులమారితనమునే కులకాంతయగు మనోరమయందును బెద్దన పెట్టె. అది ప్రౌఢతకు దెల్పు నని మనకవి తలంపు. వేశ్యయింటికి విటుఁడు చేరుటకుఁ గారణము ధర్మాచరణార్థము కాదు. వంశాభివృద్ధి చేసికొనుటకును గాదు. నీచేంద్రియవాంఛను దీర్చుకొనుటకై యచటికిఁ జేరును. కాఁబట్టి యాపనికి వేశ్య లాతంకము కలిగించినఁ గార్యసాధన మగుచుండును. సతీపతుల విషయములో నీయెత్తు లవసరము లేదు. దాంపత్య మను నది ధర్మబద్ధమై యన్యోన్యానురాగసంకలితమై విరాజిల్లుచుండును. అనుకూలుఁ డగుపతి ప్రాణప్రియ యగుసహధర్మచారిణి కోరినకోర్కుల నెప్పుడు కోరినను దీర్చి తీరును. ప్రాణనాథుఁడు సంభోగము నరికట్టినంగాని తనకోరికను సాగింపఁ డని సతి తలంచుట యనఁగా నాథుని నీచునిగా నెంచుటయే యగును. అట్టి యెత్తుల నెత్తు డుపడఁతి పడపుపడఁతియెత్తులవంటియెత్తులు కలది కాదా? మనోరమకుఁ గవిచేఁ గలిగింపఁబడిన యీమాయోపాయములు వేశ్యలమాయలను బోలియుండలేదా? ఇది మనోరమాసౌశీల్యమును బాడుచేయుటలేదా ? తప్పక పాడుచేయుచున్నది.

పురాణస్థ మనోరమ వివాహమునకు "షరతు" పెట్టిన దని యుఁ బెద్దనగారి మనోరమ యట్టి 'షరతు' పెట్టలే దనియు రావుగారు తెల్చిరి. ఇది యసత్య

పుప్రాఁత. పురాణస్థమనోరమ 'షరతు'ల వేనిని బెట్టలేదు. షరతులేకుండ వివాహము నంగీకరించి చేసికొనినది. సురతమునకు 'షరతుఁ'బెట్టినది పెద్దనగారి మనోరమ. ఆ'షరతు' తీరువఱకు నాథుఁ డాసక్తితో నుద్యమించిన సురతమునకు నవకాశ మీయలేదు. కాన ననుచితమైన 'షరతు'పెట్టి యదితీరువఱకుఁ దుచ్ఛమగు పట్టు పట్టినది పెద్దనగారి మనోరమ. సత్యముఁ గప్పిపెట్ట రావుగారు ప్రయత్నించుచున్నారు. క్రుళ్లుదాఁచిన దాగునా ? మఱింత రసాభాసము తెచ్చిపెట్టును.

నవదంపతు లేకశయ్యాగతులయి యొకరితో నొకరు ముచ్చటించుకొనుట వెలయాలివర్తనమును దెల్పు నని నేను వ్రాసినట్లు రావుగారు లిఖించిరి! ఇది మోసపుప్రాఁత. నే న ట్లెచ్చటను వ్రాసియుండ లేదు. నవదంపతు లేకశయ్యాగతులై యిష్టగోష్ఠి సలుపుట తప్పు కాదు. అట్టిసమయములోఁ బ్రాణనాథుని కోరికను దీర్చి సంతృప్తునిఁ జేసి యటుపిమ్మట నాతనితో నిష్టగోష్ఠి నడిపి యాసమయమున మనోరమ తనసఖుల యవస్థను జెప్పి వారిబాధల దొలఁగింపు మనినఁ బ్రాణప్రియుఁ డగుపతి యట్లు సేయకుండునా ? పెద్దన యట్లు వ్రాయలేదు. నాథుఁడు చేయు బాహ్యరతుల నన్నింటిని సహనముతో నంగీకరించి యాస హెచ్చించి నాథుని సంభోగేచ్ఛను మిన్నుముట్టించి యటుపిమ్మట నొక్కుమ్మడిగా ననాధ్యపు 'షరతు' పెట్టి కార్యవిఘాతము చేయుట యేటినీతి? సిద్ధమైన సంభోగమునకు భంగము కలిగించి పతిని ఘోరారణ్యములకు లాగుటేల ? ఏడ్పులేల ? కులసతులతోడి పొత్తు నిట్లు హాస్యాస్పదము చేయనేల ? పెద్దన యిప్పట్టునఁ దప్పక తప్పుచేసెను. ఇవి సిగ్గులచేటు కాదా ? మనోరమ వేశ్యజిత్తుల వంటి జిత్తులు కలదైనదని నేను వ్రాసియుండఁగా అంకులాఁడితనము కలదైన దని నేను వ్రాసినట్లు రావుగారు లోకమునకుఁ దెలిపిరి. అట్లు చేయవచ్చునా! వేశ్యల అంకు మాట నే నెత్తలేదే. రంభవంటి భార్యకలవాఁడ వనిన అంకులాఁడి యగు భార్య కలవాఁడవని యర్థమా! కులధర్మపత్నీ ధర్మములు చెప్పుచు మనవారు "శయనేషు వేశ్యా" అని వ్రాసిరి. వేశ్యవలె అంకులాఁడితనము గలది కులధర్మపత్ని యని యర్థమా! రావుగారు నావాక్యములకు నపార్థకల్పనముల నె ట్లయినఁ జేసి నన్నుఁ హాస్యాస్పదుని జేయవలయు నని యక్రమప్రయత్నములు చాలఁ జేసిరి. ఇది సద్విమర్శకలక్షణము కాదు. జిత్తులమారితనమును గూర్చి నేను ముచ్చటించితినే కాని అంకులాఁడితనమును గూర్చి కాదు. అది పెద్దన గారి మనోరమయందు నే నేను

—: రావుగారి విచిత్ర సాహసము :—

సుఖ మన సురతసౌఖ్యమే యని నే నెచ్చటను వ్రాయకపోయినను నే నాకీతిని వ్రాసినట్లు రావుగారు లోకమునకుఁ దెలిపిరి. ఇది వట్టి మోసపువ్రాఁత. సౌఖ్య మన సురతసౌఖ్యమే యనునట్టి భావము తేల్చినవాఁడు పెద్దనార్యుఁడు కాని నేను గాదు. దాంపత్యసౌఖ్యముతో చుంబనాలింగనాదికముల మనోరమచేఁ జల్లఁగ ననుభవింపఁ జేసి తుదకు సురతసౌఖ్య మనుభవించు తఱి వచ్చినప్పుడు మాత్రము నేనెట్లు సౌఖ్య మనుభవింతు" నని యామెచేఁ బెద్దనఁ బలికించె. కాన సురతసౌఖ్యమే సౌఖ్యమా? యని నేను బ్రశ్నించితిని. యీ ప్రశ్న నే సురతసౌఖ్యమే సౌఖ్య మనుటను గా రావుగారు తేల్చిరి. మఱియు రావుగా రింకను నొక వింతను గావించిరి. వివాహ మనునది సురతసౌఖ్యమునకొఱకే యని నేను బోధించినట్లు చదువరులకుఁ దోఁపఁజేయ నెంచి "ప్రపంచములో స్త్రీలును పురుషులును బరస్పరము వివాహమాడుట" యను తమవాక్యములకు "గూఢేంద్రియసుఖము" అనెడు నామాటలను జేర్చి ప్రపంచములో స్త్రీలును బురుషులును బరస్పరము వివాహ మాడుట గూఢేంద్రియసుఖము కొఱకేనా యను నేకవాక్యముఁ జేసి యీస్వకల్పితవాక్యాంతమున ఇది శ్రీ శాస్త్రిగారి వాక్యమే. అని యర్ధచంద్రరేఖలలోఁ బెట్టి తమప్రతివాది నగునేను వివాహము గూఢేంద్రియసుఖముకొఱకే యేర్పడిన దని బోధించినట్లు తేల్చిరి. రావుగా రీయర్థమును దేల్చుటకు నెన్నిపాట్లు పడినను దుదకు వివాహము గూఢేంద్రియసుఖముకొఱకా? యని నేను శంకించినట్లు తేలుచున్నది కాని యందుకొఱకే యని సిద్ధాంతము చేసినట్లు తేలుట లేదు. అయినను, కొఱకా? యనఁ, గొఱకే యని భావమువచ్చు నను విపరీతవాదమును రావుగారుగలిగించిరి. శ్రీరావుగారి కీతర్క మెక్కడనుండి లభించినదో! శ్రీనాథుని రాజమహేంద్రవరధర్మాసనపండితులనుండి లభించినదేమో! పెక్కేల రావుగారివంటి పెద్దలిట్టిమాయోపాయములను బన్నుట తగదు. మొత్తముమీఁద రావుగారును బెద్దనార్యుఁడును, తేవప్పెరుమాళ్లయ్యగారును గలసి మనోరమాసౌశీల్యమును బూర్తిగఁ బాడుచేసిరి. "ఈప్రణయసుకుమారవిషయమును నేను రసికత యెఱుంగని మానిసివలెఁ గర్కశకషణభాషణముల విమర్శించితి నని నన్ను రావుగా రాక్షేపించిరి. నేను రావుగారు మెచ్చుకొనుచున్న రసికత లేని మానిసి నయిన మాట నిజము. ఈప్రణయసుకుమారవిషయమున నేతప్పు లుండవచ్చును గాఁబోలు! పాషాణకఠినహృదయముతో "షరతు"లు పెట్టి యుత్సాహభంగమును జేయవచ్చును

గాఁబోలు! దాని కేమి తేవప్పెరుమాళ్లయ్యగారు లోనగు మనీషులు పెద్దనగారి విరసపు వ్రాఁతలను సరసము లని మెచ్చుకొని దోషముల గుణములఁ జేయుటచేతి నింతచర్చ కావింపవలసివచ్చినది. ప్రియుఁడు ప్రియురాలి మృదుదేహముపై నఖ క్షతముల నొనరించిన మాసోదరిని బాధించుచున్నాఁడను సోదరులు లోకములో లేకపోలేదు. శ్రీరావుగారు పెద్దనార్యునిగ్రంథవిషయములో సోదరప్రేమ కలవారు కాన జాలిపడుచున్నారు.

—: రసము, నీతి :—

ఇంక రసమును గూర్చియు నీతిని గూర్చియు ముచ్చటించు కొందము. ఈరెండిటిని రెండుశీర్షికల క్రిందఁ దీసికొని విషయచర్చ కావింపవలసినది. అయినను శ్రీరావుగారీరెండిటిని గలిపి యొక శీర్షిక క్రిందనే చేర్చి చర్చించిరి కాన నేనును నట్లే కావించుచున్నాను.

రసప్రశంస :—శ్రీరావుగారు రసవిషయమై చక్కని చర్చను దేనిని గావించియుండ లేదు. కాని మనుచరిత్రములో వరూథినీప్రవరుల యుపాఖ్యానములు తప్పఁ దక్కిన దంతయు రసోత్సేకము లేని వట్టివల్లీబంధ మని వ్రాసిరి. దీనిచే మనుచరిత్రములోఁ జాలభాగము రసహీనముగా నున్న దని తేలుచున్నయది. ప్రవర వరూథినుల చరిత్రముల తరువాత నున్నయది చాలవఱకును మనోరమావృత్తాంతము. ఇందుఁ జాల రసభంగము కావింపఁబడియున్న దని యిదివఱకే వ్రాసితిని. ఈభాగమును రావుగారును వట్టివల్లీబంధ మనిరి. ఇంక రావుగారు మెచ్చుకొనిన వరూథినీప్రవరుల చరిత్రములు కూడఁ జాల విరసములుగానే యున్నయవి. అది శ్రీరావుగారు తిన్నగఁ గనిపెట్టలేదు. ప్రవరవరూథినుల కథలోఁ బ్రవరుఁడు ప్రథమనాయకుఁ డని రావుగారే వ్రాసిరి. కాని యీకథానాయకుని మన పెద్దన స్వకార్యార్థమై యవిదగ్ధునిఁ జేసివేసెనుగదా! అవిదగ్ధుఁడు కథానాయకుఁ డగుచో నచట రసము వెలయ దని శాస్త్రములు ఘోషించుచున్నవి. రావుగారి పెరుమాళ్ళయ్యగారును నీయరసికుని నెంత పిండినను రస మూర దని తెలిపిరి. శ్రీ. వె. రా. రావుగారును నట్లే నుడివిరి. దీనిం బట్టి పెద్దనార్యుని ప్రవరుఁడు లోకదృష్టిలోఁ గూడ నరసికుఁడే యై పోయినాఁడు. శ్రీరావుగారు కన్నెత్తి శ్రద్ధతో, మనుచరిత్రమును దిన్నఁగఁ జూచుకొనిన నీసత్యము గ్రహించుకొనవచ్చును. అప్పుడు ప్రవరుని కథ రసహీనము చేయఁబడిన సంగతి బోధలోనికి వచ్చును. ఇఁక నీసందర్భములో నాయిక వరూథిని. ఈమె ఘూఁతపసిండివంటి

వలపుం బచరించు పచ్చివేశ్య. ద్వితీయనాయకుఁడు గంధర్వుఁడు. ఈతఁడు, పరమనీచుఁడు. వీనిపై రెత్తిరఁ బాపము వచ్చు నని రావుగారే వ్రాసిరి. వీనికిఁ గామినీ సంభోగవిషయములో దేహముల సంఘర్షణ ముండినఁ జాలును. మనస్సులు కలియ నక్కఱలేదు. నాయిక పై నుదాహరింపఁబడిన వేశ్యాంగనయే. ఈమెకు గంధర్వునియందు మోహము లేదు. ఉభయుల కూడికకు మోసమే కారణము. ఆమెకుఁ దనయందు రతిలే దనియుఁ బైఁగా రోఁత కల దనియు నామెకు సత్యము తెలిసిన హాని కలుగు ననియు గంధర్వుఁడు పూర్తిగ నెఱుంగును. కావుననే యామెచేఁ గన్నులు మూయించినాఁడు. ఆతఁడు ప్రవరవేషమున నున్నాఁడు. కాన నాతనియందు వరూథినికిఁ బ్రేమ కల దని రావుగారు వ్రాసిరి. అది తప్పు. ప్రవరవేషమూలముగ నామె మోసపోయి కన్నులు మూసికొని వానిని గూడిన దనఁగా వానియందు నామెకుఁ బ్రేమలే దనియే భావము. ప్రవరవేషము పై నామెకు నింపు కలదు గాని యావేషమును దాల్చినవానియందుఁ బ్రేమ యించుకయు లేదు గదా? ఇఁక నీకూడిక మనస్సులు కలిసిన కూడిక యెట్లుకాఁగలదు? ఆకుసుమాస్త్రశకటములు రెండు సంఘర్షణము కలవి యగుట యెట్టిదియో నీదేహముల సంఘర్షణమును నట్టిదియే, కావున, నిచ్చట పశుశృంగారమే కలదు కాని వినిర్మలశృంగారరసము లేదు. మూఁడవనాయకుఁడు స్వరోచి. ఈతఁడు బహునాయికలు కలవాఁడు. కామాంధుఁడు. పశుగమనమునకుఁగూడ సిద్ధపడినవాఁడు. నాయిక మనోరమ. ఈమె కులకాంత, యోగ్యురాలు, కాని, పెద్దనచే నీమెసౌశీల్యము కూడఁ బాడుచేయబడినయది. అంతియే గాక యీమె సఖులమూలముగా దుఃఖార్త చేయఁబడినది. నాథుఁడు కూడుటకు వచ్చినప్పుడు నా కెక్కడి సౌఖ్య మనినది. అందుపై నుభయుల దగు నుత్సాహమునకును సున్నయే చుట్టఁబడినయది. ఈదంపతుల తరువాతి శృంగారముంగూర్చిన ప్రసంగమే లేదు. ఈ వైరస్యము పెద్దనగ్రంథములో బయలువెడలినది. రసము చెడినది. అది గాక మనోరమ ప్రధాననాయికయే కాదు. ప్రధాననాయిక యీప్రబంధములో వనదేవత. ఆమె స్వరోచిభార్యయే కాదు. నాలుగవనాయకుఁడు స్వారోచిషుఁడు. ఈతఁడు శృంగారనాయకుఁడే కాఁడు. ఈతనికి నాయిక లేదు, కాన నీతనియెడ శృంగారరసస్ఫురణమునకు నవకాశమే లేదు. పెక్కేల సత్యానురాగము గలయుత్తమదంపతుల వినిర్మలానురాగము మనుచరిత్రములో నెచ్చటను వర్ణింపఁబడి యుండలేదు. కావుననే యీకావ్యము పశుశృంగారదూషిత మని పెక్కురు వ్రాసియున్నారు.

నికృష్టశృంగారము (పశుశృంగారము) అన నేమి? మనరావుగారు మనుచరిత్రలో నికృష్టశృంగారము కలదనిన వింతపడి యదియెట్టి దనుచున్నారు. అట్లు వ్రాసినందులకయి నన్నుఁ దిట్టి పోయుచున్నారు. కావున ముందుగ నీచశృంగార మనిన రావుగారికి బోధపడునట్లు చేయవలసియున్నది. వీరు విజయనగరసామ్రాజ్యమందలి యాంధ్రకవులచరిత్రములు వ్రాసి యచ్చొత్తించి ప్రకటించియున్నారు. అందులో శ్రీకృష్ణదేవరాయని యాముక్తమాల్యద యనుప్రబంధరాజము "జఘన్యశృంగారదూషిత"మని స్వహస్తములతోఁ వ్రాసిరి. వల్లభరాయని క్రీడాభిరామములోని శృంగారము "నీచశృంగార"మనిరి. జక్కయకవిదగు విక్రమార్కచరిత్రములోని శృంగారము "విశృంఖలశృంగార"మనిరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కావ్యద్వయమును (శృంగారశాకుంతలమును జైమినిభారతమును) "శృంగారవర్ణనము లతిమాత్రముగాఁ గలిగియున్న"వనిరి. ఈవిధముగ నాంధ్రభాషోద్ధరణమొనరించిన మహనీయు లగు కృష్ణదేవరాయాదుల ప్రబంధరాజములు నికృష్టశృంగారదూషితములే యని తాము వ్రాసినప్పుడు నికృష్టశృంగార మనిన నేమి యర్థమును దాము చేసికొనిరో యాయర్థమునే మనుచరిత్రవిషయమునఁగూడఁ జేసికొనవలె నని శ్రీరావుగారికి వినయపూర్వకముగా విన్నవించుచున్నాఁడను.

కృష్ణదేవరాయప్రబంధాదులందుఁ గలనికృష్టశృంగారముకంటెను, పెద్దనార్యునిగ్రంథమునందలి పశుశృంగారము హెచ్చుగు నికృష్టత గలిగియున్నది. ఆయంశము దెల్పుటకుఁ బూర్వము మనరావుగారు పశుశృంగార మన నెట్టి నిర్వచనము నిచ్చిరో యది కనుఁగొందము.

రావుగా రిచ్చిన పశుశృంగారలక్షణము:—"పశుకామము అనఁగా వావివరుసలు లేనిదియు శాస్త్రదూష్య మైనదియు నగుశృంగారరస మని నిర్వచింపవచ్చును. అనఁగా గురుదారాభిగమనమును, మునిపత్నీవాంఛనమును, పరకాంతాసంభోగమును, వేశ్యాంగనాసంక్రీడనమును, బలాద్వశీకృతకన్యాదూషణము నిత్యాదులు పశుకామ మనియు నికృష్టశృంగార మనియుఁ దలంపవచ్చును. అట్టివేవైనను నీగ్రంథమున నున్న వేమో చూడుఁడు."

రావుగా రిచ్చిన పైపట్టికలోని దోషము లేవియు మనుచరిత్రములో లేవని రావుగా రెట్లు సాహసించి వ్రాయఁ గలిగిరో తెలియవచ్చుట లేదు. పైపట్టికలో "వేశ్యాసంక్రీడన" మను దోషము కలదుకదా! అది మనుచరిత్రములో లేదా? వరూథిని వేశ్యకాదా? ఆమెవేశ్య యని శ్రీరావుగారే వ్రాసిరి. "వేశ్యానాయిక"

యనియు ను, వరూథినీసఖులం గూర్చి ముచ్చటించుచు, "ఆమాట లాడినస్త్రీలు భోగస్త్రీ" లనియు నున్న వాక్యములను జనువరులు చూచుకొనందగును. మఱి యును నీవేశ్యలు "పూఁతపసిండివంటి వలపుం బచరించుకులంబు" లోనివా రని పెద్దనార్యుఁడే లిఖియించెను. లేనివలపుం జూపు వెలయాం డ్రని దీనివలన బోధ పడుచున్నయది. మనుచరిత్రములోఁగల వరూథినీనామక పణ్యాంగనయొక్క క్రీడన ములు మాత్రమేకాక సంక్రీడనములు గూడ నతివిపులముగా వర్ణింపఁబడియున్నవి. ఉపరతులు, కన్నెఱికపురతులు, గర్భిణీరతులు మున్నగు నవియును నిందుఁ గలవు. మనరావుగారు మనుచరిత్రములో వరూథినీచరిత్రమే ప్రధాన మని కదా వ్రాసిరి. ఇఁక దీనిని బహుశృంగారప్రధాన మనుట కభ్యంతర మే మున్నది ? వేశ్యాసంభో గము శాస్త్రదూష్య మని వేఱుగఁ జెప్పవలసియుండునా ?

పారుఁడను బ్రహ్మర్షి ని పుంజికస్థల యను వేశ్య తనశృంగారచేష్టలచే మోహి తునిజేసి యాతనితో సురతక్రీడను సలిపిన పచ్చిశృంగార మిందు కన్యకచే వివ రముగా వర్ణింపఁబడియున్నది. కావున నిందు వేశ్యాసంక్రీడన మున్న దనుటకు సందియమేమి ? మఱియు నిందు నుత్తమదంపతుల శృంగారసంక్రీడనము పాడు చేయఁబడికూడ నున్నది. "ఇత్యాదు" లని రావుగారు వ్రాయుటచే వారు వ్రాసిన వానితోఁ దుల్యము లగు వానినిగూడఁ దీసికొనవచ్చును.

ఇంక బలాత్కారసంభోగ మిందున్నదో లేదో చూతము. అదియును నిందుఁ గలదు. కలిగాఁడు తనయందు వలపులేని వరూథినిని మోసపుచ్చి యామెయి ష్టమునకు వ్యతిరేకముగా నామెతో భోగించెను. ఇది తప్పని వాఁడెఱుంగును. కావున వాఁడు కావించినసంభోగము బలాత్కారసంభోగమే యగుచున్నది. ఈయం శమును నేను దేల్చినట్లు చదువరులు భావించుకొనఁదగినది కాదు. మన రావుగారి పెన్నేటి రామచంద్రరావుపంతులు, బి. యే., బి. యల్., గారే గంధర్వుఁడు కావించినది బలాత్కారసంభోగము (Rape) అనియు శిక్షాస్మృతినిఁబట్టి శిక్ష కర్హ మైన దనియు వ్రాసిరి. కాన నిది బలాత్కారసంభోగ మనుటకు సందియములేదు. ఇంకను నిందుఁ బరమయోగ్యుఁడును విరాగియుఁ బావనమూర్తియు నగు ప్రవరా ఖ్యుఁడు వల దని వారించు చున్నను బరమపాపకృత్య మని ఘోషించుచున్నను రతిసంరంభము మీఱ వరూథిని బలవంతముగా నాతనిపైఁ బడి కౌఁగిలించుకొని యధరం బాసించినట్లు వర్ణింపఁబడి యున్నది. ఇది బలాత్కారసంభోగము కాదా ? చుంబనాలింగనాదికములు బాహ్యరతులై సురతక్రీడకు నంగములే యై యున్నవి

కదా ? మునిపత్నీవాంఛన మెట్టిదియో ప్రవరాది మునివరులను గూర్చిన వాంఛనమును నట్టిదియే. అందులోను బలాత్కారపూర్వకమైనది కూడ నై యున్నది. అదిగాక పశువు వచ్చి నన్నాలింగనము చేసికొను మనఁగాఁ గథానాయకులలో నొక్కఁడగు స్వరోచి మోహముతోఁ గౌఁగిలించుకొనినట్లు వర్ణింపఁబడియున్నది. కావున నీగ్రంథము పశుశృంగారప్రధానము గాక మ తే మగును ? పినవీరభద్రుని ప్రబంధములలో శృంగార మతిమాత్రముగా నున్నదియని రావుగా రాక్షేపించిరి. ఆగ్రంథములం దున్న శృంగారము మనుచరిత్రమునందలి శృంగారవర్ణనములవలె మించిపో లేదు. కావున నేవిధమునఁ జూచినను మనుచరిత్రము హెచ్చుగు పశు శృంగారముచే దూషితమై యున్న దని సచ్చరితు లెల్ల నెఱుంగుదురు.

ఈతని శృంగారవర్ణనములు నీతికి హానిని గలిగించునవిగా నున్న వని కూడ మనము తెలిసికొని యున్నాము. రావుగారు కూడ నీయంశమును గొంచెముగనో గొప్పగనో యీక్రిందిరీతి నంగీకరించియున్నారు.

“ఇట్లు చెప్పుటచేఁ బెద్దనార్యుని శృంగారరసవర్ణన మంతయుఁ బ్రశంసనీయ మనియు నీతిబోధక మనియు నాయభిప్రాయము కాదు.”

ఇట్లంగీకరించిన రావుగారు మనుచరిత్రమునందలి శృంగారమును మరల నతిమాత్రముగా స్తుతించుట యెందులకో తెలియవచ్చుట లేదు. పైకేల ? మనుచరిత్ర మంతయుఁ బచ్చిశృంగారముతో నింపివేయఁబడినది. ఆముక్తమాల్యదాదులందలి శృంగార మింతహీనస్థితిలో నున్న దని చెప్పుకొన నవసరము లేదు. శ్రీరావుగా రిచ్చినపశుశృంగారలక్షణములు మనుచరిత్రమునం దున్నంత విపులముగా నాముక్తమాల్యదాదులందు లేవు. రాయలకాలమునఁ బుట్టిన పారిజాతాపహరణాదు లన్యోన్యానురాగము గల యుత్తమదంపతుల నిష్కళంకశృంగారములంగూర్చినవి. హరణాదు లన్యోన్యానురాగము గల యుత్తమదంపతుల నిష్కళంకశృంగారముంగూర్చినవి. పెద్దనార్యుని మనుచరిత్రము శృంగారరసప్రధాన మనునది లోకవిదితము. తుద కారసమే బహువిధములఁ బాడుచేయఁబడియున్నది.

మన శ్రీరావుగారు పెద్దనార్యునం దస్మదాదులకుఁ గ్రూరభావము కల దని భావించి యీక్రిందిరీతిని లిఖించిరి.

“ఆకవీశ్వరుని గుణదోషములను దేశకాలపాత్రములను బట్టి న్యాయపరిశీలనము గావించి సప్రమాణముగ నిరూపించి దాక్షిణ్యబుద్ధిని తీర్మానము గావింపవలసిన దనియే నా వేఁడికోలు.”

విమర్శకుఁ డెప్పుడును దాక్షిణ్యము గాని క్రౌర్యము గాని పూని విమర్శనము చేయరాదు. ఏపక్షమును బూనని నిర్మలాభిప్రాయముతో సారస్వతాభివృద్ధిని గోరి విమర్శనము గావింపవలయును. పూర్వకావ్యములందలి దోషముల నెత్తి చూపుట యాకవులకొఱకుఁ గానే కాదు. ఆకావ్యములం జదువుకొనువారికొఱకు. కావున రావుగారు వ్రాసినవ్రాఁత మంచివిమర్శనపద్ధతిలో నుండఁదగినది కాదు. పెద్దనార్యునందు రావుగారి కున్నంత భక్తి యస్మదాదులకునుగలదు. అంతకంటెహెచ్చుగాఁ గూడఁ గలదని చెప్పవచ్చును.

పెద్దనార్యుని జఘన్యశృంగారరసప్రచారములఁ గాపాడ నెంచి ముందుగా శృంగారరసమును గూర్చి యొకయద్భుతోపన్యాసమును రావుగారు లిఖయించిరి. తప్పు నొప్పుగాఁ జేయుతలంపు కలిగినప్పుడెల్ల వీ రీవిచిత్రోపన్యాసములఁ గొట్టుట వాడుకయై యున్న దని యిదివఱకే వ్రాసితిని. ఆధోరణిని బట్టి ప్రపంచములోని వాఙ్మయము లన్నియు శృంగారరసమే ప్రధానరసముగా నున్న వనియు దేశభేదములను బట్టి శృంగారరసవిషయములో రుచిభేదము లున్నవనియు వ్రాయ మొదలుపెట్టిరి. ఇది యంతయు సత్యమే, కాని యీయుపన్యాస మిచట నేల యతుకవలసివచ్చెనో తెలియుటలేదు. ఇది పెద్దనార్యుఁడు కావించిన కచకుచాదిశృంగారవర్ణనముల సమర్థించుటకుఁ గాఁబోలు నెత్తుకొనిరి. కావుననే "కచకుచాదివర్ణనమీఁకాలమువఱకుఁ గవులలో ననివార్య మైన కావ్యాంగఁ బరిగణింపఁబడినది. ఇప్పు డిప్పు డాంగ్లేయసంసర్గమునఁ గొంతవఱకీసంప్రదాయము మాఱుచున్నది, గాని మనదేశమునందలి ప్రాచీనవాఙ్మయముఁ బరిశీలించుచున్నప్పు డీనాఁటిరసప్రమాణముల నుపయోగపఱుచుట యన్యాయము" అని వీరు వ్రాసిరి. ప్రాచీనపద్ధతినిబట్టి ప్రాచీనకాలమందుఁ బుట్టియున్నమనుచరిత్రమందలి కచకుచాదిశృంగారవర్ణనముల నేను నవీనపాశ్చాత్యపద్ధతులనుబట్టి నిందించినట్లు లోకమునకు నొకభ్రమను గలిగించి యందుమూలముగా వారికి నావిమర్శనముపై నరుచినిబుట్టింపఁ బ్రయత్నించిరి. ఇది యోగ్య మగుపనిగాదు. మనపెద్దలొనరించిన కచకుచాదిశృంగారవర్ణనముల నిందించుచున్నవారు కవులచరిత్రకారాది నవనాగరకులు. ఆసంగతిని నేను నావిమర్శనములో విస్పష్టముగాఁ దెలిపినాను. అది రావుగారును నెఱుంగుదురు. కావుననే తమ మచ్చువిమర్శనములో:—

"కచకుచాదివర్ణనవిషయములో వీరు పెద్దనార్యుని నిందింపనులేరు. అభినందింపనులే దని పైని వారివాక్యముల సహాయముననే చూపితినిగదా."

అని వీరు చక్కగ లిఖించిరి. ఇఁక వీరి పైయుపన్యాస మేల? తుదకుఁ బెద్దనగారి శృంగారవర్ణనములు నిందార్హములుగానే యున్న వని రావుగా రంగీకరించిరి.

కాని యట్టివర్ణనములు చేసినవారు మనలోఁ బల్వు రుండఁగా నొక్క పెద్దననే నిందిం పనేల యని వీరు శంకించుచున్నారు. నా వ్రాసిన దానిని వీరు తిన్నఁగాఁ జూచుకొనిన నీప్రశ్నమునకే యవసరము లేకుండ నుండును. ఏ మన, నావిమర్శనములో "మఱియుఁ గుచసంభోగవర్ణనముల నొక్క పెద్దనార్యుఁడే చేయలేదు. సంస్కృతమహాకవులలో నీవర్ణనము లమితముగాఁ గలవు. కాళిదాసు మున్నగుమహాకవులును గావించియుండిరి. ఇంగ్లీషులో షేక్స్పియరు మున్నగు మహాకవులును నట్లే కావించియుండిరి. అందులకై యితనిని బ్రత్యేకముగ నిందింపఁ బని లేదు." అని నేను వ్రాసియున్నట్లు రావుగారు తమమచ్చువిమర్శనములో లిఖియించిరి. కాన రావుగారీపట్టున ననవసరవిషయముల వ్రాసియుండి రని చెప్పకతప్పదు. మఱియును దమయుపన్యాసపురంగు మార్చి యింగ్లీషులోఁ బచ్చిశృంగారవర్ణనములఁ దీసివేసి మిగిలినగ్రంథమును బ్రచురించు ముద్రణములు (Bowdlerised Editions) మనుచరిత్రాదులవిషయములోఁ బ్రచురించుట మంచి దని రావుగారు లోకమునకు బోధగావించిరి. నాయందుఁ గరుణను వహించి నన్నాపని నొనరింపు మనిరి. ఆమహాకార్యమును "రసికతయెఱుంగని మానిసుల మగు నస్మదాదుల" మెట్లు చేయఁ గలము? అందులకు సర్వవిధముల సమర్థు లగు తామే పూనుకొనుట మంచిది. దాని కేమి గాని యిప్పు డాంగ్లేయభాషాపరిజ్ఞానము వచ్చినతరువాతఁ గుచవర్ణనాదిపద్ధతులు మాఱిపోవుచున్న వనియుఁ బెద్దనాదులనాఁటి శృంగారవర్ణనము లిప్పుడు లే వనియు రావుగారు లిఖించుట వింతగ నున్నది. మనుచరిత్రాదులందలి వర్ణనములవంటి వర్ణనములకై పదునాఱవశతాబ్దము వఱకుఁ బో నవసరము లేదు. హూణవిద్య బాగుగా వ్యాపించి యున్నయిక్కాలమునఁ దదభిజ్ఞులై నవనాగరకాగ్రగణ్యులై యుండువారు కూడఁ గుచసంభోగాదివర్ణనములఁ బచ్చిపచ్చిగాఁ గావించుచునేయున్నారు. మనప్రాచీనశృంగారగ్రంథములమీఁదికి దాఁడి వెడలిన నవనాగరకశిరోమణి తనగ్రంథములలో "సింగారపుచన్నులు, ఇరుకుచన్నులు, పించపుచన్నులు, సిబ్బెపుగబ్బిగుబ్బలు" మున్నగు రీతిగాఁ గుచభేదములను దేట తెలుఁగుమాటలతో విశేషముగా వర్ణించియున్నాఁడు. ఇంతియ గాక పూవులై, పిందెలై, కాయలై, పండ్లై, గిండ్లై, బిందెలై, గుట్టలై, కొండలగు వఱకుఁ గుచాభివృద్ధులను వర్ణించుటయే గాక యటుపిమ్మట నున్నతస్థితినుండి జాఱి తెప్పానప కాయలై, కొండచిలువలై, తిత్తులై, యెండిన జిల్లేడుకాయ లగువఱకుఁ జిత్రించి యున్నాఁడు. ఈమహానీయుఁడు చేసినంత కుచవర్ణనము లోకములో నేకవియును

జేసియుండలేదు. ఈపుణ్యాత్ముఁడు సంభోగాదివర్ణనములఁగూడ నమితముగాఁ జేయుటలో వెనుదీయలేదు. కనుఁడు:—

ఉ. "ఎన్నఁడు చూడఁగల్గునొకొ యింతిని జెన్నెసలారఁ జూచి నే
నెన్నఁడు నిండుకౌఁగిటను హెచ్చుగఁ జేరుతునొక్కొ చేర్చి యిం
కెన్నఁడు దాని సెజ్జ నిడి యించుక కూడుదునొక్కొ కూడి యా
కన్నియకోర్కెతో నగుట కన్నుల నెప్పుడు చూడఁగల్గునో."

ఉ. "కవ్వడి చేయి పోఁకముడి గ్రక్కున నవ్వల చేరఁ బారగా
జవ్వని యేమియుఁ బలుకఁజాలక బిగ్గన తానె చెల్వునిన్
నెవ్వడి కౌఁగిలించికొనె నేర్పున జేఁడును సంతసిల్లియా
క్రొవ్విరిబోఁడి కెంబెదవి గొబ్బున గంటిడి యానెఁ దేనియల్."

వీరుచేసిన లోఁతగు పచ్చివర్ణనము లింకను ననేకములు గలవు. ఇట్టినీతివాచస్పతులే మనగ్రంథరాజముల ననేకములను నణఁచివేయ మూలకారణమై యున్నారు. శ్రీరావుగారు "కృష్ణదేవరాయలు, రామరాజభూషణుఁడు, సూరనార్యుఁడు, ధూర్జటి, కుమార ధూర్జటి మున్నగువారు సంభోగవర్ణనము చేసినవారే. వీరి గ్రంథములను బహిష్కరించినయెడల నాంధ్రవాఙ్మయములోని మేలైన రత్నముల నిరసించి గులకరాళ్లను దాఁచుకొనినట్లగును" అని విచారించుచున్నారు. కావున నింతదూరము వ్రాసితిని. శృంగారవర్ణనౌచిత్యము తెలిసికొనుటకై పాశ్చాత్యవాఙ్మయములకడకుఁ బో నవసరము లేదు. మనలోని యౌచిత్యవిచారచర్చాకారాదులును నౌచిత్యము ముఖ్య మని నొక్కివక్కాణించియున్నారు. ఇప్పుడౌచిత్యమును విడిచి వర్ణించువారును గలరు. ఔచిత్యమును బాటించువారును గలరు. మొత్తముమీఁద నిప్పుడు పదదార్ఢ్య మొకించుక తగ్గుచున్న దేమో కాని భావదార్ఢ్యము మఱింత హెచ్చి పోవుచున్నది. పూర్వులు సువాసినుల కచకుచాదివర్ణనములఁ జేసియుండఁగా నిప్పటివారు పూర్వసువాసినుల కచకుచాదివర్ణనములను విరహాదివర్ణనములను బచ్చి పచ్చిగా నొనరించుచున్నారు. (చూ. రాజమహేంద్రవరములోఁ బ్రకటింపఁబడిన చింతామణి) పూర్వులు కచకుచసంభోగాదివర్ణనములను శృంగారప్రబంధములలోఁ గావించియుండఁగా నిప్పటి మహనీయులు చిన్నివిద్యార్థులకొఱకై వ్రాయఁబడియుండు సంగ్రహవ్యాకరణాదులయందును గచకుచసంభోగాదివర్ణనములు గల శృంగారపద్యరత్నముల యువకుల మనములలోఁ గామోద్రేకమును బుట్టించువానిని నమితముగా నుదాహరించి యున్నారు. పూర్వులు రసప్రధానము లగు ప్రబంధరాజములలోఁ గొన్నిట గోప్యావయవాది వర్ణనములఁ

గావించి యుండఁగా నిప్పటినీతివాచస్పతులు బాలురకు నీతులు బోధించుటకయి వ్రాసిన నీతికథలలోఁ "గొలుసుసవాయి" మున్నగు సుఖరోగముల నేర్పుతో వర్ణించియున్నారు. ఇట్టి మహానీయులు నీతి పేరుచెప్పి మన ప్రబంధరత్నముల నణఁచివేయ నిప్పుడు మితిలేని ప్రయత్నములం జేయుచున్నారు. ఈశుకతుల్యులే గోప్యావయవవర్ణనము గల వైజయంతీవిలాసాదులను మొదటను నిందించివైచి తర్వాత తామే చక్కనియక్షరములతో ముద్రించి ప్రకటించుచున్నారు. నిక్కమగు భాషాభివృద్ధినే మన శ్రీ యచ్యుతరావుగారును గోరుచో నిట్టి యపూర్వనీతి పరుల దుష్ప్రయత్నములు సాగకుండఁ జేయుటకై తగిన పనిఁ గావింపవలయును, గాని, మేలగు గ్రంథరత్నములు పాడయిపోవుచున్న వని వగచుచున్నమాత్రమున లాభమింతయు నుండనేరదు. కవితాకన్యకు సోదరి యగు చిత్రలేఖనకళ బహువిధములుగ శృంగారచేష్టాదికములఁ బచ్చిపచ్చిగాఁ జిత్రించియువకులమనస్సుల నుద్రేకపూరితములఁ గావించుచునే యున్నది. యువతీయువకు లొకరి నొకరు కౌఁగిలించుకొనుట ముద్దిడుకొనుట మున్నగు బాహ్యరతులతోఁడఁ గూడిన చిత్రపటములును మనగ్రంథములలో నిప్పుడు ముద్రింపఁ బడుచున్నవి. పైకేల, యిప్పటిప్రచారమువలన నీతి కంతగా లాభములేదు గాని సారస్వతము చెడుచున్నది. పాశ్చాత్యసారస్వత సంపర్కమువలన, గొన్ని లాభము లున్నను మొత్తముమీఁద విరసులమూలముగా హాని యెచ్చగుచున్నది. మనము కన్నులు మూసికొని చేతికి వచ్చినట్లెల్ల వ్రాసిన లాభము లేదు. కచకుచసంభోగాదివర్ణనములఁ జేసినందులకయి పెద్దనార్య నస్మదాదులము నిందించియుండలేము. ఈతఁడు నీతిబాహ్యములగు ప్రచారముల లోకములో నడిపించుటకై తనకు శృంగారరసమును వెలయింపఁజేయుటయందుఁ గలనేర్పునంతను మనుచరిత్రములో వినియోగించినాఁడు. కావున, పెద్దనార్యుఁడు జఘన్యశృంగారమును వెలయించినాఁ డని చెప్పవలసి వచ్చినది. మఱియు నీతఁడు బహువిధముల రసభంగమును గలిగించినాఁడు. కృష్ణదేవరాయలు బహుభంగుల సమర్థుఁడే యై యుండినను రసవిషయములోఁ దేలిపోయినాఁ డని మనరావుగారే వ్రాసిరి. అట్లే పెద్దనార్యుఁడును బహువిధముల సమర్థుఁడగుకవియే యైనను రసమును వెలయించుటలోఁ దేలిపోయినాఁడు. సత్యము లోకమునకు బోధపడుటకయి యీసంగతు లింతగా వ్రాయవలసివచ్చినది. శాంతరసముఁగూడఁ బెద్దన చెడఁగొట్టినాఁడు గాని వీరరసమును మాత్రము వర్ణించినమట్టునకు బాగుగనే వెలయించినాఁడు.

# ఆంధ్రీకృత సేతుబంధ కావ్యము.

(కొన్ని మచ్చుపద్యములు.)

—: శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు :—

---

## ప్రథమాశ్వాసము.

గీ. వృద్ధిఁ బొరయక తుంగుఁడై వెలయు నెవ్వఁ, డప్రసారితవిస్తృతుఁ డౌను నెవ్వఁ
డనవనతుఁ డయ్యు గాంభీర్య మెనయు నెవ్వఁ, డప్రలఘుకపరిశ్లిష్టుఁ డనధిగమ్య
తత్త్వుఁడైనను బ్రకటుఁడై తనరు నెవ్వఁ, డట్టిమధువైరిఁ దలఁచెద ననవరతము.

గీ. లగ్నదనుజేంద్రవక్షస్స్థలప్రభూత, రక్త మచ్ఛప్రభాపూరరంజిత మయి
డంబుమీఱెడు నెవనినఖంబు గళిత, కుచయుగాంశుకరీతిని గొనబుఁజూపఁ
బఱచె భీతిల్లి దైత్యేంద్రుభాగ్యలక్ష్మి.

గీ. మురమథను భుజపరిస్ఫురపరిగృహీత, మతులపీనతమస్ర్గాహ్యామసమవలిత
మగు నరిష్టుని గళమున కధికపీడ, గలుగఁ దజ్జీవితము వ్యతిక్రాంత మయ్యె.

గీ. శ్లాఘ్యగుణమూలలబ్ధసుస్థామయుతము, ధాత్రి నవగాఢవేష్టనత్వమున మించు
నాకికుజమూడఁదీసిననందసుతుఁడు, జిష్ణుయశమునుద్రుంచెఁదచ్ఛిఖముమాడ్కి.

గీ. ఎవనినర్తనసమయమునం దిర్లుగోలుపు, కంఠకాంతిని గలిసిన కంటిచిచ్చు
సెగలతోఁ గూడి పటురవచితము రాజఁ, దట్టహాసమునై పొల్చు హరిదనీక
మూర్ధ్వసంప్లుష్టతిమిరాళియొప్పఁదాల్చు, నట్టిగిరిజేశుపాదంబుఁ బట్టికొనుఁడు.

గీ. ఎతని నర్తనసమయమం దింపుమీఱ, హృష్టరోమాంచితస్తన మీఁదులేని
రాగగరిమ విముగ్ధంబు రాజదితర, భాగసంప్రేప్సువై యొప్పువామభాగ
మల్లన వడంకె భీతిచే నాఁగె లజ్జ.

గీ. దిశలకడలకుఁ గ్రుమ్మరి తిరిగివచ్చి, హెచ్చుగు ప్రతిధ్వనులఁగూడి యెవనియట్ట
హాసవిచ్ఛేదములు చంద్రహారినిశలఁ, బర్వు నభమున జ్యోత్స్నాప్రవాహరీతి.

గీ. ఎవనినృత్యంబునందు నీయేడుజలధు, లతిపరిక్షోభజనితభయప్రకంపి
తోరుమత్స్యఘనిహతనీరోత్థరప్ర, వేగములు వారిపూరణవికటధూమ
పుంజబడబాముఖంబులై పొల్చె నట్టి, శివునిపాదాంబుజంబు సంసేవ్య మెప్డు.

గీ. అనవధాన కృతస్ఖలితాళియందు, మరల సంస్థాపితంబైన మైత్రిపగిది
నూతనావనినాథప్రణీతమైన, కావ్యకథ నిర్వహించుట కష్టతరము.

గీ. వృద్ధినొందును విజ్ఞానవిభవ మమల, కీర్తి గలుగును సద్గుణపూర్తి యొసఁగుఁ
బుణ్యపురుషుల చరితంబు బోధసేయు, నేమిఫల మియ్యదిక్కావ్య మిద్ధగుణము.

గీ. ఇచ్చమీఱిన ధనబుద్ధి యింపు గులుకు, జవ్వనంబును గణనీయసచ్చరిత్ర
మెట్టు లోకనికి దుర్లభం బట్లె కవికి, నవనవార్థంబు బంధసౌష్ఠవము నొక్క-
చోట ఘటియింప దుష్కర మాట నిజము.

గీ. త్రిదశబందీవిమోక్షంబు త్రిజగతీస్థ, శోకశంకుసముత్పాటనైకపటువు
జనకనృపనందినీదుఃఖసంక్షయంబు, బద్ధరాగంబు రావణవధ వినుండు.

గీ. అమితశాత్రవదూషితహారితనూజుఁ, డనెడుహృదయాన రాఘవమనసి జేషు
విద్ధయై రాజ్యలక్ష్మి సమిద్ధయశుని, దినకరాత్మజు నభిసరించెను ముదమున.

క. వ్యవసాయరవినిశాముఖ, మవబంధకశృంఖలౌఘమతిరుట్కారికిన్
రవివంశ్యవిజయకేసరి, పవిపంజర మబ్దకాల మవసిత మయ్యెన్.

గీ. కడచెను గదంబివాయువు లుచ్చాటమునను, గంటి మేఘాంధకారితగగనతలము
సైచితిని గర్జితధ్వనిసమితి నైన, నాశ చెడె సీతజీవితమంచు నాను.

గీ. సూర్యసుతకీర్తిపథము వసుంధరాత్మ,జాదృగశ్రువిఘాతంబు సవితృవంశ్య
జీవితమునకు మూలమా జీవగఱ్ఱ, రావణాంతకదినము శరత్తు వచ్చె.

—౯ శరదృతువర్ణనము ౯—

గీ. తరణికరకేసరౌఘంబు ధవళజలద, దళసహస్రపకీతంబు దనుజవైరి
విగ్రహేక్షణయోగ్యంబు విధికి జనన,సదనపద్మంబుకై వడి సారసాక్షు
పదము భాసిల్లె నాశరత్ప్రాప్తియందు.

క. దినమణికిరణస్ఫురితము, ఘనలక్ష్మీరత్నరశనఘనబుతువిలస
న్మనసిజశరవక్త్రము సుర,ధను వత్తఱి మింట మృగ్యదర్శన మయ్యెన్.

గీ. అభ్రకాలసమాకర్షణావనతవి,ముక్తములు ధూతజలముక్సమూహమధుప
సంతతులు గగనపాదపశాఖలైన, దిశలు స్వస్థాసములఁబొందు తెఱఁగు దోఁచె.

గీ. ఏకదేశసువృష్టిసందృశ్యమాన, జలలవంబులు ప్రత్యగ్రసాంద్రమిహిర
తేజములు మజ్జనప్రాప్తతీవ్రసుఖము, లహము లల్పాల్పశుష్కభావహములయ్యె.

గీ. నిరతిశయసౌఖ్యమునను వినిద్రుఁ డగుచు, నిజవియోగసముత్థచింత నీరధి కిడి
ప్రాక్ప్రబుద్ధరమావరివస్యమాన, చరణుఁడై నిద్రమేల్కాంచె శార్ఙ్గపాణి.

గీ. రాత్రి చేలావికీర్ణంబు రమ్యకాంతి, స్ఫుటవిభిన్నబలాహకశుక్తిముక్త
తారకామౌక్తికౌఘం బుదారలీల, గగనపాథోధి యమితప్రకాశ మయ్యె.

క. అడఁగెను గేకులరుతములు, పొడసూపెను రాజహంసపూగవిరుతముల్
కడపనర లేడఁ బోయెనొ, యెడఁదకు సప్తచ్ఛదాళి యింపొనరించెన్.

గీ. క్షీనవార్వాహలగ్నంబు పీతవృష్టి, సముదయదత్తంబు దిగ్వధూసంఘమునకుఁ
బ్రథమసౌభాగ్యచిహ్నంబు ప్రకటసరస,నఖపదం బన నొప్పెడునాకవిభుని
కార్ముకంబు విశీర్ణతఁ గాంచె నపుడు.

గీ. బహుళమేఘవినిస్సృతవారిధౌత, మతిదవిష్ఠసమాలోక్య మతివిమలము
నైన నభమున నిర్మల మబ్జవైరి,బింబ మాసన్నమైనట్లు పేర్చె మింట.

గీ. క్షుభ్యమానోరుకుముదరజోవిలిప్త, మతిచిరాయాత మనధిగతాస్పదంబు
పంకజాకరదర్శనబద్ధకుతుక, మంచగమి దెసల నత్తఱి మించి తిరిగె.

గీ. విమలచంద్రాతపాలిప్తవిశదరుచులు, దివ్యదంబరమణిదీప్తిదితసుషమలు
క్షపలు శరదబ్జముఖియురస్స్థలమునందు, మహితముక్తావళీవిభ్రమంబు దాల్చె.

క. భ్రమరరుతదత్తసంజ్ఞము, శమితఘనావరణతపనసాంద్రకరాశ్లి
ష్టము సలిలనిహితనాళము, కమలము సంసుప్తి సుఖితుకైవడి లేచెన్.

గీ. పంచబాణశరాసనపటురవంబు, కమలషండపరిభ్రమత్తరంగగేహ
మంజుమంజీరనినదంబు మధుకరోక్తి, కబ్జినీప్రతిభాషలు హంసరుతులు.

గీ. ఖండితోత్పాటితమృణాళిఁ గమలినిఁ గని,మధుమదాతామ్రమధుకరమంజుశింజి
తంబు గల్గినకమలంబు దయితముఖము, గాఁ దలంచిజనాళివేడ్కను గ్రహించు.

గీ. బహుళపంకేరుహామోదభరితదిశము, మధురసార్ద్రరజోరాజిమండితంబు
కరిఘటాగండదానశీకరవహంబు, భ్రమరసేవ్యంబు వనగంధవహము వీచె.

గీ. కంటకితగోపితాంగియుఁ గాలవశత, వదలుచుండెడి ముగ్ధస్వభావదివస
నాథకరచుంబ్యమానమౌ నళినిముఖము,వోలెఁజూపడుకమల మకాలమునను.

గీ. సప్తపర్ణసుమోత్తరసాంద్రధవళ,ధూళిసంవృతగాత్రంబు లోలకుంభి
క్షణికకర్ణాగ్రచామరచ్ఛవిచరిష్ణు,బంభరవ్రాత మిభదానపంక మపుడు
డాయ భీతిల్లి యవలకుఁ బాయఁ దొడఁగె.

గీ. రాజు లెల్లరు రిపురాజరాజ్యలక్ష్మి
కరముఁ జేపట్టు రాత్రిముఖంబు శూర
పంకజాక్షీముఖాంభోజబద్ధవైర
చంద్రదీధితి కనదుడుసంచయంబు
హసితకుముదాకరం బిట్టు లాశరత్తు.

—: హనుమంతుఁడు సీతావృత్తాంతమును దెలుపుట. :—

గీ. వేగ దరియుంగ నవనిజావిరహకీలి, కృశశరీరుఁడు సతతాశ్రుకీర్ణముఖుఁడు
నైనరాముండు చిరగతుం డైనహనుమ, రామిచే వీడె మనములో రమణియాశ.

గీ. సరవి ముఖకాంతిబోధితస్వామికార్య, నిర్వహణుఁ డైన మారుతి నికటమునకుఁ
జాలితసుఖోపనతకర్మసిద్ధిపగిది, రాఁగఁ గని సంతసిల్లెను రాఘవుండు.

గీ. తొలిని సామీరి హర్షనిస్తులవికాస, భాస్వరం బగు మోమునఁ బదపడి తన
వాక్కుచేఁ దెల్పె భూసుతవార్త మెల్ల, రఘువరుండు ప్రమోదాంబురాశిఁ దేలె.

గీ. నాతిఁ జూచితి ననుమాట నమ్మఁడయ్యె, క్షీణ యన నశ్రుసంతానసిక్తుఁ డయ్యె
నీకు శోకిల్లు నన నేడ్చి నిశ్వసించె, బ్రతికి యున్నది యని పల్కఁ బావమానిఁ
గౌఁగిలించెను రాముఁ డుత్కంఠతోడ.

గీ. విపులచింతాహతద్యుతివిధము గలది, కాంతినిస్పృహ మైనట్లు కరగతంబు
వేణికాబంధమలినంబు రాణిమాని,కంబు రాముని కిచ్చె నాగాజ్జపట్టి.

గీ. ఉదితబాష్పావసన్నమయూఖచయము, కరతలాంజలిగత మగుతరుణిమణిని
నేత్రపుటములఁ గ్రోలియు నెలఁతవార్త, లడిగి రఘునేత యార్తిఁగో నలరెనపుడు.

గీ. విరళహస్తాంగుళీరంధ్రవిగళదమల, కిరణధారానికాయంబు కీర్ణకాంతి
మణిని వీక్షించి శోకించిమరలదాని, మోమునఘటించె సలిలసంపుటమువ్యాక్షి.

గీ. చాన పంపినయయ్యభిజ్ఞానచిహ్న, మంగమం దిడకపోయిన నవనిజాత
హస్తసంస్పర్శచేబలె నధికముగను, రాముతనువల్లి రోమహర్షణము నొందె.

గీ. బాష్పసంక్లిన్నమయ్యును బంక్తికంఠ
వధసమాలోచనోద్భూత బహుళకోప
వహ్ని దుష్ప్రేక్ష్య మయ్యెను బ్రభుముఖంబు
చైత్రచండాంశుబింబంబు చందమునను.

గీ. కుపితలయకాలదండభృద్ఘోరవికట, భ్రూలతాస్పర్ధి దినసుప్తభుజగవిధము
దృష్టసారంబునగునిజదీప్రధనువు,నంద నిగిడించె దృష్టి నాయువనిభర్త.

గీ. అంత నామూలబద్ధమై యట నిగతము, నైనరామునిదృష్టిచే ననవరతము
వీక్ష్యమాణంబు మసృణంబు వెడఁదవిల్లు, వంపఁబడక యెసజ్యమై వన్నెమీఱె.

—: లంకాభిగమనోద్యోగము :—

గీ. రాఘవోపకృతిప్రతిరచనమునకు, బద్ధదీక్షుం బనాదృతపంక్తికంఠ
వీర్యమై పేర్చువానరవిభునిమనము, కార్యభారంబు లఘువైనకరణి విరిసె.

గీ. భ్రూలతాభంగసూచితస్ఫురదమర్ష, రసము రాక్షసజీవితక్రథనవిషము
పోషమె లంకాభిగమనేచ్ఛ భూమిపతికిఁ, జిత్తతోపచతార్థంబు చెలఁగుకరణి.
గీ. కలయలక్ష్మణముఖమును గాంచివలెను, వాలిసోదరునురమును మాలపగిది
ననిలపుత్త్రునియందు సద్యశముభంగి, దాశరథిదృష్టి వారిపైఁ దగులుకొనియె.
గీ. వానరానీకవిమథితవనచయుండు, మథితపాథోధిమేఖలామండలుండు
క్షుభితరత్నాకరంబున కభిముఖముగ, మథనసమయపుమందరక్ష్మాధరంబు
కరణి నడచెను దశకంఠఖండనుండు.
గీ. చలితకోమలపుగ్రాజివిలసితంబు, దినకరునికిరణజాలంబు తీరునఁ దరు
చరబలంబుగృహీతదిక్చక్ర మగుచు, నడచె రాముని వెనుకను బుడమివడఁక.
గీ. శాత్రవారణిదీప్తంబు సామ్యహీన, రోషపవనాహతోద్ధతోరుస్వనంబు
దానవావాసవనదాహదావవహ్ని, రామమార్గానుగతముశాఖామృగాళి
పెరుఁగుచుండె మహోదధిప్రేక్షి మించి.
గీ. చటులకేసరసటల నుజ్జ్వలితమైన, ప్లవగసేనాసమూహసంపరివృతుఁడయి
నడచెరాముండు రాక్షసనగరిపైపు, హరిముపానీతలయదీప్రపగిదినికాయ
సంకులాంభోధిచాడ్పున శంకలేక.
గీ. తపనకరజాలసంశోభితములు ముక్త, వారివాహాపరోధము ల్వరుస దిశలు
జ్ఞానుతాగతశోకాంధకారిత మగు, రామమానససీమను భ్రాంతిగొలిపె.

—— వింధ్యవర్ణనము ——

గీ. చాపతుల్యాకృతివహించుసంద్రమునకు, సంహితశరోపమముపార్శ్వసంఘటితము
గుణమువలె నున్న వింధ్యాద్రికుధరవరముఁ, జూచెరాఘవుఁడత్తటిజూక్షులలర.
గీ. మసృణశిఖరాగ్రదేశంబు మథితకటక, వృక్షమండప్రకాశితవిపులతటము
కుజచరానీకసంభృతకుహరగర్భ, మద్రి కపిపాతమున భగ్నమయ్యె నంత.
గీ. సలిలకణసిక్తధాతుదృషన్నిషణ్ణ, రాజితాంబుదతతినిర్ఝరప్రహసిత
కందరాముఖనిర్యాతగాఢవకుళ, మద్యగంధంబు సహ్యాద్రి కుద్యతులయి.
గీ. కపులుచూచుచునడచిరి కమ్రసలిల, బింబితవళక్షవారిదబృందములను
స్ఫటికపాషాణసంకులస్ఖలితగతిని, మీఁదికెగసినచందము మీఁజునముల.
గీ. తటయుగోత్క్షిప్తములును సందళితభుజగ, ధామగళితాంబుపూరసిక్తంబు లగుచు
నఖలస్రోతస్వినీప్రవాహంబు లపుడు, ప్లవగపాతంబుచే మహాపథములయ్యె.
గీ. ఖండితోద్ధృతచందనకాననంబు, ప్లవగసైన్యంబు జలధరవారితోగ్ర

దావవహ్నినవీభూతతరుగహనము, నిత్యశైత్యగుణప్రాప్తనిద్రయు నగు
మలయ మత్తటి వీక్షించె మార్గమందు.

గీ. చందనానోకహవ్రాతసక్తము లయి
ఖండితోద్వేల్లితలతాళికల్పము లయి
లగ్ననిర్మోకధవళిమాలయములు నయి
తనరుపృథుభోగిభోగవేష్టనపథముల
గనిరి మలయాద్రిపైఁ బ్లవంగమను లపుడు.

గీ. తీరవర్ధితవిటపవిస్తారభార, వినతరోహిణతరుషండవేష్టితములు
రమ్యతృణదీప్రపథము లరణ్యదంతి, దానసురభులు గిరినదు ల్గానఁబడియె.

గీ. శుక్తిసంపుటదర్శితశోభమాన, తోయనిక్షిప్తముక్తానికాయరుచిర
బహుళవర్ణవిరాజితవకులవాటి, దానసౌగంధ్యసురభిరజోనవైల
వేలఁ గాంచిరి ప్లవగు లవ్వేళ నచట.

గీ. వికచతాపింఛతరునీలవిచలదూర్మి, కరపరామృష్టసంఫుల్లసురభిశైల
కంధిదంతావళేంద్ర న్యుత్తటమదాంబు, ధారవలె నొప్పువేలను వారుగనిరి.

గీ. విద్రుమవ్రాతదంతక్షతద్రుతోష్ఠ, రమ్యడిండీరరచితాంగరాగమృదిత
విపినకబరీలతాంతసంపృక్తజలధి, భోగపరిచిహ్నములఁ దాల్చుపోల్కి నమరు.

గీ. అల్లిబిల్లిగ నల్లిన యలరుఁదీవ, యిండ్లలోఁ బెరుఁగుచుండెడు నింపుమీఱు
కిన్నరులగానరవమును గీలితాను, రాగమున శుక్తిసంపుటరమ్యనేత్ర
యుగము ముకుళించివినుచున్నయువిదఁ బోలెఁ
దనరువేలను గాంచె నవ్వనచరాళి.

---

# గ్రంథస్వీకారము.

(1) నీకేజయము:—ఆంధ్రప్రచారిణీగ్రంథమాల 76 వ పుష్పము. ద్వితీయ భాగము. గ్రంథకర్త మ. శ్రీ కైప సుబ్బరామయ్యగారు. ప్రకాశకులు, కవిరాజహంస వోలేటి పార్వతీశముగారు. వెల రు 1-8-0. 212 పుటలు. 25 ప్రకరణములు. పిఠాపురములోఁ బైగ్రంథాలయములో దొరకును. ఈగ్రంథమాలలో రాంబోవునవల, పామపాహైదరాలీ (మైసూరురాజ్యవిప్లవము.) మఱియును బహువిధములగు నవలలు ఆంధ్రప్రచారిణీ గ్రంథ నిలయములో దొరకును.

---

(2) సూక్తిసుధాలహరి:—కర్త బ్ర॥ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము. 3-4-5 ఫారముల విద్యార్థుల కుపయోగించునట్లు గద్యపద్యభాగములతోనొప్పు చక్కనిపుస్తకము. శాస్త్రిగారు ముప్పదియేండ్లుపాధ్యాయవృత్తియందుండుటచేఁ జిరకాలానుభవము కలిమి ముఖ్యపూర్వపుస్తకములలోనుండి యుచితగద్యపద్యములనుదీసి శ్రమపడి ప్రచురించిరి. విద్యాధికారులు వీరిశ్రమకు ఫలితముగ విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగ నిర్ణయింపఁదగును. ఈయొక్కపుస్తకమునే, రెండుమూఁడు సంవత్సరములు భాగభాగములుగ విభజించి విద్యార్థులకు బోధింపవచ్చును. ఆయాభాగముల రచించినకవులచరిత్రమును, కొన్నిపదములకు లఘుటిప్పణియుఁగలదు. దీనివెల రు. 0-12-0 పిఠాపురములో, కౌండిన్యనిలయములో దొరకును. ఇాదే పరిక్షిత్తు, మహాభారతచరిత్రము నను గ్రంథములు కూడ దొరకును.

---

(3) నాగకన్య:—సంస్కృతమునందలి సోడ్ఢలకవివిరచిత మగు "ఉదయసుందరికథ"కు గుంటూరుజిల్లా తాడికొండనివాసులు బ్ర. వంగల వేంకటరామశాస్త్రిగారియాంధ్రీకరణము. మూలము నాంధ్రమును వచనములే. సోడ్ఢలకవిమూలమును శ్రీగాయక్వాడ్ ఓరియంటల్సీరీసులో (బరోడాదొరతనమువారిచే) 11వ గ్రంథముగాఁ బ్రచురింపఁబడినది. ఇంచుమించు 160 పుటల సూక్ష్మాక్షరకలితము గు నుద్గ్రంథమును శ్రీయుత వేంకటరామశాస్త్రిగారు వర్ణనాదివిశేషభాగమును దగ్గించి చిన్నిపొత్తముగా నొనరించి కథనవగాహనచేసికొనుటలోఁ గష్టములేకుండ జేసిరి. దీనికిముందు శ్రీ శంకరశాస్త్రిగారు పీఠికవ్రాసిరి. అందుబరోడాప్రతిలోఁగల

యింగ్లీషుపీఠికలోని కవికాలాదివిషయములనె తెలిపియున్నారు. శ్రీ వేంకటరామశాస్త్రిగారి పదరచన నిర్దుష్టముగను, మనోహరముగను, గంభీరముగను జూపట్టుచున్నది. ముద్రణమును సుందరముగ నున్నది. అందందు సుభటగోష్టులు, తెలుసుకొన్నాను, కౌగలి, దాచక, స్మృతిపధము, యదార్ధము, అసమర్ధుఁడు, ప్రాణనాధుఁడు, మొదలగు ప్రమాదములు కనఁబడుచున్నవి. ఈ గ్రంధమును విద్యాధికారులు కళాశాలలయందుఁ బాఠ్యగ్రంథముగా నియమింపఁదగియున్నది.

దీని నిదివఱలో విజయనగరమహారాజ సంస్కృతకళాశాలలో నాంధ్ర పండితు లగు బ్ర. విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రులుగారు, ఆకళాశాలలోనే సాహిత్యాచార్యులగు ఉ. వే. శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యస్వామివారును దెలిఁగించియున్నారు. ఇందులో శాస్త్రిగారిది పూర్తిగఁ బ్రచురింపఁబడి యాంధ్ర చెన్నపురవిశ్వవిద్యాలయములలోఁ బాఠ్యగ్రంథముగా నియమింపఁబడినది. ఆచార్యులవారి గ్రంథము కొంతవఱకు మాత్రమే విజయనగరమహారాజకళాశాలపత్రికలోఁ బ్రకటింపఁబడినది. ఇందాచార్యులవారిది యథామాతృకము.

ఉదయసుందరి యనుపేరును మార్చి శ్రీ వేంకటరామశాస్త్రులుగారు నాగకన్య యనుట యంత యుచితముగాఁ జూపట్టదు. దీనివలన సోడ్ఢలకృతమగు నాగకన్యయను వేఱొక గ్రంథ మున్నదేమో యని కొందఱకుఁ దోఁపవచ్చును. పలువురు దీని నానామముతోనే రచియించియుండుటచేత నేపేరుమార్పనవసరము కనఁబడదు. ఆసంశయమే యున్నచో పేరుమరల నాంధ్రీకరించుటయు నవసరము కాదు. ఉదయసుందరి యనుటలో బాధ యేమియుఁ గనఁబడదు. శాకుంతలాదు లెందఱు తెనిఁగింపలేదు? పేరుమార్చిరా? రు. 0-12-0 కవిగారియొద్దదొరకును.

---

(4) మహాపురుషులు:—రాజమహేంద్రవరములో కీ. శే. ద్రోణమురాజు సీతారామారావుగారు గౌతమబుద్ధుఁడు, నానకు, అగ్బరు, శివాజీ, వేమన అను నీయైదుగురు మహాపురుషుల చరిత్రమును సంక్షేపరూపమున వచనముగ వ్రాసి యిచ్చిన శ్రీయుతులు నాళము రంగారావుగారు ప్రకటించిరి. క్రౌను 90 పుటలు. చక్కనియచ్చు. సుందర మగు నాకారముగల యీపుస్తకము విద్యార్థుల కత్యుపయోగకర మగునని తలంచెదము. రాజమహేంద్రవరము ఆర్యపుస్తకాలయములో దొరకును. మఱియు నీయార్య పుస్తకాలయములో ననేకాంధ్రాంగ్లేయగ్రంథము లుదొరకును. విద్యార్థులకుఁగావలసిన వన్నియు నచ్చటఁ గలవు.

(5) శ్రీకోదండరామాయణము:—కర్త, కవిభూషణ శతావధాని బిరుదాంకితులు, బుదా రామయ ప్రధానిగారు.

ఓడరేవుగ్రామములోని శ్రీ కోదండరామస్వామివారి కంకితముగ "దండిదొర! యోడరేవుకోదండరామ" యను మకుటముతోడ రామాయణకథ యంతయును 116 సీసపద్యములలో నిమిడ్చిరి. దీనికి విమర్శకాగ్రేసర, మహామహోపాధ్యాయ, బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారును, ఆంధ్రతులసీదాసు విజాపురపు వేంకటరావు, బి. ఏ., గారును "దొలిపలుకు" వ్రాసియున్నారు. పద్యములనడక ధారాళముగానున్నది. భాష నిర్దుష్టముగనున్నది. ఒక్క పద్యముచిత్తగింపుఁడు:—

సీ. కడఁక రాముఁడు సమగ్రంబుగాఁ గార్ముకం బెక్కిడి మాఁర్వి మ్రోయించినంత
భువనంబులదరె నంబుధిజీవనము లింకె జలచరోత్కరములు సంచలించెఁ
దడఁబాటొదవ సరిత్పతి చనుదెంచి రామచంద్రునకనర్ఘ్యమణు లొసఁగి
బలమగుతిమితిమింగిలముల కలవి గాకుండంగ నలునిచేఁ గొండలెల్ల
వనధివేయించు మనిచెప్పి చనియె నటులె,దినము లైదింటిలోవారిధిని నలుండు
కపివరులుసాయమొనరింపఁగట్టెరాముఁ,డింతలోనీశ్వరునిబ్రతిష్ఠించెనచట"దండి"

రామునిచరిత్రమును రామునకే వినిపించిన ట్లుండుట- పైకుశతకములలోఁ గూడను గనఁబడుచున్నది. ఓడరేవు కోదండరామునకుఁ దెల్పఁబడుచున్న దనుమా.

"నేను మిమ్మిప్డు గంగానది దాఁటించినట్లు సంసారమహాబ్ధినుండి నీవు దాఁటింతు వని గట్టిగా వరంబు నిత్తు వేనియు మిమ్ముఁ బోనిత్తు" నని గుహుఁడు పల్క "రాముఁడు హర్షమొంది యతఁడు కోరినవర మిచ్చె" "కోదండరామ" అనిన-దూరదృష్టిలేని వారికెట్లు దోఁచిన నేమిలెండు. భక్తిభావ మిచటఁ బ్రధానము. అందందు శుద్ధపతిలోఁ జూపఁబడని పొరపాటులు గలవు. వెల రు. 0-8-0 కాకినాడలో సాల్టు కష్టమ్సు డిపార్టుమెంటులో నుద్యోగు లగు కవిగారియొద్ద దొరకును.

---

(6) శ్రీకృష్ణగీతివ్రాతము:—శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజకృతము. ఆటవెలఁదిగీతములు. లోకములో సాధారణముగా నైదుపద్యములను రచించి పంచరత్నములందురు, తొమ్మిదింటిరచించిన నవరత్నములందురు, పంచరత్నములు, నవరత్నము లనుటయేనా యందేమేని చమత్కార ముండవలదా యను తలంపుగల మహారాజుగారు నవరత్నమాలిక, గ్రహమాలిక, రాశిమాలిక, నక్షత్రమాలిక, వత్సరమాలిక యను నైదుమాలికలను దమయుద్దేశప్రకారము రచియించిరి. నవ

రత్నమాలికలోఁ బ్రతిపద్యమున నొక్కొక్కరత్నముపేరు చమత్కారముగావచ్చును. కేవలము నాయానామములు పద్యములలో నిమిడియుండుటయేకాదు. శ్లేషార్థముం జూపును. తత్తన్మాలికలలో నాయానామములం బాఠకులు చూడవచ్చును. ప్రతిపద్యమునకును మకుటముగా "విక్రమేశవర్యవినుతకృష్ణ" యని వచ్చును. మాలిక కొకటిరెండు మచ్చుచూడుఁడు.

1. నవరత్నమాలికలో—

నిఖిలదేవవంద్య నీలలితాకృతి, నొక్కమాఱునాకు నొనరఁజూపు-

ఇందు నీలలితాకృతియనుచో నీలరత్నముపేరు గలదు.

2. గ్రహమాలికలో—

తగదుసుమి పరాకు జగదీశనాపట్ల-

ఇందు- కుజగ్రహనామము పరాకుజగదీశ యనుమాటలో నున్నది.

3. రాశిమాలికలో—

నరకయోగ్యుఁడైన నరకునిచేఁజిక్కి, భూపకన్యకల విముక్తలుగను-

ఇందుఁ- గన్యారాశినామము భూపకన్య యనుచోఁ గలదు.

4. నక్షత్రమాలికలో—

అచ్యుతా, యతికరుణార్ద్రమానస, శౌరి - భక్తనిచయహృదయపద్మసద్మ—

అనుచో నార్ద్రానక్షత్రముపేరు గలదు.

భాసమానవిగ్రహా సుభద్రాపూర్వ, ఫల్గునీజసూత—

ఇందులో- పూర్వఫల్గునీనక్షత్రనామము గలదు.

5. వత్సరమాలికలో—

గెలువఁ దరముగాని బలురక్కసులను బ్ల,వంగగణముచేత భంగ మొంద—

ఇందుఁ బ్లవంగ సంవత్సరము గూడి యున్నది.

ఇట్టి విచిత్రనియమములు చక్కగాఁదెలియుటకై యెట్టినియక్షరము లాయాస్థలములలో ముద్రింపఁబడినవి. ఆధునికులలోఁ గవులు ముక్తకాదిపంచాశత్పద్యనిర్మాణముచేయ నూహించువా రీమార్గము నవలంబించినఁ జక్కగనుండును.

---

(7) గోవిందశతకము—కాకినాడ వాస్తవ్యులు నండూరి వేంకటజోగేశ్వరుఁడుగారు రచియించినది. ౧౦౮ కందపద్యములుగలవు. భక్తిరసప్రధానము. శైలి చక్కనిది. భాషనిర్దుష్టము. మచ్చునకుఁ గొన్ని పద్యములు.

క. బహుభక్తియుక్తిలక్ష్మణ, సహితుఁడవై మానియజ్ఞసంరక్షణముక్
విహిత మని చేసి తది లో, కహితార్థం బుచితమగును గదె గోవిందా. ౧౮
క. మైమఱచి నిద్రవోవం, గా మ్మెల్లని యుండఁ గలలు గనుతెఱి మఱియుక్
మామాసర్వావస్థల, నోమంగా నీవె భార మోగోవిందా. ౧౦౫
క. వెలమకులాబ్ధీందుఁడు పో,కలగోవింద ప్రభునకుఁ గడుశుభదముగా
నిలఁ బ్రభవాబ్దంబున నిది, వెలువడెఁ గరుణక్ గ్రహింపవే గోవిందా.౧౦౧

ఇందలి ప్రభవ మొన్న (1928) టిదే. పోకల గోవింద ప్రభుఁడు కవిగారియుద్యోగశాఖాధికారిగ నుండిరఁట. శతకము కవిగారి కుమారుఁడు రాధాకాంతముగారియొద్ద- కాకినాడలోదొరకఁగలదు.

---

(8) శంకరవిజయము—బ్రహ్మశ్రీ పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రికృతము. ఈగ్రంథము వచనకావ్యము. శ్రీమాధవాచార్యప్రణీతమగు శంకరవిజయానుసారముగాఁ వ్రాయఁబడినది. కాని కేవలానువాదము గాదు. అనుచితభాగములు కొన్నింటిం దీసివైచిరి. శాస్త్రిగారీగ్రాంథికాంధ్రగద్యమును శ్రీజగద్గురుపుష్పగిరి పీఠాధిపతులయిన శ్రీశ్రీవిద్యానృసింహభారతీస్వాములు, శ్రీశంకరాచార్యచరిత్రము నాంధ్రులకుఁ దెలుపుమని యాజ్ఞాపించినందున రచియించిరఁట. శ్రీశంకరాచార్యుల కాలనిర్ణయముం గూర్చి యిదివఱకుఁ బలువురు పండితులు గావించిన వివాదముల నన్నింటిం బట్టి విమర్శించి, వీరు, క్రీస్తునకుఁ బూర్వమందు రెండవశతాబ్దముననే యవతరించి యుండునని యభిప్రాయమునుఁ దగిన ప్రమాణములతో నిచ్చియున్నారు. గ్రంథసారాంశము సంగ్రహముగా నెనిమిదిరీతులుగా వ్రాసిరి. అయిదు ప్రకరణములు. 1 శంకరాచార్యజననాదికము 2 శంకరాచార్యగ్రంథసారాంశాదికము 3 శంకరమండనమిశ్రసంవాదాదికము 4 దిగ్విజయము 5 సర్వజ్ఞపీఠారోహణాదికమును. 128 పుటలు-చక్కనియచ్చు. మచ్చునకుఁ గొన్ని వాక్యములు.

"అప్పుడు ప్రాజ్ఞుఁడగు శంకరాచార్యుఁడు మండనపండితుని వాదోత్సుక్యమును గ్రహించి మొదట తనమత ముపన్యసింపఁ దలఁచి పండితాఖండలా! మండనా! పరమార్థమును, సచ్చిదానందమును, అమలమును, అద్వితీయమును నగు బ్రహ్మమే యనాద్యవిద్యావృతమై శుక్తిరూప్యస్వరూపమునఁ బ్రకాశించునట్లు సకలప్రపంచాకారమునఁ బ్రకాశించుచున్నది. సమస్త ప్రపంచ విలయమునకుఁ గారణ భూత మగు బ్రహ్మజ్ఞానము వలనఁ గలిగెడి యాత్మనిష్ఠయే పునరావృత్తి

రహిత మగు మోక్షము. ఇదియే నామతము. దీనికి వేదాంతములు పరమప్రమాణములు. ఈవిషయమును నేను సిద్ధాంతీకరించుకొనఁ జాలక వాదమునఁ బరాజయము నందితినేని నాసన్న్యాసమును, కాషాయవస్త్రములను బరిత్యజించి తెల్లనివస్త్రములను ధరించి నీకు శిష్యుఁడ నయ్యెదను. జయాపజయనిర్ణయమున కుభయభారతియే ప్రమాణము." పుట 48. దీనివెల ౧౨ అణాలు. పిఠాపురములో శ్రీచిదంబర గ్రంథమాలాకార్యస్థానమున దొరకును.

ఆంధ్రులెల్లరు నిట్టిగ్రంథమును జదివి యద్వైతమతకర్త యగు శ్రీశంకరాచార్యులవారిచరిత్రము నెఱిఁగికొనుట ముఖ్యము.

---

(9) రామతీర్థస్వామిజీవితము:—కర్త శ్రీయుత బులుసు వేంకటేశ్వరులుగారు, ఎం.ఏ., పిఠాపురరాజకళాశాల, కాకినాడ. 6 + 147 పుటలు. వెల రు. 0-8-0 మాత్రము. గ్రంథకర్తగారు వేదాంతశాస్త్రమున ఎం.ఏ., పరీక్షలో నుత్తీర్ణులైరి. ఆంధ్రలోకమునఁ బ్రచురప్రచారమునందిన 'వివేకానందజీవిత' మను గ్రంథముద్వారమున నిదివఱకే తెలుఁగునాఁట సుపరిచితులు. ఇఁక విషయమైల క్షుణ్య మెంతమా, 'భారతవర్షమున నవతరించిన యార్యధర్మామృతము యావత్ప్రపంచమును గుడిపివైచినది' యని పాశ్చాత్యదేశములందుఁగూడఁ బొగడ్తఁ గనిన వేదాంతకేసరి 'వివేకానందస్వామి' జగన్మోహనముగ సింహగర్జన మొనరించినపిమ్మట, బరాత్పరసందర్శనైకలాలసత్వమున, నవయౌవనభోగభాగ్యములను, నున్నతోద్యోగములను, దృణప్రాయముగ నిరసించి, భారతీయవేదాంతడిండిమమును దశదిశలుఁ బ్రతిధ్వనించునట్లుల్మ్రోగించి మాతృదేశ సముద్ధరణమునకయియే కాక లోకకల్యాణసిద్ధికై బ్రహ్మానందామృతమును లోకులకుఁ జూఱలిచ్చి, ముప్పదిరెండేండ్లునిండకమునుపే తనధర్మమును నెఱవేర్చి, బ్రహ్మసాయుజ్యము నందిన రామతీర్థుని చరితామృతము. 'న కుతూహలి కస్య మన శ్చరితం చ మహాత్మనాం శ్రోతుమ్' (భట్టబాణునిసూక్తి) అనునట్లు లిట్టిపీరపురుషుని జీవితసుధ నాస్వాదింప నెవరికిఁ గుతూహలము కలుగదు! మహాత్ములజీవితమును బఠించి, వారిసందేశమును మనసారఁ గ్రోలి, యాచరణమునఁ బరిణమింపఁజేసినచో మనము తరింతుమని కదా పెద్దల యుపదేశము. దేశచరిత్ర మనినచో నాదేశమునందలి మహాత్ముల చరిత్రయే యను పాశ్చాత్యతత్త్వవేత్త యగు కార్లైలుపండితుని సిద్ధాంత మాంగ్లభాషావిదులకుఁ గ్రొత్తది కాదు. స్వార్థత్యాగ మొనరించి ప్రపంచకల్యాణసిద్ధికై

యాత్మసమర్పణ మొనరించిన శ్రీశంకరాచార్యభగవత్పాదులు, శ్రీభగవద్రామానుజాచార్యపూజ్యచరణులు, శ్రీమధ్వాచార్యులవారు, శ్రీరామకృష్ణపరమహంస, శ్రీరామతీర్థస్వామి, శ్రీరాజారామమోహనరాయలు, శ్రీచైతన్యస్వామి, శ్రీఅరవిందయోగి మొదలగు మహోదయులచరిత్రములే వారిదేశముయొక్క చరిత్రమగుచుండును. సుకాలమువలె నిట్టిమహాపురుషు లక్కడక్కడ, నెడనెడ మనపుణ్యపరిపాకవశమున నవతరించుచుందురు. ఇట్టివారిలో శ్రీరామతీర్థునిచరితామృతము నాంధ్రపాత్రములోమనభాగ్యవశమున గ్రంథకర్తగారొసంగియున్నారు. కాని మాహిషంబగు పిచ్ఛిలదధితోఁ గలిపిన యోదనమున వడ్లగింజలవలె నీగ్రంథమున సందందు భాషాదోషములు పడినయవి. 'కండ్లు, రాశులు, రామతీర్థ, ద్వారా, ప్రత్యేకతరగతులు, మాంద్యపంకిలము, బద్ధకము, ప్రతి-చోట, లేకంబోలేదు, నవయావ్వన, శలవు, క్రుత్రిమ, ముత్రా(మధురకు) - భావగౌరవమునకుఁ దోడు భాషాసౌష్ఠవము గూడగ్రంథమున నుండవలెను. ఇట్టిదోషలేశములుగుణబాహుళ్యమున, నిందుకిరణములలో నాతని మచ్చంబోలె గణనీయములు కాకపోవచ్చును. ఇట్టిపవిత్రచరిత్రముల నింకను వీరు రచియించి, తమవాణిని ధన్యముచేసికొని పాఠకలోకమును దరింపఁజేయుదురుగాక! రామతీర్థస్వామిజీవితము సంగ్రహముగా నిదివఱలో శ్రీయుత ముదిగంటి జగ్గన్న శాస్త్రిగారిచేఁ బల్లెటూరిగ్రంథ మండలిలోఁ బ్రకటింపఁబడినది. (యా. రా.)

---

10. పాండురంగమాహాత్మ్యము—కర్త ఉభయభాషాప్రవీణ అత్తలూరి సూర్యనారాయణగారు. తెనాలి రామకృష్ణకవి పద్యకావ్యమునకు వచనము. వీ రిదివఱలో నీగ్రంథము నందలి పుండరీకుని చరిత్రమును మాత్రము ప్రకటించి యున్నారు. ఇది సంపూర్ణగ్రంథము. కవిగారు పద్యకావ్యమునకుఁ గడుదాపుగాఁ బదవిన్యాసంబొప్పఁ జక్కఁగ రచియించిరి. పాండురంగమాహాత్మ్యమునందు- కేవల క్షేత్రమాహాత్మ్యమేకాక, మాతాపితృపరిచర్యలఫలమును, అక్రమప్రవర్తనమువలనఁ గలుగు కష్టములును, పతివ్రతామాహాత్మ్యము, బ్రహ్మచర్యగృహస్థాశ్రమముల వివరము, భగవత్కారుణ్యము మున్నగునవి తెలియఁగలవు. విద్యార్థులకీ వచనముభాషాభివృద్ధికిఁ జక్కఁగఁ దోడ్పడఁగలదు.

వీరి తెనిఁగింపుఁ దెలుపుటకై కొంచెము మచ్చుచూపుచున్నాము.

"భోజనాదిపదార్థములకొరకై తన యొడలియందలి సౌడవ్రలను లజ్జ

వొందక వైశ్యునియింటఁ గుడువయుంచును. మాతృభూషణంబులఁ గ్రమక్రమంబుగ నపహరించు, జనకునకు లోకులవలన రాఁదగిన ఋణపత్రంబులఁ దొంగిలించి, ఋణగ్రహీత లొసంగినంత మాత్రమె కైకొని వాని నొసంగును. ఎంత హెచ్చువడ్డియైననోర్చి సాహుకారులనుండి ఋణము గ్రహించును. మాన్యములను ధాన్యమును గ్రామమిరాశీలను దాకట్టుభూములను దగువారల కమ్మఁజూచును. ఇవ్విధంబున స్వేచ్ఛావిహార మొనరించు నాతఁడు ముం దేవిధంబునం బ్రవర్తిల్లు వాఁడో దేవుఁడే యెఱుంగును—పుట 51.

ఈపాండురంగమాహాత్మ్యము- ప్రకృతమున సర్వత్రసామాన్యముగఁ బ్రబలియున్న పాండురంగవిఠలుఁడను పండరినాథుని చరిత్రము. భాషాభిమానులేకాక భక్తవర్యులుం జదువఁదగినది.

వెల 0-12-0 ఇదియేకాక- ఆంధ్రనైషధసారమును గుణమణి మున్నగు గ్రంథములుగూడఁ గవిగారియొద్ద గుంటూరుజిల్లా, ఈమనిగ్రామమున దొరకును.

---

# తాళపత్త్రగ్రంథస్వీకారము.

---

బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులుగారు పరిషత్తునకీక్రింది తాళపత్రగ్రంథముల నొసంగిరి. మేము వానిని వందనపూర్వకముగా స్వీకరించుచున్నాము.

1. నీలకుంతలవిలాసము—తులగాన నీలకంఠకవి.
2. కుముద్వతీపరిణయము—బొమ్మిడి వీరయకవి.
3. సునందాపరిణయము—చింతకుంట కోదండరామకవి.
4. కృష్ణార్జునసంవాదము—పుట్టిపాక ఓబయకవి.
5. సీతారామచరిత్రము—మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి.

ఇందుఁ గుముద్వతీపరిణయము— మేంక అప్పనృపాలునకుఁ గృతియీయఁబడినట్లుగలదు. రాఁబోవుసంచికలో గ్రంథవిషయమును గృతికర్త, కృతిభర్తల విషయము మున్నగునవి వివరించి వ్రాసెదము.

---

క. "రాజ!" భవదీయుఁడైన త,నూజునకు న్శుభము నోజ నూల్కొను విద్వ
ద్రాజికి ధనదానము ని,ర్వ్యాజమునం జేయు మిహపరంబులు గలుగున్. ౩౦౫

వ. అని యిట్లు చతుర్థపద్యంబుఁ జదివినఁ జతుర్థం బగు రకారంబుతోఁ నవ్వికా రంబునుం బాసి బాలుండు తండ్రికి మ్రొక్కి మిత్రద్రోహ లక్షితం బగు ఋక్ష వ్యాఘ్రవృత్తాంతం బంతయుం జెప్పిన నచ్చెరువు మెచ్చునుం బిచ్చలింప నవనీ పతి జవనికవంకఁ జూచి. ౩౦౬

గీ. పిన్నదాన విచట నున్నదానవు తల్లి, యింటి వాకిలియును నెఱుఁగ వీవు
కానలోనఁ బులియు మానిసియు నెలుంగుఁ, దొడరు చేఁత లెట్లు తోఁచె నీకు.

వ. అనుడు నతం డింకఁ దాఁపం బని లే దని తలంచి. ౩౦౭

క. భూనాయక! భూసురకృప, నానాలుక నొప్పు వాణి నానాదృథవి
జ్ఞానమునఁ దెలియు నన్నియు[1], భానుమతీదేవిమచ్ఛభంగి న్సవిలోన్. ౩౦౮

మ. అనినన్ దిగ్గన లేచి చూచి తెరలో నాచార్యుఁగా నిశ్చయిం
చి నరేంద్రుం డతి హృష్టుఁ డౌచు సచివుం జేపట్టి నీయట్టి బం
ధునిధానం బిఁక నొండు గల్గునె గురుద్రోహంబుఁ దప్పించి యెం
దును బాపంబును బొందకుండ నను ధన్యుం జేసి తీనేర్పునన్. ౩౦౯

క. ప్రణయము దప్పక యాబ్రా, హ్మణహత్య దొలంగ రాజ్య మలరఁగ సుతుదు
ర్గుణములు విడిపించితి నీ, గుణములచే నన్ను జట్టిగొంటివి చుమ్మీ. ౩౧౦

వ. అని గ్రుచ్చి కౌఁగిలించుకొని తనపట్టిచెట్ట పట్టుకొని పుణ్యాసుల భానుమతియగు భానుమతియుం దానును గురు డగ్గఱి. ౩౧౧

క. ఎల్లవిధంబులఁ జూచినఁ, దల్లియుఁ దండ్రియును నీవె దయసేయుము మా
కల్లలు లోఁగొని మము నీ,నల్లిలుగఁ జూడు మనుచు నరపతి మ్రొక్కెన్. ౩౧౨

శా. ఈచందంబున మ్రొక్కి యందలముఁ దా నెక్కించి భూమీవరుం
డాచార్యుం గొని వచ్చి గద్దియపయిన్ హర్షంబుతో నుంచి శి
ష్టాచారంబునఁ బూజచేసి తనరాజ్యశ్రీ సమర్పించి త
ద్వాచాదత్తముగాఁగఁ గైకొని ప్రసాదం బంచు నేలె న్భువిన్. ౩౧౩

మ. అని మంత్రీంద్రుఁడు చెప్పిన న్విని కథాహ్లాద ప్రసన్నాత్ముఁ డై
జననాథుండును మంత్రి లేనిపని మోసం బంచుఁ జేపట్టి యె

---

1 జ్ఞానముఖంబున వెలయున్.

య్యన సత్త్వాఢ్యులచేతఁ బుష్పకనిభం బౌ దివ్యసింహాసనం
బనువొందం గొనిపోయి నిల్పె నిజహర్మ్యంబైన ధారాపురిన్. ౩౧౫

ఉ. శంభుముఖాంబుజార్క దృఢసారవరాహశరీరవశ్యవి
శ్వంభరు శాంభవీవరదు సంభృతరక్షణు సర్వలోకకు
క్షింభరు సిద్ధసాధ్య సుర కిన్నర పన్నగ గీతకీర్తివి
శ్వంభరు జంభవైరిసహసంభవు దృష్టవపుర్విజృంభణున్. ౩౧౬

ఉ. శంకితకింకరవ్రజవశంకరుఁ బంకజనేత్రమిత్రు న
ర్భంకమకాంతిసంకులకపర్దవిభూషితభవ్యదివ్యకూ
లంకషు నిష్కళంకితవిలాసకలాపధురీణు శౌర్యస
ర్వంకషవైభవాంకితవశంకరు శంకరు లోకశంకరున్. ౩౧౭

మాలిని. పరమకరుణలీలా భక్తలోకానుకూలా
పరిచితసురరక్షా భగ్నదైతేయవక్షా
సరసిజహితనేత్రా సచ్చిదానందగాత్రా
హరిహరమయ రూపా యోగయోగస్వరూపా. ౩౧౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీరఘోట్టవిభాళాది బిరుదప్రకట చారిత్ర కళింగదేశ నిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాలరూప నూపురసుందర చరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాఁటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఱవివెన్నయామాత్యపౌత్ర హారీతసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజ విరచితం బైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందుఁ బార్వతీపరమేశ్వరానోన్యప్రశ్నోత్తరంబులును భర్తృహరి వైరాగ్యంబును విక్రమార్కుని రాజ్యసాయుజ్యంబులును, శాలివాహన విజయంబును భోజునికి సింహాసనప్రాప్తియు మంత్రిగుణప్రశంసయు నందోపాఖ్యానంబును నన్నది కథావతారిక ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరామాకుచశైలవిహారుని మునిహృదయగహ్వరాశ్రయుని మహా
దారుణనఖదారితరిపు, వారణనరసింహు నిగమవనసంచారిన్. ౧

క. మనమునఁ దలఁచుచు విద్వజ్జనదైవజ్ఞాది సర్వజనసమ్మత మా
దినమున భోజుఁడు సింహాసన మెక్కం గడఁగె రాజ్యసంపద మెఱయన్. ౨

సీ. ధారాపురంబులోఁ దారాపథమువోలు రత్నమండపములో యత్న మమర
నిర్మైనపసిఁడికంబమ్ముల మేడలో దివ్యసింహాసనస్థితి యొనర్చి
యవరోచనాజ్యదూర్వామ్రపల్లవపుష్పసిద్ధార్థదధిఫలక్షీరములును
నాదిగాఁ బెక్కు పుణ్యద్రవ్యములు గూర్చి పుణ్యాహమున భూమిపాలుపుదీర్చి[1]
దేవతరువుమాడ్కిఁ దెల్లనిగొడుగుతోఁ, గూడఁ బసిఁడికామకుంచె లచట
నిలిపి పొంతఁ గైదువులు సేర్చి యర్చన, లిచ్చె నుత్సవంబు పిచ్చలింప. 3

వ. తదనంతరంబ నానాపురాణేతిహాసశ్రవణంబులను బంచమహావాద్యప్రపంచంబులను సంగీతసాహిత్యసంగతనాట్య ప్రసంగంబులను బ్రతియామదీయమాన ధూపదీపాదినైవేద్యమహోపచారంబులను దత్పరివారదేవతలకు నృఘబృంహణంబుగా సేమం బగునేమంబున నారాముండునుం బోలె నాయామినిం గడపి మఱునాఁడు కృతమంగళస్నానుం డై ప్రత్యూషనిత్యకృత్యంబులు నిర్వర్తించి యప్పుడు మకరతోరణంబులునుం దెలిముత్తియంబుల తోరణంబులునుం గలువడంబులు, బలికూటంబులు మేలుకట్లునుం జీరగుండ్లును మృగనాభిలేపనంబును, ముక్తాఫలరంగవల్లికలును వెల్లివిరియ నుల్లంబుల నుల్లసిల్లుపౌరులును నానాదిగంతాగత విద్వజ్జన జ్యోతిషిక శాకునిక స్వరవేదులును వందిమాగధబృందంబులును బసిండి పళ్లెరంబుల మాణిక్యదీపంబులతో నివాళింపుచున్న పుణ్యాంగనలును హిత రాజలోకబంధువర్గంబునుం దలకొన జయ జీవ వర్ధస్వ సుఖీభవాది శుభసూచకశబ్దంబులును బహువిధవాద్యరవంబులును, నొక్కటై దిక్కులుపిక్కటిల్ల మిక్కుటంబుగా సుముహూర్తంబున సర్వతోముఖంబగు మహాసింహాసనంబు డగ్గఱి ప్రదక్షిణంబుగాఁ దిరిగి చూచి తత్తద్వారంబుల కడల నున్న బొమ్మలతలకడల నున్నపిన్నగద్దియలలో నొందేని నడుగిడి పెద్ద

---

1 పులితోలుపైభూతి చెలువుదీర్చి.

గద్దియ యెక్కుట భావ్యం బని వారశూలరహితంబుగా నొక్కదిక్కున నిలిచి సకలజనకలకలంబు నుడిపి మౌహూర్తికసావధానశబ్దంబు లాలయ నిష్టదేవతలం దలంచి ప్రశస్తఖడ్గహస్తుం డై పూర్ణఘటికోచితనాదావసరంబు నెదురు చూచుచుండ. ౪

—: మొదటిబొమ్మకథ :—

క. మును గడియారంబునఁ గట్టినపెనుజేగంటరవము శేయను నెడ గ్ర
క్కున భోజుం డడుగెత్తినఁ, గని నిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలికెన్. ౫

చ. పలికిన భోజుఁ డద్భుత మపారముగా మది నిండి పాఱఁగా
నిలిచి గతజ్ఞ తద్జ్ఞ ధరణీసుర మాగధవందిగాయకా
కలకల మెల్ల మాన్చి శుభకాలములో నిది యెక్కఁ బూనఁగా
వల దన నేల యిందుల నివారణకారణ మేమి నావుడున్. ౬

మ. తనవాక్యంబులు తత్సభాజనుల కుత్సాహంబు నాశ్చర్యముల్
పెనఁగొల్పంగఁ బసిండిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె నో
జననాథా విను చంద్రగుప్తనృపసంజాతుండు కంజాతమి
త్రనిభుం డుజ్జయినీపురం బరఁగె నేతత్కర్త సత్కీర్తితోన్. ౭

వ. ఆయనఘునత యెట్టి దంటేని- ౮

క. సిద్ధులకు నసాధ్యము లగు, సిద్ధులు నెనిమిదియుఁ దనకు సిద్ధంబులుగా
నిద్ధరణిఁ బౌరుషమునఁ బ్రసిద్ధుం డగు సాహసాంకుఁ జెప్పం దరమే. ౯

శా. సంభూతాన్యవిడంబడంబరమిథఃసంరంభగర్వోర్వశీ
రంభానాట్యవిజృంభమాణమతివిస్రంభాదిశుంభన్మనో
జంభారిప్రియసంభృతానకమహాసంభావనాసంభవా
స్తంభోదర్కుఁడు విక్రమార్కుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్. ౧౦

క. అతిశయవితరణగుణమున, నతనికి సరిరాక యెక్క నలవియె నీకుం
గ్రతువులు నూఱును జేయక, నితరుల కమరేంద్రపీఠ మెక్కం దరమే.[1] ౧౧

క. అనవుడు భోజుఁడు విస్మయ,మును సిగ్గు నహంకృతియును ముప్పిరిగొన ని
ట్లనియె నొకయర్థి వేఁడినఁ, దనియఁగ సహపాదలక్షధన మే నిత్తున్. ౧౨

క. నావితరణ మిది యల్పమె, నావుడు నది నవ్వి తనగుణం బన్యులకుం
దా వినిపించుట కొఱఁతగ,దా వివరము తప్పి తీవు ధరణీనాథా! ౧౩

1 మెక్కుటగలదే.

క. ఇది మొదలు కొఱఁత యయ్యెం, దుదిఁ బుణ్యము హానిఁబొందె దొడ్డతనంబుం
జెదరెం దనుఁ దాఁ జేర్కొను, టిది కష్టము తొంటినీతి యెఱుఁగవు చుమ్మీ. ౧౪

ఉ. ఆయువు మంత్ర మౌషధము నర్థము దానము మానభంగ మ
న్యాయము నర్థనాశము గృహవ్యసనంబును దాఁపురంబుగాఁ
జేయుట నీతియుక్త మటుసేయక తా నయి దానధర్మముల్
చేయుమనంచుఁ జెప్పినను నీయని నవ్వరె ధర్మ మెంచరే. ౧౫

క. ఈసమయమునకుఁ దగ నితి, హాసము గల దొకటి వినుము హరిదశ్వకులో
ల్లాసకరుఁ డయోధ్యాపుర,వాసి సుదర్శనుఁ డనంగ వసుమతి నేలెన్. ౧౬

చ. అతఁడు సపాదలక్షవసుధామరపఙ్క్తికి భోజనంబు సు
వ్రతముగఁ బెట్టుచుం దివిజవర్గము మిక్కిలిఁ దుష్టిఁ బొందఁగాఁ
గ్రతువులు పెక్కుసేయుచు జగన్నుతుఁడై సరయూతటంబునం
గతిపయవాసరంబు లధికం బగుసత్ర మొనర్చుచుండఁగన్. ౧౭

క. శారద వీణావాద్యవి,శారద తగుమూప మైనచందము మెఱయన్
శారదనీరదనిభుఁ డగు, నారదముని చేరవచ్చె[1] నరపతిఁ జూడన్. ౧౮

క. వచ్చినమునిఁ గనుఁగొని యిటు, విచ్చేయుం డనుచు మ్రొక్కి విభుఁ డుచితార్ఘ్యం
బిచ్చి కృతాంజలియై నే, సచ్చరితుఁడ నైతి మీప్రసాదము కలిమిన్. ౧౯

గీ. ఎచటినుండి యిటకు నేతెంచితిరి నన్ను, ధన్యుఁ జేయ నన్నఁ దపసి వలికెఁ
బరమధర్మశీల బ్రహ్మలోకమున నీ, దానధర్మవార్తఁ దడవ వింటి. ౨౦

చ. విని నినుఁ జూడ వచ్చితి భువిం గడుఁ బుణ్యుఁడ వంచు నన్న నో
మునివర శిష్యుఁగాఁ దలఁచి ముద్దునఁ బల్కెద వెంతవాఁడ నే
ననుచు వినీతుఁ డైనఁ గొనియాడి గుణాఢ్యుఁడ వీవు నీయశం
బనఘచరిత్ర బ్రహ్మభువనాంతము ముట్టిన దింత చాలదే. ౨౧

క. విశదమగు కీర్తివసనము, కృశరక్షక! సప్తతంతుకృత మయ్యుఁ జతు
ర్దశభువనంబులఁ గప్పెను, వశమే నినుఁ బొగడ శేషవాణీశులకున్. ౨౨

వ. కావున నీ కసాధ్యంబు లే దె ట్లన్న. ౨౩

క. ధాత్రీశ పుణ్యనిర్మల,గాత్రులకును జగములో నగమ్యము గలదే
క్షత్రియపుత్త్రుఁడు విశ్వా,మిత్త్రుఁడు బ్రహ్మత్వపదవి మేరల మీఱెన్. ౨౪

క. స్వకులోచితధర్మముఁ ద,ప్పక మనువారలకు వలయుపని దుర్ఘటమే
ప్రకటంబుగ ఋషిపత్నులు, సికతాకలశముల జలము చేసుపుగొనరే. ౨౫

1. వచ్చె నపుడు నరపతిఁజూడన్.

వ. దీనికి దృష్టాంతంబుగ నీవుకు దీనం గుండఁ జేసి నీరు నించిన నిలుచు నని యిసుక
చేతి కిచ్చిన నృపాలుం డందుకొని. ౨౬

క. అటు చేసినఁ జిత్రము మిక్కుటముగ నాదానధర్మగుణసిద్ధునిచే
ఘటితరస మైనసికతా,ఘటి యొప్పెను రసము ఘుటికగట్టినభంగిన్.[1] ౨౭

క. కృతిఁ గుండలు నిలిచిన స,త్కృతిఁ గనుఁగొని నారదుండు దినమును నీ వీ
గతిఁ బుణ్యకీర్తి వెలయిం,పు తపోనిష్ఠలను వెలసి పుణ్యవిచారా. ౨౮

వ. అని యుపదేశించి చనిన. ౨౯

గీ. ఇట సుదర్శనుండు నీమట్టికుండల, నిచ్చ వండిపెట్ట మెచ్చుగాదు
మంటఁ జేసి మొదలి వంటనే కఱిగొన్న, దానఁ దొలుత వండఁ దగుట యెట్లు.

మ. అని మృద్భాండము లెల్ల మాని సికతాయత్తంబు లౌ కుండలన్
ఘనుఁ డాపాయసశాకసూపముల పాకం బెప్పుడుం జేయుచుం
దనియన్ బ్రాహ్మణభోజనంబు లిడుచుం దానొక్కనాఁ డప్పదా
ర్థనికాయంబులు వండుచోటఁ జని తత్సామగ్రి వీక్షింపఁగాన్. ౩౦

క. వెస లుడుకం గని నృపుఁ డు,బ్బసమున నే నిట్టిఘనత వడసితి ననఁగా
నిసుమునఁ జేసినకుండలు, విసవిసలై విరిసెఁ బుణ్యవిపరీతగతిన్. ౩౧

క. ఉలికి యతం డప్పుడు మదిఁ, గలఁగుచు నిటఁ గల్మషంబు గలసెనొ తగు వి
ప్రులయెన్నిక గూడదొ హా,తలు మాత్రముఁ దప్పిరొక్కొ ధర గద లెనొకో.

మ. అని యుత్సాహవిహీనుఁ డౌచు నతిచింతాక్రాంతుఁ డై యుండఁగాఁ
దనయిచ్చ న్మని తొంటిచాడ్పున వియద్భాగంబు శోభిల్ల వ
చ్చినఁ బూజించి మునీంద్ర నామహిమకుం జేటయ్యెఁ బో నీవు చె
ప్పినమర్యాదయు నెట్లు దప్పె ననినం బ్రహ్మర్షి బోధించుచున్. ౩౪

క. మర్యాదఁ దప్పెఁ జిత్తవి,పర్యాసాహంకృతులను బార్థివ "గర్వా
త్కార్యం వినశ్యతి" యనుచు, నార్యులు మునుచెప్పునీతి యదితప్పగునే. ౩౫

క. పర్వతపథమున రథమును, బర్వస్త్రీసంగమమున బ్రహ్మవ్రతమున్
గర్వమున ధర్మకార్యము, నుర్వీభాగమున నావయు న్నడవ దనా. ౩౬

---

1. ఉ. ఆగతిఁ గుండ నిల్చిన ధరాధిపుఁ గన్గొని నారదుండు నీ
వీగతిఁ బుణ్యకీర్తి వెలయించుచు నిచ్చలుఁ దీర్ప సత్ర ము
ద్యోగములేక చేయు మని తెల్పి వియద్గతి నేగె నంతలోఁ
ద్యాగము భోగముం దగుసుదర్శనుఁ డచ్చటఁ దాను మెచ్చుచున్.
గీ. క్రొత్తకడవ దెచ్చుకొని వండి మఱి దాని, మీఁద వండిపెట్ట మెచ్చు గాదు
మంటఁ జేసి మొదల మంటనే కఱిగొన్న, దానఁ దొలుతవలెనఁ దగుట యెట్లు.

క. ఇంతమహిమ వడసితి నని, సంతసమున నీవు రాజసము గైకొన్నన్
సంతతముఁ జేయు సుకృతం, బింతయు నిట్టింకె నింక నే మనవచ్చున్. ౩౮

ఉ. నావుడు భూవరుండు మునినాయక నే నపరాధి నైతి నేఁ
డావిధ మేక్రియం గలుగు నానతి యి మ్మని మ్రొక్కినంత నా
దేవమునీంద్రుఁ డి ట్లనియె ధీరుఁడ వై మది నుబ్బు లేక భూ
దేవసపాదలక్షఁ బరితృప్తి యొనర్పుము భుక్తిముక్తులన్. ౩౯

క. బహుదినములు జరపఁగఁ ద, న్మహిమయుఁ జేకూరు నింక మనమున గర్వా
గ్రహము వల దనుచు శుభ మొం, దహితంబుగఁ జెప్పి నారదుఁడు సనినంతన్.

క. తాఁకిన మఱి వంగినక్రియ, నాఁకొని వడివడుకొన్న యనువున నృపుఁడుం
దేఁకువ సెడి తొల్లిటివ్రత, మాకొలఁదినె నిత్యసత్ర[1] మచ్చట జరిపెన్. ౪౦

ఉ. కావున నేన దాత నని గర్వము గైకొని ప్రల్లి నీ వన
ద్యాభవుఁడ వైతి దానమును బౌరుషముం బరు లెన్నకుండఁగాఁ
దా వినిపించెనేనియు నతండుఁ దృణంబును నొక్కయె త్తగున్
త్మావర గంజిలో మెతుకు గల్గినఁ గ్రొవ్వట నీమహత్త్వముల్. ౪౧

గీ. అనుడు ఘనుఁడు భోజుఁడును మనంబున న్సిగ్గి, బమ్మరిల్లి పసిఁడిబొమ్మ! నాదు
దానమల్ప మన్నదానవు మీరాజు, దానమెంత చెప్పు దాన నిలుతు[2]. ౪౨

వ. అనిన సాలభంజిక యి ట్లనియె నతం డిట్టి మహావదాన్యుండు. ౪౩

క. పొడగన్నంతనె వేయును, నొడివినఁ బదివేలు నగిన నూర్వేలు మనం
బొడఁబడి మెచ్చినఁ గోటియు, నడిగెడువారలకు నిచ్చు హాటకమయముల్.

మ. అది యెట్లన్న నతండు కీర్తి దిశలన్ వ్యాపింప భూమండలం
బుదధు ల్మేరగ నేలుచుండి యొకనాఁ డుర్వీశులు న్మంత్రులున్
సుదతీరత్నములున్ రసజ్ఞులుఁ గవిస్తోమంబులుం గొల్వ న
త్యుదయశ్రీఁ గొలువిచ్చి యుండఁగఁ గవీంద్రుం డొక్కఁ డేతెంచుచున్. ౪౫

[3]సీ. దందశూకాధిపోద్దండభుజాదండభూరివిశ్వంభరాభారధుర్య
జంభారిపరికీర్తితాంభోజినీమిత్ర[4]సూనుసమాహితదానరాయ

---

1 మాకొలఁదినె నిత్యసత్ర మచ్చట—చిన్నయసూరి గారి పాఠము. మాకలసత్రంబుభంగినచ్చట—ఇతరప్రతులలో—2 దాన మెంత నీవు దానఁదెలుపు. చి. సూరిగారు. దానమెంత నేర్పు—3. ఈపద్యములోని ప్రాకృతభేదములు తెలియవచ్చుటలేదు. పద్యములోని తప్పొప్పులు తెలియలేదు. ఎవ్వరియొద్దనైనఁ బ్రతియున్నచో దిద్దిసవరించి మాకుఁబంపఁ బండితులం గోరెదము. 4. యంభోరుహిణీమిత్ర.

అక్షీణహృదయ దండాక్షకేళఃక్షేళిపతివఃకణీవళఃప్రకడక్ష
అంకక్షరిక్షమహాలదసాందన లవలవప్పహిత తులఃకధీర
ధీరసంపదస్తు దేవబంధకహిమ[1], దఃకస్తాక్షు మోాదర్శనిచయ
యనుచు నాల్గుభాషలను రాజు దీవించి, నయనసంజ్ఞ నాసనమున నుండి. ౮౭

సీ. రాజేంద్ర యాఅక్షరముల పేరిటివాఁడ నాద్యక్షరము మాన నశ్వవేది
రెండక్షరములఁ బరిత్యజించిన నాట్యకర్త మూఁడుడిపిన గతవిదుండ
నాలుగు నుడిగింపఁ జాలనేర్పరి నైదు విడిచిన బుధుఁడ నీవిధము గాక
సర్వాక్షరంబులుఁ జదివిచూచిన బుద్ధి బలముగాఁగల యట్టి ప్రౌఢుఁ డనఁగ
నేతిబీఱకాయనీతి గాకుండఁగ, నిన్నివిద్యలందు నెన్నఁబడ్డ
సార్థనాముఁ డైనయర్థిగా నెఱుఁగుము, విబుధపంకజార్క విక్రమార్క. ౮౮

గీ. అనినఁ గ్రమ్మఱఁ జదివించి యల్లనవ్వి, ధరణిలో నీవు "చతురంగతద్జ్ఞ" సంజ్ఞఁ
బరఁగి నాఁడవయనుఁడు భూపాలుఁ బొగడి, యెలమిఁ జతురంగతద్జ్ఞకవీశ్వరుండు.

క. ఇది తగుఁ దగ దనక కళా, విమలకు నీసమ్ముఖమున విద్యలయెఱుకం
బొదపెట్టుట హనుమంతుని, యెదుర వెసం గుప్పిగంతు లెగయుటచుమ్మీ.[2]

ఉ. అంబుజమిత్రతేజ భవదగ్రకరప్రసృతంబు లైన దా
నాంబువులందుఁ బుట్టి భువనాంతము నిండుచుఁ గీర్తిపుండరీ
కంబు ప్రతాపసూర్యుఁడు వికాస మొనర్పఁగ నాకసంబు భృం
గంబుగ లోనఁ బూని యధికం బగువాసన నొప్పు నెప్పుడున్. ౯౦

క. అని చెప్పినపద్యములోఁ, దనకీర్తివ్యాప్తియుం[3] బ్రతాపస్ఫురణం
బును గని భాండాగారికుఁ, గనుసన్నం బిలిచి మెచ్చుగా నాతనికిన్. ౯౧

క. ధనమిప్పించె విలోకన, మునకుం బలుకునకు హసితమునకుఁ గవికి వే
యును బదివేలును లక్షం, బును గోటియుఁ బసిఁడిటంకములు చొప్పలుగాన్.

క. ఘనుఁడు కవి పీడుకొని యొ, య్యనభాండాగారిఁ బిలిచి యర్థి ననుం జూ
చినఁ బలికించిన నవ్వం, చిన మెచ్చించినను నిట్లు చెప్పక యిమ్మా.[4] ౯౩

చ. అని సెలవిచ్చినన్ ధనగృహస్థితుఁ డా తనలెంక యిట్టిచో
ప్పున నొసఁగంగ యాచకులు భూజనకల్పమహీజ మంచు నిం
పునఁ బొగడంగ దానగుణభూషణుఁ డంచు నవంతినాయకుం
డనుదినమున్ యశంబు దిశలం దలర న్మహి యేలె నెంతయున్. ౯౪

1. దేవబంధకహాోదు 2. గుప్పిగంతులేయుటచుమ్మీ. 3. దనకీర్తియుంవ్యాప్తియుం. 4. చినఁ బలికించిన మెచ్చిం చిన నిట్లని నీవు నాకుఁ జెప్పకయిమ్మా.

# రసార్ణవాలంకారము.

## ద్వితీయపరిచ్ఛేదము—"గుణోపాదానము."

---

నిరుష్టమైనను గావ్యము గుణయుక్తముకానిచో సాధువుగానెంచఁబడదు. 1. †నిరుష్టస్యాపి కావ్యస్య గుణోపాదాన మంతరా
శాస్త్రార్థ ◆ ◆ లాలోకః సాధుత్వం నా నుమన్యతే

2. నహి కుష్ఠాదిభి ర్దోషై రహితం కామినీవపుః
నృత్తగీతాదిచాతుర్యగుణాన్ [నాద్రియతే] క్వచిత్.

శబ్దగుణము లిరువదిరెండు. 3. తేషు శబ్దగుణా స్తావత్ ద్వావింశతి రుదీరితాః
తే చ సాన్వయనామానో నిగద్యన్తే మనీషిభిః.

4. శ్లేషః ప్రసాదః సమతా మాధుర్యం సుకుమారతా
అర్థవ్యక్తి స్తథా కాన్తి రుదారత్వ ముదాత్తతా.

5. ఓజశ్చ పున రార్జిత్య మ[థ] ప్రేయః సుశబ్దతా
సమాధిః సౌక్ష్మ్యగాంభీర్యే [సం]క్షేపో విస్తర స్తథా

6. సామ్మిత్యం భావికత్వం చ రీతి రుక్తి స్తథైవ చ
ఏష ◆ ◆ గుణోద్దేశో నిర్దేశోఽత్ర నిగద్యతే.

1. శ్లేష. 7. యత్ర బద్ధోఽతిసంశ్లిష్టః స శ్లేషః కవిభిః స్మృతః

2. ప్రసాదము. ప్రసిద్ధార్థపదన్యా[సాత్ ప్ర]సాద ఇతి కీర్తితః

3. సమత. 8. బద్ధో మృదుస్ఫుటోన్మిశ్రవర్ణజన్మా న సజ్జరః
భజతే యత్ర సోద్భేదం తత్సమత్వ ముదీర్యతే.

4. మాధుర్యము. 9. అర్థోచితవచోబద్ధో మాధుర్య మభిధీయతే

5. సుకుమారత. (సౌకుమార్యము) అకఠోరాక్షరన్యాసః సౌకుమార్య ముదాహృతమ్.

10. ద్వితీయతుల్యా ◆ ◆ నాం సర్వే చాసమయోగినః
సౌకుమార్యేణ బాధ్యన్తే ని [?] విన్దు ర్గురుసంయుతః.

11. రేఫద్వయసమోపేతో నై ◆ ◆ క్వచి దిష్యతే.
న చైకలక్షణన్యాసో బహుషు స్యా న్నిరంతరః.

---

†మాతృకలలో "నిర్దిష్ట" అని కలదు. ఈపాఠము సందర్భోచితముగా లేదు. కావున "నిరుష్ట" అని మార్చఁబడినది. [యా. రా.]

12. నారా దేకోఽపి బహవో వినా చిత్ర ♦♦ ధనాత్ [?]
స్వయం రేఫో మృదుః కింతు కఠోరయతి యోగినామ్.
13. అన్యోన్యమృదుసంయోగః స్వల్పో దోషాయ[కల్ప]తే
కాఠిన్యలక్షణా తత్ర హన్తుం యుక్త్యాపి శక్యతే.
14. అతిప్రసఙ్గదోష స్తు ప్రతీత్యైవ నిరస్యతే
అ[యమేవ] స్వరాద్ధాంతః పూర్వమే వావలమ్బితః.

6. అర్థవ్యక్తి. 15. అర్థవ్యక్తింతువిద్వాంసః ప్రాహుః సంపూర్ణవాక్యతామ్
7. కాంతి. బన్ధస్యో ♦ ♦ ♦ కాన్తిః స్ఫురణా దభిధీయతే.
8. ఔదార్యము. 16. వదన్తి బన్ధవైకట్య మౌదార్యం కవిపుంగవాః
9. ఉదాత్తము. శ్లాఘ్యైర్వ[శేషణై ర్యుక్త ము] దాత్త మితి తద్విదః.
10. ఓజస్సు. 17. ఓజస్సమాసభూయస్త్వం తద్ [ద్వంద్వా?] పదపద్ధతిః
11. ఔర్జిత్యము. బన్ధగాఢత్వ మౌర్జిత్యం సమాసే వ్యాస ♦ ♦ చ
12. ప్రేయస్సు. 18. ప్రేయోర్థపదవిన్యాసః ప్రేయః కవిభి రిష్యతే
13. సుశబ్దత. యా సుబన్తతిఙన్తానాం వ్యుత్పత్తిః సా సుశబ్దతా.
14. సమాధి. 19. సమాధిర్[అన్యథ]ర్మస్య భవే దన్యత్ర రోపణమ్
15. సౌక్ష్మ్యము. సౌక్ష్మ్య మాహు స్తు శబ్దానా మంతఃసంజల్పరూపతామ్.
16. గాంభీర్యము. 20. ధ్వనిమత్తా తు గాంభీర్య మార్యైర్[ఏష]గుణః స్మృతః
17. సంక్షేపము. అభిధానం సమాసేన సంక్షేపః పరికీర్తితః.
18. విస్తరము. 21. వ్యస్తం విస్తార ఇత్యాహు రభిధానవిశారదాః
19. సమ్మితత్వము. యావదర్థపద[త్వం హి]సమ్మితత్వం నిగద్యతే.
20. భావికత్వము. 22. భావాభివ్యంజకా వాణీ భావికత్వ ముదాహృతమ్
21. రీతి. ఉపక్రమస్య నిర్వాహో రీతి రిత్యభిధీయతే.
22. ఉక్తి. 23. [వినా?]న్తరేణ చార్థస్య భణనా దుక్తి రిష్యతే
ఇరువదిరెండర్థగుణ ఏతేఽప్యర్థగుణా స్తద్‌జ్ఞైర్ద్వావింశతి రుదాహృతాః.
ములలక్షణము. 24. తేషాం[చ ల]క్షణం బ్రూమ స్తత్సద్భిః పరిభావ్యతామ్
శ్లేష. సపిధానసుసూత్రత్వం(?) తేషు శ్లేషోఽభిధీయతే.
ప్రసాదము. 25. యత్ర ప్రకట ఏవార్థః స[ప్రసా]దో గుణః స్మృతః
సమత. అవైషమ్యం క్రమస్థానాం సమ తేతి సతాం మతిః.

మాధుర్యము. 26. క్రోధా దవాప్య తీవ్రత్వం మాధుర్య మభిధీయతే
సౌకుమార్యము. మ[నోజ్ఞతా]పదార్థానాం సౌకుమార్య ముదాహృతమ్.
అర్థవ్యక్తి. 27. అర్థవ్యక్తిః పదార్థానాం స్వరూపకథనం విదుః
కాంతి. ఉద్దీప్తరసతాం కాంతి మాహుమనంతి [విశారదాః]
ఉదారత్వము. 28. ఉదారత్వ మితి ప్రాహు రుత్కర్షం విభవస్య తు
ఉదాత్తత. ధీమద్భి రాశయోత్కర్ష ఉదాత్తత్వ ముదీర్యతే.
ఓజస్సు. 29. ప్రారంభేషు చ సం ♦ ♦ ♦ జః సుకవయో విదుః
ఔర్జిత్యము. రూఢాహంకార తౌర్జిత్య మభంగుర మి హోచ్యతే.
ప్రేయస్సు. 30. ప్రేయః ప్రియపదార్థానా ముపన్యాసః ప్ర[కీర్తితః]
సుశబ్దత. పదై రదుష్టైః కథనం దృష్టార్థస్య సుశబ్దతా.
సమాధి. 31. వ్యాజే నాన్యార్థభజనం సమాధి రభిధీయతే
సౌక్ష్మ్యము. సూక్ష్మార్థదర్శనం సౌక్ష్మ్యం వ్యాహరన్తి విశారదాః.
గాంభీర్యము. 32. శాస్త్రార్థసవ్యపేక్షత్వం గాంభీర్య మితి కీర్తితమ్
సంక్షేపము. బహో రర్థస్య సంకోచః సంక్షేప ఇతి కీర్తితః.
విస్తరము. 33. [విస్తారం]పున రర్థస్య విస్తరం తద్విదో విదుః
సమ్మితత్వము. అనురూపగుణారోపః సమ్మితత్వం త దుచ్యతే.
భావికత్వము. 34. భావయుక్తత్వ మాచార్యై ర్భా[వికత్వమ్] ఇతి స్మృతమ్
రీతి. రీతి మాహుః పదార్థానా ముత్పత్త్యాదిక్రియాక్రమమ్.
ఉక్తి. 35. సంవృతాసంవృతప్రాయ ముక్తి రర్థస్య బోధనమ్
కొన్ని యెడల దోష దోషాణా మపియేషాం స్యా ద్గుణత్వం కారణాత్ క్వచిత్.
ములుగుణములేయగు.
అట్టిదోషములునలు 36. చత్వారింశ త్త దుచ్యంతే తేచ వైశేషికా గుణాః
వదిచెప్పఁబడుచున్నవి.
పదదోషములు:అసాధువు. పదం యాతి గుణీభావ మనుకర్తు రసా ధ్వపి.
37. యథా న బాధతే స్కన్ధో యథా'బాధతి'బాధతే
అనిబద్ధము. తథా ♦ ♦ ♦ ణ దృష్ట మనిబద్ధనిబన్ధనమ్.
కష్టము. 38. శ్రుతే రవల్లభం కష్టం త న్న దుర్వాచకాదిషు
క్లిష్టము. అపి క్లిష్టం గుణా యేష్టం ఝటిత్యర్థప్రతీతికమ్.

అనర్థకము. 39. అనర్థకం న దుష్టం స్యా ద్యమకాద్యుపయోగి యత్
అపుష్టార్థము. సద్భి రిష్ట మపుష్టార్థం ఛందస్సంస్కారకారణమ్.
గూఢార్థము. 40. పదాంతర ప్రతీ[త్యర్థం]గూఢార్థ మపి సుందరమ్
అప్రతీతము. అప్రతీతం తు త ద్విద్యా ద్గోష్ఠీ ష్వేవ గుణావహామ్.
సందిగ్ధము(ససంశయము) 41. సందిగ్ధం ప్రకరణాది విశేషావగ ♦ ♦ [ణః]
యద్వా తథావిధార్థస్య వివక్షాయా మితి స్థితిః.
నేయార్థము. 42. ప్రహేలికాదివాక్యేషు నేయార్థ మపి శోభతే
అసమర్థము. అసమర్థ మపి ప్రాయ ♦ ♦ వేష్టం మనీషిభిః.
అప్రయోజకము. 43. అప్రయోజక మిచ్ఛన్తి జాత్యాదా తద్విదోగుణమ్
దేశ్యము. మహాకవిమతం దేశ్యం లోకోక్తిచ్ఛాయయా గుణః.
గ్రామ్యము. 44. ♦ ♦ ♦ లక్షితం గుప్త మపి గ్రామ్యం న దుష్యతి
సంవీతస్య హి లోకేన న దోషాన్వేషణం క్షమమ్.
45. శివలింగాదిశ ♦ ♦ ♦ స్యా సమ్య క్త్వభావనా
లక్షితేషు చ శబ్దోఽన్య స్తదర్థోఽన్య శ్చ కశ్చన.
వక్రిమ. 46. స్మృతిహేతుత్వయోషం[?]తువక్రిమా[నైవబాధ]తే
నిమగ్నదూషణం యత్తు త న్నోద్భావ్యం మనీషిభిః.
47. కిం తు వైదగ్ధ్య మున్మృద్య జఠరం వ్యాధికోపనాత్
అశ్లీలము. అ[శ్లీల మ]పి సంవీతం గుణ మాహు ర్మనీషిణః.
సిద్ధము. 48. అసభ్య స్మృతిహేతో స్తు సిద్ధ మ ప్యభిధీయతే
పాత్రావస్థావిశేషేణ దో ♦ ♦ మంగళం భవేత్.
49. అమంగళస్మృతే ర్హేతు ర్గుణో సభ్య స్మృతి ర్యథా
ధీమన్తోఽపి నిబధ్నన్తి గౌణవృత్త్యా ఘృ ♦ ♦ ♦
50. క్వచి దాశ్రయసౌన్దర్యా ద్ధత్తే శోభా మసా ధ్వపి
కాంతావిలోచనన్య స్తం మలీమస మి వాంజనమ్.
51. ♦ ♦ వశవిశేషా చ్ఛ దురుక్త మపి శోభతే
నీలం చ పాశ మాబద్ధ మన్తరాలే స్రజా మివ.
52. గుణత్వం పదదోషాణాం దిఙ్మాత్రేణ ప్రదర్శితమ్.

[పదదోషములగుణత్వము సంపూర్ణము.]

---

లనుచు నీరెంటిదాఁకని గలపేళ్లు విశిష్టాన్వయము లనఁ జెలఁగు నింకఁ
గర్తృకర్మార్థము ల్గలిగినక్రియలందు నిన యను ప్రత్యయం బెసఁగుచుండు
వచ్చినవాఁ డన నిచ్చినసొమ్మన మొలఁత చెందిరముప్రామినకుచ మన
వనితలు పసుపురాచినమానికపుతావ నాఁగఁ బండినచేనునాఁ దగు నిఁక
రూఢిగా రాజపేరుం డన దొరబం టనంగ నీదారి నెసంగుఁ బేళ్లు
వహి విశేష్యము పూర్వపదముగాఁ గలకర్మధారయమహాచుఁ జెన్నారుచుండుఁ
జలివేఁడి కనుఁగవ వెలిగప్పుచందునా నీరెండుపేరులదాఁకి నుడులు
పరఁగ విశేషణోభయపదకర్మధారయ మగుచుఁ జెలఁగు రహిఁకి నెక్కఁ
బొరెఁ గాకినలు పన బూఁగ్గచాయ యనంగ సుద్దతెలుపు నాఁగ సొరిది నిది యె
పుడు నుపమానము పూర్వపదమ్ముగాఁ గలకర్మధారయాఖ్యను దలిర్చు
నలువుమీఱఁగ మగపులి యన రాచసింగ మన నీరెండు నామములు లెస్స
యూహింపఁగ నుపమానోత్తరపదకర్మధారయాహ్వయ మయి తనరుచుండు
నప్పయమంత్రి యన్నమరా జబ్బినాయఁడు వేంకటరాయ లనెడి
నామము ల్సంభావనాపూర్వపదకర్మధారయం బగుచుఁ బొల్పారుచుండు
నల సిగ్గుసొమ్మనఁ గొలువుపంట యనంగఁ జనువుధనంబునా జగతిలోన
నలువుగ నవధారణాపూర్వపదకర్మధారయం బగుచు వింతగఁ దగు నిఁక
నేకవద్భావి యనేకవద్భావి యనఁ ద్విగుసమాసములు రెం డగు నెటు లన
ముజ్జగం బిరువంక ముమ్మాఱు ముత్రోవ ముక్కన్ను ముమ్మొన ముత్తర మన
నివి యెల్ల వరుసగా నేకవద్భావి ద్విగుసమాస మగుచు ని ట్లెసఁగుచుండు
నలుదెస లైదు రేక లన ననేకవద్భావి ద్విగుసమాసపద్ధతిఁ దగు
ముదు తెలుంగులలోపలను గనుపట్టిన తిగబహువ్రీహులు తేటపఱుతు
వేవెలుఁగు నలువ వెడవిల్తుఁ డనుపేళ్లు ద్విపదబహువ్రీహివిధము లగుచుఁ
జెలఁగుచు జలికాఁక సెకకంటి యన బహుపదబహువ్రీహి నాఁ బరఁగుచుండు
మేలిమిజాళువాసేలువాఁ డన మతుబర్థబహువ్రీహి యై తగు మఱి
యరయ బహువ్రీహియందె యై యనుచుడి కలవాఁ డనెడిచోటఁ గలిగియుండుఁ
దెల్లనిగొడుగును వెల్లనిబొక్కెము నై ధర్మజుం డొప్పె ననఁగ నింకఁ
దలిదండ్రు లన్నదమ్ములు బావమఱఁదులుఁ బిన్నపెద్దలనెడిపేరు లెల్ల
నొగి నితరేతరయోగవద్ద్వంద్వసమాస మగుచు నొప్పు మఱియుఁ దోఁట
దొడ్డిగనులు తొత్తుదొడుకుబంటు లనుఁగుగుజ్జుమొద్దు లనఁగ గొఱ్ఱెమేఁక

బట్టె లనఁగఁ జెర్వుపాడిపంట లన *సమాహారద్వంద్వ మగుచు వెలయు
నారయంగ సముచ్చయద్వంద్వముల యుదంతములపైని నుకార మమరుచుండు
హరియును గిరియును నలరు నన్నట్టులు రమయును నుమయును నమరును రనఁ
దగు నర్థమునుగూర్పు ధర్మంబునొనరింపు మవనీతలంబున ననువహింనిఁ గ్రి
యాద్వంద్వసంబంధ మన్వాచయద్వంద్వ మనఁగ రాజిలు దీనియవల నింక
వాసిగాఁ దెలివిడి సేసెద నవ్యయీభావసమాసము ల్బాళిఁ గనుఁడు
కడు నిమ్మకాయంత కాసంత గోరంత యిసుమంత దోమంత యేనుఁగంత
చీమంత యన నివి నామపూర్వపదసమాస మగుచు నిట్లు మంతు కెక్కుఁ
గొనకొమ్మ తుదమ్రాను మునిమాపు నడురేయి రాయంచ కడసంజ రాచిలు కన
మునివ్రేళ్లు మీఁగాళ్లు ముంజేయి కొనఁగోరు క్రీఁగడు పనఁగ నీలాగు మఱియుఁ
గడకన్ను లోఁదొడ పెడతల యనఁగ నవ్యయపూర్వపదసమాసాఖ్యఁ దనరు
లుక్సమాసంబు నలుక్సమాసం బన రెండుదెఱంగుల నుండు వినుఁడి
యడవిపంది యనంగ మెడకుంకు మనఁ జేనిపని యన నీరుకో డనఁగ ముక్కు
పుడుక యనఁగఁ జెవిపోఁ గన నిన్నియు లుక్సమాస మగుచు రూఢి కెక్కు
నూరఁబంది యనంగ నోరఁగ్రొ వ్వనఁగ నలుక్సమాసాఖ్య పొల్పుగఁ దగు నికఁ
దగఁ దెనుంగునఁ దద్ధితప్రత్యయాభిధ గలిగిన మత్వర్థములను గొన్ని
వివరింతుఁ బ్రత్యయా లవి కాఁడు గాఁ డాఁడు వాఁ డరి యీఁ డీఁడుల్ వహింగ నిండి
యిఁడి యన వరుసగా నెసఁగుచు నుండును వీనికి లక్ష్యము ల్వినుతుఁ దెలియ
నవలఁ గాఁ డనుప్రత్యయము వచ్చి నెఱవగకాఁ డనంగ సొగసుకాఁ డనంగఁ
గుంటెనకాఁ డనఁ గోటుకాఁడన నీటుకాఁ డనఁ జేవాఁడికాఁ డనఁ దగుఁ
సంస్కృతపదముపైఁ జను నొక్కటను విటకాఁ డనంగను నయకాఁ డనంగ
నవలను మత్వర్థమందు గాఁడగు నందగాఁ డన నెఱపందెగాఁ డనంగఁ
గన్నగాఁ డన జూదగాఁ డన నిఁక మత్వర్థమునందు నాఁ డనెడిప్రత్య
యము వచ్చి తనరుఁ గొడిమెలాఁ డొరిమెలాఁడు పొన్నువల్వగలాఁడు వన్నెలాఁడు
నాఁగ మత్వర్థమం దాగతి వాఁ డనుప్రత్యయం బమరుచుఁ బసులవాఁడు
చంటివాఁ డెడవాఁడు వింటివాఁడు తుపాకివాఁ డీటెవాఁ డన వఱలు జాతి
వాచకములు పాఱువాఁ డనఁ రాచవాఁ డనఁ గమ్మవాఁ డన నలరు నటుల
నవల నరియను ప్రత్యయము వ చ్చొప్పఁబగి నేర్పరి బాగరి యోర్పరి యనఁ

* సమాహారోదాహరణములయం దవశ్యకర్తవ్యమగు నేకవద్భావము చేయఁబడలేదు.

జూపరి మనసరి జూదరి లావరి తీర్పరి యనఁగ వర్తిల్లు నింకఁ
గనఁగొన్నినుడుల నీఁడనుప్రత్యయ మ్మొంది గుణమును బొసయుఁగులముఁదెలుపుఁ
గపటీఁడు నాఁగను గన్నడీఁ డనఁగ సాలీఁడనఁ దనరు నీజాడను మఱి
వహిఁగల్గుట కీఁడను ప్రత్యయమొంది కట్టిఁడి వెరవిఁడి యన నడరు మఱియుఁ
గడు లేని దనుట కొక్కైడ నిఁడిప్రత్యయం బది వచ్చి ముక్కిఁడి యనఁ దగు మఱి
యిండి యిఁడియను నీరెండుప్రత్యయములుఁ బసి యనునుడికడఁ బొసఁగి లెస్స
ధర్మివాచకమయి తనరారును బసిండి నాఁగను బసిఁడి యనంగ నెలయు
వరుస నింకఁ దిజంతవాచకరీతులు తెనుఁగునఁ దగునట్లు తేటపఱుతు
రహిఁగ నతీతమౌ రాతిరిప్రొద్దు వెన్నటిజాము లవి రెండు గానియట్టి
గతకాలమం దెల్లఁ గలుగు లజ్జు మఱియు గతకాలమం దెల్లఁ గలుగు లుజ్జు
కడుఁ దా నెఱుఁగనికాలమునం దెల్లఁ గలుగును లిట్టు పొంకముగ నవల
వానలు గలిగిన వసుధ ఫలించు నా నిదియె లృజర్థమై యెసఁగుచుండు
గనుఁగొన రాఁగలకాలంబునం దెల్లఁ లృట్టగు రాఁగలరెండుజాము*
లవిగాక తను భవిష్యత్కాలమునం దెల్ల వఱలుచు లుట్టింక వర్తమాన
కాలమునం దెల్లఁ గలుగు లట్టు మఱి యాశీర్వాదమున లిజ్జు చెలఁగు మఱియు
నరయ విధినిమంత్రణామంత్రణాధీష్టసంప్రార్థనప్రశ్నసరణి లిజ్జు
దనరు నెట్లనఁ జేయఁదగినకార్యం బెఱింగించుట విధిగ రాణించు నవలఁ
బూనిక నియమించుటే నిమంత్రణ మగు నదె నీవుదికి వచ్చినటుల నడుచు
కొమ్మన నామంత్రణ మ్మగు సత్కారపూర్వకవ్యాపారము తగధీష్ట
మడుగుట ప్రార్థనం బగు నొరుని దెలియ నడుగుట సంప్రశ్న మగును మఱియుఁ
గనఁగ నాశీరర్థమునను విధ్యర్థమ్ము నను లోట్టు వఱలు నె ట్లనినఁ గవులు
వీనికి లక్ష్యము ల్వేర్వేఱ వినుఁ డింక భూతార్థ మగు లేమివోయె ననఁగ
భాగ్యంబు మీఁదను బ్రబలనున్న దన భావ్యర్థమౌ ననుచున్న దనఁగ వర్త
మానార్థ మగు లోకమాత నన్ బ్రోవుత మనఁగ నాశీరర్థ మయ్యె మఱియుఁ
దెనుఁగున నాశీర్వచనరీతి యెయ్యెడఁ గావుతఁ బ్రోవుతఁ గాతన నగు
నా వెన్నుని దయ మేల్గావుతఁ బ్రోవుతఁ గరుణ నన్రక్షించుఁగాత శుభము
లావెడు నా రమ్ము చేయుము లె మ్మన్న విధ్యర్థ మయ్యె నివ్విధము లింకో
నొరునిఁ జెప్పఁ బ్రథమపురుష మెదిరివానిఁ దప్పకచెప్ప మధ్యమపురుషము

* రాఁగలరెండుజాములు=రాఁగలరాత్రి రెండుజాములు.

తనకుఁ జెప్పుకొను నుత్తమపురుష మివి యేకవచనబహువచనవిధములను
స్వత్ర్యృతులందు నెసంగుచునుండు నెచ్చటను బ్రథమపురుషమున కేక
వచనమ్మునకు బహువచనమ్మున కరయ భూతార్థమందు నొప్పు నెను నిరియు
మొగి మధ్యమపురుషంబున కితివి యితిరి పరఁగు నయ్యుత్తమపురుషమున కి
తిని ఇతిమి తగఁ జెందును బ్రత్యయంబులు వీనికి లక్ష్యము లివ్విస్తరింతు
కనుఁడు చేసెను జేసి రనఁగఁ జేసితివి చేసితిరి యనంగఁ జేసితిని జేసి
తిమి యన నిటులు వర్తిల్లు భవిష్యదర్థమునఁ బ్రథమపురుషమున కేక
బహువచనముల కెప్పట్టుల నును నురు చను మధ్యమపురుషమునకు దువు దు
రమరు నుత్తమపురుషమునకు దును దుము దనరుఁ జేయును జేతురనఁగ మధ్య
మపురుషమునకు నమరుఁ జేయుదువు సేయుదురు నాఁగ నుత్తమపురుషమునకుఁ
దనరుచుండును జేయుదును జేయుదుము నాఁగ వరుస నింకఁ బ్రథమపురుషమునకు
వర్తమానార్థైకవచనబహువచనముల నెడి నెదరు నై పలికెడిఁ బలి
కెద రన నిట్లు రాగిలు మధ్యమపురుషమునకు దవు దరుచు దనరుఁ బలికె
దవు పల్కెదరన నుత్తమపురుషమునకు దను దము నగుఁ బల్కెదను బలికెద
మన నిట్లు కాలత్రయప్రసంగోక్తులవలనఁ గ్రియల్ దగు వరుస నింక
బాళిగాఁ దెలిపెదఁ బ్రథమపురుషమున కల్లభూతభవిష్యదర్థములనె
యరయ స్థావరతిర్యగప్రాణివాచకపదములందలి యేకవచనబహువ
చనము లొక్క విధంబె వనము పెరిఁగెను వనమ్ములు పెరిఁగె ననఁగ హయంబు
బలిసెను హయములు బలియును నాఁగను లక్ష్యము లిట్లు చెలంగు నవల
సరవిగా మానవస్థావరతిర్యగప్రాణు లర్థంబులై యమరు నెడల
నూహింపఁ బ్రకృతిపై నున్న యనెడుమాటపయిని బ్రత్యయములు పరఁగుచుండుఁ
గన వర్తమానార్థమున నేకవచనబహువచనములను దియు వియు ననఁగ
సిరి యగుచున్నది సిరు లగుచున్నవి యనఁగ నీలాగున నమరు నెచటఁ
బురుషులఁ జెప్పునప్పుడె యాఁ డనఁగ వచ్చి ముని పల్కుచున్నాఁడ ననఁగ నల్ల
యున్న యన్మాటపై నొప్పు నా ర్బహుతను ధీరులు పలుకుచున్నా రనంగఁ
దెలియ నింక నెడి నెదులు వచ్చు నన్నింటఁ బ్రభువు పల్కెడిఁ జెట్టు పండె డెలుఁగు
మొలఁగెడి వలువ కదలెఁడు నాఁ బ్రథమైకవచనముల్ దనరు నివ్విరుసతోఁన
నవల నప్రాగభావార్థంబులైనట్టి క్రియల నదు వనుప్రత్యయము వచ్చి

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా వారు. పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

# ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

## అధ్యక్షులు

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్న పంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు,

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు (కోశాధ్యక్షులు.)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్ టి.

దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

అళక్కి వేంకటాద్రిమయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావు నాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

## కాకినాడ-ఆంధ్రసాహిత్యపరిషత్తులో వెలకుదొరకు గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి | రు | 0 | 8 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | ... ... | 0 | 10 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | ... | 1 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | ... ... | 0 | 2 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము-శ్రీమాన్ కపిస్థళం కృష్ణమాచార్యులుగారు | ... | 0 | 8 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | ... ... | 0 | 2 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | ... ... | 0 | 3 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము-జ. రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 9 | కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి | ... ... | 0 | 8 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | ... ... | 1 | 0 |
| 11 | అకారాద్యముద్రితగ్రంథసూచిక | ... ... | 0 | 8 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 12 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | ... ... | 0 | 12 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 8 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | ... ... | 0 | 12 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | ... | 0 | 8 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | ... | 0 | 4 |
| 18 | హరిస్వరంగములు-కొత్తపల్లి సూర్యారావుగారు | ... ... | 0 | 8 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు | ... ... | 1 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | ... ... | 0 | 8 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | ... | 0 | 12 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి | ... | 1 | 4 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు | ... ... | 0 | 4 |
| 24 | ఆంధ్రధాతుమాల—చిన్నయసూరి | ... ... | 0 | 12 |
| 25 | శాసనపద్యమంజరి | ... | 0 | 12 |
| 26 | శతకసముచ్చయము (ప్రథమభాగము) | ... ... | 0 | 12 |
| 27 | ,, (ద్వితీయభాగము) | ... | 0 | 10 |
| 28 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | ... | 0 | 8 |
| 29 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి | ... ... | 0 | 8 |
| 30 | రసాభరణము—అనంతకవి. | ... ... | 0 | 8 |
| 31 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) | ... ... | 0 | 8 |
| 32 | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| 33 | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ | ... ... | 0 | 8 |
| 34 | అమరుకము-సాంధ్రము-జయంతిరామయ్యపంతులుగారు | ... | 1 | 0 |
| 35 | సాంబోపాఖ్యానము-రామరాజురంగప్పరాజు | ... ... | 1 | 0 |
| 36 | హంససందేశము-కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | ... ... | 0 | 2 |
| 37 | సింహాసనద్వాత్రింశిక-ద్వితీయభాగము-గోపరాజకవి | ... ... | 0 | 10 |
| 38 | రాయవాచకము | ... ... | 0 | 8 |
| 39 | ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకాసహితము | ... | 0 | 8 |



Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.

# ఆంధ్రసాహిత్య
# పరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము ౨౩. | భావనామసంవత్సరము.<br>మాఘఫాల్గునమాసములు. | సంచిక ౬. |

శ్రీరస్తు.

## కర్ణాటకసాహిత్యపరిషత్తు.

---

శ్రీకృష్ణరాజేంద్రపరిషన్మందిరము—బెంగుళూరు.

అధ్యక్షులు.

మైసూరుసంస్థాన శ్రీమద్యువరాజ శ్రీకంఠీరవనరసింహరాజ ఒడయర్ బహద్దూర్ జి. సి. ఐ. ఇ. మహాస్వామిగారు.

### (1) గమకకళాభ్యాసగోష్ఠి.

ఈగమకకళాభ్యాసగోష్ఠి పద్యకావ్యములను జదువు విద్య నేర్పుటకేర్పడినది.

కన్నడకావ్యములను జెవి కింపగున ట్లర్థము విశదపడునట్లు చదువు విద్యను బ్రచారముచేయవలయుననునుద్దేశముతో, కర్ణాటసాహిత్యపరిషత్తువారొకగమక కళాభ్యాసగోష్ఠి (పరీక్షార్థమై) యేర్పాటుచేయుటకు నిశ్చయించిరి. ఈ ౧౯౩౫ సం॥రము ఏప్రిల్, మే, జూన్ నెలలలో బెంగుళూరులోఁబరిషన్మందిరములో నీగోష్ఠి జరుగును. ప్రసిద్ధగమకకళానిపుణులైన శ్రీమాన్ ఎస్. బిందూరావుగారు శిక్షకులు. ఈగోష్ఠి, ఆదివారములందును మఱియితరమైన సెలవుదినములలోను సామాన్యముగా- ఉదయము 7½ గంటలు మొదలు 8½ గంటలవఱకు నొకతరగతియు

సాయంకాలము $6\frac{1}{2}$ గంటలు మొదలు $7\frac{1}{2}$ గంటలు వఱకును వే ఱొక తరగతి యునడుపఁబడును......ఈగోష్ఠిలోఁ జేరఁదలఁచినవారు కన్నడములో అప్పర్ సెకండరీ, అథవా, స్కూలుఫైనలుతరగతి విద్యార్థులును, దగినకన్నడసామర్థ్యము గలయితరులును గూడ నుండవచ్చును. చేరినవారు నెల కొక్కరూపాయి కట్టవలెను. విద్యార్థులకు షట్పదీకావ్యములు, చంపూకావ్యములు, పాటలు, సీసపద్యములు మొదలైనవి చదువుట నేర్పఁబడును. వారువారు నేర్చుకొను కావ్యభాగములలోని యర్థము, విశేషములు, కావ్యకవికాలాదులు బోధపడుటకై యప్పుడపుడు కొన్నియుపన్యాసము లీయఁబడుచుండును. చిట్టచివర పరీక్షలుచేసి యోగ్యతాపత్త్రిక లొసంగఁబడును. చాలినంతమంది చేరఁగానే గోష్ఠి ప్రారంభింపఁబడును. గమకకళయును, సాహిత్యస్వారస్యమును జనుల యనుభవములోనికిం దెచ్చుటకు భాషాభిమానమును బెంపొందించుటకును విద్యాభిమానులగు కర్ణాటకు లెల్లరు, నీగోష్ఠి శ్రేయస్కరముగా నభివృద్ధినొందునట్లు సాయపడుదురుగాక.

విద్యార్థులు తమతమ యపేక్షాపత్రములను యీ మార్చి ౩౧ తేదీనాఁటికిఁ జేరునట్లు పంపవలయును.

వారిపేరు, వయస్సు, ఉద్యోగము, వారిభాషాసామర్థ్యము, సంగీతపరిచయమును దెల్పవలయును. వారువారు చదువుపుస్తకములు వారే సంపాదించుకొనవలయును. భోజనసదుపాయములును వారేచూచుకొనవలయును.

అని మొదలైనవిషయములతోఁ గర్ణాటకసాహిత్యపరిషత్తు గౌరవకార్యదర్శులు శ్రీయుత సి. కె. వేంకటరామయ్య, ఎం. ఏ. ఎల్. ఎల్. బి. గారు ప్రకటించి యున్నారు.

## (2) విశేషసాహిత్యోత్సవము.

1934 సం॥రం మే నెలలో నొకవారముదినములు జరిగినది. అది మీకెల్లరకును విదితమే. అందు, కర్ణాటకోపన్యాసములు, గ్రంథప్రదర్శనము, విజ్ఞానశాలలు, కర్మాగారములు, పీనిసమీక్షణము మొదలగు ననేకవిషయములు సాహిత్యోపయోగములునడచినవి. ప్రసిద్ధవిద్వాంసులు, పరిశోధకులును, విజ్ఞానశాస్త్రములు, రాజ్యశాస్త్రములు, అర్థశాస్త్రములు, ఇతిహాసములు,కావ్యవిమర్శనములు మొదలైనవానింగూర్చి ముచ్చటించియుండిరి.ప్రత్యుపన్యాసమును ముగిసినపిమ్మట ప్రశ్నోత్తరములు నడచినవి. ఈయుత్సవములకుఁ గన్నడదేశమునుండి యనేకులు దయచేసియుండిరి. వీరిలోఁ బలువు రుపాధ్యాయులు; విద్యాప్రచారమునం దాసక్తి

గలవారును శతసంఖ్యాకు లుండిరి. ఈసాహిత్యోత్సవమును మహాజను లందఱు నుంజూచి సంతోషించిరి. పాఠశాలలలోని బోధనకార్యము, తగినట్లు నడచుటకును, కన్నడభాష బలపడుటకును, నిట్టిప్రకృతిలోకవిచారములం గూర్చిన యుపన్యాసములు ప్రయోజనకారు లని యనుభవమునఁ దోఁచుచున్నది.

అట్టివిశేషసాహిత్యోత్సవము నీసంవత్సరమునఁ గూడ నడపుటకుఁ బరిషత్తువారికిఁ గోరికి గలదు. అనేకప్రాంతములనుండి వచ్చు సూచనల నంగీకరించి యీసారియును రాఁబోవు మేనెల వేసవిసెలవులలో జరుపుటకు నిశ్చయింపఁబడినది. సాధ్యమైనంతవఱకు నిరుటికంటె నీయేఁడు విశేషముగా నొనరింపఁదలఁపుగలదు. గతవత్సరమున నీయుత్సవము జరపుటకు రు ౧౬౦౦ వ్యయమైనవి. మహాజనులు దొడ్డమనస్సుతోఁ దోడ్పాటుచేయనిదే యిట్టియుత్సవము జరుగుట కష్టము.

దేశవిద్యాభివృద్ధి కిట్టి ప్రయోజనకరమైన కార్యమును,అసాధ్యమని యెంచి విడిచిపెట్టుట పరిషత్తున కిష్టముగాదు. పరిషత్తు మీవంటి యుదారపురుషులను నమ్మి నిల్చి యున్నయది. కాలస్థితి సంకుచితముగానున్నను దేశభాషాభిమానము ముఖ్యమని తలంచి మాప్రార్థనలను తమరు లాలించెద రని నిరీక్షించుచున్నాము. ద్రవ్యసహాయ మెంతవిశేషముగఁ గలిగిన నంతవిశేషముగ నుత్సవము జరగును. కాఁబట్టి కుతూహలముతో మేము మీయనుగ్రహమునకై యెదురుచూచుచున్నాము. అని ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి బి. ఏ. గారు (హెడ్ మేష్టరు నార్మల్ స్కూలు) డి. వి. గుండప్పగారు (మైసూరు లెజిస్లేటివ్ కౌన్సిలులోను యూనివర్సిటీ కౌన్సిలుసినేటులోను మెంబరు) సి. కె. వేంకటరామయ్యగారు ఎం. ఏ. ఎల్. ఎల్. బి. (సర్కారుట్రాన్స్లేటరు) వ్రాయుచున్నారు.

---



# శ్రీభగవద్గీతాదర్శన వ్యాఖ్యా-పర్యాలోచనము.

---

బ్ర. శ్రీ. నిడమర్తి జలదుర్గాప్రసాదరాయఁడుగారు సాంధ్రతాత్పర్యమును శ్రీభగవద్గీతాదర్శన మను పేర గీతలకు వ్యాఖ్యానము నొకటిని వ్రాసి ప్రకటించిరి. భారతాంతర్గతమును నేడువందలు శ్లోకముల పరిమితిని గలదియు, భగవంతుఁడగు కృష్ణపరమాత్మచే నర్జునునకు నుపదేశింపఁబడినదియు, సర్వజ్ఞుఁడగు వేదవ్యాసునిచే యథోపదిష్టముగా నుపనిబద్ధమును, మతకర్తలగు నాచార్యపురుషులకు ముమ్మూరకును బరమప్రమాణమును, సర్వోపనిషత్సారభూతమును నగుగీతాశాస్త్రము నర్థము సులభగ్రాహ్య మగునటుల నెంద ఱెన్ని వ్యాఖ్యల వ్రాసినను జాలును వలదనువాఁ డుండఁడు. ఈశాస్త్రము నర్థము సర్వజనగ్రహణీయ మనుటకు సాక్ష్యము ప్రపంచమునఁ బ్రచురములుగా నున్న యెల్లభాషలలోనికి నిది పరివర్తితమగుటయు.

ఈ గ్రంథకర్త గీతాశాస్త్రమున నొకింత కృషిని జేసినవాఁ డనుట యతిశయోక్తి కానేరదు; స్వయంకృషివలన శాస్త్రార్థమును సాధింపఁ గడఁగు వానియందుఁ గల లోపము లీవ్యాఖ్యాతయందు నొక కొన్ని గన్పించుచున్నవి. రెండవయధ్యాయమున నఱువదియొకటవ శ్లోకమునకు వ్యాఖ్యను వ్రాయుచు 'మత్పర' యను మాటకు శంకరాచార్యుని వివరణము నిచ్చియు నట వాసుదేవ శబ్దము నర్థమును గ్రహించియుండ లేదు. ఇట్టివి మఱియుఁ గలవు. ఈ నేరమి గురుశుశ్రూషచేఁ గాక స్వయంకృషివలన శాస్త్రార్థమును గ్రహింపఁదలఁచు వారియెడల సాధారణముగాఁ గన్పించును. శాస్త్రమర్యాదను గుర్తెఱింగినవాఁడు కావ్యాదులయందువలె శాస్త్రములయం దశ్లీలాదిదోషములను బరిగణింపఁడు. 'కపాస'మ్మనుచో శ్రీరామానుజుని గూర్చి పరంపరాప్రాప్తమైన కథయే కావ్యదృష్టికిని శాస్త్రదృష్టికిని గల భేదమును వెల్లడించుచున్నది. ఎనిమిదవ యధ్యాయమున నేడవ శ్లోకమున వీరికిఁ దోఁచిన యభిప్రాయము నట్టిద. రెండవ యధ్యాయమున నేడవ శ్లోకమునకు నర్థమును జెప్పుచుఁ గార్పణ్యాశబ్దమును వ్యక్తీకరించిన పద్ధతియుఁ, దమ లెక్కప్రకారమున నాయధ్యాయమునఁ "దొమ్మిది ఏ"గుర్తుఁ గల శ్లోకమును వివరించిన పద్ధతియును జాటును. కృపా కార్పణ్యా శబ్దములకు సంబంధము గలదని వీరు పొరఁబడిరి. కృపణ శబ్దమునకు నుఘనిమత్సిద్ధమగు నర్థమును గానరైరి.

ఈవ్యాఖ్యాత పాశ్చాత్యులయుఁ దద్విజ్ఞాన వ్యామోహితులయుఁ బ్రక్షిప్తవాదమును గేవల మంగీకరింపకపోయినను దత్పక్షమున కొకకొంత సహాయుఁడువలె నచ్చటచ్చటఁ దన యభిప్రాయమును వెల్లడించు స్వభావమును గలవాఁడు. ఈదృశప్రక్షిప్తవాదము నూహించుటకుఁ బూర్వులగు కొందఱు వ్యాఖ్యాతలు ద్వితీయాధ్యాయమున శాస్త్రార్థము సమస్తమును సూత్రింపఁ బడిన దని వ్రాయుటయు నాధారము. సూత్రరూపమున నీయధ్యాయమునఁ దెలుపఁబడిన శాస్త్రార్థమునకు వివరణగ్రంథమే తక్కిన పదునాఱధ్యాయములును. ఈయభిప్రాయమునుగూడఁ బురస్కరించికొని నేఁటివఱకుఁ బాశ్చాత్యులు గీతలయందు యథాశక్తిఁ బ్రక్షిప్తముల నూహించుచునే యున్నారు. వారి సాహసమును సంపూర్ణముగా నీవ్యాఖ్యాత వహింపకపోయినను గొంతవఱకా మార్గమునఁ గృషిసల్పిరి. గీతాశాస్త్రమే ప్రక్షిప్తమను వారు వ్రాయువ్రాఁతలకంటె నిది యన్యాయము కాదు. ఐనను సంప్రదాయసిద్ధముగా నీశాస్త్రము నలవరించికొనినవారు మిక్కుటముగా నీవాదమును జేయరని మాయూహము. తిలకు దీనికుదాహరణము.

శ్రీశంకరభగవత్పాదాచార్యులు, "గీతాశ్శాస్త్ర స్సప్తభిశ్శ్లోకశతైరుపనిబబంధ"యని వ్రాసినారు. వారివ్యాఖ్యావిలసితమగు గ్రంథమునఁ గ్రమముగాఁ బదునెన్మిది యధ్యాయములందును నేఁడువందల శ్లోకములున్నవి. నాఁటినుండియు సర్వవేదాంతులకు సమ్మతములు సార్థకములగు వానిలో నొకకొన్ని వీరికిఁ బ్రక్షిప్తములని తోఁచినవి. వీరికిఁ బ్రక్షిప్తము లని తోఁచిన వానిలోఁ బదమూఁడవ యధ్యాయారంభమున వీరుదాహరించిన 'ప్రకృతిం పురుషంచేవే' త్యాదిశ్లోకము నెచ్చటనుండి గ్రహింపఁబడినదో తెలియదు. శ్రీశంకరాదులు గీతాశాస్త్రమునం దెచ్చట నీశ్లోకమును బేర్కొనలేదు; కావున దానిని వీరు ప్రక్షిప్త మనుటకేమి యాటంకమును లేదు. శాస్త్రమునందు లేనిదానినిజూపి ప్రక్షిప్త మనుటకు విశేషమును గానరాదు. ఇఁకఁ బ్రథమాధ్యాయమున ముప్పదియెన్మిదవశ్లోకమును వీరు మిత్రద్రోహశబ్దాన్వయ మూపట్టునఁ గుదురమిఁ బ్రక్షిప్తమనిరి. ద్రోహశబ్దమును లౌకికదృష్టిచే విచారించిరే కాని జిఘాంసార్థముగల ద్రుహధాతు నిష్పన్నముగా గ్రహింపరైరి. అటుల గ్రహించినచో సంప్రదాయవిరుద్ధముగా నాశ్లోకమును బ్రక్షిప్తమని వీరనరు. తక్కినవి మూఁడు వీరుప్రక్షిప్తము లనిన శ్లోకములు- వాని యర్థరహస్యమును వారే మననాదికమువలన గ్రహింపఁగలరు- వానిలోఁ బదునేడవయధ్యాయాదిమశ్లోకమునకు శ్రీశంకరాచార్యులవా రన్యాయార్థకల్ప

నావకాశమునుగూడ తమభాష్యమున నాశంకించుటచే వారికిఁ బూర్వము నీశ్లోకము నర్థము వివదింపఁబడుచుండెడిదేమో యనుటకు సాధ్యమగుచున్నది.

శాస్త్రము నర్థమంతయు రెండవయధ్యాయమున సూత్రరూపమునఁ జెప్పఁబడినటుల సర్వవేదార్థము నీయధ్యాయమున నుపబృంహితమైనది.

ఈ వ్యాఖ్యాతలు శ్లోక క్రమమును మార్చి నూతనత్వమును గీతల కొడఁగూర్చినారు. మూఁడవ యధ్యాయమునఁ గల శ్లోకము లోకకొన్ని యచ్చట నప్రస్తుతము లనియు నింకొకచో వానిని జేర్చవలయుననియు వీరూహించిన దానిని విమర్శించిన నశ్లే వీరు చేసిన మార్పులన్నియు శాస్త్రసంప్రదాయములకు భిన్నము లని యెల్లవారికిని దోఁచును. కర్మాకర్మలలోఁ గర్మ మంచిదనియు నాకర్మయందును విష్ణుస్వరూపమగు యజ్ఞముకొఱకైన కర్మ బంధహేతువు కాదనియుఁ దదితర మెల్ల కర్మయు బంధహేతువే యనియు యజ్ఞస్వరూప మిట్టి దనియుఁ జెప్పినవిషయము పరమేశ్వరార్పణబుద్ధితోఁ జేయు యజ్ఞకర్మ కర్తవ్యమని బోధించు తృతీయాధ్యాయమున నసంగతము నప్రస్తుతముగా వీరికిఁ దోఁచినది.

బ్ర. శ్రీ నిడమర్తి జలదుర్గాప్రసాదరాయుఁడుగారు తమగ్రంథమున విజ్ఞాపనాంతమున జిజ్ఞాసను గూడ వ్రాయుటచేత నిందనుక యీగ్రంథము గుణాగుణములఁ జర్చింపవలసివచ్చినది; మఱియు శ్రీసాహిత్యపరిషత్తువారు నన్నీగ్రంథమునకుఁ బర్యాలోచనము వ్రాయుమనుటచేతను, సర్వోపనిషత్సారభూతమును బరమప్రమాణము నగు గ్రంథమిదియగుటచేతను నప్రియ మైనను సత్యమును నాకుఁ దోఁచినదానిని వ్రాసితిని; క్షన్తవ్యుఁడను.

కోపల్లె శివకామేశ్వరరావు.
పీఠికాపుర కలాశాల, సంస్కృతాంధ్రాధ్యాపకుఁడు.

# గ్రంథస్వీకారము.

## 1. పూలమాల.

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు రచియించినది. ఈయమ పదునెనిమి దేండ్ల వయసుగలదియఁట. పాఠశాలలోఁ జదువలేదు, గురుకులవాసము చేయలేదు. స్వయంకృషిని, భర్తగారిసహవాసమున నిట్టికవితను గూర్చినదనుట మెచ్చఁదగినది. ౧౮ పుష్పములతో గ్రుచ్చఁబడిన యీమాలలో మొదటిపుష్పము 'కాత్యాయని'-"ఓంకారపంజరశుకీం" అను శ్లోకమునకుఁ దెనుఁగుపద్యము.

శ్రీమదోంకారపంజరాసీనశుకము, ప్రాంచదుపనిషదుద్యానపరభృతమ్ము
ఆగమారణ్యవీథీమహామయూర, మైనకాత్యాయనీదేవి నాత్మఁదలఁతు.

మూలములో శుకీం, కలకంఠీం, మయూరీం అని కలవు. వానినట్లే స్త్రీలింగరూపములుగానే యుంచిన నెక్కుడుసొగసుగా నుండియుండును. "చాటింపు" ప్రహారిశ్లోకములకుఁ దెనుఁగు.

"లేరుతల్లిదండ్రులు లేదులేదు బంధు, వర్గము సహోదరులు లేరు, వసతిలేదు
తలఁపనియ్యెడ సుంతైన ధనములేదు, కాన జాగర్తి జాగర్తి కాచుకొనుఁడు."

ఇందు జాగర్తి యనుటకంటె జాగ్రత్త యనుట లెస్స. "గుమ్మఁడు" గుమ్మఁడేఁడే కన్నతల్లీయను గేయము ననుసరించినది. "కృష్ణునితో పాంచాలి"-సోమయాజిగారి భారతభాగము ననుసరించి రచియింపఁబడినది.

"వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి" నను పద్యమున కీయమ్మగారి పద్యము చిత్తగింపుఁడు.

ఉ. పుట్టితి నగ్నికుండమునఁ బుత్రికనై ద్రుపదాధినేతకున్
మెట్టితిఁ గుంతికోడలుగ మేలగు నీభరతాన్వయమ్ముఁ జే
పట్టితి ధర్మమార్గులగు భర్తలఁ గొంటిని నీతిధైర్య స
మ్రాట్టులఁ బుత్రులన్మఱియు మాసహజన్ముల ప్రాపుగాంచితిన్.

ఎచ్చటను స్థాయిగానక నానామార్గములుత్రొక్కుచున్న నేఁటికవులరచనలయందుకన్న, పూర్వకవులరచనలయందే రుక్మిణమ్మగారికి పక్షపాతము మిక్కుట మని పీఠికలో శ్రీయుత అబ్బూరి రామకృష్ణరావుగారు వ్రాసినది నిక్కము. సత్కృషి చేసి రుక్మిణమ్మగా రింతకంటె మంచి పొత్తములను రచింప నాశీర్వదించుచున్నాము. వెల, ఆఱణాలు. విశాఖపట్టణములో మెయిన్ రోడ్డులో రుక్మిణమ్మగారియొద్దనే దొరకును.

2. శ్రీపూసపాటివంశానుచరితము ప్రథమభాగము. కళింగఫాద్‌షాగ్రంథమాల. విజయనగరములో బ్రా॥ శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిచేఁ బ్రకటింపఁబడినది. దీనికి ఫోరువర్డు విశాఖపట్టణము జిల్లాజడ్జీ వెర్నర్ ఏ. బ్రాడీదొరవారు రచియించిరి.

విజయనగరము సంస్థానాధీశులైన పూసపాటివారిచరిత్ర మింక బహుచరిత్రములనుండి సంగ్రహించి యుక్తియుక్తముగ సప్రమాణముగ రచియింపఁబడినది. పూసపాటివారను నామమువచ్చుటకుఁ గలయైతిహ్యము లన్నియు దీన చర్చింపఁబడియెను. పూసపాడను గ్రామమునంగల కోటను రక్షించుటచే, పూసపాటివారను పేరువచ్చినట్లును-పుంసపాటుఁ డను మహానందిసుతునిబట్టి వచ్చినట్లును-శిలాదిత్యునిభార్య పూషావతి యనుగర్భవతి శత్రువుల బారినుండి యొక్క బ్రాహ్మణునిచే రక్షింపఁబడినట్లును ఆపూషావతి(శత్రుభయమున) గుహలో పలవాసముచేయుటచే గుహాసంభవత్వపరముగా గెహిలోటు లైరనినట్లును, గెహిలోటులు (గ్రహలాట్టులు) గ్రహారాట్టులనుటకువాడుకలోఁ జెడినమాటయనియు గెహిలోట్టులే పూసపాటివారయినట్లును-ఐతిహ్యములనుబట్టి- బహుపుస్తకభాండాగారములలో గ్రంథ సహాయమునుబట్టి పెట్టింగు, ఈస్టువిక్కు, లోకనాథఘోషు, బాల్‌ఫోరు, టాల్‌భాయి, వీలర్, జేమ్సు, రన్నెలు మొదలగు చరిత్రకారుల గ్రంథములం బట్టియునాలోచించి శర్మగారు చక్కఁగా రచియించియున్నారు. ఇందు క్షత్రియులలోని శాఖలు గోత్రములుం దెల్పి యీపూసపాటి వా రేశాఖవారో తేల్చిరి. శ్రీసూర్యాన్వయ సముద్దీపకులును శ్రీమాధవవర్మాన్వయాలంకారులునగు నీమహారాజవంశస్థుల గృహనామము శ్రీపూసపాటివారనునది భామ్యముకా దనకుండ పౌరుషేయమేయనుట నీగ్రంథము విశదీకరించు నని తేల్చిరి. ద్వితీయభాగములో సత్యనిర్ధారణము గావింపఁబడునఁట.

ఈగ్రంథము పోషకులకుఁ బండితులకుమాత్రము "ప్రైవేటు సర్క్యులేషన్" నిమిత్తమనియు నీప్రతికి వెల పోషకులదయ యనియుఁ వ్రాసినారు.

3. పాదుషా హైదరాలీ.

ఆంధ్రప్రచారిణీగ్రంథమాల ౨౨ వ పుస్తకము. ప్రకాశకులు కవిరాజహంస వోలేటి పార్వతీశముగారు. గ్రంథకర్త శ్రీఅలంపూరు కృష్ణస్వామిగారు— ఇరువదియైదు ప్రకరణములు 184 పుటలు. వెల 1—8—0. ప్రకాశకు లగు శ్రీవోలేటి పార్వతీశముగారికి పిఠాపురము వ్రాయవలయును.

(కాశీభట్ట 'బ్రహ్మయ్యశాస్త్రిగారు—గతసంచిక శేషము.)

—: నీ తు లు :—

ఇదివఱకు రసమునుగూర్చి ముచ్చటించుకొని యున్నాము. కావున నింక నీతులంగూర్చి ప్రసంగించుకొందము.

"ఈయుపాఖ్యానమునందు ముఖ్యముగ శృంగారరసము ప్రకటితము. నీతియుఁ దత్సంబంధికమే" అని రావుగారు వ్రాసిరి. ఇందలిశృంగారరసము నీచస్థితి యం దున్న దని మన మిదివఱకుఁ దెలిసికొనియున్నాము. నీతియుఁ దత్సంబంధి కమే యని రావుగారు చెప్పినది సరిగ సరిపడియున్నది. ఇందలిరసమువలెనే నీతి యు నీచస్థితియందే యున్నమాట నిజము. ఈప్రబంధమునందలి నీత్యాపకముం గూర్చి వ్రాయుటకుఁ బూర్వము పెద్దనకాలమునందలి పరిస్థితులంగూర్చి ముచ్చ టించుకొనవలసియున్నది. "ఆకాలముపరిస్థితులు, నానాఁటికవితాసంప్రదాయము లు, నప్పటిప్రజలయొక్కయు, రాజులయొక్కయు, మనోవృత్తులు మున్నగునవి సాక ల్యముగ గుర్తించినఁ గాని పెద్దనార్యునికవితాకన్యయొక్క యాకృతిక్రియాలక్షణ ములయందలి యుత్కృష్టతానికృష్టతలను, నింద్యానింద్యస్థితిగతులను నిర్ణయింప నవకాశ ముండదు." అని రావుగారు సరసముగా వ్రాసిరి. కాని "ఈయుపన్యాస మంతయు శ్రీశాస్త్రిగారికి నవసరము లేదని నాకుఁ దెలియును." అని కూడ వ్రాయించిరి. ఇట్లేల వ్రాసిరో నాకుఁ దెలియవచ్చుట లేదు. న్యాయముచేఁ గృష్ణ దేవరాయాదులకాలపరిస్థితులు నాకే యవసరము. అవి నావాదమునకే యను కూలించును. ఇదివఱకు వానిఁ బరామర్శించియేయున్నాను. అయినను రావుగారు నావ్రాసినదానిఁ జూచుకొనక యప్పటికాలస్థితుల పరిశీలన మవసర మని కూడ నొక్కివక్కాణించుచున్నారు కావునను, చరిత్రాంశములను బరిశీలించుట ముఖ్య మను చున్నారు కావునను, నప్పటిచరిత్రాంశముల బాగుగఁ బరిశీలించి వానిని బట్టియే నీతివిషయములో మనుచరిత్ర మెట్లున్నదో నిరూపించి చూపెదను. ఈప్రబంధో ద్దేశ మంతయుఁ దెలిసికొనుటకై శ్రీకృష్ణదేవరాయల గమనికలం గూర్చి భాషిం చుకొనవలసియున్నమాట నిజము.

రాయలు కళానిధి, కువలయహితకౌశలుఁడు, విబుధపోషకుఁడు, జడజాత విరోధి, చక్రపాలకుఁడు, సత్పతియు నగురాజే కాని పరికించి చూడ నీతనియం దొకకళంకము కలదు. ఈమహాప్రభువునకుఁ జిన్నతనమునందే చిన్నమ్మ యనువేశ్య తోడి పొత్తు సంప్రాప్త మయినది. ఈమెనే చిన్నాదేవి యందురు. ఈమె రాయ

లుంచుకొనిన గణికయని చరిత్రములు ఘోషించుచున్నవి. రాయలవారిభార్యలలో నొకయుంపుడుకత్తె కలదనియు నామెపేరు చిన్నాదేవి యనియు న్యూనిచ్ అను పోర్చుగీసురాయబారి లిఖించియున్నాఁడు. మఱియు కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుపంతులవారు తమహిందూదేశకథాసంగ్రహములో నీమె పణ్యస్త్రీ యనియే వ్రాసిరి. శ్రీయుత ఆదిపూఁడి సోమనాథరావుగారుకూడఁ దమకృష్ణదేవ రాయచరిత్రములో "సీ. వెలయాండ్రలోఁబుట్టి విమలగుణాళిచే నొప్పి యెప్పుడు తనమెప్పు వడయఁ గోరుచిన్నాదేవిఁ గూరిమిఁ బెండ్లాడె" నని వ్రాసిరి. వారిమాట యుపీఠిమాటయు నెంగులకు మన శ్రీ లేకుమళ్ల అచ్యుతరావు యమ్.యే.,యల్.టి. గారే కృష్ణదేవరాయలభార్యలం గూర్చి యిట్లువ్రాసిరి. "1. చిన్నాదేవి-భోగస్త్రీ 2. తిరుమలదేవి- ఉమ్మత్తూరి గంగరాజుకూఁతురు. 3. అన్నపూర్ణాదేవి- ప్రతాపరుద్ర గజపతికూఁతురు." పెక్కేల? చిన్నాదేవి వేశ్య యనుసంగతియును నామె బాల్యముననే రాయలతో సంబంధించిన సంగతియును మనరావుగారును నంగీకరించిరి. రాయలు ధనాఢ్యుఁడు గావున వేశ్యాప్రియుఁ డైనఁ గావచ్చును, గాని యాతఁడు వేశ్య నుంచుకొనుటతోఁ దృప్తినొందక యామెయం దగ్గలమైన వలపు గలవాఁడై యామెను దనభార్యలతో సమానగౌరవప్రపత్తులు కలదానినిగాఁ జేసి తన దేవేరులలో నొక్కదానినిగా నొనరించి తా నెచ్చటికిఁ బోయిన నచ్చటికిఁ దీసికొని పోవుచు బహిరంగముగా నేలఁజొచ్చె. ఈరాయలవారు తిరుమలదేవాలయము లోఁ దనయొక్కయుఁ, జిన్నాదేవియొక్కయుఁ, దిరుమలదేవియొక్కయు లోహప్రతిమలు చెక్కించిస్థాపించె. ఆప్రతిమలు మూఁడును నిలువంబడియున్నవి. కుడివైపుననున్నది చిన్నాదేవిప్రతిమ. నడుమ నున్నది రాయలవిగ్రహము. ఎడమవైపున నున్నది తిరుమలదేవిబొమ్మ. ఈ విగ్రహముల కుడిభుజములపై చిన్నాదేవ్యరు, కృష్ణరాయ మహారాయరు, తిరుమలదేవియరు అని పేరులుఁ గన్నడములోఁ జెక్కఁబడియున్నవి. ఈప్రతిమల ప్రతిబింబపటములు తీయించి యాంధ్రసారస్వతపోషకు లగుబ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులవారు లోకోపకారార్థమై యాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రచురించియున్నారు. వానిని జదువరుల యుపయోగార్థమై యీప్రక్క నిచ్చితిని.

భోగస్త్రీయగు చిన్నాదేవిని నొకప్రక్కను దనకులస్త్రీ యగుతిరుమల దేవిని నొకవైపునను నుంచుకొని ప్రతిమలఁ దీయించి సుప్రసిద్ధమహాస్థల మగు తిరుమలలో రాయలవారు స్థాపించుటంబట్టియే వారు వేశ్యతోడి పొత్తును గౌర

వనియ మైనదానినిగా భావించుకొని రని తేలుచున్నది. మఱియు నామెను దేవి యనిపిలుచుట కూడ నీయంశమును మఱింత స్థాపించుచున్నది. ఈ ప్రతిమలఁ దీయించుకొనుకాలమునాఁటికి నన్నపూర్ణాదేవిని జేపట్టలేదు. ఈవివాహము చాల యాలస్యముగ నైనదికాపున శాసనాదికములలోఁ గూడఁ జిన్నాదేవియొక్కయుఁ దిరుమలదేవియొక్కయుఁ బేరులే చాలవఱకుఁ గాన్పించుచున్నవి. రాయలువారీరీతిగాఁ దాము చిన్నాదేవిని గౌరవించుటయే కాక తనయాశ్రితులు కూడ గౌరవించునట్లు చేసిరి కావుననే యాతనియాస్థానకవు లగుపెద్దనార్యాదులు కూడఁ దాము విరచించిన కావ్యములలోఁ జిన్నాదేవిని గూడఁ దనభార్యనుగా వర్ణించుట కవకాశము కలిగించెను. పెద్దనార్యుని మనుచరిత్రములో రాయలదేవేరులం గూర్చి యిట్లు వ్రాయఁబడియున్నది. "క. ఆవిభువనంతరంబ ధ, రావలయముదాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా, దేవియు శుభమతి తిరుమలదేవి యు నుం దనకుఁ గూర్చు దేవేరులుగన్" ఇట్లే పారిజాతాపహరణమందును వర్ణింపఁబడియున్నది. వీని నన్నిటినిబట్టి చూడ వేశ్యను బహిరంగముగాఁ దనయింటఁ బెట్టుకొని నిశ్శంకముగా రాయ లేలఁజొచ్చె నని తేలుచున్నది.

రాయ లీప్రకారముగా వేశ్యను భార్యనుగా నింటఁబెట్టుకొని యేలుచుండుటయే గాక వేశ్యాసంపర్కము సరసతను సౌఖ్యమును హెచ్చించు నని తమ సన్నిధానవర్తులలో నూహలు బయలువెడలి వారుకూడఁ వేశ్యాలోలు రగుటకుఁ దగుప్రోత్సాహము నిచ్చినట్లు కూడఁ గాన్పించుచున్నది. ఈతనిసభలో ధూర్జటికవింగూర్చి యీ క్రింది ప్రసంగము జరిగె. సభవారిలో నొక్కరు "స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గె నీయతులితమాధురీమహిమ" అని సమస్య నిచ్చిరి. అందుపై మఱియొక్కరు "చ. స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గె నీ, యతులితమాధురీమహిమ, హా తెలిసెన్ భువనైకమోహనో, ద్ధత సుకుమారవారవనితా జనతాఘన తాపహారి సం,తతమధురాధరాధర సుధారస ధారలు గ్రోలఁగాఁ జుమీ" అని పూర్తిచేసిరి. దీనింబట్టి రాయలసభలో వేశ్యాప్రియులకు గౌరవ ముండెడి దనియు నద్దాని నొకఘనకార్యముగా నచ్చటివారు చెప్పుకొనుచుండెడివారనియుఁ దేలుచున్నది. రాయలసభలో నిట్టిచర్చ జరుగుట తనతాతకు యశస్కర మని భావించి కుమారధూర్జటి తనకావ్యములోఁ దనతాతం గూర్చి యిట్లు చెప్పుకొనియెను. "చ. స్తుతమతి యైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలకల్గె నో, యతులితమాధురీమహిమ నా మును నీపెదతాత చాలస, న్నుతిఁ

గనేఁ గృష్ణరాయల మనోజ్ఞసభ న్నీను మీావు నట్లు మ,త్కృతబహుమానవైఖరు లఁగీర్తివహింపుము ధాత్రీలోపలన్." పెక్కేల రాయలు వేశ్యలకు బహువిధము లగు ప్రోత్సాహముల నిచ్చె. తనయాముక్తమాల్యదలో వీరిని విశేషముగా వర్ణించెను. ఈతనివిద్యానగరమునఁ బండ్రెండువేలు వేశ్య లుండెడివా రని చరిత్రములు ఘోషించుచున్నవి. చరిత్రములలో విజయనగరమందలి వేశ్యావాటికలంగూర్చి ప్రత్యేకవర్ణనము గలదు.

రాయలవారివేశ్యాప్రియత్వమే యాకాలమున వేశ్యల కింత విశేషస్థితిని దెచ్చిపెట్టె. అంతమాత్రముచే వేశ్యాప్రియత్వమును మనసంఘ మంగీకరించిన దని చెప్పుకొనఁదగినది కాదు. మనసంఘ మెప్పుడును వేశ్యానృత్యగానములకు బ్రోత్సాహ మిచ్చుచున్నను వారలసంపర్కము నెంతమాత్ర మంగీకరింపలేదు.

మన స్మృతులు—"శ్లో. పశు వేశ్యాదిగమనే మహిష్యుష్ట్రీం కపీం తథా ఖరీం చ సూకరీం గత్వా ప్రాజాపత్యం సమాచరేత్॥" (పరాశర)-అని ప్రాయశ్చిత్తములు విధించుచున్నవి. మఱియు ను "శ్లో. దర్శనా చ్చిత్తవైకల్యం స్పర్శనాత్తు ధనక్షయం సంభోగాత్ కిల్బిషం పణ్యస్త్రీణాం ప్రత్యక్షరక్షసామ్" అని వేశ్యాసంభోగము పాపదాయక మని నొక్కి చెప్పుచున్నవి. ఇంకను మనకవులు "పణ్యస్త్రీషు వివేకకల్పలతికాశస్త్రీషు రజ్యేత కః" అని యును "వేశ్యా శ్మశాన సుమనా ఇవ వర్జనీయాః" అనియు ను "వెలయాలి జీవనము జీవనమే తలపోసి చూడఁగన్" అనియు "క శ్చుంబతి కులపురుషో వేశ్యాధరపల్లవం మనోజ్ఞ మపి" అనియు బహువిధముల వేశ్యాసంభోగము నిందించి వైచి యున్నారు. సంఘమును దానినంగీకరించువారిని నిషేధించి వైచుచున్నయది. ఈవిషయమై నవనాగరకాగ్రగణ్యు లగుకందుకూరి వీరేశలింగముపంతులవారు "అదిగాక మనధర్మశాస్త్రకర్తలు వేశ్యాప్రియులను పఙ్క్తిబాహ్యు లనియు వారికి రాజసభలలో కొలువు నియ్యకూడ దనియు విధించి యున్నారు. అందుచేతఁ బూర్వకాలమునందు వేశ్యల నుంచుకొన్నవా రెంతో హీనులుగాఁ జూడఁబడుచుండిరి. మనరాజులు వారికి సభలలోఁ బదు లీయకుండిరి. కులమువారలు వారిని మిక్కిలి తక్కువగాఁ జూచుచుండిరి. కాఁబట్టి యాకాలములో బహిరంగముగా వేశ్యల నుంచుకొనుట ఎంతో తలవంపులుగా నుండి మానాభిమానములు కలవా రందరును వ్యభిచారమును మానుచు వచ్చిరి." అని వ్రాసిరి. ఈవిధముగా శాస్త్రమును సంఘమును గట్టిగా నిషేధించుచున్నను కృష్ణదేవరాయలు నిరంకుశత్వమువహించి వేశ్యను బహిరంగ

ముగా నంతఃపురమునఁ బెట్టుకొని వేశ్యాప్రియులను దనసభలో గౌరవించుచు వేశ్యల నాదరించుచు వచ్చెను. అయిన ను రాజు చేయు పని చాల దుష్కృత్య ముగా నున్న దనువాడుక లోకములోఁ బుట్టకపోలేదు. కాని ధనబలసమేతు లగు వారలు నిజదోషముల నొప్పుకొనక పోవుటయే కాక పైఁగాఁ దాముచేయునది యోగ్య మైనపనియే యని లోకమునకుఁ దోఁచునట్లు చేయఁ బ్రయత్నింతురు, కాన, రాయలవారు ను దాము స్వీకరించిన వేశ్యాప్రియత్వమునందుఁ దప్పులే దనియు నది మంచిపనియే యనియు లోకమునకు బోధలోనికి వచ్చునట్లు చేయు సరసములగు మార్గముల నవలంబించెను. మనుచరిత్రము పుట్టుటకుఁ గల కారణ ములలో నిది మొదటిది.

పెద్దన కావ్యకథ నేర్పా టెవరు చేసిరి.

పెద్దనార్యుని ప్రబంధచరిత్రము నంతను బరికించి చూచిన రాయలకళంక మును బాపుటయే ప్రధానోద్దేశముగాఁ బెట్టుకొని యీకబ్బము వ్రాయఁబడినదని ప్రాజ్ఞులకుఁ దెలియకపోదు. ఈప్రబంధేతివృత్తమును నిర్ణయించుటలోఁ దత్కర్త యగుపెద్దనార్యున కేవిధమగు స్వాతంత్ర్యమును లేనే లేదనియు రాయలవారే దాని నేర్పాటుచేసి రనియు మనరావుగా రిట్లు వ్రాసిరి. "మనుచరిత్రకథ నెంచికొ నుటలోఁ బెద్దనార్యుని కెంతమాత్రము నధికారము లే దని యు నాపనిని శ్రీకృష్ణ దేవరాయలవారే చేసి పెద్దన్ననుఁ బ్రబంధము రచియింపుఁ డని యాజ్ఞాపించి రని యు మనుచరిత్రము జాగ్రత్తగాఁ జదివినవారికి స్పష్టమగును."

ఈకథ నేల నిర్ణయించె?

పెద్దనార్యుఁడు తన ప్రబంధకథను నిర్ణయించుటలో నధికార మెంతయు లేద నియు నందులో రాయలబానిసీఁ డాయె ననియుఁ జెప్పఁజాలను, గాని, మొత్తము మీఁద వా రుభయులును గలిసి యీకథ యుండఁ దగు నని నిర్ణయించినట్లుతోఁ చెడిని.

ఈప్రబంధేతివృత్తమేది ?

పెద్దనార్యుని ప్రబంధమునందలి ముఖ్యకథ ప్రబంధమునందుఁ దెలుపఁ బడినరీతిగా స్వారోచిషమనుచరిత్రము కాదు. ఇందులో ముఖ్యమైనది వరూథినీ నామక వేశ్యాచరిత్రము కావుననే విమర్శకులు కొంద ఱీయది వరూథినీచరిత్రము కాని మనుచరిత్రము కాదని యిదివఱకే వ్రాసియున్నారు. ఈప్రబంధములో మను వుయొక్క చరిత్ర మత్యల్పము కదా ! ఇది నిర్వివాదాంశము. కావుననే యీ

ప్రబంధమునకు మనుచరిత్ర మని కాని మనుసంభవ మని కాని పేరుండఁదగి
నది కా దని పండితప్రకాండు లభిప్రాయపడుచున్నారు. మన శ్రీమదచ్యుతరావు
గారే "ఈకథయందలి సార మంతయు వరూథినీప్రవరుల యుపాఖ్యానమునందే
యున్న దని యుఁ దక్కినభాగ మంతయు, రసోత్సేకము కలుగఁజేయలేని వల్లీ
బంధ మనియుఁ బెద్దనార్యుఁడు తనలోకోత్తరకావ్యప్రజ్ఞ నంతయు నీయుపాఖ్యాన
మునందే చూపించె ననియు వారినమ్మకము"అని లిఖించిరి. ఇదియే ప్రధానమనిరి.
ఈవిధముగా మనువుయొక్క చరిత్రము మూలకుఁ ద్రోసివేయఁబడుటకుఁ గల
కారణ మేమి? పెద్దనార్యుఁడు వరూథినీచరిత్రమునే ప్రధానము చేసికొనెను,
గావున, దానిని విరచించుటలోనే తనప్రజ్ఞావిశేషము నంతను హెచ్చుగాఁ జూపెను.
మనువుయొక్క చరిత్రము న్నప్రధానముగాఁ జూచుకొనెను, గావుననే దాని నెల్లె
ట్లో యీడ్చివైచె.

పెద్దన తనకృతికి మనుచరిత్ర మనుపే రేల పెట్టె?

తానువరూథినీనామకవేశ్యాచరిత్రమును వ్రాయఁదలఁచుకొనినవాఁ డగు
చోఁ దనకావ్యము మనుచరిత్రమని యేలనుడివె నందు రేని గణికాచరిత్ర మనిన
లోకమునకు వెగటుగా నుండుటయును విలువ లేకుండుటయును గల్గు నను భీతిచే
నిదియొక ఘనునిచరిత్రమే యనుభ్రాంతిని గల్గించుటకై మనుచరిత్ర మనుపేరునిడి
తుదిని గొన్నిపద్యములతో విష్ణుస్తుతి నతికె. ఈకథ మార్కండేయపురాణోక్త
ము కావలె ననేల ?

ఈకథను మార్కండేయపురాణోక్తముగాఁ జెప్పు మని రాయలు కోరి
నట్లుగా, పెద్దనార్యుఁడు వ్రాసెను. అట్లు కోరుటలోఁ గూడఁ గొంతరహస్యము
కలదు. మనువుయొక్క చరిత్రమును వర్ణించుటయే పెద్దనార్యుని ముఖ్యోద్దేశ మైన
యెడల నయ్యది మార్కండేయపురాణోక్త ప్రకారముగా నుండవలె నని ప్రత్యే
కముగాఁ గోరుటలో సారస్యము లేదు. ఏమన-స్వారోచిష మనుసంభవకథ శ్రీమ
ద్భాగవతాదులందును గలదు. దాని నేల తీసికొనరాదు ? మనపెద్దనార్యునకుఁ
గావలసిన వేశ్యాప్రశంస దానిలో లేదు. అందు స్వారోచిషుఁ డగ్నికిఁ బుట్టినట్లు
గాఁ దెలుపఁబడియున్నది. వరూథినీనామకవేశ్యావృత్తాంతము లేనే లేదు. అందు
మూలముచే నయ్యది త్రోసివేయఁబడినది. న్యాయముచే స్వారోచిషు నొకఘను
నిగాఁ జెప్పఁదలచుకొనినయెడల మార్కండేయపురాణోక్తక్రమము తీసికొనఁ
దగినది కాదు. ఏమన-నందు స్వారోచిషుఁడు వేశ్యాసంతతిలోనివాఁ డని తేలు

చున్నది. స్వరోచి లంజకొడుకని మనరావుగారి రామచంద్రరావు పంతులవారే వ్రాసినారు. ఇట్టియనుచితసంబంధమును బ్రధానముచేసికొని మార్కండేయపురాణోక్తక్రమ మనుసరించుటకంటెఁ బరమపవిత్రుఁ డగునగ్నిహోత్రుని పుత్రుఁ డని తెలుపు కథను దీసికొనుటయే శ్రేయస్కరముగా నుండునుగదా! అయినను బెద్దనార్యునకుఁ గావలసినది వరూథినీనామక వేశ్యాప్రశంసకాని మఱి యొకటికాదు. ఆహేతువుచే మార్కండేయపురాణోక్తకథ ననుసరింపవలసివచ్చినది. ఈకథనుబట్టి వేశ్యాసంతతులు పూర్వకాలమునందును ఘనస్థితిలోనికివచ్చెడివారని తేలుననియెడి తలంపున స్వప్రయోజనార్థమై మార్కండేయపురాణోక్తమైన కథను జెప్పుటయే ప్రధానముచేసికొనియెను. కాని యామార్కండేయపురాణములో వేశ్యలఘనతకు నష్టువచ్చుభాగము లేవియైన నున్నయెడలవానిని ద్రోసిరాజని వారల కనుకూలించు రీతిగాఁ గ్రొత్తవ్రాతలు వ్రాసెను. ఎట్లన:—

ఇప్పట్టున మార్కండేయపురాణమును బెద్దనార్యునకు వ్యతిరేకముగానే యున్నది. వేశ్యాసంపర్కము కూడ దని యీపురాణమును గట్టిగ నిట్లు నిషేధించుచునేయున్నది.

శ్లో. "పరస్త్రీయం నాభిలపే. దిత్యూచు ర్గురవో మమ।
　తేన త్వాం నాభివాంఛామి కామం విలప శుష్యవా".

దీనిని మారన యిట్లు తెనిఁగించెను.

కం. "పరవనితారతి కీడని, గురులెఱిఁగింతు రటుగాన గోమలి మది నా
　కు రతిజనింపదు నీదెస, నిరతము నావెస భజింపు నీవును విరతిన్".

ఇవి వరూథినితోఁ బల్కినపల్కులు. దీనింబట్టి వేశ్యారతియును బరవనితారతియే యనియును గావునఁ బాపదాయకమే యనియును దేలుచున్నది. ఇటఁ బరవనిత యనఁగా భార్యకంటెఁ బరురాలైన వనిత యని యర్థము. భార్యకంటెఁ బరురాండ్రైన స్త్రీలెల్లరును నభిలషింపఁ దగనివారే కదా? వేశ్యమాత్రము స్వస్త్రీకంటె భిన్నురాలు కాదా? మానవుఁడు వివాహమాడునపుడు ధర్మార్థకామవిషయములలో నిన్నతిక్రమింప నని భార్యకు వాగ్దానము జరిగియుండును గదా. స్వస్త్రీనే కాని పొందఁగూడదు కదా. ఏవిధమునఁ జూచినను, వేశ్యాసంపర్కము నిషిద్ధమై తీరుచున్నది. ఏపురాణమును ప్రధానముగాఁ జేసికొని పెద్దనార్యుఁడు తన ప్రబంధమును విరచించెనో యాపురాణమే వేశ్యారతి కూడ దనియు నందుమూలముచేతనే భూసురాగ్రణి యగు ప్రవరాఖ్యుఁడు వేశ్య యగు వరూథినిని ద్రోసి

వేసె ననియు విస్పష్టముగఁ దెలుచుండఁగా నాభావము నంతను దిరస్కరించివైచి పైఁగఁ దనప్రబంధములో వేశ్యారతి యుచితమే యనుభావమును సూర్యాస్తమ యవర్ణనము చేయుమిషపై పెద్దన యిట్లు తేల్చె.

చ. "తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భర వివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్".

దీనింబట్టి వేశ్యను గూడవచ్చు నని తేలుచున్నది. ఇది మూలవిరుద్ధభావ మని యిదివఱకే చెప్పినాను. ఇది కవివాక్యము కాని పాత్రోచితవాక్యము కాదు. ఇందులో వేశ్యను గూడవచ్చు ననుటకుఁ దగు హేతువు గూడఁ దెలుపఁ బడి యున్నది. అదియేదియన 'అనన్యకాంత' యగుట యంట. అనన్యకాంత కావునను దనయందలి మోహముచేఁ బరితాపముపాలై నవయుచున్నది కావునను, ప్రవరుఁడు వరూధినిని పొందవలసినదే యని పెద్దనార్యుఁడు సిద్ధాంతము కావించె. ఆమెను బొందనందులకై సర్వోత్తముఁడగు నాభూసురాగ్రణిని మహీసురాధముఁ డనియుఁ గ్రూరుఁడనియు నిందించెను. న్యాయముచే వరూథిని దేవవేశ్య, కాని, పెద్దనార్యుఁ డిచట దేవత్వమును బ్రధానముగాఁ దీసికొనలేదు. ఈపద్యము మన భూలోక మందలి వేశ్యల కన్వయించుటకై తరుణీత్వానన్యకాంతాత్వములను మాత్రమే తీసికొని, యవి కలవు కావున వేశ్యను గూడవచ్చు నని పెద్దనార్యుఁడు తేల్చెను. చిన్నాదేవి తరుణియు ననన్యకాంతయుఁ గావునను దనయందు వలపు పెట్టుకొనినది యుఁ గావునను గరుణార్ద్రహృదయుఁడై యామెను కృష్ణదేవరాయలు పాలించుట సర్వవిధముల నుచితముగనే యున్న దని లోకము భావించుకొనునట్లు చేయుట కై పెద్దనార్యుఁడు తనకవితాచాతుర్యము నంతయుఁ జూపెను. ఈపద్యము దుర్నీతి దాయకముగా నున్నదని మన శ్రీ ఓకుమళ్ల అచ్యుతరావుగారే యంగీకరించిరి. కనుక దానిని గుఱించి యంతగా వ్రాయ నవసరములేదు. వేశ్యలప్రశంస యున్నందులకే యాముక్తమాల్యదాదుల రావుగారు నిందించిరి. అట్టిస్థితిలో వేశ్య లనన్య కాంతలు కావున వారిని గూడవచ్చు ననియు నాతరుణుల విరహతాపము పాలు చేయుట క్రూరత్వమును నధమపురుషత్వమునై యుండుననియు లోకమునకు బోధ చేయుచున్నమనుచరిత్రము నేమనవలెనో చదువరులే యూహించుకొందురుగాక.

వేశ్యను గూడవచ్చునని తెల్పుటయే గాక యామెను గూడక త్రోసివేసిన ప్రవరాఖ్యవిద్వచ్ఛిఖామణిని మూర్ఖుఁ డని మనకవి నిరసించి వైచె. గణికాసంభోగము దర్పయుతమేయైనచో విజ్ఞుఁడగు ప్రవరాఖ్యుఁడు వరూధిని నేల త్రోసివేసె ననుశంక కలుగునుగాన, దత్పరిహారార్థమై యాప్రవరుఁడు వేశ్యాసంభోగములోని చాతు ర్యము నెఱుంగని యవిదగ్ధుఁడుకావున నట్లుచేసె నని పెద్దనార్యుఁడు తేల్చె.

జ్ఞాని యగుప్రవరుని మూర్ఖునిగా స్వలాభార్థమై పెద్దనార్యుఁడు నిరూపిం చుటయే గాక నిక్కమైన రసికతలేని కాముకాధముఁ డగు కలినామక గంధర్వ బ్రువుని- అంగభవవిద్యాపారగుం డని స్తుతించె. ఏవిధముచేత నైన వేశ్యను గూడి నవాఁ డెవఁడో వాఁడె రసికాగ్రణి యని పెద్దన సూచించె.

వరూధినీనామక ధననారి సురతక్రీడను సరసముగ సాగించుస్థితిలో లేకు న్నను నామెతోడి ప్రథమసురతము నాయకుని సంతోషింపఁ జేయఁ గలిగిన దని పెద్దనార్యుఁడు వివిధసురతవర్ణనములద్వారముగా లోకమునకు బోధచేసె.

మనకవి కులస్త్రీగర్భాధానవర్ణనము చేయవలసి వచ్చుస్థితిని దెచ్చిపెట్టి యావర్ణనమును సర్వవిధములఁబాడుసేసె. అది మనోరమాస్వరోచుల గర్భాధా నముతో సంబంధించిన విషయము. ఈ గర్భాధానపుగదిలో నాయిక యగు మనోరమచే నేడ్పించియును గొంతేనమ్మకోర్కెలు కోరించియును దుదకు గర్భా ధానమే చెడి కార్యము రసాభాసమై పోవునట్లు చేసెను. ఇది పెద్దనార్యుఁడు బుద్ధి పూర్వకముగాఁ దెచ్చిపెట్టిన రసాభాసము.

వారాంగనలు కామశాస్త్రతంత్రజ్ఞతె హెచ్చుగు లోకజ్ఞత కల్గియుందురు. కా వున వారితోడి సంభోగ మతిమనోహరముగా నుండుననియు నట్టి ప్రౌఢత కవకాశ ము లేక కులస్త్రీలు సమయానుకూల సరసత లేనివారై యేడ్చియును బెంకిపట్లు పట్టియును నాయకులమనస్సులకు నిక్కమగు నానందము కలుగఁజేయఁ జాలకుం దు రనియుఁ బెద్దనార్యుఁడు లోకమునకు స్ఫురింపఁజేసెను.

ఈపను లన్నియు వేశ్యాప్రియాగ్రణి యగు రాయలవారిని సంతోషపెట్టు టకై పెద్దనార్యునిచే సాహసపూర్వకముగాఁ గావింపఁబడినవి. ఈసంగతిని మన రావుగారును నెఱుంగుదురు. కావున "ఆకాలమున రాజులు శృంగారరసప్రియు లగుటచేఁ దదాశ్రితు లగు కవీశ్వరులును శృంగారరసలాలసులు కావలసివచ్చినది" అని వ్రాసిరి. దీనింబట్టి మనకవి, రాజేచ్ఛ యె ట్లున్నదో యట్లు వ్రాసి ప్రభువును సంతోషపెట్టఁ బ్రయత్నించినాఁ డని తోఁచుచున్నది. కావుననే దేశోద్ధారక నాగే

శ్వరరావుపంతులుగారు "విశ్వశ్రేయస్సునకు సాధనమైన కావ్యప్రయోజనమును రాజాశ్రయము సంకుచితము చేసినది." అనియుఁ "గావ్య మంతయు గామపరమై కావ్యప్రయోజనమును సంకుచితము చేసినది." అనియు వ్రాసినవ్రాఁతలు యథార్థము లగుచున్నవి. మనకవి నీతిని దనయిచ్చవచ్చినట్లు త్రిప్పి పాడుచేసి దానికి సరిపడుటకై రసమునుగూడఁ బాడుచేసె.

మనరావుగారు "పెద్దనవలెనే యతని సమకాలికు లగుముక్కుతిమ్మన్న ధూర్జటి వారివెనుక సమీపకాలములో వెలసిన రామరాజభూషణుఁడు పింగళి సూరన్న యిత్యాది మహాకవులందఱు శృంగారరసభూయిష్ఠంబు లగు గ్రంథములను రచించిరి." అని వ్రాసి పెద్దన్నశృంగారరసము చిత్రించుటలోఁ దనకాలమునఁ బ్రకటితమగు రుచిప్రమాణముల మించిపోలే దనుభావమును దేల్చిరి. ఇది సరికాదు. పైన రావుగారిచేఁ బేర్కొనఁబడిన యాకాలపు కవు లెవరును శాస్త్రములఁ దృణీకరించి సదాచారము నతిక్రమించి నీతిని పదటఁగలిపి వెలయాలిపొత్తు మంచిదే యనియు రసికత యందే యున్న దనియు శుద్ధవైరాగ్యము పూనుట మూఢత్వ మనియుఁ బెద్దనవలె హేతువాదము పెట్టలేదు. కావున నాకాలపు రుచిప్రమాణముల మించియే పెద్దనార్యుఁడు శృంగారవర్ణనమును గావించె ననకతప్పదు. ఇట్టికారణములచే, పెద్దనగ్రంథ మసత్కావ్య మగుచున్న దని నేను వ్రాసితినే గాని "వెలిపెట్టిరే బాడబుల"ను దానిం బట్టియును గచకుచాదుల వర్ణనములను బట్టియును గాదు. ఆకాలపరిస్థితులే యీయంశమును దేల్చుచున్నవి. పెద్దన వేశ్యాగమనమును సమర్థింపఁ దనగ్రంథమును వ్రాసెను గావునను మనపెద్దలు వేశ్యాగమనమునుఁ బశుగమన తుల్యముగా నెంచిరి గావునను రావుగారును వేశ్యాసంభోగము పశుకామములోఁ బడు ననిరి కావునను బెద్దనకృతి పశుకామబోధక మనియు నీతిబాధక మనియు నిస్సంశయముగా మనము చెప్పుకొనవచ్చును.

అనన్యకాంతలు గావున వేశ్యలఁ గూడుట తప్పుగా దని పెద్దనార్యుఁడు సరసముగఁ జేసిన కాంతాసమ్మితబోధ లోకములో నమిత మగు హానిని గలిగించుచున్నయది. ఎంతటిమహానీయులు పెద్దనపక్ష మవలంబించి వేశ్యలఁ గూడుట ఒంకుగా దనియుఁ దప్పుగా దనియు గట్టివాదము గావింప మొదలిడిరో గనుఁగొనుఁడు. శ్రీ వెన్నేటి రామచంద్రరావుపంతులు బి. ఏ., బి. యల్. గారు, శ్రీన్యాపతి శేషగిరిరావుపంతులు బి. ఏ., బి. యల్. గారు, శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావు పంతులు ఎం. ఏ., ఎల్. టి. గారు, కేతవరపు వేంకటశాస్త్రిగారు మున్నగు హేమా

హేమీాలెల్లరును వేశ్యాసంభోగమును మనఃపూర్వకముగా సమర్థింపఁ బడఁగల పాల్లెల్లఁ బడుచున్నారు. ఈయంశము చాలదా మనుచరిత్రము పరిమళము గల విషపుష్పమువలె లోకమున హానిచేయుచున్న దని చెప్పుటకు ?

మన శ్రీమదచ్యుతరావుగారికి కలినామకగంధర్వుఁడు వరూధినిని మోసగించి కావించిన యక్రమసంభోగ మవినీతినిరోధకమై ధర్మమే యగుచున్న దఁట! వారివాక్యరత్నములనే యీాక్రింద నిచ్చుచున్నాఁడను.

"వరూధినీప్రవరుల కథ నీతిబోధకము, వరూధినీమాయాప్రవరులకథ యవినీతినిరోధకము, నీతిప్రబోధము నవినీతినిరోధను నీరెండును గావ్యేందిరయొక్క ధర్మైకచరణము నందలి యాకృతిద్వయమే."

ఈయపూర్వనీతివాక్యములను రావుగా రేలోకమునుండి పలుకఁజొచ్చిరో తెలియవచ్చుటలేదు. ఏమన-కలిగాఁడు చేసినదారుణకృత్యము లవినీతినిరోధకములై ధర్మమెట్లైనవో దురూహ్యములుగా నున్నయవి. ఈభూలోకములో నాతఁడు కావించినది మంచిపని యనుట కవకాశములేదు. రావుగారివాక్యము భావరసము లేని శుష్కవల్లీబంధము.

మోసము చేసి వరూధిని యనువేశ్యతో కలి కూడినాఁ డని యిదివఱకే వ్రాసినాను. ఆకూడుట తనకొఱకా యామెకొఱకా యనఁ దనకొఱకే. స్వార్థపరత్వముతో వంచనకృత్యమును గావించినాఁడు. ఆమె పరితాపమును దీర్చుటకుఁ గాదు. తన్నుఁ ద్రోసివేసిన యావేశ్య ప్రవరునియందు మోహము పెట్టుకొని యాతఁడు లభింపమిచే మన్మథాగ్నిలో వేఁగుచున్నందులకై యీాతఁడు చాలసంతోషించినాఁడు, కాని, విచారపడలేదు. తాను దొంగయై యాప్రవరవేషము వేసికొని యామెను గూడుటకు నవకాశము చిక్కినది గదా యని సంతోషించి యావేషమును దాల్చనేకాని యామెప్రాణము నిలుపుటకుఁ గాదు. మార్కండేయపురాణ మట్లే చెప్పుచున్నది. నావ్రాసినదాని నెట్లైన కాదనుటకై రావుగా రొకవిచిత్రమైన యెత్తు నెత్తిరి. వరూధినియును నీగంధర్వుఁడును దేవలోకములోనివా రంట ! అందుమూలముచే మనభూలోకధర్మము లచటఁ బనికిరావంట! ఇది దోషమును దోష మని యొప్పుకొనక లోకవంచనము చేయుటకయి వ్రాసిన మోసపువ్రాఁత. ఏమన:- నాకిచ్చిన సమాధానములో వీరు కలిగాఁడధర్మనిరోధద్వారముగా ధర్మప్రబోధమే గావించె నని ముగ్ధవాదము గావించినను దాము లిఖియించిన యాముక్తమాల్యదావిమర్శనములో వీఁడు వరూధినీసౌశీల్య

మును బాడుచేసె నని "వరూథిని తనయైంద్రియభోగేచ్ఛకు బానిసయయి కుహనాప్రవరునిమాయలలోఁ బడి తనశీలముఁ గోలుపోయెను." అని వ్రాసిరి.

దీనింబట్టి వరూధినీనామకరూపాజీవకు శీలమున్నట్లును నయ్యది కుహనాప్రవరుఁడగు కలిగానిమూలముగా ధ్వంసము చేయఁబడినట్లును దేలుట లేదా? ఇది యధర్మనిరోధకమును ధర్మప్రబోధకమును నగు పని యెట్లు కాఁ గలదు. అది యట్లుండ నిండు, ఎవ్వతెకైన ననుచితకామోదయమై దానివలన బాధపడుటతటస్థించిన దానిబాధను దొలఁగింపకుండుట కవి కుచితము గాదనియు, నాభోగపరాయణురాలికి నింద్రియైకసుఖవ్యాపారపారగు నొకనిని దగిలించి యామె నీచేంద్రియవాంఛను దీర్చుట కవిపని యనియు, ఇదియే కావ్యనీతి.(Poetic justice) యనియు రావుగారు వ్రాయసాహసించుటకు వెనుదీయరైరి! కామాంధునకుఁ గామాంధురాలిని, గామాంధురాలికిఁ గామాంధుని గూర్చుట కవిపని యగునా? అట్లైన వాల్మీకిమున్నగువారు మనరావుగారు చెప్పినకావ్యనీతి(Poetic justice) నెఱుంగక రామాయణాదులఁ బాడుచేసి రని చెప్పవలెనుగదా! రావణుఁడు చెఱకువిలుకానికఱకుటమ్ములఁ దూలి విరహార్తుఁడై సీతావిరహదుఃఖాబ్ధిలోఁ బొరలుచుండెను. సతీమణి యగుసీత పాతివ్రత్యధర్మముతో వఱలుచుండెను. ఇంక నాకాముకుని యవస్థ నెట్లుపాపవలసియున్నది. అతఁడు సీతాదేవికొఱ కేడ్చుచుఁ జావవలసినదియా? ఆయింద్రియైకభోగపరాయణునకు నింద్రియైకసుఖవ్యాపారపారగురా లగునొకకాముకురాలిని సీతావేషము వేసి కవి తగిలింపవలసినదికదా? అపుడుకదా రావుగారి కావ్యనీతి శోభించును! కావ్యనీతి యన నిట్టిది కాదు. దుష్టులు చేసిన దుష్టకృత్యములకుఁదగినశిక్ష నందుటయు సుకృతు లగువారు తాము చేసిన సుకృతములకుఁదగిన సత్ఫలము నందుటయుఁ గావ్యమునఁ గలిగించుట కావ్యనీతి యని ప్రాజ్ఞులువ్రాసియుండిరి. గ్రంథమునందు కావ్యనీతి కలదా లేదా యని విచారించుట కలవాటుపడిన పాశ్చాత్యపండితు లీవిషయమై యిట్లువ్రాసిరి.

Poetic justice:—'That ideal justice which poets exercise in making the good happy, and the bad unsuccessful in their evil schemes.' —Brewer's Phrase & Fable.

'A distribution of rewards and punishments such as is common in poetry and works of fiction but hardly in accordance with the realities of life.' —Annundale.

ఈరీతిగానే New Century Dictionary లోఁగూడఁ గలదు.

వీనింబట్టి రావుగారు వ్రాసినది పూర్తిగాఁ దప్పని తేలుచున్నది. రావుగారికి సత్యముతోఁ బనిలేదు. చేతికి వచ్చినట్లు వ్రాయుటయే మచ్చువిమర్శనము వ్రాయుట యని భావించిరి కాఁబోలు !

వరూథినిని నామెనుగూడిన గంధర్వాధముని విమర్శనమునుండి తొలఁగించుటకై రావుగారికి నొక యెత్తు నెత్తిరి. దేవలోకసామాన్య యగునంగన నాయిక యగుటచే నామెపలుకులుఁ జేఁతలు మానవజాతికి సంబంధించినవి కావఁట. అట్లే మాయాప్రవరుని చేష్టాదికమును నంట! ఇట్లు వ్రాసి తుదకు దేవతలనైనను మనుష్యజీవితవృత్తులంగో నున్నలక్షణములతోఁ జిత్రించుట చాల మేలే యని యంగీకరించి తుద కట్లు చేయుటచే వారియందు దేవతాగుణములను దప్పించి మానవగుణముల నారోపించుట యగును గాన నట్లుచేయరా దని రావుగారు తెల్పిరి. ఇదియుఁ దప్పు వ్రాఁతయే. మానవుఁ డగుకవి వ్రాయుగ్రంథములో దేవతలనుగూడ మానవత్వములోనికిఁ దీసికొనిరాకుండ నుండఁజాలఁడు. పెద్దనార్యుఁడు వరూథినిని మనుచరిత్రలో మానవత్వములోనికిఁ దెచ్చితీరినాఁడు. మానవదేహములందుఁ గలుగుస్వేదోద్గమము తెప్పపాటు మున్నగువానిని వరూథినీవిషయములో వర్ణించితీరినాఁడు. అదిగాక యాదేవాంగన చచ్చిపోవునేమో యను భీతిని గంధర్వుఁడు పెట్టుకొనినాఁ డని పెద్దన లిఖించె. అంతమాత్రముచేఁ బెద్దన గ్రంథమును నిందించివేయవలెనా ?

—: నెరసుల నెంచుట. :—

నేను నెరసుల నెంచినట్లుగా రావుగారు నాపై దోషారోపణము గావించిరి. నే నట్లు చేయలేదు. నేను జూపినవి వట్టినెరసులు కావు, కథాశిల్పమున కడ్డువచ్చు విరళబంధము లని వేనిని రావుగారు భావించిరో యట్టివానినే నేను మనుచరిత్రలోఁ జూపితిని. రావుగారి మెప్పువడసిన దండ్యాచార్యులవారు,

"శ్లో. తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యాద్వపు స్సుందరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్"

అని నుడివి యుండిరి. కాన విమర్శకుఁడు స్వల్పదోషములను గూడఁ జూపఁదగినదే. రావుగారు విష్ణుచిత్తీయవిమర్శనములో నెరసు లని తామే పేర్కొనిన దోషములనుగూడ నెంచితీరిరి. అట్లేల చేయవలసివచ్చె ? తా మేదిచేసినను జేయవచ్చునేమో? నెరసులని త్రోసివేసినంతన యున్న దోషములు తొలఁగిపోవు.

వసుమనుచరిత్రలంగూర్చి నాకును శ్రీ వెన్నేటి రామచంద్రరావుపంతులుగా

రికిని జరిగినచర్చమాట నెత్తికొని పంతులవారివ్రాఁతలు మృదుత్వము తప్పలేద నియు నావ్రాసినది విరసోక్తులతోఁ గూడియున్నదనియు శ్రీరావుగారు లిఖించిరి, యిది నాయందుఁగల ద్వేషభావము వ్రాయింపఁగా వ్రాసినవ్రాఁత. నేను నా మాట చెప్పుకొనఁదగదుకదా! ఇంక రామచంద్రరావుపంతులుగారివ్రాఁత లెంత మృదువుగనున్నవో చూపెదను గనుఁడు. పంతులువారు మనుచరిత్రమునందలి నాయిక యగు వరూథినిం గూర్చి ముచ్చటించుచు "బ్రహ్మయ్యగారిలంజ"యని వ్రాసిరి. ఆమె మనుచరిత్రపక్షము వహించిన పంతులవారిలంజ యనిన ననవచ్చు నేమో కాని వసుచరిత్రపక్షమున వ్రాసిన నాలంజ యెట్లు కాఁగలదు. పంతుల వారివ్రాఁతలో మార్దవమును లేదు చాతుర్యమును లేదు. ఇట్టి పరుషవాక్యలు వారివ్యాసములోఁ బెక్కులు కలవు. అయినను పక్షపాతబుద్ధి వానిని గనఁబడ నిచ్చినది గాదు. నావ్రాసినదానిలో లేని లోపములను జూపినది. పక్షపాతము వదలకున్న విమర్శనములు బాగుపడవు.

కావ్యములందలి గుణదోషముల నెంచుట సత్కావ్యములు పుట్టునట్లు చే యుటకే. ఈయంశమును పెద్దనార్యుఁడే "నిరుపహతిస్థలంబు" అను పద్యములో విశదముచేసి యున్నాఁడు. ఒప్పుతప్పెరయు రసజ్ఞులుండవలె నన్నాఁడు.

దీనిలో, ఒప్పుతప్పెరయురసజ్ఞు లుండినం గాని యూరక కృతుల్ రచియిం చుట కవకాశముండునా యని తెలుపఁబడి యున్నది. నిజముగా మంచివిమర్శ నములు మనసారస్వతమున వలయునన్ని లేకపోవుటచే వాఙ్మయాభివృద్ధినే ప్రధా నముగాఁ జేసికొని నేను విమర్శనముల వ్రాయుచున్నాఁడను. నాలోపము లున్నఁ జూపవచ్చును. రావుగారు వృథాగా నన్నేలనిందింప మొదలిడిరో తెలియవచ్చు టలేదు. నే నెచ్చటను బెడసరపువ్రాఁతలు వ్రాయకపోయినను నన్నుదూఱుటకుఁ గారణము గాన్పించుటలేదు.

శ్రీ రావుగారు పెడసరపువ్రాఁతలు వ్రాయుటయం దభిలాష గలవారుగాఁ గాన్పించుచున్నారు. ఆంధ్రభాషాపోషణ మొనరించిన మహనీయులలో నగ్రగ ణ్యు లగు రాయలవారి విష్ణుచిత్తీయముపై విమర్శనమును వ్రాయుచు రాయల వారినిగూర్చి యుక్తాయుక్తముల నెంచక పెడసరపువ్రాఁతలు చాలవ్రాసిరి. ఒకటి రెండుదాహరణముల నిచ్చెదను.

(1) ఈవిషయమై రావుగారు, "ఈచక్రవర్తికి నేలకో సంగీతజ్ఞానము సున్న"అని వ్రాసిరి. ఆచక్రవర్తికి సంగీతజ్ఞానము లేదని వీరెట్లు గ్రహించిరో! కవిత్వ

ము కఠినపాకము కలిగి యుండుటచేత నంట. బహువిధకళాపోషకుండై నిరంతర మును దదభిరుచితో మెలంగిన చక్రవర్తి సంగీతజ్ఞానశూన్యుఁడగుట కలుగ నేరదు. కాన తగినకారణము చూపకయే యాతనికి సంగీతజ్ఞానము సున్నయని యూహించుట గొప్పసాహసము. ముసురుపాకముగఁ గవిత్వముచెప్పువారిలో సంగీత రహస్యజ్ఞు లనేకులు కలరు. పద్యకవిత్వమువలెనే వారిగేయకవిత్వమును ముసురు పాకమం దుండవచ్చురు. అది గాక, ఆముక్తమాల్యదంబట్టి చూడ వీరికి సంగీతజ్ఞానము సున్నయనఁదగినది గాఁ గాన్పించుటలేదు. ఈపద్యముంగనుఁడు.

ఉ. కామిని మేఘరంజి మఘగర్వమడంతు నటంచు లో నిజ
క్షేమముఁగోరి పాడి మఱిచిత్రమరుత్తృణతాచిరద్యుతి
స్తోమవలాహకావలుల దోఁచి ప్రఫుల్లకదంబకేతకో
ద్దామసమీరణాహతులఁ దాపమునీ నొఱగు న్విచేష్టతన్.

చ. కలఁ డొకరుండు పేరుకొనఁగానికులంబు మదీయభక్తుఁ డి
య్యిల మను వాఁడు వామనత నే వసియింపనొ పుణ్యభూమి నం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి బ్రహ్మవే
ళలఁ జనుదెంచి పాడు మము లాలన మంగళనామకైశికిన్.

రాయలవారి కావ్యపాకముం గూర్చి కళాపరిపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిగారు ముచ్చటించుచు నయ్యది పక్వపనసఫలపాకముననున్న దనఁగా-నం దుపైన రావుగారు విరసపువ్రాఁతలు చాలవ్రాసిరి. పనసలలో బురదపనస యొకటి కలదఁట. అందు పీచేగాని మఱేమియు నుండదఁట. ఆబురదపనసపాకమున నున్న దని రావుగారు గేలిచేసిరి. ఆభాషోద్ధారకుని, ఆమహాకవిని, ఆపండితపోషకుని నీవిధముగ గేలిచేయుట న్యాయమా ? నిజముచే విష్ణుచిత్తీయములో సహృదయ హృదయోల్లాసమును గలిగించు పద్యరాజము లనేకములు గలవు. అట్టిదాని యందు మాధుర్యమేమియు లేదనియు గ్రంథము బురదపనసపాకమున నున్నదని యు నుడువుట యుచితమా? ఇంతయేల గ్రంథనామమే సరిపడలేదనిరి. విష్ణుచిత్తీయ మనుపే రుండఁగూడదఁట. విష్ణుశక్తీయమనియో విష్ణుభక్తీయ మనియో యుండవలయునఁట. ఇట్టిపిచ్చి యాక్షేపణము లాముక్తమాల్యదపైఁ బెక్కులు గావించిరి.

పెద్దనార్యునియం దెంతయో యభిమానము పెట్టుకొని యెంతయోపక్షపాతమును జూపిన రావుగారు తుదకు—పెద్దనార్యునివిషయములోఁగూడఁ దమ సహజలక్షణముం బట్టి పెడసరపువ్రాఁతలు వ్రాసిరి. "మనుచరిత్రరచనములో

నేవిధ మగు స్వాతంత్ర్యమును పెద్దనార్యునకు లే దని వీరు వ్రాసిరి. ఆమహాకవిని వట్టిబానిసను జేయుటకాదా ?

(2) పెద్దనార్యుఁడు గావించిన సూర్యాస్తమయవర్ణనమునుగూర్చి వ్రాయుచు "పెద్దనార్యుని శృంగారరస మిచటఁ బొంగి పొరలినది. శ్రీ శాస్త్రిగారి చీవాట్లకుఁ బెద్దన్న యిచ్చటఁ దప్పక యర్హుఁడే" అని లిఖయించిరి. పెద్దనయందు గౌరభావము కలదనుకొను వీరు పెద్దన్న చీవాట్ల కర్హుఁడే యని వ్రాయుట వింత కాదా ? పెడసరపువ్రాఁతలు వ్రాయుట వీరికి సహజ మగుటచే నిట్టివిరసపువ్రాఁతను వ్రాసిరి. ఇట్టివనేకములు కలవు.

మొత్తముమీఁద రావుగారిప్రతివిమర్శన మంతయుఁ జెడినది. వారు మచ్చువిమర్శనమును వ్రాయఁదలఁచుకొనఁగాఁ దుదకుఁ బిచ్చి విమర్శన మగుటకు సిద్ధమైనది. వీరు గొప్పవారే కాని వీరికిఁ దొందరపా టెక్కువనియు గ్రంథమును దిన్నగఁ జూచుకొన రనియు నే నిదివఱకే వ్రాసియున్నాను. ఆకారణమున విమర్శనము పాడైనది. బహుభాష లెఱింగిన పెద్దపండితులైన కారణమున వీరివిమర్శనము నిస్సారమైనను వీరియున్నతవిద్యయందుఁ గలగౌరవముచే వీరికి నేను సమాధానమిచ్చితిని.

రావుగారు పురాణవిద్యలో గొప్పపండితులై యుండియు, నున్నతోద్యోగియై యుండి యు మన యాంధ్రభాషయందు మంచియభిమానమును బెట్టుకొని చాలకృషిచేసి విమర్శనములు మున్నగునవి వ్రాయ మొదలిడుట చాల శ్లాఘనీయాంశము. పరమేశ్వరుఁడు శ్రీరావుగారికి దీర్ఘాయురారోగ్యోన్నతులను మంచి విమర్శనపాటవమును నొసంగుఁగాక. ఆంధ్రసారస్వతమును మహోన్నతదశ నొంది ప్రకాశించుఁగాక.

ఓం తత్ సత్.

☞ ఈవ్యాసము శ్రీమదచ్యుతరావుగారు గావించిన యసంగతప్రసంగములకు సమాధానముగా వ్రాయఁబడినది. కాని యిది పెద్దనార్యుని మనుచరిత్రముపై సంపూర్ణ విమర్శనముగాదు. కాన పెద్దనార్యునిగ్రంథమునందలి గుణప్రశంసయిందులేదు. ఆహేతువుచే నాపొత్తమునందుత్తమగుణము లేవియు లేవని నేనుదలంచినట్లు భావింపరాదు. ఆమహాకవికావ్యములో సహృదయులు హృదయపూర్వకముగా "మేలు మేలు" అని మెచ్చుకొనఁదగిన భాగము లనేకములు కలవు. వాని నాతొలివిమర్శనములో విశదీకరించియే యున్నాఁడను. నే నప్పు డప్పుడు మనుచరిత్రముపై వ్రాసిన విమర్శనముల నన్నిటిని సచ్చరితులు చదివి చూచుకొని తరువాతఁ దమయభిప్రాయముల నేర్పాటు చేసికొనఁగోరుచున్నాను.

కా॥ బ్రహ్మయ్యశాస్త్రి.

# జన్మదినోత్సవపద్యములు.

బ్రహ్మర్షి డాక్టరు. సర్. ఆర్. వేంకటరత్నము నాయుడుగారి జన్మదినోత్సవమున శ్రీపిఠాపురము యువరాజావారు రచించి చదివిన పద్యములు.

సీ. పూవులువిచ్చినఁ దావులు విరిసినఁ బరమేశుమహిమయే ప్రజ్వలించుఁ
విహగములు పాడిన వీణెలు మ్రోసినఁ బరమేశుమహిమయే ప్రజ్వలించుఁ
పవనుండు వీచినఁ బల్లవం బదరినఁ బరమేశుమహిమయే ప్రజ్వలించు
మేఘంబు లుఱిమిన మెఱుపులు మెఱసినఁ బరమేశుమహిమయే ప్రజ్వలించుఁ
గీ. గాని, స్వార్థరహితుఁడయి కరుణ పొంగ, సర్వమానవసంసేవ సలుపునట్టి
భక్తనరునిజీవనమందువలె మఱెందు,నీశుమహిమ వెలుఁగఁజాల దెంచిచూడ.
ఆ. వె. రత్నరాశికంటె రజత పుగనికంటె, రమ్యదివ్యసౌధరాజికంటె
రాజ్యమహిమకంటె, రణజయోన్నతికంటె, విశ్వసేవకుండు విలువకాఁడె ! 2
ఆ. వె. కాన, నోమహాత్మ! మానసీయము లైన, త్వచ్ఛరీరజీవితములు మాకు
విలువలేని వింతవిరజాజిదండలు, వాడకుండుఁగాక వానిపూలు. 3
గీ. ప్రమదమునఁ జేరు గగనమ్ము భరతపక్షి,వంతఁబొందదయ్యదిసుఖవర్తియెపుడు
నయిన,దానిఁజూడఁగ లేకయార్తిఁజెంది,వసుధపైనున్న జనుఁడెంతొపరితపించు.
సీ. ప్రాణులప్రాణ మౌ పరమేశుఁ డిచ్చు నాయుర్వృద్ధి నీకు సర్వోపకార!
లోకరక్షకుఁ డైనలోకేశ్వరుం డిచ్చు నారోగ్యవృద్ధి నీకాత్మవేది !
శాంతస్వరూపుఁ డౌ సర్వేశ్వరుం డిచ్చు శాంతి వృద్ధియు నీకు సత్యవాది !
ప్రేమవారిధి యైన విశ్వేశ్వరుం డిచ్చు సౌఖ్యవృద్ధియు నీకు సౌమ్యశీల !
ఆ. వె. ఈవుమాత్ర మెపుడు నేమైనఁగానిమ్ము, మమ్మువదలవలదు మఱియు మమ్ము
నుద్ధరింప నీవె యుండితీరవలయు,వేఱు తలఁపవలదు విదితనీతి.

# శ్రీ దేవీభాగవతము.

సుప్రసిద్ధపండితు లగు దాసు శ్రీరామపండితులు రచియించినది. శ్రీదేవీ భాగవతమును వీరికంటె ముందు, ములుగు పాపయారాధ్యులును, తిరుపతి వేంకటేశ్వరకవులును దెనిఁగించి యుండిరి గాని వారిభాగవతములకంటె వీరిదియే ముందు ప్రకటింపఁబడినది. శ్రీరామపండితులు 1900 సంవత్సరమున నీమహాభాగవతాంధ్రీకరణమును బ్రారంభించి యైదునెలలలోఁ బూర్తిచేసినా రనిన వారికవితాధార యెంతయనర్గళ మైనదో యుభయభాషాపాండిత్య మెంత మిన్న యైనదో చెప్పక చెప్పుచున్నది. శ్రీరామపండితులు - లోకములో భాగవతముంగూర్చి వ్యాపించి యున్న యనవసరమైన శైవవైష్ణవ భేదవాదములను సప్రమాణముగఁ జక్కఁగా నిరసించిరి. వారి యభిప్రాయమిది:—

"ఈవిధముగ నొకపురాణమునందు నొకదానికిఁ బ్రాధాన్య మిచ్చి మరియొక పురాణమునందు మరియొక పురాణమునకుఁ బ్రాధాన్య మీఁబడినట్లు గానవచ్చుచున్నది.

దీని కొక వింతయేమి: వ్యాసుండు తానేదేవతనుగూర్చి యే కథసెప్పెనో ఆకథకును ఆదేవతకును బ్రాధాన్యమిచ్చినది యెవ్వరికి దెలియదు. అంతమాత్రముచే నందొకటి ముఖ్యమనియు మరియొకటి యముఖ్యమనియుం జెప్పుట యుచితమా. "సోర్ధ్వ పుండ్రముఖం దృష్ట్వా వ్రతం చాంద్రాయణం చరేత్"అనిచెప్పిన చోటనే "తిర్యక్పుండ్రధరం దృష్ట్వా చండాలమివ సంత్యజేత్" అని చెప్పలేదా. కావున నుభయపురాణములును ముఖ్యములే అని మనము గ్రహించుట యుచితముగానున్నది. రెంటికిని లఘుత్వము చెప్పినను చెప్పవలసివచ్చును.

ఇంతకును వారివారి భక్త్యతిశయముల ననుసరించి భాగవతపురాణములు రెండింటిలో నొకదానిని వారువారు పురాణ మని యనుకొందురే కాని నాతాత్పర్యమందు రెండుభాగవతములును పురాణము లనియు వ్యాసప్రోక్తము లనియు పఠనీయములనియు నమ్ముచున్నాఁడను.

మహాయనియు ఉపయనియు భేదములు కల్పించుకొని ముఖ్యత్వాముఖ్యత్వములను జెప్పుట యుక్తము కాదని తలంచెదను."

ఈగ్రంథములో మొదట శ్రీరామపండితుల జీవితచరిత్ర సంగ్రహమును, బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధానులుగారి యుపోద్ఘాతమును గలవు.

వెల రు 6 లు. బెజవాడ వాణీముద్రాక్షరశాలాధిపతులయొద్ద దొరకును.

# సాహిత్యసభ.

ఆంధ్రసాహిత్యపోషణార్థమై పరిషత్కార్యస్థానమునఁ గూడ వివిధ విద్యావిషయములం గూర్చి పండితులచే నుపన్యాసము లిప్పించుట కర్తవ్య మను తలంపుతో, ది 2-2-1935 తేదిని, సాహిత్యసభ యొకటి కావింపఁబడినది. అందువిమర్శకాగ్రేసర బ్ర॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు భవభూతి యుత్తరరామ చరిత్రము నందలి ప్రధానరస మేది యను విషయముం గూర్చి యుపన్యాసముగావించిరి.

ఈనాటకమునందలి ప్రధానరసము "కరుణవిప్రలంభశృంగార" మని తేల్చిరి. వారియుపన్యాససారసంగ్రహము నీక్రింద నిచ్చుచున్నారము.

ఉత్తరరామచరిత్రమునందలి ప్రధానరసము కరుణవిప్రలంభశృంగారమా, కరుణమా యను వివాద మీనడుమ బైలువెడలినది. పరికించిచూడఁ గరుణమనుటకంటెఁ గరుణవిప్రలంభశృంగార మనుటయే సర్వవిధముల నుచిత మనితోఁచుచున్నది. కరుణవాదులు శ్రీరామునకు సీత మృతినొందిన దనుదృఢప్రత్యయము కలదు. కావునఁ బ్రత్యాశ కవకాశము లేదనియుఁ గాన నాటక ప్రధానరసము కరుణమే యనియు వ్రాసిరి. ఇది సరికాదు. రామునకు సీత మరణించిన దను దృఢప్రత్యయము కల దనుటకు నాటకములోనే యాధారమును లేదు. సీత పూర్ణారోగ్యస్థితిలో నుండఁగా నడవిలోనికిఁ బంపివేయఁబడినది. అట్లు పంపఁబడిన తరువాత నామె యేమైన దనువార్త రామునకు నేవిధమునను గూడఁ దెలియరాలేదు. అట్టిస్థితిలో నామె మరణించిన దను దృఢప్రత్యయ మాతని కెట్లు కలుగఁగలదు. ఆమె క్రూరమృగములతో నిండియున్న ఘోరారణ్యములో నేకాకినిగా విడువఁబడినది, గావున, నాక్రవ్యాదులచే భక్షింపఁబడిన దని రాముఁడు దృఢముగా నిశ్చయించుకొనె నని కరుణవాదులు వాదించుచున్నారు. అట్లు వాదించుట కవకాశము లేదు. ఘోరారణ్యములో సీత విడువఁబడుటచేఁ గ్రవ్యాదులచే హానికలుగునేమో యనుభీతి రామునకుఁ గలిగినఁ గలుగవచ్చును గాని తప్పక క్రూరమృగములచే నామె భక్షింపఁబడియె నను దృఢప్రత్యయమునకు రాముఁడు వచ్చితీరవలసిన యవసరము లేదు. ఘోరాటవులలో నేకాకినులుగా విడువఁబడిన యబలలు సురక్షితముగా నింటఁ జేరి స్వనాథులను గూడుకొనుట లోకములో లేదా! దమయంతి, యట్టిది కాదా. ప్రథమవనవాసములో సీతయును మృతికి లోనుగాక బ్రతికియుండి తుదకు నాథునితోఁ గలిసికొనలేదా! ఇట్టి యనుభవ

ముగల రాముఁ డిప్పట్టున సీత మరణించె నని దృఢప్రత్యయము కలవాఁ డెట్లు కాఁగలఁడు? సీత మరణించె నను దృఢప్రత్యయము రామునకు లేనియెడల రాముఁ డేల తీవ్రశోకము పాలాయె నని కరుణవాదు లడుగుచున్నారు. "శోకముయొక్క తీవ్రతాతీవ్రతలను నిర్ణయించుట కష్టము. పూర్వకాలమందు సీతావియోగము కలిగినప్పుడు రాముఁ డేడ్చిన యేడ్పతి తీవ్ర మని "అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అని యీ నాటకమునందే తెల్పఁబడినయది. రాముఁ డిక్కడనే గాదా యతితీవ్రముగా నేడ్చినాఁ డని సీత చిత్రకూటసందర్శనకాలమునఁ బలికినది. అప్పు డట్టి శోకముపాలైన రామునకు సీత మరణించె నను దృఢప్రత్యయము కలిగినదా. ప్రత్యాశ లేకపోయెనా! అది గాక యీకాలమున రాముఁ డేడ్చు సందర్భమున నాతఁడు శృంగారమునకుఁ గూడ నెడమిచ్చినాఁడు కాన నీదుఃఖమంత తీవ్రమే కాదు. రాముఁడే "అహహా విస్మయములో మునిఁగి తేలుచున్న నాహృదయమునందలి సుఖదుఃఖాతిశయము విప్రలంభమువలె నున్నది."(యదయం విస్మయ పరిప్లవమాన స్సుఖదుఃఖాతిశయో హృదయస్య విప్రలమ్భః)అని జృంభకాస్త్రము లెఱిఁగి తనరూపుననుండు కుశలవులఁ గనుట లోనగు ప్రత్యాసలంబట్టి పలికె. సీత వియోగమున కిప్పుడు తానే కారణము గనుక హెచ్చుగా నేడ్చినాఁడు. "క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా" అని రాముఁ డెట్లు పలికెనందురా యివి వాసంతికతో జరిగిన ప్రసంగములోనివి. వాసంతిక, రాముఁడు సీతను విడిచె నను కోపముతోఁ గూడినదై యాతనితో విరసప్రసంగము చేసెను. రాముఁడును నామెకు హృదయమిచ్చి మాటలాడ లేదు. సీతను విడువుమని ప్రజ లేల కోరి రని వాసంతిక యడుగఁగా నది ప్రజలకే తెలియునని రాముఁడు సమాధాన మిచ్చెనే గాని యున్న సంగతిని దెల్ప లేదు. లక్ష్మణుఁడు సురక్షితముగా నున్నాఁడా యని యడుగ దాని కొకపట్టున సమాధానమే యిచ్చినవాఁడుగాఁడు. పిమ్మట సీత యేమైనదని యామె యడుగ నామె తలంపుల కనుకూలముగా, నేమైన దన నేల క్రవ్యాదులు భక్షించి యుండును, అన్నాఁడు. ఇది యాతని హృదయములో నున్న తలంపనుటకు వలను పడదు. అదిగాక "నియతం విలుప్తా" అని నియత మను నుత్ప్రేక్షావాచకమును వాడినాఁడు గావున నది యూహామాత్రము గాని యెఱిఁగియుండి పలికిన పలుకు కాదని స్పష్టమగుచున్నది. ఇది సందేహద్యోతకము కావచ్చునుగాని దృఢప్రత్యయద్యోతకముగాదు. రామునకు సీత కనఁబడుట లేదను నూహ కలదుగాని మరణించినదను నూహ లేదు. "నాశితప్రియతమః" అనఁగాఁ గనఁబడకుండునట్లు చేయఁబడిన ప్రియురాలు గలవాఁ డని యర్థము. కరుణవాదుల వాద మంతయు నిస్సా

రమగుచున్నది. ఇంతయేల, నాటకముం బరికించిచూడ సీతజీవించియే యున్నదను నిశ్చయము రామునకుఁ గలదనుట కనేకోదాహరణములుగలవు. వశ్యవాక్కులగల మహర్షులు సీత వీరమాతయగుఁగాక యనియు, పుత్రపూర్ణోత్సంగయై యుండఁగాఁ జూచుభాగ్యము పట్టుఁగాకయనియు నాశీర్వదించిరి. ఆయమోఘాశీర్వాదములనువిని రాముఁడు ధన్యులమైతి మని సంతసించె. మఱియును, అరణ్యమున నున్నప్పుడు సీతను గాఁపాడుటకై దేవతలకుఁగూడ సాధ్యముగాని కార్యములఁ జేయుశక్తి గలదని నాటకమున వర్ణింపఁబడిన గంగాదేవియును, పృథ్వీదేవియును రామునిచే గోరఁబడిరి. సీత గంగాతీరమున వాల్మీకియాశ్రమముకడ విడువఁబడియె. ఆశ్రమస్థానము లందుఁ గ్రూరమృగములు క్రౌర్యము దక్కియుండు నని పెద్దలు చెప్పుదురు. ఇట్టియంగరక్షులఁ గావించిన రాముఁడు వ్యతిరేకవార్తాదియును వినరాక యుండఁగనే సీత మరణించిన దని యెట్లు నిశ్చయించుకొనఁగలఁడు. సీత జీవించియే యున్నది, అందుకు నిదర్శనము లుండఁగా శ్రీరామచంద్రునకు సీత మరణించినదను నిర్హేతుకాభిప్రాయ మెట్లు కలుగును. ఇంతయేల! సీత జీవించియున్నదనుదృఢనిశ్చయము రామునకుఁగలదని నాటకమువేనోళ్ళ ఘోషించుచున్నది. అందుఁ బ్రధానమైనది, రాముఁ డశ్వమేధముచేయుట. తానుమృతపత్నీకుఁడనను తలంపుగలవాఁడే యగుచో నశ్వమేధ మెట్లుచేయఁగలఁడు, మృతపత్నీకుఁడగు విధురుఁడు కర్మాధికారము లేనివాఁడు. అతఁడుయాగముచేయుటకధికారముండదు. ఈయంశమును నాటకమే సూచించుచున్నది. రాముఁ డశ్వమేధము చేయు నను మాట యెచ్చట వచ్చినను నాతనికి సహధర్మచారిణి యెవ రనియు మరలఁ బెండ్లియాడినాఁడా యనియుఁ బ్రశ్నలువేయఁబడుచు వచ్చినవి. దీనింబట్టి మృతపత్నీకుఁడు క్రతువు నొనరింపరా దని నాటకము తెల్పుచున్నట్లు స్పష్ట మగుచున్నది. కావున రాముఁడు సీతాప్రతికృతిం బెట్టుకొని యశ్వమేధ మొనరించుటచే నాతనికిఁ దనభార్య జీవించి యున్నదను దృఢనిశ్చయము కల దనుట స్పష్ట మగుచున్నది. కావుననే భార్యాప్రతికృతినిఁ బెట్టుకొని క్రతువు చేయవచ్చునను ధర్మశాస్త్రవాక్యములో జీవించి యుండియుఁ గ్రతువులోఁ బాల్గొనుటకు నవకాశము లేనప్పుడే ప్రతికృతిని బెట్టుకొనవలయునను విధి కాన్పించుచున్నది. భార్య విదూరస్థయై యున్నపుడు ప్రతికృతినిబెట్టుకొని క్రతువు చేయవచ్చునని శాస్త్రముబోధించుచున్నది. కావున రాముఁడట్లశ్వమేధముచేసెను. సీత, అయోధ్యకుసమీపమున నున్న వాల్మీక్యాశ్రమముననే యున్నదనిన కరుణవాదులే తమమాటను రద్దుచేసి

కొని క్రతుకాలమున నామె పాతాళలోకమున నున్నదని చెప్పిరి. కనుక విదూరస్థయై యున్న దన్నమాటయే గదా! పరలోకమున నున్న భార్యయొక్క ప్రతికృతిని బెట్టుకొన వచ్చునెడల మరణించి పరలోకము నందున్న భార్యల ప్రతికృతుల నేల పెట్టుకొనరాదని కరుణవాదులు శంకించిరి. సీత యీదేహముతోడనే పరలోకమున కేగినది గాని దేహమును వీడికాదు. దశరథుఁడు స్వర్గమున కేగి యుద్ధములో దేవతలకు సాయ మొనరించెను. అతఁ డచటికిఁ బోయియున్న కారణమున నాతనిని మరణించినవానినిగాను, అతనిభార్యలు వైధవ్యము నందిన వారలఁగాను నెవ్వరైనఁ దలంచిరా! ఆతఁడే రాముఁ డరణ్యమునకుఁ జనినతర్వాత బెంగపెట్టుకొని తనువు విడిచి స్వర్గమునకుఁ బోయె. అపు డాతఁడు మరణించినవాఁడుగా నెంచఁబడియె. అతనిభార్యలకు వైధవ్యము సంప్రాప్త మయ్యె. కావున నీలోకమున సంప్రాప్తమైన యీదేహముతోఁ బాతాళలోకమునకుఁ జని యున్న సీతను మృతులైన వారితో సమముగా నెంచఁదగినదికాదు. శ్రీమతి సరోజినీనాయఁడమ్మగా రీకాలమునఁ బాతాళలోకమునకు (అమెరికాకు) వెళ్లుచు వచ్చుచుండునట్లే సీతాదేవికూడఁ బాతాళలోకమునకు వెళ్లుచు మరల భూలోకమునకు వచ్చుచుండెను. ఈలోకమునకు వచ్చి రాముని కామె యనేకోపచారములుచేసె. ఇట్టిసీతను మృతులలోఁ జేర్చుట యెంతమాత్రమును దగదు కావునఁ బాతాళమందున్న సీతయొక్క ప్రతికృతిని బెట్టుకొని రాముఁ డశ్వమేధము చేయుట న్యాయముగనే యున్నది. విదూరస్థయనగా క్రతుకాలమున నునికి తెలియమిని లభించుస్థితిలో లేనిదనినమాటయేగదా. భార్యాప్రీతికై శ్రౌతయజ్ఞక్రియలు సాగుననుట తగదు.

అంతర్నాటికాంతమున సీత కాన్పింపఁగా సీత జీవించియున్న దను వింతరామునకుఁ గలిగినది గాని యాతనికి నామెజీవించి యున్న దను తలం పప్పుడుక్రొత్తగాఁ గలిగినదిగాని మొదటినుండియు లేదని కరుణవాదులు తెలిపిరి. అంతకుఁబూర్వమందు సీత జీవించియున్న దను ప్రత్యాశ రామునకుఁ గలుగనిచో సీత కాన్పించినప్పుడు లక్ష్మణునితోఁ గూడి యాతఁడు-దైవానుగ్రహమువలన మనమను కొనినట్లేయైనది- (దిష్ట్యా తథైవైతత్) అని యెట్లు పలుకఁగలిగెను. దీనింబట్టి యింతకుఁ బూర్వమునందే సీత జీవించియున్న దనియుఁ గుశలవులం గనిన దనియు వారు భావించుకొని యుండినట్లు స్పష్ట మగుచుండలేదా. రామునకు సీత జీవించియున్న దనుతలం పుండుఁగాక. ఆమెను విడిచివేసినవాఁడు మరలనెట్లుస్వీకరింపఁ గలఁడు. కావున నీవిధముగాఁ బ్రత్యాశ లే దని చెప్పవలసి వచ్చుచున్న దని కరుణవా

దులు వాదించుచున్నారు. కాని దీనికిఁ దగుసమాధానము నాటకమే యిచ్చుచున్నది. విడిచిపెట్టిన సీతను మరల స్వీకరించుట యెట్లను ప్రశ్న ప్రస్తావనయందే గలదు. సీతారాములను గలుపుటయే నాటకప్రధానోద్దేశము. అది యెట్లు కలుగు ననఁగా దేవతలయొక్కయు ఋషులయొక్కయు ననుగ్రహముచేఁ గలుగు నని తెల్పఁబడినది. నాటకమునఁగూడ నాపుత్రులను రాముఁ డాదరించునా యని సీత ప్రశ్నింపఁగాఁ దమస, దేవతలును ఋషులు నందులకుఁ బ్రయత్నించుచున్నా రనియు నందుల కై వారొకసంఘముగా నేర్పడినా రనియుఁ బలికినది. ఆసంఘము వసిష్ఠుఁడు, వాల్మీకి, అరుంధతి, భాగీరథి, పృథ్వి మున్నగువారితోఁ గూడుకొనియున్నదని నాటకమే తెల్పుచున్నది. వసిష్ఠుఁడు సీతారాముల కిప్పుడు వియోగము గలిగినను మరల మంగళమే కల్గునని చెప్పుట ప్రత్యాశను గలిగించుచున్నది. ఇది రామునికడఁ బలుకలేదే యందురేని మాటలు కోటలు దాఁటును కాన, ఋష్యశృంగాశ్రమములోఁ బలువుర యెదుటఁ బలికినపలుకులు రామునకుఁ దెలియవచ్చుట వింతకాదు. పైనిఁదెల్పఁబడిన పెద్దల మహాయత్నముచే వారుభయులుం గలిసిరి. ప్రతికృతిని బెట్టుకొని రాముఁ డశ్వమేధముం జేయుట సీతారాములు కలియుదు రను ప్రత్యాశను దెలుపుచున్నదని యరుంధతి పలికినది.

“ఏకోరసః కరుణఏవ” అని భవభూతియే పల్కినాఁడే. నీ విందలి రసము శృంగార మని యెట్లు చెప్పఁగలవని యందురేని “ఏకోరసః కరుణఏవ” అనువాక్యములు నాటకములో నొకపాత్రమగు తమసచేఁ బలుకఁబడినవి. నాటకమునందు వచ్చు నొకపాత్రము నాటకప్రధానరసము కరుణ మని వెల్లడించిన దనుటకంటె వింత మఱియొక టుండనేరదు. అది నాటకరసముంగూర్చి ముచ్చటించునదికాదు. ముచ్చటించునదియె యందురేని కరుణశబ్దమునకుఁ గరుణవిప్రలంభమను నర్థము కూడఁగలదు. విప్రలంభములలోఁ గరుణనామక మొక్కటి గలదు. కరుణవాదులాయంశము నంగీకరించియేయున్నారు. కాఁబట్టి “ఏకోరసః కరుణఏవ” అనినప్పుడు కరుణవిప్రలంభ మని యర్థముచెప్పుకొనవలెను. ఈవాక్యమే యనేకులను భ్రమపెట్టుచున్నది. ఇంతయేల, శాస్త్రములు, నాటకనామకరూపకమునందలి ప్రధాన రసము శృంగారమో వీరమో మాత్రమే యై యుండవలయు నని తెల్పుచున్నవి. భవభూతి శాస్త్రానుగుణముగాఁ బోవువాఁడని కరుణవాదులే చెప్పిరి. అట్టివాఁడు శాస్త్రవిరుద్ధముగాఁ దననాటకమును గరుణరసప్రధాన మెట్లుచేయును. సాహిత్యదర్పణ టీకాకారుఁడు శృంగారవీరములే నాటకములోఁ బ్రధానములై యుండ

నవసరములేదు. ఇతరరసములు నుండవచ్చునని పల్కినాఁడనియుఁ గావున నాటకము కరుణరసప్రధానముకావచ్చుననియుఁ గరుణవాదులు పలికిరి. ఈటీకాకారుని వాక్యములు మూలమునకుఁ జాల విరుద్ధముగా నున్నవి. శృంగారమో వీరమో మాత్రమే ప్రధానముగా నుండవలయునని మూలము చెప్పుచుండఁగాఁ దద్వ్యతిరేకముగా జ్ఞాపికాకారుఁడు పలికినపలుకు లెక్కుడు ప్రమాణములగునా! అదిగాక కరుణరసప్రధానమగు నాటకము మఱియొక్కటి కాన్పించినదా; కాన నిప్పట్టునఁ గరుణరసప్రధానుల వాద మంగీకరింపఁదగినది గాదు. శృంగారమో వీరమో నాటకములోఁ బ్రధానముగా నుండవచ్చు నని లక్షణము చెప్పుచున్నది కావున భవభూతి మహావీరచరిత్రమును, వీరరసప్రధానముగాను- ఉత్తరరామచరిత్రము (కరుణవిప్రలంభ) శృంగారప్రధానముగాను-గావించి రెండునాటకములు వ్రాసెను. ఇతఁడు రచించిన వానిలో మూఁడవది యగుమాలతీమాధవము నాటకనామక రూపకముకాదు. అది ప్రకరణము. ప్రకరణములో శృంగారమొక్కటియే ప్రధానరసముగా నుండవలయును,గావున, దానినిశృంగారరసప్రధానముగాఁ జేసినాఁడు. ఈప్రకారముగా శాస్త్రమునే యనుసరించినాఁడు. పూర్వవ్యాఖ్యాతలెల్లరునుత్తర రామచరిత్రము కరుణరసప్రధానమనిరని కరుణవాదులుచెప్పిరి. అదిసత్యముగాదు. వ్యాఖ్యాతలలోనెల్ల నారాయణభట్టు మిక్కిలిప్రాచీనుఁడని చరిత్రాభిజ్ఞులు వ్రాయుచున్నారు. ఈతఁడు వ్రాసిన భావార్థదీపిక యను వ్యాఖ్య నాటకము కరుణరసప్రధానమనుటలేదు. కరుణవిప్రలంభప్రధానమనుచున్నది. కావున నాదినుండియు భవభూతికృతనాటకము కరుణవిప్రలంభశృంగారప్రధాన మను వాడుకయున్న దనియు నదియే సత్యమనియు గ్రహించుకొనవలయును.

ఇత్యాదిగా శాస్త్రులుగా రుపన్యసించిరి. గ్రంథవిస్తరభీతిచే ననేకాంశములు ప్రకటింపలేకపోయితిమి. ఇఁకనొక విశేషము గలదు. శాస్త్రులుగారు తాము నాఁ డుపన్యసింతుమని మాకు బాసయిచ్చినతర్వాత వారికి ముఖపక్షవాతము వచ్చినది. మూతి వంకరపోయినది. మాటలు కొంచెము ముద్దగా వచ్చినవి. అయినను వారు వాగ్దానముచేసిన రీతిగా నియతదినమున యథాకాలమునకు సభకు విచ్చేసి రెండుగంటలవఱకు మృదుమధురగ్రాంథికశైలి నుపన్యసించిరి. ఇది శ్రీశాస్త్రుల వారు దేహసంరక్షణముకంటె దేశసంరక్షణమే ముఖ్యముగా నెంచుకొనువారను నంశమును వెల్లడిచేయుచున్నది.

క. అదికారణముగ నతనికి, సదృశం బగుగుణము నీకుఁ జాలదు భువిలోఁ
బాదలనిపెద్దతికంబులు, పొదపెట్టక[1] మగిడి పొమ్ము భోజనృపాలా. ౫౫
వ. అనుడు నసంతరంబ. ౫౬
శా. లగ్నం బీక్రియ విఘ్న మొందిన నిరాలాపంబుగా విస్మయో
ద్విగ్నస్వాంతనృపాలపౌరహితవందివ్రాత మీక్షింపఁగా
భగ్నోత్సాహమనోరథుం డగుచు భూపాలుండు లజ్జాభరా
భుగ్నాస్యాంబుజుఁ డౌచు నింటి కరిగెం బుణ్యం బగణ్యంబుగన్. ౫౭
వ. అంతఁ గొంతకాలంబున. ౫౮

—♦ రెండవబొమ్మకథ ♦—

క. మొలఁ బులితోలును మేనం, బలుచని వెలిపూఁత యటుతఁ బాములపేరుం
దల మిన్నేటియు జడలను, జలివెలుఁగుం గలుగు మేటిజంగముఁ గొలుతున్.
సీ. అనుచుఁ గడంకతో నాభోజతిలకుండు దివ్యాసనం బెక్కఁ దివిరి మఱియు
ఫలకుసుమాదిశుభద్రవ్యములు గూర్చి సర్వపూజలుఁ దొంటిజాడఁ జేసి
కవిరాజభూసుర గాయకపాఠక నర్తకులును దనకీర్తి పొగడఁ
బసిఁడిగిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు శిరమున మౌక్తికశేష లిడఁగ
ఖడ్గహస్తుఁ డగుచుఁ గదలి నృపాసనప్రాంతభూమి చేరె గ్రహబలంబు
గలుగువేళఁ బూర్ణఘటికాంతనాదంబు, చెవుల సోఁకినంత శీఘ్రగతిని. ౬౦
క. శింజాయితమంజీర, వ్యంజితనీలాంశుభృంగ మగు పదకంజం
బంజక యిడఁగా వేళా,భంజని[2] యై యచట సాలభంజిక పలికెన్. ౬౧
క. ఓహో భూవర వలవని, హాహూలివి[3] యేల విక్రమార్కునిసరిగా
సాహసమును గంభీరో,త్సాహంబును లేక యెక్కఁ దరమే నీకున్. ౬౨
గీ. అనుడు నిలిచి భోజుఁ డాత్మగుణంబులు, చెప్పఁ జూచి మొదలితప్పుఁ దలఁచి
మాని నాఁటిబొమ్మపూనిక నీవును, దప్పకుండఁ జెప్పు తద్గుణములు. ౬౩
క. అనవుడు నది యిట్లను నీ,గొనములు గలనృపులఁ బేరుకొని చెప్పం జూ
చిన జగమున నుజ్జయినీ, మనుజేంద్రుఁడుగాక యితరమనుజుఁడు గలఁడే.
క. శుభలక్షణుఁడు వదాన్యుం, డభయుం డిఁకఁ గలుగనేర్చునయ్య "నభూతో
నభవిష్యతి" యనుపలు కా,ప్రభునకు సరిచెప్పుచోటఁ బలుకఁగవచ్చున్.
శా. ధారానాథ యనాథసస్యములకున్ ధారాజధారాధరా
కారుం డై కరుణామృతంబు గురియంగాఁ బ్రాజ్యసామ్రాజ్యల

1. పొదపెట్టక-శర. 2. భంజిక-చిన్నయసూరి. 3. వలదుసుమాహూలివి. యాహూలివి-చిన్నయసూరి.

ర్తిప్రరూఢిం జగ మెల్ల నుల్లసిలఁగా శ్రీవిక్రమార్కాఖ్యుఁ డు
ర్వ్వరామారమణుండు కీర్తిఁ బరఁగెన్ వీరుం డుదారుం డనన్. ౬౬

మత్తకోకిల. అమ్మహీశుఁడు నాఁడునాఁటికి నాత్మభూముల నన్యదే
శమ్ములందుల వార్తలం బరిచారకు ల్వినిపింపఁగా
నిమ్ముతోడ నవంతిపట్టణ మేలుచుండఁగ దూరదే
శమ్మువార్త లెఱుంగఁబోయినచారు లిద్దఱు వచ్చినన్. ౬౭

ఉ. అచ్చటివార్త లెల్లఁ దెలియ న్విని వారల నాదరించి మీ
రిచ్చటి కేగుదెంచునెడ నీసుమన్ గిరులందుఁ గానలం
దచ్చెరు వేమి గంటి రని యానతి యిచ్చిన నందులోన న
య్యచ్చ యెఱింగి యొక్కఁడు నరేంద్రున కి ట్లనియె న్వినీతుఁడై. ౬౮

సీ. చిత్రకూటాద్రిపైఁ జిత్రంబు గనుఁగొంటి నచటి బిల్వద్రుమప్రచుర మైన
పుణ్యతపోవనంబున రత్నకాంచనమయ మైన దేవతాలయము గలదు
లోకైకవంద్య మందాకినీజలధార తోరమై ముందటఁ దొరఁగుచుండు
నానీరు శుద్ధుపై నమృతంబుననఁ బోలుఁ బాపిపైఁ గాటుకభంగిఁ దోఁచు[1]
దానిపొంత నొకఁడు మౌనియై జపముతోఁ, బాయకుండ వేల్మి సేయుచుండు
నతని కెన్ని యేఁడు లరిగెనో యొలికిన, హోమధూళి హిమనగోన్నతంబు.

మ. అనిచోద్యంబుగఁ జెప్పిన న్విని తదీయాలోకనోత్సాహియై
మనుజేంద్రుండును దిగ్గనం గదలి రమ్యా చూత మావాని పా[2]
వనతీర్థం బని వానిఁ దోడుకొని భాస్వత్ఖడ్గసాహాయ్యుఁ డై
చనియెం గ్రూరమృగప్రచారతరువిస్తారంబులం దూఱుచున్. ౭౦

వ. ఇట్టి దుర్గమమార్గంబునం జనుదెంచుచు నొక్కయెడ. ౭౧

ఉ. భూరమణుండు గాంచె నతిభూరిపయోధరఝాట మాత్మవి
స్తారపునఃప్రరూఢపటుశాఖమహావటజూట మంచితో
ర్వీరుహసంభృతైకమునివీరకృతోటజవాటము న్సనా
సీరమణిప్రభాపటలచిత్రితకూటముఁ[3] జిత్రకూటమున్. ౭౨

సీ. అందులతీఁగె లింద్రాంగణాగములతోఁ జెలిమిసేయుచు మిన్ను గలయఁ బ్రాఁకు
నందుల వ్రాఁకులు నందనవనకల్పతరువులతోఁ గూడి పెరుఁగుచుండు

1. శుద్ధున కమృతమై పొలుపారుఁ బాపికిఁగాటుకభంగిఁదోఁచు-అనీరు పుణ్యుల కమృతంబువలెనుండు-చిన్నయసూరి. 2. చూత మాదివ్యపావన 3. చిత్రవనాటము.

నందుల క్రొవ్విరు లన్నదమ్ములమాక్షిఁ జుక్కలవాసన కిక్కసేయు
నందుల సెలయేఱు లాకాశగంగతో నటనలు సలుపుచు నాఁడుచుండు
నందుల మెలఁగు కరులైరావతముఁదామఁ, గమపుగట్టిమేసి మదము గురియు
నందుఁ గలుగు మాను లాసప్తమునులతో, నిత్యసత్యగోష్ఠి నిలుతు రచట.

ఉ. అందుల నొక్కనో జలకమాడుచునుండఁగఁ దొల్లి మేదినీ
నందనవక్త్రవేణినయనస్తనకాంతులు జాతిరూపులై
యిం దుదయించె నాఁగ నుతికెక్కుచుఁ బెక్కుదినంబు లంబుజేం[1]
దిందిరమీనచక్రములు దేలుచునుండు సరోవరంబులన్. ౨౪

క. వివిధద్వాదశరాసులు, దవిలి తిరిగి పాళ్లసంపదలు చేకుఱమి
న్నవరత్నరాసులకునై, నవగ్రహంబులుం దదంగణంబులఁ బొలయున్. ౨౫

క. వింతలుగా నగ్గిరిపొడ, వింతం తని చెప్ప నలవి యే వెన్నెలఁ ద
త్ప్రాంతంబునఁ గరఁగినశశి,కాంతంబులు చంద్రుకంపు గడుగుచునుండున్.

సీ. శిరమున విమలపుష్కరవతి యగుమాల్యవతి రత్నమాలికావతి యనంగ
మృగపాదఘట్టన మృదులమాజేగుఱుధూళి శేఖరితసిందూర మనఁగఁ
బ్రబలసమీరణోత్పతితంబు లైన పుష్పంబులు కరశీకరంబు లనఁగ
సర్వతోముఖసముచ్ఛాలనవారి[2]నిర్ఝరములు మదజలస్రావ మనఁగఁ
దన్నుఁ జేరినమేఘముల్ మన్ననంగ[3], సాలతరువులు బర్హధ్వజము లనంగ
నేచినీరాజ్యపట్టగజేంద్రులీల[4], నిలిచిపోలుచునయ్యచలంబునృపతిమ్రొక్కె.[5]

శా. లంకేశారిపదాంకితంబులు ఝురాలంకారకూలంకషల్
పంకేజాకరసంకులాంతరములం బ్రవ్యక్త దివ్యాంగనా
సంకేతంబులు మీనకేతనధనుష్టంకారశంకావహ
ఝంకారాళికులంబులుం గల మహాశైలస్థలుల్ చూచుచున్. ౨౮

క. ధారాధరమార్గాగత,ధారాళం బగుచు ధరణిధరమధ్యకృతా
ధారం బై ధరఁ బరఁగిన, ధారాతీర్థంబు గనియె ధారాధీశా. ౨౯

వ. కనిన నితని మనఃప్రసాదంబు దట్టం బై నిలిచె. ౩౦

క. దుర్మార్గునకైన మహా,ధర్మస్థలి నాత్మశుద్ధి దలకొను ననఁగా
ధర్మంబుల కాకరమా, నిర్మలునకుఁ జిత్తశుద్ధి నిలుచుట యరుదే. ౩౧

1. నుతికెక్కుదినంబులయందు నంబుజేం 2. చ్ఛాలనలోలి 3. పన్ననంగ. 4. ఉజ్జయినిరాజు పట్టగజేంద్రలీల-ఈపాఠము యతిచెడినది. 5. ఇక్కడ వ. "అచటఁ దెరువుఁజూపుచు మావంతు క్రియా హారుండు చూపమున్నుగానతండు చని చని" అని యొకదానిలోఁగలదు.

భుజంగప్రయాతము. అతం డంత సుస్నాతుఁ డై రత్నహేమాం
చితం బై సువర్ణాద్రి చెల్వొంది దేవా
న్వితం బైన హర్మ్యంబు వే సొచ్చి యాదే
వతం గాంచి పూజించి వచ్చె న్నతుం డై. ౮౨

గీ. అచటిహోమశాల కరిగి వహ్నానంబునఁ, దపము కలిమిదోఁప జపముతోడ[1]
మధురయుతములైన మారేడుఁబండుల, వేల్మి సేయుచున్న విప్రుఁ జూచి.

గీ. అన్నపుష్పఫలజలాక్షతాదులు చేత,నున్నవాఁడును[2] జపహోమములను
జేయువాఁడుఁ బ్రణతిసేయఁదగరుగాన,[3] మనుజవిభుఁడు మ్రొక్కమానిపలికె.

క. ఓవిప్రోత్తమ సవనం,[4]బీవెరవున జరుగ నెన్ని యేఁడులు చనియె
న్నావుడు నుబ్బస పుచ్చుచు, నావిధిచేఁతలకు నేమి యనఁగల దధిపా. ౮౫

ఉ. ఇచ్చట నేండ్లు నూఱు సనియెన్ జగదంబిక నాయవస్థకు
న్మెచ్చదు కూడు మాని రవి మీఁదఁ దపింపఁగ వేల్మి సేసి ము
చ్చిచ్చున వెచ్చుచుండి తెగఁ జిక్కితి నన్నఁ; గృపానువృత్తిఁ దా
నచ్చటివాని లేపి విహితాసనుఁడై నృపుఁ డాత్మనిష్ఠతోన్. ౮౬

క. వ్యాలోలకరాళకజి,హ్వాలం బగు సప్తజిహ్వవదనంబున భూ
పాలుఁడు మధుమిశ్రిత మగు, మాలూరఫలంబు వేల్చె మంత్రముకొలఁదిన్.

వ. అట్లు హోమంబు గావించిన నయ్యుమ నెమ్మనంబున నమ్మిక పొడమి పొడ
సూపకున్నం గడచూపునం గెంపుగదుర మదిం బదరి దొరకొన్నకర్జం బుజ్జ
గించుట యుజ్జగంబున నొజ్జల లజ్జ లుడుపు రజ్జులనుచు నుజ్జయినిఱేఁడు మారే
డుఁబండు మాని తన మెడం జూచి. ౮౮

గీ. పలుకుఁదేనియ గలతలపండు వేల్వఁ, దలఁచి తలచిక్కు చక్కమీఁదటికిఁ[5] జెరివి
యెడమకేలఁ దెమల్చుచు నడిద మెత్తి, మెఱుఁగుమిడుఁగుఱు లెగయగా మెడకుఁ బూనె.

వ. ఇట్లు పూని యుంకించిన. ౯౦

క. ఓహో నృప నీధర్మో,త్సాహములకు మెచ్చితిని నిజం బిది యిఁక నీ
సాహసము విడువు మని త,ద్బాహాఖడ్గంబు వట్టెఁ బరమేశ్వరియున్. ౯౧

క. పట్టి నిలుచుండి నృప నీ, కిష్టహితం బైన వేఁడు మిచ్చెద నని చే
పట్టిన మ్రొక్కి మహీవరుఁ, డి ట్టనియెం దల్లి మెచ్చి తెట్టులు నన్నున్. ౯౨

1. ఘనతపోవిభూతికలిమి మెఱసి 2. నున్నతనికిని 3. జేయునతనికి నతి చేయఁదగదుగాన
4. హవనంబీవైరవున.....నావుడునుబుస్సగొట్టుచు-చిన్నయసూరి, 5. చెక్కుమీఁదటికి,

మ. ఇతఁడు స్నానము సంధ్యయున్ జపము ని త్యేకాలముం జేయఁగా
శతవర్షంబులు పోయె నీద్విజుని మెచ్చం జెల్లదో మెచ్చుసం
గతి గాదో గుణ మానతి మ్మనిన నోక్ష్మాపాల యీమస్తర
వ్రతము ల్లలియుఁ జంచలంబు మతి భావం బల్ప మెప్పట్టునన్. ౯౩

గీ. మేరుశైలక్షీర మేరులంఘితమున, నాఁగు నీవ్రతంబు నగణితంబు[1]
చంచలాత్మకృతము సంకల్పరహితంబు, నైన జపము లెల్ల హానిఁ బొందు. ౯౪

క. దేవర భువిఁ గాష్ఠంబున, గ్రావంబునఁ గాంచనమునఁ గలుగఁడు శుచియౌ
భావమునఁ గలుగనేర్చును, భావజ్ఞా భావశుద్ధి పరమార్థ మనన్.[2] ౯౫

క. డెందంబున సందేహము, నొందక ప్రహ్లాదుతండ్రి నొడఁబఱిచెడుచో
నిందుఁ గలఁ డనినఁ గంబము,నం దుదయింపండె విష్ణుఁ డసురులు బెదరన్.

క. దేవద్విజమంత్రౌషధ, దైవజ్ఞాచార్యతీర్థధర్మముల యెడన్
భావన యేవిధమున నౌ, నావెరవున నచటి సిద్ధి యగునిద్ధగతిన్.[3] ౯౬

గీ. భావ మస్థిరంబు గావున వీనివ్ర, తంబులెల్ల నిష్ఫలంబు లయ్యె
నీవు నిష్ఠ నిట్లు గావించితివి గాన, గడియలోన మెచ్చు గలిగె నీకు. ౯౭

క. ధన్యుఁడ వనవుడు విని స, త్యన్యాదానమును దేవతావరమును రా
జన్యవరాజ్ఞయుఁ దిరుగుట, యన్యాయము గానఁ దిరుగ కంబిక వినుమా. ౯౮

ఉ. ఇష్టములెల్ల నాకుఁ దగ నిచ్చెద నంటివి సర్వమున్ వ్రత
భ్రష్టుఁడు నాక వీనికిఁ గృపామతి నిమ్మని మ్రొక్కినంత సం
తుష్టి వహించి దేవత చతుశ్శతవత్సరభోగ్యమైన యు
త్కృష్టమహీపతిత్వమును దివ్యపదంబును నిచ్చె వానికిన్. ౧౦౦

క. వానికి ని ట్లిచ్చి ధరి,త్రీనాయకుఁ బరిణమించి దేవియు నంత
ర్ధానమ్మునొందె విప్రుఁడు, నానృపు వెఱఁగంది పొగడి యరిగె నిజేచ్ఛన్.

శా. తత్సేవాఫలదర్శనంబున మహత్ప్రస్థాన విశ్రాంతిగా[4]
నుత్సాహంబును సాహసంబును బ్రతాపోదారభావంబు న[5]
త్యుత్సేకంబును భూషణాకృతులతో నొప్పారఁగా భూపతీ
వాత్సల్యంబున వచ్చె విక్రమయశోవర్ధిష్ణుఁ డుజ్జేనికిన్. ౧౦౨

వ. కావున నీ కిట్టి గుణంబులు సమకూరకునికి నెక్కంజనదు పొమ్మనిన విని భోజుం

1. మేరుస మానమౌ, ఘనతపంబులౌనగణితమైన, 2. పరతత్త్వ మనన్. 3. నీదుక్రియన్.
4. దదర్థ్వవిశ్రాంతిగాఁ జిత్తమందుత్సా. 5. గర్వోత్సేకంబున

డును మనంబున నతనిం గొనియాడుచు నుద్విగ్నితలగ్నుండై[1] సిగ్గుపడుచుఁ బూర్వద్వారగమనంబు మాని యపరద్వారగమనోత్సుకుం డగుచు నాఁటి కద్దివ్యాసనం బెక్కరాకుండుట తెల్లంబుగా మొగంబు తెల్లంబడఁ దిరిగి చని మఱి యొక్కనాఁడు. ౧౦౩

## మూఁడవబొమ్మకథ

క. ఉల్లోలదుగ్ధసాగర, కల్లోలకరాగ్రమందకంపితఫణభృ
ద్వల్లభమణిమయడోలా, వేల్లనసుఖలోలుఁ డైన వేల్పుం దలఁతున్. ౧౦౪

క. అని నియమంబున హితశా,కునికస్వరశాస్త్రవేదకోవిదయుతుఁ డై
యను వగుదినమున సింహా, సన మెక్కఁ దలంచి భోజజనపతి చేరెన్. ౧౦౫

క. చేరిన నచ్చటిపుత్రిక, యారాజుం బలికె వాసవాసన మెక్కం
గోరుట జగ మెఱుఁగ మహా,దారిద్ర్యుఁడు క్రతువు సేయఁ దలఁచుటచుమ్మీ.

ఉ. ఆర్యులఁ గూర్చి నేఁడు శుభమైన ముహూర్తము చూచి పట్టిగాం
భీర్యము దోఁపఁగాఁ దగని పెద్దఱికం బిది యేల సన్నపుం
గార్యమె విక్రమార్కనృపుగద్దియ యెక్కుట వానిఁబోల నౌ
దార్యము నీకుఁ గల్గినఁ బదం బిడు మోజగ భోజభూవరా. ౧౦౬

వ. అనుడు విస్మయమానమానసుం డై మానవేంద్రుం డాసింహాసనయానంబు మాని యనుమానించి మీనరపతివితరణంబు లే తెఱం గెఱింగింపు మనిన నది యిట్లనియె. ౧౦౭

సీ. బలమున నిజమునఁ బ్రాణరక్షణమున భీము భీమాగ్రజు భీమగురునిఁ
జెలువున సంకల్పసిద్ధిఁ దేజంబునఁ బద్మారిఁ బద్మజుఁ బద్మమిత్రు
శివభక్తిఁ గీర్తి విశిష్టదానంబున బాణు బాణారాతి బాణజనకు
నైశ్వర్యమున రతి నఖిలోత్సవస్ఫూర్తిఁ[2] గామసంహరుఁ గాముఁ గామసఖుని
నష్టభోగముల రణాటోపమున బుద్ధి, నింద్రు నింద్రతనయు నింద్రమంత్రిఁ
గ్రేణి సేయు ననుచు జాణలు వొగడంగ,నవని యేలె విక్రమార్కవిభుఁడు. ౧౦౮

క. సాహసము జయము బల ము,త్సాహంబుఁ బరాక్రమంబు ధైర్యముఁ గలని
ర్మోహకుని దొరయు నెడ సం,దేహించుచునుండు నాదిదేవుం డైనన్. ౧౦౯

క. నరుఁడు మగతనము నేర్పునఁ, బరఁగించెడుచోటఁ దోడుపడుదురు సురలున్
ధర గాళికునకుఁ దోడ్పడ, గరుడఁడు జక్రంబు హరియుఁ గలిగినభంగిన్. ౧౧౦

---

1. విఘ్నితాలంఘితకాలజ్ఞుండై 2. నఖిలలోకస్ఫూర్తి.

క. అనవుడు భోజుఁడు గౌళికుఁ, డనువానికి నెచట విష్ణుఁ డాయుధములు వా
హనమును దోడ్పడియెను నే,వినవలతుం జెప్పు మనిన వెస నిట్లనియెన్. ౧౧౨

గీ. తుంగసౌధశృంగసంగతాంబర మగుచుఁ, బూర్వభూమి నొక్కపురవరంబు
భజనకెక్కియున్న నిజమైనపేరిట,వెలసెఁ భువిఁ బ్రతాపవిషయ మనఁగ. ౧౧౩

వ. అట్టిపురంబున. ౧౧౪

క. సేనానికి నెన యనఁ బర,సేనాభంజకుఁడు గలిగె క్షితిపతి విష్వ
క్సేనారాధకుఁడు బృహ,త్సేనాఖ్యుఁడు బల్మి భీమసేనుఁడు వోలెన్. ౧౧౫

వ. ఆనరేంద్రునకు నావందివి యనుసుందరియును నయనానందంబుగా నొక్కనం
దన యుదయించె. ౧౧౬

క. ఆరాజతనూభవ క,న్యారత్నము మదను మోహనాస్త్రముక్రియ నా
కారంబున నొప్పును ధర,లో సాక్షికినెక్కు నది సులోచన యనఁగన్. ౧౧౭

క. భూవలయంబున నుపమా,జీవన మగు వస్తు వేక్చి చెప్పెద మనఁగా
నావెలఁది యవయవములకు, నేవియు సరిగాక యునికి నేమనవచ్చున్. ౧౧౮

సీ. మృదుపల్లవంబులు ముడురకయుండినఁ బదసరోజములసంపదలఁ బోలుఁ
గరికరంబులమేనఁ గర్కశభావంబు లేకయుండిన నూరులీలఁ బోలుఁ
జక్రవాకంబులు సడిసన్న రేయెల్లఁ బాయకుండినఁ జనుదోయిఁ బోలుఁ
జుక్కలఱేఁడు దా స్రుక్కక పొంగక కందకుండిన ముఖకళలఁ బోలుఁ
జంచరీకచయము సంచలింపక కూడి, నిలిచెనేని కురుల చెలువుదాల్చుఁ
బువ్వుఁదీఁగె మొదలిమవ్వంబు దప్పక,ననిచెనేని మేనియనువుఁబడయు. ౧౧౯

మ. తనలావణ్య మగణ్యదర్పమయమై తారుణ్యపూర్ణంబుగా
ననవద్యద్యుతితోడ నానృపతికన్యారత్న మేరాజనం
దనుల న్మెచ్చక మీఁది మేడకడ గంధర్వాంగనావిభ్రమం
బున నుండెన్ మృదువస్త్రగంధసుమనోభూషాదిభోగంబులన్. ౧౨౦

సీ. తరుణి యీక్రియ మేడఁ దరలకుండుటయును దెలిసి గౌళికుఁ డనుధీరవిటుఁడు
చాయలయుక్కునఁ జక్రంబు గావించి కాష్ఠయంత్రంబున గరుడిఁ జేసి
తా విష్ణుఁడై మన్మథప్రథనమునకు మెఱపుగాఁ గస్తూరి మిగుల నలఁది
పసపువన్నియ పట్టువసనంబు గావించి తిరునామ మొప్పఁగాఁ దీర్చి కడఁక
నెక్కి కీలున వాహన మెగయఁజేసి, పవనపథమునఁ జనుదెంచి బాలమోల
నిలిచి నేనిదె కృష్ణుఁడ నిన్నుఁ గూర్చి, వచ్చితిని నన్ను వరియింపు లచ్చికరణి.

చ. అనవుడు బాల విస్మయము హర్షము లజ్జయు నగ్గలింప నా
తని నట నుంచి యేగి తనతండ్రికి నట్టితెఱం గెఱుంగఁ జె
ప్పిన నతఁడు ప్రియంబున నభీష్టము నేఁ డొనఁగూడఁబోలు నీ
కని చనుదెంచి యచ్చట గవాక్షముఖంబునఁ జూచి యుబ్బుచున్. ౧౨౨

క. చల్లనికొండకు గిరిజా,వల్లభుఁ డల్లుఁ డగునట్టిపుణ్యమునఁ దల్లీ
నల్లనిదేవర నీచే, నల్లుఁ డనఁగఁ గలిగె నేఁ గృతార్థుఁడనైతిన్. ౧౨౩

క. అమ్మా తడయక కైకొను, పొమ్మా యని యనుప నేగి పొలఁతుక యచటన్
నెమ్మి దళుకొత్తఁగాఁ దన, నెమ్మన మలరంగ నాతని న్వరియించెన్. ౧౨౪

ఉ. గాళికుఁ డయ్యెడ న్మది వికాసము హాసముఁ గూడియాడఁగా
బాలిక నంతనంత మృదుభాషణభూషణ తోషణంబులం
గేలికిఁ జేర్చి లజ్జ కడకీ లెడలించుచు బుజ్జగించి పాం
చాలుని పోలిక న్సురతసౌఖ్యము తీపులు చూపె నేర్పునన్. ౧౨౫

ఉ. అజ్జలజాక్షియున్ హృదయమందునఁబుట్టినవానిపోరుచే
బుజ్జవ మియ్యకోలు గొనుపొందునఁ గూడిన నింపుగైకొనున్
సెజ్జకుఁ దాన చేరు రతిచేష్ట లెఱుంగఁగడంగు చెయ్వులన్
లజ్జయొకింత చేడ్పడఁ జెలంగుఁ బెనంగు ననంగకేలినై. ౧౨౬

క. ఇటు నానాఁటికి నొయ్యనఁ, గుటిలాలక యులుకు దీర్చుకొనుచుం దనకొఁ
గిట నాదటఁ జెలఁగఁగ న, వ్విటుఁడు న్సురతుల గారవించుచుఁ దివురున్.

సీ. అంగుష్ఠ మడుగు గుల్ఫాంతంబుఁ జిఱుదొడ జఘనంబు నాభి వక్షంబుఁ గుచము
భుజమూలములుగళంబును జెక్కు మోవియునయనములు న్నుదురుముందలయునునఁగఁ
గలుగుచోటులఁ జంద్రకళలఁబెంపునఁ జెక్కు నారోహణావరోహణము లెఱిఁగి
బీజమంత్రాక్షతవ్యాజహృద్భాషల [1]హృదయాదిమర్మంబు లెక్కఁజేయు
సుఖముఖాంకనఖరచుంబనభూషణ,గ్రహణతాడనములఁ గదలఁబొడిచి
చిత్తశయను దెలిపి యుత్తానశాయిత,ముఖ్యసురతతంత్రములఁ గలంచె. ౧౨౭

క. మనసిజమర్మజ్ఞునితోఁ, మనమలరఁగఁ బెనఁగి కరఁగె మానిని రతిసం
జనితసుఖంబున నెలపొడు,పునఁ గరఁగెడు చంద్రకాంతపుత్రికఁ బోలెన్.

శా. ఆజాడం గుచచక్రవాకరుచి పెంపారం దదీయాననాం
భోజాతప్రభ లుల్లసిల్లఁగ సముత్ఫుల్లాక్షి [2]మీనద్యుతుల్

1. దృగ్బాణముల్ హృదయాదిమర్మవాహికలఁజొనిపి 2. పెంపారంగ శుంభన్ముఖాంభోజంబు లీక్షసింపుచుం జెలఁగ నుత్ఫుల్లాక్షి.

తగు నిప్పుడు కుజంబు నెగడును మదకరి బెగడును చెలి సాధుఁ బొగడ దనఁగఁ
గనఁగ విందురు కందు రనుటకుం దృప్తు వచ్చి విందు కందు రన నిట్లు వెలయునింక
లఘ్వాదు లైన చలస్మరవరచరప్రముఖములౌ క్రియాపదములందె
యిత్వ మేర్పడక నొక్కెడల నడంగు నట్టులుగాఁగ నిలిచిన నిలుచు వినుఁడు
చలియించెను జలించె స్మరియించెను స్మరించె వరియించెను వరించె వహిఁ జరించెఁ
జరియించెను ధరించె ధరియించె నన నొప్పు నిటువలె మఱికొన్ని యెఱుఁగఁదగును
గణియించెను గణించె ఘటియించెను ఘటించె హరియించెను హరించె ననఁగ నింకఁ
జూచెనే ననుటకుఁ జూచుడు నాఁగను వచ్చెనే ననుటకు వచ్చుడు నన
మెచ్చెనే ననుటకు మెచ్చుడు ననిన లిఙర్థక్రియ లగుచు నలరు నవలఁ
బ్రైకొంటి కొకక్రియ వెట్టెడిచో నాది నిలుపక కడపటను నిలుపఁదగు
నటులుగాక నడుమ నచుకింపఁ దగదండ్రు దొరకెను గజఘటల్ దొరకె హరులు
కరిఘట లుత్తరగము ల్దొరకె ననుట యొప్పుఁ గరిఘట లబ్బెను దురగము లన
రా దింకఁ దుదియకారమున కెత్వము లేదు క్రియలపట్టుల నెత్వమయి తనర్చు
నెద్దు పర్వెత్తిపోయెను నాఁగ బంటు పనివినియె నా నిట్లు నెగడు మఱియు
నూయెల పయ్యెద తాయెతులనడిమి యెత్వమునకు యత్వ మేత్వమునకుఁ
జాయకుఁ బాయకు లోయకు ననుపల్కులం దెత్వ మమరక యత్వ మగును
సరవి సముచ్చయశబ్దాంతములఁ గ్రియ నమరింప బహువచనముగఁ దనరు
నేకవచనముగా నెసఁగదు వినుఁ డింక శ్రీశుండు హరియు వచ్చి రన మఱియుఁ
గమలజుం డింద్రుండుఁ గార్తికేయుఁడు వచ్చి రనఁగఁ జెల్లును వచ్చె ననఁ దగ దింక
వేపోక లనుటకు వేయిపోకనఁ జెల్లు జాత్యేకరచనాఖ్యసరణి నిట్లు
చిగురాకు గలయ మొల్చె నటంచు నాముక్త మాల్యదఁ బెద్దనామాత్యుఁ డనియె
నవల నాచార్థమందలి క్త్వప్రత్యయాంతంబులకును బర్యాయపదము
నెఱిఁగింతుఁ దెలియుఁడీ యిలకుఁ గోకగుచున్న సంద్రంబనఁగ ని ట్లెసఁగుచుండు
నింక స్వార్థములందు హేత్వర్థములయందుఁ గలుగుణిచ్చులయర్థములు వచింతు
నవి యె ట్లన వినుండు వివరంబు మీఱ నింపుదు రింతు రనఁగ నొప్పును బహుతను
భువి భక్తులు గణియింపుదురు కీర్తింతురు హరిగుణాము లనంగ స్వార్థణిచ్చు
కన దీని కేకవచనమున కింపు నించును వచ్చు నెఱిఁగింతుఁ గనుఁడు తెలియ
ఘనుఁ డెఱిఁగింపునా జనుఁ డెఱిఁగించునా లక్ష్యము లిట్లు చెలంగు నవల
నూహింపఁ బనిచేయుచుండెడు నరుని జేయింపుచున్నాఁ డని యిటులు చెప్ప

మాటయె యలహేతుమణ్ణిజర్థంబునఁ బరఁగుచునుండు నిప్పుగిది మఱియుఁ
దద్ధాతుమణ్ణిజర్థంబునఁ దముగల్గి యిప్పింత మనఁగ నిల్లెసఁగుచుండు
నొగి స్వార్థణిచ్చునన్దుము గల్గి కాలత్రయమున నిత్తు మనంగ నమరుచుండు
నవల యజంతార్థ మతిశయమున నేని మాటిమాటికి నేని తేటగాఁగ
సూచించు నతఁడన సొరిది మీఱఁగ నిట్లు లక్ష్యంబు లెస్స చెలంగు నింక
దొరఁకొన నామధాతుప్రక్రియార్థము తనయుండు కావలె ననుచు నిచ్ఛ
గలుంచుట యన్నట్లు లింక క్యజర్థము కృష్ణునివలె నాచరించుచున్న
వాఁడన నిట్లింక వహిఁగ నాఖ్యానార్థ మిలను సత్యమ్ముగఁ బలుకు ననుమొ
దలయిననుడువులై తగునింక భావకర్త్రార్థము తెలిపెద నగుట యనఁగఁ
బ్రభువుచేత నొసంగఁబడుట యనఁగ నిట్టి నుడులు లక్ష్యమ్ములై యడరు నవలఁ
బ్రార్థనం బగుచోటఁ బ్రశ్నంబువిశె సంశయంబుదిక్కున నిర్ణయంబుపట్ల
నెత్వము నొత్వము నౌత్వము వరుసగా నలరు దీనికి లక్ష్యములు వినుండు
వనితరావే యన వానలు గలవేమొ నాఁగ నీవో యతండో గణింపఁ
జెలియ నీవేచుమీ చేరనౌ నన నింక నందించు నెందను నట్టి నుడులు
నటు నిటు నెటు లన నమరు నౌ నటుఁజూతు నిటుఁబిల్తు నెటుఁబోయెఁబటమనఁదగు
నటవలెఁ గాదని యిటనాడెడినెలంత యటఁబాడెడి ననంగ నమర నింకఁ
గ్రియలు విభక్తు లవ్యయములు సంస్కృతపదము లైన నొకచోఁ బరిఢవిల్లుఁ
దెనుఁగున "మాధవం మనసా భజంతి సంతత" మనినట్టుల "దరరథాంగ
పాణియుగ్మాయ తుభ్యం నమో" యన నిట్లు "దహనబింబాధరస్తనభరేషు"
నా వహి మఱియు "సద్ధావాగ్విబుధ" మనిన ట్లనువాదాన నటులు గాక
భవతి దదాతి బిభర్తి భాతి చరంతి గిరతి శేతే యను క్రియలు చొరవు
రామః పయోధరం గ్రామేణ సర్వస్య యనెడువిభక్తులు నునుపఁ గావు
కృత్వా హసిత్వా పరిత్యజ్య నాఁగ క్త్వాంతల్యబంతావ్యయాల్ తగవు కృతుల
రేసి గరీయాన్ వరీయా ననెడి యీయసున్ ప్రత్యయాంతము ల్చొరవు తుదల
నెన్నంగ దత్తవాన్ కృతవా ననెడి క్తవతుప్రత్యయాంతాల్ కృతులను జొరవు
పేచివా నేయివా నూచివా ననుక్వసుప్రత్యయాంతంబు లేపట్లఁ జొరవు
రంతు మకర్తు మస్త్రంకార మను తుమున్ ణములంతములగు శబ్దములు గూడ
వపిచ నహీవతు లనునవ్యయపదము లొనర విటులఁ దెనుంగునకు మఱియుఁ
జేయఁదగినదినా నీయఁదగినదినా నమరు తవ్యప్రత్యయార్థము లయి

యవల శతృప్రత్యయార్థముగలవెల్లు వర్తమానార్థాన వఱలు వినుఁడి
యెలనాఁగ వీణవాయించుచుఘనులఁ బిల్చుచుమెచ్చుచుఁ గనుంగొనుచు ననినిఁకఁ
జెలి నాథుఁ బిల్వవచ్చె ననఁ బిల్వ ననుశబ్దము తుమున్నంతమై యమరు నింక
దనుజుతమ్ముని శాశ్వతముగ నిల్పెను రాముఁ డనఁగ శాశ్వతముగ ననుపదము క్రి
యావిశేషణమయి యలరును మఱి విధేయవిశేషణము తెల్పెద వినుఁడు పయి
రాముండు సుగుణాభిరాముం డనుచు విశేష్యము ముందుఁగాఁ జెప్పి యలవిశేష
ణము పైని నిట్టుల నమరింపఁగా విధేయవిశేషణం బనఁగ వఱలు నిఁక
నావల క్త్వాప్రత్యయార్థపదాల్ వినుం డాసించి పిలిపించి యూడి యలిగి
చేసి చూచి వరించి డాసి నా నివి యెల్ల క్త్వాప్రత్యయార్థమై తనరు మఱియుఁ
బ్రణుతించి విరచించి పరిభవించి యన ల్యప్ప్రత్యయార్థములయి పరఁగు నింకఁ
బడెఁ బఱిచెను బెట్టెఁ బా టనుశబ్దముల్ సంస్కృతపదముపై సంఘటింపఁ
జనును సంకటపడె సంతోషపఱిచెను బాధపెట్టెను దుఃఖపాటు సడలె
ననఁ బ్రియమును భయము నను నుడుల్ రెండునున్నతోఁగూడిమెచ్చుగఁ బ్రియంప
డె భయంపడె ననఁ బాటిలు నివ్విధమ్మునఁ గొదవపదములు పేర్కొనఁదగ దిఁకఁ
గనుఁగొనఁ గనిన వినిన యనియెడి పలుకులకెల్ల నెఱిఁగింతుఁ గుఱుచమీఁది
యినపదంబుమొదలి యిత్వంబు చెడి పొల్లయై వాఁ డనుటకు నాఁ డనుచుఁగూర్చి
పలుకనౌ నెటులనఁ దెలియుఁ డిదియె కనినాఁ డనఁ దగదు కన్నాఁ డనంగ
విన్నాఁడనంగను వెలయు నిట్టివి జడ్డలై యున్న వాఁడన నమరుచుండుఁ
గన్నవాఁ డనఁగను విన్నవాఁ డనఁగ నీవగలను జెప్పఁగావలయు నాతఁ
డట్టివాఁ డిట్టువాఁ డెట్టివాఁ డౌట కౌ నట్టిఁడు నిట్టిఁడు నెట్టిఁ డనఁగఁ
బరఁగు నింకఁ గృదంతభావార్థరీతులు తెలుఁగునఁ గొన్నింటిఁ దెలుపుదుఁ దగఁ
దలఁపు వలపు చూపు సోల పనుశబ్దము లుప్రత్యయాంతత నొప్పు చుండు
తలఁకుడు తిరుగుడు నలుకుడు పొంగుడు నన నుడుప్రత్యయమై చెలంగుఁ
దెలియుట కలఁచుట తలఁచుట యనెడిపదమ్ము లుటప్రత్యయమ్మయితగు
రహి తోఁపడము కొసరడము కోరడమన నలయడముప్రత్యయ మగుచుఁ జనుఁ
గన్నెఱికము రాయమన్నెఱికము కడుఁ బెద్దఱికము నిఱుపేదఱికము
పెఱరాచఱికము కమ్మఱికము నను పేరు లివి ఱికప్రత్యయ మవుచుఁ దనరుఁ
గోఁత వ్రాఁతయుఁ జేఁత మ్రోఁత యనునుడులు తప్రత్యయమ్మయి తగుఁ నలయిక
పొందిక యచ్చిక పోలిక కోరిక యనఁగ నికప్రత్యయ మయి తనరుఁ

గనుకలి వినుకలి యనఁ గలిప్రత్యయాఖ్య నెసఁగుచుండును వినికి యునికి
యనఁగ నికిప్రత్యయాంతత తగు నింకఁ గలుగుట యనుటకుఁ దెలియఁబఱుతు
బలిమి మాలిమి కూర్మి కలిమి పోఁడిమి తాల్మి యన నిమిప్రత్యయాంతమై తనర్చుఁ
దలఁప నభావార్థముల నమిప్రత్యయములు వచ్చి తగు శబ్దములను గొన్ని
తెలిపెద సంజ్ఞగాఁ దలఁపమి, చేయమి, వినమి, కనమి యన వెలయు నింక,
కిప్రత్యయ మగు దుక్కియన నొక్కట లోభితనము పెద్దతనంబు చెనఁటితనము
నెఱతనమును గ్రామణితనము పందతన మనఁ దనప్రత్యయమయి తనరు
నలుగుట కలుకన, నిలక మునుక పోక యాఁకన కప్రత్యయ మగుచుఁ బొలు
పొందును నిలుకడ పోకడ యనఁ గడప్రత్యయం బగును విఱుగడ పన్ను
గడ తేరుగడ దిద్దుగడ యనంగను గడప్రత్యయ మగుచుఁ గన్పట్టు నింకఁ
గనుటకుఁ గంటయు వినుటకు వింటయుఁ దినుటకుఁ దింటయుఁ దెగి కొనుటకుఁ
గొంటయు ననుటకు నంటయు నన నుటప్రత్యయంబులు వచ్చి పరఁగు నవలఁ
దలఁపఁ బునలకుఁ జుటలు వచ్చి ప్రోపునకుం బ్రోచుటయనఁగఁ గొఱలుచుండు
నింపు నిం చనియెడి యిట్టిపల్కులమీఁద నొక్కొకయెడ నుట లుండెనేని
అదియెల్ల భావార్థపదము లనుచుఁ దెనుంగునఁ దగుఁ గోపింపు టనఁగ మఱియుఁ
గోపించుట యనంగఁ గాపింపుట యనఁగఁ గాపించు టనఁగఁ జొక్కనుగు నింక
రాగిల్లు విలసిల్లు రంజిల్లు ననుచోట భావార్థమున నుటప్రత్యయ మయి
రాగిల్లుట యనంగ రంజిల్లు టన విలసిల్లుట యనఁగను జెల్లు నవల
నేర్పుచే నింకఁ గొన్ని విశేషములు లెస్స దెలిపెదఁ గవులెల్లఁ దెలిసికొనుఁడు
కాకుసంబోధనకర్మధారయముల నవ్యయాల నచేతనముపయినిఁ బ్ర
థమలపయి కచటతపలకు గసడదవలు వికల్పమ్ముగ వచ్చు నవల
లలి నుదంతక్రియలపయి కచటతపల్ గసడదవ లగు వికల్పమునను
మొకమోట మిటు సెల్లునె కనంగ నృహరి, యౌనె గపటపువగలు జగదగణ్య
నీచెప్పిననుడి శౌరి చాలు బుధులకు నీసేసినదియె కృష్ణా సమువఁగ
నుపకృతిసేయనై నపురాణవిగ్రహా విబుధులుపొగడ మీఱుబరమాత్మ (?)
నుతియింతు హరివిగాన తమి మనుపు దేవనది నీకు సుతయు గానఁ దగెశార్ఙ్గి
యననొప్పు నీకఁదొల్లిఘనులు చెప్పినప్రయోగములు వీనికిఁ దెల్పు దమరవినుఁడు
ప్రబలు నుద్యోగపర్వమునఁ గారువున కాదేశంబురానిది తెలిపెద నిదె
యవల "నీచెప్పిన" యనెడికందమ్మున నేచక్కఁ గనువాఁడనే యనఁ దగ

ఇంక వాక్యదోషముల ఇదానీం వాక్యదోషాణా మపి కిఞ్చిత్ ప్రచక్ష్మహే.
గుణత్వము——

శబ్దహీనము. 53. శబ్దహీనం న దోషాయ భాషాచిత్రేషు కల్పతే
యత్నః స బన్ధనిర్జ్ఞానహేతుః కోఽపి కృతో యది.

క్రమభ్రంశము. 54. క్రమభ్రంశ మపి ప్రాహు[ర్న]దోషం సూరయ స్తదా
విసంధి. న సంహితాం వివక్ష్యామీ త్యసన్ధానం పదేషు యత్.

55. తద్విసన్ధీతి నిర్దిష్టం నప్రగృహ్య ♦ ♦ ♦ కమ్
అనుకం పాద్యతిశయో యది కశ్చి ద్వివక్షతే.

పునరుక్తి. 56. న దోషః పునరుక్తేఽపి ప్రత్యు తేయ మలం[కృతిః]
వ్యాకీర్ణము. వ్యాకీర్ణం తు న దోషాయ ప్రాక్ప్రతీతికరం భవేత్.

57. యదోచ్చారణభంగః స్యా త్సంయోగాదేర ♦ ♦ ♦.
ఛందోభంగము. న ఛందోభంగ మప్యాహు స్తదా దోషాయ సూరయః.

58. ధాతుభేదేన దుష్యేత స్వరసంధికృతా ♦ ♦
నామభేదే చ శ్లేషేషు న దోష ఇతి తద్విదః.

59. లుప్తే పదాన్తే శిష్టస్య పదత్వం నిశ్చితం యథా
తథా సన్ధివి[హీనం తత్]పద మే వేతి వర్ణ్యతే.

సంకీర్ణము. 60. పర్యాయేణ ద్వయో ర్యత్ర వాక్యం ప్రశ్నోత్తరాదిషు
సంకీర్ణం తన్నదోషా.........................

61. ..........................విదు ర్బుధాః
రసాన్తరతిరస్కారే తదిష్టం నేష్ట మన్యథా.

భిన్నలింగత్వము. 62. ♦ ♦ ♦ భిన్నలిఙ్గత్వం యత్రోద్వేగో న ధీమతామ్
భిన్నవచనము. న భిన్నవచనేఽప్యేవం దోష మిచ్ఛన్తి కోవిదాః.

ఖంజము. 63. నఖఞ్జమపి దోషాయ క్రియాపేక్షా న యత్ర తు
యత్రా స్త్యాదే రపేక్షా వా యత్ర వా స్ఫూర్జితం ధ్వనేః.

న్యూనోపమ. 64. న్యూనోపమ మపి ప్రాయః సుప్రసిద్ధం న దుష్యతి
♦ ♦ సర్వేణ సారూప్యం నాస్తి భావస్య కస్యచిత్.

65. యథోపపత్తికృతిభి రుపమానం ప్రయుజ్యతే
అఖణ్డమణ్డలః క్వేన్దుః క్వ[కాన్తా]నన మద్యుతి.

66. యత్కిఞ్చిత్కాన్తిసామ్యాత్తు శశినై వోపమీయతే

| | | |
|---|---|---|
| అధికోపమ. | | ఏవ మే వాధికౌపమ్యే న దోషం తద్వి[దో విదుః]. |
| శైథిల్యము. | 67. | సుకుమారార్థబన్ధేషు గౌడై శ్శిథిల మిష్యతే |
| బంధవైదగ్ధ్యనిస్పృహ. | | అనుప్రాసధియా తే హి బంధవైదగ్ధ్యనిస్పృహాః. |
| | 68. | ♦ ♦ ♦[అథా]దిభేదేన యది వా కవికౌశలాత్ |
| | | సర్వే క్వచి త్త్వచి ద్దోషా లభన్తే గుణతా మమీ. |
| శబ్దాడంబరమునకై వైషమ్యము. | 69. | గణయన్తి న వైషమ్యం[శబ్దాడమ్బర]తత్పరాః |
| | | అర్థశ్లేషం చ గౌడా శ్చే ల్లభన్తే కి మతః పరమ్. |
| | 70. | దీప్త మి త్యపరై ర్భూమ్నా కఠోర మపి బధ్యతే |
| నేయార్థము. | | శబ్దశ[క్తేః ప్ర]తీతి శ్చే న్నేయార్థం నైవ దుష్యతి. |
| అప్రసన్నము. | 71. | అప్రసన్న మపి ప్రాయ శ్చిత్రాదా వితి నిశ్చయః |
| | | పాత్రౌచిత్యేన హాస్యాదా ♦ ♦ త్పన్న మ పీష్యతే. |
| శృఙ్గారాదులనప్రౌఢి. | 72. | అప్రౌఢి మపి శంసన్తి శృఙ్గారాదిషు తద్విదః |
| అనిర్వ్యూఢము. | | రసాతిశయసన్ధానా దనిర్వ్యూఢం నదోషకృత్. |
| నిరలంకారము. | 73. | పూర్వోత్తరార్థసన్ధానే నిరలఙ్కార మిష్యతే |
| ఋజుమార్గము. | | రసాలఙ్కారపుష్టత్వా దృజుమార్గో గుణావహః. |
| వాక్యార్థదోషముల గుణత్వము. | 74. | అథ వా క్యార్థదోషాణా మదోషః ప్రతిపద్యతే |
| ఉన్మత్తవాక్యాపార్థము. | | మత్తోన్మత్తాదివాక్యేషు నాపార్థ మపి దుష్యతి. |
| | 75. | తత్ర ప్రత్యుత సూక్తార్థో నిహ[న్తి నిహి]తం రసమ్ |
| వ్యర్థము. | | తథై వ వ్యర్థ మిచ్ఛన్తి వ్యపేక్షస్మరణాయ చ. |
| ఏకార్థకవాక్యము. | 76. | రసాక్షిప్తధియం వాక్యం నైకార్థ మపి దుష్యతి |
| | | సంశయాయైవ సన్దిగ్ధం యది జాతు ప్రయుజ్యతే. |
| | 77. | స్యా దలఙ్కార ఏవాసౌ న దోష ఇతి మే మతిః |
| | | అ[భేద]మపి వాక్యేషు చిత్రహేతౌ న దుష్యతి. |
| ఖిన్నము. | 78. | న ఖిన్న మపి దోషాయ యత్ర చ్ఛాయా నహీయతే |
| | | ఇతి సమాఖ్యా ♦ మే వైత ద్విశేష్యఖ్యానసంస్మృతమ్. |
| | 79. | కాన్తం భవతి సర్వస్య లోకసీమానువర్తినః |
| అత్యుక్తి. | | అత్యుక్తి రితి గౌడీయై రాకికారవతి|కమే. |

80. లలితో మార్గ ఇత్యస్మి న్నతిమాత్ర మపీష్యతే
పరుషము. విరుద్ధే లక్షణాజ్ఞా తు పరుషం నైవ దుష్యతి.
హీనోపమ. 81. హీనోపమం న దోషాయ యత్రోద్వేగో సధీమతామ్
అధికోపమ. తథాధికోపమ స్యాపి న దోష ఇతి తద్విదః.
82. న దో ◆ ◆ ◆ [దృ]శౌపమ్యాతిరేకోపమాదిషు.
అప్రసిద్ధోపమ. కదాచి త్కవికౌశల్యా దప్రసిద్ధోపమం గుణః.
83. ఝటితిప్రతిపత్తి స్స్యా ద్యత్రో ◆ ◆ పమాదిషు
యత్రస్యా ద్గుణబాహుల్యం రసో వాపి పరిస్ఫుటః.
84. దోషాయ నిరలఙ్కారం త న్నశంసన్తి సాధవః
అశ్లీలము. మహాకవిపథా ◆ ◆ అశ్లీల మపి బధ్యతే.
దేశవిరోధము. 85. నాస్తి దేశవిరోధోఽపి దూషణం కవికౌశలాత్
కాలవిరోధము. దోషః కాలే విరోధేఽపి న కార్యాన్తరహేతుతః.
లోకవిరోధము. 86. న చ లోకవిరోధోఽపి తాత్పర్యే దోషభాగ్భవేత్
యుక్తివిరోధము. తథా యుక్తివిరుద్ధస్య గుణత్వం క్వచి దిష్యతే.
ఔచిత్యవిరోధము. 87. క్వా ప్యౌచిత్యవిరోధో ◆ ◆ ◆ వస్థాన్తరా భవేత్
ప్రతిజ్ఞావిరోధము. న ప్రతిజ్ఞావిరోధేఽపి దోషో విధురచేతసామ్.
88. అస్తి కాచి దవస్థా సా [యా సరా]గస్య చేతసః
యస్యాం భవే దభిమతా విరుద్ధార్థాపి భారతీ.
ధర్మశాస్త్రవిరోధము. 89. ధర్మశాస్త్రవిరోధో[ఽపి నదోషః] పుణ్యతేజసామ్
స హి తత్ర ప్రసిద్ధత్వా త్పరమోత్కర్ష కారణమ్.
90. తేషాం తేజోవిశేషేణ ◆ ◆ ◆ యో న విద్యతే
అర్థశాస్త్రవిరోధము. అర్థశాస్త్రవిరోధేఽపి దోషో నోర్జితభాషణే.
కామశాస్త్రవిరోధము 91. కామశాస్త్రవిరుద్ధేఽపి న దో ◆ ◆ ◆ పేక్షయా
రతిచక్రే ప్రవృత్తే తు నైవ శాస్త్రం న చ క్రమః.
కళాశాస్త్రవిరోధము. 92. కలాశాస్త్రవిరోధోఽపి క్వచి ద్దోషాయ నేష్యతే.

ఇతి రసార్ణవాలఙ్కారే గుణోపాదానం నామ
ద్వితీయః పరిచ్ఛేదః-

# రసార్ణవాలంకారము.

## తృతీయపరిచ్ఛేదము—"శబ్దాలంకారప్రకాశము."

---

| | |
|---|---|
| ఇఁక దోషరహితము | 1. శ్లో. అథోజ్ఝితదోషస్య న్యస్తాశేషగుణ[స్యచ] |
| గుణసహితమునగు | ♦ ♦ కావ్యశరీరస్య చారుతోత్కర్షహేతవే. |
| కావ్యమునకుఁజారు | 2. జ్ఞేయోఽలఙ్కారయోగోఽయం కామినీవపుషో యథా |
| తోత్కర్షహేతువు | ♦ ♦ ♦ సున్దరస్యాపి ప్రకర్షాధాయకో ధ్రువమ్. |
| లగునలంకారములు | 3. నిసర్గరమ్యలావణ్యాతిశోధాయకతా తు యైః |
| తెలియఁదగినవి. | ఉక్తాలఙ్కారవ ♦ ♦ త్తేషా మతిశయస్తుతిః. |
| స్వభావరమణీయత్వ | 4. స్వభావరమణీయత్వం వినా లఙ్కృతయో వృథా |
| ము లేనిచోనలంకార | లోలస్తనతటన్యస్తో హారో హా ♦ ♦ ♦ ♦ నః. |
| ములు నిష్ఫలములు. | |
| స్త్రీలయలంకారములు | 5. అలఙ్కారాస్తు నారీణాం శరీరే త్రివిధాః స్మృతాః |
| మూఁడువిధములు. | బాహ్యా స్తథా_న్తరాః కేచి త్తథా బాహ్యా_న్తరా ఇతి. |
| అందు బాహ్యములు. | 6. తత్ర తా రచితా బాహ్యద్రవ్యైర్బాహ్యా ఇతి స్మృతాః |
| | పృథక్త్వేనావభాసన్తే వస్త్రహా ♦ ♦ ♦ దయః. |
| ఆన్తరములు. | 7. స్వీయావయవసంస్కారజన్మానః పున రాన్తరాః |
| | స్వరూపశోభాజనకా నఖో[ల్లేఖా]లకా ♦ ♦ |
| బాహ్యాన్తరములు. | 8. బాహ్యై రపి పదార్థై స్తు కృతా స్తన్మయతాంగతాః |
| | ధూపాస్యవాసప్రముఖా జ్ఞేయా బాహ్యాన్తరా ఇతి. |
| కావ్యశరీరమునకుశబ్దా | 9. తథా కావ్యశరీరేఽపి భాసన్తే బాహ్యతోఽపి యే |
| లంకారములు బాహ్యా | సర్వేఽపి శబ్దాలఙ్కారా స్తే బాహ్యా ఇతి కీర్తితాః. |
| లంకారములవంటివి. | |
| అర్థాలంకారము | 10. స్ఫుర న్త్యర్థపరామర్శా దర్థాలఙ్కృతయ స్తు యాః |
| లాన్తరాలంకారములు. | ఆ త్మనాన్తఃప్రతీతత్వా దాన్తరా ఇతి తాః స్మృతాః. |
| శబ్దాలంకారములు. | 11. శబ్దోత్కర్షం వితన్వానాః శబ్దాలఙ్కృతయో మతాః |
| అర్థాలంకారములు. | అర్థోత్కర్షనిమిత్తత్వా దర్థాలఙ్కృతయః పునః. |
| ఉభయాలంకారములు. | 12. ఉభయాలఙ్క్రియా స్తత్ర ద్వయాలఙ్కారహేతవః |
| శబ్దాలంకారములుపదు | జాతీ రీతిశ్చ వృత్తిశ్చ రచనా ఘటనా తథా. |
| నెనిమిది. | 13. ముద్రా చ్ఛాయా తథాయుక్తి ర్భణితిః శ్రవ్యతాపి చ |

ఉ. తారల నెన్నవచ్చు వసుధారజము ల్గణుతింపవచ్చు న
వ్వారిధిభంగసంగ భవవారికణంబులు లెక్కపెట్టి పెం
పారఁగవచ్చుఁగాని యరయంగ మహోత్పలసూతికైన దు
ర్వారవనాటవీరనికరంబుల సంఖ్యల నెన్న శక్యమే. ౨౮౪

సీ. పర్వతోన్నతులు సుపర్ణవేగులు భూరిపవమానసమబలు ల్బాహుసార
వంచితపంచాస్యసంచయు ల్పాషాణపాదపాయుధులును బ్రధనభీము
లగువానరేంద్రులయందుఁ గొందఱు వాలి సుగ్రీవులను గొంద ఱగ్రలీల
నలనీలమారుతనందనులను గొల్చుచు మతంగమాల్యవత్ప్రముఖ నిఖిల
శైలముల సర్వకాననస్థలములందు, సంచరించుచునుండి రుత్సాహవృత్తి
నట్టిశాఖామృగోత్తము లందఱికును,వాలి యేలిక యగుచుఁ దావఱలుచుండె.

క. అంతకుమును దశరథభూ,కాంతుఁడు దా మఘసమాప్తి గావించి మహా
సంతోషుఁ డగుచు నగరికిఁ, గాంతలతో నేగె మౌనిగణపరివృతుఁడై. ౨౮౬

వ. ఇట్లు పురంబుఁ బ్రవేశించి యిందిరానివాసం బగుతనమందిరంబు సొచ్చి వసి
ష్ఠఋష్యశృంగాది మునులను బహూకరించి వీడ్కొలిపి యనంతరంబున భూసు
రాది సకలజనంబులకుఁ బసదనంబు లొసంగి వారిం బ్రియపూర్వకంబుగా
ననిపి కళత్రసహితుండై సుఖంబుండి సుపుత్త్రావాప్తిం గోరుచున్నయెడ నతని
పత్ను లంతర్వత్ను లగుటం జేసి కొన్నిదినంబులకు నక్కాంతలకు. ౨౮౭

సీ. ఆఁకలి తఱచైన నన్నంబు దినియెడుకోరిక లెంతయుఁ గొంచె మయ్యెఁ
బిండివంటలు నున్నియుండలు మొదలైన మధురవస్తువులందు మనసుపుట్టెఁ
బుల్లనై కడు విలసిల్లు ఫలంబులు కరము భక్షింపఁగాఁ గాంక్ష లొదవె
నావులింతలు ఘన మయ్యెను రేఁబగల్ నిద్దురపై మతి నివ్వటిల్లె
యోగినులకుఁ బరధ్యానమొప్పురీతి, నెపుడుచూచినఁబరచింతయొనరియుంటఁ
బలుకరించిన వేగంబ పలుకు టుడిగెఁ, గడఁగి యెడపక వేవిళ్లు పొడముకతన.

సీ. కాయము ల్కొంచెంబుగాఁ గృశించుటచేతఁ దన్వంగులనుచుంట తథ్య మయ్యె
నడుగులు మెల్లన నిడి నడచుట మందగామిను లనుట తార్కాణమయ్యె
ముఖములు ధావళ్యమున మించియుండుటఁ జంద్రాస్యలనుమాటసత్యమయ్యె
బడలికచే నవిస్పష్టభాషిణులౌట శుకవాణు లనుపల్కు ప్రకట మయ్యె
ననుచుఁ జూపఱు లెన్నంగ ననుదినంబుఁ, గ్రొత్తరీతులు కడుఁ దళుకొత్తుచుండఁ
జిత్తముల సమ్మదములు రేకెత్తుచుండ, వెలఁదు లొప్పిరి వేవిళ్లు బలియునపుడు.

క. శ్యామలకుఁ గుచాగ్రంబులు, శ్యామలవర్ణంబు లగుచుఁ జక్కఁగ నమరెం
దామరమొగ్గలపై సు,శ్రీమీఱఁ వ్రాలు చంచరీకము లనఁగన్. ౨౯౦

గీ. ఇవ్విధంబునఁ దగియున్న జవ్వనులకు, నంతకంతకు గర్భంబు లతిశయిల్ల
నాభిదేశంబు లధికనిమ్నములు గాక, లలితవికచాబ్జములరీతి నలరుచుండె.

గీ. అంగనల కళిసీలరోమావళులకు, వళులు లేకుండె మిగుల గర్భములు పొదల
బరువటంచునుగటితటాభరణమాది,గలుగుతొడవులువిడిచిరక్కమలముఖులు.

గీ. రత్నగర్భంబు లగుచు విరాజితంబు, లైనస్ఫటికపుఁగలశంబులట్లు మిగులఁ
బుండరీకాక్షు తేజోవిభూషితంబు, లగుచు మగువలగర్భంబు లలరుచుండె. ౨౯౩

వ. అనంతరంబ. ౨౯౪

—: దశరథునకుఁ బుత్రోత్పత్తి. :—

గీ. రమణ దశరథ సీమనోరథము పండ,వలె నటంచును బండితవరులు దండఁ
బలుక వినుచు నరేశ్వరుం డలరుచుండ, నెలఁతలకు నంతకంతకు నెలలు నిండ.

వ. ఒక్కసమయంబున నద్ధరాకాంతకాంతలలో నగ్రగణ్యయగు కౌసల్యాదేవికి.

క. నొప్పులు వొడమిన దాదులు, గుప్పున మది నెఱిఁగి యింకఁ గోమలికి సుతుం
డొప్పుగఁ బుట్టునటంచును, ముప్పిరి గొనువేడ్క లపుడు మొనయుచునుండన్.

వ. పరివేష్టించి యున్నసమయంబున నొక్క పరిచారిక శీఘ్రంబున. ౨౯౮

క. క్షీరాన్న మొప్పుగను బం,గారపుఁబాత్రమునఁ దెచ్చి కౌసల్యకుఁ దాఁ
గూరిమిఁ దిను మని యొసఁగిన, సారసముఖి యించుకంత సరగ భుజించెన్.

వ. తదనంతరంబ యాశంబరనితంబ యామనస్యంబు సహింప నేరక దీనాలాపం
బులు వలుకుచున్నయెడ నయ్యన్నులమిన్నం గని యచ్చటనున్న వృద్ధాంగ
నలు తత్కాలసముచితవచనంబు లాడుచు నిమిషంబులు వత్సరప్రాయంబుగాఁ
గడపుచున్నంత. ౩౦౦

సీ. నియతిఁ బండ్రెండవనెల యగుచైత్రమాసంబున శుక్లపక్షంబునందు
నవమిం బునర్వసునక్షత్రమున సౌమ్యవాసరమ్మున ననివార్యలీలఁ
జౌవంచగ్రహాము లుచ్చస్థానముల నుండ శశిబృహస్పతు లొక్కచక్కిఁ గూడ
ఘనకుళీరాఖ్యలగ్నమునందు నృపకాంత కనియెఁ గుమారుని ఘననిభాంగుఁ
బుండరీకాక్షునర్థమై దండి మెఱయు,చుండువాని విభాకరాఖండతేజుఁ
బుండరీకాయతాక్షు నాఖండలాది, సురసమాజనిరంతరస్తుతచరిత్రు. ౩౦౧

గీ. మగువ లందఱు హర్షనిమగ్న లగుచు, నపుడు సముచితకృత్యంబు లాచరించి
సుతుని నెంతయుఁ గౌసల్య చూచుచుండఁ, గనిరి వారల కన్నులకఱవుదీఱ.

చ. దివిజులు పుష్పవృష్టి జగతిం గురియించిరి దివ్యభేరికా
రవములు మింటఁ జొప్పడెఁ గరంబు దెసల్ వెలుఁగొందె మానితో
త్సవమున నప్సరోంగనలు సల్పిరి నాట్యము గంధయుక్తమై
యవిరళశైత్యమాంద్యయుతమై పవమానము వీచె నయ్యెడన్. 303

క. పుత్త్రుఁడు గలిగె నటంచును, మిత్త్రులు దెలుపంగ నపరిమిత మోదమునన్
ధాత్త్రీపతి మదిఁ బొంగుచుఁ, జిత్త్రాంబరభూషితులుగఁ జేసెను వారిన్. 304

వ. మఱియు నద్దశరథుండు భేరీమృదంగ పటహకాహళవేణువీణాదిరావంబు లొన
ర్పం దగువారి నియమించిన వా రట్లు సేయం దద్ఘోషంబు లోకం బై పురలక్ష్మి
యమ్మహారాజపుత్త్రోదయసమయమహోత్సవంబు చాటె ననుభంగిం దేజరిల్లి
పౌరజనంబులకు శ్రవణానందకరం బై యొప్పెఁ దదనంతరంబున. 305

క. కైకేయి ప్రసవవేదనఁ, బ్రాకటముగఁ బొందుచుండఁ బంకజనేత్రల్
లౌకికకృత్యముల న్వడిఁ, జేకొని కావించి రపుడు చిత్తము లలరన్. 306

క. పరమగుణ కైక గురువా,సరసంయుతదశమిఁ బుష్యసంజ్ఞికతారన్
వరమీనలగ్నమున సుతుఁ, బురుషోత్తము నంశమునను బొలుపుగఁ గనియెన్.

గీ. రభసమునమింటదేవదుందుభులు మొరసెఁ,గుసుమవర్షంబుఁగురియించిరసురవైరు
లంత ధరణీశుఁ డాత్మలో సంతసిల్లెఁ, దూర్యనినదంబు లెసఁగె నిస్తులతఁ బురిని.

గీ. చెలువుమీఱంగ నేకాదశిని సురారి,గురుదినంబున నాశ్రేషఁ గుశల మైన
కర్కటకలగ్నమునసృపాంగనసుమిత్ర,కనియెఁగృష్ణాంశమునఁగవగాఁగసుతుల.

క. దివి మ్రోసె దేవదుందుభు, లవనిస్థలిఁ బుష్పవృష్టి నలరించిరి దా
నవవైరు లంతఁ జల్లని, పవనం బొగి వీచె దిశలఁ బరిమళయుత మై. 310

ఉ. అంత ధరాతలేంద్రుఁడు నిజాంగన పుత్త్రులఁ గన్నయట్టి వృ
త్తాంతము వించు నెంతయు ముదంబునఁ బొంగుచు నిన్నినాళ్లకు
న్వంత దొలంగె నంచు బుధవర్ణితభాగ్యము గల్గె నంచు నీ
సంతతుల న్నమంచితయశం బిలఁ గాంచెద నంచు నెంచుచున్. 311

గీ. డంబుమీఱంగఁబుత్త్రోత్సవంబునెఱపఁ, బూనుచునతిప్రయత్నమప్పుడయొనర్చి
యఖిలజనులకు నిష్టమృష్టాన్నసలిల,దానములఁ దృప్తి చేసె నుదారలీల.

సీ. సూతమాగధవంది వైతాళికులకు మేలాటపాటలతోడిపాటవంబు
నీటుచూపెడు నాటబోటులకును దాసదాసీకటాదివితానములకు
మక్కువ మీఱంగ నక్కజంబుగఁ గోర్కి కెక్కువావిత్తంబు చక్కగ నిడి
సాధుభూసురసహస్రంబుల కతిభక్తి గోహిరణ్యంబుల కోటు లిచ్చి

కవుల కంబరభూషాదికము లొసంగి
మానఘను లగు హితులకు మంత్రివరుల
కమితబహుమానములఁ బ్రమోదము ఘటించి
సకలజనసన్నుతులు గాంచె సంభ్రమమున. ౩౧౩

గీ. తథ్య మెన్నంగ జగతి నీదశరథేశుఁ, డంబుజాతాక్షుఁడగు సందియంబు లేదు
కాకయుండిననితఁడు శ్రీకలితవత్సుఁ,డజసుతుఁడుభూపతియునౌనెయనిరిబుధులు.

క. ఇటు పుత్రోత్సవకృత్యము, పటుమతి నరపుంగవుండు పంక్తిరథుం డా
దట నొనరిచి యిటమీఁదన్, ఘటియిల్లు శుభంబు లెల్లఁ గమలాక్షుకృపన్.

వ. అని తలంచుచుండి పదంపడి పండ్రెండవదినంబునఁ బురోహితుం డగు వసిష్ఠునిం బిలిపించి కుమారులకుఁ బుణ్యాహవాచనపూర్వకంబుగా జాతకర్మంబులు సేయించి యమ్మునీంద్రునిం జూచి. ౩౧౬

క. మునివర నాసూనులకును, ఘన మగుకృపతోడ నామకరణంబులు నీ
వొనరింపు మనిన నాతఁడు, మనుజాధిపు వచనములకు మన మలరంగన్.

గీ. రమ్యకౌసల్యసూనుండు రాముఁ డనుచుఁ
బరమకైకేయి కొమరుండు భరతుఁ డనుచు
ఘనసుమిత్రాసతీమణీతనయు లోలిఁ
దనర లక్ష్మణశత్రుఘ్ను లనుచుఁ బలికె. ౩౧౭

వ. ఇవ్విధంబున నామకరణంబు లొనర్చి సర్వోర్వీసుపర్వసహితుం డై యాశీర్వచనంబులు చేసిన దశరథుండు సంతుష్టాంతరంగుం డై తత్సమయోచితమహోత్సవంబు గావించి వసిష్ఠాదులం బూజించి వీడ్కొలిపి పుత్రమిత్రకళత్రసమేతుం డై రాజ్యపరిపాలనంబు సేయుచు సుఖం బున్నంత. ౩౧౮

క. నలుగురు బాలురు వరుస, న్నెలనెల కొక్కొక్క తేట నెగడఁగ సుతులన్
లలిఁ జూచి తల్లిదండ్రులు, కులపాలకు లగుదు రనుచుఁ గోర్కులు మీఱన్.

క. ఎత్తుకొని ముద్దువెట్టుచు, మెత్తనిమేనిపయిఁగేలు మృదుతరకేలిన్
హత్తించి దువ్వుచును దమ, చిత్తము లలరంగఁ జొచ్చి చెలఁగుచునుండ గడున్.

వ. ఇట్లానందించుచుఁ గుమారపోషణావలోకనతత్పరు లై యుండఁ బ్రవర్ధమాను లగు నారామభరతలక్ష్మణశత్రుఘ్నులు మూఁడవవత్సరంబు ప్రవేశించిన.

సీ. అందియ లగ్గజెలు పొందుగా మ్రోయంగ వడివడి గునగున నడచుచుండి
మురువులు గొలుసులు మురువుగా నాదింప వలనొప్పఁ జప్పట్లు వైచుచుండి

పాటపాడినరీతి నేటుగా నవ్యక్త లలితవాచావళు ల్పలుకుచుండి
యంకస్థలంబుల నందము లైఱయంగ గారాము నెఱపుచుఁ గూరుచుండి
తల్లిదండ్రుల కధికముదంబుఁ గూర్చి, దినదినంబున కొకవింతతేజ మెసఁగఁ
గన్నవారలకన్నులకఱవుదీఱ, వెలయుచుండిరి ధరణిలోపలను మిగుల. ౩౨౩
గీ. అత్తయన్నయ్యమామయమ్మవ్వతమ్ముఁ,డనుచు రామాది బాలకులద్భుతముగఁ
దల్లిదండ్రుల కోర్కులు పల్లవింపఁ, బలుక నేర్చిరి మధురసంభాషణములు. ౩౨౪
గీ. అక్కుమారులఁ గనుఁగొని పెక్కుగతుల, మక్కువలుమీఱఁగా శుకవాక్కులొలయ
గ్రక్కుననుముద్దుగొనుచు నొక్కొక్కసారె, చక్కగా నెత్తుకొనుచుం బురక్షజముగ.
వ. మఱియు నయ్యంగనామణు లక్కుమారరత్నంబుల గాంచి. ౩౨౬
సీ. ఈరామునీలశోభారాముఁ గన్నయావామాక్షి తొల్లింటినోము ఫలము
నీభరతుని వారిదాభాయుతునిఁ గన్న యాభామినీమణి వైభవంబు
నీలక్ష్మణుని రమ్యశీలు శత్రుఘ్నుని లీలతోఁ గన్న ప్రోయాలిమహిమ
నీనందనులఁ గాంచి యానంద మొందుచు మానుగాఁ జెల్వొందువానితపముఁ
దలఁచి నుతియింప వశమానెధాత్రిలోన, హరునకైనను భారతీవరునకైన
గురునకైనను బన్నగేశ్వరునకైన, మౌనికైనను దలఁప సేనానికైన. ౩౨౭
క. అని వినుతించుచునుండఁగ, విని మనుజవరేణ్యసతులవేడ్కలు దమ నె
మ్మనముల ఘనములుగాఁగను, దనయులఁ గైకొందు రధిక తాత్పర్యములన్.
వ. ఇవ్విధంబున నద్దశరథేశ్వరు ముద్దియలు సుతుల నొద్ద నుంచుకొని తద్దయు ముద్దులాడుచు వారు కోరినరీతిని క్షీరశర్కరాన్నపానీయ ఫలదానంబులం జేయుచు వారికి నూతనధౌతాంబరంబులు గట్టుచు వజ్ర వైదూర్య నీల గోమేధిక పద్మరాగ పుష్యరాగాది నవనవరత్నస్థాపిత జాంబూనదాభరణంబులు దొడుగుచుఁ దారాకారహారంబులు గళంబులం గదియించుచు వారల మందహాస సుందరవదనేందు నయనారవిందంబుల యందంబులు డెందంబులయందుఁ బొంకుపఱిచి యమందానందంబులం జెందుచు వారిం బ్రేమాలవాలవీక్షణంబుల నవలోకింపుచు సొంపు మీఱ బెంపుచున్నఁ గొన్నివత్సరంబు లరిగిన నొక్కదినంబున దశరథుండు కుమారులం గని యిట్లని వితర్కించె. ౩౨౯

—: రామాదుల కుపనయనసంస్కారములు. :—

క. ఈతఱి సంధ్యాదిలస, త్పూతవిధు ల్చలుపఁ దగినబుద్ధులు గలస
న్నీతులతనుజాతుల నుపనీతులఁ గావింపవలయు నేమమొలర్పన్. ౩౩౦

క. అని తలఁచి వసిష్ఠమహా, మునివరు రప్పించి మోదమున మీరలు నా
తనయుల కుపనయనంబుల, నొనరింపఁగవలయు ననుచు నొప్పుగఁ దెలుపన్.

చ. విని మునిముఖ్యుఁ డాత్మఁ గడు వేడుకఁ జెంది నరేంద్ర యిప్పు డీ
ఘనశుభకార్య మీవు కుతుకంబునఁ జేయుట మేలుగాదె నా
మనమున నిట్లు దోఁచె నిట మంచిముహూర్తము గూడి యుండె నం
చనుపమవాక్యులం దెలుప హర్షముఁ జెందె నృపాలుఁ డెంతయున్. ౩౩౨

సీ. పిమ్మట మహనీయుఁ డమ్మునిశ్రేష్ఠుండు సచివులఁ గన్గొని సరభసముగ
దశరథుం డాత్మలోఁ దలఁచిన భద్రకార్యం బెఱింగించి జవంబుతోడ
సకలసంభారము లనుపమరూపవలయు మీరనిన వారలు ముదం బూనుచుండి
మునిచెప్పినట్టు లప్పనులు సేయించి సత్వరమునఁ దెల్పఁగా గురుఁ డతండు
వికసితాననుఁ డగుచు నవ్వేళయందు, క్షితిపు నాతనిసతులను సుతుల నతుల
మతులసుకృతులసద్గుణయుతులఁగృతుల,మంగళస్నానములనొనర్పంగఁబలికె.

క. పలికినవారలు మజ్జన,ములు గావించుచును జిత్తములఁ వేడుకలన్
లలితాంబరమణిభూషణ,ములు వేగ ధరించియున్న మునిపతి యంతన్.

సీ. భవ్యపీఠంబుల బాగుమీఱఁగ వారిఁ గూర్చుండ నియమించి గొనబుమీఱు
భద్రవాద్యములు సముద్రముల్ ఘోషించుభంగి నపారశబ్దములు వలుక
మంత్రతంత్రవిధుల్ క్రమంబునఁగావించి హుతవహునాజ్యాదిహోమములను
బ్రీతుని జేయుచుఁ బిదపఁ జేయంగల కృత్యములెల్ల నగ్గింపఁ జేసి
వరుస దప్పక శాస్త్రోక్తసరణి రామ, భరతలక్ష్మణశత్రుఘ్నబాలకులను
బ్రహ్మమంత్రోపదేశసంప్రాప్తభూతి, తేజుల నొనర్చె నమ్మునిరాజు లలర. ౩౩౫

వ. తదనంతరంబున. ౩౩౬

క. ఘనయజ్ఞసూత్రకృష్ణా,జినమౌంజీదండధరుల క్షితిపతిసుతులం
గని ముని భిక్షాపాత్రము,లను వేడ్కొసంగి సంజ్ఞల న్నెఱిఁగింపన్. ౩౩౭

క. వామనమూర్తు లనంగా, శ్రీమించి చెలంగు రాజశేఖరతనయుల్
రామాదులు జనసన్నుత, ధీమహితులు సుగుణయుతు లతిత్వరతోడన్. ౩౩౮

వ. తల్లిదండ్రుల మనోవల్లు లానందపల్లవాన్వితంబు లై శోభిల్లఁ దత్పాదహల్లకం
బులకు నమస్కరించి క్రమమున వారలం జూచుచు. ౩౩౯

క. గంభీరనాద మలరఁగ, "త్వం భిక్షాం దేహి" యంచుఁ దగ వేడుకొనన్
జంభారినిభుం డగున,య్యంభోజహితాన్వయేశుఁ డతివలుఁ దానున్. ౩౪౦

క. “శతధృతి రివ పరమాయు, స్సతతం భజ” యనుచు పనస వస్మద మొదవన్
సుతులకు నాశీర్వాక్యము,లతులితముగఁ బలికి యంత నతిశీఘ్రమునన్. ౩౮౧
ఉత్సాహ. కనకరజతవస్త్రమౌక్తికములు చాలఁ దెచ్చి స
త్తనయకరసరోజకనమదార హేమపాత్రలం
దునుప వార లాత్మ మోద మొప్ప నప్పదార్థముల్
ముని వరేణ్యుఁ డగువసిష్ఠముని కొసంగి రన్నియున్. ౩౮౨
గీ. వలను మీఱ నరుంధతీవరుఁడు పిదపఁ, దగువిధానమ్ము లొనరించి దశరథేశ
నిన్ను సుతులను దీవించుచున్నవిప్ర, వరుల నెల్లను మన్నింపవలయుననుఁడు.
ఉ. భూమిపతీశ్వరుండు పరిపూర్ణమనోరథుఁడై ధరామర
స్తోమముల న్సువర్ణముల శోభనలీల వెలుంగు భూరి ము
క్తామణుల న్నవాంబరవితానములం బ్రియ మందఁజేసి త
త్సామవచస్తుతు ల్వినుచు సంతసమందుచు నుండె నయ్యెడన్. ౩౮౪
క. అన్నన్న యన్నదానం, బిన్నరవరుఁ డిట్లుసేయునే యంచు జనుల్
సన్నుతులు చేయురవములు, విన్నందుచు నుండె సురలు మేలనిపొగడన్.
ఉ. అంత వసిష్ఠుఁ డమ్మహిపు నాదర మొప్పఁగఁ జూచి మేదినీ
కాంత మదాశ్రమంబునకుఁ గ్రచ్చఱ నేనికఁ బోయివత్తు నీ
కాంతలు నీతనూభవశిఖామణు లీవునుఁ గూడి పూర్వది
క్కాంతవిలాస మొప్పఁగ సుఖంబుగ నుండుఁ డటంచుఁ బల్కినన్. ౩౮౬
గీ. మానివరుపాదములకు నమస్కరించి, నాకుమాయుల కుపనయనంబు లధిక
విధులఁజేయించితిరి వేదవిదులు మెచ్చ, మిమ్మునుతియింప నాకువశమ్ముగాదు.
క. అని మునివరునకుఁ బ్రీతిని, ధనవసనమణీవితాన తాంబూలములన్
వినయమున నిచ్చి యనిపెను, మనమునసంతోష మొదవ మహిపతియంతన్.
వ. కొన్ని దినంబు లరిగిన. ౩౮౯

—: రామాదుల విద్యాభ్యాసము. :—

క. గురు మతి యగునరపతి నలు, గురుసుతులకుఁ జదువులబ్బఁ గోరి కొమరులన్
గురువుల కొప్పించిన న, గ్గురు తేజులు గురులచెంతఁ గూరిమితోడన్. ౩౯౦
వ. మెలంగుచుఁ దొలంగని భక్తిభావంబులం జెలంగుచు విద్యాభ్యాసంబు చేయుచు
విధినిమిత్తంబున రామలక్ష్మణులు ను భరతశత్రుఘ్నులు ను బరస్పరం బత్యంత
స్నేహానిబద్ధబుద్ధు లై ప్రవర్తించుచుండి వేదవేదాంగధనుర్వేదాదిసమస్తవిద్యా

విశేషంబులు నేర్చి గజాశ్వరథారోహణాదులవలన వలనుగలిగి సకలగుణమణి గణాలంకృతులై యొప్పుచుండ బుధజనంబు లక్కుమారులం గాంచి క్రమంబున నుతియింపఁ బూని రెట్లనిన. ౩౫౦

క. ఈరాముఁడు తలిదండ్రులు, గారామునఁ బెంచుచుండఁగాఁ బ్రబలుండై
తా రాజకుమారులలోఁ, దారాజాని క్రియ మిగులఁదనరెడు మఱియున్. ౩౫౧

సీ. ధారాధరము నెన్ను తనుకాంతి గలవాఁడు చంద్రబింబోపమాస్యంబువాఁడు
కంజాతములఁబోలు కందోయి గలవాఁడు నీలంబులను గేరు నెఱులవాఁడు
కరితుండములమించు ఘనభుజంబులవాఁడు చక్కనిపీనవక్షంబువాఁడు
పల్లవంబులమించు పాదము ల్గలవాఁడు కంబువిలాసకంఠంబువాఁడు
ఘనమృగేంద్ర నిభావలగ్నంబువాఁడు, మెచ్చఁదగువాఁడుకీర్తులఁదెచ్చువాఁడు
హెచ్చుగలవాఁడుకారుణ్యమిచ్చువాఁడు,మచ్చికలొనర్చిబుధులనుమెచ్చువాఁడు.

చ. తలఁపఁగ నిట్టు లన్నవసుధావరనందనులందు సత్యవా
క్కులు గలమేటి లేఁడు బుధకోటులు మాటికి నెన్నఁజాలు న
త్యలఘుగుణంబులుం గలుగునట్టి మహాత్ముఁడు సోదరాదరుం
డలరులవింటిజోదుబలె నందము గల్గినవాఁడు చూడఁగన్. ౩౫౩

గీ. పుండరీకాక్షుఁ డితఁడు గాఁబోలు నట్లు, గాకయున్నను బుండరీకములభంగిఁ
గన్నులలరారుచుండునే ఘనకృపార,సంబు చూపులఁ జిలుకునేజనులమీఁద.

గీ. అన్నగారిఁ బోలు నమితరూపంబున, నన్నగారి నేలు నతులమహిమ
నన్న భరతుఁ డితని జెన్నుగా జగతిని, గన్నవారిభాగ్య మెన్ననగునె. ౩౫౫

క. విధుసోమసమాఖ్యుండున్, బుధరతుఁ డరిమోదహారి భూరివరకళా
నిధిరాజనఁ దగు నీతం, డధికత భరతాఖ్య గనుట యబ్బుర మగునే. ౩౫౬

గీ. లలితసర్వభద్రలక్షణలక్షితుం, డగుట నితఁడు లక్ష్మణాఖ్యఁ దనరె
నితనిఁగాంచువార లతులతరామోద,యుతమనోబ్జులగుచు నుందురవని. ౩౫౭

క. పాత్రతరధర్మమతిని సు, మిత్రాత్మజుఁ డెన్నఁగా సుమిత్రాత్మజుఁ డా
ధాత్రిని నీధర్మరతుం, బుత్రునిగాఁ గన్నయినుఁడు బుధనుతుఁడు గదా. ౩౫౮

క. శత్రువుల సంహరింపఁగ, ధాత్రిన్ భుజశక్తి గలిగి తనరెడుఁగానన్
శత్రుఘ్ననామధేయము, చిత్రంబుగఁ గాంచె నితఁడు చిరయశమబ్బన్. ౩౫౯

శా. ఈరీతి న్నుతిగాంచి మించుసుతుల న్వీక్షించి ధాత్రీశ్వరుం
డీరామాదులు నూత్నయౌవనలసద్దేలాయుతు ల్గావునన్



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C. B. E. గారు

# ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము.

— జయంతి రామయ్యపంతులుగారు. —

ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఆ 1911 వ సంవత్సరము మేనెల ది 12 వ తేదిని, చెన్నపట్టణమందుఁ బ్రతిష్ఠింపఁబడినది. కావున నీపరిషత్తునకు నేఁటికి వేయేండ్లకు నిరువదియైదేండ్లు ప్రాయము వచ్చినది. నేఁటి యాచారము ననుసరించి రజతోత్సవము (Silver Jubilee) జరుపు సమయమాయినది. ఈసందర్భమున నీసమాజముయొక్క యుత్పత్తి స్థితిగతులను గూర్చి పరామర్శించుకొనుట యుచితము.

పరిషత్తును స్థాపించుటలో నాకును గొంత సంబంధము కలదని చెప్పుకొనవలసియున్నది. కార్యనిర్వాహకు లితరు లైనను బ్రథమసంకల్పము నాదియే. ఆ 1911 సంవత్సరప్రారంభమున నేను రాజకీయోద్యోగము (Presidency Magistrate అను) పనిమీఁదఁ జెన్నపురి వెళ్ళి యచ్చట మూఁడుసంవత్సరము లుండుటయుఁ దటస్థించినది. నేనచ్చటకు వెళ్లినవెంటనే యాంధ్రభాషావాఙ్మయాభివృద్ధికై యొక మహాసంఘ మేర్పఱుచుటయుక్తమని పలువురుపెద్దలతోఁ జెప్పుటయే కాక యావిషయమై "ఆంధ్రభాషామహాసంఘము" మను శీర్షికతో నొకవ్యాసము-ఆంధ్రపత్రిక, విరోధికృత్సంవత్సరపు "ఉగాదిసంచిక"లోఁ బ్రకటించినాఁడను. (అనుబంధము ౧.) ఈసమయమందు, పీఠికాపురాధీశ్వరు లగు శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుగారును వారిదివాను మొక్కపాటి సుబ్బారాయఁడుగారును జెన్నపురిలో నుండినందున వారితోఁ గూడ నీవిషయమై ప్రసంగించినాఁడను. వా రిరువురు నామోదించిరి. శ్రీవా రామోదించుటయే కాక యుత్సాహముతోఁ గార్యము కొనసాగింపఁ బూని ముందుగాఁ గార్యక్రమము నిర్ణయించుటకై తమమందిర మగు "డన్మోరు"లో ఆ 1911 వ సంవత్సరము మార్చి నెల ది 26 వ తేది నొకచిన్న సభ కావించిరి. (అనుబంధము ౨.) ఈసభకు-

1. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు
2. వేదము వేంకటరాయశాస్త్రులుగారు
3. మొక్కపాటి సుబ్బారాయఁడుగారు
4. చెన్నాప్రెగడ భానుమూర్తిగారు
5. గోటేటి కనకరాజుగారు
6. వావిలికొలను సుబ్బరావుగారు

7. దినవహి హనుమంతరావుగారు

8. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు

నేమను వెళ్లియుంటిమి. ఆంధ్రభాషయొక్కయు వాఙ్మయము యొక్కయు నభివృద్ధి నిమిత్తమై యొకమహాసంఘ మేర్పఱుచుట కర్తవ్య మని సభ్యు లేకగ్రీవముగాఁ బలికిరి. అట్టి సంఘ మేర్పడిన పిమ్మట జరుపవలసిన కార్యక్రమములో సమగ్రమైన నిఘంటునిర్మాణము ముఖ్య మని వీరేశలింగము పంతులుగారు సోపపత్తికముగాఁ బ్రతిపాదించిరి. దానికిఁ దక్కినసభ్యులు సంగీకరించిరి. స్థాపింపఁబడఁబోవు సంఘ మట్టి నిఘంటునిర్మాణమునకుఁ బూనుకొన్నచో నందులకుఁ గావలసినధన మంతయుఁ దామే యిచ్చెద మని మహారాజావా రప్పుడే ప్రతిజ్ఞ చేసిరి.

మహాసంఘమును స్థాపించుటకై యొకసభ తిరువల్లిక్కేణి యున్నతపాఠశాలాభవనమున, ఆ 1911 వ సంవత్సరము మే నెల ది 12 వ తేదిని జరుపఁబడినది. ఆసభకు శ్రీపిఠాపురము మహారాజావా రగ్రాసనాధిపతిగా నుండిరి. ఈసభలో జరిగినతీర్మానములు మూఁడవయనుబంధమునఁ జూడనగును. వీనిలో మొదటితీర్మాన మైనవెంటనే శ్రీమహారాజావారు కార్యాంతరవ్యగ్రతచే వేఱొకచోటికి వెళ్లిరి. వారిస్థానమందు న్యాయపతి సుబ్బారావుపంతులుగా రధ్యక్షులయి మిగిలిన కార్యక్రమమును నడిపిరి. నిఘంటువు గూర్చినతీర్మాన మైనవెంటనే యాకార్యమునకుఁ బట్టెడు ధన మంతయుఁ దామే యిచ్చెద మని సభలోఁ జెప్పు మని మహారాజావారు తమతోఁ జెప్పినట్లు సుబ్బారావుపంతులుగారు చెప్పిరి. సభాసదు లందఱును మిగుల సంతోషించిరి.

ఆసభకు రావలయు నని పలువురు ప్రముఖుల కాహ్వానము లంపఁబడినవి. వేంకటగిరిపురవరాధీశ్వరు లగు శ్రీ మహారాజా వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్రబహద్దరుగారి కాహ్వానము మాత్రమే గాక శ్రీవారిప్రియమిత్రులును హైకోర్టు వకీలు నగు పి. వి. కృష్ణస్వామిసెట్టిగారి ద్వారమున జాబుకూడఁ బంపఁబడినది. మహారాజావారు సభకు రాఁజాలకపోయినను, బరిషన్నిర్మాణోద్యమము తమ కెంతయు నిష్ట మని ప్రత్యుత్తర మిచ్చిరి. (అనుబంధము ౪.) ఈయుత్తరము శ్రీవారి కీయుద్యమమునందుఁ గల యాదరమును బ్రకటించుచున్నయది. బొబ్బిలి పురవరాధీశ్వరులగు మహారాజా శ్రీరావు శ్వేతాచలపతి రంగారావు బహద్దరుగా రీసమయమున నుదకమండలమున నుండుటచే సభకు రాఁజాల రైరి. పరిషన్నిర్మాణము తమ కిష్టమే యని జాబువ్రాసిరి. (అనుబంధము ౫.)



కీ. శే. శ్రీ వేంకటగిరిపురాధీశ్వరులు
మహారాజా సర్ వెలుగోటి శ్రీరాజగోపాల
కృష్ణయాచేంద్ర బహద్దరువారు.

నిబంధన నిర్మాణమునకై సంఘ మొకటి నియమింపఁబడినది. ఆసంఘము ప్రతిపాదించిన నిబంధనలు పరిషత్సభలో నామోదింపఁబడినవి. "సాహిత్యపరిషత్తు" ను పేరు "వంగీయసాహిత్యపరిష" న్నామమునుండి గ్రహింపఁబడినది. "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యనుకృష్ణదేవరాయమహాకవి వాక్యము పరిషదుద్దేశసూచకసంగ్రహ వాక్యము (Motto) గను* సరస్వతీ విగ్రహము పరిషల్లాంఛనము (Crest) గను గ్రహింపఁబడినది.

ఈనిబంధనలలోఁ బరిషత్సభ్యులు—1. ప్రతిష్ఠాపకులు, 2. ఉద్ధారకులు, 3. పోషకులు, 4. యావజ్జీవసభ్యులు, 5. సాధారణసభ్యులు నని యైదువర్గములుగా నుండవలయు ననియుఁ, బ్రతిష్ఠాపకులు చెఱి పదివేల రూప్యములు, ఉద్ధారకులు చెఱియైదువేలు, పోషకులు చెఱివేయి, యావజ్జీవ సభ్యులు చెఱినూఱు నొక్కసారిగా నీయవలయు ననియు సాధారణసభ్యులు సంవత్సరమున కాఱురూపాయలు చందా నీయవలయు ననియు నిబంధనలలో విధింపఁబడినది. దీని ననుసరించి పిఠాపురము మహారాజావారును వేంకటగిరి మహారాజావారును జెఱి పదివేల రూపాయల నిచ్చి ప్రథమప్రతిష్ఠాపకులైరి. బొబ్బిలి మహారాజావారు మఱికొంతకాలమునకుఁ దాముఁను బదివేలరూపాయల నిచ్చి ప్రతిష్ఠాపకులైరి. శనివారపుపేట, మునగాల, ముక్త్యాల, నడిమితిరువూరు జమీందారులు పోషకులైరి. ఇరువదియైదుమంది యావజ్జీవసభ్యులైరి. కొంతకాలముపిదప, ఉయ్యూరు జమీందారులగు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారైదువేల రూపాయల నొసంగి యుద్ధారకులైరి. చందాలీయనక్కఱలేకయే విద్యాధికులఁ గొందఱను గౌరవార్థసభ్యులనుగాఁ జేర్చుకొనవచ్చు నని కూడ నిర్ణయమైనది. ఈనిబంధనలలో నప్పుడప్పుడు కొంచెము మార్పులు చేయఁబడినవి. ఇప్పుడు వ్యవహారములోనున్న నిబంధన లనుబంధముగాఁ జూపఁబడినవి. (అనుబంధము ఙ) ఆ 1913 సంవత్సరము ఏప్రిల్ నెల ది 8 తేదిని, పరిషత్తు Company Act ప్రకారము రిజిష్టరు కాఁబడినది.

పరిషత్ప్రథమవార్షికసభ ఆ1912 సంవత్సరము ఏప్రిల్ నెల ది 6, 7 తేదుల యందు పచ్చయప్పకళాశాలాభవనమందు సమావేశమైనది. ఆసభకు శ్రీపిఠాపురము మహారాజావా రగ్రాసనాధిపతిగా నుండిరి.

---

*ఆముక్తమాల్యదయందుండుటచేత నీవాక్యము కృష్ణరాయరచిత మనియే యందఱుఁ దలఁచుచున్నారు గాని యంతకుఁ బూర్వపు క్రీడాభిరామమందుఁగూడ నీవాక్యము కనఁబడుచున్నది.

ఈకాలములో నాంధ్రప్రబంధములు కొన్నింటిలో శృంగారవర్ణన మతి మాత్రముగాను, అశ్లీలముగాను నున్నది, కావున నట్టిగ్రంథములను బ్రకటింపరాదని యొకవాదమును గ్రాంథికాంధ్రము జనసామాన్యమునకు దుర్గ్రాహ్యముగా నున్నది గావున వ్యావహారిక భాషలో గ్రంథములు రచియింపవచ్చు ననియు నట్టి గ్రంథములె పాఠశాలలలో నుపయోగింపవలయు నని యొకవాదమును బుట్టి విద్వల్లోకమును గలంచుచుండెను. ఈరెండువాదముల యందలి గుణాగుణములను బరిశీలించి సిద్ధాంతీకరించుటకై యీసంవత్సరము మే మాసములో ది 15, 16 తేదులయందు పచ్చయప్పకళాశాలాభవనమునం బెద్ద విద్వత్సభ యొకటి సమావేశమైనది. ఆసభ కాంధ్రదేశమునందుండి పెక్కురు విద్వాంసులుం, కవులు వచ్చియుండిరి. తొలినాఁడు సభకు పురాణము నాగభూషణముగారు, ఎం. ఏ., బి. ఎల్. అగ్రాసనాధిపతిగా నుండిరి. ఈదినమున శృంగారవర్ణనను గుఱించి విపులముగాఁ జర్చించి సభాసదు లొక సిద్ధాంతమును జేసిరి. రెండవనాఁడు వ్యావహారిక భాషావిషయమై చర్చ జరిగెను. ఈసభకు చల్లపల్లి కుమారరాజాగా రగు శ్రీయార్లగడ్డ అంకినీడు ప్రసాదబహద్దరుగా రగ్రాసనాధిపతులుగా నుండిరి. వ్యావహారికభాషావాదముపక్షమున గురుజాడ అప్పారావుగా రుపన్యసించిరి. పేరి కాశీనాథశాస్త్రులుగారు వారి ననుసరించిరి. కాని యితరవిద్వాంసు లించుమించుగా నందఱును నావాదమును ఖండించి గ్రాంథికభాషావాదమునె సిద్ధాంతము చేసిరి. ఈరెండువాదములను గూర్చి గావించఁ జేయఁబడిన సిద్ధాంతము 2 వ యనుబంధమునఁ జూడనగును. ఈసభకుఁ బండితులను రప్పించుటకును వారి కాతిథ్య మిచ్చుటకును బట్టిన ధనమంతయు శ్రీవేంకటగిరి మహారాజావారొసంగిరి.

ఈసిద్ధాంతములను జూపి వాని భావమును విపులముగా గవర్నరుగారికి నివేదించుటకయి-

1. ఆనరెబుల్ మోచెర్ల రామచంద్రరావుగారు
2. రాయబహద్దరు బయ్యా నరసింహేశ్వరశర్మగారు
3. పండిత దీవి గోపాలాచార్యులుగారు
4. తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు
5. గునుపాటి ఏనాదిరెడ్డిగారు
6. వేమవరపు రామదాసుపంతులు గారు
7. కమలి పట్టాభిరామారావుపంతులుగారు



కీ. శే. మహారాజ సర్ శ్రీ రావు వేంకట
శ్వేతాచలపతిరంగారావుబహద్దరువారు,
బొబ్బిలిసంస్థానాధీశ్వరులు.

నియమింపఁబడిరి. ఆగష్టు ది 7 వ తేదిని వారట్లొనర్చిరి. పూర్వపుప్రబంధములను నశింపఁజేయుట గాని మార్చుట గాని భాషకు నష్ట మనియు వానియందచ్చటచ్చట నత్యధిక శృంగారవర్ణనము లున్నను నవి పామరులకుఁ దెలియని కఠినశైలిలో నున్నవనియు వానివలనఁ బూర్వకాలపువారు గాని యిప్పటివారుగాని నీతియందు దౌర్బల్యమును జెందలే దనియు, నీప్రబంధములపై నభియోగము తెచ్చినచోఁ బూర్వగ్రంథప్రకటనమునకు నిరుత్సాహమును భంగమును గలుగు ననియు నెప్పుడైనఁ బ్రభుత్వమువా రట్టిప్రబంధములలో దేనినైన హానికర మని తలఁతురేని నావిషయ మాంధ్రసాహిత్యపరిషత్తువంటి పండితసంఘమునకుఁ దెలిపిన నాసంఘ మాలోపమును నివారించు ననియుఁ గనుకఁ బూర్వపుఁ బ్రాఢవాఙ్మయము జోలికిఁ బ్రభుత్వమువారు పోఁగూడ దనియు మనవిచేసిరి. మఱియు జనసామాన్యమునందు విద్యావ్యాప్తికై సులభశైలిలో గ్రంథములు రచించుటావశ్యకమయినను గ్రామ్యభాషను గ్రంథములలోఁ జేర్చుట, మీఁదుమిక్కిలి యట్టిగ్రంథములు పాఠశాలలలోని బాలురకుఁ బఠనీయములుగా నిర్ణయింపఁబడుట యనర్థదాయక మనియుఁ దెలుఁగు మాతృభాష కానివారినిఁ బఠనీయగ్రంథనిర్ణాయకసంఘములో నుంచుట యసంతృప్తికరముగ నున్న దనియు విజ్ఞాపన మొనరించిరి. గ్రంథము నీతివిషయమున నింద్యమా యనుప్రశ్నను గుఱించి లార్డుకాక్బర్న్ గారు (Cock Burn) వివరించి రనియు, వారుచెప్పినట్లు గ్రంథము ముద్రింపఁబడి సర్వసాధారణముగఁ గొలఁది వెల కమ్మఁబడుచు దుర్నీతినిఁ బ్రోత్సాహపఱచు నెడల నది నింద్య మనియు నట్లుకాక యెక్కువ వెల కలిగి పుస్తకభాండాగారములకును పండితులకును మాత్రమే విక్రయింపఁబడుచుండిన యెడలఁ బ్రకటనకర్తపై నేరముండ దనియు మొదటి విన్నపమునకు శ్రీగవర్నరుగారు ప్రత్యుత్తర మొసఁగిరి. గ్రామ్యభాషవిషయమై ప్రభుత్వమువారు మధ్యస్థముగ నుందు రనియుఁ దెలుఁగు మాతృభాషగాఁ గలవారి నింకను బఠనీయగ్రంథ నిర్ణాయకసభలోఁ జేర్ప వలనుపడునా యని విచారింతు మనియు రెండవవిజ్ఞాపనమునకు సమాధానము వాక్రుచ్చిరి. గవర్నరుగారి కభివందనము లొనర్చి పరిషత్తు రాయబారులు తిరిగివచ్చిరి.

అంతటితో శాంతిపొందక వ్యావహారిక భాషావాదులు లక్షణవిరుద్ధభాషకు, ఆధునికాంధ్ర మని పేరుపెట్టి విద్యాశాఖాధికారిగారి (Director of Public Instruction) నొప్పించి, ఉన్నతపాఠశాలాధ్యయనాంత మందు జరుగుపరీక్ష (Secondary School Leaving Certificate Examination) లో

విద్యార్థులు గ్రాంథికాంధ్రమందుఁ గాని యాధునికాంధ్రమందుఁ గాని ప్రశ్నముల కుత్తరములు వ్రాయవచ్చు నని యుత్తరువు పుట్టించిరి. ఈయుత్తరువు పుట్టినట్లు వెల్లడి యైనంతనె పరిషత్తువా రాయుత్తరువు సరియైనదికాదు గావున దానిని రద్దు చేయవలయు నని విద్యాధికారులకు నివేదించిరి. కాని వా రానివేదికను మన్నింపలేదు. ఇఁకముం దావిషయమయి చేయవలసిన పని యేదియో నిర్ణయించుటకై ఆ 1912 సంవత్సరము నవంబరునెల ది 24 వ తేదిని పచ్చయప్ప కళాశాలాభవనములో నొకసభ కావింపఁ బడియెను. ఆసభకు పిఠాపురము మహారాజాగారును, కురుపాము, కపిలేశ్వరపురము,(కృష్ణామండలములోనిది) ఉయ్యూరు, తేలప్రోలు, నడిమితిరువూరు జమీందారులును మఱియు ననేకులు గృహస్థులును విచ్చేసిరి. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగా రగ్రాసనాధిపతిగా నుండిరి. విషయమును విపులముగాఁ జర్చించి సభ్యు లేకగ్రీవముగా-గ్రామ్యభాషలో రచియింపఁ బడిన తెలుఁగుపుస్తకములను పాఠశాలలలో నుపయోగింపకుండున ట్లుత్తరువు చేయుఁ డని కోరుచు దొరతనమువారి కొక మనవిపత్రమును బంపవలయు నని తీరుమానించిరి. ఆప్రకారము మనవిపత్ర మొకటి యచ్చువేయించి దానిప్రతు లాంధ్రదేశమందలి ముఖ్యపట్టణములకుఁ బంపి రమారమి పదివేలమందిచే సంతకములు చేయించి మనవిపత్రమును సంతకముల కాగితములను గలిపి యొకపుస్తకముగా నట్టకట్టించి గవర్నరుగారికిఁ బంపఁబడెను.(అనుబంధము ౮)అంతకంత కీవాదము ప్రబలసాగెను. గ్రామ్యవాదమును సమర్థించుచు రావుసాహెబు గిడుగు రామమూర్తిగారు నవీనాంధ్రము (Modern Telugu) అనుపేర నొకవ్యాసమును బ్రకటించిరి. దానినిఖండించుచు గ్రాంథికభాషాసమర్థనము (A defence of Literary Telugu) అనుపేరితో నొకవ్యాసమును బ్రకటించితిని. వాదప్రతివాదము లిట్లు జరుగుచుండఁగా, "మఱి యేభాషలోను లేనియీప్రాచీననవీన భాషావిభాగ మొక్క యాంధ్రభాషయందుమాత్రము చేయుట భాషాసంప్రదాయమునకును, శాస్త్రమునకును, లోకమునకును విరుద్ధము గాన నాభేదమును గల్పించిన నిబంధనమును రద్దు చేయునట్లు విద్యాధికారిగారి కుత్తరువు లీయవలయు ననియు నీయర్థమును వివరించి యనువదించుట కవకాశము కావలయు ననియుఁ బరిషత్కార్యనిర్వాహకసభ్యులలో నొక్క రగు గౌరవనీయు బయ్యా నరసింహేశ్వరశర్మగారు దొరతనమువారిని వేఁడిరి. ఈవిషయమై ఆ 1913 వ సంవత్సరము నవంబరు నెలలో సమావేశమైన శాసననిర్మాణసభలో సవిస్తరముగఁ



జయపురాధీశ్వరులగు మహారాజశ్రీ
డాక్టరు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ బహద్దరువారు.

జర్చ జరగినది. ఆసమయమున గౌరవనీయులగు 1. మోచెర్ల రామచంద్రరావు
గారు, 2. ఏ. యస్. కృష్ణారావుగారు, 3. పి. కేశవపిళ్లెగారు, 4. చింతలపాటి
నరసింహరాజుగారు, 5. టి. వి. శేషగిరి అయ్యరుగారు, 6. వి. యస్. శ్రీనివాస
శాస్త్రులుగారు వీరలందఱు నరసింహేశ్వరశర్మగారు ప్రతిపాదించిన యర్థమునే
యేకగ్రీవముగ దృఢపఱచిరి. వీరిలో శ్రీనివాసశాస్త్రులుగారు నిషిద్ధనిబంధనము
పుట్టిన సమయమునకుఁ దన్నిబంధనకర్తలలో నొకరుగా నుండిరి. గ్రాంథికభాషవలె
నే గ్రామ్యభాషకూడఁ బాఠశాలలలో బాలురకు నేర్పుచున్నా రని యెవరో
చెప్పఁగా నది నమ్మి (School Leaving Certificate) సంఘమువా రాని
బంధనము చేయుట తటస్థించిన దనియు, నిటీవల విచారింపఁగా గ్రామ్యభాషను
బాఠశాలలలోఁ జెప్పుట లేదని తమకునిశ్చయముగఁ దెలిసినది గావున నానిబం
ధన మవశ్యము నిషేధనీయ మనియు వారు ప్రతిపాదించిరి. ఆసభలో వీరివాద
మును ఖండించి గ్రామ్యవాదమును సమర్థించినవా రెవ్వరును లేకపోయిరి. అపు
డు విద్యాధికారిపదము నధిష్ఠించియున్న Sir Alfred Bowne గారు నరసిం
హేశ్వరశర్మగారు కోరినప్రకార మొనర్చుట కెంతమాత్ర మవకాశము లేదని
తొలుత వాదించిరి గాని, చిట్టచివర కాయభిప్రాయమును మార్చుకొని మధ్యమ
పరీక్షాంధ్రవచనరచనాపద్ధతి నిర్ణయించుటకు విశ్వవిద్యాలయమువారిచే నియ
మింపఁబడినసంఘము (University Intermediate Examination
Telugu Composition Committee) వారు, ఆవిషయమును గుఱించి
చర్చించుచున్నా రనియు, శీఘ్రకాలమునందే వారియభిప్రాయము తేలఁగల దని
యు, నది తేలినపిమ్మట నాపద్ధతియే పాఠశాలాంత్యపరీక్షకుఁగూడ వర్తించున ట్లుత్త
రువు చేసెద మనియుఁ జెప్పుటచే నాచర్చ యంతటితో నంతరించెను.

పిదప ఆ 1914 సంవత్సరము ఆగష్టు ది 11 వ తేదిని జరిగిన సభలో మద
రాసు విశ్వవిద్యాలయాధ్యక్షసంఘమువారు నవీనాంధ్రము(Modern Telugu)
అని పిలువఁబడెడు భాష కళాశాలలయం దుపదేశింపఁ గూడ దని నిర్ణయించిరి.
ఈనిర్ణయము ననుసరించి దొరతనమువారును విద్యాశాఖాధికారిగా రిదివఱలో
గ్రామ్యవాదపక్షమునఁ జేసినయుత్తరువును రద్దుచేసిరి. (అనుబంధము ౯)

మూఁడు సంవత్సరము లాంధ్రలోకము నంతను గలవరపెట్టిన గ్రామ్యవాద
మంతటితో నంతరించెను. అది యంతరించుటవలన నాంధ్రవిద్వల్లోకమునకుఁ గలి

గిన యానందము తత్కాలమందు, పరిషత్పత్రికలోను మఱి యితరపత్రికలలోను గూడఁ బ్రకటింపఁబడినది. ఇది జరిగి నేఁటి కిరువదిరెండు సంవత్సరము లైనది. ఇప్పుడును గొందఱు గ్రామ్యవాదులు లేకపోలేదు. గ్రామ్యరచనమును జేయు వారునుగలరు. పత్రికలలో గ్రామ్యభాషాభూయిష్ఠవ్యాసములు కనఁబడుచున్నవి. ప్రస్తుతము నామావశిష్టమైన "ప్రబుద్ధాంధ్ర" మొదలగు కొన్నిపత్రికలు గ్రామ్య భాషనాదరించునవి గలవు. నవ్యకవులలోఁ గొంద ఱీభాషను వాడుచున్నారు. కాని గ్రామ్యవాదులలోఁగూడఁ బలువురు భాషకు నియమ మావశ్యకమని తలం చుచున్నారు. గిడుగు రామమూర్తిపంతులుగారు టీకల బాలకవిశరణ్య మని యొక గ్రంథమును బ్రకటించినారు. ఇప్పుడు గ్రామ్యములుగా గణింపఁబడు కొన్నిశబ్ద ములఁ బూర్వకవులు కొందఱు ప్రయోగించినా రని చెప్పుచు నట్టిప్రయోగము లఁ గొన్నిటినుదాహరించినారు. గోదావరీకృష్ణాతీరములయందలి యక్షరాస్యులు వాడువ్యావహారికభాషయందు గ్రంథరచనము చేయవలయు నను రామమూర్తి పంతులుగారు పూర్వకవిప్రయోగములఁ బాటించుట విశేషమే కదా ? పూర్వకవి ప్రయోగముల నంగీకరించుటచే యథేచ్ఛావాదము వెనుకపట్టినట్లే కదా ! పూర్వ కవిప్రయోగములు ప్రమాణము లనునది గ్రాంథికవాదుల కిష్టమే, కాని, యా పూర్వకవులు ప్రామాణికులుగా గ్రహింపఁ దగినవా రగుదురా వారిగ్రంథముల లోని ప్రయోగములు కవులు బుద్ధిపూర్వకముగాఁ బ్రయోగించిన వగునా లేక ప్రమాదజనితములా యను విషయములను జర్చించి పరిశీలనమునకు నిలిచిన శబ్దముల నంగీకరించుట కాక్షేపణ ముండఁగూడదు. అన్నివిషయములలోను యథేచ్ఛావాదు లెప్పటికి నుందురు. వారి నడ్డుపెట్టువారు లేరు. కాని వారివాద మునకు రాజాదర ముండినచో నది యనర్థదాయక మగును. గ్రామ్యవాదమున కట్టియాదరము లేకుండఁ జేయుటయే పరిషత్తు నిర్వహించిన ఘనకార్యములలో నొకటి.

శృంగారవర్ణన లధికముగా నున్నగ్రంథముల ప్రకటనము నిషేధింపఁగూడ దని దొరతనమువారికి నివేదనము చేయఁబడిన దని యిదివఱలోఁ జెప్పియుంటిని. ఆ 1927 సంవత్సరములో వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారు ప్రక టించిన బిల్హణీయము, హంసవింశతి, వైజయంతీవిలాసము మొదలగుగ్రంథముల లో శృంగారవర్ణన మసభ్యముగా నున్నది గావున నావర్ణనములతో నాగ్రంథము లను బ్రకటింపరా దని దొరతనమువారు నిషేధించిరి. ఆసంవత్సరము, అక్టోబరు



జయంతి రామయ్య పంతులు, బి. ఎ., బి. ఎల్.

నెలలో బళ్లారిలో జరిగిన పరిషద్వార్షికసమావేశసందర్భమున నొకసభ జరిగినది. ఆసభలో నట్టిగ్రంథముల ప్రకటనము నిషేధించుట యుచితము కాదనియు, గొందఱు తగుమనుష్యులు గవర్నరుగారికి స్వయముగా నివేదించు నటులు పరిషత్తువా రేర్పాటుచేయవలయు ననియుఁ దీర్మానము చేయఁబడినది. ఆతీరుమానమున ననుసరించి-

1. శ్రీపిఠాపురము మహారాజావారు
2. దొడ్డప్పనాయక్కనూరు జమీందారులగు దివాన్‌బహద్దరు వి. రామభద్రనాయఁడుగారు
3. లక్కవరము ప్రొప్రయిటరులగు మంత్రిప్రెగడ భుజంగరావుగారు
4. కల్లూరపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు
5. Dr. S. కృష్ణస్వామి అయ్యంగారు
6. రాయిసాహెబు గుమ్మడూరి వేంకటరంగారావుగారు
7. దంతహుండా మాలుద్దారగు త్రిపురాన సూర్యప్రసాదరావుగారు
8. టి. శంకరంపిళ్లెగారును

నేనును గలసి 1928 వ సంవత్సరము మార్చినెల ది 10 తేదిని, ఉదయము 11 గంటలవేళఁ జెన్నపురిలో గవర్నరుగారిని దర్శించి నివేదనపత్ర మొకటి సమర్పించి (అనుబంధము ౧౦) యందలి విషయమునే విపులముగా నుపన్యసించితిమి. అపుడు గవర్నరుగారి మంత్రివర్గములోఁ జేరిన సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు కూడ నుండిరి. గవర్నరుగారు మేము చెప్పినది సావకాశముగ వినిరి. పిదప వావిళ్లవారు ప్రకటించిన గ్రంథములలో నసభ్యము లనఁబడు భాగముల నీసివేసి మిగిలినగ్రంథమే ప్రకటింపవలయు నని దొరతనమువా రుత్తరువుచేయఁగా వావిళ్లవా రందుల కంగీకరించినట్లు కనఁబడుచున్నది. ఈవిషయములో నింకను సరియయిన నిర్ణయము కాలేదు.

—§ వార్షికసభలు §—

ఆంధ్రభాషాసేవకై జనులయం దుత్సాహము పురికొల్పుటకై యాయాస్థలములయందు సంవత్సరమున కొక్కసారి పరిషద్వార్షికోత్సవము జరుపవలయు నని పరిషన్నిబంధనలలో నున్నది. ఆప్రకారము జరపినమొదల నిప్పటి కిరువదినాలుగు సభలు కావలసియుండెను. మూఁడుసారులు మాత్రము రెండేసి వార్షికసభలు కలిపి యొక్కసారిచేయవలసి వచ్చినది. కావున నింతవఱకు 21 సభలు మా

త్రమే జరగినవి. ఏయేసభ యెప్పుడెప్పు డేయేయూరిలో జరగినదో యాసభల కధ్యక్షు లెవ్వరో 11 వ యనుబంధములోఁ జూడనగును.

ప్రథమసభ చెన్నపురిలో సమావేశ మైనది. అధ్యక్షులుగా నియమింపఁబడిన శ్రీపిఠాపురము మహారాజావారు రాఁజాలనందున రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగా రగ్రాసనము నలంకరించిరి. పిదప మధ్యాహ్నము మహారాజావారు విచ్చేసిరి. ఆసభలో రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు తమగ్రామ్యవాదమును బోధించిరి. ఇతరులు దానిని ఖండించిరి. తుదకా వాదము నిరాకృత మైనది. ఈవిషయమును సమగ్రముగఁ జర్చించి సిద్ధాంతీకరించుటకై విద్వత్సభ యొకటి కావింపఁబడి యందులోఁ గూడ గ్రామ్యవాదము నిషేధింపఁబడినది. ఆసభావృత్తాంతము పైని వివరించియున్నాఁడను.

రెండవసభ యాంధ్రవాఙ్మయమునకుఁ బుట్టినిల్లయిన రాజమహేంద్రవరములో జరగినది. ఆసభకు వచ్చినవారికందఱకు శ్రీపిఠాపురము మహారాజావారాతిథ్య మొసంగిరి. గ్రాంథికవాదాగ్రేసరు లగు మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగా రగ్రాసనాధిపతులుగా నుండిరి. ఆసభకు వేనవేలు జనులు వచ్చిరి. పలువురు గ్రామ్యవాదమును ఖండించుచు నుపన్యసించిరి. ఆవాదమును బ్రతిపాదించువారు లేరైరి.

మూఁడవసభ కాకినాడలో సమావేశ మైనది. పెక్కురు జనులు వచ్చిరి. విజయనగరకళాశాలాధ్యక్షులు, కిళాంబి రామానుజాచార్యులు ఎం. ఏ., బి. ఎల్. గా రగ్రాసనాధిపతులుగా నుండిరి. ఈసభలో రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారును గురుజాడ అప్పారావుగారును గ్రామ్యవాదమును బ్రతిపాదించుచు నుపన్యసించిరి. పిదప వాదప్రతివాదములు తీవ్రముగా జరగినవి. చిట్టచివరకు "1912 వ సంవత్సరము మేనెలలోఁ జెన్నపట్టణమునందు జరగిన పండితగోష్ఠియొక్క యభిప్రాయమే యీపరిషదభిప్రాయముగ గ్రహింపవలసిన"దని సభవారు నిర్ణయించిరి. ఇందుఁ బేర్కొనఁబడిన పండితాభిప్రాయ మిట్లున్నది.

"గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణిక మతానుసార మగు భాషను బ్రయోగింపవలయును గాని లక్షణవిరుద్ధ మగుభాషను బ్రయోగింపఁ గూడదు. గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలయు ననుట సర్వజనసమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యము కాదు. లక్షణభంగము కాకుండ భాషావైచిత్రి యెంతయైనను గనఁబఱుపవచ్చును."



కీ. శే. రావుబహద్దరు
కందుకూరి వీరేశలింగము పంతులుగారు.

నాలుగవసభ, యాంధ్రప్రబంధకవితాసూతికాగృహ మగు విద్యానగర మున కనతిదూరమం దున్న బళ్లారిపురమందు సమావేశ మైనది. దానికి, ఆనెగొంది సంస్థానము జాగీర్ దారు లగు శ్రీరంగదేవరాయలవా రధ్యక్షులుగా నుండిరి. వీరు పూర్వము కర్ణాటరాజ్యమును బాలించిన "నరపతి"రాజుల వంశము లోనివారు. ఇప్పుడు వీ రనుభవించుచున్న ఆనెగొంది సంస్థాన మాకర్ణాటరాజ్యములో నేకదేశము. వర్తమానకాలమునందు నైజాము రాజ్యములోఁ జేరియున్నది. సభ జయప్రదముగా జరిగినది. ఈసభకు మధురమండలములోని దొడ్డప్పనాయక్కనూరు జమీందారు లగు దివాన్‌బహద్దర్ వి. రామభద్రనాయఁడుగారు విచ్చేసిరి. వీ రాంధ్రులు, జైమినిభారతాదిగ్రంథకర్తయగు సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకుని వంశస్థులు. మాతృభాషాభిమానము మిక్కిలిగఁ గలవారు. వీరు పరిషత్తులో యావజ్జీవసభ్యులుగా నుండుటయే కాక జైమినిభారతపుస్తక మచ్చువేయించుటకై రు. 500 విరాళముగా నిచ్చిరి. సభ ముగిసినపిమ్మట శ్రీరంగదేవరాయలువారు జీర్ణ కర్ణాటరాజధానిని సందర్శించుటకై సభ్యుల నాహ్వానము చేసిరి. పలువురు చని వారి యాతిథ్యము ననుభవించి జీర్ణవిజయనగరపట్టణమును జూచివచ్చిరి.

అయిదవసభ, రెడ్డిరాజుల రాజధానికి సమీపమం దున్న గుంటూరులో జరిగినది. శ్రీమంత్రిప్రెగడ భుజంగరావుగా రగ్రాసనాధిపతులుగా నుండిరి. శరీర స్వాస్థ్యము తక్కువగ నున్నను మిక్కుట మైన మాతృభాషాభిమానమును బురస్కరించుకొని శ్రీరామభద్రనాయఁడుగా రీసభకు వచ్చి మఱుచటి సంవత్సరము సభ మధురాపురములోఁ గావింపవలయు నని యాహ్వానించిరి. ఆసభ కడపలోఁ గావింపవలయు నని జనమంచి శేషాద్రిశర్మగారు కోరిరి- ముందు, కడపలో సభ జరిగించి పిదప మధుర వెళ్లునట్లు పరిషత్తువారు నిర్ణయించిరి.

ఆఱవసభ, కడపపురములోఁ గూడినది. దానికి, కోలాచలము శ్రీనివాస రావుగా రధ్యక్షులుగ నుండిరి.

సప్తమవార్షికసభ, తొలుతఁ బాండ్యరాజులకును బిదప నాంధ్రనాయఁక రాజులకును రాజధానియైన దక్షిణమధురాపురమున సమావేశమయ్యెను. ఆనెగొంది సంస్థానాధీశ్వరు లగు శ్రీరంగదేవరాయలవారే యగ్రాసనాధిపతిగా నుండిరి. ద్రావిడదేశములో నున్న పలువు రాంధ్రులే కాక ద్రావిడులు ననేకు లాసభకు విచ్చేసిరి. ఆపట్టణమందు నెలకొల్పఁబడిన "తమిళసంఘము" కార్యనిర్వాహకులు పరిషత్తునకు స్వాగత మొసఁగిరి. వారు చిరకాలమునుండి ప్రకటించుచున్న 'సెంద

మిళ' పత్రికల సంపుటములను వివిధగ్రంథములను ద్రవిడనిఘంటువులం జిపత్తున కిచ్చిరి. సభ యుత్సాహసమన్వితముగ జరగినది. ఈసభ ద్రావిడదేశనాభిస్థాన మందు జరగుటచేత నాత్రేయాంధ్రులును దాక్షిణాత్యాంధ్రులును గూడి చిరకాలము విడిపోయి యుండి తిరిగి యొకచోటఁ గూడినసోదరులవలెనే యెంతయు సంతసించిరి. ఈసందర్భమున నే నాసభలో నన్నమాటల నుదాహరించుచున్నాఁడను.

"మీరును మేము సోదరులము. మీరు చిరకాలముక్రిందట స్వదేశమును విడిచి యీదేశమునకు వచ్చి ధనమును యశోధనమును సంపాదించి యిచ్చటనే స్థిరపడినారు. మేమో, యింటనే కనిపెట్టుకొని యుండి యేదో యొకవిధముగఁ గాలక్షేపముచేయుచు మిమ్ముఁ జూచు వేడుకతో నేఁడిటకు వచ్చినారము. మీరెవ్వరో మేమెవ్వరో యని మాయెడల నుదాసీనభావము వహింపక మీరు మమ్ములను సోదరులనుగా గ్రహించి యాదరించినందులకు మే మెంతయు సంతసించినారము. ఇంతటినుండి మనము పరస్పర యోగక్షేమముల నరయుచు మనకన్నతల్లియైన యాంధ్రభాష యభివృద్ధికై కలిసి పాటుపడుదము గాక."

అష్టమవార్షికసభ, తిక్కనకవీంద్రుని వాసస్థాన మగు నెల్లూరుపురమునందును నవమసభ బెజవాడయందును, దశమసభ యేలూరను జరగినవి.

ఏకాదశసభ శ్రీపురుహూతికాపీఠ మగు పీఠికాపురములో శ్రీమహారాజావారి కోటలోనే జరగినది. మహారాజావారు స్వాగతోపన్యాసముం జదివిరి. పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులు గారధ్యక్షులుగా నుండిరి. ఈసభలోఁ బరిషత్కార్యస్థానము చెన్నపురినుండి యాంధ్రదేశమునకు మార్చుట మంచిదా, మంచిదైన నేపట్టణమునకు మార్పవలయు నను విషయమును బరిశీలించి తమ యభిప్రాయమును దెలుపుటకుఁ బదునొకొండుగురు సభ్యులుగల యుపసంఘ మొకటి నియమింపఁబడినది.

పండ్రెండవసభ-తునిలో శ్రీరాణీగారి యాదరమున జరగినది. ప్రస్తుతము జయపురము మహారాజావారగు శ్రీవిక్రమదేవవర్మగారు సభాధ్యక్షులుగానుండిరి. పరిషత్కార్యస్థానము శీఘ్రకాలములోనే కాకినాడకు మార్పవలయు నని యొకతీరుమానము గావింపఁబడినది.

పదమూఁడవసభ- పశ్చిమగోదావరీమండలములోని తణుకులోఁ గూడినది. ఆచంట వేంకటరాయసాంఖ్యాయన శర్మగారగ్రాసన మధిష్ఠించిరి. నే నీసభకు



కీ. శే. ఆనేగొంది సంస్థానాధీశ్వరు లగు శ్రీరాజా శ్రీరంగదేవరాయలు వారు.



కీ. శే. దొడ్డప్పనాయక్కనూరు జమీందారు దివా౯ బహదరు వి. రామభద్రనాయుడుగారు.



కీ. శే. రాయిసాహెబు గుమ్మడూరి వేంకటరంగారావుగారు, ఎం. ఏ.

వెళ్ల లేదు. నేను వెళ్లియుండని పరిషద్వార్షికసభ యింతవఱ కిదియొక్కటియే. ఈ సభలోఁ బరిషత్కార్యస్థానము తునినిర్ణయమునకు వ్యతిరేకముగ రాజమహేంద్రవరమునకు మార్చవలసిన దని యొకనిర్ణయమును, "గ్రామ్యముకాని వ్యావహారికాంధ్రభాషలోఁ బూర్వసంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చు"నని యొకనిర్ణయమును జేయఁ బడినవి.

పదునాల్గవసభయుఁ బదునైదవసభయుఁ గాకినాడలో జరగినవి. మొదటిసభకు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, రెండవసభకు ఉయ్యూరిప్రభువులగు శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారును అధ్యక్షులుగా నుండిరి. మొదటిసభలో, తణుకులోఁ జేయఁబడిన పూర్వోదాహృత నిర్ణయములు రెండును బునర్విమర్శకు వచ్చినవి. పరిషత్కార్యస్థానము కాకినాడకే మార్చవలయునని సభవారు నిశ్చయించిరి. ఆప్రకారమే జరగినది. చెన్నపట్టణమునుండి సామానులు తెచ్చుటకుఁ బట్టినధన మంతయు శ్రీపిఠాపురము మహారాజావా రొసఁగిరి. అద్దె లేకుండఁ గార్యస్థానమున కొకయిల్లుకూడ నిచ్చియున్నారు. భాషావిషయక మగు రెండవనిర్ణయమును గూర్చి "తణుకులో జరగిన పరిషత్సభలోఁ జేయఁ బడిన 10 వ తీర్మానము గ్రామ్యవాదమున కనుకూలముగా నన్వయించుట కవకాశముండుటచేతను, ఈపరిషత్తువారికి గ్రామ్యవాద మనంగీకార మగుటచేతను 1914 వ సంవత్సరము ఏప్రిల్ 19 వ తేదిని కాకినాడలో జరగిన పరిషత్సభలోఁ జేయఁ బడినట్టియు, ఆనందసంవత్సర పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినట్టియు తీర్మానమునే యీసభవారు స్థిరపఱచుచున్నా"రనియు-

"ఇంకముం దెప్పుడైనను పైనుదాహరింపఁబడిన తీర్మానవిషయమై పునర్విమర్శనము జరుగుట యావశ్యక మని కార్యనిర్వాహకసభవారికిఁ దోఁచినప్పుడే గాని యట్టి పునర్విమర్శనము జరుగఁగూడదనియు, జరిగినప్పుడు- అప్పటికి, పరిషత్సభ్యులుగానుండి విషయనిర్ణయమునం దభిప్రాయ మిచ్చుట కధికారము గలిగిన సభ్యులందఱిలో 100 కి 66 గురుగాని యంత కెక్కువమందిగాని యామోదింపనిదే యాతీర్మానము మార్పఁగూడ"దనియుఁ గూడ నిర్ణయించిరి.

పదునాఱవసభ బళ్లారిలో జరగినది. బళ్లారిలో నింతకుఁ బూర్వ మొకసభ జరిగియున్నను దత్పురవాసుల కాంధ్రభాషయందుఁ గల యాదరాతిశయముచే నింకొకసారికూడఁ బరిషత్తు నచ్చటి కాహ్వానించిరి. ఈవిషయములో నధికశ్రద్ధతోఁ బనిచేసినవారు న్యాయవాదులుగా నుండిన టి. శివశంకరంపిళ్లెగారు. వీరు

జన్మచే ద్రావిడులయ్యును నాంధ్రభాషనభ్యసించి దానియందు మిగుల నాదరము గలవారయిరి. ఈసభకు త్రిపురాన సూర్యప్రసాదరావుగారధ్యక్షులుగా నుండిరి.

పదునేడవసభ, గౌతమీతీరమునందు ముక్తీశ్వరములోఁ గూడినది. ఈసభలో-"తగినంత సంస్కృతభాషాపరిచయము లేనిదే యాంధ్రభాషాప్రావీణ్యముగాని యుభయభాషాప్రావీణ్యము గాని కుదురదనియు, నాంధ్రవిశ్వకళాపరిషత్తువారిపుడు జరుపుచున్న యుభయభాషాపరీక్షలలో (C) కక్ష్యపరీక్షలో సంస్కృతము లేనేలేదు గనుకను, (B) కక్ష్యపరీక్షలో సంస్కృతభాగ మత్యల్పముగా నున్నది గనుకను (A) ఏకకక్ష్యలో తెలుఁగుభాగ మత్యల్ప మగుటచేతను, ఈమూఁడు కక్ష్యల పరీక్షల నిలిపివైచి యిప్పటి (A) కక్ష్యలోని సంస్కృతమును (B) కక్ష్యలోని తెనుఁగును గూడి యుండునట్లు వేఱొక యుభయభాషాప్రవీణ పరీక్షను విశ్వకళాపరిషత్తు వారేర్పాటు చేయవలయు ననియు నీపరిషత్తువారి యభిప్రాయము" అని యొకతీర్మానము కావింపఁబడినది. ఇందులో సూచించినవిధముగా నుభయభాషాప్రవీణ పరీక్ష యిటీవల మార్పఁబడినది.

పదునెనిమిదవసభయుఁ, బందొమ్మిదవసభయుఁ గలిపి పెద్దాపురములో జరుపఁబడినవి. చెన్నాప్రెగడ భానుమూర్తిగా రపు డధ్యక్షులుగా నుండిరి.

ఇరువదియవసభ విశాఖపట్టణములో శ్రీజయపురము మహారాజావారి యాదరమున జరుపఁబడినది. అప్పుడు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిలుగా రధ్యక్షులుగా నుండిరి-

ఇరువది యొకటి, యిరువదిరెండు సంవత్సరముల సభలు కలిపి రాజమహేంద్రవరములోను, ఇరువదిమూఁడు, ఇరువదినాల్గు సంవత్సరములసభలు కలిపి అమలాపురములోను జరుపఁబడినవి. రాజమహేంద్రవరసభకు వర్తమానాంధ్రకవిజ్యేష్ఠులు వడ్డాది సుబ్బారాయఁడుగారును, అమలాపురపుసభకు అవధానిశిరోమణి కాశీ కృష్ణాచార్యులుగారు నధ్యక్షులుగా నుండిరి.

## — పత్రికాప్రకటనము. —

పరిషన్నిబంధనలలో విధింపఁబడినప్రకారము పత్రికాప్రకటనము పరీధావిభాద్రపదమాసములో నారంభింపఁబడినది. తొలుత మూఁడుమాసముల కొకసారి ప్రకటింపఁబడుచుండి, యానందసంవత్సరమున మాసపత్రికగా మార్పఁబడినది. ఇట్లు జరుగుచుండఁగా యూరోపుదేశమందు మహాసంగ్రామము ప్రారంభమై తత్కాలమునఁ గాగితములు మొదలగు సామానులు దొరకుట కష్టసాధ్యముగా

నుండుటచేఁ గాళయుక్తి సంవత్సరారంభమునుండి పత్రిక రెండునెలలకొకసారి ప్రకటింపఁబడునట్లు మధురసభలో నిర్ణయింపఁబడి నేఁటివఱకు నట్లేజరగుచున్నది.

పత్రికయందు సంస్కృతాంధ్ర భాషావిషయకములును దద్వాఙ్మయవిషయకములునగు వ్యాసములు విద్యాధికులచే రచియింపఁబడినవి పెక్కులు ప్రకటింపఁబడినవి. గ్రంథవిమర్శనముగూడ బహుళముగాఁ జేయఁబడినది. ఆధునిక భౌతికశాస్త్రవిషయములు కూడ నప్పుడప్పుడు చర్చింపఁబడినవి. ఆఙ్గ్లేయశాస్త్రపారిభాషికశబ్దములకు సరియైన తెలుఁగుపదములు కొంతవఱకుఁ బ్రకటింపఁబడినవి.

— శాసనములు. —

ప్రాచీనతామ్ర శిలాశాసనములు ముప్పదియేనిమిది విమర్శనపూర్వకముగాఁ బ్రకటింపఁబడినవి. ఎక్కడనో రెండుమూఁడు శాసనములకుఁ దప్పఁ దక్కినవాని కన్నిఁటికి శాసనప్రతిబింబములు ప్రకటింపఁబడినవి. వీనిలోఁ గొన్నింటిని జేర్కొనియెద:-

రాజరాజునాఁటి నందంపూఁడి శాసనము తామ్రశాసనము పరిషత్పత్రికప్రథమసంపుటము ప్రథమసంచికయందే ప్రకటింపఁబడినది. చాళుక్యరాజరాజు "రెండేఱులనడిమి విషయమున" నున్న నందంపూండి గ్రామమును నారాయణుఁ డను కవికి నగ్రహారముగా నిచ్చిన ట్లీశాసనము నం దున్నది. శాసనముచివర "కావ్యానాం కర్తా నన్నియభట్టః" అని యున్నది-ఈనన్నియభట్టె ప్రథమాంధ్రకావ్యమైన భారతప్రథమభాగమును రచించిన నన్నయభట్టారకుఁడు. అతనికి భారతాంధ్రీకరణమునందుఁ దోడ్పడిన నారాయణభట్టె నారాయణకవి. నన్నయభట్టారకకృత భారతమునకుఁ గృతిభర్తయైన రాజరాజనరేంద్రుఁడే రాజరాజు. ఆంధ్రవాఙ్మయ కల్పభూజమునకు మూలభూతు లగు నీత్రిమూర్తులకును సంబంధించిన శాసనము నాంధ్రసాహిత్యపరిషత్పత్రిక ప్రథమసంపుటము మొదటిసంచికలోఁ బ్రచురించుట మిక్కిలి యుచితమని గుణజ్ఞు లెంచకమానరు. ఇంతియకాక యీశాసనమం దింకొక విశేషముగూడఁ గలదు. శాసనలిపి మూఁడవపత్రము రెండవపుటవఱకు నొకరీతిగను, అచ్చటనుండి చివరవఱకు వేఱురీతిగను నున్నది. పూర్వభాగములో రాజరాజు తాత యైన శక్తివర్మవఱకును రాజ్యముచేసిన రాజులవృత్తాంతము వివరింపఁ బడినది. అంతవఱకుఁ బూర్వమెప్పుడో చెక్కియుంచినట్లును, ఉత్తరభాగము భూదానసమయమందుఁ జెక్కఁబడినట్లును దోఁచుచున్నది. ఈశాసనకాలమునకుఁ బిదపఁ బుట్టినశాసనము లన్నియు నీరీతిలిపిలోనే యున్న

వి. కాఁబట్టి యాంధ్రలిపిలో నీకాలమందు మార్పు కలిగిన దనియు నీమార్పున కీనందంపూఁడి శాసనమే ప్రథమోదాహరణ మనియుఁ దోఁచుచున్నది.

మూఁడవసంపుటములో నాంధ్రభాషాపోషకులలో రెండవరాజరా జన నొప్పు కృష్ణదేవరాయలు, నాయన దేవులు చిన్నాదేవి, తిరుమలదేవులును శ్రీతిరుపతివేంకటేశ్వరస్వామికి ౧౪౩౬ వ శాలివాహనసంవత్సరమం దాభరణము లర్పించినట్లున్న మూఁడుశాసనములు ప్రకటింపఁబడి యున్నవి. ఆసంపుటము లోనే స్వామి యాలయము బహిర్ద్వార సమీపమునందు స్థాపింపఁబడి యున్న కృష్ణదేవరాయలయొక్కయు నాయనదేవుల యొక్కయు లోహవిగ్రహముల ప్రతిబింబములు ప్రకటింపఁబడినవి. చిన్నాదేవి యగ్రమహిషి యనియుఁ దిరుమల దేవి ద్వితీయమహిషియనియు నిరూపింపఁబడినది.

తొమ్మిదవ సంపుటములో, ఆనెగొంది జాగీర్దారులగు శ్రీరంగదేవరాయుల వారి యొద్దనున్న మహారాష్ట్రశాసన మొక్కటి ప్రకటింపఁబడినది. ఇది వెండిరేకుమీఁదఁ జెక్కఁబడి యున్నది. కడపటి కర్ణాట ప్రభువగు శ్రీరంగదేవరాయలు తనరాజ్య మన్యాక్రాంత మయినందునఁ బరస్థలమునకుఁ బోయి యచట మృతి నొందినందున వారిదేవి యగు తిమ్మాజి యమ్మగారు తమకొమాళ్లు తిరుమలరాయలు రామరాయలు నను నిద్దఱను వేంకటకృష్ణప్పయను వకీలును సహాయమిచ్చి శ్రీశివాజీప్రభువునొద్దకుఁ బంపఁగా నాయన వారి దుఃస్థితికి వగచి ౧౫౭౮ శాలివాహనసంవత్సరమందు వారిజీవితార్థమై యానెగొందికి సమీపమునందలి గ్రామములుకొన్ని జాగీరుగా నిచ్చిన ట్లీశాసనము చెప్పుచున్నది. కొన్ని కారణములను బట్టి యీశాసనము ప్రమాణముగా గ్రహింపఁదగినది కాదేమో యని కొందఱూహించుచున్నారు. పునహాపట్టణమందున్న ఇతిహాసపరిశోధకమండలివారీవిషయము పరిశీలించుచున్నట్లున్నది.

పదునాలుగవసంపుటములోఁ బ్రకటింపఁబడిన పెద్దచెఱుకూరు శాసనము నన్నెచోడ కవికాలనిర్ణయమునకును బదునేడవసంపుటములోఁ బ్రకటింపఁబడిన నరసారావుపేటశాసనము తిక్కనసోమయాజి కాలనిర్ణయమునకు నుపకరించును.

పదునెనిమిదవ సంపుటమునందుఁ బ్రకటింపఁబడిన మల్కాపురశాసనము చాలముఖ్యమయినది. దీనిమూలమునఁ గాకతీయ రుద్రమదేవి గణపతిదేవుని భార్య కాదు, కూఁతురేయని నిశ్చయముగఁ దేలుచున్నది. ఆకాలమం దాచరణము లోనున్న గ్రామనిర్మాణపద్ధతి యిందువలనఁ దెలియుచున్నది. వర్ణభేదము లేకుం



కీ. శే. పానగల్లురాజా
దివాన్‌బహాదరు
పానుగంటి రామారాయనింగారు, ఎం. ఏ.



లక్కవరసంస్థానాధిపతులు
శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు
బహద్దరుగారు.

డి నందఱకు నన్నముపెట్టు సత్రములును బ్రసూతికాగృహములు (Maternity Hospitals) నాకాలమునం దున్నట్లు దీనివలనఁ దెలియుచున్నది. గోళకీశైవమతచరిత్ర మిందు వివరింపఁబడినది.

ఇరువదినాలుగవ సంపుటములోఁ బ్రకటింపఁబడిన ప్రాచీనశాసనచతుష్టమువలన నన్నయభట్టారకుని కాలముకంటెను బూర్వమున్న యాంధ్రభాషాస్వరూపము కొంత నిరూపింపనగును.

శాసనములు మాత్రమేకాక యైతిహాసికాంశములను దెలుపు కొన్నిగ్రంథములుకూడఁ బ్రకటింపఁబడినవి. వీనిలో రాయవాచకము, తొండమానా వంశావళి, ప్రతాపచరిత్రము ముఖ్యములు. రాయవాచక మనునది కృష్ణదేవరాయల రాజ్యపద్ధతిని, ఆయన జైత్రయాత్రలను వివరించుచున్నది. ఈగ్రంథ మిటీవల విపుల మగుపీఠికతోఁ బ్రత్యేకము పుస్తకముగాఁ బ్రకటింపఁబడినది. తొండమానా వంశావళి పుదుకోట రాజుల వృత్తాంతము తెలుపును. అదికూడఁ బుస్తకరూపమునఁ బ్రకటింపవలసి యున్నది.

బమ్మెరపోతరాజు వరంగల్ ప్రాంతమువాఁడా లేక యొంటిమిట్టప్రాంతమువాఁడా, కాకతీయరాజులు క్షత్రియులా కారా, నన్నెచోడకవి నన్నయభట్టునకుఁ బూర్వుఁడా తరువాతివాఁడా, అరవములో ழ కారమును హళకన్నడములోని ఱ కారమునుబోలిన వర్ణవిశేషము పూర్వ మాంధ్రమునం దుండెనా లేదా యనువిషయములను గుఱించియుఁ గొన్ని బాలవ్యాకరణసూత్రముల సమన్వయమును గూర్చియు విపులమయిన చర్చలు జరగినవి. అవి పత్రికయం దచ్చటచ్చటఁ జూడనగును.

## — గ్రంథప్రకటనము. —

అంతకుఁ బూర్వ మముద్రితములుగా నుండిన పెక్కుగ్రంథములు పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినవి. ఈగ్రంథముల పట్టిక ౧౨ వ యనుబంధమునఁ జూడనగును. ఇవి యన్నియుఁ బరిషత్పుస్తకభాండాగారమునం దున్నవియే. పెక్కుగ్రంథములు తొలుతఁ బరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడి పిదప విడిగాఁ బుస్తకరూపముగాఁ గూడఁ బ్రకటింపఁబడినవి. వీనిలో ముఖ్యమైనవి కొన్ని యీదిగువఁ బేర్కొనఁబడును-

**1.** విప్రనారాయణచరిత్రము- ఇది యెఱ్ఱాప్రెగడ చిన్నిమనుమఁడు చదలువాడ మల్లయ్యకవి రచించినది. దీనినెవ్వరు నెఱుఁగరు. సారంగు తమ్మయ్యవైజయంతీవిలాసమునకుఁ బూర్వపుది. వివిధమండలములనుండి పరిషత్తునకై పుస్త

కసంపాదనమున కేఁగిన పలువురు వారువారిచ్చిన తాళపత్రగ్రంథములతో పాటు కొన్ని విడిపోయాకుల కట్టలను బాగుచేయలేకపంపియుండిరి. వానిలోనుండి యవకాశ మున్నపుడు కార్యస్థానోద్యోగులు పరిశీలించి కొన్ని కొన్ని గ్రంథములలో దొరకినన్ని భాగములు తీసి కట్టుచుందురు. అట్టి విడిచెత్తలోనుండి క్రొత్తపల్లి సూర్యరావుగారేతి కనిపెట్టిన దీగ్రంథము. ఇది ప్రకటింపఁబడినపిమ్మట, చదలువాడవారి సంగతి బైటఁబడినది.

2. కవిజనాశ్రయము—ఇది వేములవాడ భీమకవి రచిత మని ప్రసిద్ధిగల యీప్రాచీనచ్ఛందోగ్రంథము. ఇంతకుఁబూర్వము ప్రకటింపఁబడియుండ లేదు.

3. శివతత్త్వసారము—మల్లికార్జునపండితారాధ్యకృత మగు నీగ్రంథము మిగులఁ బ్రాచీన మైనయది. కందపద్యమయము. భాషాప్రయోగవిశేషములు కొన్ని గలవు.

4. శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాథుని కవిత్వమువలెఁ గథయు మనోహరముగా నుండును. దీనినిఁ గూడ నెవ్వరుఁ నెఱుఁగరు. నైజామురాజ్యములో దొరకినది.

5. కాళిందీకన్యాపరిణయము—ఇది యహోబలపండితీయకర్తయగు నహోబలునిచే రచియింపఁబడిన ప్రౌఢప్రబంధము. అహోబలుని మొదటిపేరు నరసరాజనియు వారియింటిపేరు గాలివా రనియుఁ దెలియవచ్చినది.

6. మన్నారుదాసవిలాసనాటకము—ఇది తంజావూరి యాంధ్రనాయక రాజులలోఁ గడపటివాఁ డయిన విజయరాఘవనాయకుఁడు నాయకుఁడుగా రంగాజమ్మ యను నతని యాస్థానకవయిత్రి రచియించిన యక్షగాన నాటకము. యక్షగాననాటకము లనేకము లీకాలమందు, తంజావూరిలోఁ బుట్టినవి. మచ్చునకై యీనాటకము ప్రకటింపఁబడినది.

7. జైమినిభారతము—ఇది మధుర నాయకరాజాస్థానమం దుండినసముఖము వేంకటకృష్ణప్పనాయకునిచే రచియింపఁబడిన మిక్కిలి హృద్య మగు వచన కావ్యము.

8. కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దన కృత మగు కావ్యాలంకారచూడామణి యొకటి చిరకాలముక్రిందటఁ బ్రకటింపఁబడినది. దానిలోఁ జేరని చివరి 8-9 యాశ్వాసములు నీగ్రంథమం దున్నవి. ఈరెండాశ్వాసములును ఛందస్సును వ్యాకరణమును దెలుపును.

9. శాసనపద్యమంజరి—ప్రాచీనశిలాశాసనములం దున్న తెలుఁగుపద్యము లున్నవి యున్నట్లు సవ్యాఖ్యానముగ నిందుఁ బ్రకటింపఁబడినయవి. దీనిలో 88 శాసనములలో నిమిడియున్న 287 పద్యములుగలవు. ఇటీవల దొరకినవి మఱికొన్నిగలవు. ఆపద్యములు కూడఁ బుస్తకరూపమునఁ బ్రకటింపఁబడును. ఈపద్యములు భాషాచరిత్ర పరిశీలనమునకు నెంతయు నుపయోగించును.

10. ఆంధ్రశబ్దచింతామణి—బాలసరస్వతి రచియించిన టీకతోఁ గూడఁ బ్రకటింపఁబడినది. ఈబాలసరస్వతియే యీగ్రంథమును మొదట బైటఁబెట్టెను.

కొఱవి గోపరాజకృత సింహాసనద్వాత్రింశికయు, రామరాజు రంగప్పరాజకృతము సాంబోపాఖ్యానమును నిక్కిలి ప్రౌఢములు రమణీయములును నగుకృతులు.

— పుస్తకభాండాగారము. —

పరిషదుద్దిష్టకార్యములలోఁ బుస్తకభాండాగారము స్థాపించుట యొక్కటి. ఈపని చాలవఱకు జరిగినది. ముద్రితగ్రంథములే కాక తాళపత్రపుస్తకములు కూడఁ బెక్కులుగల భాండాగారమున్నది. విద్యాభిలాషులు ప్రతిదినమును వచ్చి తమకుఁ గావలసిన గ్రంథములను జూచి పోవుచున్నారు. విద్యార్థుల యుపయోగార్థ మాంధ్రదేశమం దచ్చటచ్చటఁ బ్రకటింపఁబడుచున్నవియుఁ గొన్ని యఱవము, కన్నడము, సంస్కృతము, నాంగ్లేయమును నగు పత్రికలుగూడ సంపాదింపు చున్నారము. తిరువాన్కూరు బరోడాసంస్థానములవారు ప్రచురించుచున్న సంస్కృత గ్రంథములను మైసూరుసంస్థానమువారు ప్రకటించుచున్న సంస్కృతకర్ణాటగ్రంథములను బరిషద్భాండాగారమున కిచ్చుచున్నారు. మన దొరతనమువారే కేటటఁ బ్రకటించుచున్న ప్రాచీనశాసనసంపాదకుల వత్సరకార్యనివేదనములును, అప్పుడప్పుడు ప్రకటింపఁబడుచుండు దక్షిణహిందూదేశశాసనములు (South Indian Inscriptions) సంపుటములు నొసంగుచున్నారు. అప్పుడప్పుడిదివఱలోఁ బ్రకటింపఁబడిన గ్రంథములలోఁ గొన్నికొన్ని పాఠములు సరిగా లేవని పండితుల యాశయము. భారతమునందుఁ గూడ నిట్టి పొరపాటులున్న వని కొందఱ యభిప్రాయము. కావున ముద్రితగ్రంథములకుఁ గూడఁ బ్రాచీనలిఖితప్రతులను సంపాదించుట కర్తవ్య మని యెంచి పరిషత్తువా రట్టిప్రతు లనేకములు సంపాదించినారు. తాళపత్రగ్రంథము లనేకము లాంధ్రదేశమందే గాక ద్రావిడాది దేశములందుఁ గూడ దొరకినవి. కర్ణాటరాజుల యేలుబడికి లోబడి కొందఱాంధ్రరాజులు ద్రవిడదేశమును బాలించిరి. వీరికిఁ దంజావూరు, మధుర రాజధాను

లుగా నుండెడివి. వారు రాజ్యము చేసినకాలమందుఁ దెలుఁగుభాషయు వాఙ్మయ మును ద్రావిడదేశమం దత్యున్నతదశయం దుండినవి. వారి యాస్థానములయందు కవు లనేకులు చేరి గ్రంథముల రచియించిరి. రఘునాథనాయకుఁడు, విజయరంగ చొక్కనాయఁడు మొదలగు కొందఱు రాజులు గూడఁ గవులుగా నుండిరి. తంజా వూరు సంస్థానమందుఁ బెక్కండ్రు స్త్రీలుగూడఁ గవిత్వముఁ జెప్పువా రుండిరి. ఇతరగ్రంథము లటుండఁ దంజావూరిలో శతాధికముగా యక్షగాననాటకము లును మధురలోఁ బెక్కు గద్యగ్రంథములునుఁ బుట్టినవి. ఇట్టి వాఙ్మయము దక్షిణ దేశములో నున్న దని పూర్వము పలువురకుఁ దెలియనే తెలియదు. పుణ్యవశ మునఁ బరిషత్తున కీగ్రంథములు దొరకినవి. వీనిని సంపాదించుటలో మిగులశ్రద్ధ వహించి శ్రమపడినవారు పుదుకోటనివాసులు నాంధ్రభాషాభిమానులు నగు హరి సేతురామయ్యగా రను నాంధ్రుఁడు. ఈవిషయములో దివాన్‌బహద్దరు వి. రామభద్రనాయఁడుగారు కూడ సహాయ మొనర్చిరి. ఈగ్రంథము లన్నిటిని బరిషత్తువారు ధనమిచ్చి కొనలేదు. తత్తత్స్వాము లాపుస్తకము లన్నిటిని బ్రతిఫల రహితముగానె యిచ్చినారు. ఈరీతిని దక్షిణదేశములో సంపాదించిన పుస్తకముల సంఖ్య. ౪౫౦. ఈరీతినే హైదరాబాదు దేశమందును గొన్నిపుస్తకములు సంపా దింపఁ బడినవి. వీనిని సంపాదించినవారు శేషాద్రిరమణకవులు. మొత్తముమీఁద నిప్పుడు పరిషద్భాండాగారమునందున్న లిఖితపుస్తకములసంఖ్య ౪౫౮౫. వీనిలో భారతప్రతులు ౩౭౧ గలవు. లిఖితపుస్తకసంపాదనమింకను జేయవలసియున్నది.

## — నిఘంటువు. —

నిఘంటునిర్మాణము పరిషదుద్దిష్టకార్యములలో మొట్టమొదటిది. ఈపని యారంభమై యజాదిపదములు గల ప్రథమసంపుట మీనడుమఁ బ్రకటింపఁబడి నది. రెండవసంపుటము ముద్రించుటకుఁ గావలసిన యేర్పాటులు జరుగుచున్నవి. ఈవిషయములో మొదటినుండి నేటివఱకు జరిగినపని యంతయు ౧౩ వ యను బంధములో వివరింపఁబడినది.

## — శాస్త్రపారిభాషికపదప్రకటనము. —

ఆధునికశాస్త్రగ్రంథములం దుపయోగింపఁ దగు పారిభాషికపదముల పట్టిక సిద్ధముచేయుట పరిషత్కార్యములలో నొకటి. అట్టిపదములు కొన్ని యప్పు డప్పుడు పత్రికలలోఁ బ్రకటింపఁబడినవి. కాని సమగ్రమైనకోశము నిర్మింపవలసి యే యున్నది. ఇది పలువుర విద్వాంసుల సహాయముచేతఁ గావలసినపని. ధన

సాహాయ్యముకూడఁ గావలయును. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారీకార్యము చేయు
ట కిప్పుడుపూనుకొన్నారు.

— భారతప్రయోగానుక్రమణిక. —

వాఙ్మయములోని యుద్గ్రంథములయం దేయే పద మేయే పద్యములోఁ బ్రయోగింపఁబడినదో తెలుపునట్టి యనుక్రమణిక గ్రంథము లాంగ్లేయభాష యందుఁ గలవు. ఆంధ్రమహాభారతమునకుఁగూడ నిట్టి యనుక్రమణిక సమకూర్చుట యుక్త మని యాలోచించి పుస్తకములోని పదముల నన్నింటిని వేఱువేఱు కాగితపు ముక్కలమీఁద వ్రాయించినారము. అవి యన్నింటిని శోధించి యక్షర క్రమముగా సమకూర్చి యచ్చువేయింపవలసి యున్నది. భారతములో నున్న పదముల నన్నింటి నెత్తి వ్రాయించితిమి గాని తత్సమేతరపదములకు మాత్రమే యిట్టి యనుక్రమణిక చాలు నని నాయభిప్రాయము.

— పాఠభేదసహితగ్రంథప్రకటనము. —

పెక్కుగ్రంథములలోఁ బెక్కుతావులందుఁ బాఠభేదము లగపడుచున్నవి. గ్రంథ మెంతప్రాచీన మైన నన్నిపాఠములు కానవచ్చుచున్నవి. వీనిలో ననేకములు లేఖకులచేఁ గల్పింపఁబడినవి. లేఖకులలో సంస్కారహీనులు మాతృకల లోని శబ్దములను సరిగాఁ బోల్పఁజాలక తమకుఁ దోఁచినట్లు వ్రాయుటచేఁ గలిగినపాఠములు కొన్ని, లేఖకులు సంస్కారు లైనపుడు మాతృకలోని పాఠములు తప్పు లని తమపాండిత్యబలముచేఁ గల్పించినపాఠములు కొన్ని. ఇట్లనేకపాఠము లేర్పడినవి. గ్రంథములం బ్రకటించువారు తమకు లభించినపాఠములలో నేదో యొకటి సరియైన పాఠముగా గ్రహించి ప్రకటించుట యాచారమై యున్నది. కొంద ఱచ్చటచ్చట వే ఱొకటి రెండుపాఠములను గూడఁ బుట యడుగునఁ జూపుట కలదు. ఉద్గ్రంథములకుఁ గల పాఠభేదముల నన్నిటిని వెదకి ప్రోగుచేసి వానిలోఁ గేవలము తప్పులనఁ దగిన వానిని విసర్జించి మిగిలినవానిలో నుత్తమ మయిన దని తమకుఁ దోఁచిన దానిని గవిపాఠముగాఁ గ్రహించి శేషించిన వానిని బుటల యడుగునఁ జూపుచు గ్రంథములఁ బ్రకటించు పద్ధతి యాంగ్లేయభాషలోఁ గలదు. ఆపద్ధతి ననుసరించి సంస్కృతభారతమును బాఠభేదసహితముగా, పూనా నగరమునందు (Bhandarkar Institute) బండార్కరు ఇన్స్టిట్యూటు వారు ప్రకటించుచున్నారు. ఆప్రకారముగా నాంధ్రభారత మచ్చు వేయించుట మంచి దని ముందుగా మచ్చునకై యుద్యోగపర్వ మచ్చువేయింపఁ

దలఁచి ముప్పదిప్రతులు సంప్రతించి మొదటి మూఁడాశ్వాసములకును పాఠభేదములెత్తి వ్రాయఁబడినవి. నాల్గవయాశ్వాసము గూడఁ బూర్తిచేసి యీసర్వము ప్రకటింపవలసి యున్నది. సరియైనపాఠముల నిర్ణయించుట కడు దుష్కరము. కొందఱ కొక పాఠము నచ్చిన మఱికొందఱకు మఱియొక పాఠము నచ్చును. అయినను పాఠము లన్ని ఖిలము కాకుండఁ గాపాడుట మంచిది. ఇప్పుడిప్పుడు బయలుపడుచున్న ప్రాచీనశాసనములు కొంతవఱకుఁ బాఠనిర్ణయము చేయుట కుపకరింపవచ్చును. మిక్కిలి ప్రాచీనము లయిన గ్రంథములలోఁ గాలక్రమమునఁ గొన్నికొన్ని స్థలములందుఁ బాఠభేదములు కలుగుట యెల్లభాషలయందును గానవచ్చుచున్నది. తెలుఁగుభారతమున కీధర్మమే పట్టినది. తాళపత్రగ్రంథములు కొన్నిటిలో నొకపాఠమును మఱికొన్నిటిలో మఱియొకపాఠమును నిట్లు బహుపాఠములు బహుస్థలములందుఁ గానవచ్చుచున్నవి. అచ్చువేయువారు కొందఱొక పాఠమును మఱికొందఱు మఱియొకపాఠమును స్వీకరించి ప్రకటించుచున్నారు. ఏదో యొకపాఠము మూలపాఠముగా గ్రహించి తక్కినపాఠము లన్నియుఁ బుటల యడుగునఁ జూపవచ్చును.

దేశేతిహాసమును బ్రకటింపవలసి యున్నది.

— విజ్ఞానసర్వస్వసంగ్రహము. —

కీ. శే. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు విజ్ఞానసర్వస్వ మనుపేర నొకగ్రంథరాజమును నిర్మించుటకు సంకల్పించి స్వల్పభాగము మాత్రము రచించి చనిపోయినారు. ఆపని యంతటితో నిలిచిపోయినది. అది క్రమముగాఁ దుదముట్టింపవలయునన్న బహుధనమును జిరకాలమును బట్టును. అది యట్టులుండ జనసామాన్యమున కుపకరించునట్లు సకలవిద్యాసముద్దేశసంగ్రహరూపముగా నొకగ్రంథమును రచింపించుటకుఁ బరిషత్కార్యనిర్వాహకు లుద్యమించుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. మనహైందవవిద్యల యొక్కయుఁ బాశ్చాత్య విద్యలయొక్కయు ముఖ్యాంశములు సామాన్యజనుల కన్వయించునట్టు లయిదాఱువందలు పుటలలో నిముడునట్లు సమకూర్చి ప్రకటింపవలయును.

— వ్యాకరణము. —

పరిషదుద్దిష్టకార్యములలో సమగ్రమైనయాంధ్రభాషావ్యాకరణ మొకటి. ఇది యింకను గావలసి యున్నది. ఇప్పు డున్నవ్యాకరణములను సత్కవికృత గ్రంథములను జక్కగాఁ బరిశీలించి సమగ్రమైనవ్యాకరణ మొక్కటి రచియింపవలసి

యున్నది. మదరాసు విశ్వకళాపరిషత్తువారును, నాంధ్రవిశ్వకళాపరిషత్తువారును, నియమించిన కొందఱుపండితు లీకార్యము నేకదేశముగా నొనర్చుచున్నారు, గాని, పరిషన్మతానుసారముగాఁ బరిషత్తువారు నియమించిన పండితులచే నీకార్యముచే యింపవలసియున్నది. దీనితోపాటాంధ్రభాషాచరిత్రమును, ఆంధ్రవాఙ్మయచరిత్ర మును గూడ రచింపవలసి యున్నది.

ఆంధ్రదేశపూర్వచరిత్రకు సంబంధించినవిషయములు పెక్కులిప్పుడు బయ లుదేఱుచున్నవి. ఇవి యన్నియుఁ బరిశోధించి యాయాభాగములయందాఱితే ఱిన వారిచే వ్యాసములు రచియింపింపవలయును.

— ఆధునికాంధ్రకవిజీవితము. —

పరవస్తు చిన్నయ సూరిగారు మొదలుగా నిటీవల బయలుదేఱిన యాంధ్రగ్రంథకర్తల జీవితములను సంగ్రహరూపముగాఁ బ్రకటింపవలయును. ఆయాక వుల జీవితములలో ముఖ్యాంశములను వారు రచించిన గ్రంథముల గుణదోషము లను సంగ్రహముగాఁజూపవలయును. ఈగ్రంథము సాధ్యమైనంతవఱకు దుర్వా దముల కాస్పదము గాకుండున ట్లుండవలయును.

—శేషసంహారము.—

పరిషత్తింకను నిర్వహింపవలసియున్న కార్యములు నాకుఁ దోఁచినమట్టుకు వివరించినాఁడను. మఱి కొన్ని యితరవిషయము లితరులకు స్ఫురింపవచ్చును. ఇవి కాలక్రమమున నిర్వర్తింపవలసి యున్నది. ఇవి యన్నియు ధనసాధ్యములు. ఈపరిషత్తును స్థాపించి నేఁటివఱకు నిరువదియైదు సంవత్సరము లెట్లో నిలఁబెట్టు కొని వచ్చినారము. ఇంతకాలము నిలిచి యింతపని చేసిన విద్యాసంస్థ యాంధ్ర దేశమున నిది యొక్కటియే యని తలంచెదను. ఏతత్పరిషత్ప్రాసాదమునకు రావు సర్వజ్ఞసింగమహీపాలుని వంశస్థులగు శ్రీపీఠికాపుర వేంకటగిరి బొబ్బిలి సంస్థానా ధీశ్వరులు స్తంభములవంటివారు. వారిలో శ్రీ పీఠికాపురపు మహారాజావారు మూలస్తంభాయమానులు. వీరు పరిషత్ప్రతిష్ఠాపకు లీయవలసిన చందాయును, నిఘంటువునకుఁ గావలసిన ధనము నిచ్చుటయే గాక పరిషత్కార్యస్థానమున కద్దె లేకుండ నొక యిల్లుకూడ నిచ్చినారు. ఇతరసంస్థానాధిపతులు మఱికొందఱు కూడ ధన మిచ్చిరి. వారెల్లరుఁ బరిషత్తునకు వంద్యులు. వీరలెల్లరు నిచ్చిన ధ నసహాయమున నేఁటివఱకు జరిగినకార్యములను జేయఁ గలిగితిమి. ఇప్పుడు పరి షత్తుమూలధనము- ఇరువదివేలరూపాయలు మాత్ర మున్నది. ఇది చాలదు.

అధమ మేఁబదివేలరూప్యములైన నుండవలయును. పరిషత్కార్యస్థానమునకు విశాలమైన భవన మొకటి యుండవలయును. ఇవి సంపాదించుటలో భాషాభిమానులగు ధనికుల సాహాయ్యము మాత్రమే గాక జనసామాన్యము సాహాయ్యము కూడఁ గావలసి యున్నది. "నిరాశ్రయా నశోభన్తే కవితా వనితా లతాః" అని మనసంప్రదాయము. పాశ్చాత్యదేశములలోఁ గూడఁ బూర్వ మీసంప్రదాయమే యుండెడిది. కాని కవితా వనితలవిషయమై యీనాఁ డా యిప్పుడు మాఱుచున్నది. ప్రాచీనాంగ్లకవులు ధనికుల నాశ్రయించి జీవించెడువారు. కాని యిటీవల వారు తాము రచించిన గ్రంథముల నమ్ముటచేతనే వారు జీవయాత్ర గడపుటయే గాక ధనికులు గూడ నగుచున్నారు. దీనికిఁ గారణము జనులలో గ్రంథపఠనాభ్యాసము హెచ్చుటయే. ఇట్టి యభ్యాసము మనదేశములో నింకను బయలు దేఱలేదు. ఎప్పటికి బయలుదేఱునో తెలియదు. అంతవఱకు విద్యాసంస్థలు వృద్ధిపొందవలయునన్న ధనికులగు విద్యాభిమానుల యాదర మావశ్యకము. ఇంతవఱ కీపరిషత్తును బోషించుకొని వచ్చిన వారిలోఁ గొందఱు గతించినారు. కొందఱు వృద్ధు లయినారు. మఱికొందఱు వృద్ధులు కానై యున్నారు. యువకులును భాషాభిమానులును శిష్టాచారసంపన్నులు నగువారు పెద్దలకుఁ దోడ్పడుటకు సమయము వచ్చినది. ఈ కాకినాడ పురములో భాషాభిమానులును ధనికులు నగువారు పలువు రున్నారు. వారు పరిషత్కార్యాలయ నిర్మాణమునకుఁ బూనుకొనుట యుక్తము. అట్లు చేయుదురుగాక.

ఆంధ్రు లనేకులు నైజాము రాష్ట్రమం దున్నారు. ఆదేశమందు వార్షికసభలు కావించుటకుఁ బ్రయత్నములు జరిగినవి; కాని కొనసాఁగలేదు. అచ్చటి యాంధ్రసోదరులతో సమావేశమై వారి యాదరమును సంపాదింపవలసియున్నది. ఆచిరకాలమునందే యీపని నెఱవేఱుఁగాక.

పరిషత్తు ప్రకటించిన గ్రంథములలో మేలుగ్రంథము లనిపించుకొనఁదగినవి యనేకములు గలవు. వీనిలో నొక్కటొక్కటి యైన నప్పు డప్పు డాంధ్ర, చెన్నపురి, మహిసూరు, ఉస్మానియా విశ్వకళాపరిషత్తుల యధికారులు పఠనీయ గ్రంథములుగా నియమించినచో నందువలనఁ బరిషత్తునకుఁ గొంత ధనముదొరకఁగలదు.

పరిషత్కార్యదర్శివర్గములో గుమ్ముడూరి వేంకటరంగారావుగారు కడు స్మరణీయులు. పరిషద్వృద్ధికి వీరు మిగులఁ బాటు పడిరి. వీరు కీ. శే. శ్రీ బొబ్బిలిమహా



కీ. శే సర్. మోచర్ల రామచంద్రరావు
పంతులుగారు, బి. ఏ., బి. ఎల్.



సర్. వేపా రామేశముపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

రాజావారి కాప్తులు. శ్రీవారు పరిషత్ప్రతిష్ఠాపకవర్గములోఁ జేరుటలో వీరియత్నము కూడఁ గల దని నానమ్మకము.

పరిషత్కార్యస్థానమునందు, కార్యనిర్వాహకుఁడుగా (Manager) నున్న కొత్తపల్లి సూర్యరావుగారు పరిషత్తున కొనర్చిన సేవ యనల్పము. ఈయన యీపనిలోఁ బ్రవేశించి ౨౩ సంవత్సరము లయినది. అంతకుఁ బూర్వము పోల వరము జమీందారుగారి యొద్దనుండి సరస్వతి యను మాసపత్రికాప్రకటనము నిర్వహించుచుండెడివారు. వీరికి సంస్కృతమునందును దెనుఁగునందును మంచి ప్రవేశముండుటయే గాక తెలుఁగులోఁ గవిత్వము చెప్పనేర్పుకూడఁ గలదు. ఆంగ్ల ద్రవిడభాషలయందుఁ గూడఁ బ్రవేశము కలదు. వీరు పరిషత్కార్యము లన్నియు స్వకార్యములుగా భావించి యవ్యాజమైన శ్రద్ధతోఁ బనిచేయుచున్నారు. ముఖ్య ముగా గ్రంథప్రకటనము పత్రికాప్రకటనము వీనియం దీయన చేయుచున్న పని కడుశ్లాఘ్యము. పరిషత్పుస్తకభాండాగారము నందలి ప్రాచీనలిఖిత గ్రంథములకు సవిమర్శములయిన సూచికలు వ్రాసినారు.

పలువురు పండితులు పరిషత్పత్రికకు వార్షికసభలకు ధన మపేక్షింపకయే వ్యాసముల రచించి పంపినారు. వారందఱుఁ గడువంద్యులు.

# అనుబంధములు.

(అ 1911 సం॥ ఏప్రిల్ ది 12 తేది. విరోధికృత్తు—ఉగాదిసంచిక.)

అనుబంధము ౧.

## ఆంధ్ర భాషామహాసంఘము

బ్రహ్మశ్రీ జయంతి రామయ్యగారిచే వ్రాయఁబడినది.

ఆంధ్రభాష భరతఖండమందలి ముఖ్యములగు దేశభాషలలో నొకటి. ఇది రెండుకోట్లకంటె నెక్కువసంఖ్య గలజనులచే వాడఁబడుచున్నది. జనసంఖ్యను బట్టి యిది భరతఖండమునందు మూఁడవభాషగను దక్షిణ దేశమునందు మొదటిదిగను నున్నది. ఈభాష చెన్నపట్టణరాజ్యమునందు మాత్రమేగాక, హైదరాబాదు, మహీసూరు, మహారాష్ట్రములు మొదలగు దేశములందుఁ గూడ వ్యాపించి యున్నది. కవిరాజశిరోమణి యగు కృష్ణదేవరాయలు "దేశభాషలందుఁ దెలుఁగులెస్స" యని నుడివెను. ఈసిద్ధాంత మిటీవలివార లీదేశస్థులే కాక ఖండాంతరులు నయిత మంగీకరించి యున్నారు. సర్వజనమనోహర మగునీభాష పూర్వకాలమందు రాజావలంబనమువలనఁ బెఱిగి క్రమక్రముగాఁ నున్నతపదవి నందినది. కాని యింకను వృద్ధిఁజెందుట కవకాశము మిక్కిలి గలదు. భాషాభివృద్ధి నొనర్పఁదగినమార్గములలో ముఖ్యమగువాని నీక్రింద సూచించెదను.

మనభాషాగ్రంథము లించుమించుగా నన్నియు సంస్కృతగ్రంథానుసారముగా రచింపఁబడియున్నవి. ఈరీతిగ్రంథము లింకను బెక్కులు రచించుట కవకాశము గలదు. ఇంతియకాక సంస్కృతభాషలో లేని యనేక విద్యావిషయము లిప్పుడు మన కాంగ్లేయ భాషామూలమునఁ దెలియవచ్చుచున్నవి. ఇంగ్లీషుభాష పాశ్చాత్యవిద్యలకెల్ల దర్పణము వంటిది. తన్మూలమున గ్రహింపఁదగిన యావిద్యలన్నియు నాంధ్రులకెల్లరకుఁ దెలియునటులఁ దెలుఁగున గ్రంథములు రచించుట యవశ్యకర్తవ్యము. ఆవిద్యలలోఁ బ్రకృతిశాస్త్రములు, అర్థశాస్త్రము, నీతిశాస్త్రము మొదలగు నాధునికశాస్త్రములు దేశాభివృద్ధికి మిక్కిలియుపయుక్తములు. వాని నన్నిటిని క్రమక్రమముగా నాంధ్రభాషయందు రచింపవలసి యున్నది. ఒక్కశాస్త్రములే కాక వచనప్రబంధములు, వ్యాసములు, ప్రసిద్ధపురుష జీవితములు, విమర్శనములు మొదలగు గ్రంథములు కూడఁ బాశ్చాత్యపద్ధత్యనుసారముగ రచింపవలయును.

సమగ్రమును సప్రమాణము నగు నాంధ్రదేశచరిత్రము వ్రాయుట మిక్కిలి యగత్యము. అట్టిగ్రంథములు ప్రస్తుతము పూర్తిగా లేవు. కాని చరిత్రవ్రాయుటకుఁ గావలసిన సాధనములనేకములు గలవు. సర్వజ్ఞుఁ డగునీశ్వరుని సంకల్పమువలన మనపూర్వకవులు ప్రాయశః నిర్ధనులై తమతమ కాలములం దుండిన భూపతులను వారిమంత్రులు మొదలుగాఁ గల యితరధనవంతులను నాశ్రయించి వారిని తమకృతులకుఁ బతులఁగా నొనర్చుటయు నట్లు చేయునప్పు డాకృతిపతులను వారిపూర్వులను స్తుతించుటయు సమకూరినవి. ఈ స్తవములలో నతిశయోక్తుల క్రిందఁ గొంతభాగమును గొట్టివేసినను, చారిత్రోపయోగము లగు నంశములు పెక్కులు గలవు. కృతులయందు బహుశః కాలనిర్ణయము లేదు. కాలనిర్ణయము కలిగి యితరవిషయములలోఁ గృతులఁ బోలియున్నవి తామ్రశిలాశాసనములు. మఱియు నీశాసనములు తొలుత లిఖింపఁబడినవె కాని వానిప్రతులు కాకయుం డుటఁబట్టి పరమప్రమాణములుగా నంగీకరింపఁ దగియున్నవి. ఇట్టి శాసనములు వేలకొలఁది గలవు. శాసనములు, కృతులు, పురాణములు మొదలగు సాధనములను సావధానముగా నిష్పక్షపాతబుద్ధితో బరిశీలించిన యెడల దేశవృత్తాంతము చాలవఱకుఁ దేలును. తేలినప్పుడు ప్రస్తుతము పలువు రనుకొనునట్లు మన దేశము పూర్వకాలమం దంధకారబంధుర మగు ప్రాకృత స్థితిలో నుండినది కాదనియు నాయాకాలములం దసాధారణప్రజ్ఞావంతులును లోకహితైకపరాయణులు నగుమహాపురుషులుండి రనియు, నట్టిమహనీయులవంశములందుఁ బుట్టిన తమభాగ్యమనల్ప మనియుఁ బ్రతియాంధ్రుఁడును దోఁచుటయే కాక యుత్తరరామచరిత్రలోని యీక్రింది పద్యముయొక్క భావ మొంతమందుని డెందమున కయిన బోధ కలుగక మాన దని చెప్ప సాహసించెదను.

శ్రీరాముఁడు:—

చ. అలఘుతరార్క వంశకలశాబ్ధిశశాంకులు సర్వలోకపూ
జ్యులు నగుపార్థివుల్ తమవిశుద్ధచరిత్రముచేతఁ బ్రాడువె
న్నెలగతి లోక మెల్లెడల నింపిన తోరపుకీర్తి కియ్యెడన్
గలుష మొకింత నావలనఁ గల్గినచో నిఁక నన్నుఁ గాల్పనే.

తెలుఁగుభాషలో నిఘంటువు లనేకము లున్నను సమగ్ర మయినదియుఁ బరమప్రమాణముగా గ్రహింపఁదగినదియు నున్న దని చెప్పుటకు వీలులేదు. భాషలోనిశబ్దములన్నిటిని గనపఱచుచు వానియర్థభేదములను సాధ్యమయినంతవఱ

కు వ్యుత్పత్తులను దెలుఁగునకు సంబంధించిన యితరభాషలలోఁగల సమానశబ్దములను బ్రయోగములకుఁ బ్రమాణగ్రంథములనుండి యుదాహరణములను దెలుపునట్టి యొకనిఘంటువును రచించుట కర్తవ్యమై యున్నది. అటుపిమ్మట సంస్కృతమునందు శబ్దకల్పద్రుమాదిగ్రంథములవంటి యాంధ్రభాషాసర్వార్థసూచకమగు గ్రంథమొకటి రచింపవలయును.

తెనుఁగున లక్షణగ్రంథములు పెక్కులున్నను సవిమర్శకమగు భాషాజ్ఞానమును గలుగఁజేయు గ్రంథమొకటి క్రొత్తగా నిర్మింపవలసియున్నది. ఆంధ్రభాషాస్వరూపము చక్కఁగా నెఱుంగవలెనన్న నాభాషనుమాత్ర మభ్యసించుట గాక యాభాషకును, అరవము, కన్నడము, కోదుభాష మొదలగు సజాతీయభాషలకును గలసంబంధములఁ గూడ నెఱుంగవలయును. అట్లు లయినఁగాని శబ్దతత్త్వము తెలియఁబడదు.

పయిని జెప్పినప్రకారము నూతనగ్రంథములు రచించుటయె గాక భారతాది ప్రాచీనప్రమాణగ్రంథములను సలక్షణముగా నుత్తమరీతి నచ్చొత్తించుట ముఖ్యకార్యము. అనేకు లనేకగ్రంథముల ముద్రింపించి లోకోపకారము చేసియున్నారు. కాని యాయచ్చు లన్నియు నిర్దుష్టములని చెప్ప వలనుగాదు. భారతము పెక్కుసారులు ముద్రింపఁబడియున్నది. కాని ప్రతిదానియందు నేవో కొన్నిదోషము లారోపింపఁబడియున్నవి. ప్రకటనకర్తలు సాధారణముగా నొక్కటో రెండో వ్రాఁతప్రతులు సంపాదించుటయు, వాని పరిష్కరించుటకు నొకపండితు నేర్పఱచుటయు నాపండితునకు మంచి దని తోఁచిన పాఠము నవలంబించుటయు నింతవఱకు జరుగుచున్నది. ఇంతమాత్రము చేత సరియగు పాఠము లేర్పడవు. అప్పకవ్యాదిలాక్షణికులు తమతమ సిద్ధాంతానుకూలముగఁ బాఠముల నచ్చటచ్చట దిద్దియున్నారు. మఱియు వ్రాఁతప్రతులయందుఁ దప్పులు మెండుగాఁ గనఁబడుచున్నవి. కవిహృదయమును దెలిసికొనవలె నన్న వేఱు వేఱుప్రదేశములనుండి ప్రతులనేకములు సంపాదించి వాని నాయాప్రదేశములందు వాడఁబడుచున్న భాషావిశేషముల గుఱ్తెఱింగినయైదాఱుగురులాక్షణికులచే విమర్శనము చేయించవలయును. ఈవిమర్శకుల కుత్తమ మనితోఁచిన పాఠమును గ్రంథమునందంగీకరించి కేవలము తప్పులుగాని యితరపాఠముల విడిగాఁ జూపవలయును. ఇట్లు ముద్రించిన గ్రంథములే ప్రమాణములును విద్వజ్జనసమ్మతములు నగును. ఈప్రకారము మొదట భారతము ముద్రించి పిదపఁ గ్రమక్రమముగా నితరగ్రంథముల నచ్చొత్తింపవలెను.

ఈకార్యములలో సులభసాధ్యములగుకొన్ని భాషాభిమానులగుకొందఱు నెఱవేర్చుచున్నారు. కాని మఱికొన్ని బహుజన ధన సాధ్యము లగుటచే నట్టి వారి కలవిగావు. ఈఘనకార్యము లొనర్చుటకును బ్రత్యేకముగా నీవిషయమునై పాటుపడువారలకుఁ జేయూఁత యిచ్చి తోడ్పడుటకును, భాషావిషయకములగు సర్వప్రయత్నములకును దారిచూపుటకును ఆంధ్రభాషా మహాసంఘము నొక గొప్పసమాజ మేర్పఱచుట యావశ్యకము. సంఘమేర్పడిన పిదప దాని కుచితప్రదేశమునం దొక కార్యాలయమును గ్రంథభాండాగారమును కార్యకర్తలు నుండవలయును. మఱియు భాషావిషయములఁ గూలంకషముగాఁ జర్చించుట కొక పత్రిక యుండవలయును. అవసరమైనచో సామాజికు లేటేట నొకచోటఁ గూడి భాషావిషయముల గుఱించి ముచ్చటించుటకుఁదగినయేర్పాటు కావలసియుండును.

ఈప్రకారము సంఘకార్యము లన్నియు నిర్విఘ్నముగా జరుగుటకు దేశభాషాభిమానులు చేయఁగలిగిన విద్యాధనరూపక మగు సహాయ మంతయుఁ గావలసియుండును. ఆంధ్రభాషావధూటి చేసికొన్న పుణ్యముచే భాషాభిమానులును దేశాభిమానులును చెన్నపట్టణ రాజ్యమునందు మాత్రమే కాక హైదరాబాదు దేశమునందుఁగూడ పలువురు గలరు విద్వత్ప్రభులగు జమీందారు లనేకులు ప్రస్తుత మనేక విధముల భాషాపోషణ మొనర్చుచున్నారు. వారునుధనవంతులగు నితరులును సంఘనిర్మాణమునకు శ్రద్ధాపూర్వక మగు ప్రయత్న మొనర్పఁబడెనేని దానికిఁ దోడ్పడుదు రనుటకు సందేహము లేదు. వారు తోడ్పడినచోఁ గార్యము నెఱవేఱుననుటకును సందేహము లేదు. భాషాభిమాను లిది యంతయు సావధానమతులై పరిశీలించి యుద్యమము కొనసాగుటకుఁ దగినప్రయత్నములు తమతమ శక్తికొలఁదిఁ జేయఁ బ్రార్థించుచున్నాఁడను.

---

అనుబంధము ౨.

RAJAH OF PITHAPURAM.

Dunmore,
Teynampet,
Madras, 24-3-11.

Dear Sir,

The favour of your attendance is requested at an informal meeting of a few friends to be held at my residence at 2 P. M. on Sunday the 26th instant in order to discuss the ways and the means for the improvement of Telugu Literature on the basis of a comprehensive scheme formulated by M. R. Ry. J. Rammayya Pantulu garu B. A., B. L., Presidency Magistrate.

---

## అనుబంధము 3.

" ఆంధ్రభాషావాఙ్మయముల యభివృద్ధికొఱకై యీ క్రిందఁ బేర్కొనఁబడు వారు ప్రథమసభ్యులుగా "నాంధ్రభాషాసాహిత్యపరిషత్తు" అను పేరఁ గాని, మఱి వేఱొకపేరఁ గాని, యొకపరిషత్తును స్థాపింపవలసినట్లు తీర్మానింపఁబడెను.

ప్రథమసభ్యులు.

మహారాజశ్రీ శ్రీ వేంకటగిరిమహారాజుగారు. కే. సి. ఐ. ఇ.
,, బొబ్బిలిమహారాజుగారు కే. సి. ఐ. ఇ.
,, పిఠాపురమురాజుగారు.
,, చల్లపల్లికుమారరాజుగారు.
,, నడిమితిరువూరుజమీందారుగారు.
,, మునగాలజమీందారుగారు
,, పోలవరముజమీందారుగారు.
,, భద్రాచలముజమీందారుగారు.
,, మైలవరంజమీందారుగారు.
,, శ్రీ రాజా విక్రమదేవవర్మగారు.
(మఱియు ననేకులు)

---

## అనుబంధము ౪.

Venkatagiri Town,
15th May 1911.

Dear Sir,

I received your letter of the 9th instant with all enclosures, as well as your subsequent telegram. But as both these reached me too late on account of my absence in the villages whence I returned only yesterday, I could not wire my sympathy with the movement of Mr. Ramayya Pantulu garu in time to be there at the meeting which according to a printed notice received by me, was to have been convened on the 12th instant. If I were here, I would have (wired) to the President of the meeting and If I were in Madras, I would also have attended the meeting. Even now I request you, as one of the organizers of the meeting to express my full sympathy with the movement to the new Association. Wish you all well,

I am yours sincerely,
(Sd.) V. R. Kristna Yachendra.

To

Mr. P. V. Krishnaswami Chetti,
Madras.

అనుబంధము గ.

Race View,
Ooty, 19-5-11.

My dear Sir,

I am sorry I was not able to reply to your circular letter re. the formation of a Telugu Academy.

I am quite in sympathy with the object of the proposed Academy and wish it every success.

I shall write to you again on this subject.

Yours sincerely,
(Sd.) Ranga Row.

---

అనుబంధము ఙ.

# ఆంధ్రసాహిత్యపరిషన్నిబంధనలు.

I. పేరు—ఈసంఘమునకు "ఆంధ్రసాహిత్యపరిషత్తు" (Telugu Academy) అని పేరు శ్రీపిఠాపురము మహారాజాగారగు శ్రీరాజా రావు వేంకట కుమారమహీపతి సూర్యారావుబహద్దరు సి. బి. ఇ. గారును, శ్రీవేంకటగిరి రాజాగారగు మహారాజా సర్ వెలుగోటి శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరు జి. సి. ఐ. ఇ పంచహజారి మన్సబ్దార్ గారును, దీనికిఁ బ్రతిష్ఠాపకులు.

II. దీని ప్రధానవ్యవహారస్థానము మదరాసులో నుండవలెను.

III. ప్రయోజనములు—తెనుఁగుభాషను, వాఙ్మయమును, అభివృద్ధిఁబొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసఁగుటయు నీపరిషత్తుయొక్క ప్రయోజనములు. ఈ పనిని నెఱవేర్చుటకై యవలంబింపఁదగు మార్గములలోఁ గొన్ని యీక్రిందఁ బొందుపఱుపఁబడుచున్నవి:—

i. తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకష మగు నిఘంటు వొకటి రచించి ప్రచురించుట;

ii. తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గలసాదృశ్యములను సాకల్యముగ నిరూపించుచు నొకవ్యాకరణమును రచించి ప్రచురించుట;

iii. ఆధునికశాస్త్రగ్రంథరచనయందుఁ బ్రయోగించుటకునై పారిభాషికపదములను నిర్ణయించి వివరించు నొకశబ్దకోశమును సిద్ధముచేయుట;

iv. ఆంధ్రదేశ ప్రాచీనచరిత్రాంశపరిశీలనకుఁ బ్రోత్సాహ మొసంగుటయు, లభ్యము లయినవానిలో మిక్కిలి విశ్వసనీయములైన యాధారముల సాహాయ్యమున సవిస్తరముగాఁ దెలుఁగుదేశముయొక్కయుఁ బ్రజలయొక్కయుఁ జరిత్రమొకటి రచించి ప్రచురించుటయు;

v. సర్వవిషయములను గుఱించి చేయఁదగు గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొసంగుట;

vi. ఆంధ్రభాషలోని మంచిగ్రంథములఁ బండితపరిష్కారముచేయించి నిర్దుష్టముగఁ బ్రచురించుట;

vii. తెలుఁగుభాషకును వాఙ్మయమునకును సంబంధించిన విషయములను జర్చించు నొకపత్రికను బ్రకటించుట;

viii. తెలుఁగువాఙ్మయమునకు సంబంధించినవిషయములను గుఱించిచర్చించుటకుఁ గాను సాంవత్సరికసభల నేర్పాటుచేయుట;

ix. తెలుఁగు సాహిత్యవిషయమునఁ బరీక్షలఁ గావించి పారితోషికములను, సాహిత్యపట్టములను, యోగ్యతాపత్రికలను, నొసంగుట;

x. ఒకపుస్తకభాండాగారము ను స్థాపించి సాగించుట. ఇందుఁ బ్రధానముగఁ దెలుఁగుగ్రంథములుండవలయును; ప్రాఁతప్రతులుఁగూడ నుండవలయును;

xi. తెలుఁగుభాషయొక్కయు వాఙ్మయముయొక్కయు నభివృద్ధికి నుపకరించు నన్నికార్యములను జేయుట;

విశేషము:—ద్రవ్యసంపత్తిని స్థితిగతుల ననుసరించి పైనిజెప్పిన మార్గములను గాలక్రమమున నవలంబించి కొనసాగింపవచ్చును.

IV. సంఘస్వరూపము:—ఈపరిషత్తునకు స్థాపకులు, ఉద్ధారకులు, పోషకులు, యావజ్జీవసభ్యులు, సాధారణసభ్యులు, గౌరవార్థ సభ్యులును, సభ్యులుగా నుందురు.

పరిషత్తుయొక్కమూలధనమునకు

(1) రు 5,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు ఉద్ధారకులు.

(2) రు 1,000 లకుఁ దక్కువకాని మొత్తము నిచ్చువారు పోషకులు.

(3) రు 100 లకుఁదక్కువకానిమొత్తమునిచ్చువారుయావజ్జీవసభ్యులు.

(4) రు 6 లకుఁ దక్కువకాని సంవత్సరపుఁ జందానిచ్చువారు సాధారణసభ్యులు.

(5) సాహిత్యాతిశయకారణమునఁగాని, గ్రంథరచనకారణమునఁగాని,యితరకారణములచేఁగాని, తెలుఁగువాఙ్మయమున కుపకార మొనరించిన ల్లొంచి కార్యనిర్వాహకసభవారు సభ్యులుగా గ్రహించినవారు గౌరవార్థ (honorary) సభ్యులు.

V. పదునెనిమిది సంవత్సరములకు లోఁబడని వయస్సు గలవారెల్ల నీపరిషత్తులో సభ్యులుగా నుండ నర్హులు. సభ్యుఁడు గాఁగోరు ప్రతిమనుష్యుఁడును బరిషత్తులో సభ్యులుగానున్న యిద్దరు ప్రస్తావన (nomination) చేసినమీఁదటఁ గార్యనిర్వాహకసభ్యులలో నధికసంఖ్యగలవారు తాము స్వయముగా సభకు వచ్చియైనను, లేనిచోఁ దమకుఁ బ్రతినిధులుగాఁ బరిషత్తులో సభ్యులుగా నుండు మఱియొకరిని బంపి వారిద్వారమున నైనను అంగీకరించినయెడలఁ బ్రవేశముఁ గాంచును.

VI. కార్యనిర్వాహకసభ — పరిషత్తులోని సభ్యులెన్నుకొనునట్టి యేఁబదిమంది సభ్యులు కార్యనిర్వాహకసభ (Senate) గా నేర్పడి పరిషత్తుయొక్క కార్యముల నిర్వహించుచుండవలయును.

కార్యనిర్వాహకసభాసదులు మూఁడుసంవత్సరములవఱకును అధికారమున నుందురు. అనంతరము వీరినే మరల నెన్నుకొనవచ్చును. మధ్యకాలమున నేర్పడు ఖాలీలు భర్తీచేయుటకుఁ గావలసిన సభ్యులను మిగిలిన కార్యనిర్వాహకసభ్యులెన్నుకొనవలయును; ఇట్లేర్పడినసభ్యుల వ్యవహితానంతరమున జరుగు కార్యనిర్వాహకసభ సాధారణనియమనము (General election) వఱకును అధికారములో నుండవలయును. పారిషదులు కార్యనిర్వాహకసభవారిలో నొకరిని అగ్రాసనాధిపతిగను, మువ్వురను గార్యదర్శులుగను నియమించుకొనవలెను. అగ్రాసనాధిపతి రానిసభలలో, సభవారు తమలో నొకరిని దాత్కాలికాగ్రాసనాధిపతిగా నెన్నుకొనవలయును. కార్యనిర్వాహకసభవారి యాలోచనలోనికి వచ్చు ప్రతివిషయమును సమావేశమయియున్న సభ్యులలో నెక్కువమంది యభిప్రాయానుసారముగఁ దీర్మానింపఁబడవలయును. సభ్యులు రెండుపక్షములయి రెండుపక్షములును సమానసంఖ్యగల వయినప్పుడు అగ్రాసనాధిపతియభిప్రాయ మం దేపక్షమున నుండునో యాపక్షానుసారము తీర్మానింపఁ బడవలయును. ఎన్నికొనిన సభ్యులుగాక ప్రతిష్ఠాపకులును ఉద్ధారకులును గార్యనిర్వాహకసభయందు అధికసభ్యులుగా నుండవలయును. ఇట్టి యధికసభ్యులలో నెవరైనను సభకు స్వయ

ముగా రాలేనప్పుడు కార్యనిర్వాహకసభలోఁ జేరియుండని పరిషత్సభ్యులలో నొ కరినిఁ దమకుఁ బ్రతినిధిగా నియమించికొనవచ్చును.

VII. పరిషత్తుయొక్క ప్రయోజనములను నెఱవేర్చుటకు వలయు నధి కారమెల్ల కార్యనిర్వాహకసభ వారికిఁ గలదు.

VIII. కార్యస్థానమునఁ బనిచేయవలసిన వారిని నియమించుటకును, వా రికి వేతనముల నిర్ణయించుటకును, వాఙ్మయసంబంధ మయిన పనిచేయుటకొఱ కుఁ బండితుల నేర్పాటు చేయుటకును, వారి కీయవలసిన పారితోషికముల నిర్ణ యించుటకును, బరిషత్తువారు సాధారణసభలో వెచ్చించుట కనుజ్ఞయిచ్చినట్టి యావశ్యకమయిన యాపత్తువ్యయమును జేయుటకును గార్యనిర్వాహకసభవారి కధికారము కలదు. వెచ్చించుట కనుజ్ఞపొందిన సొమ్మును లిఖితపూర్వకముగా హేతువుల నుదాహరించి యొకబాపతునుండి వేఱొకబాపతునకు మార్చుట కును గార్యనిర్వాహకసభవారి కధికారము గలదు.

IX. అగ్రాసనాధిపతిగారి యుత్తరువునకులోఁబడి కార్యస్థానమునఁ బని లోనుండువారిని నియమించుటకును దొలఁగించుటకును అధికారము కలిగి యగ్రా సనాధిపతిగారి పై పరామర్శకు లోనై కార్యనిర్వాహకసభవారికి బదులు ఉత్తర ప్రత్యుత్తరరూపక మగువ్యవహారమును జరుపుచు పరిషత్తునకు రావలసిన సొమ్ము లు రాఁబట్టుచు నియ్యవలసిన సొమ్ముల నిచ్చుచుండుటకును గార్యదర్శుల కధికా రము కలదు.

X. గవర్నమెంటు పత్రములు కొనుటమూలమునఁ గాని, యిండియా దేశపు ట్రస్టు ఆక్టులో వివరింపఁబడి అప్పుడప్పుడు కార్యనిర్వాహక సభవారిచే నిర్దేశింపఁబడిన యితర మార్గములఁ గాని పరిషత్సభ్యులనుండి పరిషత్తువారిచే నే మింపఁబడిన యిద్దఱు ట్రస్టీలపేరఁ బరిషద్ధనమును నిలువచేసి భద్రపఱుపవలయు ను. తత్కాలమునకై పరిషద్ధనమును గార్యనిర్వాహకసభవారిచే నిర్దేశింపఁబడు బ్యాంకీలలో దేనియందైనను ట్రస్టీలపేర నుండవచ్చును. సాధారణవ్యయమున కుఁ గాను రూ. 100 లు కార్యదర్శుల స్వాధీనమందు స్థిరముగా నుంపవలయును. ఇతరవిధములగు వ్యయములకుఁ గావలసినసొమ్ము కార్యదర్శి అగ్రాసనాధిపతి యంగీకారముతోఁ బంపుబిల్లుల ననుసరించి ట్రస్టీల చెక్కులరూపముగా నిచ్చు చుండవలయును. కార్యదర్శి లాయవ్యయములకు లెక్క నుంపవలయును; సా ధ్యమయినవిషయములలోనెల్ల వ్యయమునకు నిదర్శనపత్త్రముల (vouchers)

ను సంపాదించి యుండవలెను. ఆలెక్కను బ్రతిసంవత్సరమును పరిషత్తువారు నియమించు తనకీదారు (auditor) తనకీచేయవలెను. ఈతనికీదారు కార్యనిర్వాహకసభవారిలో నొకఁడై యుండరాదు.

XI. అర్ధమపక్షము మూఁడుమాసముల కొకతూరియైనను గార్యనిర్వాహకసభవారు సమావేశము గావలయును.

XII. కార్యనిర్వాహకసభవారు సమావేశమయి జరుపవలసిన కార్యములను నెఱవేర్చుట కర్ధమపక్షము ఎనమండ్రుసభ్యులు సమావేశము కావలయును.

XIII. కార్యనిర్వాహకసభవారు చాంద్రమానసంవత్సరము ముగిసిన పిమ్మట సాధ్యమైనంత త్వరలోఁ బరిషత్తువారి సాధారణసభ నొకదానిని సమావేశము చేయింపవలయును. ఆసభయందు సంగ్రహముగా గతసంవత్సరములో జరిగినపనియొక్క వివరమును, లెక్కలతనికీదారుని విమర్శనపత్త్రము (report)తోఁగూడ నాయవ్యయవిజ్ఞాపనమును విన్నవించినపిమ్మట రాఁబోవు సంవత్సరములో జరుగవలసిన కార్యక్రమము యొక్కయు, వ్యయవివరముయొక్కయు నిర్ణయము కావలయును. విన్నవించిన వివరముల (reports) యొక్క ప్రతులను, సభప్రారంభము కాకపూర్వము సభ్యులకీయవలయును.

XIV. కార్యనిర్వాహకసభవారి ప్రస్తావన ననుసరించి పరిషత్తువా రొక యధ్యక్షుని గౌరవార్థముగా నియమించికొనవలెను. ఆయధ్యక్షుఁ డొక సంవత్సరమువఱకు నాయధికారములో నుండవలయును.

XV. ఈవిధులతాత్పర్యమునను సరించి పరిషత్కార్య నిర్వహణార్థమై యుపవిధులను నిర్మించికొనుటకుఁ గార్యనిర్వాహకసభవారి కధికారము కలదు.

XVI. పరిషత్తు వార్షికసభ సమావేశము కావలసినకాలమునకుఁ బూర్వమున నిరువది దినముల నోటీసును, గార్యనిర్వాహకసభాసమావేశమునకుఁ బూర్వము పదునైదుదినముల నోటీసును సాధారణముగా నీయవలయును.

---

## అనుబంధము. ౭.

### 1. శృంగారవర్ణననుగుఱించిన తీర్మానము.

1. ఒక్క తెనుఁగునందు మాత్రమే గాక సాధారణముగా నన్నిభాషలయందును శృంగారరస ముత్తమరసముగా గ్రహింపఁ బడుచున్నది. కావ్యములలో సర్వసాధారణముగా నిదియే ప్రధానరసముగా నంగీకరింపఁబడి యున్నది. సంస్కృ

తభాషలోఁ గావ్యరచనాపద్ధతులను శాసించు విపులశాస్త్రము గలదు. ఆశాస్త్రమాంధ్రకవులచే సయిత మనుసరింపఁబడుచున్నది.

2. ఏతచ్ఛాస్త్రానుసారముగా రచింపఁబడిన పూర్వకవికృత కావ్యములు నేఁటిదనుక నిరాక్షేపముగా నాంధ్రలోకముచే నంగీకరింపఁబడి యున్నవి. అనుచితవర్ణనలు కావ్యశాస్త్రమునం దశ్లీలాదిదోషములుగాఁ బరిగణింపఁబడి నిషేధింపఁబడినవి. కొందఱుకవు లొకానొకస్థలమునం దొక్కొక్కరసము నించుకనొక్కి వర్ణించినను అట్టిపట్టులందు సాధారణముగా భావము పండితైకవేద్య మగుప్రౌఢభాష నుపయోగించి యున్నారు. అట్టిభావములు విప్పిచెప్పినఁ గాని స్పష్టపడవని యాంధ్రభాషాపరిచయము గలవారికి విశదము.

3. ఏభాషయందైన నన్నికావ్యములును సర్వసామాన్య జనపఠనీయములుగా నుద్దేశింపఁబడి యుండవు. పాఠకాధికారానుగుణముగాఁ బఠింపఁబడును. ఈయంశ మాంధ్రకావ్యరచనయందుఁ గూడఁ బాటింపఁబడినది.

4. పూర్వము గ్రీకుదేశమందలి ప్రౌఢశిల్పులచే నిర్మింపఁబడిన శిలావిగ్రహములందును, ప్రస్తుతము పాశ్చాత్యకళాకోవిదులచే రచియింపఁబడుచున్న చిత్రపటములయందును శిల్పనైపుణ్యప్రకటనమున కధికావకాశ మొసంగుటచే నగ్నప్రతిమలే శ్లాఘాపాత్రములుగా గణింపఁబడుచున్నవి. కేవల శ్రవ్యప్రబంధములకంటె దృశ్యప్రబంధములును వానికంటె దృశ్యపదార్థములును మనోవికారమును గలుగఁజేయుటయం దధికసామర్థ్యము గలవని యందఱకు విదితమే.

5. శృంగారకావ్యములం జదువుటవలనజనులకు దుర్వృత్తులయందుఁ బ్రవేశము గలుగుచున్నదనుట యుక్తము కాదు. అట్లనుటకుఁ బ్రమాణములేదు. సర్వసాధారణముగా నట్టివ్యాపారములందుఁ బ్రవేశించువారు ప్రౌఢకావ్యములం జదివి యర్థము చేసికొనఁ జాలనివారయియున్నారు. చదివెడివారియం దాదోష మొక్కొక్కచోటఁ గనఁబడినను దానికి గ్రంథపఠనము కారణము గాదు.

6. కావ్యములలోఁ గొన్ని యాయాకాలములయందుఁ బ్రభుత్వముచేయుచుండిన ప్రభువులచే రచింపఁబడి యున్నవి. అనేకములు తత్తత్కాలములందలి ప్రభువులకుఁగాని వారిమంత్రులకుఁగాని యంకితములు చేయఁబడి యున్నవి. ప్రభుసమ్మానము వడయుటచేతనే తత్తత్కాలములం దాగ్రంథములు దూష్యములుగా నెన్నఁబడి యుండలేదని స్పష్టమగుచున్నది.

ఉచితానుచితవివేకము కాలభేదముబట్టి భేదించును. భావభేదము కలిగినప్పుడెల్లఁ బూర్వగ్రంథములను సవరింపవలయు నని నిర్ణయించినచో నందు

వలన ననేకానర్థములుపుట్టునదనుటకు సందేహములేదు. అట్టిసిద్ధాంత మేదేశమందు నెవరు నంగీకరించి యుండలేదు. ఇప్పు డంగీకరించినయెడల సాధారణముగా నన్ని భాషలయందు నమూల్యములుగాఁ బరిగణింపఁబడుచున్న గ్రంథములను గూడ నవలింపవలసివచ్చును. తుదకుమతగ్రంథములకుఁగూడ నాపద పట్టవలసివచ్చును.

7. శృంగారవర్ణన లెక్కువగా నున్నగ్రంథముల రూపుమాప యత్నించుట వలన భాషావాఙ్మయములకు విపత్తు కలుగు ననుట నిస్సందేహము అట్లు చేసి నచోఁ దెలుఁగులో మాత్రమే కాక భరతఖండమునందలి యితరభాషలలో నయి తము గల యనేకగ్రంథము లదృశ్యములు కావలసివచ్చును.

8 లాక్షణికు లనేకులు శృంగారప్రధానకావ్యముల నాధారము చేసి కొన్ని లక్షణముల నేర్పఱిచియున్నారు. తెలుఁగులో శబ్దస్వరూపమును నిర్ణయించుటకుఁ బూర్వకవి ప్రయోగములు ముఖ్యాధారములు. అట్టియాధారముల నాశనముచేయుట భాష కపకారమగును.

కాఁబట్టి పూర్వకవికృతశృంగారప్రబంధముల రూపుమాపుట గాని యందలి భాగముల లోపింపఁజేయుట గాని కూడ దని యీసభవారి దృఢాభిప్రాయము.

2. గ్రామ్యభాషాప్రయోగము.

గ్రంథరచనయందుఁ బూర్వలాక్షణికసమ్మతమగు భాషను బ్రయోగింపవలయును గాని లక్షణవిరుద్ధమగుభాషను బ్రయోగింపఁగూడదు. గ్రంథములను మృదుమధురశైలిని రచింపవలయు ననుట సర్వజనసమ్మతము. అట్లొనరించుటకు లక్షణభంగ మవశ్యము కాదు. లక్షణభంగముకాకుండ భాషావైచిత్ర్య మెంతయైనం గనుపఱుపవచ్చును. అందువలన శైలిభేదము లేర్పడును.

2, 3 అర్ధానుస్వారము, శకటరేఫము.

అర్ధానుస్వారశకటరేఫములు శబ్దస్వరూపావయవములగుటను శబ్దవ్యుత్పత్తులను నిరూపించుటకు సాధనము లగుటను త్యాజ్యములు కావు.

4 సంధి:—గద్యరచనయం దచ్చటచ్చట సద్భావబోధనార్థమును, పఠన సౌకర్యార్థము నావశ్యకమని తోఁచినపట్టులందు సంధి చేయకున్నను దోషము కాదు, కాని, సంధి యెప్పుడును జేయనక్కఱలేదని వాదించువారి వాద మంగీకార్యము కాదు. సంధి చేయుటయుఁ జేయకుండుటయుఁ, గొంతవఱకుఁ బాఠకాధికారము ననుసరించి యుండును. పసిపిల్లల నిమిత్త ముద్దేశింపఁబడిన పుస్తకములందు శాస్త్రవిరుద్ధముగాకుండ సంధిని దగ్గించుట మంచి దనియే చెప్పవచ్చును. పద్యరచనయందు విసంధి దుష్టమే.

౫. అన్యదేశ్యపదప్రయోగము:

పూర్వకవిమతానుసారముగా రసపోషణమునకై యచ్చటచ్చట యథోచితముగా నన్యదేశ్యపదములం బ్రయోగింపవచ్చును. కాని యథేష్టముగాఁ బ్రయోగింపఁగూడదు. అన్యభాషలలోనుండు భౌతికశాస్త్రాదిగ్రంథములఁ దెలుఁగులోనికిఁ బరివర్తనము చేయునపుడు తత్తచ్ఛాస్త్రోచితపారిభాషికపదంబులు తెనుఁగునఁ గాని సంస్కృతమునఁ గాని నిర్ణయించి వానినే యుపయోగింపవలయును. ఏకపదములు దొరకనిచో నాతిదీర్ఘసమాసపదంబుల నిర్మింపవచ్చును. అట్లొనర్చుటకు సాధ్యముకానిచో నన్యదేశ్యమూలపదంబుల నాంధ్రభాషాసంప్రదాయాను సరణముగా సంస్కరించి గ్రహింపవచ్చును. పారిభాషికపదములు సంస్కృతమున నుండినచో భరతఖండములోని యన్నిభాషలకును సమానములుగా నుండును గాన నట్టిపదములు బహుశః సంస్కృతములోనే యుండుట మేలు. ఆంధ్రసాహిత్యపరిషత్తువా రట్టి పదముల నిర్ణయించి ప్రకటించిన బాగుగ నుండును.

---

అనుబంధము. ౮.

మహోన్నతులును మహామంత్రిసమేతులును నగు
మహారాజశ్రీ మదరాసుగవర్నరుదొరవారికి—

ఈదిగువను వ్రాళ్లుచేసిన యాంధ్రభాషాభిమానులు
వినయపూర్వకముగాఁ జేయు మనవి.

ఏమనఁగా:—

ఇప్పుడిప్పుడు కొద్దిమంది తెలుఁగుభాషను తమ యిచ్ఛానుసారముగా "సంస్కరింప" వలయునను నభినివేశమును గల్పించుకొని తదనుగుణముగా గ్రాంథికభాషను విడిచిపెట్టి గ్రంథము లిఁక గ్రామ్యభాషయందే రచింపవలయునని వాదించుచున్నారు. మఱియు గ్రామ్యభాషయందు రచింపఁబడిన గ్రంథములఁ బాఠశాలలలో నుపయోగించునటు లొనర్చుటకు యత్నములు జరుగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇట్లభిమానముతో వాదించు వారిద్దఱు ముగ్గురుమాత్రమే. వారి వాదము నామోదించువారి సంఖ్య యత్యల్పము. రెండుకోట్ల కధికమగు నాంధ్రులసంఖ్యలో నణుమాత్రము. వీరివాదము గ్రాంథికభాషాసంప్రదాయమునకు విరుద్ధమగుటయేగాక ఆంధ్రభాషావాఙ్మయముల వృద్ధికిని, దేశాభివృద్ధికిని హానికరమగుటచేత ఆంధ్రలోకమున కెంతయు నసమ్మత మని దృఢముగను నిశ్చయముగను మనవిచేయుచున్నారము.

2. కాలక్రమమున మారుచుండుట భాషస్వభావమనియు, మారక యెన్నటికి నొక్కరీతిగానే యుండవలయునని వాదించుట యశాస్త్రీయమనియు, భాషకు గ్రామ్యాగ్రామ్యభేదము భాషాస్వరూపము నెఱుంగని పండితమ్మన్యులచేఁ గల్పింపఁబడినదిగాని వాస్తవము గాదనియు, ఇప్పటి గ్రాంథికభాష సంస్కృత పదములతోడను, సాంస్కృతిక వాక్యరచనా విశేషములతోడను వర్తమానమందు వాడుకలో లేని కేవలపురాతనపదప్రయోగములతోడను నిండియుండుటంజేసి పండితులుకానివారలకు దురవగాహమనియు, సర్వసామాన్యముగా నందఱకును దెలియుటయే గ్రంథరచనయొక్క ముఖ్యలక్షణము కావున నింతటినుండి గ్రంథముల నాంధ్రదేశమం దుత్తమజాతిస్త్రీపురుషులు సంభాషణయందు వాడుచున్న భాషయందే వ్రాయవలెననియు, ఈ పద్ధతి యాంగ్లేయభాషయందుండుటచే నాంధ్రులకుఁగూడ ఆచరణీయమనియు నీవిపరీత సంస్కారవాదుల మతము.

3. ఈ వాదము దోష భూయిష్ఠమైయున్నది. తెలుఁగునందు గ్రాంథికభాష దుర్బోధమని చెప్పుట యతిసాహసము. అనుభవవిరుద్ధము. కొన్నికొన్ని గ్రంథము లతిప్రౌఢముగానుండుటచేత పాండిత్యవిహీనులకు సులభముగాబోధపడక పోవచ్చును. అట్టివి ప్రాచీనగ్రంథములం దంతగా లేవు. అట్టిగ్రంథము లన్ని భాషలయందును గలవు. ఈ కాఠిన్యము పాకభేదముననుసరించినది గాని లక్షణమువలనఁగలిగినది కాదు. సులభముగా గ్రహింపఁదగిన సలక్షణగ్రంథము లనేకములు గలవు. అవి యాంధ్రదేశమందెల్లెడలఁ బ్రచారములోనున్నవి. నేఁడుగూడ భాషాసేవకు లనేకు లీసలక్షణభాషచేతనే సుబోధములగు గ్రంథము లనేకములు రచియించుచున్నారు. నిర్దుష్టభాషచే గ్రంథరచన చేయఁగలవారి సంఖ్య మొత్తముమీఁద కొంచెమయినను, అట్టి గ్రంథములను గ్రహింపఁగల వారనేకు లుందురు. ఇట్టులే యన్నిభాషలయందును, ప్రౌఢకవులు కొద్దిమంది, చదివి గ్రహింపఁగలవారు పెక్కురు. అట్లుకాకున్న ప్రౌఢకావ్యములు లేకపోవలసియే వచ్చును. కొంతకాలమునుండి సలక్షణమగు తెలుఁగున రచింపఁబడిన నాటకగ్రంథము లనేకములు పుట్టుచున్నవి. నాటక సమాజము లనేకము లేర్పడి యీనాటకములను ప్రదర్శించుటయు వేలకొలఁది జను లానాటకములఁ జూచి యానందించుటయు జరుగుచున్నది.

4. ఆంగ్లేయభాషయందే యెక్కువపరిచయము గల యీ కాలమువారికి కొందఱకు సలక్షణాంధ్ర గ్రంథములు కొన్ని కష్టసాధ్యములుగా నుండవచ్చును.

ఈ లోపము వారిమాతృభాషావైముఖ్యమునలనఁ గలిగిన దని వారు సర్వసామాన్య విషయములంగూర్చి యొకరితోనొకరు ప్రసంగించునపుడు గూడ యథేచ్ఛగాఁ బ్రయోగించు నాంగ్లేయపదములే చాటుచున్నవి. కేవలము వీరల సౌకర్యార్థము భాషామర్యాదల మార్పవలెనని వాదించుట ధర్మముకాదు. వర్తమానమునం దాంగ్లేయ విద్యాధికు లగు పలువురాంధ్రులు మాతృభాషాభిమానము కలిగి తద్భాషాపరిచయమును వృద్ధి నొందించుకొనుటయే కాక యాభాషయందు గ్రంథములుగూడ రచియించుచున్నారు. నూతనసలక్షణగ్రంథరచనకై యనేక సమాజములు లేర్పడుచున్నవి.

5. సంభాషణ రూపముగా మాత్రమే వ్యవహరింపఁబడు చున్నంతవఱకు జనులనోళ్లఁబడి దేశభేదమువలనను కాలభేదమువలనను మాఱుచుండుట భాష స్వభావము. అట్టి భాష గ్రాంథికమైన పిమ్మట ననఁగా నాభాషచే గ్రంథములు రచించుట కారంభమయిన పిదప పూర్వపు వికారగుణము తగ్గి భాషకు లక్షణ మేర్పడి దేశభేదములచే భిన్నముగాక యేకరూపముగా నుండును. ఇది సర్వ గ్రాంథిక భాషలకు సమానలక్షణము. అట్లు కానిచో నొక ప్రదేశమున రచింపఁబడు గ్రంథములు వేఱొక ప్రదేశమునను, ఒకకాలమున రచింపఁబడు గ్రంథములు కాలాంతరమందును బొత్తిగాఁ దెలియకపోవుట తటస్థించి గ్రంథరచనయొక్క ప్రయోజనమునకే భంగముకలుగును. ఈకుస్థితి యాంధ్రదేశమున కింకను బట్టలేదు గాని "సంస్కార" వాదులయుద్యమము కొనసాగినచోఁ బట్టుననుటకు సంశయములేదు.

6. పూర్వమధ్యాధునిక కాలభేదములచేత ఆంగ్లేయభాష మూఁడువిధములుగా నున్నదనియు, పూర్వకాలభాషకును ఆధునికభాషకును భేద మత్యంతము కలదనియు, ఆంధ్రభాషకుఁగూడ నట్టి పరిణామము కలిగిన ట్లూహింపవలయుననియుఁ గొందఱియాశయము. ఆంగ్లేయ భాషయందుఁ గలిగిన మార్పులు చాలవఱకు నాదేశము నార్మనుదేశీయులచే నాక్రమింపఁబడియుండిన కాలమునందు సర్వసామాన్య గ్రాంథికభాష యేర్పడియుండకపోవుటచేఁ గలిగినవనియు, ఆంగ్లేయగ్రాంథికభాషా పితామహుఁ డనఁదగిన చాసరు నాఁటిభాషకు నిప్పటి భాషకును భేదము బొత్తిగా లేకపోలేదుగాని వానికిఁగల ముఖ్యభేదము వర్ణక్రమము (Spelling) నకు సంబంధించినది గాని లక్షణమునం దంతఁగా మార్పులు కలుగ లేదనియు ఆంగ్లేయపండితులు చెప్పుచున్నారు.

7. ఆంధ్రభాషయన్ననో:—11 వ శతాబ్దారంభము నాఁటికే యనఁగా నార్మనులు ఇంగ్లాండు నాక్రమించుకొనక పూర్వమే యున్నతస్థితికి వచ్చియుండెను. గ్రాంథికభాష యేర్పడి నేఁటికిఁగూడ నుత్తమగ్రంథముగా నెన్నఁబడుచున్న యాంధ్రభారతమందు మూఁడు పర్వము లాశతాబ్దము పూర్వార్ధమునందు రచింపఁబడియుండెను. పిదప మాతృభాషాభిమానులగు నాంధ్రరాజులే దేశమును కలకాలము పరిపాలించు చుండుటంజేసి భాష నిజమర్యాదానుసారముగనే క్రమక్రమముగా వృద్ధిఁబొందుచు వచ్చినది. పదపడి కొంతకాల మాంధ్రదేశములోఁ గొంతభాగము మహమ్మదీయులచే నాక్రమింపఁ బడియుండెను గాని భాషామర్యాద లదివఱకే స్థిరపడియుండుటంబట్టి రాజకీయ వ్యవహారముతో సంబంధించిన కొన్ని పారశీకాద్యన్యదేశ్య పదములు వ్యావహారికభాషయందుఁ జేరుటతప్ప భాషాస్వరూపమున భేద మేమియుఁ గలుగలేదు. కాఁబట్టి యాంగ్లేయభాషా సామ్యమునుబట్టి యాంధ్రభాష మాఱవలె నని వాదించుట యశాస్త్రీయము. క్రొత్తతెలుఁగు ప్రాఁతతెలుఁగు నను భేదము "సంస్కార" వాదుల స్వకపోలకల్పితము గాని వాస్తవముగాదు. ఆంధ్రులకు దుర్బోధము. ప్రాచీనాంగ్లేయభాషకుఁ బోల్పఁదగిన వస్తువు తెలుఁగులో లేదు. వీరల క్రొత్తతెనుఁగనునది గ్రామ్యభాషగాని వేఱుగాదు.

8. గ్రాంథికభాషా సాహచర్యముచే సంస్కరింపఁబడిన యుత్తమాంగ్లేయ సంభాషణభాషకును ఇప్పటియాంధ్రుల సంభాషణభాషకును సామ్యముచెప్పుట యక్రమము. సంభాషణభాషాశైలికంటె గద్యకావ్యముల భాషాశైలియు, అంతకంటె నాటకశైలియు, అంతకంటెఁ బద్యప్రబంధశైలియు ప్రౌఢములు. ఆంగ్లేయభాషయందు నాటకములు గద్యగ్రంథములు పెక్కులుండుటచేతను చదువాదేశమం దధికముగా వ్యాపించియుండుటచేతను అచ్చుయంత్రములయుపయోగము ప్రబలుటచేతను, ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి పట్టణము లందలి యున్నతవిద్యాలయములమూలమునను గ్రాంథికభాషాసంబంధ మెక్కువయయి సంభాషణభాష ప్రౌఢమగుటయు దానికిని గ్రాంథికభాషకునుగల యంతర మల్పమగుటయుఁ దటస్థించినవికాని గ్రాంథికభాష ప్రౌఢిమ తగ్గుట యిందుకుఁ గారణముకాదు.

9. ఆంధ్రభాషయందలి గ్రంథములు ప్రాయికముగా పద్యరూపములుగానే యుండుటచేత గ్రాంథికభాషకును వ్యావహారికభాషకును అంతర మాంగ్లేయభాషయందు కంటె నెక్కువగానున్నది. నాటకములును గద్యకావ్యములును

ఇప్పుడిప్పుడు బయలుదేఱుచున్నవి. ఈనాఁటి గ్రంథకర్తలు సులభమగు ద్రాక్షాపాకముననే గ్రంథముల రచించుటకు యత్నించుచున్నారు. పలువు రట్లు వ్రాయఁగలిగియున్నారు. ఈప్రకార మింకఁ గొంతకాలము జరిగినపిమ్మట నీ గ్రాంథికభాషా సంబంధముచే నాంగ్లేయభాషయందువలెనే యక్షరాస్యుల వ్యావహారికభాష ప్రౌఢమయి స్థిరపడుననుటకు సందేహము లేదు. ఇప్పుడే యారంభమయినది. చదువుకొన్నవా రనేకు లుత్తరప్రత్యుత్తరములందును, ఉపన్యాసములిచ్చునప్పుడును, వార్తాపత్రికలయందును సలక్షణమగు భాషనుపయోగించుచున్నారు. అక్షరాస్యుల వ్యావహారికభాషకును గ్రాంథికభాషకును భేదము తగ్గించుటకు న్యాయమైనమార్గ మిది గాని "సంస్కార" వాదులు చెప్పునది కాదు.

10. "సంస్కార" వాదులు చెప్పునట్లు ఏకరూపమును సర్వసామాన్యమునగు వ్యావహారికభాష ప్రస్తుతమాంధ్రలోకమందు లేదు. జాతిభేద దేశభేదములనుబట్టి యది వివిధముగానున్నది. ఇందులో నేదియో యొకదేశమం దొక జాతివారిచే వ్యవహరింపఁబడుచున్న భాషయందు గ్రంథముల రచింపుదమన్న నవి యితర దేశములందును ఇతరజాతులకును సంస్కారవాదులు కోరునంత సులభముగా నర్థమెట్లగును? ఆభాష కొకలక్షణ మేర్పఱచి యాలక్షణము నందఱు మన్నింపవలయునని నిబంధనము చేయుదమన్నచో నదియు నొక గ్రాంథిక భాషగా నేర్పడి వర్తమానగ్రాంథికభాషయం దారోపింపఁబడిన దోషములకన్నిటికిని పాత్రముకాదా? గ్రాంథికభాష యొక్కటియే తెలుఁగుదేశమంతటను తెలియఁదగి యున్నది.

11. కాలక్రమమున గ్రాంథికభాషకూడఁ గొంతవఱకు మాఱుచుండుననుట సత్యమే. ఆప్రకార మాంధ్రభాషకూడ మాఱుచునే యున్నది. పూర్వకవిప్రయోగములకంటె భిన్నములగు ప్రయోగములు తరువాతి కవులగ్రంథములలోఁ గనఁబడుచున్నవి. వానిని లాక్షణికులంగీకరించి యున్నారు. కాని గ్రాంథిక భాషయందు మార్పులు విలంబముగను బహుకవి సమ్మతముగను గలుగును. భాషాలక్షణవిచారము చేయునప్పుడు తత్తత్కాలములందు ప్రామాణికులుగా నెన్నఁబడువారి గ్రంథములందలి ప్రయోగములే ప్రమాణముగాని మఱియేదియు ప్రమాణము కానేరదు. సుప్రతిష్ఠితమగు నీమర్యాదకును ఆంధ్రభాషాసంప్రదాయమునకును విరుద్ధముగా నిద్దఱుముగ్గురుచేరి తమ యిచ్ఛానుసారముగా భాషను మార్చెదమనుట హాస్యాస్పదము.

12. ఈ యపూర్వ సంస్కార వాదుల మతానుసారముగా రచింపఁబడిన గ్రంథములు ప్రచారములోనికి వచ్చినయెడల ఆంధ్రులకుఁ గ్రమక్రమముగా నిప్పటి గ్రాంథికభాషతోఁ బరిచయము తగ్గి కొంతకాలము గతించిన పిమ్మట నిప్పటి తెలుఁగు గ్రంథము లన్యభాషాగ్రంథములవలె దురవగాహము లగుట తటస్థించును. అందువలన రాఁబోవు జనులకుఁ దమదేశపు పూర్వవృత్తాంతము బొత్తిగాఁ దెలియకపోవును. నాగరికులను ఖ్యాతిగల ప్రతిజాతియొక్కయు పూర్వాచారములు, పూర్వపురుషుల యుదారభావములు, ఆశయములు, వారు కనిపెట్టినవిషయములు మొదలగునవి యన్నియు ననఁగా బహుకాలసంచితమగు నాగరకతాసారమంతయు వారివారి వాఙ్మయములందు నిక్షిప్తమై యుండును. జనులు వాఙ్మయము నర్థము చేసికొనలేక పోయినచో వారలకుఁ దమ పూర్వవృత్తాంతము, పూర్వమర్యాదలు తెలియకపోవును. తమ పూర్వవృత్తాంతమును మఱచిపోవుటకంటె ఘోరతరమైన విపత్తేజాతివారికిని దటస్థింపఁ బోదుకదా!

13. పిల్లలకును పామరులకును సులభముగా బోధపడునట్లు గ్రంథములు రచించుట కనేక మార్గములు కలవు. అట్టి గ్రంథములయందు సర్వసామాన్యముగా నందఱకు నర్థమగు పదములనే ప్రయోగింపవలెను. తఱచుగా సంధుల సడలింపవలయును. వాక్యములు చిన్నవిగా నుండవలయును. విషయముకూడ చదువరుల తెలివికి లోపడినదిగా నుండవలెను. గ్రంథములు సులభముగా రచియింపవలెనన్న నివి మార్గములు కాని గ్రామ్యభాషను బ్రయోగించుట సరియయిన మార్గముకాదు. ఆంగ్లేయభాషలో పసిపిల్లల నిమిత్తము వ్రాయు చిన్న పుస్తకములునైతము గ్రామ్యభాషలో వ్రాయరు. తెలుఁగులోనేల వ్రాయవలెను?

14. సరియయిన పర్యాయపదములు దేశభాషయందు దొరకనియెడల అన్యదేశ్య పదముల గ్రహించుట కభ్యంతరము లేదు. కాని దేశభాషాపరిచయ మల్పమును అన్యదేశభాషాపరిచయ మధికము నగుటచే దేశ భాషయందలి పర్యాయపదముల నన్వేషింపకయే యన్య భాషాపదముల యథేచ్ఛముగాఁ బ్రయోగించుట నింద్యము. అట్లు బ్రయోగించినయెడల భాషలలో నెల్ల లలిత మనిపించుకొన్న యీ తెలుఁగు సంకరమై కర్ణకఠోరమగును. సంస్కృత పదము ననవసరముగాఁ బ్రయోగించిరనియే కదా సంస్కారవాదులు కొందఱు పండితుల నిందించుచున్నారు. అట్టి తా మన్యదేశ్య శబ్దముల నిరంకుశముగా నెట్లు ప్రయోగింప నొప్పును?

15. మీఁదఁ గనఁబఱిచిన హేతువులంబట్టి యీ యపూర్వ సంస్కార వాదుల వాదమును నిషేధించి వర్తమాన మర్యాదానుసారముగా సలక్షణభాషచే రచింపఁబడిన గ్రంథములనుమాత్రమే పాఠశాలలయందుపయోగించునట్లును, తదితరగ్రంథముల నుపయోగింపకుండునట్లును శాసింపవలయు నని దొరతనము వారి నిండుమూలముగా మఱిమఱి వేఁడుచున్నారము. మఱియు, తెలుఁగు "టెక్స్టు బుక్కు కమిటీ" లో తెలుఁగు మాతృభాషగాఁ గల వారిద్దఱు మాత్రమే యున్నారు. తెలుఁగు తెలియనివారు తెలుఁగు గ్రంథముల నియమించుట న్యాయముకాదు గనుక ఆ "కమిటీ" లోని సభ్యు లందఱు తెలుఁగు మాతృభాషగాఁ గలవారుగా నుండున ట్లేర్పాటుచేయవలయు ననికూడఁ బ్రార్థించుచున్నారము.

ఇట్లు,

విన్నవించెడి యాంధ్రభాషాభిమానులు

---

అనుబంధము. ౯.

The following G. O. No. 196. Educational, dated the 22nd February 1915, has been issued on the subject of the battle of the styles in regard to Telugu:—

"A controversy arose sometime ago between two sections of the Telugu people as to whether the "classical" or "modern" style should prevail in Telugu literature generally and be the language of Telugu school readers in particular. In 1912-13 the Secondary School Leaving Certificate Board, on the representation of some school managers and headmasters issued two circulars for the guidance of candidates appearing for the public examination conducted by that body. While the first circular declared that all pupils belonging to a school would be examined alike, ie., either in "classical" or in "modern" Telugu the second modified the first and allowed each pupil to answer his paper in any style he liked. The issue of these circulars was subsequently-brought to the notice of the Government, but no steps were immediately taken in the matter, as it was considered desirable to await the result of the deliberations of the committee which the Syndicate of the Madras University has appointed to consider the possibility of fixing a standard for composition in Telugu for

the Intermediate Examination. This Committee having lately submitted its report and the Syndicate having thereupon decided that it is not in a position to recognise what is known as "modern" Telugu for University purposes, the Director of Public Instruction will be requested to arrange for the withdrawal of the circulars referred to *Supra*."

---

అనుబంధము. ౧౦.

## OBSCENITY IN LITERATURE.

According to the Sanskrit works on poetics obscenity (asleelam) is a literary fault or blemish (dosha). It is defined as that which offends one's sense of shame or modesty (Vrida), causes disgust (Jugupsa) or is inauspicious or unpleasant (Amangalam). According to Vamana, obscenity is not a fault where it is not patent, where it is the result of a far-fetched construction or where it is approved by popular sentiment. (Nagupta lakhitasamvrittani) (a).

INDIAN VIEW.

It does not appear that obscenity has ever been treated as an indictable offence under the Hindu Law.

According to the writer in the Encyclopaedia Brittanica "the test of criminality as accepted in England and Canada is whether the exhibition or the matter complained of tends to deprave and currupt those whose minds are open to immoral influences and who are likely to visit the exhibition or to see the matter published." In applying this test, "it is necessary to consider the effect of the whole work and not merely the particular extract challenged as improper" and it is said that "in practice, it is difficult to induce juries to convict the publishers of well-known and old established works of real literary quality on the ground that they contain passages offensive to Modern notions of propriety."

ENGLISH VIEW.

PRACTICE OF BRITISH COURTS.

---

(a) Kavyalankarasutravritti (2-1-16).

The effect of indecent sculptures and pictures is more direct and deleterious than that of indecent literature and even here difficulty is felt in drawing the line between representations of the nude and works which fall within the definition of the obcsene.

OBSCENE PICTURES.

Finally, it is stated that, in the Colonial Acts, no penalty is incurred if the defence can prove that the incriminated publication is a work of recognized literary merit i. e., Aristophanes or Boccacio's Decameron".

COLONIAL LAW.

The distinction between what is and what is not obscene in literature is often a fine one and the line to be drawn between them is, in many cases, more or less arbitrary. The test to be applied is whether a perusal of the book is calculated to corrupt the morals of the average reader. Who is to apply this test? In England, it is the Jury and therein lies a guarantee that the book will be judged in accordance with the popular sentiment. No such guarantee exists in India where these cases are tried by Stipendiary Magistrates whose literary attainments, moreover, are not always such as to ensure a correct understanding of the original passages. The caution that, in coming to a conclusion, the court should consider the effect of the book as a whole and not merely of the passage or passages challenged, does not seem to be always borne in mind by the authorities in India. Neither the colonial law nor the practice of the British courts exempting works of literary merit from liability to be suppressed, seems to be well understood here.

Guarantee or safety under English Law.

No such guarantee in India.

In Indian literature, the nature of the contents of a poem as well as the method of treating them is, to a large extent, determined by literary convention. This convention certainly condemns lapses from propriety but places a liberal construction on the term propriety. There are books written by ruling Sovereigns such as Krishnadevaraya's

Indian literary convention.

*Amuktamalyada*, and books dedicated to Kings such as *Manucharitra* dedicated to the same King which are regarded as great works of art but which are not free from stray passages liable to be objected to by a purist. As a rule, sentiments of this sort are clothed in high-flown and difficult language understood only by scholars.

Frankly obscene books to be controlled.

There are books which are frankly obscene such as the Telugu book *Chandralekhavilapam*. The publication of Such books must certainly be controlled. But books which are of real literary merit and are approved by popular sentiment should not be condemned on account of stray passages. If works of merit which conform to the conventions under which they were written should be liable te be prohibited by reason of the modern notions of literary propriety, few works, if any, would escape condemnation and it would be intolerable if each succeeding generation should have it in its power to suppress or mutilate the approved literature of the previous generation.

But classics should be protected.

CASE OF TEXT Books is Different.

Whether every one of these books is such as can be prescribed as a text-book for study in schools and Colleges is a different question. The standard applicable to text-books must always be higher than that applied to books intended for the general reader and the fact that a book is not considered fit to be prescribed as a text-book for students, is not an argument for prohibiting its use by the general reader.

WORKS OF ART HOW TO BE JUDGED.

Works of art must be judged by a different standard than books of moral maxims. The object of both is the same Viz. to inculcate truths but while the teacher of maxims treats of the truths in their naked and often unattractive form, the artist tries to make them attractive to the reader. In other words, he sugars the pill. It may be that some times there is a little more sugar than is absolutely necessary but that should not be penalized unless the

excess is so great as to neutralize the virtue of the medicine itself.

The indirect effects of the present policy of prosecuting publishers for obscenity, are more harmful than the direct effect. This policy seems to have created, in the minds of several publishers, a feeling of uncertainty and consequent insecurity due to the apprehension that any book may, at any time, be considered objectionable. It is highly desireble to remove that feeling.

Indirect affect of present policy of prosecution.

In view of all the considerations set forth above, it is only fair to ask that the Indian Law should not be more severe than the Colonial Law which seems to be substantially identical with the practice of the British Courts and which leaves "wellknown and old established works of real literary merit" untouched and that, in deciding whether a prosecution is to be launched or not, the character of the book as a whole and not merely of particular passages should be taken into consideration. It would be easy to draw up lists of old established and well known works with the help of learned bodies such as the Telugu Academy, the Tamil sangham and the Kannada Academy and also the University Boards of studies in Sanskrit and Vernaculars. Standing lists like these will remove the present sense of uncertainty and serve as a valuable guide to the publishers. In the case of books not included in thes lists, it is submitted that the literary bodies referred to above may ordinarily be consulted before a book is condemned.

Preparation of Standing lists of works of merit.

Literary bodies to be consulted before condemning a book.

అనుబంధము ౧౧.

# పరిషద్వార్షిక సభలు—తదధ్యక్షులు.

| ఎన్నవ సభ | ఏ సంవత్సరము ది | జరిగిన తేది | స్థలము | అధ్యక్షులు |
|---|---|---|---|---|
| 1 | విరోధికృత్తు | 1912 సం॥ ఏప్రిల్ ది 6-7 తేదీలు | చెన్నపురము-పచ్చయ్యప్పకాలేజీలో | శ్రీపిఠాపురముమహారాజావారు |
| 2 | పరీధావి | 1913 సం॥ ఏప్రిల్ ది 19-20 తే॥ | రాజమహేంద్రవరము-హితకారిణీహైస్కూలు | కొక్కొండ వేంకటరత్నశర్మగారు |
| 3 | ప్రమాదీచ | 1914 సం॥ ఏప్రిల్ ది 18-19 తే॥ | కాకినాడ-మ్యునిసిపల్‌హాలులో | కిళాంబి రామానుజాచార్యులు గారు ఎం. ఏ. బి. యల్ |
| 4 | ఆనంద | 1915 సం॥ ఏప్రిల్ ది 3-4 తే॥ | బళ్లారి-కోలాచలము వేంకటరావుగారిపుర మందిరము. | శ్రీరంగదేవరాయలు బ॥రు వారు |
| 5 | రాక్షస | 1916 సం॥ ఏప్రిల్ ది 22-23 తే॥ | గుంటూరు-ఏ.ఇ.యల్. యమ్. కాలేజీహాలులో | శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరువారు |
| 6 | నల | 1917 సం॥ ఏప్రిల్ ది 7-8 తే॥ | కడప-మ్యునిసిపల్ బ్రాంచి సెకండరీస్కూలులో | కోలాచలముశ్రీనివాసరావుగారు. |
| 7 | పింగళ | 1918 సం॥ మే ది 11-12 తే॥ | మధుర-విక్టోరియా ఎడ్వర్డుహాలులో | శ్రీరంగదేవరాయలు బ॥రువారు |
| 8 | కాళయుక్తి | 1919 సం॥ జూన్ ది 7-8 తే॥ | నెల్లూరు-లక్ష్మీనర్సారెడ్డిగారి పురమందిరము | వేదం వేంకటరాయశాస్త్రిగారు |
| 9 | సిద్ధార్థి | 1920 సం॥ ఏప్రిల్ ది 3-4-5 తే॥ | బెజవాడ-రామమోహనధర్మపుస్తకభాండారము | నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు |
| 10 | రౌద్రి | 1921 సం॥ అక్టోబరు ది 3-4 తే॥ | ఏలూరు-పురమందిరములో | శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు |
| 11 | దుర్మతి | 1922 సం॥ సెప్టెంబరు ది 2-3 తే॥ | పిఠాపురము-మహారాజావారికోటలో | పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు |

| న్నవ సభ | సంవత్సరముది | జరిగిన తేది | స్థలము | అధ్యక్షులు |
|---|---|---|---|---|
| 12 | దుందుభి | 1923 సం॥ అక్టోబరు 13-14 తే॥ | తుని-శ్రీరాజావారిహైస్కూలులో | శ్రీమాన్ విక్రమదేవవర్మ బహద్దరువారు |
| 13 | రుధిరోద్గారి | 1924 సం॥ అక్టోబరు ది 9-10-11-12-13 తే॥ | తణుకు-కరణముల సత్రములో | ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు |
| 14 | రక్తాక్షి | 1926 సం॥ ఫిబ్రవరి ది 6-7 తే॥ | కాకినాడ-అన్నదానసమాజభవనము | చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు |
| 15 | క్రోధన | 1927 సం॥ జనవరి ది 29-30 తే॥ | కాకినాడ-సరస్వతీభవనములో | శ్రీరాజా వేంకటాద్రిఅప్పారావు బహద్దరువారు |
| 16 | అక్షయ | 1927 సం॥ అక్టోబరు 22-23-24 తే॥ | జల్లూరి-కోలాచలము వేంకటరావుగారిపురమందిరము | శ్రీత్రిపురాన సూర్యప్రసాదరావు దొరగారు |
| 17 | ప్రభవ | 1929 సం॥ మార్చి ది 30-31 తే॥ | ముక్తేశ్వరము-శ్రీముక్తేశ్వరస్వామియాలయము | జనమంచి శేషాద్రిశర్మగారు |
| 3-19 | విభవ-శుక్ల | 1930 సం॥ సెప్టెంబరు 20-21 తే॥ | పెద్దాపురము-ఆర్యవైశ్యభవనములో | చెన్నాప్రెగడ భానుమూర్తి పంతులుగారు బి. ఏ. |
| 20 | ప్రమోదూత | 1931 సం॥ మే ది 23-24 తే॥ | విశాఖపట్టణము-మిసెస్ ఏ. వి. యన్. కాలేజీలో | మహామహోపాధ్యాయతాతా సుబ్బరాయశాస్త్రులుగారు |
| 1-22 | ప్రజోత్పత్తి-అంగీరస | 1933 సం॥ మే ది 23-24 తే॥ | రాజమహేంద్రవరము-బాబ్జీసినీమాహాలులో | వడ్డాది సుబ్బరాయకవిగారు |
| 3-24 | శ్రీముఖ-భావ | 1935 సం॥ ఆగష్టు ది 24-25 తే॥ | అమలాపురము-బాలికాపాఠశాలలో | అవధానిశిరోమణి కాశీ కృష్ణాచార్యులుగారు |

అనుబంధము ౧౨.

1 విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయ్యకవి
2 జైమినిభారతము-వచనము-సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు
3 కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి
4 చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి
5 నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు
6 జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి
7 సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు
8 కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దయకవి
9 శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు
10 చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి
11 శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి
12 నారసింహపురాణము-ఉత్తరభాగము-హరిభట్టు
13 మన్నారుదాసవిలాసనాటకము-రంగాజమ్మ
14 కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) అహోబలపతి
15 ఆంధ్రధాతుమాల-చిన్నయసూరి
16 శాసనపద్యమంజరి
17 శతకసముచ్చయము (2 భాగములు)
18 సూత్రాంధ్రవ్యాకరణములు-చిన్నయసూరి
19 రసాభరణము-అనంతకవి.
20 ఆంధ్రశబ్దచింతామణి-బాలసరస్వతికృతాంధ్రటీకోపేతము
21 షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య
22 రాయవాచకము-విశ్వనాథరాయని స్థానాపతి
23 సింహాసనద్వాత్రింశిక-(2 భాగములు) కొఱవి గోపరాజకవి
24 ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి
25 చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము)
26 సాంబోపాఖ్యానము- రామరాజు రంగప్పరాజు

అనుబంధము ౧౩.

“ తెలుఁగుఁభాషను, వాఙ్మయమును అభివృద్ధి నొందించుటయు, ఆవిషయమునఁ బరిశ్రమ చేయువారలకుఁ బ్రోత్సాహ మొసంగుటయు ” ప్రయోజనములుగా నాంధ్రసాహిత్యపరిషత్తు చెన్నపురియందు ఆ 1911-వ సంవత్సరమందుఁ బ్రతిష్ఠింపఁబడినది. ఏతత్పరిషత్ప్రయోజనముల నెఱవేర్పు మార్గములలో “తెలుఁగు భాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటు వొకటి రచించి ప్రకటించుట” ప్రథమమార్గముగా నిరూపింపఁబడినది.

ఇట్లు నిరూపింపఁబడిన వెనువెంటనే శ్రీపీఠికాపురవరాధీశ్వరు లగు మహారాజా శ్రీ రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు మాతృభాషాభిమానమును బురస్కరించుకొని నిఘంటు నిర్మాణమునకుఁ గావలసిన ధనమంతయుఁ దామె యిచ్చెద మని ప్రతిజ్ఞ చేసి యాప్రకారము నడపుచున్నారు. శ్రీవారియౌదార్య మనన్యాదృశ మని వేఱ చెప్ప నక్కఱలేదు గదా! ఇది జరిగిన యచిరకాలముననే మదరాసు దొరతనమువారు తెలుఁగు నిఘంటువునకై రు. 20,000 వ్యయపెట్టుదు మని తమ Budget లోఁ బ్రకటించిరి. అది తెలిసి మహారాజావారు నాతో “నిఘంటువునకుఁ గావలసిన ధనమంతయు నేనే యిచ్చెద నని చెప్పియుంటిని గదా! వేఱొకసొమ్ము దానిలోఁ గలియనేల? ఆసొమ్ము వచ్చినయెడల మఱియొకకార్యముక్రింద వినియోగపఱుపరాదా ?” అని సెలవిచ్చిరి. దొరతనమువా రేకారణముచేత ధనమీయఁ దలఁచిరో తెలియదనియు, పరిషత్తువారలడుగలేదనియు ఆసొమ్ము నిఘంటువునకై వినియోగింపఁబడదనియు నేను బదులు చెప్పితిని. పిదపఁ గొలఁదిదినములకే యూరోపుమహాసంగ్రామ మారంభ మయ్యెను. దొరతనమువా రాధనమునిచ్చెద మని చెప్పలేదు. మే మడుగనులేదు. నిఘంటునిర్మాణవిషయమైమహారాజావారికిఁ గల యభినివేశమును సూచించుటకై యీచిన్న విషయము నుదాహరించినాఁడను.

అటుపిమ్మట నిఘంటువు రచియింపవలసిన పద్ధతిని గూర్చి నే నొకవ్యాసమును గూర్చి యది తెలుఁగునను, ఇంగ్లీషునను బ్రకటింపఁగాఁ బలువురు పండితులు తమ యభిప్రాయముల నంపిరి. ఆంగ్లేయభాషా నిఘంటువులను-అందులోను ముఖ్యముగా Oxford Dictionary of English language అను

నుత్తమనిఘంటువును- ఆదర్శముగా నుంచుకొని నే నా వ్యాసమును గూర్చినాఁడను. పలువురు పండితులు మొత్తముమీఁద నా మార్గము నామోదించిరి.

మఱికొంతకాలమునకు నీపురమందే పరిషత్కార్యస్థానమందు నిఘంటునిర్మాణకార్య మారంభమైనది. దానికి, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు సంపాదకుఁడుగా నియమింపఁబడిరి. సంస్కృతశబ్దములను ధరించి వ్రాయుటకు శ్రీమాన్ తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు నియమితులైరి. ఓ. సి. దొరసామయ్యగారు సంపాదకులకు సహాయులుగా నేర్పాటయిరి.

ఈరీతిని గొంతకాలము పనిజరిగినపిమ్మట-అనఁగా-1917 వ సంవత్సరము సెప్టెంబరునెలలో నిఘంటుకార్యము తృప్తికరముగా జరుగుచుండనట్లు తమకుఁ దెలిసినదనియు నికముందు దాపని పిఠాపురములోఁ గాని కాకినాడలోఁ గాని కార్యస్థానముంచి తాము చేయించెద మనియు, నందులకుఁ బరిషత్తువా రంగీకరింపవలయు ననియు శ్రీమహారాజావారు జాబువ్రాసిరి. పరిషత్తువా రందుల కంగీకరించిరి. నిఘంటు కార్యస్థానము పిఠాపురములో 1918-వ సంవత్సరములో-అనఁగా కాళయుక్తి సంవత్సరారంభమునఁ బ్రతిష్ఠింపఁబడినది. తేవప్పెరుమాళ్లయ్యగారు పిఠాపురము వచ్చిరి కాని వేదము వేంకటరాయశాస్త్రులుగారు వచ్చుటకంగీకరింపలేదు. వేఱొకసంపాదకుని నియమింపవలసి యుండెను. నే నంతకుఁ బూర్వము కొలఁదికాలమునందె రాజకీయోద్యోగమునుండి విరమించి యుండుటచేతఁ గాఁబోలు నిఘంటు సంపాదకత్వము వహించి కార్యనిర్వహణము చేయవలయు నని మహారాజావారు నా కొకజాబు వ్రాసిరి. ఇట్టిజాబు వచ్చు నని నే నెన్నఁడును దలఁచియుండలేదు. తలవని తలంపుగాఁ బైఁబడనున్న యీకార్యభారము భరింపఁజాల నను భీతి పొడమినది. ఈభారమును దప్పించుకొనుటకు వేఱొకసంపాదకుని శ్రీవారికిఁ గనఁబఱచుట తప్ప నుపాయాంతరము కనఁబడలేదు. కార్యము నిర్వహించుటకు సమర్థులైన వారును, పిఠాపురములో నివాసముగా నుండుట కిష్టపడువారును నా కెవ్వరు నప్పుడు స్ఫురింపలేదు. ఉపాయాంతరమును సూచింపకయే నేను దప్పించుకొన్నచోఁ గార్యభంగ మగునని తోఁచినది. ఆంధ్రభారతియే మహారాజావారిముఖమున నన్నీకార్యమునకుఁ బురికొల్పుచున్నదనియు నాభారతియే నన్ను నిమిత్తమాత్రముగా నుంచుకొని కార్యము నిర్వహించుకొనుననియుఁ, బండితసాహాయ్యమునఁ గార్యము సాధ్యము కాకపోవ దనియు, దృఢసంకల్ప మున్నచోఁ గ్రియాసిద్ధి తప్పక తనంతటఁ దానే

వచ్చుననునార్యోక్తి సత్యము కాకపోదనియు నమ్మి యాంధ్రభారతీసేవయే పరమ ధనముగా గ్రహించి తమసెలవుప్రకారము చేసెద నని మహారాజావారికిఁ బ్రత్యుత్తరము వ్రాసినాఁడను.

పనిలోఁ బ్రవేశించి చెన్నపట్టణములోఁ బని యెంతవఱకు జరిగినదో చూతమని యక్కడనుండి వచ్చిన కాగితములు పరిశీలింపఁగా సంస్కృతపదముల విషయమై జరిగిన పనితప్పఁ దక్కిన పని యంతయు మొదటినుండియుఁ జేయవలసినట్లుగఁ గనఁబడినది. ప్రమాణములుగ గ్రహించిన గ్రంథము లన్నియుఁ బండితులకుఁ బంచిపెట్టి యందుఁ గల తత్సమేతరశబ్దముల నొక్కొక్కటి నొక్కొక్క కాగితపుముక్కమీఁద వ్రాయించి యాముక్కమీఁదనే యాపదమున కాసందర్భమున గలయర్థమును సంగ్రహముగాఁ బ్రమాణవాక్యములను వ్రాయించితిమి. ఇట్లు వ్రాయుట యైనపిదపనొక్కొక్కపదమునకు సంబంధించిన కాగితపుముక్క లన్నియు నొక్కొక్క గుదిగాఁ గూర్చిపిదప నాగుదులన్నియు నకారక్రమముగా నేర్పాటు చేసి యనంతర మాయర్థాదులను బరిశీలించి సిద్ధాంతీకరించుట యైనది. ఈవిధాన మంతయు నిఘంటుపీఠికలో వివరింపఁ బడినది. పైనుదాహరించిన పని యంతయుఁ దత్సమేతరపదముల విషయమైనదే.

తత్సమశబ్దముల విధానము వేఱు. ఆప్టే (Apte) సంస్కృతాంగ్లేయ నిఘంటువులోని పదజాల మధికముగానున్నట్లు తోఁచి యాపదములను, వాని కా నిఘంటువునందుఁ జూపఁబడిన యర్థములకుఁ దెలుఁగును వ్రాసినఁ జాలు నని తొలుత నెంచితిమి. కాని, కొన్నిదినములు పని జరిగిన పిదప "ఆప్టే" లోని యర్థములు కొన్ని సరిగా లేనట్లు కనఁబడినవి. అంతటినుండి యితర సంస్కృత నిఘంటువులను బట్టియు నావశ్యక మయినప్పుడు కావ్యాది మూలగ్రంథములను బట్టియుఁ గూడ నర్థముల సిద్ధాంతపఱుపవలసి వచ్చినది. ఈ విషయముగూడ నిఘంటుపీఠికలో వివరింపఁబడినది.

ఈ ప్రకారము పాటుపడి యజాదిపదజాలముగల 1000 పుటల ప్రథమ సంపుటమును నేఁటికిఁ బ్రకటింపఁ గంటిమి. మిగిలిన సంపుటముల నచిరకాలమందే ప్రకటించు యత్నములు జరుగుచున్నవి. ప్రతి సంపుటమునకు నీమొదటి సంపుటమునకుఁ బట్టినంతకాలము పట్టు ననుకొన నక్కఱలేదు. వానికిఁ గావలసిన శబ్దాదిసాధన సామగ్రి సిద్ధముగా నుండుటచేత నింతకాల మావశ్యకము కాదు.

సంస్కృతపదవిమర్శనము చాలవఱకు ముగిసినది. ముఖ్యముగా నచ్చతెనుఁగు పదముల విమర్శనమే ముందు గావలసియున్నది.

ఇంతవఱకుఁ బూర్తియైనగ్రంథము ప్రకటించుచున్నారము. అందలి గుణదోషముల విచారము సహృదయ విద్వదధీనము.

"ప్రకటిత మగుదాఁకన కృతి కర్తధనము, పిదప నద్ది సాధువిమలధనము
కన్నె యైనకాంత కన్నవారల సొమ్ము, పెండ్లియైన పిదపఁ బ్రియునిసొమ్ము"

తద్‌జ్ఞులు సమబుద్ధితోఁ జేయు నిర్ణయము శిరసావహింపఁ దగినదే యగునుగదా !

అర్థములు, వివరణములు మొదలగునవి తెనుఁగులో నుండవలయునా లేక యాంగ్లేయభాషలో నుండవలయునా యను విషయమును విమర్శించి తెనుఁగులోనే యుండవలయు నని పరిషత్తువారు నిర్ణయించిరి. ఈ విషయము లాంగ్లభాషలోనున్నచో ద్రావిడభాషలకుఁ గల పరస్పర సంబంధమును నిర్ణయింప యత్నించుచున్నట్టియు, నాంధ్రభాషాప్రవేశ మంతగా లేనట్టియు విద్వాంసుల కుపయోగముగా నుండవచ్చును, గాని, యాంగ్లభాషా పరిచయములేని తెలుఁగువారల కెంతమాత్రము నుపయోగింపదు. ఆంధ్రులు రచించు నాంధ్రభాషానిఘంటు వాంధ్రులకుఁ బనికిరాకున్నచో నది తనకుమాలినధర్మ మగును. భాషాతత్త్వపరిశోధకులు తెనుఁగుశబ్దముల యర్థాములఁ జక్కఁగాఁ దెలిసికొనఁ గోరినచో వారు ముందుగాఁ దెలుఁగుభాషను గొంతవఱకైన నభ్యసింపవలయును. అట్లు కానియెడల శబ్దార్థముల సాధించుటకై గ్రంథములనుండి యుదాహరింపఁబడు వాక్యముల భావము వారి కెట్లు బోధపడఁ గలదు? ఈహేతువులనన్నింటి నిబట్టియీనిఘంటువు తెనుఁగునందే యుండవలయు నని పరిషత్తువారు నిర్ణయించిరి.

ఈ నిఘంటునిర్మాణకార్యనిర్వహణమందు నాకు సహాయులై యత్యంత శ్రద్ధతోఁ బనిచేసి నాకు మాట దక్కించినట్టియుఁ దక్కించుచున్నట్టియుఁ బండితుల నామముల నీ క్రింద నుదాహరించుచున్నాఁడను.

1. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు
2 పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారు
3. పేరి వేరయ్యశాస్త్రులుగారు
4. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారు
5. శ్రీపాద పాపయ్యశాస్త్రులుగారు

6. కూచి నరసింహముగారు బి. ఎ.
7. చర్ల నారాయణశాస్త్రిలుగారు
8. పిసుపాటి చిదంబరశాస్త్రిలుగారు
9. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిలుగారు
10. దర్భా సర్వేశ్వరశాస్త్రిలుగారు

మొదటి ముగ్గురును సర్వేశ్వరశాస్త్రిలుగారును గేవలము సంస్కృతపదముల పనిచేసిరి. కూచి నరసింహముగారు కేవల మాచ్ఛికపదముల పని చేయుచున్నారు. మిగిలినవారు సమయానుకూలముగా రెండు పనులును జేసిరి. తేపప్పెట మాళ్లయ్యగారు, మల్లయ్యశాస్త్రిలుగారును దివంగతులైరి. పేరయ్యశాస్త్రిలుగారును, లక్ష్మీపతి శాస్త్రిలుగారును, పాపయ్యశాస్త్రిలుగారును ఇప్పుడీపనిలో నుండి విరమించినారు.



# పరిషత్కార్యదర్శులుగాఁ బనిచేసినవారు.

1. వేదము వేంకటరాయశాస్త్రిగారు.
2. డాక్టరు. ఆచంట లక్ష్మీపతిగారు బి. ఏ., ఎం. బి. బి. ఎస్.
3. పురాణం నాగభూషణముగారు ఎం. ఏ., బి. ఎల్.
4. నెమలి పట్టాభిరామారావుపంతులుగారు బి. ఏ.
5. గుమ్ముడూరి వేంకటరంగారావుగారు ఎం. ఏ.
6. కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు ఎం. ఏ
7. దర్భా వేంకటశివరామరాసుగారు బి. ఏ., బి. ఎల్.
8. కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
9. వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

# కోశాధ్యక్షులు.

1. డి. బ. కంచి కృష్ణస్వామిరావు పంతులుగారు
2. సర్. పిట్టి త్యాగరాయసెట్టిగారు బి. ఏ.
3. సర్. జస్టిస్. వేపా రామేశము పంతులుగారు
4. డి. బ. ధర్మవరము శేషాచార్యులుగారు బి. ఏ., బి. ఎల్.
5. గంటి లక్ష్మన్నగారు బి. ఏ. బి. ఎల్.
6. డి. బ. కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయఁడుగారు
7. రా. సా. వేమూరి రామకృష్ణారావుగారు ఎం. ఏ.
8. పెద్దాడ రామస్వామిగారు ఎం. ఏ.

# పరిషదుద్యోగులు

అక్కిరాజు ఉమాకాంతముగారు.
క్రొత్తపల్లి సూర్యారావుగారు.
మల్లాది సూర్యనారాయణశాస్త్రులుగారు.
శ్రీపాద నరసింహశాస్త్రులుగారు.
సరస్వతి రంగస్వామి అయ్యంగారు.

డబీరు నారాయణమూర్తిగారు.

హరిసేతు రామయ్యగారు.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులుగారు.

చతుర్వేదుల వేంకటరాఘవయ్యగారు.

వారణాసి వేంకటేశ్వరరావుగారు.

మల్లాది సుబ్రహ్మణ్యముగారు.

విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు.

కూనపులి వేంకటరమణమూర్తిగారు

## తాళపత్త్ర గ్రంథములు సంపాదించినవారు.

---

1. వి. సేతురామయ్యగారు-వెలవనూరు-తిరుమనాపల్లి.
2. దేవగుప్తాప భరద్వాజముగారు- పిఠాపురము.
3. మంత్రిప్రెగడ వేంకటరమణయ్యగారు- పిఠాపురము.
4. ఎస్. (సింగోటి) రంగనాథరావుగారు- నందలూరు-కడప.
5. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు } అనంతపురము.
6. రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారు } అనంతపురము.
7. దూపాటి శేషాద్రిరమణకవులు. గుంటూరు.
8. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు- నెల్లూరు.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తునకు

# ౨౫ సంవత్సరములలోనయిన

# ఆయవ్యయముల పట్టిక.

ఆంధ్రసాహిత్యపరిషత్తు..విరోధికృన్నామ సంవత్సరము మొదలు

ఆయము. (1911 సంవత్సరము మొదలు

| | | | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ప్రతిష్ఠాపకులు | | | | 30000 | 0 | 0 |
| 2 | ఉద్ధారకులు | | | | 5000 | 0 | 0 |
| 3 | పోషకులు | | | | 4800 | 0 | 0 |
| 4 | యావజ్జీవసభ్యులు | | | | 2660 | 0 | 0 |
| 5 | సాధారణసభ్యులు | | | | 7553 | 4 | 0 |
| 6 | పత్రిక చందాదారులు | | | | 4970 | 10 | 0 |
| 7 | విరాళములు:— | | | | 6338 | 9 | 9 |
| | పండితసభకు శ్రీ వేంకటగిరిమహారాజాగారివలన | 500 | 0 | 0 | | | |
| | గ్రంథప్రకటనము | 4638 | 9 | 9 | | | |
| | డిఫ్యూ్యటేషనుకు | 500 | 0 | 0 | | | |
| | కార్యస్థానము మార్పునకు శ్రీ పిఠాపురము మహారాజావారిచ్చినవి | 700 | 0 | 0 | | | |
| | | 6338 | 9 | 9 | | | |
| 8 | పుస్తకవిక్రయము | | | | 5532 | 14 | 10 |
| 9 | పత్రిక విడిసంచికల విక్రయము | | | | 981 | 2 | 3 |
| 10 | చేబదుళ్లు | | | | 1500 | 0 | 0 |
| 11 | బ్యాంకివడ్డి | | | | 16601 | 7 | 9 |
| 12 | నిఘంటు జమ శ్రీ పిఠాపురముమహారాజావారివలన | | | | 15000 | 0 | 0 |
| 13 | పిఠాపురములో నిఘంటువు నిమిత్తము కాళయుక్తి మొదలు యువసంవత్సరమువఱకు వ్యయము చేసినవి | | | | 62302 | 8 | 10 |
| | | | | | 162740 | 9 | 5 |

యువనామసంవత్సరాంతమువఱకు ౨౫ సం॥లలో నైన ఆయవ్యయముల పట్టిక.

1936 సంవత్సరము వఱకు)

## వ్యయము.

| | రు. | అ. | పై. | | | |
|---|---|---|---|---|---|---|
| 1 నిఘంటు విషయము:— | | | | | | |
| పదసూచిక | 1167 | 8 | 0 | | | |
| పారిభాషికపదసంపాదనమునకు | 631 | 14 | 8 | | | |
| జీతములు | 70648 | 6 | 10 | | | |
| అచ్చునకు | 226 | 1 | 3 | | | |
| కాకితములు కార్డులు | 1066 | 10 | 3 | | | |
| ఇంటిఅద్దె | 2113 | 12 | 4 | | | |
| కొనినపుస్తకములు మొదలైనవి | 796 | 15 | 11 | | | |
| చిల్లర వ్యయము | 1620 | 14 | 1 | 78272 | 3 | 4 |
| 2 పత్రికావిషయము:— | | | | | | |
| ఇంటియద్దె | 5565 | 14 | 0 | | | |
| అచ్చునకు | 7803 | 3 | 0 | | | |
| పోస్టేజీ | 3063 | 6 | 0 | | | |
| కాగితము | 5736 | 5 | 8 | | | |
| బ్లాకులు | 368 | 13 | 9 | 22537 | 10 | 5 |
| 3 పుస్తకభాండాగారము:— | | | | | | |
| ప్రతులు వ్రాయించుటకు, సంపాదించుటకు. | 2853 | 7 | 11 | | | |
| కొనిన పుస్తకములు | 1757 | 3 | 1 | | | |
| చిల్లర వ్యయము | 484 | 2 | 8 | 5094 | 13 | 8 |
| 4 పరిషదుద్యోగుల జీతములు | | | | 28760 | 12 | 0 |
| 5 గ్రంథప్రకటనము | | | | 3654 | 14 | 9 |
| 6 ప్రయాణవ్యయములు | | | | 2050 | 15 | 3 |
| 7 చిల్లరముద్రణము | | | | 1673 | 8 | 7 |
| 8 ఆడిటరు ఫీజు | | | | 900 | 0 | 0 |
| 9 కలములు కాగితములు | | | | 791 | 12 | 0 |
| 10 చిల్లరవ్యయము | | | | 1236 | 14 | 10 |
| 11 కొనిన సామానులు | | | | 698 | 5 | 0 |
| 12 పత్రికలకు చందాలు | | | | 275 | 9 | 0 |
| 13 చేబదుళ్లు తీర్చినవి | | | | 1000 | 0 | 0 |
| 14 నిలువ:— | | | | | | |
| గవర్నమెంటు పత్రములు | 20000 | 0 | 0 | | | |
| ఫిక్సెడ్ డిపాజిట్లు | 750 | 0 | 0 | | | |
| కార్యస్థానమున | 43 | 2 | 7 | 20793 | 2 | 7 |
| | | | | 162740 | 9 | 5 |